# తెలుగు అకాడమి ప్రాంతీయ కేంద్రాలు




| ప్రాంతీయ కేంద్రం/ చిరునామా | ఈ కేంద్రం పరిధిలోని జిల్లాలు |
|---|---|
| విజయవాడ<br>ఎస్.ఆర్ ఆర్ అండ్ సి.వి ఆర్<br>ప్రభుత్వ కళాశాల,<br>విజయవాడ-520 004 | 1 కృష్ణా<br>2 గుంటూరు<br>3 పశ్చిమ గోదావరి<br>4. ప్రకాశం |
| విశాఖపట్టణం<br>హిందీభవన్, ఆంధ్ర విశ్వ విద్యాలయ ఆవరణ,<br>విశాఖపట్టణం-530 003. | 1 విశాఖపట్టణం<br>2 విజయనగరం<br>3 శ్రీకాకుళం<br>4 తూర్పుగోదావరి |
| అనంతపురం<br>ప్రభుత్వ డిగ్రీ కళాశాల,<br>అనంతపురం-515 001. | 1 అనంతపురం<br>2 కర్నూలు |
| తిరుపతి<br>స్టేట్ బ్యాంక్ ఆఫ్ ఇండియా బిల్డింగ్,<br>శ్రీ వేంకటేశ్వర విశ్వ విద్యాలయ ఆవరణ,<br>తిరుపతి-517 502 | 1 చిత్తూరు<br>2 నెల్లూరు<br>3 కడప |
| కరీంనగరం<br>ఇండియన్ మెడికల్ అసోసియేషన్ హాల్,<br>ప్రభుత్వ డిగ్రీ స్త్రీల కళాశాల ప్రక్కన,<br>కరీంనగరం-505 002 | 1 కరీంనగరం<br>2 ఆదిలాబాదు<br>3 నిజామాబాదు |
| వరంగల్లు<br>సి కె ఎం. ఆర్ట్స్ అండ్ సైన్సు కళాశాల<br>దేశాయిపేట, వరంగల్లు -506 006 | 1. వరంగల్లు<br>2. ఖమ్మం |
| హైదరాబాదు కేంద్రం<br>తెలుగు అకాడమి,<br>హిమాయత్ నగర్,<br>హైదరాబాదు-500 029 | 1 నల్గొండ<br>2 మహబూబ్‌నగర్<br>3. రంగారెడ్డి<br>4 మెదక్<br>5 హైదరాబాదు, సికింద్రాబాదు |

# ఆంధ్రప్రశస్తి

గోదావరీపావనోదారవాఃపూర
మఖిలభారతము మా దన్ననాడు,
తుంగభద్రాసముత్తుంగ రావముతోడ
కవుల గానము శ్రుతిఁ గలయునాడు,
పెన్నానదీసముత్పన్న కైరవదళ
శ్రేణిలో తెన్గు వాసించునాడు,
కృష్ణాతరంగ నిర్ణిద్రగానముతోడ
శిల్పమ్ము తొలిపూజ సేయునాడు;

అక్షరజ్ఞాన మెఱుఁగదో యాంధ్రజాతి,
విమలకృష్ణాపదీసైకతములయందు
కోకిలపుఁబాట విచ్చుక గూండ్లు కట్టి
నేర్చుకొన్నది పూర్ణిమానిశలయందు !

-విశ్వనాథ

అమరావతీ పట్టణమున బౌద్ధులు విశ్వ
విద్యాలయములు స్థాపించునాడు,
ఓరుగల్లున రాజవీరలాంఛనముగఁ
బలు శస్త్రశాలలు నిలుపునాడు,
విద్యానగరరాజవీథులఁ గవితకు
వెండ్లిపందిళ్ళు కప్పించునాడు,
పొట్నూరికి సమీపమున నాంధ్రసామ్రాజ్య
దిగ్జయస్తంభ మెత్తించునాడు !

ఆంధ్రసంతతి కే మహాత్మాభిమాన
దివ్య దీక్షాసుఖస్ఫూర్తి తీవరించె
నా మహావేశ మర్థించి యాంధ్రులార
చల్లుఁ డాంధ్రలోకమున నక్షతలు నేఁడు !

తన గీతి యజీవజాతిని పాటకులనుగా
దిద్ది వర్ధిల్లిన తెనుఁగువాణి,
తన పోటులు విరోధితండంబులకు సహిం
పనివిగా మెరసిన తెనుఁగుకత్తి,
తన యందములు ప్రాంతజనుల కభిరుచివా
సన నేర్ప నలరిన తెనుఁగురేఖ,
తన వేణికలు వసుంధరను సస్యశ్యామ
లనుజేయఁ జెలఁగిన తెనుఁగుభూమి,
అస్మదార్ద్రమనోవీథి నావహింప
జ్ఞప్తి కెలయించుచున్నాఁడ; చావలేదు,
చావలేదు, ఆంధ్రుల మహోజ్జ్వలచరిత్ర
హృదయములు చీల్చి చదువుఁడో సదయులార !

కృష్ణాతరంగపంక్తిన్ ద్రొక్కి త్రుళ్ళింత
నాంధ్రనౌకలు నాట్యమాడునాడు,
ఇంటింటు దేశిసాహిత్యదీపములతో
నాంధ్రతేజస్సు రాపాడునాడు,
సుకుమారశిల్పవస్తు ప్రపంచమునందు
నాంధ్రనైపుణి పంతమాడునాడు,
సమరసేనావ్యూహజయపతాకలక్రింద
నాంధ్రపౌరుషము చెండాడునాడు;

చూచి, సంతోషమున తలలూఁచి, గర్వ
మూని, ఆంధ్రపుత్రీపుత్రు లందఁగలరు
శాంతి, నందాక లేదు విశ్రాంతి మనకు,
కంకణవిసర్జనల కిది కాల మగునె !

- రాయప్రోలు

ఏ రాజు పంచెనో యిచట శౌర్యపుపాయ
సమ్ములు నాగులచవితినాళ్ళ,
ఏ యొజ్జసంజలో నెలమి పల్లవరాజ
రమణులు కాళ్ళఁ బారాణు లిడిరో,
చిత్రరథస్వామి శ్రీరథోత్సవములో
తెలుఁగు పిల్లలు కత్తి త్రిప్పి రెపుడో,
ఏ రెండు జాముల యినుని వేడిమి వచ్చి
కలసిపోయెనో త్రిలింగప్రభువుల;

నా జగత్ప్రేయసంబులై యలరు, తొంటి
వేంగిరాజుల పాదపవిత్రచిహ్న
గర్భితమైన, యీ భూమిఖండమందు
నశ్రువులు జార్చు జీవచ్ఛవాంధ్రజనులు !

ఇఁట వేఁగీశుల పాదచిహ్నములు లేవే ! శేష
భావనాస్ఫుటమూర్తిత్వమునైనఁ బొందవు,
పూర్వాహ్లాదుష్కాలపుంపుటికల్
గర్వమునం దిముడ్చుకొనియెం గాబోలు,
నీ పల్లెచో టిట లోకాద్భుతదివ్యగర్భనముఁటే
యాభోగ మేలాటిదో !

నీ యతులప్రభావమహనీయత
వేఁగిపురాధిరాజమా, ఆయతధర్మమూర్తులు
మహాత్ములు వారలు బ్రహ్మకోశగోపాయిత
లాంధ్రపల్లవనృపాలుర హుంకృతి
వ్యాప్తసుగర్భగానై యరిలోకభీకరమహాద్భుత
శౌర్యరసాకృతిం జనెన్ !

ఈ నా పదార్పితక్షోణి నేరాజు ధ
ర్మాసనంబుండి సత్కృత్యార్థ మనెనో,
ఈ నా దృగావృతంబైన భూములలోన
నే శౌర్యధనులు శిక్షింపఁబడిరో,
ఈ నా శరీరమం దివతళించిన గాలి
యెంత పౌరాతన్య మెచుకొనెనో,
ఈ నా తనూపూర్ణమైన యాకాశమ్ము
నే క్రతుధ్వనులు శబ్దించినవియొ;
అస్మదజ్ఞాతపూర్వదివ్యత్వ మొప్పు
నీ పునీతావనీఖండ, మిచట నిలిచి
యస్వతంత్రత దొరలు నాయాంధ్రశక్తి
నన్నుఁ గంపింపఁజేయుచున్నది భృశమ్ము.

వేఁగిరాజ్యపు పల్లెవీథుల చెడుగుళ్ళ
రిపులఁ గప్పించు నేరుపులు తెలిసి,
ఎగురు గోడీళ్ళనొగసులో రిపుశిర
స్సుల బంతులాడు శిక్షలకు డాసి,
చెళ్ళాడి యుప్పు తెచ్చినసాడె శాత్రవ
వ్యూహముల్ పగిలించునొఱపు గఱచి,
కోతికొమ్మచ్చిలో కోటగోడల కెగ
బ్రాకి లంఘించు చంక్రమణ మెఱిగి;

తెనుఁగు లంతప్పె, యవి, నేర్చుకొనినయందు,
రెన్నగాఁ, దెల్గుతల్లులు మున్ను, శౌర్య
రస మొడిచి యుగ్గుఁబాలతో రంగరించి
బొడ్డుకోయని కూనకే పోయుదు రఁట !

శిలవోలెన్ కదలంగలేక హృదయస్నిగ్ధార్ద్ర
సద్భావనాఖిలచైతన్యుఁడనై, పురావిదిత
వేంగీపూజ్యసామ్రాజ్యగాథల యోజించుచు,
నాంధ్రపల్లవనరేంద్రశ్రీయశస్స్తంభమున్ బలె
నిల్చుంటిన, యీ పవిత్రధరణీభాగంబునం
దిగలిన్ !

ఏ దివ్యపూరుషు, లీ శాద్వలాంకూర
శేఖరమ్ముల లిఖించిరో, యివెల్ల,
ఈ వాయువీచిలో, నే యప్సరస్సమా
జము, నింపిరో గీతిసముదయంబు,
ఏ దివ్యశిల్పు, లీ రోదసీకుహరాన
వ్రాసిరో, దివ్యశిల్పంబు లిన్ని !

ఈ పథాంతరమునం, దే పురాణమునీంద్ర
సంతతులో ప్రశంసలు పొనర్చు;

ఎటఁ గనినఁ బూర్వపల్లవనృపచరితలె
వ్రాయఁబడి, పాడఁబడి, గీయఁబడి, యుపన్య
సింపఁబడి, స్తోత్రపేయమై చెన్నుదాల్చు,
నీ యతీంద్రియశక్తి నాకెట్టు లబ్బె !

ఈ పొలా లెంత చే వెక్కించుకొన్నవో
గుండె వ్రయ్య సముద్రగుప్తు డడలె,
ఈ నేల పావిత్ర్య మెంత కుంభించెనో
చిత్రరథస్వామి సేవలు కొనె,
ఇట పల్లవుల రాచమొలనాగ లే వ్రత
మ్ములు చేసిరో లచ్చి నిలుకడపడె,
ఈ కాశ్యపీఖండ మే శరజ్జ్యోత్స్నలో
పులకించెనో, కీర్తి తెలుపు లూరె;

ఇట నెచట త్రవ్వినను బంగరే నట, యది
యెంత శ్రీయొ, యదెంత రాజ్యేందిరయొ, ఏ
దానతసఖ్యాగ పాలనిర్వ్యన్నిధాన
మైన యీ చోట నుపభోగ్యమయ్యె నేడు !

ఈ పొదలం జరించుచు నపూర్వ మహా
మహామహానుభావహా నే పురవీథులందొ
చరియించుచునుంటి నటంచుఁ, బారతంత్ర్యా
పతితుండ నయ్యును, పురామహోదాంధ్రమునన్
స్వతంత్రుఁడా నేపురుషుండనో యనుచు నీ భ్రమ
సత్యముగా తలంచుదున్ !

ఏ పల్లవనృపాలుఁ డెత్తిన బావుటా
చాళుక్యనృపుల రాజ్యంబునందు,
ఏ దేశికవిత పాలించిన కవిరాజ
నన్నయ్య వ్యాకరణంబునందు,
ఏ యులిఁజెక్కు నేర్పులు మహాశిల్పి
గోదావరీనదీఘోషయందు,
ఏ తొంటి తెలుఁగుల యెక్కువాచారమ్ము
బలవన్నృపుల ప్రాభవమ్మునందు

సమసిపోయెనో, ఉన్మత్తసామజంబు
కొలను బొరబడి తమ్మితూఁడులను వెరికి
వైచునటు లెఱుంగుగాని, తత్పద్మగర్భ
కేసరవిమిశ్రమధురసాగియత గలదె ?

ఇమ్ముగఁ గాకుళమ్ము మొదలీవరకుంగల
యాంధ్రపూర్వరాజ్యమ్ముల పేరు చెప్పిన,
హృదంతర మేలా చలించిపోవు,
న్యార్ద్రమ్మగు చిత్తవృత్తుల పురాభవనిర్ణయమేని
ఎన్ని జన్మమ్ములుగాగ నీ తనువునన్
ప్రవహించునో యాంధ్రరక్తముల్ !

ఇది వినిపింతునంచు మది నెంచెద మిత్రులకున్,
గళస్థగాద్గదికము, లోచనాంత
బహుధాస్రుతబాష్పనదమ్ము, స్పందనాస్పద
హృదయమ్ము, నా పనికిఁ జాలక చేసెడు, నన్ను
వింతగా నెద వదలించుకొన్న దిది యెక్కడి
పూర్వపు జన్మవాసనో !

-విశ్వనాథ

వేఁగిరాజుల సరివితలికి గరువంపు
నడక నేర్పినది నన్నయ్య రచన
తెనుఁగుభాషాపద్మమునకుఁ జాఱని వన్నెఁ
బట్టించినది కవిబ్రహ్మపలుకు
కంచుఢక్కల నోరు గట్టించి జయకేత
నముల నెత్తినది శ్రీనాథు జిహ్వ
ప్రతిలేని యపవర్గ పదవివంకకు రహ
దారి దీసినది పోతన చరిత్ర

విజయనగరాధిపుల భుజావేదికలకు
సందలంబులు మోయు మర్యాద గఱపి
తనివిఁగొన్నది మొన్న పెద్దన కవిత్వ
మాంధ్రభారతి ! నీ తేజ మద్భుతంబు !

-జాషువా

* * * * *

తెలుగు భాషా వ్యాప్తికి, తెలుగును అధికార భాషగా
తీర్చిదిద్దడానికి, తెలుగు సాహిత్యాభివృద్ధికి నిర్విరా
మంగా కృషిచేస్తున్న తెలుగు అకాడెమి ఇరవై
సంవత్సరాలు పూర్తిచేసుకున్న శుభసందర్భంగా
శుభాకాంక్షలతో

VICE - PRESIDENT
INDIA
NEW DELHI - 110011

June 20, 1988

## MESSAGE

*The Telugu Akademi has done useful work in promotion of Telugu, one of our ancient and great languages. Its work in the field of making books in Telugu available for higher education is particularly praiseworthy.*

*On the occasion of its completion of Two Decades, I send the Telugu Akademi my best wishes for its continued growth and usefulness.*

*(S.D. Sharma)*

GOVERNOR
ANDHRA PRADESH

RAJ BHAVAN,
HYDERABAD - 500 041.

9th July, 1988

## MESSAGE

*The completion of Two Decades of service by the Telugu Akademi is a significant landmark in the promotion of Telugu Language and Literature. I am happy that a souvenir is being brought out to commemorate the occasion celebrating the Two Decades of its service.*

*2. Language and Literature play a mighty role in projecting the true image of the people in any part of the country. In a multilingual Nation like ours, the promotion of Language and Literature should contribute to the creation of better understanding and appreciating one anothers history and culture and to provide deeper insights into the human soul.*

*3. The contribution made by the Telugu Akademi in this direction judging from the material produced and distributed through the wide network - the period of Two Decades has indeed been rewarding and laudable.*

*4. My best wishes for the success of the celebrations.*

*(KUMUD JOSHI)*





యన్. టి. రామారావు
ముఖ్యమంత్రి

హైదరాబాదు
తేదీ. 11.7.1988

శ్రీ వి. కొండలరావు గారికి,
మహాశయా,

తెలుగు అకాడమీ జీవితంలో రెండు దశాబ్దాలు గడచినందుకు ఆ సంస్థ అధ్యక్షులను, మిమ్ములను, సిబ్బందినీ, రచయితలను హృదయపూర్వకంగా అభినందిస్తున్నాను. అకాడమీ ప్రచురణలు పుంఖానుపుంఖాలుగా వెలువడి అసంఖ్యాకమైన విద్యార్థులకు విజ్ఞానప్రదాతలై అధ్యాపకుల మన్నలను పొంది, తెలుగు భాష యొక్క శక్తినీ, మాధుర్యాన్నీ, భావస్ఫోరకత్వాన్ని ఇనుమడింపచేస్తున్నందుకు ప్రశంసిస్తున్నాను. బహుళమైన పారిభాషిక పదజాలాన్ని సేకరించి, వాటికి రూఢార్థాలను నిర్ణయించడం మూలంగా విజ్ఞాన శాస్త్రావగాహన విస్తృతను, బంధురతను సంతరించుకొనగలదని నా విశ్వాసం. పాలిటెక్నిక్ విద్యా బోధన, వృత్తి విద్యా శిక్షణ, స్నాతకోత్తర స్థాయి విద్యా వ్యాసంగమూ ఆంధ్ర భాషా మాధ్యమంతో జరుపవలెనన్న నిర్ణయం అనివార్యమూ సముచితమూ, ప్రశంసనీయమూ. అకాడమీ నుండి వెలువడే వైజ్ఞానిక స్రవంతి ముందు ముందు మరింత వైశాల్యాన్ని, గంభీరతను, వేగాన్ని పుంజుకొనవలెనని నా ఆకాంక్ష.



మీ శ్రేయోభిలాషి

(యన్.టి. రామారావు)



EXTERNAL AFFAIRS MINISTER
INDIA

V. 129/EAM/88 July 29, 1988

## MESSAGE

*Telugu Akademi which was established to encourage publication of Telugu books to enrich Telugu literature is, this year, celebrating two decades of its existence. On this happy occasion I extend my best wishes to the Akademi and hope they would continue to do the useful work of enriching the Telugu literature.*

*(P.V. Narasimha Rao)*

No M/(PPD)P/7/88/565
MINISTER OF HUMAN RESOURCES
DEVELOPMENT
NEW DELHI - 110001
INDIA

మహారాజశ్రీ కొండలరావుగార్కి-

తెలుగు అకాడమి స్థాపన జరిగి ఇర్వై సంవత్సరాలు పూర్తికావస్తున్న సందర్భంగా అకాడమి త్వరలో ఒక ప్రత్యేక సంచిక ప్రచురించుచున్నందులకు చాలా సంతోషము. తెలుగు అకాడమి ఈ గత ఇరువది సంవత్సరములలో ఉన్నతవిద్యారంగానికి చేసిన సేవ చాలా కొని యాడతగినది. ఇక ముందు కూడ అకాడమి తెలుగు భాషాభివృద్ధికి కృషి చేయగలదని ఆశిస్తున్నాను.

ఈ సందర్భంలో మీ అకాడమి సభ్యులందరికీ నా హృదయపూర్వక అభినందనలు.

ఇట్లు,
(సం)
(పి. శివశంకర్)



No. 1516/IM/88

INDUSTRY MINISTER
INDIA
UDYOG BHAWAN, NEW DELHI-110011
23.6.1988

మిత్రమా,

తెలుగు సాహిత్య సేవలో తెలుగు అకాడమి రెండు దశాబ్దాలు పూర్తి చేసిన సందర్భంగా అకాడమి ఆశయాలు, ఆదర్శాలు, సాధించిన ప్రగతి నిర్వహించిన కార్యకలాపాలను వెలుగులోకి తెచ్చే విధంగా ఒక ప్రత్యేక సంచికను వెలువరించాలని మీరు నిర్ణయించడం చాలా సంతోషదాయకం.

అకాడమి నిర్వహించిన కార్యక్రమాలతోబాటు తెలుగు భాష ప్రాచుర్యాన్ని, ప్రాభవాన్ని వెలుగులోకి తెచ్చే వివిధ వ్యాసాలు కూడా పొందుపరచి, తెలుగు భాష తియ్యదనాన్ని ఆసేతుహిమాచలపర్యంతం అందరూ గుర్తించి, ఆనందించే విధంగా ప్రచురించగలరని నా ప్రగాఢ విశ్వాసం. మీ కృషి ఫలప్రదం కావాలని నా ఆకాంక్ష.

ఇట్లు

(జలగం వెంగళరావు)



TEL NO OFF 32377
34076
RES 33763
HYDERABAD

**G.NARAYAN RAO,** B.Sc., LL.B
**SPEAKER,**
ANDHRA PRADESH LEGISLATIVE ASSEMBLY


DATE . . . . 198

మిత్రులు శ్రీ, కొండలరావుగారికి

1968లో స్థాపించిన తెలుగు అకాడమీ ఇర్వై ఏళ్లు పూర్తి చేసుకున్న సందర్భంగా ఒక ప్రత్యేక సంచికను ప్రచురించడానికి పూనుకున్నందుకు సంతోషం.

ఇప్పటివరకు మీరు ప్రచురించిన సహస్ర గ్రంథాలు తెలుగులో ఉన్నత విద్యాభ్యాసం చేస్తున్న తెలుగు విద్యార్థులకేకాక, ఆధునిక సాంకేతిక విజ్ఞానాన్నీ, సాంఘిక, ఆర్థిక, రాజకీయ శాస్త్రాది విషయాలనూ, విజ్ఞాన శాస్త్ర విషయాలనూ తమ మాతృభాషలోనే అధ్యయనం చేయడానికి తెలుగు విద్యాధికులకనేకమందికి ఉపకరించేవిగా ఉన్నవనడంలో సందేహం లేదు.

మీ సంస్థ ప్రచురించిన పారిభాషిక పదకోశాలు, సాధారణ పదకోశాలు, తెలుగును అధికారభాషగా అమలు పరచడంలో వివిధ ప్రభుత్వ శాఖలకు ఎంతగానో ఉపకరిస్తున్నాయి.

సర్వసాధారణంగా ప్రభుత్వ రంగంలో ఉండే సంస్థలకు ఆర్థికంగా నష్టాలు రావడం మామూలైపోయిన ఈ రోజుల్లో లాభదాయకంగా సంస్థ కార్యకలాపాలను నిర్వహిస్తున్న మీ పరిపాలనా దక్షతను ప్రత్యేకంగా అభినందిస్తున్నాను.

పాఠ్యగ్రంథాలనేకాక, ముందు తరాలవారికి మార్గదర్శనం చేయగల ఉత్తమ సిద్ధాంత గ్రంథాలను కూడా ప్రచురించడానికి మీ సంస్థ పూనుకోగలదని, సంస్థ ప్రారంభమైన కొత్తలో ప్రారంభించి మధ్యలో నిలిచి పోయిన తెలుగు మాండలిక పరిశోధనా కార్యక్రమాన్ని కూడా కొనసాగిస్తారని ఆశిస్తున్నాను.

సాధించిన దానితో తృప్తి పడటంకన్నా సాధించవలసి ఉన్నదానిపట్ల దీక్షను పెంచుకోవడం సజీవ కార్యవాదుల లక్షణం. అటువంటి దీక్షను మీరు గ్రహించగలరని ఆశిస్తున్నాను.

భవదీయుడు,

(జి. నారాయణ రావు)

JUSTICE AVULA SAMBASIVA RAO

Phones Off 222406
Res · 248324

"Vibhava".
Plot No 68, Road No 1,
Jubilee Hills,
Hyderabad - 500 034

Date 8-7-1988

శ్రీ కొండలరావుగారూ,

నమస్కారాలు.

జూన్ ఆరవతేదీగల మీ జాబు అందింది.

తెలుగు అకాడమి ఇరవైయేండ్ల పండుగ జరుపుకుంటున్నందుకు సంతోషం అది సంబరపడవలసిన సన్నివేశం. వెయ్యి పుస్తకాల ప్రచురణ, లక్షా పాతికవేల పారిభాషిక పదాల సేకరణ తృప్తికారణం. గర్వకారణం కూడా.

భాష సాహిత్యం జీవితానికి అద్దం పడతాయనిగదా అనుకుంటాం. అంతేకాక మార్పు మానవ సహజమని కూడా గుర్తిస్తున్నాం. అయినప్పుడు మారుతున్న మానవుని జీవితాన్నీ, అవసరాలను భాష సాహిత్యం ప్రతిబింబించాలి. వాటికి అనుగుణంగా మారుతూ వుండాలి.

ఈనాటిది ప్రజాయుగం. అతి సామాన్యులు, సగటు మానవులు మన ప్రజల్లో ఎనభైశాతం ఉన్నారు. ఇరవైశాతం ప్రజలకే సాహిత్యం పరిమితం కాకూడదు. జనావళికి అది అందుబాటులో వుండాలి. అలా లేకపోతే సాహిత్యం యుగధర్మాన్ని, ప్రజావళిని మరిచినట్లే అవుతుంది.

ఇది సమతాయుగం. విజ్ఞానం కొద్దిమందికి మాత్రమే పరిమితమయే గుత్తవిత్తం, గుప్తధనం కాకూడదు. అది అందరికీ అందాలి. అప్పుడే సమత, న్యాయం నెలకొంటాయి.

విజ్ఞానాన్ని ప్రజాసముదాయానికి అందించి, పంచిపెట్టగల సాహిత్యం ఈకాలపు అవసరం. అందుకు అనుకూలమైన భాష, పదజాల సమీకరణ, కావలసిన సాధనాలు. సరళమైన తెలుగు నుడికారంతో కూడిన భాష వాడుకలోకి రావాలి.

ఈనాటి వ్యావహారిక భాషలోనైతమూ ఆ సరళత్వం లోపించింది. అది "ప్రచ్ఛన్న గ్రాంధికమని" కూడా అనడానికి సందేహించను.

దినదినమూ, క్షణక్షణమూ పెరుగుతున్న విజ్ఞానాన్ని తెలుగు మాటలలో పొందుపరచగల భాష కావాలి. పదాల కూర్పు కావాలి. సాహిత్యం కావాలి.

సగటు మానవుడు కూడా నవీనుడు కావాలి. ఆర్థిక దారిద్ర్యంతోపాటు, విజ్ఞాన దారిద్ర్యం నుండి కూడా బయటపడాలి.

అందుకు నవీన సాహిత్యమే తరుణోపాయం. అట్టి భాషనూ, సాహిత్యాన్నీ, నిర్మించే కృషిలో తెలుగు అకాడమీ భాగస్వామి అవాలి. మార్గదర్శి కావాలి.

ఆ ప్రయత్నంలో అకాడమీ విజయవంతం అవగలదని ఆశిస్తాను.

ఆవుల సాంబశివరావు

కె. యస్. శర్మ, ఐ.ఎ.యస్.
సంచాలకుడు,
నవోదయ విద్యాలయ సమితి,
కొత్త ఢిల్లీ.

# సందేశం

"గత ఇరవై సంవత్సరాలలో మీరు సాధించిన కృషిని, ముఖ్యంగా గ్రంథప్రచురణలోను, పారిభాషిక పదాలను సమకూర్చడంలోను, సునిశితమైన పంపిణీ వ్యవస్థ ఏర్పాటు చేయటంలోను చేసిన కృషిని గురించి తెలుసుకొని ఎంతో సంతోషిస్తున్నాం. రాబోయే కాలంలో, నవోదయ విద్యాలయాల అవసరాలకనుగుణంగా తెలుగు ప్రచురణలను అందించి మా కృషికి దోహదం కల్పిస్తారని, మీ సంస్థ మూడు పువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లాలని ఆశిస్తున్నాం".

మీరు ఎప్పటిలాగే ఎక్కడ పనిచేస్తున్నా ఆ సంస్థకు వన్నె చేకూరుస్తారనే మా దృఢ నమ్మకాన్ని మీ ఈ కార్యక్రమాలు మరొక్కసారి ధృవపరుస్తున్నందుకు ఎంతో సంతోషిస్తున్నాను.

ఇట్లు
భవదీయుడు

కె.యస్. శర్మ

పి. ఇంద్రారెడ్డి
విద్యామంత్రి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

## సందేశం

తెలుగు భాషాసాహిత్యాలకూ ఉన్నత విద్యాబోధనకూ సంబంధించిన గ్రంథ ప్రచురణారంగంలో అకుంఠిత దీక్షతో సేవచేసే అత్యుత్తమ విజయాలు సాధించిన తెలుగు అకాడమి ఇర్వై ఏళ్ల ఉత్సవాలు జరుపుకోడం ఎంతో ఆహ్లాదకరమైన విషయం. అకాడమి, తాను నిర్వహించిన వివిధ కార్యకలాపాలద్వారా పరిశోధన, విద్యావిస్తరణ సేవలద్వారా ప్రజాహృదయాలమీద గాఢమైన ముద్రవేసింది.

బోధనభాషగానూ పరిపాలనభాషగానూ తెలుగు స్థిరంగా నిలదొక్కుకున్నది. దాని అభివృద్ధి సాధనలో, విస్తరణకృషిలో తెలుగు అకాడమి అత్యంత ప్రముఖమైన పాత్ర నిర్వహించింది. తెలుగు భాషాపాటవాన్ని పెంపొందించడానికి వివిధ శాస్త్ర, సాహిత్య సాంకేతిక విషయాలమీద అనేక గ్రంథాలు ప్రచురించడానికి అకాడమి, అనేక కార్యక్రమాలనూ పథకాలనూ రూపొందిస్తూ ఉన్నందుకు నా సంతోషాన్ని తెలియపరుస్తున్నాను.

ఇటువంటి ప్రముఖ సంస్థకు అధ్యక్షుడిగా ఉండి దీని కార్యకలాపాల నిర్దేశంలో పాలుపంచుకోడం ఒక మహదవకాశంగా తలుస్తున్నాను.

విద్యారంగానికీ తెలుగు భాషాసాహితాభివృద్ధికీ చేస్తున్న సేవలో అకాడమి సర్వసమగ్రంగా సాఫల్యం పొందాలనీ ఉజ్జ్వల భవిష్యత్తునందుకోవాలనీ కోరుతూ శుభాభినందనలందిస్తున్నాను.

పి. ఇంద్రారెడ్డి



GALI MUDDU KRISHNAMA NAIDU

MINISTER FOR FORESTS

HYDERABAD

DATE 7-7-1988

## సందేశము

తెలుగు అకాడమిని స్థాపించి 20 సంవత్సరాలు పూర్తి కావస్తున్న సందర్భంగా, ద్విదశాబ్ది ఉత్సవాలు పెద్దఎత్తున జరుపుకునుచున్నదని తెలిసి చాలా ఆనందిస్తున్నాను. గత ఇరవై సంవత్సరాలుగా తెలుగు అకాడమి, తెలుగు భాషాభివృద్ధికి, సాహితీ వికాసానికి చేస్తున్న సేవలు బహుదా ప్రశంసనీయము. తెలుగులో ఉన్నత విద్యాబోధనకు అవసరమైన వివిధ స్థాయిల పాఠ్యగ్రంథాలు, అనువాద గ్రంథాలెన్నిటినో ప్రచురించి మాతృభాషలో విద్యాబోధనకు తనవంతు పాత్రను అత్యంత ప్రతిభావంతంగా నిర్వహిస్తున్న తెలుగు అకాడమికి నా అభినందనలు.

తెలుగు అకాడమివారు నిర్వహిస్తున్న ద్విదశాబ్ది ఉత్సవాలు జయప్రదం కావాలని మనఃస్ఫూర్తిగా ఆశిస్తున్నాను.

గాలి ముద్దు కృష్ణమ నాయుడు

## అధికార భాషా సంఘం

### ఆంధ్రప్రదేశ్

డాక్టరు నండూరి రామకృష్ణమాచార్య,
ఆధ్యక్షుడు

ఫోన్ నెం. 233765
230111 (249)
బి. బ్లాకు, గది సంఖ్య. 205
సచివాలయం,
హైదరాబాదు - 500 022

2-6-1988

లేఖ నెం. 7/అ.భా.సం.పేషీ /88, తేదీ. 2-6-1988

తెలుగు అకాడమికి సందేశం

ప్రియ మహోదయా,

ఉన్నత విద్యా రంగంలో ఇంతవరకూ ఉగ్గడింపదగిన సేవ చేసి చారిత్రాత్మకమైన భూమిక నిర్వహించిన తెలుగు అకాడమికి నాహృదయ పూర్వకమైన జేజేలు.

అయితే చేసిన సేవ కంటె చేయవలసిన సేవయే ఇంకా ఎక్కువగా ఉన్నదనే సంగతి మరచిపోరాదు.

ఉన్నత విద్యావికాసానికి, వృద్ధికి పఠన, వాఙ్మయం, పాఠ్యగ్రంథాలు మాత్రమే చాలవు. ప్రపంచ భాషలలో ఉన్న సుప్రసిద్ధ ప్రామాణిక గ్రంథాలు తెలుగులో అవతరించాలి. ఇవి కేవలం అనువాద రూపాలతో యథామాతృకములుగానే కాక, యథోచిత సవరణలతో రూపొందించవచ్చు.

ఇర్వై సంవత్సరాల అభ్యున్నతి సాధించిన ఈ సందర్భంలో తెలుగు అకాడమీ ప్రత్యేక సంచిక ప్రచురించుచున్నందున నా అభినందనలు.

భవదీయుడు,
నండూరి రామకృష్ణమాచార్య

PHONE : 331-7143
GRAMS : UNIGRANTS
TELEX : 3165913

Yash Pal
CHAIRMAN

UNIVERSITY GRANTS COMMISSION
BAHADURSHAH ZAFAR MARG
NEW DELHI - 110 002

D.O.No.F. 1-9/88 (CM)

22 July, 1988

*Dear Shri Rao,*

*I send my greetings and best wishes to the Telugu Academi on the occasion of completing two decades of its work.*

*With regards,*

*Yours sincerely,*

*(Yash Pal)*

PHONE: 331 8849
GRAMS: UNIGRANTS
TELEX: 3165913

Professor **K. SATCHIDANANDA MURTY**
Vice Chairman

UNIVERSITY GRANTS COMMISSION
BAHADUR SHAH ZAFAR MARG
NEW DELHI - 110 002

## MESSAGE

*I am very glad that Telugu Akademi has completed twenty years. During this period it has achieved much. Probably there is no other akademi of this kind which has brought out more useful publications in regional languages for use of students in colleges and universities.*

*On this occasion I wish the Akademi further development.*

*6 June 1988* *K. Satchidananda Murty*

Tele: SHABDAYOG

**Prof. Suraj Bhan Singh**
Chairman.

**GOVERNMENT OF INDIA**
**COMMISSION FOR**
**SCIENTIFIC & TECHNICAL TERMINOLOGY**
**(MINISTRY OF EDUCATION & CULTURE)**

WEST BLOCK NO. VII, R.K. PURAM

*19 (Saka)*

*New Delhi - 110066* *19*

June 3, 1988.

**MESSAGE**

I am very happy to learn that on the completion of "Two Decades' of its laudable service, the Telugu Akademi, besides publishing a 'Souvenir', is also organising various programmes to celebrate the occasion in a befitting manner.

The excellent and monumental work done by your Akademi in the field of production of literature is unprecedented. Your sincere and enthusiastic approach towards the implementation of the national policy on education will, no doubt, set an example before other Granth Akademies and Book Production Boards.

I, on my own behalf and on behalf of the Commission for Scientific & Technical Terminology, send you best wishes on the occasion and we will always be prepared to extend all help and cooperation as and when needed by you.

I wish you all success in your endeavours.

*(Suraj Bhan Singh)*

GRAMS: 'BHARATI" TELEPHONES: 23558

# CENTRAL INSTITUTE OF INDIAN LANGUAGES

(Ministry of Education and Culture, Government of India)
Manasagangotri, MYSORE - 570 006

No. F. 1-1/88
Dr. D.P. Pattanayak
Director

June 6, 1988

*Dear Sri Kondal Rao,*

*Thank you for your DO letter NO. TA/Spl-2/88-89 dated May 1988 informing me of the souvenir sought to be brought out on Telugu Akademi completing two decades of its service to the cause of Indian languages.*

*The Akademi has rendered a great service to the country by making it possible for Telugu being the medium of instruction at different levels of education. I congratulate the past and present functionaries of the Akademi for their contribution.*

*I have no doubt that under your able leadership the celebration of Two Decades of the Telugu Akademi would be a fine experience for Telugus living in Andhra Pradesh.*

*With best wishes,*

*Yours sincerely,*
*D.P. PATTANAYAK*

# West Bengal State Book Board

Arya Mansion, 8th Floor
6A, Raja Subodh Mullick Square
Calcutta - 700 013
Phone : 26-7854

From.: Prof. Sibnath Chatterjee,
Chief Executive Officer.
D.O.No. : OSBB/88-89/262

Dated, the 10th June, 1988

*Dear Sri V. Kondal Rao Garu,*

*Please accept my heartiest congratulations on completion of two decades of your highly esteemed Akademi. Please convey my personal regards to the Chairman and all the staff-members of your Akademi. Your Akademi has already found a place of prestige in the academic map of our country. I wish it will continue to flourish. All my colleagues here in this Board also feel proud of your Akademi and keenly look forward to your performance.*

*With deep personal regards,*

*Yours sincerely,*
*(S.N. Chatterjee)*

**J.P.L. Gwynn**
65 South Hill Road
BROMLEY
Kent BR2 ORW
Tel. 01- 460-9189
28th June 1988.

*Dear Shri Kondal Rao,*

*Your kind letter of 31st May contains an account of the main achievements of the Telugu Akademi during the last twenty years. It gives the impression that the Akademi has concentrated on the educational side of its duties, namely, the provision of text books and glossaries for use in school and college courses which are run in Telugu medium. While this achievement is commendable and valuable, it fulfils only one of the objects of the Akademi.*

*The first object for which the Akademi was established was stated in broad terms to be 'modernising the language.' This is an ongoing process to which attention can well be devoted in the coming years.*

*Vocabularies and usages are constantly changing in modern languages. For example, in English what used to be known as **'the press'** or **'journalism'** is now called **'the media'** to take account of other forms of communication. There should be an authoritative body to provide constantly updated advice on Telugu equivalents for new terms and usages as soon as they become prevalent in the modern world. That is a function which I have always felt the Telugu Akademi should fulfil.*

*The late Shri Narla Venkateswara Rao told me in London a few years ago that there was a need for a guide to transliteration into Telugu of foreign words, personal names and place names in order to bring about uniformity. If this is a task that the Akademi can take on, the result will be helpful to publishers and readers alike.*

*Having lived in Britain for the last twenty years while still trying to keep in fairly close touch with India, I must say how regrettable it is that Telugu language and culture and even the word Telugu itself are so little known to people on this side of the world. Although it is outside the scope of the Akademi to promote Telugu culture overseas, anything that it can do to interest foreign scholars and students in Telugu studies, or to stimulate other institutions to do so, will be greatly to the benefit of all concerned.*

*I send my very best wishes for the success of your celebrations.*

*Yours sincerely,*

*(Sd.) J.P.L. Gwynn*

IGNOU

**PROF. G. RAM REDDY**

Vice-Chancellor
Indira Gandhi National Open University
New Delhi

## MESSAGE

*I am very happy to learn that the Telugu Akademi is completing 20 years. During these 20 years, the Akademi has done remarkable work by providing material in Telugu for the undergraduate students.*

*I have been associated with the Akademi right from its inception and I have all admiration for the way the Akademi is performing its functions. Very few similar institutions in the country have done as much work in their regional languages as the Telugu Akademi has done. I would, therefore, like to congratulate all the staff, in particular its Directors, who have been associated with this institution. During the last few years, under the dynamic leadership of Dr. V. Kondal Rao, Director, the Akademi has ventured into a number of other areas. I hope, in the years to come, it will continue to do the pioneering work.*

*G. Ram Reddy*



Grams: 'OPVARSITY '

Phone : Off : 226391
Res : 63063

# ANDHRA PRADESH OPEN UNIVERSITY

**Prof. C. NARAYANA REDDY**
*M.A. PH.D., D.Litt.*
*Vice - Chancellor*

6-3-645, SOMAJIGUDA
HYDERABAD - 500 482 (A.P.)

Lr.No.614/VCP/APOU/88

*Date:* 30-6-1988

## సందేశం

జాతీయోద్యమంలోనూ, నిర్మాణ కార్యక్రమంలోనూ ప్రాంతీయ భాషల వికాసం ప్రముఖ స్థానం పొందిన సంగతి అందరికీ తెలిసిందే. తెలుగు ప్రజలు ఈ రంగంలో అగ్రగాములుగావున్నారు.

1968లో తెలుగు అకాడమి స్థాపన ఉన్నత విద్యారంగంలో తెలుగు వాడుకకు స్ఫూర్తినిచ్చింది. ఈ రెండు దశాబ్దాల కాలంలో తెలుగు అకాడమి 600 పైగా గ్రంథాలు ప్రచురించడం వారి కృషికి నిదర్శనం. ఈ గ్రంథాలు ఉన్నత ప్రమాణాలలో ఉన్నాయి. తొలిదశాబ్దంలో విద్యావిషయక కార్యక్రమంలో నిమగ్నంకావడంచేత అకాడమి పాలనా భాషగా తెలుగు వాడుకకు ఎక్కువ చేయూత నివ్వలేకపోయింది. అయితే ఆ తరువాత తెలుగులో భాషా శిక్షణ, పదకోశాల ప్రచురణ ద్వారా అధికారభాషగా తెలుగు వాడుకకు గణనీయంగా తోడ్పడింది. అకాడమి నిర్వహిస్తున్న నిఘంటు నిర్మాణం, గిరిజన భాషా వాచకాల ప్రచురణ, పదసేకరణ, జనరంజక గ్రంథప్రచురణ, భాషాశిక్షణ వంటి వివిధ కార్యక్రమాలు అందరి మన్ననలు పొందుతున్నాయి.

వింశతి ఉత్సవాలు జరుపుకొంటున్న సందర్భంగా అకాడమి నిర్వాహకులందరికీ నా శుభాకాంక్షలందజేస్తున్నాను.

సి. నారాయణ రెడ్డి

# SRI KRISHNADEVARAYA UNIVERSITY

Offi: 21192-96
Phones: 20923-25
Res: 20628

**Prof. K. Venkata Reddy,**
M.A., Ph.D., Dip. in statistics
**VICE-CHANCELLOR**

Sri Venkateswarapuram
ANANTAPUR - 515003 (A.P.)
India

Date: 8.7.1988

గౌరవనీయ తెలుగు అకాడమీ సంచాలకులకు

తెలుగు అకాడమీ ఇరవయ్యేళ్ళ వయస్సు నిండిన సందర్భంలో స్మృతి చిహ్నంగా ఒక విశేష సంచికను వెలువరించడం ఎంతో ముదావహం. ఈ సందర్భంగా నా హృదయపూర్వక శుభాకాంక్ష లందిస్తున్నాను.

తెలుగు అకాడమీ మొదలైనప్పటి నుంచి ఆ సంస్థతో నాకు ఏదో ఒక విధంగా సన్నిహిత సంబంధం కొనసాగుతూనే ఉంది. మొట్టమొదట ఆర్థిక శాస్త్రానికి సంబంధించిన పదకోశం తయారు చేయించడం ద్వారా, తర్వాత కళాశాలల్లోని ఆర్థిక శాస్త్ర అధ్యాపకులకు ఏర్పాటు చేసిన ఓరియంటేషన్ కార్యక్రమానికి కన్వీనరుగా నియమించడం ద్వారా, ఆ తర్వాత డిగ్రీ స్థాయి విద్యార్థులకు మూడు వాచకాలను రాయించడం ద్వారా తెలుగు అకాడమీ నన్ను ఎంతగానో ప్రోత్సహించింది. అది నా అదృష్టంగా భావిస్తున్నాను.

మొదట్లో నత్త నడక నడిచినా, ఈనాడు శరవేగంతో ప్రయాణిస్తున్నది తెలుగు అకాడమీ. తన పరిధిని విస్తృత పరచుకుంటూ అచ్చు పుస్తకాల ప్రచురణ స్థాయిని మించి ఆధార గ్రంథాల ప్రచురణ వరకు, అనువాదాల స్థాయి నుంచి మౌలిక గ్రంథ ప్రచురణ వరకు, డిగ్రీ స్థాయి పుస్తకాల ప్రచురణ నుండి స్నాతకోత్తర స్థాయి పుస్తక ప్రచురణ వరకు ఎదుగుతున్నది.

దినదినాభివృద్ధి చెందుతున్న వివిధ రంగాల పరిజ్ఞానాన్ని సామాన్యులకు అందజేయడంలోను, వివిధ స్థాయిల్లో పోటీ పరీక్షలకు అవసరమైన రచనలను అందించడంలోను తెలుగు అకాడమీ చురుకైన పాత్ర నిర్వహించాల్సి ఉంది. ఇందుకోసం కేవలం కళాశాల, విశ్వవిద్యాలయాల అధ్యాపక మేధావులనే కాక, విద్యాసంస్థలకు వెలుపల ఉన్న ఎందరో మహానుభావుల శక్తియుక్తుల్ని కూడా తెలుగు అకాడమీ పుష్కలంగా ఉపయోగించుకోవాల్సి ఉంది.

తెలుగు ప్రజలకు సేవ చేయడంలో తెలుగు అకాడమీ గణనీయంగా కృషి చేస్తూ చైతన్యవంతంగా కొనసాగాలని మనసారా కోరుకుంటున్నాను.

(సం.) కె. వెంకట రెడ్డి

**PROF. T. NAVANEETH RAO**
M.Sc , Ph.D., C.Chem., F.R.S.C.

**VICE-CHANCELLOR**

TELE: OFFICE: 71951/Ext.221/364
71048
LODGE: 71088

OSMANIA UNIVERSITY
HYDERABAD - 500 007.A.P.

No. VCP/296
Date: 8th July, '88.

## MESSAGE

*At the outset, let me extend my heart-felt congratulations to the Telugu Akademi for having completed two decades of dedicated literary service to the Telugu Medium students and Telugu literature*

*My sincere appreciations are for the yeomen service rendered by the Telugu Akademi in getting prepared standard text-books for college and University students and also for tremendous work done in translating English books into Telugu and enriching it for the people of Andhra Pradesh. They are now exposed to the world of ideas which were hitherto the privilege of only the English speaking population of Andhra Pradesh.*

*Under the dynamic leadership of Mr. P. Indra Reddy, Hon ble Minister for Education as Chairman of Telugu Akademi, and with Mr. V. Kondal Rao as Director, we already see the Akademi vibrating with new ideas and breaking new grounds in opening more district centres, and facing up to the new challenges of the day.*

*On this happy occasion of having completed two decades of commendable achievements, while congratulating once again, I wish the organisation and the organisers of the celebrations ALL SUCCESS.*

*T. NAVANEETH RAO*

Grams: MAHILALAYA

Phones: Off.: 2876
Res.: 2931

# SRI PADMAVATI MAHILA VISVAVIDYALAYAM

TIRUPATI - 517 502, ANDHRA PRADESH

**Prof.K. RAJYALAKSHMI,** M.D.
Vice-Chancellor

No. 2022/VCP/SPMVV/88
Dated: July 8, 1988

శ్రీ కొండలరావుగారికి
నమస్కారం

తెలుగు అకాడమి రూపుదిద్దుకొని 20 సంవత్సరాలు పూర్తికావస్తున్న సందర్భాన్ని పురస్కరించుకొని ప్రత్యేక సంచికను వెలువరిస్తున్నందుకు సంతోషం. కడచిన 20 సంవత్సరాలలో తెలుగు అకాడమి భాషా సాహిత్య రంగాలలో చేసిన సర్వతోముఖమైన, విశిష్టమైన కృషి ప్రశంసనీయమైనది. సాహిత్యసమీక్షా పరిజ్ఞానంతో, విమర్శనా దృక్పథంతో చేపట్టిన బహుముఖమైన పుస్తక ప్రచురణ తెలుగు భాషాభిమానులకు, పండితులకు, జిజ్ఞాసువులకు ఎంతో ఉపకరించి, వారి ఆదరాభిమానముల నందుకొన్నది. అకాడమీ చేసిన సర్వతోముఖమైన కృషిలో ప్రత్యేకతను సంతరించుకున్నది "మాండలిక వృత్తి పదకోశ" ప్రచురణ పథకం. భారతీయ భాషలలోనే ఇది తొలి ప్రయత్నం కావడం తెలుగువనితగా నాకెంతో గర్వకారణంగా ఉంది. అకాడమీ చేస్తున్న ఈ అపారమైన కృషి భవిష్యత్తులో బహుముఖంగా మరింత విస్తరించాలని, తెలుగుపాఠకలోకానికి అకాడమీ ప్రచురణలు కరదీపికలుగా వెలుగుచూపాలని ఆశిస్తూ, ఆకాంక్షిస్తూ,

అభివందనములతో,

కోలా రాజ్యలక్ష్మి

Gram: "UNIVERSITY"
Tele Phone: Off. 63327, 64871 Ext. 222
Res. 62516, 64871 Ext. 374

# ANDHRA UNIVERSITY

**Prof. K.V. RAMANA**
M.A., M.S.W. (Andhra)
A.M., Ph.D. (Illinois, U.S.A)
VICE-CHANCELLOR

VISAKHAPATNAM 530 003
ANDHRA PRADESH, INDIA

No. VC(S)/0016/1988

Dt. 20-6-1988

## సందేశం

*శ్రీ కొండలరావు గారికి :*

*మీ 20-5-1988 తేదీ లేఖ అందినది. తెలుగు అకాడమీ రెండు దశాబ్దాల కాలంలో అత్యుత్తమమైన సేవలను విద్యారంగానికి అందించింది. తెలుగును బోధనాభాషగా విరివిగా వాడకం చేయడంలో అకాడమీ ప్రముఖ పాత్ర వహించింది. మరియు అకాడమీ ప్రచురించిన గ్రంథాలు విద్యార్థులకు అధ్యాపకులకు ఎంతో ఉపయోగపడుచున్నాయి. అదే విధంగా స్నాతకోత్తర స్థాయిలో కూడా అకాడమీ గ్రంథరచన మరియు ప్రచురణ చేపట్టి భాషాభివృద్ధికి మరియు విజ్ఞానాభివృద్ధికి తోడ్పడగలదని ఆశిస్తున్నాను. రానున్న దశాబ్దంలో కూడా మరింత విరివిగా అకాడమీ తన సేవలను ప్రజాబాహుళ్యానికి, విద్యార్థిలోకానికి, అధ్యాపక వర్గానికి అందజేస్తుందని నాకు పూర్తి విశ్వాసం ఉంది.*

ఇట్లు
(కె.వి. రమణ)

# SRI VENKATESWARA UNIVERSITY

Professor **S.V.J. LAKSHMAN,**
M.Sc., D.Sc., F.N.A.Sc.,
VICE-CHANCELLOR

Phone: Off: 2737
Res: 2904
TIRUPATI - 517 502
(Andhra Pradesh)
INDIA
31 May 1988

**MESSAGE**

*I am happy to learn that the Telugu Akademi is completing twenty years of its useful service to the nation in general and Telugu people in particular.*

*The Telugu Akademi has been engaged in doing some commendable work. A number of books have been written by eminent authors right from the school stage to the post-graduate level. I am happy to learn that a number of good scientific books in English have been translated into Telugu by the efforts of Telugu Akademi. I am happy to note that Telugu Akademi is running a few Regional Centres as well at places like Visakhapatnam, Vijayawada, Tirupati and Warangal.*

*I wish the Akademi all success in the years to come.*

*(S.V.J. LAKSHMAN)*

ఆంధ్రప్రదేశ్ ఆరోగ్య విజ్ఞాన విశ్వవిద్యాలయం
విజయవాడ - 520 005

**ANDHRA PRADESH UNIVERSITY OF HEALTH SCIENCES**
VIJAYAWADA - 520005, INDIA
PHONES: OFF: 53374, RES: 53290
TELEX : 475 269 UHS IN
GRAMS : HEALTH UNIVERSITY

PROF: L. SURYANARAYANA, M.S
VICE CHANCELLOR

VC/OC/277/88

Dt. 08-06-88

శ్రీ కొండలరావు గార్కి

శుభాభినందనలు

తెలుగుజాతికే గర్వకారణమైన తెలుగు అకాడమి రెండు దశాబ్దాలు విజయవంతంగా ఉన్నత విద్యారంగానికి సేవచేసిన శుభతరుణంలో నా హార్దిక శుభాకాంక్షలు.

తెలుగు భాషను "దేశ భాషలందు తెలుగు లెస్స" అని మనవాళ్ళు "ఇటాలియన్ ఆఫ్ ది ఈస్ట్" అని పాశ్చాత్యులు ప్రస్తుతించారు. అటువంటి జిలుగు వెలుగుల తెలుగు భాషకు ప్రత్యేకమైన సంస్థ నెలకొల్పడం, ఆ సంస్థను ఇరువది వత్సరాలు దిగ్విజయంగా కొనసాగించడం ముదావహం.

తెలుగు అకాడమి విజయానికి బాధ్యులైన భాగస్వాములందరినీ ఈ శుభ సందర్భంలో అభినందిస్తున్నాను.

ద్విదశాబ్ది విజయోత్సవ ప్రత్యేక సంచిక సర్వాంగ సుందరంగా వెలువడాలని ఆకాంక్షిస్తున్నాను.

తెలుగు అకాడమి ఆచంద్రార్కం అనవరతంగా వెలుగొందాలని, తెలుగుజ్యోతిని, తెలుగు ఖ్యాతిని దిగ్దిగంతాలకు ప్రసరింపజేయాలని అభిలషిస్తున్నాను.

భవదీయుడు

లింగం సూర్యనారాయణ

మండలి వెంకట కృష్ణారావు

**M.V. KRISHNA RAO**
MEMBER, (South Zone),
KHADI & VILLAGE
INDUSTRIES COMMISSION
Irla Road, Vile Parle (West)
BOMBAY - 400 056
Phones
Office : 6363659
Guest House :6364172

Sevasadan
Gandhi Kshetram Phone: 221
AVANIGADDA - 521 123
Krishna Dt. A.P.

Dt. 4-7-88

తెలుగు అకాడమి డైరక్టరు
శ్రీ వి. కొండలరావు గారికి
నమస్కారములు.

తెలుగు అకాడమి ద్వాదశ వార్షికోత్సవముల సందర్భంగా తమరు పంపిన లేఖ అందినది. గత 20 సంవత్సరములుగ తెలుగు అకాడమి చేసిన కృషి ప్రశంసనీయమైనది. అద్వితీయమైనది.

తెలుగు అధికారభాషగ అభివృద్ధిపరచడానికి మాతృభాష అయిన తెలుగులో విద్య, విజ్ఞాన సముపార్జనలకు తోడ్పడడానికి స్నాతకోత్తర స్థాయివరకు తెలుగులో పాఠ్య పుస్తకాల ప్రచురణకు భారత ప్రభుత్వ సహాయ, సహకారములతో తెలుగు అకాడమీ, ముఖ్యమంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి హయాంలో అప్పటి విద్యామంత్రి శ్రీ పి.వి. నరసింహారావు అధ్యక్షతన 1968లో స్థాపించబడింది. పటిష్టవంతమైన పునాదులతో ప్రారంభించబడింది. "ఆంధ్రప్రదేశ్‌లో గాంధీజీ," వివిధస్థాయిలలో స్వాతంత్ర్యపోరాటాలను గురించి చరిత్రాత్మకమైన, మహత్తరమైన ప్రచురణలను చేసింది. 600 పైగా పుస్తకాలను తెలుగు అకాడమీ ప్రచురించి తెలుగు భాషాతల్లికి ఉత్తమ సేవలను అందించింది.

శ్రీ జలగం వెంగళరావు నేతృత్వములో విద్యాశాఖను నేను నిర్వహించినపుడు తెలుగు అకాడమీ అధ్యక్షులుగా పనిచేసే అదృష్టము కల్గింది.

తెలుగు బోధనాభాషగ ఉన్నంత కాలం తెలుగు అకాడమి ఎంతేని అవసరం. తెలుగు అకాడమీ ప్రత్యేకతను నిలుపుకొంటూ తెలుగు సాహిత్యానికి ఎనలేని సేవలు అందించగలదనే విశ్వసిస్తున్నాను; కోరుకొంటున్నాను.

మండలి వెంకట కృష్ణారావు

**Dr.K. KESHAVA RAO** Ph D,
FORMER MINISTER, A.P.

Phone· 37696
1, Journalist Colony, Road No. 3,
Banjara Hills, Hyderabad - 500 034, A P.

July 5, 1988

*Dear Sri V. Kondal Rao garu,*
*Your letter dated July 1, 1988.*

*I am happy to know that Telugu Akademi has completed 20 years of valuable service.*

*The contribution of Telugu Akademi to Telugu language and culture is indelible.*

*The members of the Akademi - researchers, staff and other associates deserve full-throated encomiums on this occasion, for their invaluable service and dedication.*

*I send my greetings.*

*Yours truly.*

*K. Keshava Rao.*

**SHRAVAN KUMAR,** I.A.S.
CHIEF SECRETARY TO GOVT.

HYDERABAD - 500 022.
DATED 6th JUNE, 1988.

D.O.Lr.No. /CSP/88.

*Dear Shri Kondal Rao,*

*It gives me great pleasure to learn that the Telugu Academi is going to celebrate "TWO DECADES" of its fruitful service this year and a Souvenir would be brought out on the occasion.*

*It is, indeed, a matter of gratification and pride that the Telugu Akademi has built up a fine record of service during the last 20 years by providing material for as many as 1,000 titles in Telugu language and by compiling and coining as many as 1,25,000 terms in the same language, besides serving the instructional and official needs through Telugu medium at different academic and administrative levels.*

*I hope the Souvenir which you propose to bring out on the occasion, would reflect adequately the activities of the Akademi in all its facets.*

*I wish your endeavour all success!*
*With best wishes,*

*Yours sincerely*

*(Sd)*
*(SHRAVAN KUMAR)*

**B.V. RAMA RAO**
M.A. (Osm ) MPA (Harvard) I.A.S.,
Vice-Chairman & Managing Director

Grams: INDINFRA
**A.P. INDUSTRIAL INFRASTRUCTURE CORPORATION LTD.,**
HYDERABAD - 500 029
Phones: Off:233596
Res: 63400

తేదీ: 5-6-1988

ప్రియమైన శ్రీ కొండలరావు గారికి,

తెలుగు అకాడమి 20 సంవత్సరాల సాహిత్య సేవ విజయవంతంగా పూర్తి చేసిన సందర్భంలో ప్రత్యేక సంచిక ప్రచురిస్తున్నారని తెలిసి చాలా సంతోషించాను.

గత రెండు దశాబ్దాలుగా అకాడమి వారు తెలుగు సాహిత్యరంగంలో చేసిన సేవ ఎంతో కొనియాడదగినది. ముందు ముందు ఇదే విధంగా ఉత్తమ రచనలు ప్రచురించాలని, ప్రామాణికమైన పాఠ్య గ్రంథాలను తెలుగులోకి తర్జుమా చేసి. వాటి ముద్రణ ఏర్పాటు చేసి తెలుగు విద్యార్థులకు సాహిత్య అభిలాష కలుగ చేస్తారని ఆశాభావాన్ని వెలుబుచ్చుతున్నాను.

భవదీయుడు

(సం)

బి.వి. రామారావు

ఎస్. కాశీపాండ్యన్, I.A.S.,

కార్యదర్శి
గృహనిర్మాణము, మునిసిపలు పరిపాలన,
పట్టణ అభివృద్ధి శాఖ,
సచివాలయం, హైదరాబాదు - 500 022.

## సందేశము

తెలుగు భాషా సంస్కృతీ సంసేవనలో తెలుగు అకాడమీ రెండు దశాబ్దాలు పూర్తి చేసుకోవడం మనమందరం గర్వించదగిన అంశం. గోండ్వానాగా వ్యవహృతమయ్యే మన తెలుగు భూమి మానవ నాగరికతా ప్రాదుర్భావ వికాసాలను పాదుకొల్పిన మాతృభూమి. సంస్కృత పదభూయిష్ఠ కవితాధోరణులు ప్రబలడంవల్ల, మన ప్రాచీన తెలుగు భాషాస్వరూపస్వభావాలు మరుగున పడిపోయాయి. తెలుగు భాషకు ప్రప్రథమ వైయాకరణుడు నన్నయ భట్టారకుడే అని ఒక భావన వుంది. ఈ భావన సరైనది కాదు. పదవ శతాబ్దానికి చెందిన యప్పారున్కాలకరిక్కాయ్ అనే తమిళ వ్యాకరణ గ్రంథంలో వాంచి (యార్) అనే ఆంధ్రకవి రచించిన తెలుగు వ్యాకరణ ప్రస్తావన వుంది. నన్నయభట్టారకుని కంటె ముందే తెలుగు వ్యాకరణం వాడుకలో వుందనడానికి ఇదే నిదర్శనం.

భాషౌన్నత్యం ఆ భాషలోని మృదుమధురపదరామణీయకతపై ఆధారపడి వుంటుందనేది నిర్వివాదం. తెలుగు భాషను వీలైనంత సులభశైలిలో లలితపదాలతో తీర్చిదిద్దే మహత్తర కృషి తెలుగు అకాడమీ భుజస్కంధాలపై వుంది. అకాడమీ ప్రచురించే గ్రంథాలను కేవలం విద్యార్థులే కాకుండా సామాన్య ప్రజానీకం కూడా చదివి అవగాహన చేసుకొనే స్థాయిలో వుండడం ఎంతైనా అవసరం. ఈ బాధ్యతను తెలుగు అకాడమీ ప్రశంసనీయంగా నిర్వర్తిస్తున్నది. అయినప్పటికీ, మన భావితరాలవారి అవసరాలకు అనుగుణంగా భాషను తీర్చిదిద్ది, కళలు, విజ్ఞానశాస్త్రం మున్నగు అధ్యయనాంశాలకు సంబంధించి మరెన్నో గ్రంథాలను ప్రచురించేందుకు తెలుగు అకాడమీ ఇంకెంతోకృషి చేయాల్సివుంది. అకాడమీ చేపట్టిన ఈ బృహత్తర కృషి జయప్రదం కావాలని ఆకాంక్షిస్తున్నాను.

ఎస్. కాశీపాండ్యన్.
3.6.88

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

శ్రీ ఎమ్. గోపాలకృష్ణన్, ఐ.ఎ.ఎస్.
కమీషనరు, జివిడిఎ,
ప్రణాళికాశాఖ

సచివాలయము,
హైద్రాబాదు,
తేదీ: 30, మే, 1988.

కొండలరావుగార్కి,

గత రెండు దశాబ్దాలుగా తెలుగు అకాడమీ యొక్క సేవలు విద్యారంగానికి అనన్య సామాన్యమైనవి. ఈ సంస్థను స్థాపించిన ప్రభుత్వ చర్య ఎంతో కొనియాడదగినదనుట నిస్సందేహము. భాషాప్రయుక్త రాష్ట్రాల స్థాపిత పశ్చాత్, రాష్ట్రప్రభుత్వాల విధానములు మారి, తద్వారా పరిపాలనాయంత్రాంగము భాషాప్రయోగ రూపేణా పరిపాలనా కార్యక్రమాలను ఆయా ప్రాంతీయ భాషలలో కొనసాగించే ప్రయత్నాలు జరుగనారంభించి కొన్ని దశాబ్దాలు గడచినవి. కొన్ని రాష్ట్రాలు సఫలీకృతులుకాగా మరికొన్ని గమ్యాన్ని చేరుకోలేదు. దీనికిగల కారణాలలో ముఖ్యమైనది ఉన్నత విద్యారంగంలో భాషాప్రయుక్త విద్యా బోధనయొక్క కుంటునడకయే. దానివెనుక గల కారణం తెలుగు అకాడమీ వంటి సంస్థలు ఏర్పడకపోవటమే ఫ్రాంసు దేశంలోని ఫ్రెంచి అకాడమీ వంటి నిర్విరామకృషి చేయగల సంస్థలు లేకుండుటయే.

కాని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో ఇట్టి కొరతలేదు ఉర్దూ అకాడమీ, తెలుగు అకాడమీలు చాలా సేవలనందిస్తున్నాయి. ప్రయాణం అతి దూరమైనది. గమ్యం నిర్ణీతమైనదికాదు. ఏమంటే భాషయే జీవనరూపము. అది మారుతూంటుంది. ఇదమిత్థమనిగాని, ఇక మారదని గానీ చెప్పలేము.

ఈ విషయాన్ని గ్రహించిన తెలుగు అకాడమీ తనసేవలను ఇంకా, ఇంకా అందిస్తూ ఉండగలదని ఆశిస్తూ

ఇట్లు,
భవదీయుడు

(సం)
(మామిడిపూడి గోపాలకృష్ణన్)

# ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము

**కే.యమ్. అహ్మద్**
ఐ.ఏ.యస్.
కమీషనర్
తెలుగు పరిపాలన సంస్థ
248294 (కా)
222323 (ఇ)

రోడ్ నం: 25
జూబిలీ హిల్స్
హైదరాబాదు - 500 034
తేదీ: 2/7/1988

తెలుగు అకాడమి అన్ని రంగములలో "తెలుగు భాష" వాడకమును ప్రోత్సహిస్తూ 20 సంవత్సరములు పూర్తి చేసినందులకు సంతోషిస్తున్నాను. తెలుగు అకాడమి యొక్క ఆధ్వర్యంలో వ్యవహారిక భాషయైన తెలుగు, పరిపాలనాభాషగా మరింత విశిష్టత నొంది శక్తిమంతమైన సాధనముగా రూపొందగలదని విశ్వసిస్తున్నాను.

శుభాకాంక్షలతో

(డా॥ కే.యమ్. అహ్మద్)

డా॥ ఆర్.వి. వైద్యనాథ అయ్యర్,
ప్రభుత్వ కార్యదర్శి
విద్యాశాఖ, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం

టెలిఫోన్ నం. 237193
232403
సచివాలయ భవనాలు
హైదరాబాదు.
తేదీ: 19-7-1988

శ్రీ కొండలరావుగారూ,

తెలుగు అకాడమి ఇరవై ఏళ్ల ఉత్సవాలు జరుపుకొంటున్నందుకు నాకు సంతోషంగా ఉంది.

ఈ ఇరవై ఏళ్లలోను అకాడమి ఎంతో ప్రగతి సాధించింది. తెలుగువారికి - ముఖ్యంగా తెలుగు మాధ్యంలో ఉన్నత విద్యనభ్యసించే విద్యార్థులకు - గొప్ప సేవచేసింది. ఇంతవరకు చేసిన సేవకు పరిగణనగా ఈ సంస్థ, దేశంలోని అత్యుత్తమమైన సంస్థల్లో ఒకటిగా ప్రశంసలందుకొన్నది. ముందుముందు స్నాతకోత్తరస్థాయి, పాలిటెక్నిక్, వృత్తివిద్యాస్థాయి కోర్సులకు కూడా పుస్తకాలు ప్రచురించబోతున్నది. అంతేకాక, సామాన్యజనానికి అర్థమయ్యేవిధంగా విజ్ఞాన శాస్త్ర సామాజికశాస్త్ర విషయాలమీద ఇంకా అనేక గ్రంథాలు రాయించి ప్రచురించబోతున్నది.

అకాడమీకి ఉజ్జ్వల భవిష్యత్తు చేకూరాలని ఆకాంక్షిస్తూన్నాను.

భవదీయుడు

సం/-
(ఆర్.వి. వైద్యనాథ అయ్యర్)

**వావిలాల గోపాలకృష్ణయ్య**

సత్తెనపల్లి
5.6.88

పెద్దలు శ్రీ వెలిచాల కొండలరావుగారికి,

నమస్తే. ఇరువది సంవత్సరాల నిరంతర కృషితో నిర్వహించి ఈ సందర్భంగా ప్రత్యేక సంచిక తెలుగు అకాడమి తరఫున ప్రకటించదలచడం అభినందనీయం.

మాతృభాషలో పరిపాలన, బోధన మాధ్యాన్ని అమలు జరుపుటకు ప్రారంభించిన మన తెలుగు అకాడమీ పాఠ్యపుస్తకాల ప్రచురణలోను, భాషా ప్రాంతీయతల పరిశీలనలోను ఇంతవరకు చేసిన కృషి నిజంగా సంతృప్తికరం అనజాలకపోయినా ఇతర రాష్ట్రాల ప్రాంతీయ భాష అకాడమీలు చేసిన కృషి కంటె తెలుగు అకాడమీ అనుసరించిన స్వయం సమృద్ధ విధానం అత్యంత అభినందనీయం. ప్రామాణిక తెలుగును సంకలనం చేసే కృషి కూడా ఇపుడిపుడే జరుగుతుండడం సంతోషప్రదం. పాఠ్యపుస్తకాల తెలుగు మాధ్యమంగా సెకండరీ, కాలేజీ, పట్టభద్రానంతర స్థాయికి సాగిస్తున్న కృషి ఇంకా విస్తరించవలసి ఉంది. మీరు నిర్వహిస్తున్న వాటిలోను "తెలుగు పత్రిక" నిర్వహించడంలోను సంతృప్తి ఉంది. అదృష్టవశాత్తు తెలుగు అకాడమీ వ్యక్తిత్వం పోకుండా నిలవగలిగినందులకు మిమ్మల కన్న మమ్మలనే అభినందించుకుంటున్నాం. వివిధ ప్రాంతాలలో కేంద్రాలు యేర్పరచడంలోరానున్న సాధక బాధకాలు సమన్వయం కోలుపోకుండా ఉండడం ప్రధానంగా ఆలోచించవలసి వుంది. వికేంద్రీకరణ ఎంత అవసరమో కేంద్రీకృత సమన్వయం కూడా అంత అవసరం అని నా భావన. ఈ ఇరవై సంవత్సరాల వలెనే - అంతకన్న కూడా అభ్యుదయ సాధనలోతెలుగు అకాడమీ భవిష్యత్తులో అనేక విజయాలు సాధించగలదని విశ్వసిస్తూ ఈ ప్రత్యేక సంచిక మార్గదర్శి అవుతుందని, కావలెనని నా ఆశాభావం - ఆకాంక్ష తెలియజేయుటకు సంతోషంగా వుంది.

నమస్తే

భవదీయుడు
(సం) వావిలాల గోపాలకృష్ణయ్య

Phone: 42762

# ఆంధ్ర సారస్వత పరిషత్తు

# ANDHRA SARASWATHA PARISHATH

TILAK ROAD, HYDERABAD - 500 001.

Ref.................... Date2-6-1988

మిత్రులు శ్రీ వెలిచాల కొండలరావుగారికి,

నమస్కారాలు

మీరు పంపిన లేఖ అర్థాధికార నెం తె అ/ప్రత్యేక/2/1988-89 తేదీ 20-5-1988. తేదీ గలది అందినది.

తెలుగు అకాడమి స్థాపించి రెండు దశాబ్దాలు గడుస్తున్న సందర్భంలో మీరొక ప్రత్యేక సంచిక ప్రచురించవలెనని తలపెట్టినట్లు తెలుసుకొని మిక్కిలిసంతోషించినాను. మీ తలంపు ప్రశంసనీయమైనది.

తెలుగు అకాడమి స్థాపించినప్పటి నుండి ఇటీవల వరకు అనగా నాలుగు సంవత్సరాల క్రిందటి వరకు *Board of Governers* లో నేను సభ్యునిగా నుండి అకాడమి అభివృద్ధిని, కృషిని దగ్గరగా చూచినాను. అకాడమి చేసిన పని హర్షించదగినది. తెలుగుఅకాడమి ఉద్యోగ బృందం కష్టపడి పని చేసి ఆశయాల సాధనకు విజయ వంతంగా పరిశ్రమించినది. భారత దేశంలో ఇతర భాషలు ఈ ప్రణాళిక క్రింద చేసిన అభివృద్ధితోపోల్చిచూస్తే తెలుగు అకాడమి చేసిన పని గణనీయమైనది. తెలుగును నేటి అవసరాలకు అనుగుణంగా తీర్చి దిద్దడంలోను, పాఠ్య పుస్తకాల ప్రచురణలలోను తెలుగు అకాడమి మార్గదర్శకమైన విజయాలు సాధించినది. ఆంధ్రప్రదేశ్‌లోని విశ్వవిద్యాలయాలు వివిధ విజ్ఞాన శాఖలలో ప్రవీణులు తెలుగు అకాడమి పనికి పూర్తి తోడ్పాటు ఇచ్చినారు. సభలను, సమావేశాలను, చర్చలను ఏర్పాటు చేసి ఆధునిక అవసరాలకు అనుగుణంగా తెలుగు సక్రమ వికాసం పొందడానికి తెలుగు అకాడమి దారి చూపించినది.

తెలుగు అకాడమి పాలకమండలిని, ఉద్యోగ బృందాన్ని ఈ సందర్భంలో అభినందించవలసి ఉన్నది. ఇకముందు తెలుగు అకాడమి ఇంకను ఎక్కువ అభివృద్ధి గావించి ఆధునిక అవసరాలకు అనుగుణమైన తెలుగు భాషావికాసానికి విజయవంతంగా కృషి చేయగలదని ఆశిస్తున్నాను.
మీకు నా హృదయ పూర్వక శుభాకాంక్షలు. నా సహకారం మీకు సర్వదా లభ్యము కాగలదు.

చిత్తగించగలరు

భవదీయుడు,

దేవులపల్లి రామానుజరావు

2-6-30 నక్కలగుట్ట
హనుమకొండ

శ్రీ కొండలరావుగారూ
మీ ఉత్తరం అందింది

ఏ భాషరానీది ఏమి వేషమురా
ఈ భాష ఈ వేష మెవరికోసమురా"?
"తెలుగు వాడవురోరి తెలుగుమాట్లాడుటకు
సంకోచపడెదవు సంగతేమిటిరా"?
అన్య భాషలు నేర్చి ఆంధ్రంబురాదంచు
సకిలించు ఆంధ్రుడా చావవెందుకురా"?

అని వెనక 1938–40ల్లో ప్రశ్నించాను. ఆ పరిస్థితి ఇప్పుడు లేదు. సంతోషం, ఆంధ్రప్రదేశ్ అవతరణ తర్వాత, "ఈనాడు మనది అయిననాడు" అనే గేయంలో

"తెలుగన్నివిద్దెలను నేర్పెడి బాసగా
వెలయునాడు మనది అయిననాడు" అన్నాను.

దానికోసం తెలుగు అకాడమీ, తెలుగు అధికార భాషా సంఘం మంచి కృషి చేసినవి. ప్రత్యేకంగా తెలుగు అకాడమీ ద్వారా తెలుగులో ఉన్నత విద్య గరపటానికి అన్ని విషయాలకు (Faculties) సంబంధించిన పుస్తకాలు తెలుగులో సిద్ధం చేస్తున్నారు. ఫలితంగా తెలుగుభాష ఉన్నత విద్యారంగంలో విద్య నేర్పే మాధ్యమంగా శక్తిసంపన్నమవుతున్నది.

ఈ సందర్భంగా అకాడమీ ఒక ప్రత్యేక సంచికను ప్రచురించడం సంతోషదాయకం. దీనికై కృషి చేసినవారంతా అభినందనీయులే-

8-6-88
హనుమకొండ

మీవాడు
కాళోజి నారాయణరావు
(కాళోజి)

GYAN BAGH PALACE
Goshamahal, Hyderabad A.P
500012 (India)

శేషేంద్ర
7/6/1988

మిత్రులు శ్రీ కొండలరావుగారికి

నమస్కారాలు

మీ లేఖ.నం. తె.అ./ప్రత్యేక/2/1988-89 అందింది. Dt. 20.5.88

మీ ఆకాడమీ వారు నిర్వహిస్తున్న కార్యక్రమాలు పరిశీలనగా చూస్తున్నాను. మీరు వెలువరిస్తున్న సంచికలు కూడ చదువుతున్నాను.

అకాడమి విజ్ఞాన వికాసానికీ, పరిశోధనకు, ఆధునిక విద్యాలోకానికి కావలసిన భాషను రూపొందించడంలో అమూల్య కృషి చేస్తోంది అనడంలో ఏమాత్రమూ సందేహం లేదు. ప్రత్యేకించి మీ మార్గదర్శకత్వంలో ఇప్పుడు జరుగుతున్న కృషి విలువలోనూ విరివిలోనూ ఇంతకు పూర్వం జరగలేదని కూడ చెప్పవచ్చు.

మీకు నా హృదయపూర్వక అభినందనలు.

ఇట్లు,
భవదీయుడు

(సం) శేషేంద్ర

బి. రామరాజు
1-8-117/2 చికటిపల్లి,
హైదరాబాదు-20

ఓం శ్రీసాయిరామ

2.6.1988

శ్రీయుతులు వెలిచాల కొండలరావుగారికి
నమస్కారములు

ఆర్యా !

తాము దయతో వ్రాసిన జాబందినది. కృతజ్ఞుడను.

తెలుగు అకాడమీ స్థాపన కాలం నుండి ఆ సంస్థ చేస్తున్న కృషి సన్నిహితంగా చూచే భాగ్యం నాకు కలిగింది. ఉన్నత విద్యారంగానికి, పాఠ్య పుస్తక ప్రచురణకు, ప్రామాణిక శాస్త్రగ్రంథ ప్రచురణకు పారిభాషిక పదకోశాల నిర్మాణానికి తెలుగు అధికార భాషగా వ్యాప్తి కావటానికి తెలుగు అకాడమీ గొప్ప సేవ చేసింది. భాషావైజ్ఞానిక గోష్ఠులు సదస్సులు నిర్వహించి మంచి ఫలితాలు సాధించింది. రాష్ట్ర కేంద్రప్రభుత్వాలు ఏ సదుద్దేశంతో ఈ సంస్థను స్థాపించినాయో ప్రారంభంనుండి ఆ ఉన్నత లక్ష్యాలకోసం ఈ సంస్థ కృషి చేస్తూనే ఉన్నది. ప్రారంభించి కొంతవరకు సాగి మధ్యలో ఆగిపోయిన బృహన్నిఘంటు నిర్మాణం కూడ త్వరలో మరల ప్రారంభించి కృతకృత్యులు కావాలెనని కోరుతున్నాను. "శ్రేయాంసి బహు విఘ్నాని" అన్నట్లుగా గొప్ప పనులకే ఆటంకాలు వస్తుంటాయి. వాటిని అధిగమించి అనుకున్న కార్యం సాధించే పరిపాలనా దక్షత మీకు ఉన్నదని నా విశ్వాసం. మీ నేతృత్వంలో తెలుగు అకాడమీ ఇతోధికాభివృద్ధిని సాధించవలెనని పరాత్పరుని ప్రార్థిస్తున్నాను. నమస్తే

మీ

బి. రామరాజు

**Dr. Ravuri Bharadwaja**
159/2RT, Vijayanagar Colony,
HYDERABAD - 500 457

9.6.88

శ్రీ కొండలరావుగారికి

నమస్కారం,

తమ జాబు అందింది. "తెలుగు అకాడమి" ప్రారంభోత్సవానికి నేనూ హాజరయ్యాను. ఒక రేడియో నివేదికను కూడా ప్రసారం చేశానని జ్ఞాపకం. ఈ తీయని సంఘటన, నిన్ననో మొన్ననో జరిగినట్లుగా ఉంది.

ఇంతవరకూ - అకాడమీ డైరక్టర్లుగా ఉన్నవారందరూ నాకు తెలిసిన వారూ, బాగా తెలిసిన వారూ కావడం నా అదృష్టం. మీరు ప్రకటించిన పుస్తకాలన్నీకాదుగానీ - సాహిత్య రంగానికి సంబంధించినవీ, సామాజిక, రాజకీయ శాస్త్రాలకు సంబంధించినవీ, జిల్లాల మాండలికాల ప్రచురణలు, నిఘంటువులూ చూశాను. ఈ పుస్తకాల్లో కొన్ని నాకు బాగా ఉపయోగించాయికూడాను.

"పొరబాట్లు జరుగుతాయేమో"నన్న అనుమానంతో, ఒక సత్ప్రథకాన్ని మూలన పడేయడం కన్నా, కొన్ని తప్పులతోనైనా సరే, ఒక మంచి పనిని కొనసాగించడం మంచిదని నేననుకొంటూ ఉంటాను. రానున్న తరాలవారు, ఆ పొరబాట్లను సరిదిద్దుతారు. ఇందులో తప్పు లేదు. అదనపు సమాచారాన్ని చేర్చుకొంటూపోతాం. ఇదీ అవసరమే!

తెలుగు అకాడమీ కృషిని హృదయ పూర్వకంగా అభినందిస్తున్నాను.

మీ సంస్థ నుండి ఆంధ్ర ప్రజలు చాలా చాలా ఆశిస్తున్నారు.

మీ ఆలోచనలు కొన్నింటిని, నాతోనూ పంచుకొన్నారు. అవన్నీ ఆచరణలోకి రావాలని కోరుతున్నాను.

నమస్కారాలతో, సెలవు

భవదీయుడు
రావూరి భరద్వాజ
9.6.88

Phone: 63245

Flat No 6, Block NO. 1,
Satyanagar,
Hyderabad - 500 044.

**Dr. P.S.R. Appa Rao**
Director of Cultural Affairs (Retired)

తెలుగు అకాడమి స్థాపన జరిగి అప్పుడే ఇరవై సంవత్సరాలు పూర్తి కావస్తున్నవని తెలిసినప్పుడు ఎంతో ఆశ్చర్యం, ఆనందంకూడా కలిగాయి. ఒక సంస్థ జీవితంలో ఇరవై సంవత్సరాలు ఎక్కువ కాలం ఏమీ కాదు. అయినా ఈ స్వల్ప కాలంలో, దేశంలోని గ్రంథ అకాడమిలు అన్నింటి కంటె తెలుగు అకాడమి సార్థకమైన ప్రగతి సాధించిన దన్న సత్యం విద్యావేత్తలందరకూ తెలిసినదే.

తెలుగు అకాడమి ఇతోధికమయిన ప్రగతి సాధించాలని వ్యవస్థాపక డైరక్టర్‌గా ఈ శుభసందర్భంలో ఆశిస్తున్నాను; సాధించగలదని విశ్వసిస్తున్నాను.

పి.యస్.ఆర్. అప్పారావు.

*16.6.1988*



ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖ కార్యదర్శి, శ్రీ ఆర్.వి. వైద్యనాథ అయ్యర్ ఐ.ఎ.ఎస్.



మారిషస్ ప్రభుత్వ ఛీఫ్ విప్ శ్రీ రాజ్ వీరాస్వామిగారికి తెలుగు అకాడమి తరఫున
మెమొంటోను అందిస్తున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి మాన్యశ్రీ ఎన్.టి.రామారావుగారు



మారిషస్‌నుంచి విచ్చేసిన సాంస్కృతిక బృందంతో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి,
విద్యాశాఖామంత్రి, తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు, తెలుగు అకాడమి సంచాలకులు శ్రీ వి.కొండలరావుగారు, తదితరులు




తెలుగు సమగ్రాభివృద్ధి రాష్ట్రస్థాయి సదస్సులో ప్రారంభోపన్యాసమిస్తున్న
రాష్ట్ర విధానసభాధ్యక్షులు మాన్యశ్రీ జి. నారాయణరావుగారు




తెలుగు సమగ్రాభివృద్ధి రాష్ట్రస్థాయి సదస్సు ప్రారంభసభాధ్యక్షులు
కళాప్రపూర్ణ వావిలాల గోపాలకృష్ణయ్యగారు ప్రసంగిస్తున్న దృశ్యం




తెలుగు సమగ్రాభివృద్ధి రాష్ట్రస్థాయి సదస్సు ముగింపు సమావేశంలో అధ్యక్షోపన్యాసమిస్తున్న
ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు శ్రీ సి. నారాయణరెడ్డిగారు




తెలుగుసమగ్రాభివృద్ధి రాష్ట్రస్థాయి సదస్సు ముగింపు సమావేశంలో ముఖ్య అతిథిగా ఉపన్యసిస్తున్న
రాష్ట్ర ఆరోగ్యశాఖామాత్యులు డా. డి. వెంకటేశ్వరరావుగారు



తెలుగు అకాడమి ఫోటో కంపోజింగ్ విభాగం



తెలుగు అకాడమిభాషా ప్రయోగశాల



తెలుగు అకాడమి నాల్గవతరగతి సిబ్బంది



తెలుగు అకాడమి గ్రంథాలయం



తెలుగు అకాడమి సంచార పుస్తక విక్రయ వాహనం



"సాహిత్య ఏకత్వం - ఆధునికత"
(17 జూన్, 1988)పై
ఏర్పాటు చేసిన
సభలో ప్రారంభోపన్యాసం
చేస్తున్న తెలుగు అకాడమి
డైరెక్టర్
శ్రీ వి. కొండలరావుగారు



"సాహిత్య ఏకత్వం-
ఆదునికత" అంశంపై
ఉపన్యసిస్తున్న
శ్రీ అశోక్ వాజ్‌పేయిగారు
ఐ.ఎ.ఎస్.



"దక్షిణ భారతీయ భాషా
సాహిత్యాల ఏకత్వ
ఆధునికతలు" అన్న
అంశం గురించి
ప్రసంగిస్తున్న ప్రముఖకవి
శ్రీ గుంటూరు శేషేంద్రశర్మగారు

నిరక్షరాస్యులుకూడా. నిరక్షరాస్యత, పేదరికం రెండూ సమానంగా ప్రయాణిస్తున్నాయి. కాబట్టి పేదరికం నిర్మూలనకు నిరక్షరాస్యతా నిర్మూలన ఒక ముఖ్యావసరం. అయితే పాలకులు, ప్రణాళికా నిర్మాతలు "ఉన్నతవిద్యకు" ఇచ్చిన ప్రాధాన్యతను ప్రాథమిక, సెకండరీ విద్యకు ఇయ్యలేదు. ఒకవైపున జాతి అవసరాల మేరకు ఉన్నత, సాంకేతికవిద్యలను పటిష్ఠం చేస్తూనే ఉచిత నిర్బంధ ప్రాథమికవిద్య లక్ష్యసాధనకు క్రియాశీలకమైన ఆచరణాత్మకమైన వ్యూహాన్ని తయారుచేసి అమలుపరచాలి. నిర్ణీత కాలవ్యవధిలోనే దానిని సాధించడానికి ఉద్యమించకపోతే నిర్దేశించు కున్న రాజ్యాంగ లక్ష్యాలకు, ఆదేశసూత్రాలకు భంగం వాటిల్లుతుంది. అపుడే దేశంలో నిరక్షరాస్యత నిర్మూలనతోపాటు స్త్రీవిద్యావ్యాప్తి కూడా జరుగుతుంది. ప్రజాస్వామ్యం, స్వాతంత్ర్యం, జాతీయ సమైక్యత వంటి విలువలను జీవన గానాలుగా మన ముందుతరాలవారు ఆలపించాలంటే విద్య అందరికీ స్త్రీ పురుష తారతమ్యాలు లేకుండా అందుబాటులోకి రావాలి. అప్పుడే స్వాతంత్ర్య సముపార్జన కోసం ప్రాణాలర్పించిన వీరుల, వీరవనితల త్యాగానికి సరైన నివాళిని అర్పించినట్లు.

కేంద్రప్రభుత్వం జాతీయ స్థాయిలో, ఆంధ్రప్రదేశ్ రాష్ట్రస్థాయిలో గత 35 సంవత్సరాలలో అనుసరించిన విధానాలవల్ల జరిగిన స్త్రీ విద్యావ్యాప్తి ఇట్లా ఉంది. 1981 జనాభా లెక్కల ప్రకారం దేశ జనాభా 68.5 కోట్లుకాగా అందులో 35.6 కోట్లమంది పురుషులు, 33.08 కోట్లు స్త్రీలు ఉన్నారు. దేశజనాభాలో సగటు అక్షరాస్యత శాతం 36.2,పురుషుల అక్షరాస్యత శాతం 46.8 కాగా స్త్రీ అక్షరాస్యత 24.8 శాతం మాత్రమే. అంటే స్త్రీ అక్షరాస్యత శాతం జాతీయ సగటు కంటే తక్కువేకాక పురుషుల అక్షరాస్యత శాతం కంటే కూడా చాలా తక్కువ. ఈ పరిశీలనవల్ల కేంద్ర ప్రభుత్వం అక్షరాస్యత శాతాన్ని పెంచడంలో గణనీయమైన విజయాన్ని సాధించలేదనీ, స్త్రీ విద్యావ్యాప్తి విషయంలో కేంద్రప్రభుత్వం విద్యావిధానంలో లోపాలున్నాయనీ తెలుస్తుంది. అంతేకాక ఆ పరిశీలనవల్ల స్త్రీ విద్యపట్ల సమాజానికున్న దృక్పథం తెలుస్తుంది. దేశంలో నవ్యత, ఆధునికత, నాగరికత అభివృద్ధి చెందుతున్నా సమాజం ఆలోచనా సరళిలో ఇంకా నవ్య ఆధునిక, అభ్యుదయభావాలు చోటుచేసుకోలేదు.

ఈ దేశ జనాభాలో 64 శాతం మంది ఇంకా నిరక్షరాస్యులేకాక, మొత్తం స్త్రీ జనాభాలో 75 శాతం స్త్రీలు నిరక్షరాస్యులు. దేశంలో దాదాపు 60 శాతం మంది ప్రజలు దారిద్ర్యరేఖకు దిగువ జీవిస్తున్నారనే వాస్తవాన్ని దృష్టిలో పెట్టుకుంటే నిరక్షరాస్యతకు, పేదరికానికి ఉన్న అవినాభావ సంబంధం తేటతెల్లమవుతుంది. అలాగే జాతీయ ఉపాధిరంగాన్ని పరిశీలిస్తే పురుష శ్రామిక జనాభాలో 65 శాతం మంది పురుష వ్యవసాయ కార్మికులు కాగా, స్త్రీ శ్రామిక రంగంలో 81 శాతం మంది స్త్రీ వ్యవసాయ కార్మికులు. అంటే వ్యవసాయేతర రంగాల్లో పనిచేసే పురుషుల శాతం 34.4 శాతంకాగా, స్త్రీలశాతం 18.7 శాతం మాత్రమే. 1981 నాటికి ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్రంలోని పబ్లిక్ సెక్టర్లలో పనిచేస్తున్న ఉద్యోగుల్లో 88.4 శాతం పురుషులు కాగా, స్త్రీలు 11.6 శాతం మాత్రమే.

ఈ వివరాలు స్త్రీల వెనుకబడినతనాన్ని, నిరక్షరాస్యతను తెలియజేయడమేకాక ప్రభుత్వం భుజస్కందాల మీద ఉన్న బాధ్యతను ప్రణాళికా ప్రాధాన్యతలను ఎంచుకునేపుడు తీసుకోవలసిన జాగ్రత్తలను తెలియచేస్తాయి.

ఇక దక్షిణాది రాష్ట్రాల్లో స్త్రీ అక్షరాస్యత ఏవిధంగా ఉందో పరిశీలిద్దాం.

| అక్షరాస్యత శాతం - వివిధ రాష్ట్రాలు | | | |
|---|---|---|---|
| రాష్ట్రం | పురుషులు | స్త్రీలు | రాష్ట్ర సగటు |
| కర్నాటక | 48.81 | 27.71 | 38.46 |
| కేరళ | 75.26 | 65.73 | 70.42 |
| తమిళనాడు | 58.26 | 34.49 | 46.76 |
| ఆంధ్రప్రదేశ్ | 39.26 | 20.39 | 29.94 |

దక్షిణాది రాష్ట్రాల్లో సగటు అక్షరాస్యతలో కేరళ అగ్రస్థానాన్ని ఆక్రమించగా ఆంధ్రప్రదేశ్ చివరిస్థానంలో ఉంది. అంతేకాక ఆంధ్రప్రదేశ్‌లో సగటు అక్షరాస్యత జాతీయ సగటు కంటే తక్కువగా

ఉండటమేకాక స్త్రీ అక్షరాస్యత జాతీయ సగటు కంటే, మిగిలిన రాష్ట్రాల సగటు కంటే చాలా వెనుకబడి ఉంది. 1985 లో శ్రీ రాజీవ్‌గాంధీ కేంద్ర ప్రభుత్వాధికారాన్ని చేపట్టి "విద్య" పోర్టుఫోలియో పేరును మానవవనరుల అభివృద్ధిశాఖగా మార్చి 21వ శతాబ్దంలోకి కంప్యూటర్ యుగంలోకి దేశాన్ని తీసుకు వెళ్ళేందుకు ఒక నూతన విద్యావిధానాన్ని ప్రకటించారు. దేశంలోని 64 శాతంమంది ప్రజలకు అక్షరజ్ఞానం అందుబాటులో లేని స్థితిలో ఇపుడు ఉండగా ఏ విధంగా 21వ శతాబ్దంలోకి ప్రవేశిస్తామో వారికే తెలియాలి. 7వ పంచవర్ష ప్రణాళికాంతానికి కేంద్రప్రభుత్వం విద్యారంగంలో సాధించదలుచుకున్న లక్ష్యాలు కాగితం మీదనే మిగిలిపోయే సూచనలు కనిపిస్తున్నాయి. నూతన విద్యావిధానం "ఆపరేషన్ బ్లాక్‌బోర్డ్" అనే పథకం ద్వారా అన్ని ప్రాథమిక పాఠశాలల్లో విద్యార్థులకు అవసరమైన సౌకర్యాలు కల్పించాలని, ప్రాథమిక విద్య పూర్తిస్థాయిలో విస్తరించాలని, రాష్ట్రస్థాయిలో మోడల్ స్కూళ్ళు స్థాపించాలని సూచించింది. కాని దానికి అవసరమైన నిధులు మాత్రం సమకూర్చలేదు. భారతదేశం స్థూల జాతీయాదాయంలో 6 శాతం విద్యారంగానికి కేటాయించి కోట్లాది నిరక్షరాస్యుల జీవితాల్లో వెలుగును నింపాలని చెప్పిన కేంద్రప్రభుత్వం ఆచరణలో దానికి భిన్నమైన విధానాన్ని అనుసరిస్తున్నది.

7వ ప్రణాళిక మొత్తం వ్యయంలో 3.5 శాతం కేటాయిస్తామని, నూతన విద్యావిధానం అమలుకు రూ. 20,000 కోట్లు సమకూర్చాలన్న సిఫారసుకు భిన్నంగా కేవలం రూ. 6,000 కోట్లకు కుదించారు. "ఆపరేషన్ బ్లాక్‌బోర్డు" పథకం అమలుకు రూ. 2,839 కోట్లు కేటాయించాలన్న సిఫారసుకు భిన్నంగా రూ. 143 కోట్లు మాత్రమే కేంద్రప్రభుత్వం కేటాయించింది. సుమారు రూ. 500 కోట్లు 432 మోడరన్ స్కూళ్లకు కేటాయించిన కేంద్రప్రభుత్వం రూ. 100 కోట్లనయినా దేశంలోని సుమారు 50,000 సెకండరీ స్కూళ్ళకు కేటాయించలేదు. అయితే ఈ మోడల్ స్కూళ్ళల్లో చదువుతున్న విద్యార్థుల శాతం మొత్తం విద్యార్థుల్లో 0.2 శాతం మాత్రమే. కేంద్రప్రభుత్వం దేశంలోని బాల బాలికలందరికీ ఉచిత నిర్బంధ ప్రాథమిక, సెకండరీ విద్యను అందుబాటులోకి తేవడానికి బదులు సమాజంలోని బహుకొద్దిమంది ప్రయోజనాలకు అనుగుణంగా విద్యా వ్యూహాన్ని తయారుచేయడం ప్రణాళికా ప్రాధాన్యతల ఎంపికలో దూరదృష్టి లోపించడమే. రాజ్యాంగం నిర్దేశించుకున్న ఆశయాలకు భిన్నంగా కేంద్రప్రభుత్వ విద్యావిధానం ఉంది.

అభివృద్ధి చెందిన పాశ్చాత్య దేశాల్లో ప్రాథమిక విద్యను అందరి అందుబాటులోకి తెచ్చి ఉన్నత విద్యను అర్హతలు కలిగిన కొద్దిమంది ఉత్తమ విద్యార్థులకు పరిమితం చేస్తుంటే, పేదదేశమైన భారతదేశంలో ప్రాథమిక, సెకండరీ విద్యకు ఇయ్య వలసిన ప్రాముఖ్యం ఇవ్వలేదు. భారతదేశంలోని అనేక గ్రామాల్లో పాఠశాలలు లేవు. ఉన్న అన్ని పాఠశాలలకు కనీస సౌకర్యాలు లేవు. 60 శాతం పాఠశాలలకు సొంత భవనాలు లేవు. 40 శాతం పాఠశాలలకు కనీసం "బ్లాక్‌బోర్డు"ల సౌకర్యం లేదు. బోధన సామగ్రి, మంచినీటి వసతి ఉండటం ఒక విలాసంగా పరిగణించవచ్చు. ఈ పరిస్థితిలో దృఢ నిర్ణయాలతో, ఏకాగ్రతతో, చిత్తశుద్ధితో నాణ్యమైన ప్రాథమిక, సెకండరీ విద్యను నిర్ణీత కాల వ్యవధిలో అందరి అందుబాటులోకి తీసుకురావాలనే రాజ్యాంగ లక్ష్యానికి పునరంకితం కావలసిన నైతికబాధ్యత ప్రభుత్వంమీద ఉంది. దీనితోపాటు స్త్రీ విద్యావ్యాప్తి అనే ఆశయంకూడా సిద్ధిస్తుంది.

ఈ నేపథ్యంలో 1983లో తెలుగుదేశం ప్రభుత్వం ఆంధ్రప్రదేశ్ పాలనను చేపట్టింది. రాష్ట్రంలో విద్యావ్యాప్తితోపాటు, స్త్రీ విద్యకు, ఉపాధికి విశేష ప్రాధాన్యతను ఇవ్వడం తెలుగుదేశం ప్రభుత్వం ముఖ్యఆశయం. ప్రభుత్వం నిధుల కొరతను ఎదుర్కొంటున్నప్పటికీ పై ఆశయాల సాధనకోసం క్రింది కార్యక్రమాలను చేపట్టింది.

- పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం ఏర్పాటు
- స్త్రీకి ఆస్తి హక్కు చట్టం
- ప్రభుత్వ రంగాల్లోని ఉద్యోగాలలో 30 శాతం ఉద్యోగాలు స్త్రీలకు కేటాయింపు. కొన్ని రకాల ఉద్యోగాలు స్త్రీలకు మాత్రమే ప్రత్యేకంగా గుర్తించడం.

- సార్వత్రిక విశ్వవిద్యాలయం ఏర్పాటు ద్వారా గృహానికి పరిమితమై ఉన్న స్త్రీలకు తమ విరామ సమయంలో కరస్పాండెన్సుకోర్సు ద్వారా ఉన్నత విద్యను అభ్యసించే అవకాశం.
- ఉద్యోగం చేస్తున్న స్త్రీల సౌకర్యం కోసం ప్రతి జిల్లా కేంద్రంలోను మహిళా వసతి గృహాల ఏర్పాటు, మహిళలు స్వంత ఉపాధిని ఏర్పాటు చేసుకోదలిస్తే జాతీయ బ్యాంకుద్వారా అప్పుల మంజూరు నిమిత్తం 20 శాతం మార్జిన్ సొమ్మును రాష్ట్రప్రభుత్వం ఏర్పాటు చేయడం.
- భారతదేశంలోనే ప్రథమంగా స్త్రీల న్యాయస్థానం నెలకొల్పడం.
- 12 సం. లోపు విద్యార్థినీ విద్యార్థులకు సిటీ బస్సులలో ఉచిత ప్రయాణ సౌకర్యం
- మధ్యలో చదువు మానుకున్న 9-14 సం. బాలబాలికలకు అనియత విద్యాకార్యక్రమం అమలు.
- 1983కు పూర్వం ఈ అనియత విద్యాకేంద్రాలు 6,780 ఉండగా ఈనాడు వాటి సంఖ్య 17,792 కు పెరిగింది. ఇందులో 1012 కేంద్రాలు ప్రత్యేకంగా బాలికల కోసం ఏర్పాటు చేశారు.
- నిరక్షరాస్యత నిర్మూలనకు తెలుగుదేశం ప్రభుత్వం జాతీయ వయోజన విద్యాకార్యక్రమం అమలు జరుపుతున్నది. కేంద్రప్రభుత్వం నిధుల సాయంతో 26 ప్రాంతాలలో, రాష్ట్ర ప్రభుత్వ నిధులతో మరో 26 వయోజన విద్యా ప్రాజెక్టులు పని చేస్తున్నాయి. రాష్ట్రంలో సుమారు 4.68 లక్షలమంది నిరక్షరాస్యులు ప్రతిఏటా ఈ వయోజన విద్య అభ్యసిస్తున్నారు. వీరిలో సగంమంది స్త్రీలు.
- పేద విద్యార్థినీ విద్యార్థులకు ఉచితంగా పుస్తకాలు, దుస్తుల పంపిణీ.
- వృత్తి విద్యను, దృశ్య శ్రవణ బోధనను పాఠశాలల్లో ప్రవేశపెట్టడం.

తెలుగుదేశం ప్రభుత్వం పాఠశాలలకు వెళ్ళే విద్యార్థినీ, విద్యార్థుల హాజరు శాతాన్ని పెంచేందుకు మధ్యలో చదువు మానివేసే వారి సంఖ్యను తగ్గించేందుకు మధ్యాహ్న భోజనపథకాన్ని ప్రథమంలో అమలుచేసినా నిర్వహణలో ఎదురవుతున్న చిక్కులవల్ల ప్రభుత్వం ఆ పథకానికి బదులుగా ఉచితంగా పుస్తకాలు, దుస్తులు పంపిణీ పథకాన్ని అమలు చేస్తున్నది.

ఆంధ్రప్రదేశ్‌లో విద్యారంగంలో ఉచిత నిర్బంధ ప్రాథమిక, సెకండరీ విద్యను అందరి అందుబాటులోకి తీసుకురావాలని, స్త్రీ విద్య, ఉపాధి రంగాలకు, ప్రోత్సాహాన్ని ఇవ్వాలని, స్త్రీకి పర్యాయ పదంగా రూఢమైన "అబల" అనే పదానికి ఇకముందు అస్తిత్వం లేకుండా చేయాలన్న దృఢ సంకల్పం గౌ. ముఖ్యమంత్రి శ్రీ ఎన్.టి.రామారావుగారికి ఉంది. ఆయన నాయకత్వాన ప్రభుత్వం స్త్రీల అభ్యుదయానికి విద్యావ్యాప్తికి చిత్తశుద్ధితో కృషి చేస్తుందని వాగ్దానం చేస్తున్నాను.

"నిరక్షరాస్యత జాతికి కళంకం" అన్నారు జాతిపిత మహాత్మాగాంధీ. ఆ కళంకాన్ని రూపుమాపుదాం మనమందరం కలిసికట్టుగా.

References :
1. Andhra Pradesh Second Census of State Public Sector employment 1987.
2. Census of India 1981.
3. India Today - June 30, 1988 Issue.



# తెలుగు సమగ్రాభివృద్ధి

## 11-7-1988 నుండి 16-7-1988 వరకు తెలుగు అకాడమి నిర్వహించిన సదస్సు సారాంశం

వెలిచాల కొండలరావు
సంచాలకులు,
తెలుగు అకాడమి.

*"తెలుగు అకాడమి" ఇరవయ్యేళ్ల పండగ జరుపుకుంటున్న సందర్భంగా "తెలుగు సమగ్రాభివృద్ధి" అనే సదస్సును అకాడమీ సదనంలో 11 జులై నుండి 16 జులై వరకు నిర్వహించింది.*

ఈ సదస్సులో ప్రారంభ, ముగింపు సభలతో కలుపుకొని మొత్తం (15) సభలు జరిగాయి. పరిపాలన రంగంలో తెలుగు అమలు, న్యాయపాలన రంగంలో తెలుగు అమలు, యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ - ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ పరీక్షల్లో తెలుగు అమలు, పాఠశాలల్లో తెలుగు భాషాబోధన, కళాశాలల్లో తెలుగు భాషాబోధన, ఉన్నత విద్యాస్థాయిలో తెలుగులో మానవిక విజ్ఞానశాస్త్రాల బోధన, ఆధునిక సాహిత్యధోరణులు, తెలుగులో పరిశోధన, తెలుగులోకి అనువాదాలు, తెలుగు భాషా సాహిత్యాభివృద్ధికి వివిధ సంస్థలు చేసిన కృషి, అన్నవి ఈ సభలకు ఎన్నుకొన్న విషయాలు. ఆయా రంగాల్లో ప్రముఖులు, విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు, ఆచార్యులు, సాహితీవేత్తలు, పత్రికా సంపాదకులు, సంస్థానిర్వహణ ప్రవీణులు, తదితరులు ఈ సదస్సులో అధ్యక్షులుగానూ, ప్రసంగకర్తలుగానూ, చర్చకులుగానూ పాల్గొన్నారు. ఒక్కొక్క నిశ్చితరంగంలో తెలుగు చక్కగా అమలు జరగడానికి, తద్వారా సమగ్రాభివృద్ధి చెందడానికి ఇంతవరకు జరిగిన కృషి ఎట్లాంటిది, ఎట్లా ఫలించింది, ఎదురయిన ఇబ్బందులు ఎట్లాంటివి, వాటిని తొలగించుకోడానికి తీసుకోవలసిన చర్యలు ఏమిటి, ఇకముందు చేయవలసిన కృషి ఏమిటి అన్న విషయాలను వీరంతా కూలంకషంగా చర్చించారు.

### ప్రారంభోత్సవ సభ - 11.7.88

11వ తేదీ ఉదయం జరిగిన ప్రారంభోత్సవ సభకు, విధానసభాధ్యక్షులు మాన్యశ్రీ జి. నారాయణరావుగారు ముఖ్య అతిథిగా విచ్చేశారు. ప్రముఖ స్వాతంత్ర్యయోధులు, అధికారభాషాసంఘం ప్రథమాధ్యక్షులు అయిన శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు సభకు అధ్యక్షత వహించారు.

ముఖ్య అతిథి విధానసభాధ్యక్షులు మాన్యశ్రీ జి. నారాయణరావుగారు మాట్లాడుతూ, రష్యాదేశంలో రష్యన్ భాషలాగా అన్ని స్థాయిల్లో తెలుగును రాష్ట్రభాషగా ఉపయోగించుటకు అవసరమైన సూచనలను సూచించవలసిందిగా సదస్యులను కోరారు. అధికార యంత్రాంగంలో అధికారభాష అమలుపట్లఉన్న అలసత్వం తొలగిపోవాలన్నారు. ప్రస్తుత పరిస్థితి నిరాశాజనకంగా ఉన్నందుకు ఆవేదన వ్యక్తపరుస్తూ శ్రీ నారాయణరావుగారు అధికారభాష అమలుకు బాధ్యులయినవారంతా చిత్తశుద్ధితో కృషిచేయాలన్నారు. భాషపై రాజకీయాలు తగవన్నారు. భాషను భాషగానే చూడవలెకాని భాషారాజకీయాలతో కాదన్నారు. భాషకు గుర్తింపు భాష వాడుక, భాషా ఉపయోగిత ద్వారానే వస్తుందన్నారు. ఏ భాష జనసామాన్యం ఎక్కువవాడుతుందో ఆభాషకేప్రాముఖ్యం ఎక్కువుంటుందన్నారు.

సభాధ్యక్షులు వావిలాలవారు, తెలుగు అకాడమీ ఇంతవరకు చేసిన కృషిని అభినందిస్తూ, ప్రజల వాడుకలో ఉన్న భాషకు అధికప్రాముఖ్యం ఇవ్వాలన్నారు.

11.7.1988

## "పరిపాలన రంగంలో తెలుగు అమలు"

పరిపాలన రంగంలో తెలుగు అమలు అనే మొదటి సభలో శ్రీ వావిలాల గోపాలకృష్ణయ్యగారు ముఖ్యవక్తగా మాట్లాడుతూ, పరిపాలన మాతృభాషలో జరగాలంటే తెలుగులో విద్యాబోధన పటిష్ఠంకావాలన్నారు. దానివలన పరిపాలన తెలుగులో సాగించడానికి తగినంత పదజాలం, తగినంత సిబ్బంది దొరుకుతుందన్నారు. ప్రజలభాషలో పరిపాలన జరిగిననాడే ప్రజాస్వామ్యం నిజమైన ప్రజాస్వామ్యం అవుతుందన్నారు. అప్పుడే విద్యద్వారా వచ్చే అభివృద్ధిలో వారుకూడా భాగస్వాములయ్యే అవకాశం వారికి దక్కుతుందన్నారు. ఏ భాషనూ ద్వేషించరాదు; ద్వేషిస్తే దేశాన్ని మరచిపోవడమవుతుంది; తత్ఫలితంగా తోడి సామాన్యమానవులకు దూరం కావడమే అవుతుందన్నారు.

1. ప్రభుత్వ ఉత్తర్వులు జారీ చేయడమేకాదు ప్రభుత్వ ఉత్తర్వులు అమలుఅయ్యేట్లు చూడాలి.
2. జిల్లాకొక జిల్లాభాషాధికారిని తెలుగుపరిపాలనాభాషగా అమలుపరచుటకు నియమించాలి. ఈ అధికారి జిల్లాభాషాసంఘ కార్యదర్శిగా కూడా వ్యవహరించాలి.
3. నెలకొక పర్యాయం సమీక్షచేయాలి. ఎన్ని ఉత్తరప్రత్యుత్తరాలు తెలుగులో జరిగినవో రిపోర్టులు జిల్లా భాషాధికారికి పంపాలి.
4. తెలుగు బోధనభాషగా చదివినవారికి ఉద్యోగాల్లో ప్రాధాన్యం ఇవ్వాలి.
5. ఐ.ఏ.ఎస్. పరీక్షలు తెలుగులో ఇవ్వడానికి తోడ్పడుటకు ఇతోధికంగా తెలుగులో సాహిత్యాన్ని ఉత్పాదన చేయాలి; శిక్షణ ఇవ్వాలి-అని అన్నారు.

సభాధ్యక్షులు ఆంధ్రప్రదేశ్ అధికారభాషాసంఘం అధ్యక్షులు డా॥ నండూరి రామకృష్ణమాచార్యగారు, ప్రభుత్వం ఇటీవల తీసుకున్న చర్యలను సమీక్షించారు. తెలుగును పరిపాలనాభాషగా అమలుపరచుటకు చాలా గట్టి పట్టుదలతో అధికారభాషాసంఘం, ప్రభుత్వం చర్యలు తీసుకుంటున్నాయన్నారు. హైదరాబాద్ నగరంలో పెద్ద ఎత్తున తెలుగు రానివారికి తెలుగు నేర్పడం, తెలుగు వచ్చిన పరిపాలన సిబ్బందికి తెలుగును పరిపాలనాభాషగా వాడుటకు తెలుగు అకాడమీ సహాయంతో బోధనశిక్షణా తరగతులను నిర్వహించబోతున్నామని ఇంగ్లీషు టైపిస్టులందరికీ తెలుగు టైపుకూడా తప్పని సరిగా నేర్చుకోవలని ఉంటుందని ఇంగ్లీషు టైపురైటర్ల స్థానే తెలుగు టైపురైటర్లను వాడవలసిందని ఆదేశాలు జారీ చేశామని చెప్పారు.

అధికారభాషాసంఘం ప్రస్తుత కార్యదర్శి శ్రీ. సి. ధర్మారావుగారు, పూర్వకార్యదర్శి శ్రీ జి. రామకృష్ణారావుగారు, డా॥ వి. సంజీవమ్మగారు, ఎస్.సి.ఎస్.ఆర్. ప్రభుత్వకళాశాల అధ్యాపకురాలు వారి పత్రాలను సదస్సుకు సమర్పిస్తూ ప్రసంగించారు.

11.7.88

## "న్యాయపాలన రంగంలో తెలుగు అమలు"

"న్యాయపాలన రంగంలో తెలుగు అమలు" అనే రెండో సభకు లోకాయుక్త శ్రీ ఆవుల సాంబశివరావుగారు అధ్యక్షత వహించారు. ప్రముఖ న్యాయవాదులు శ్రీ కోకా రాఘవరావుగారు, శ్రీ. వి. సూర్యనారాయణమూర్తిగారు, శ్రీ ముక్తేవి లక్ష్మణరావుగారు మాట్లాడారు.

లోకాయుక్త ఆవుల సాంబశివరావుగారు మాట్లాడుతూ వారు ప్రధాన న్యాయమూర్తిగా ఉన్నప్పుడు తెలుగు కోర్టుభాషగా వాడుటకు చాలా ప్రోత్సహించామని ఇప్పుడుకూడా లోకాయుక్త కోర్టుకు చెందిన

న్యాయవ్యవహారాలన్నీ, తీర్పులన్నీ తెలుగులోనే జరుపుతున్నామని చెప్పారు. క్రింది కోర్టులలో తెలుగువాడుక ముమ్మరంగానే ఉందికాని పై కోర్టుల్లో ఇంకా తెలుగు అమలు అంతగా జరగడంలేదని, జరగవలసినఅవసరం ఎంతయినా ఉందని, దీనికి లా కోర్సులు తెలుగులో నిర్వహించడం, తెలుగులో వాదించుటకు వకీళ్లకు శిక్షణ తరగతులు నిర్వహించడం, ముఖ్యమైన ప్రామాణికమైన హైకోర్టు తీర్పులను, అనువదించడం వంటి కార్యక్రమాలను తెలుగు అకాడమి ముమ్మరంగా చేపట్టాలని, న్యాయపదకోశాలను, నిఘంటువులను నమూనాలను తెలుగులో రచించుటకు, అనువదించుటకు న్యాయమూర్తుల, న్యాయవాదుల ప్రోత్సాహం అవసరమని అన్నారు.

ప్రాంతీయభాషలో న్యాయపాలన జరిపించే అధికారం న్యాయస్థానాలకే, ప్రత్యేకంగా ఉన్నత న్యాయస్థానాలకే ఉంది కాని ప్రభుత్వానికి లేదు కనుక న్యాయమూర్తులే ఈ విషయంలో తగు శ్రద్ధ తీసుకోవలసిఉంటుందని శ్రీ కోకా రాఘవరావుగారు, శ్రీవి. సూర్యనారాయణమూర్తిగారు, శ్రీ ముక్తేవి లక్ష్మణరావుగారు అభిప్రాయపడ్డారు. మన రాజ్యాంగం ప్రకారం హైకోర్టు తీర్పులు మాత్రం ప్రాంతీయభాషలో ఉండకూడదుకాని తక్కిన తీర్పులన్నీ ప్రాంతీయభాషల్లో ఉండొచ్చునన్నారు.

**11.7.88**

**"పబ్లిక్ సర్వీస్ కమిషన్ పరీక్షల్లో తెలుగు అమలు"**

పబ్లిక్ సర్వీస్కమిషన్ పరీక్షల్లో తెలుగు అమలు అనే మూడవ సభకు ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ అధ్యక్షులు ఆచార్య రామకిష్టయ్యగారు అధ్యక్షతవహించి మాట్లాడుతూ, పబ్లిక్ సర్వీస్ కమీషన్ వ్రాతపరీక్షలు తెలుగులోనైనా ఇంగ్లీషులోనైనా వ్రాయవచ్చని, తెలుగులో వ్రాసే క్లాస్ 2, 3, 4 అభ్యర్థులకు నూటికి అయిదు మార్కులు అదనంగా ఇచ్చే సదుపాయం కలిగించబడిందనీ, ఇంటర్వ్యూలలో తెలుగులోనైనా, ఇంగ్లీషులోనైనా సమాధానాలు ఇచ్చే అవకాశాన్ని కమీషన్ కల్పించిందని చెప్పారు. తెలుగులో వ్రాస్తే తెలుగులో మాట్లాడితే చిన్నతనమనే మానసిక బలహీనత నుండి సర్వీస్ కమీషన్ పరీక్షలు వ్రాసే అభ్యర్థులు తేరుకోవాలని, అది ముఖ్యమైన అవరోధమని అన్నారు. ఇప్పుడు అయిదు మార్కులు కలిపే ప్రత్యేక ఏర్పాటు క్లాస్ 2, 3, 4, ఉద్యోగాలకే పరిమితమయిందని దానిని క్లాస్ - 1 ఉద్యోగాలకు కూడా అమలుపరచుటకు ప్రభుత్వఆమోదాన్ని కోరవచ్చునని అన్నారు.

మాజీ ఆంధ్రప్రదేశ్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ సభ్యులు శ్రీ టి.వి. నారాయణ, శ్రీ బాబూరావువర్మగారలు మాట్లాడుతూ ఇప్పుడు యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమీషన్ పరీక్షల్లో ఎనిమిది పరీక్షాపత్రాలలో ఆరు పరీక్షా పత్రాలు తెలుగులోరాయవచ్చని, అట్టి పత్రాలను తెలుగు వచ్చినవారు దిద్దుతారని, తెలుగు రాని ఛీఫ్ ఎగ్జామినర్ ఎవరయినా ఉంటే అతడు కొన్ని పత్రాలను ఇంగ్లీషులో అనువాదం చేయించుకొని వాటి ప్రమాణాన్ని నిర్ధారిస్తాడని అన్నారు. వివిధ డిపార్టుమెంటుల్లో పనిచేసే ప్రభుత్వోద్యోగుల ప్రమోషన్ల నిమిత్తం కమిషన్, 50కి పైగా డిపార్టుమెంట్ పరీక్షలు నిర్వహిస్తుందని, ఈ పరీక్షలు ఇపుడు ఇంగ్లీషులోనే నిర్వహించడం జరుగుతున్నదని వీటిని కూడా తెలుగు, ఇంగ్లీషు భాషలో నిర్వహించే ఏర్పాటు చేయవలసిన అవసరంఉందని అన్నారు.

**12.7.1988**

**"పాఠశాలల్లో తెలుగు భాషాబోధన"**

"పాఠశాలల్లో తెలుగు భాషాబోధన" అనే మొదటి సభకు పాఠశాల విద్యాశాఖ సంచాలకులు శ్రీ తాటిపర్తి వెంకారెడ్డిగారు అధ్యక్షత వహించారు. సదస్సులో నాగభైరవ కోటేశ్వరరావు, శ్రీ మధురాంతకం రాజారాం, డా// ఏటుకూరు ప్రసాద్గారలు పాల్గొన్నారు.

వెంకారెడ్డిగారు మాట్లాడుతూ పెద్దపట్టణాల్లో తప్ప జిల్లా, మండలాలస్థాయిలో నూటికి 80 శాతం విద్య తెలుగు మాధ్యమంద్వారానే ఇవ్వబడుతోందని, పాఠ్యాంశాలలో ఈమధ్య చాలా మార్పులు ప్రవేశపెట్టామని, కాని పాఠ్యాంశాలు

వ్రాసేవాళ్ళు పిల్లలకు పాఠాలలో ఆసక్తి కలిగేటట్లు అందంగా వ్రాయాలని, పాఠాలు చెప్పే అధ్యాపకులు కూడా పిల్లలకు స్ఫూర్తి కలిగించేట్లు ఆసక్తి కలిగించేటట్లు పాఠాలు చెప్పాలని అన్నారు. మంచి అధ్యాపకుల కొరత అన్ని మాధ్యమాల్లో ఉంది; తెలుగు మాధ్యమంలో కూడా ఉందని అన్నారు. మంచి వసతులు కల్పిస్తే, మంచి అధ్యాపకులు లభిస్తే తెలుగు మాధ్యమంద్వారా చదివేపిల్లలు కూడా ఇంగ్లీషుమాధ్యమం పిల్లలకు ఏ మాత్రం తీసిపోరని అన్నారు. మంచి వసతులు కావాలంటే ఎంతో పెట్టుబడి అవసరం ఉంటుందని, మంచి విద్యకు చెందిన సమస్య మాధ్యమంది కాదని, మంచి వనరులకు, వసతులకు చెందిందని అన్నారు. కాన్వెంటుల్లో ఎక్కువ పెట్టుబడి పెట్టి మంచి వసతులు కల్పిస్తున్నందున విద్యాప్రమాణాలు బాగున్నాయేకాని, కేవలం ఇంగ్లీషు మాధ్యమంవల్ల కాదన్నారు. నవోదయ స్కూళ్లల్లో కూడా తెలుగు మాధ్యమం పెట్టవలసిన అవసరం ఉందని అన్నారు. రాష్ట్రంలో నవోదయ స్కూళ్ళు ఒక శ్రేణికి, కాన్వెంటు స్కూళ్ళు మరో శ్రేణికి, గవర్నమెంటు స్కూళ్ళు మరో శ్రేణికి చెందినవవుతున్నాయని, అందువలన ఒకే స్థాయికి చెందిన విద్యార్థుల విద్యాస్థాయిలు వేరువేరుగా ఉంటున్నాయన్నారు.

శ్రీ నాగభైరవ కోటేశ్వరరావు, శ్రీ మధురాంతకం రాజారాం, శ్రీ వేలుకూరి ప్రసాద్ మాట్లాడుతూ సామాన్య ప్రజల పిల్లలు చదువుకుంటున్న రోజుల్లో, తెలుగు పాఠ్యాంశాల్లో, తెలుగు పుస్తకాల్లో, తెలుగు బోధన పద్ధతుల్లో వాడుకభాష వాడుకే ఎక్కువ ఉండాలని, తెలుగులో చదువుకుంటే పిల్లలు ఏ జంకూ లేకుండా మాట్లాడగలరని, వారి సందేహాలను నివృత్తి చేసుకోగలరని, స్వతహాగా ఆలోచించుకునే శక్తి, చర్చించే శక్తి పెంచుకోగలరని అన్నారు.

పాఠ్యపుస్తకాల్లో చెప్పే పాఠ్యాంశాలు, బొమ్మలు, పిల్లల వయస్సుకు, వారి అవగాహనకు సరిపోవునట్లుగా ఉండాలన్నారు. ఒక తరగతి పాఠ్యాంశాలకు, ఇంకొక తరగతి పాఠ్యాంశాలకు సమన్వయం ఉండడంలేదని, అలాంటి సమన్వయం కల్పించవలసిన అవసరం ఎంతయినా ఉందన్నారు. ఇతర దేశాల్లో పిల్లల పుస్తకాల గురించి, పిల్లల విద్య గురించి ఎంతో శ్రద్ధ తీసుకొంటున్నారని మన రాష్ట్రంలో కూడా అలాంటి శ్రద్ధ తీసుకోవలసిన అవసరం ఎంతయినా ఉందన్నారు. పాఠశాలలో జరిగే విద్యాబోధన స్పష్టంగా, నిర్దుష్టంగా, సంగ్రహంగా, ఆకర్షణీయంగా ఉండాలన్నారు.

**12.7.88**

## "కళాశాలల్లో తెలుగు భాషాబోధన"

"కళాశాలల్లో తెలుగు భాషాబోధన అనే రెండవ రోజు సభకు హైదరాబాదు విశ్వవిద్యాలయం తెలుగు శాఖాధ్యక్షులు ఆచార్య జి.వి. సుబ్రహ్మణ్యంగారు అధ్యక్షత వహించారు. సదస్సులో ఆచార్య తుమ్మపూడి కోటేశ్వరరావు శ్రీమతి నాయని కోటేశ్వరి, శ్రీ కోవెల సంపత్కుమారాచార్య ప్రసంగించారు.

తెలుగు భాషాబోధనకు కళాశాల స్థాయిలో రెండవశ్రేణి పౌరునికున్న గుర్తింపులాంటి గుర్తింపే ఉందని, విద్యార్థులు తెలుగును ఎక్కువ సెకండ్ లాంగ్వేజ్‌గా నేర్చుకుంటున్నారు, అధ్యాపకులు కూడా తెలుగును చాలావరకు సెకండ్ లాంగ్వేజ్‌గానే చెబుతున్నారు కనుక, దానిని సెకండ్ హేండ్ లాంగ్వేజ్‌గానే చూస్తున్నారన్నారు. తెలుగును సవతితల్లి చూపే చూస్తున్నారన్నారు. ఒక్కొక్క క్లాసులో రెండు రెండు క్లాసులను జతపరచడం, నూరుమందికి పైగా విద్యార్థులను కుక్కడం, టైంటేబుల్‌లో ఆఖరు గంటలు తెలుగుకు కేటాయించడం, వారానికి నాలుగు పీరియడ్‌లు మాత్రమే పడెయ్యడం, మరికొన్ని గంటలు అదనంగా కావలసి ఉంటుందంటే పాఠాలు తగ్గించుకొమ్మని, కుదించుకోమని చెప్పడం జరుగుతుందని, దానివలన కళాశాలస్థాయిలో తెలుగు బోధన సక్రమంగా జరగడంలేదని అభిప్రాయపడ్డారు.

తెలుగును తెలుగువారే చులకనగా చూస్తున్నారన్నారు. దానివలన విద్యార్థులు తెలుగు సక్రమంగా చదువలేకపోతున్నారు, వ్రాయలేకపోతున్నారు, మాట్లాడలేకపోతున్నారని అన్నారు.

కళాశాల స్థాయిలో, విశ్వవిద్యాలయ స్థాయిలో, తెలుగు బోధనను పటిష్ఠంచేయవలసిన అవసరం ఎంతయినా ఉందని అభిప్రాయపడ్డారు. తెలుగు సంభాషణా, ఉపన్యాస చర్చా ప్రక్రియలను, తెలుగులో స్వతంత్ర రచనా అనువాద ప్రక్రియలను విద్యార్థులకు నేర్పవలసిన అవసరం ఎంతయినా ఉందని తెలుగు అకాడమీ సంచాలకులు అభిప్రాయపడ్డారు. అప్పుడే విద్యార్థులు ఐ.ఏ.ఎస్, ఐ.పి.ఎస్ వంటి పోటీ పరీక్షలు కూడా తెలుగులో మరింత ధైర్యంగా వ్రాయుటకు వీలుంటుందని అభిప్రాయపడ్డారు. తెలుగు అభ్యర్థులు తెలుగులో పోటీ పరీక్షలు వ్రాయడానికి తెలుగు అకాడమి పునశ్చరణ కోర్సులు నిర్వహించుటకు సిద్ధంగా ఉందని అన్నారు. తెలుగు పాఠ్యాంశాలను, తెలుగు పుస్తకాలను దైనందిన భాషా అవసరాలకు, పోటీ పరీక్షల అవసరాలకు అనుగుణంగా మార్పుచేయవలసిన అవసరం, బోధన పద్ధతులను మార్చి, బోధనతోపాటు శిక్షణకు కూడా ప్రాధాన్యత ఇవ్వవలసిన అవసరం ఎంతయినా ఉందని తెలుగు అకాడమి సంచాలకులు శ్రీ కొండలరావుగారు అభిప్రాయపడ్డారు.

13.7.88

"ఉన్నత విద్యాస్థాయిలో తెలుగులో మానవిక - సాంఘిక శాస్త్రాల బోధన"

"ఉన్నత విద్యాస్థాయిలో తెలుగులో మానవిక - సాంఘిక శాస్త్రాల బోధన" అనే మొదటి సభకు హైదరాబాదు విశ్వవిద్యాలయం ఆచార్యులు శ్రీ ఆర్.వి.ఆర్. చంద్రశేఖరరావుగారు అధ్యక్షత వహించారు. ఆచార్య వి. రామకృష్ణ, ఆచార్య వి. కామేశ్వరరావు, ఆచార్య ఎం. రాధాకృష్ణశర్మ చరిత్రాచార్యులు, ఆచార్య జి. హరగోపాల్, ఆచార్య వి. ఎస్. ప్రసాద్, ఆచార్య ఎ. ప్రసన్నకుమార్, ఆచార్య వి. భాస్కరరావు, రాజనీతి - ప్రభుత్వ పాలనాశాస్త్రాచార్యులు ప్రసంగించారు.

ఆచార్య చంద్రశేఖరరావుగారు, డిగ్రీస్థాయి వరకు తెలుగు మాధ్యమం విద్యార్థులకు తెలుగు అకాడమి చేసిన కృషిని ప్రశంసిస్తూ, స్నాతకోత్తరస్థాయి విద్యకు అంతకన్నా ఎన్నో రెట్లు ఎక్కువ కృషి చేయవలసి ఉంటుందన్నారు. ఎన్నో మౌలికమయిన సంప్రదింపు గ్రంథాలను వ్రాయించవలసి ఉంటుందని, ఎన్నో అనువాదాలు చేబట్టవలసి ఉంటుందని అన్నారు. ఇంగ్లీషు భాషను కూడా అశ్రద్ధ చేయకుండా ఇంగ్లీషుకూడా విద్యార్థులు క్షుణ్ణంగా నేర్చుకొని, ఆ భాషలో వచ్చే సాహిత్యాన్నికూడా పఠించేట్లు చూడవలసిన అవసరం ఉందన్నారు. పరిభాషాపదకోశాలను, నిఘంటువులను, విజ్ఞానసర్వస్వాలను తెలుగులో వ్రాయించవలసి ఉంటుందన్నారు.

ఆచార్య రామకృష్ణ, ఎన్.సి.ఇ.ఆర్.టి (N.C.E.R.T) ప్రచురించిన +2 పుస్తకాలను తెలుగులోకి అనువదిస్తే, ప్రవేశ వృత్తి పోటీ పరీక్షల్లో కూర్చునేవారికి అవి ఎంతో ఉపయోగపడతాయన్నారు. మంచి ఆచార్యులను, అధ్యాపకులను, ఎంపికచేసి పుస్తకాలు రాయించవలసి ఉంటుందన్నారు. ఆచార్య హరగోపాల్, పాఠ్యాంశాలూ పుస్తకాలూ సామాజిక స్ఫురణ కలిగినవై ఉంటేనే తప్ప విద్యార్థులకు వాటిపై ఆసక్తి కలిగించలేమని అన్నారు. ఈ రోజు విద్యార్థులకు విద్యపై ఆసక్తి లేకపోవటానికి సామాజిక స్ఫురణ లేని పాఠ్యాంశాలు, పుస్తకాలు బోధనపద్ధతులే కారణమన్నారు. ఆచార్య ప్రసన్నకుమార్, తెలుగులో చెబితే విద్యార్థులకు సునాయాసంగా అర్థమవుతుందని, తెలుగులో బోధించడం ఎంతయినా అవసరమని, వేరే దేశాలవలె భారతీయ విద్యార్థులు ఇంగ్లీషును లైబ్రరీ లాంగ్వేజీగా నేర్చుకోవచ్చునని అన్నారు. తెలుగులో పుస్తకాలు ప్రచురించుటకు, మెరుగుపరచుటకు తెలుగు అకాడమి మరింత కృషిచేయాలన్నారు. భాషావిషయంలో సులభశైలిని అవలంబించి, తెలుగులో పారిభాషికపదాలను ఇచ్చినపుడు కొన్ని అస్పష్టంగా ఉన్నవాటికి బ్రాకెట్లో ఇంగ్లీషు పదాలను కూడా ఇవ్వడం మంచిదన్నారు.

ఆచార్య మధుసూదనరెడ్డి, పుస్తకాల సమీక్ష, పుస్తకాల ఆధునీకరణ ఎప్పటికప్పుడు చేపట్టాలన్నారు. ఆచార్య వి.ఎస్. ప్రసాద్, తెలుగు పుస్తక రచనలో, ప్రచురణలో తెలుగు అకాడమి సార్వత్రిక విశ్వవిద్యాలయం ఎదుర్కొంటున్న సమస్యలను విశదీకరించారు. సార్వత్రిక విశ్వవిద్యాలయంవలె తెలుగు అకాడమి కూడా యూనిట్లుగా

ప్రకరణాలను ప్రచురించే పద్ధతిని అవలంబించడమే బాగుంటుందన్నారు. దానివలన ప్రచురణ జాప్యాన్ని అరికట్టడమే కాకుండా, ఎక్కువమంది ప్రతిభావంతులతో పుస్తకాలు వ్రాయించే సౌకర్యంకూడా కలుగుతుందన్నారు.

ఆచార్య భాస్కరరావుగారు మాట్లాడుతూ గ్రాంథిక భాష ఇంకా తెలుగు అకాడమి పుస్తకాలలో కొన్నింట్లో కనబడుతూఉందని, దీనిని వాడుకభాషకు దగ్గరగా మార్చాలన్నారు. రచయితల ఎంపికలో, సంపాదకుల ఎంపికలో అకాడమి తగు జాగ్రత్త తీసుకోవాలన్నారు. ఆచార్య రాధాకృష్ణశర్మగారు మాట్లాడుతూ, బోధన ఏ భాషద్వారా జరిగినా అధ్యాపకుడు విషయాన్ని సరియైన విశ్లేషణతో విద్యార్థులకు అందించాలన్నారు. వివిధ విషయాలలో జరుగుతున్న ప్రగతి పాఠ్యాంశాలలో,పాఠ్యపుస్తకాలలో,పాఠ్యబోధనాపద్ధతులలో ప్రతిబింబించాలన్నారు.

13.7.88

**"ఉన్నత విద్యాస్థాయిలో తెలుగులో మానవిక సాంఘిక శాస్త్రాలబోధన"**

"ఉన్నత విద్యాస్థాయిలో తెలుగులో మానవిక సాంఘిక శాస్త్రాలబోధన" అనే అంశంపై నిర్వహించిన మధ్యాహ్నం సభకు ఆంధ్ర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య కె.వి. రమణగారు అధ్యక్షత వహించి మాట్లాడుతూ, భాషాక్లిష్టత వలన విద్యార్థులు కంఠతా పెట్టే అలవాటుకు లోనవుతున్నారన్నారు. పాఠ్యాంశాలు, పాఠ్యపుస్తకాలు సుస్పష్టంగా, సరళంగా ఉండాలన్నారు. తెలుగు మాధ్యమం ద్వారా స్నాతకోత్తరస్థాయిలో వ్రాసే విద్యార్థులు ఇంగ్లీషు పుస్తకాలను భాషాక్లిష్టత వల్ల వాడజాలనందున విశ్వవిద్యాలయాల గ్రంథాలయాలలోని పత్రికలు, పుస్తకాలు ఎక్కువ వాడబడకుండా ఉండిపోతున్నాయన్నారు. తెలుగు మాధ్యమంనుండి ఇంగ్లీషు మాధ్యమంలో చేరే స్నాతకోత్తరస్థాయి విద్యార్థులు ఇంగ్లీషు భాషతో ఇబ్బందిపడుతున్నారని, చదువులో చురుకయిన వారయినా భాషవలన విశ్వవిద్యాలయ పరీక్షల్లో, పోటీపరీక్షల్లో, బాగా రాయగలగడంలేదని, అందుకని స్నాతకోత్తరస్థాయిలో కూడా తెలుగు మాధ్యమం ప్రవేశపెట్టవలసిన సమయమాసన్నమయిందని ఆచార్య కె.వి. రమణగారు అన్నారు.

ఆచార్య రాఘవేంద్రరావు, ఆచార్య శివరామకృష్ణారావు, ఆచార్య కె. రంగారావు, ఆచార్య వంగపల్లి విశ్వనాథం మాట్లాడుతూ, మాతృభాషలో అన్ని స్థాయిల్లో కూడా విద్య బోధించడం ఆవశ్యకమనీ, దానికి తగిన చర్యలు విశ్వవిద్యాలయాలు, తెలుగు అకాడమి తీసుకోవాలని, ఇప్పటికే చాలా జాప్యం జరిగిందని, విద్యార్థులు ఇంగ్లీషులో చదవలేక, ఇంగ్లీషులో చదివి తెలుగులో అనువదించి రాయలేక, క్రియాత్మకంగా, వినూత్నంగా, స్వేచ్ఛగా ఆలోచించలేకపోతున్నారని, భాష వారికి ఒక గుదిబండలా తయారయిందని, అది అటు బోధించేవారికి, ఇటు చదువుకొనేవారికి ఇరువురికీ ఇబ్బందికరమయిందని, దానివలన విద్యయేకాక, పరిశోధనలు కూడా ప్రమాణాలు కోల్పోతున్నాయన్నారు. తెలుగులో పుస్తకాలు వ్రాయించేటప్పుడు అన్ని శబ్దాలు ఇంగ్లీషునుండి తెలుగులోకి అనువదించక్కరలేదని, ఇంగ్లీషు భాషలాగే తెలుగు భాషకూడా అవసరమయిన ఇంగ్లీషు శబ్దాలను తెలుగు భాషలో అంతర్భాగం చేసుకోవడమే బాగుంటుందని అన్నారు. దానివలన భాషకూడా పెరుగుతుందని అభిప్రాయపడ్డారు.

14.7.88

**"ఉన్నత విద్యాస్థాయిలో తెలుగులో విజ్ఞానశాస్త్రాల బోధన"**

"ఉన్నతవిద్యాస్థాయిలో తెలుగులో విజ్ఞానశాస్త్రాల బోధన" పై నిర్వహించిన మొదటి సభకు ఉస్మానియా విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య టి. నవనీతరావుగారు అధ్యక్షత వహిస్తూ, ఉస్మానియా విశ్వవిద్యాలయం ఇదివరకే తెలుగులో వ్రాసే స్వేచ్ఛను విద్యార్థులకు స్నాతకోత్తరస్థాయి విద్యలో కూడా కల్పించిందని, ఇటీవల విశ్వవిద్యాలయాల ఉపాధ్యక్షుల సమావేశంలో తెలుగు మాధ్యమాన్ని స్నాతకోత్తరస్థాయిలో సాంఘిక, వైజ్ఞానిక శాస్త్రాల్లో కూడా ప్రవేశపెట్టడానికి తెలుగుఅకాడమీని పుస్తకాలు రాయించవలసిందిగా కోరామని అన్నారు.

ఇకముందు ఇంగ్లీషు మాట్లాడితేనే అగౌరవం, తెలుగు మాట్లాడితేనే గౌరవమని భావించే రోజులు

వస్తున్నాయని, కనుక, అన్ని స్థాయిల్లో, అన్ని రంగాల్లో, తెలుగును విస్తృతపరిధిలో వాడవలసిన అవసరం ఎంతయినా ఉందని అన్నారు. విశ్వవిద్యాలయాలు తెలుగును అన్ని స్థాయిల్లో మాధ్యమంగా దశలవారీగా ప్రవేశపెట్టడానికి సంసిద్ధమేనని అన్నారు.

సదస్సులో ఆచార్య ఎస్. బ్రహ్మాజీరావు, ఆచార్య వి.యస్.రావు, ఆచార్య కె.వి.ఎన్.రావు, ఆచార్య కైలాసపతిగారలు మాట్లాడుతూ పరిభాషాపరంగా వివిధ ఐచ్ఛికాలలో వాడే పరిభాషాపదాల అర్థాలను ప్రామాణికంచేయాలని, అలాగే వివిధ విద్యాస్థాయిల్లో ఒకే అర్థానికి వాడే పదాలు ఒకేవిధంగా ఉండుటకు వాటిని సమీక్షించి చర్యలు తీసికోవాలని, మాండలికాలు పుస్తకాల్లో వాడేటప్పుడు ఇతర ప్రాంతాల్లో వాడే సమానార్థ పదాలను, లేక వాటికి సంబంధించిన ఇంగ్లీషు పదాలను బ్రాకెట్లో ఇవ్వాలని అన్నారు. భాషాపరంగా, భాష వాడుక భాషకు ఎంత దగ్గరగా వస్తే విద్యార్థులకు అది అంత సులభమవుతుందని అన్నారు. విద్యార్థుల సౌకర్యార్థం, ప్రచురణ జాప్యం నివారణ దృష్ట్యా కూడా, ఏ కొందరితోనో కాక అనుభవజ్ఞులైన చాలామంది రచయితలచేత పుస్తక రచన చేయించాలని, అందుకు మొత్తం పుస్తకాన్ని ఏ ఒకరికో ఇచ్చే బదులు ఒక్కొక్క ప్రకరణాన్ని ఒక్కొక్కరికిచ్చి వ్రాయించాలని సూచించారు.

## "ఉన్నత విద్యాస్థాయిలో తెలుగులో విజ్ఞానశాస్త్రాల బోధన"

ఉన్నత విద్యాస్థాయిలో తెలుగులో విజ్ఞానశాస్త్రాలబోధన పై నిర్వహించిన మధ్యాహ్నం సభకు శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు ఆచార్య ఎస్.వి.జె.లక్ష్మణ్‌గారు అధ్యక్షత వహిస్తూ స్నాతకోత్తర స్థాయిలో విజ్ఞానపరమైన విషయాల్లో తెలుగును విద్యామాధ్యంగా ప్రవేశపెట్టేటప్పుడు తగినంతమేరకు పుస్తకాలు, వ్యాసాలు వ్రాయిస్తే తప్ప విద్యాప్రమాణాలు దెబ్బతింటాయని, పరిశోధనలు కూడా దెబ్బతింటాయని అన్నారు. తెలుగు అకాడమి ఇంతవరకు చేసిన సేవలను కొనియాడుతూ, అకాడమి ఈ మధ్య ఎంతో చైతన్యవంతంగా ముందుకుపోతుందని, అందుకు అకాడమి సంచాలకులను సిబ్బందిని అభినందించారు. విదేశాలలో విద్యార్థులు విద్యావిజ్ఞానాల అభివృద్ధి మేరకు వారి భాషతోపాటు ఇతరభాషలు కూడా అధ్యయనం చేస్తునట్లు మన దేశవాసులు కూడా వారి భాషలను అభివృద్ధిచేసికొంటూ ఇతరభాషలనుకూడా దీక్షతో నేర్చుకోవాలన్నారు.

ఆచార్య వి. శివరామప్రసాద్, ఆచార్య వి. వి. అరుణాచలం, ఆచార్య జి.శివరామశాస్త్రి ప్రసంగిస్తూ, పెరుగుతున్న విద్యావిజ్ఞానాల దృష్ట్యా స్నాతకోత్తరస్థాయిలో డిగ్రీస్థాయికన్నా ఎన్నో రెట్లు ఎక్కువ పుస్తకాలు తెలుగు అకాడమి వ్రాయించవలసిన అవసరం ఉంటుందన్నారు. జనరంజకమయిన సైన్సు పుస్తకాల అనువాదాలు కూడా ఎన్నో చేపట్టవలెనని, సైన్సుకు చెందిన పరికరాలగురించి పనిముట్ల గురించి కూడా జనరంజకమయిన పుస్తకాలు వ్రాయించాలన్నారు. విశ్వవిద్యాలయాలు పాఠ్యాంశాలు మారుస్తున్నప్పుడు అన్ని విషయాలలో పాఠ్యాంశాలు సమస్థాయిలో ఉండేటట్లు పరస్పర సమన్వయాలను దృష్టిలో పెట్టుకొని వ్రాయాలన్నారు. మారుతున్న విద్యావిజ్ఞానాలదృష్ట్యా పుస్తకాలను ఎప్పటికప్పుడు సమీక్షించడం, పరిష్కృతంచేయడం, అదనపు సాహిత్యాన్ని అందించడం, సంప్రదింపు గ్రంథాలను ఎక్కువ ప్రచురించడంలాంటి పనులు అకాడమి మరింత చేపట్టాలన్నారు. ఒకే Concept ను వివిధ శాస్త్ర విషయాలలో చెప్పినపుడు వివిధ విషయాలకు చెందిన అధ్యాపకులు కలిసి ఆ Concept గురించి క్షుణ్ణంగా చర్చించి పాఠాలు వ్రాస్తే బాగుంటుందన్నారు. ఒకే పదానికి వేరువేరు విషయాలలో వేరువేరు అర్థాలు వచ్చే అవకాశమున్నపుడు అలాంటి సమన్వయకృషి చాలా అవసరమన్నారు.

ఇంటర్మీడియట్ బోర్డు కంట్రోలర్ ఆఫ్ ఎగ్జామినేషన్స్ శ్రీ వి.ఎస్. రామచంద్రరావుగారు మాట్లాడుతూ వైజ్ఞానికమైన విషయాలను బోధించేటప్పుడు కూడా దేశీయమైన, జనరంజకమూ మనోరంజకమూ అయిన, ఎన్నో ఉదాహరణలను పాఠ్యాంశాల విశదీకరణ కొరకు విద్యార్థులకు చెప్పొచ్చునని, దానివలన, విద్యార్థులకు, విద్యాసక్తి, విషయాసక్తి పెరుగుతాయని మంచి ఉదాహరణలను ఇచ్చి చెప్పారు. పాఠాల బోధనను ఎలా దేశీయం చేయవచ్చునో చక్కని ఉదాహరణలద్వారా విశదీకరించారు.

15.7.88

## తెలుగులో "ఆధునిక సాహిత్య ధోరణులు"

"ఆధునిక సాహిత్య ధోరణులు" అనే శీర్షికపై నిర్వహించిన మొదటి సభకు అధ్యక్షత వహించిన శ్రీ కాళోజి నారాయణరావుగారు ప్రసంగిస్తూ ఖలీల్ జిబ్రాన్ చెప్పిన సాహిత్య హితాన్ని సాహిత్యవేత్తలందరూ గుర్తుపెట్టుకోవాలన్నారు. మనమెపుడూ ఎందులోనైనా మంచిని స్వీకరించిచెడునువదిలివేయాలన్నారు.

"If you happen to see a 'Beautiful Truth' tell it in any words, but if you happen to see an 'Ugly Truth' tell it no words" అని జిబ్రాన్ అన్నాడని, అది చాలా మంచి సూచన అని, అన్ని వర్గాలలో, అన్ని సిద్ధాంతాలకు, అన్ని స్కూల్స్‌కు చెందిన రచనల్లో ఎంతోమంచి సాహిత్యం ఉందని, ఆ సాహిత్యాన్ని ఈ వర్గానికి చెందినది, ఆ వర్గానికి చెందినదని చూడకుండా అందరూ చదవాలన్నారు. సాహిత్యం బహుముఖంగా, బహుప్రక్రియలతో, బహుముఖమైన ఆలోచనా అవలోకనా పరంపరతో రావడం సమాజప్రగతికి, సమాజ అభివృద్ధికి సూచకమని అన్నారు. సాహిత్య ఆధునికీకరణవలననే భాషా ఆధునికీకరణకూడా జరుగుతుందన్నారు. వివిధ సాహిత్య ప్రక్రియలు వివిధ భాషాశైలి అవలంబనలే భాషాభివృద్ధికి తోడ్పడతాయన్నారు. సదస్సులో శ్రీ బలివాడ కాంతారావు, శ్రీ టి.ఎల్. కాంతారావు, శ్రీ వడలి మందేశ్వరరావు, ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి, శ్రీమతి అరుణావ్యాస్‌గార్లు మాట్లాడుతూ సాహిత్యాభివృద్ధి, సాహిత్యప్రక్రియ వివిధ రంగాల్లో ఎలా ప్రగతి చెందింది, భాషాభావాలు, సంఘసంస్కరణోద్యమాలవలన, రాజకీయోద్యమాల వలన, విదేశీయ ప్రభావాలవలన ఎలా మార్పుచెందుతూ వచ్చినదీ సమీక్షించారు. ఆచార్య కేతు విశ్వనాథరెడ్డి, నవలా సాహిత్యంలోని అభ్యుదయ వ్యతిరేక, అనుకూల ధోరణులను సమీక్షించారు. సాహిత్య ప్రక్రియ, సంఘాన్ని దృష్టిలో పెట్టుకొని, సంఘస్ఫూర్తితో, సంఘ పరివర్తన, సంఘసంస్కరణకొరకు వ్రాయాలని, దానిని విమర్శించేటపుడుకూడా సంఘ పరివర్తనకు, సంఘసంస్కరణలకు అది ఎంతవరకు దోహదంచేసిందో ఆ దృక్పథంతోనే, దాన్నిచూడాలని అన్నారు.

శ్రీ వడలి మందేశ్వరరావు సాహిత్య భాషకు, శాస్త్రీయ భాషకు తేడా గురించి చెబుతూ, శాస్త్రీయ భాష, సూటిగా, ముక్తసరిగా, ముక్కుకు సూటిగా ఉంటుందని, సాహిత్య భాష ఆలంకారికంగా ఉంటుందని, అలంకారంలేకుండా సాహిత్యం సాహిత్య మవదని అన్నారు. రచయితకు రెండు జగత్తులుంటాయని ఒకటి తాను జీవించే వాస్తవిక జగత్తు, ఇంకొకటి తాను ఆశించే స్వాప్నిక జగత్తు, ఆదర్శ జగత్తని అన్నారు. రచయిత ఏది వ్రాసినా ఏది చెప్పినా ఈ రెండు జగత్తులగురించి చెబుతాడని, వాటిని వర్ణిస్తాడు, వాటినిగురించి చమత్కారంగా, జనరంజకంగా చెబుతాడని, అలా చెప్పడమే అలంకారమవుతుందని అన్నారు. శ్రీ బలివాడ కాంతారావు, శ్రీ టి. ఎల్. కాంతారావుగార్లు మాట్లాడుతూ సాహిత్యానికెప్పుడూ సమాజం నేపథ్యం కావాలి, అప్పుడే అది వాస్తవికతకు దగ్గరవుతుంది, అపుడే అది సహజమవుతుందన్నారు. సామాజిక స్ఫురణ లేకపోవడం వలననే సాహిత్యం కుంటుపడుతుందని, సంఘంలో ఎక్కువ రోజులు సామాజిక స్ఫురణలేని సాహిత్యం నిలబడదని, నిలదొక్కుకోలేదని అన్నారు. సాహిత్యం సంఘానికి ప్రతిబింబం అవాలి. సంఘం సాహిత్యానికి పునాదిరాయి కావాలి అన్నారు.

నవల చదివేంత ఓపిక ప్రజల్లో క్షీణిస్తోందని, కనుక చిన్నకవితలాగే కథకూడా Popular అయ్యే రోజులు వస్తున్నాయని బలివాడ కాంతారావుగారన్నారు. నవల రాయడంకంటే కథ రాయడం కష్టమని, ఈ రోజుల్లో వారపత్రికల్లో వచ్చే కథల జీవితప్రమాణం ఒకవారం రోజులేనని, కథ కలకాలం నిలిచేటట్లుగా రాయాలని, అలాంటి కథలు మనవారు రాశారని, అలాంటి కథలు విదేశీయులకు మార్గదర్శకమయినాయని, ఎన్నో మంచి కథల ఉదాహరణలు చెప్పారు. మంచి రచనల ముద్రణావిక్రయాలలో రచయితలు ఎంతో ఇబ్బందిపడుతున్నారని, వీటిని తెలుగు అకాడమిలాంటి సంస్థలు చేపట్టి మంచి రచనలకు, మంచి రచయితలకు ప్రోత్సాహం ఇవ్వాలన్నారు. శ్రీటి.ఎల్. కాంతారావుగారు మాట్లాడుతూ ఆధునికతను కావ్యకాలానికి అంటగడుతున్నారని, కావ్యగుణానికి, కావ్యవస్తువుకు కాదని, అది తప్పని అన్నారు. ఆధునికత వస్తువుకు, వస్తు

గుణానికి, భాషాస్వరూపానికి చెందిందని, ఏ కాలంలో కూడా ఆధునికంగా వ్రాసేవాళ్ళూ సంప్రదాయపద్ధతిగా వ్రాసేవాళ్ళూ ఉంటారన్నారు. సాహిత్యంసమాజాన్ని విస్మరిస్తే, సమాజం సాహిత్యాన్ని విస్మరిస్తుందన్నారు.

శ్రీమతి అరుణావ్యాస్ సాహిత్య సింహావలోకనం చేస్తూ సృజనాత్మక రచనలను సృజనాత్మకంగానే చూడాలికాని వర్గదృక్పథాలతో, రాజకీయ దృక్పథాలతో చూడకూడదన్నారు. తెలుగు సాహిత్యం ఎన్నో పోకడలు పోయిందని, ఎన్నో సాహిత్య ప్రక్రియలను చేబట్టిందని, మన సాహిత్యం ప్రపంచ సాహిత్యంలో ఏ సాహిత్యానికి తీసిపోదని అన్నారు. రచయిత జీవితాన్ని ప్రేమించడం నేర్వాలి. సాహిత్య ప్రక్రియ ఎప్పుడూ నిర్మలంగా నవ్వుతూ ఉండాలి; అది మూలుగుతూ నిట్టూర్పులు విడవకూడదన్నారు. సాహిత్యమెపుడూ శ్రేయంగానూ, ప్రేయంగానూ ఉండాలన్నారు.

**15.7.88**

## "తెలుగులో పరిశోధన"

"తెలుగులో పరిశోధన" పై నిర్వహించిన మధ్యాహ్నపు సభకు ఆచార్య నాయని కృష్ణకుమారిగారు అధ్యక్షత వహిస్తూ తెలుగు భాషాసాహిత్యపరమైన పరిశోధనాసిద్ధాంతవ్యాసాలు పదకొండు పన్నెండువందల వరకు ఉన్నాయన్నారు. కాని వీటిలో నిజంగా ప్రామాణికమయినవి కొన్ని మాత్రమేనని, ఈ మధ్య, పట్టాలను, పిహెచ్.డిలను దృష్టిలో పెట్టుకొని పరిశోధనలు చేస్తున్నారని, పిహెచ్.డిలను ఉద్యోగాలతో ముడిపెట్టడంవలన ఏదో విధంగా ఏదో ఒక సిద్ధాంతవ్యాసం రాసి, "అమ్మయ్య"! అని ముగించి ఒక నిట్టూర్పు విడుస్తున్నారని, ఉద్యోగాలకు, పిహెచ్.డిలకు సంబంధం విడదీస్తేనేకాని పరిశోధనలు బాగుపడవని అన్నారు. పని వత్తిడివలన, చిత్తశుద్ధి తక్కువయినందువలన సూపర్వైజర్లు కూడా, పరిశోధకులకు తగువిధంగా గైడ్ చేయడంలేదని, పని వత్తిళ్ళవలనకూడా సూపర్వైజర్లు సరియైనంత సమయం పరిశోధకులకు ఇవ్వజాలడంలేదన్నారు. సభలో పాల్గొన్న ఆచార్య చేకూరి రామారావుగారు, ఆచార్య కేతవరపు రామకోటిశాస్త్రిగారు, ఆచార్య సంపత్కుమారాచార్యగారు పరిశోధనల్లోని అపరిశోధనల గురించి కూలంకషంగా సమీక్షించారు. పరిశోధనలు బాగుపడాలంటే అన్ని విశ్వవిద్యాలయాల్లో జరిపే పరిశోధనలకు సమన్వయం ఉండాలని, Methodology గురించి, సిద్ధాంతవ్యాసాలు వ్రాసే పద్ధతి గురించి ఇదమిత్థంగా నిర్ణయం జరగాలని, సిద్ధాంతవ్యాసాలు Quotationలతో Foot-note లతో నిండిపోతున్నవని, కొన్ని కొన్ని Quotationలు అసంబద్ధంగాకూడా Quote చేస్తున్నారని, భావంకంటే భాష, భాషకంటే పుస్తకాల బరువు ఎక్కువయిపోతున్నాయని అన్నారు. ఈ పరిశోధనలు ఎలా జరగాలి, ఎలాంటి మార్పులు చేపట్టాలి - అనే విషయాలు క్షుణ్ణంగా పరిశీలించి నిర్ణయాలు తీసికొనుటకు తెలుగు అకాడమి ఒక నిపుణుల కమిటీని ఏర్పరచి సిఫారసులు చేయాలన్నారు. ఈ రోజు జరిగే పరిశోధనలపై సమీక్షాపరిశోధనలు జరిపించవలసిన అవసరం ఎంతయినా ఉందన్నారు. పరిశోధనలు చేసినవాటిపైనే తిరిగి పరిశోధనలు చేస్తున్నారని, దీనిని నివారించాలని, విశ్వవిద్యాలయాలు సంఘప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని పరిశోధనలు జరపాలి, జరిపించాలని అన్నారు.

చర్చల్లో పాల్గొన్నవారు, పరిశోధకులను పరిశోధకులుగా చూడటంలేదని, పరిశోధకులకు ఇష్టంలేని పరిశోధనలను వారితో చేయిస్తున్నారని, గైడెన్స్ సరిగా లేదని, పరిశోధకులకు తగు వసతులు లేక తగు ప్రోత్సాహం లేక, తగినన్ని పుస్తకాలు, వ్యాసాలు పరిశోధనకు లభించక ఇబ్బందిపడుతున్నారని అన్నారు.

**16.7.88**

## "తెలుగులోకి అనువాదాలు"

"తెలుగులోకి అనువాదాలు" అనే శీర్షికపై నిర్వహించిన మొదటి సదస్సుకు ఆంధ్రప్రభ సంపాదకులు శ్రీ పొత్తూరి వెంకటేశ్వరరావుగారు అధ్యక్షతవహిస్తూ, తెలుగు అకాడమి, పత్రికల్లో వచ్చే భాష గురించి ఒక సెల్ లాంటిదేర్పరచి,

ప్రతిరోజూ వస్తున్న పత్రిక పదజాలాన్ని సేకరించి, పత్రికాసంపాదకులతో, విలేఖరులతో, పరిభాషానిపుణులతో, విశ్వవిద్యాలయాలలోని భాషాపండితులతో సంప్రదించి పరిభాషను ప్రామాణికంగా రూపొందించాలన్నారు.

ప్రముఖ పాపులర్ సైన్స్ రచయిత మహీధర నళినీమోహనరావుగారు పరిభాషకు చెందిన అనువాద ఇబ్బందులను, భాషాపరమైన అనువాద ఇబ్బందుల ఉదాహరణలను కొన్ని ఇచ్చి ఇతర భాషలలో పరిభాషను ఎలా రూపొందిస్తున్నారో చెప్పారు. ఒక మూలపదాన్ని తీసికొని (అది ఏ భాష మూలపదమైనా కానీయండి) ఇంకొక జోడు పదాన్ని దానితో జోడించి ఎలా జంటపదాలను కూరుస్తున్నారో, ఒక పదంనుండి ఎన్నో ఉపపదాలను ఎలా ఉత్పత్తిచేసి, వివిధ అవసరాలకు, అర్థాలకు వాటిని వాడుతున్నారో చెప్పారు. విదేశీయులు తమ భాషను ఆ విధంగా వారి భాషకు చెందిన మూలపదార్థాలతో జోడుపదాలను జోడించి సుసంపన్నంచేసుకొంటున్నట్లే మనంకూడా మన భాషలకు చెందిన ఏ సంస్కృత పదాన్నో, ఉర్దూ పదాన్నో, హిందీ పదాన్నో, మరే దేశీయ పదాన్నో మూలపదంగా తీసికొని, మనంకూడా ఎన్నో ఉపపదాలను, జోడు పదాలను కల్పించుకోవచ్చునని అన్నారు. అన్ని భాషలు చేస్తున్న పనీ అదే. దానికి మనం వెనకాడవలసిన అవసరం లేదన్నారు.

వాకాటి పాండురంగరావుగారు, తెలుగు అకాడమి సదస్సులు, సమావేశాలు, చర్చావేదికలు ఏర్పరచి, భాషను, పరిభాషను అభివృద్ధి చేయాలన్నారు. "తెలుగు అకాడమి" చెల్లాచెదురుగా ఉన్న అనువాదాలు, అనువాదకర్తలకు ఒక పెద్ద "ఆసరాగా, సమన్వయ సంస్థగా తయారవడం తెలుగు భాషకు శుభపరిణామం" అన్నారు. " ఈ నెలలో పత్రికలో వచ్చిన కొత్త తెలుగు పదాలు, వాటి ఆంగ్ల మూలాలు" అన్న శీర్షికనొకదానిని "తెలుగు" పత్రికలో ప్రచురించడం, వచ్చిన పదాలను సమీక్షించడం మంచిదన్నారు. ఈ పని నిరంతరం చేయాలన్నారు.

శ్రీ ఇన్నయ్యగారు మాట్లాడుతూ, తెలుగు అకాడమి తెలుగు అనువాదాలు చేయడంకంటే తెలుగు అనుసరణ గ్రంథాలు వ్రాయించాలన్నారు. తెలుగు అకాడమి పుస్తకాలు విశ్వవిద్యాలయాల్లో చదివే విద్యార్థులేకాకుండా జనసామాన్యులు కూడా చదువుకొనుటకు సులభంగా ఉండేట్లు జనరంజకంగా వ్రాయించే ప్రయత్నం చేయాలన్నారు. దాని వలన తెలుగుదనం ఉట్టిపడే భాష స్వేచ్ఛాయుతంగా వస్తుందన్నారు. ప్రామాణికమయిన పత్రికలనుండి వ్యాసాలను స్వేచ్ఛానువాదం చేయించాలన్నారు.

16.7.1988

## "తెలుగు భాషాభివృద్ధికి వివిధ సంస్థలు చేసిన కృషి"

"తెలుగు భాషాభివృద్ధికి వివిధ సంస్థలు చేసిన కృషి" అనే మధ్యాహ్నసభకు విద్యాశాఖ కార్యదర్శి డా// ఆర్.వి.వైద్యనాథఅయ్యర్‌గారు ముఖ్య అతిథిగా, శ్రీదేవులపల్లిరామానుజరావుగారు అధ్యక్షులుగా విచ్చేశారు.

"తెలుగు భాషాసాహిత్యాభివృద్ధికి వివిధ సంస్థలు చేసిన కృషి" గురించి శ్రీ దేవులపల్లి రామానుజరావుగారు అధ్యక్షోపన్యాసంచేస్తూ గత రెండు దశాబ్దాల్లో తెలుగు అకాడమి చాలా ప్రగతిసాధించిందని, దేశంలో అన్ని అకాడమీలలో చాలా మంచి అకాడమీగా పేరుగాంచిందని, ఇటీవలికాలంలో సాధించిన అభివృద్ధి మరీ ప్రశంసనీయమయిందని, తెలుగు అకాడమి సంచాలకులు, సిబ్బంది ఎంతో దీక్షానిమగ్నతలతో అకాడమి కార్యకలాపాలను నడుపుతున్నారని వారికి అభినందనలు తెలిపారు. తెలుగు భాషాభివృద్ధికి వివిధ సంస్థలు చేసిన కృషిని వారు ఉద్యమాలుగా సమీక్షించి కొనియాడారు. ఈ కృషి కారణంగానే ఈ రోజు "తెలుగు" సమగ్రాభివృద్ధిని సాధించిందని, ఎన్నో అవసరాలకు అది ఇపుడు ఉపయోగపడేట్లుగా రూపొందిందని అన్నారు.

డా// ఇరివెంటి కృష్ణమూర్తిగారు, వివిధ తెలుగు భాషాసాహిత్యప్రచురణ సంస్థలు ఎన్నాళ్ళుగానో చేసిన, చేస్తూఉన్న తెలుగు భాషాభివృద్ధికృషి చాలా ప్రశంసనీయమైనదని, ప్రత్యేకంగా ఆంధ్రసారస్వతపరిషత్తు, సాహిత్య

అకాడమీ, తెలుగు భాషాసమితి, తెలుగు అకాడమి, యువభారతిలాంటి సంస్థలు తెలుగు భాషాభివృద్ధికి ఎంతో దోహదం చేశాయని, తెలుగు భాషాసమితి, మదరాసులో, హైదరాబాదులో, ఎన్నో మంచి భాషాభివృద్ధి కార్యక్రమాలను నిర్వహించిందని, ఇపుడు ఈ భారమంతా చాలావరకు తెలుగు విశ్వవిద్యాలయం, తెలుగు అకాడమీలపైననే పడిందని, ఈ సంస్థలు నిలదొక్కుకొని, తెలుగు భాషకు, తెలుగు సాహిత్యానికి ఇంకెంతో కృషిచేయవలసి ఉందని అన్నారు. విశాలాంధ్ర ప్రచురణాలయం కార్యనిర్వాహకులు శ్రీ వి.రాజేశ్వరరావుగారు మాట్లాడుతూ తెలుగు భాషాసాహిత్య పుస్తకాలను, తెలుగు విద్యా వైజ్ఞానిక పుస్తకాలను ఎన్నో భాషాసంస్థలే కాకుండా, ఎందరో సంస్థల్లాంటి వ్యక్తులు ముద్రించారని, వారి కృషి ఫలితంగానే ఎన్నో ప్రామాణికమైన పుస్తకాలు ఈ రోజు మనకు లభ్యమయినవని, ఈ మౌలికమయిన, ప్రామాణికమయిన కృషివలననే ఇంకెన్నో తెలుగు పుస్తకాలు అటు తరుపరి వెలువడడం జరిగిందని అన్నారు. భాషాసాహిత్య ప్రచురణపరంగా వావిళ్లవారు, వెంకట్రామా అండ్‌కో వారు, విశాలాంధ్ర బుక్‌హౌస్‌వారు, హైదరాబాదు బుక్ ట్రస్ట్ మున్నగువారు చేసిన సేవ అపారమని అన్నారు. తెలుగు పుస్తకాల ముద్రాపకులు ఈ మధ్యకాలంలో పేపరు ధర అపరిమితంగా పెరిగినందువలన, పేపరు దొరకకపోవడంవలన, పుస్తక విక్రయాలపై విధించే సుంకాలు ఎక్కువకావడంవల్ల, రవాణా తపాలా ఖర్చులు పెరిగిపోవడంవలన, ముద్రించిన పుస్తకాలు కొనుటకు ప్రభుత్వ సహాయప్రోత్సాహాలు అంతగా లభించనందువలన చాలా ఇబ్బందులుపడుతున్నారు, ప్రభుత్వం ఈ విషయంలో తగు శ్రద్ధ వహించి పుస్తక ముద్రాపకులకు తగు ముద్రణవసతులు, విక్రయ వసతులు కల్పించాలన్నారు. పుస్తకాల ప్రదర్శనలకు కూడా ప్రభుత్వం ఉచితంగా వసతి కల్పించాలన్నారు. ప్రామాణికమయిన తెలుగు పుస్తకాలు ప్రభుత్వ గ్రంథాలయాలు కొనేట్లుగా ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేయాలన్నారు.

శ్రీ మహీధర నళినీమోహనరావుగారు కూడా ఈ సభలో పాల్గొంటూ కనీసం 40 శాతం పుస్తకాలయినా "ఉన్నతస్థాయి పుస్తక కొనుగోలు కమిటీ" ఒకటి హైదరాబాదు స్థాయిలో ఏర్పరచి, మంచి పుస్తకాల ఎంపికకు కొనుగోలుకు ప్రభుత్వం తోడ్పడాలని, ఈ కమిటీ పుస్తకాలతో పరిచయమున్న నిపుణులతో కూడినదయి ఉండాలని, మంచి పుస్తకాలని భావించిన పుస్తకాలను పుస్తక ప్రచురణ ఖర్చుకు రెట్టింపు రేటుకు మించకుండా, రెండునుండి మూడువేల కాపీలవరకు అన్ని గ్రంథాలయాలూ కొనుగోలు చేసే ఏర్పాటు ప్రభుత్వంచేయాలని అన్నారు.

సభలో ముఖ్య అతిథిగా పాల్గొన్న విద్యాశాఖ కార్యదర్శి డా॥ ఆర్.వి.వైద్యనాథఅయ్యర్‌గారు మాట్లాడుతూ ప్రజాస్వామ్య వ్యవస్థంటూ ఏర్పడ్డాక ప్రజల భాషలోనే పరిపాలనాబోధనలు జరగాలని, అందుకు తెలుగు సమగ్రాభివృద్ధి ఎంతయినా అవసరమని, దానికి వివిధ సంస్థలు, పరిశోధనా- ప్రచురణా-బోధనాపరంగా ఎంతో కృషిచేయవలసిఉంటుందని అన్నారు. మంచి రచనలను, మంచి రచయితలను ప్రోత్సహించుటకు తెలుగు అకాడమీ ప్రోత్సాహ పారితోషికాలు ఇవ్వటం, మంచి రచయితల రచనలను ప్రచురించడం, వారి పుస్తకాలకు రాయల్టీల్లాంటివి ఇవ్వడం చేయవచ్చని సూచనలిచ్చారు.

సభలో డైరెక్టర్ ఆఫ్ లైబ్రరీస్ శ్రీ కృష్ణమూర్తిగారు మాట్లాడుతూ గ్రంథాలయాల పుస్తక కొనుగోలు సమస్యలను వివరించారు. తెలుగు అకాడమి సంచాలకులు మాట్లాడుతూ సాహిత్యంకూడా ఒక ఐచ్ఛికమేనని, అన్ని విషయాలతోపాటు సాహిత్యంకూడా బోధన పఠనాంశమేకనుక, తెలుగు అకాడమి ఇతర విషయాలతోపాటు సాహిత్య ప్రచురణలను కూడా చేబట్టవచ్చని, మంచి పుస్తకాలను ఎంపికచేసి, ప్రోత్సాహ పారితోషికాలు ఇచ్చి, వాటి ముద్రణకూడా చేబట్టే యోచనకూడా అకాడమీకి ఉందని, విద్యాశాఖ కార్యదర్శి శ్రీ వైద్యనాథ అయ్యర్‌గారు సూచించినట్లు రచయితలకు రాయల్టీ ఇచ్చే పద్ధతిని కూడా అకాడమి చేబట్టవచ్చన్నారు.

సభలో డా॥ వెలగా వెంకటప్పయ్యగారు మాట్లాడుతూ ఆంధ్రప్రదేశ్‌లో గ్రంథాలయాలు వట్టి గ్రంథాలయాలుగా స్థాపించబడలేదని, వాటి వెనకాల ఎంతో జాతీయ భావన ఉండేదని, జాతీయోద్యమాల్లో ఎన్నో త్యాగాలు చేసినవారు, ఎంతో జాతీయ భావన ఉన్న స్వాతంత్ర సమరయోధులు గ్రంథాలయాల స్థాపన వెనకాల ఉండేవారని, గ్రంథాలయాలను జాతి

చైతన్యానికి కేంద్రాలుగా వారు వాటిని రూపొందించారని, ఎన్నో జాతీయోద్యమ సారస్వత సాహిత్యోద్యమ సభలు, సమావేశాలు కూడా ఈ గ్రంథాలయాలలో జరిగేవని, ఇప్పటికీ అవి జరుగుతున్నాయని, గ్రంథాలయాలను అప్పటి బ్రిటిష్ ప్రభుత్వం నిజాం ప్రభుత్వం, రాజకీయ ఉద్యమాలకు శిబిరాలుగా, శిక్షణ కేంద్రాలుగా ఒక నిఘావేసి చూసేవారని, గ్రంథాలయాల స్థాపనను అప్పటి దేశభక్తులు ఒక జాతీయోద్యమంగా చేపట్టారని అన్నారు. తెలుగు భాషాభివృద్ధికి, తెలుగు భాషాభిమానానికి, తెలుగు పత్రికాపఠనాకేంద్రాలుగా తెలుగు భాషాసాహిత్య ప్రచారకేంద్రాలుగా గ్రంథాలయాలు ఎంతో సహకరించాయని అన్నారు.

<u>ముగింపు సభ</u> 16.7.88

ముగింపు సభకు రాష్ట్ర వైద్య, ఆరోగ్యశాఖామంత్రి డా॥ దగ్గుపాటి వెంకటేశ్వరరావుగారు ముఖ్య అతిథిగా, ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులు డా॥సి.నారాయణరెడ్డిగారు అధ్యక్షులుగా విచ్చేశారు.

అకాడమి సంచాలకులు శ్రీ వి. కొండలరావుగారు సదస్సు గురించి సమగ్ర సారాంశ నివేదిక సదస్యులకు సమర్పించారు. సదస్సు ఉద్దేశాలను, చర్చాంశాలను, చర్చా సారాంశాలను సవివరంగా వినిపించారు. చర్చలు చాలా ఫలవంతంగా, చాలా ఉత్సాహవంతంగా సాగాయని, దానివలన సదస్సు ఉద్దేశించిన లక్ష్యాలు నెరవేరాయని, సదస్సులో పలువురు చేసిన సూచనలను అకాడమి తగు జాగ్రత్తతో పరిశీలించి పాటిస్తుందని, సదస్యులు వెలిబుచ్చిన అభిప్రాయాలను, సూచనలను ప్రభుత్వం దృష్టికి, సంస్థల దృష్టికి తీసుకొస్తుందని చెప్పారు.

ముఖ్య అతిథిగా వేంచేసిన డా॥ దగ్గుపాటి వెంకటేశ్వరరావుగారు మాట్లాడుతూ, "భాష భాషకోసం కాదు, దేశంకోసం" అని, దేశభక్తిలో భాషాభక్తికూడా ఇమిడి ఉంటుందని, రాష్ట్రం దేశంలో భాగమేకనుక దేశస్థాయిలో దేశభాషలో, రాష్ట్రస్థాయిలో రాష్ట్రభాషలో బోధనా పరిపాలనా జరగాలని, ఒక్క మనదేశం తప్ప, ప్రపంచంలో ఏ చిన్న దేశంలోనైనా వారి దేశభాషలోనే విద్యాబోధనా పరిశోధనా, పరిపాలనలు జరుగుతాయని, ప్రజల భాషలో పరిపాలనా బోధనా జరగడమే ప్రజాస్వామ్యమవుతుందని, మరొక భాషలో పరిపాలనాబోధనలు జరగడం ప్రజాస్వామ్యానికి విరుద్ధమని, అత్యంత ఉన్నత పరిపాలనా స్థాయినుండి అతి క్రింది పరిపాలనాస్థాయివరకు కూడా తెలుగులోనే ఉత్తరప్రత్యుత్తరాలు, చర్చలు సదస్సులు, సమావేశాలు జరగాలని, దీనికి ప్రభుత్వం దృఢసంకల్పంతో పూనుకోవాలని, విద్యాసంస్థలు, అకాడమీలు, పరిపాలనాసంస్థలు, పరిపాలకులు, అందరూ చిత్తశుద్ధితో దానికి తోడ్పడాలని అన్నారు. శాస్త్ర సాంకేతిక ఆర్థిక పరమయిన అభివృద్ధికి, ప్రజలకు శాస్త్ర సాంకేతిక ఆర్థిక ప్రతిఫలాలు అందించుటకు, ప్రజలు దైనందిన జీవితంలో వాడే భాషే అంతటా చలామణిలో ఉండాలని, ప్రజల మధ్యా, ప్రభుత్వంమధ్యా భాష వంతెనలా పనిచేయాలని, అది ప్రజల మధ్యా ప్రభుత్వం మధ్యా, అగాధం కాకూడదని డా॥ వెంకటేశ్వరరావుగారు అన్నారు. శాస్త్ర సాంకేతిక అభివృద్ధి జరగందే ఆర్థికాభివృద్ధి జరగదు, ఆర్థికాభివృద్ధి జరగందే ప్రజాసంక్షేమం ప్రగతి చెందదు, ప్రజాసంక్షేమం ప్రగతి చెందందే ప్రజాస్వామ్యానికి అర్థముండదు, ప్రజాసంక్షేమం జరగాలంటే ప్రజల భాషలో పరిపాలన జరగాలి – అని అన్నారు.

పరిపాలకుల ఆంగ్లేయభాషావ్యామోహమే తెలుగు భాషాభివృద్ధికి, తెలుగు భాషాప్రయోగ విస్తరణకు ఒక పెద్ద అవరోధమవుతోందని, తమ భాషను తామే చిన్నచూపు చూసే ప్రవృత్తిని పరిపాలకులు మార్చుకోవాలని, అప్పుడే భాష అభివృద్ధి చెందుతుందని, తద్వారా భాష జ్ఞానవిజ్ఞానాభివృద్ధికి తోడ్పడుతుందని, కేవలం తెలుగు నేర్చుకుంటేనే చాలదు, తెలుగుద్వారా ప్రపంచంలో ఉత్పత్తి అవుతూ ఉన్న జ్ఞానవిజ్ఞానాలను తెలుసుకోవాలి, వాటిద్వారా ఆర్థిక అభివృద్ధి సాధించాలి - అని అన్నారు. ఈ రోజు చైనాలాంటి దేశం చైనాభాషలోనే బోధనపరిపాలనలు జరుపుకొంటూ ఎంతో అభివృద్ధిని సాధించిందని ఈరోజు అత్యంత ఆరోగ్యవంతమయిన పిల్లలు ఎక్కడ ఉంటారంటే చైనాలో అని తెలిసికొన్నవారికి ఆశ్చర్యసంభ్రమాలు కలుగుతున్నాయని, అలాగే ఎంతో అభివృద్ధిసాధించిన రష్యా, జపాన్, కొరియాదేశాలు కూడా వారి వారి మాతృభాషలోనే వారి విద్యా పరిపాలన కార్యకలాపాలు జరుపుకొంటున్నారని రష్యాలోని "లుముంబా విశ్వవిద్యాలయంలో" విదేశాలనుంచి వచ్చిన విద్యార్థులు రష్యన్‌భాషను నేర్చుకొని ఆ భాషలోనే విద్యాపరిశోధనలు చేస్తున్నారని ఉద్యోగ, వైద్య,

వి. ఆ దేశాలన్నీ ఎంతో ముందంజవేశాయని, దానికి ఇతర కారణాలతోపాటు భాషకూడా ఒక కారణమని అన్నారు.

తెలుగు అకాడమీ ఇంకా చాలామంది రచయితలతో చాలా పుస్తకాలు రచింపజేసే పనిని చేపట్టాలని, అది తెలుగు భాషాసాహిత్యాభివృద్ధికి అత్యుత్తమ సంస్థగా రూపొందాలని, తెలుగు భాష, తెలుగు సాహిత్యం, ఏ భాషకీ ఏ సాహిత్యానికీ తీసిపోదని తెలుగు అకాడమీ నిరూపించాలని అలాంటి కృషి అకాడమీ చేయగలదని ఆకాంక్షిస్తూ ఇరవయ్యేళ్ళు నిండిన శుభసందర్భాన అకాడమీసిబ్బందికి అభినందనలు, శుభాకాంక్షలు తెలియజేస్తున్నానని డా॥వెంకటేశ్వరరావుగారన్నారు.

సార్వత్రిక విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు డా॥ సి. నారాయణరెడ్డిగారు వారి అధ్యక్షోపన్యాసంలో, తెలుగు అకాడమి ఒక స్వచ్ఛంద బోధన, పరిశోధన, ప్రచురణ సంస్థగా తెలుగు భాషకు ఎనలేని కృషిచేస్తోందని, అది స్వయంప్రతిపత్తిగల విడిసంస్థగా కొనసాగడమే తెలుగు భాషాభివృద్ధికి, తెలుగు సాహిత్యాభివృద్ధికి మంచిదని అన్నారు. తెలుగు ఈ రోజు బహుముఖంగా అభివృద్ధిచెందుతున్నదని అనడానికి తెలుగు అకాడమీ చేబడుతున్న బహుముఖ కార్యక్రమాలే నిదర్శనమని అన్నారు.

తెలుగు అకాడమి నిర్వహించిన ఈ సభను ముగింపు సభగా తాము భావించడంలేదని, దానిని తెలుగు బహుముఖ విస్తరణ విజృంభణకు శంఖారావపు సభగా, తొలి సభగా భావిస్తున్నామని అన్నారు. తెలుగు ఇంకా పరిపాలనా భాషగా ప్రతిష్ఠాపటిష్ఠతలు సాధించకపోవడానికి చిత్తశుద్ధి లేక కాదు లక్ష్యశుద్ధి లేక అని అన్నారు. ఈ రోజు తెలుగు ఎక్కడుంది అని మనం ప్రశ్నించుకొంటే, తెలుగు అంతటా ఉంది కాని అధికార యంత్రాంగంలో మాత్రం ఇంకా లేదు - అని అనవలసివస్తూఉంది. తెలుగు ఈ రోజు సాహిత్యంలో ఉంది, కవిత్వంలో ఉంది. సినిమాల్లో, టి.వి. ప్రసారాల్లో ఉంది. ఇంటింటా ఉంది కాని ప్రభుత్వ పాలనారంగంలో ఇంకా అంతంతే ఉందన్నారు. తెలుగు పాఠ్యపుస్తకాలకు వస్తే, పాఠ్యపుస్తకాలలో వాడే భాష ఎలా ఉండాలి, అది ఎలాంటి వ్యావహారిక భాషయి ఉండాలి అన్న విషయం ఇంకా ఇదమిత్థంగా తేలలేదు. ఇంకా మాటకు, పఠనకు సామ్యం కుదరలేదు, "అమ్మ వస్తున్నది" అన్న పిల్లవాడు సూటిగా అర్థంచేసుకోగలిగే మాటను "అమ్మ వచ్చుచున్నది" అని అనే తిరుగుడు భాషలోనే చెప్పే ప్రయత్నం ఇంకా మనం చేస్తూనే ఉన్నాం అన్నారు. విన్నమాటలోనే వ్రాసిన మాటకూడా ఉంటే పిల్లవాడికి సులభంగా అర్థమవుతుందన్న విషయం మన భాషావేత్తలు ఇంకా గ్రహించడంలేదన్నారు.

వారు అధికారభాషాసంస్థకు అధ్యక్షులుగా ఉన్నప్పటినుండి ఇప్పటివరకుకూడా తెలుగును పరిపాలనాభాషగా వాడవలెనని ఖచ్చితమయిన ఆదేశాలు ఇవ్వడం జరిగిందని, కాని ఆ ఆదేశాలు పాలనారంగంలో చిత్తశుద్ధితో అమలుజరపకపోవడంవలననే భాషాప్రాతిపదికపై ఆంధ్రరాష్ట్రం ఏర్పడి 30 ఏళ్లు దాటినా, ఇంకా తెలుగుకు బదులు పరిపాలనా - బోధనా - భాషగా ఇంగ్లీషుకే ప్రాధాన్యత ఉండడం చాలా విచారకరమని, ఈ పరిస్థితి తెలుగువారికి తెలుగు రాకకాదు, తెలుగు వారు తెలుగులో రచనా బోధనలు చేయలేక కాదు, తెలుగులో పరిపాలనాబాధ్యతలు నిర్వహించలేకకాదు, తెలుగుపై తెలుగువారికి తగినంత ఆదరాభిమానాలు లేకనే అని అన్నారు. ఇతర భాషలు ఎన్నో అవసరాలమేరకు నేర్చుకోవాలి. అవి ఆ భాషలోని జ్ఞాన విజ్ఞానాలు సేకరించి మన భాషలో అనువదించుకొనుట కొరకే నేర్చుకోవాలి కాని ఆ భాషలు మన భాషలకు బదులుగా వాడుటకు కాదు. ఏ భాషయినా భావం కొరకు నేర్చుకోవడం జరుగుతుంది కాని భాషకొరకు కాదు అని సి.నా.రె. అన్నారు. ఇంగ్లీషు భాష నేర్చుకోవలసిందేకాని ఇంగ్లీషుభాష /నేర్చుకోవడం ఇంగ్లీషు భాషా వ్యామోహంతో కాకూడదు. సంఘంలో ఇంగ్లీషు మాట్లాడితే గౌరవం పెరుగుతుందనే స్థాయి భావంతో కాకూడదు. ఇంగ్లీషు భాషను ఆ భాషలో ఉన్న జ్ఞానవిజ్ఞానాల్ని తెలుగులో అనువదించి అందించే భావంతో నేర్చుకోవాలి - అన్నారు. భావం సంపన్నమయితే భాష భావానికి తనంతటదే తోడ్పడుతుంది, తనంతటదే అవసరమయిన భాషాప్రక్రియను కల్పించుకొంటుంది, ఇతర భాషలను తన భాషలో అంతర్లీనంచేసికొని వాటిని కూడా తన భాషగా వాడుకొంటుంది, భావం సుస్పష్టమయితే భాష ధారాళంగా

తనంతటదే ప్రవాహంలా ప్రవహిస్తుంది. ఒక భాష అభివృద్ధికాకపోవడానికి కారణం భాషదకాదు భావానిది అని అన్నారు. బ్రౌనులాంటి, హాల్డేన్ లాంటి ఆంగ్లేయ పండితులు తెలుగు భాష ఆధునిక విజ్ఞానాలన్నిటికీ ఎంతో అనువైన భాషని, భారతీయ భాషలన్నిటిలో తెలుగు ఎంతో సుసంపన్నమయిన భాషని, దానిని అన్ని జ్ఞాన విజ్ఞాన బోధన పరిపాలనావసరాలకు వాడొచ్చునని తేల్చారని, తెలుగు మాట్లాడమంటే, అన్యభాషలను తెలుగీకరణ చేసుకోవడమంటే అవలీలగా అందరికీ అర్థమయే అన్యభాషాపదాలకు కూడా అర్థంకాని అతికష్టతరమయిన తెలుగు పదాలను సృష్టించి వాటి సౌలభ్యాన్ని అసౌలభ్యం చేయడం కాదన్నారు. ఉదాహరణకు "Circle Inspector" అని అందరికీ అర్థమయే ఇంగ్లీషు పదానికి "వృత్త పర్యవేక్షణాధికారి" అని, తెలుగులో అనువదిస్తే తెలుగులో రాస్తే ఎంత కఠినంగా ఉంటుందో ఊహించుకోవచ్చునన్నారు. అలాంటిది తెలుగు అమలును నిరుత్సాహపరచే దురుద్దేశమే అవుతుంది కాని సదుద్దేశం మాత్రంకాదని అన్నారు.

తెలుగు అకాడమి "తెలుగు సమగ్రాభివృద్ధి" సదస్సుల్లాంటి సదస్సులు, సమావేశాలు నిర్వహించడం చాలా బాగుందని, తెలుగు అకాడమి ఎంతో చైతన్యవంతమయిన కార్యక్రమాలను ఈ మధ్య చేపడుతున్నందుకు చాలా సంతోషంగా ఉందని, అకాడమి ఇరవయ్యేళ్లపండగ జరుపుకొంటున్న శుభసమయాన అకాడమి పురోభివృద్ధికి, అకాడమి ద్వారా తెలుగు సమగ్రాభివృద్ధికి తమ శుభాకాంక్షలు అందజేస్తున్నామని, అకాడమి మూడు పువ్వులు ఆరు కాయలుగా విస్తరించి వికాసమొందాలని తమ ఆకాంక్ష-అని ఆశీస్సులు అందజేశారు.

ఆరు రోజులపాటు జరిగిన ఈ సదస్సు అన్ని రంగాల్లోనూ తెలుగును అమలుపరచడానికి, తద్వారా భాషను సమగ్రంగా అభివృద్ధిచేయడానికి తీసుకోవలసిన చర్యలను కూలంకషంగా చర్చించడానికి చక్కని వేదికను సమకూర్చింది. విస్తృతప్రాతిపదిక మీద తెలుగు సమగ్రాభివృద్ధిపై సదస్సు జరగడం ఇదే మొదటిసారి. సదస్యులు చేసిన సూచనలను చిత్తశుద్ధితో అమలుపరచడానికి అకాడమి శక్తివంచనలేకుండా కృషిచేస్తుంది. ఇందుకు అందరి సహాయసహకారాలనూ అకాడమి సాదరపూర్వకంగా అర్థిస్తూఉంది, ఆహ్వానిస్తూ ఉంది.

భాష సమాజంకోసం పుట్టింది కాని, సమాజం భాషకోసం పుట్టిందికాదు. సమాజావసరాలకోసం భాషను ఉపయోగిస్తాం. అవసరాలు పరిమితంగా ఉంటే భాషాపరిధికూడా పరిమితంగానే ఉంటుంది. అవసరాలు పెరిగినప్పుడూ, మారినప్పుడూ భాషాపరిధికూడా పెరగవలసి ఉంటుంది. అయితే, భాష ఎలా పెరుగుతుందన్న ప్రశ్న ఎదురవుతుంది. ఏ రంగంలోని అవసరాలమేరకు భాషను ఉపయోగిస్తే ఆ రంగంమేరకు భాష పెరుగుతుంది. ఆధునిక సామాజిక, వైజ్ఞానిక, సాంకేతిక శాస్త్రాల అవసరాలమేరకు భాషను ఉపయోగిస్తే ఆయా రంగాల్లో భాష పెరుగుతుంది.

వెనకటికంటే ఇప్పుడు, భాషావినియోగరంగాల విస్తృతి పెరిగింది. కాబట్టి వాటి అవసరాలమేరకు ప్రయత్నపూర్వకంగా భాషను విస్తృతం చేసుకోవలసిన అవసరం కూడా పెరిగింది. భాషతో ప్రమేయమున్న అన్ని రంగాలలోనూ తెలుగు వాడకాన్ని పెంపొందించినట్లయితే తెలుగు భాష సమగ్రంగా అభివృద్ధిచెందుతుంది. అలాంటి వాడకం ఎలాంటిది, దాని స్వరూపం ఎలాంటిది, ఆ వాడకానికి వివిధ సంస్థలు, వ్యవస్థలు చేసిన, చేస్తూవున్న, ఇంకా చేయవలసిన కృషి ఎలాంటిది అన్న చర్చలు ఈ సదస్యులో చాలా ఫలవంతంగా జరిగినాయని చెప్పాలి. తెలుగు అభివృద్ధి గురించి ఒక సమగ్రమయిన అభిప్రాయానికి సదస్యులు రావడానికి తోడ్పడటమే కాకుండా తెలుగుపై అభిమానాన్ని, తెలుగు అభిరుచిని, తెలుగులో ఆసక్తిని ఈ సదస్సు పెంచింది. ఆధునిక అవసరాలకు ఆధునిక విద్యావిజ్ఞానాలకు తెలుగును విరివిగా, విస్తృతంగా వాడవచ్చునన్న విశ్వాసాన్ని నమ్మకాన్ని ఈ సదస్సు తెలుగు వారికి సంపూర్ణంగా కలిగించింది. డా// సి.నారాయణరెడ్డిగారన్నట్లు ఈ సదస్సు తెలుగును మరింత ఉత్సాహంగా ముమ్ముందుకు తీసుకుపోవడానికి, తెలుగుద్వారా తెలుగువారి గౌరవాన్ని ఇనుమడింపజేయడానికి శ్రీకారం చుట్టింది.



# తెలుగు నేర్చుకోటమంటే వాక్యాలు నేర్చుకోటం కాదు

చేకూరి రామారావు
పీఠాధ్యక్షులు,
భాషాశాస్త్ర విభాగం,
తెలుగు విశ్వవిద్యాలయం.



తెలుగు భాషను తెలుగు వాళ్ళకూ, ఇతరులకూ బోధిస్తాం. తెలుగు వాళ్ళకు సాధారణంగా మాట్లాట్టం బోధించం. రచనా భాషే ప్రధానంగా బోధిస్తాం. స్కూళ్ళల్లో తెలుగు పిల్లలకు బోధించే తెలుగును గురించి ప్రభుత్వంవారు, వారు నియమించిన పండితవర్గమూ ఆలోచిస్తున్నట్టు పత్రికల్లో వార్తలు చదివాం. ఆ కొండను తవ్వే వారి కృషి ఫలితాల కోసం ఎదురు చూద్దాం.

తెలుగురాని వాళ్ళకు తెలుగు నేర్పే విధానమొకటుంది. (బహుశ చాలా ఉన్నాయి). వేరే భాష మాట్లాడే వాళ్ళు తెలుగు మాట్లాట్టానికి సాధారణంగా ఒక ప్రాపంచిక ప్రయోజనం ఉంటుంది. ఒక భాషను కేవలం ఆ భాష మీద ప్రీతితో ఇతర భాషీయులు చదువు తారనుకోటం భ్రమ. దేశభాషలందు తెలుగు లెస్స అనో, ఇంకా ఇట్లాంటి దేశభక్తి, జాతిభక్తి, భాషాశక్తి పూరితమైన ప్రలాపాలు మనం ఎన్నైనా చేసుకోవచ్చుకాని, ఒక కొత్త భాషను ఏదో ప్రయోజనాన్ని ఆశించే, జనం నేర్చుకుంటారు.

తెలుగు భాషను కొందరు విదేశీయులు, మరికొందరు స్వదేశీయులు నేర్చుకొంటున్నారు. జనంలో భాగంగా కలిసిపోయిన వారికి సాధారణ వ్యవహారం కోసం బడి పద్ధతిలో భాషాబోధన అవసరం లేదు. తెలుగు భాష మాట్లాడే ప్రజలే భాషాబోధకులు. పాఠం చెపుతున్నామన్న ధ్యాస లేకుండానే వాళ్ళు భాష నేర్పుతారు. నేర్చుకుంటున్నామన్న ధ్యాస లేకుండానే నేర్చుకొనే వాళ్ళు నేర్చు కుంటున్నారు. అది సహజమైన పద్ధతి. దానికి పంతుళ్ళూ అక్కర్లేదు, పుస్తకాలూ అక్కర్లేదు, యంత్రాలూ అక్కర్లేదు, యంత్ర శాలలూ అక్కర్లేదు.

కాని వివిధ వ్యాపకాల్లో ఎక్కువ కాలాన్ని వెచ్చించే వారికి ఈ పద్ధతిలో నేర్చుకోవటం కుదరదు. అన్ని వేళలా నేర్చుకునే వాళ్ళ సౌకర్యం కోసం మాట్లాడే వాళ్ళు దొరకరు. సహజ పద్ధతిలో కాలయాపన చాలా ఉంటుంది. కావలసింది, కావలసిన పద్ధతిలో తక్కువ వ్యవధిలో నేర్చుకోటానికి ఫలప్రదమైన పద్ధతులు, సర్వ్యజనాత్మకమైన పుస్తకాలు, ఆధునిక పరికరాలు, సుశిక్షితులైన బోధకులు అవసరమవుతారు.

తెలుగుభాష బోధించటానికి బ్రౌన్ మొదలుకొని ఇప్పటివరకూ చాలా మంది చాలా పుస్తకాలు రాశారు. లీలిస్కర్‌గారి "ఇంట్రడక్షన్ టు స్పోకెన్ తెలుగు" కృష్ణమూర్తి, శివానందశర్మగార్ల "బేసిక్ కోర్సు", వెంకటేశ్వరశాస్త్రి ప్రభృతులు "మైక్రోవేవ్" పుస్తకం ఇంకా శివరామమూర్తి, వి.ఎస్. సుబ్రహ్మణ్యం వగైరాల పుస్తకాలు అచ్చులో దొరుకుతున్నై. ఇవి కాక (30 రోజుల్లో తెలుగు, ఇరవైరోజుల్లో తెలుగు వంటి చెత్త పుస్తకాల సంగతి ఇక్కడ ప్రస్తావించటం అనవసరం) పైన పేర్కొన్న రచయితలు సద్బుద్ధితో, సదాలోచనతో విశేషకృషి చేసి పుస్తకాలు రాసినవాళ్ళే. కాని నిర్మొహమాటంగా చెపితే ఆ పుస్తకాలేవీ నాకు నచ్చలేదు. ఇట్లా అనటం ఆ గ్రంథకర్తలను అభిశంసించటం కోసం కాదు. భాషాబోధకుడికి అన్ని అవసరాలకు సరిపడే పుస్తకం తయారు చెయ్యటం సాధ్యంకాదు. బోధకుడు తనకు తనే పుస్తకం, లేక బోధనా సామగ్రి తయారు చేసుకోవటం ఒక్కటే ఉత్తమమైన మార్గం. ఏ ఒక్క పుస్తకమూ బోధకుడి స్వయంకృత బోధన సామగ్రికి సమానం కాదు.

భాషాశాస్త్రజ్ఞులు తయారు చేసే పుస్తకాల్లో ఒక పెద్దలోపం కనపడుతుంది. అదేమిటంటే వాళ్ళు భాషను శాస్త్ర దృష్టితో (అంటే సైంటిస్టు దృష్టితో) చూస్తారు. విశ్లేషణ దృష్టే శాస్త్ర దృష్టిగా చాలాకాలంగా చలామణిలో ఉంది. ఉదాహరణకు

ఆయనవస్తాడు
ఆమెవస్తుంది
అతనురాడు
ఆమెరాదు.

అనే వాక్య సముదాయంలో క్రియాపద కోసం పేజీలు వెచ్చించని తెలుగు బోధనా గ్రంథం లేదు. వ్యాకరణ బోధనే భాషాబోధన అనే భ్రమ ఇంకా చాలా మంది పండితులకుంది. ఈ విషయంలో ఆధునిక పండితులు ప్రాచీన పండితులకన్నా ఏమంత మెరుగుకాదు. మాస్కోలో ప్రగతి ప్రచురణాలయంలో పనిచేస్తున్న లేక చెయ్యదలచుకున్న రష్యన్ భాషీయుడొకడు తెలుగు డిపార్ట్‌మెంట్‌కి వెళ్తే బాలప్రౌఢ వ్యాకరణాలు బోధిస్తారు. ఆ బాధ పడలేక ఏ ఆధునికుణ్ణి ఆశ్రయిస్తే ఆధునిక వ్యాకరణం చెప్తాడు? కాని అతనికి కావలసిన భాష చెప్పేవాడు దొరకడు.

వ్యాకరణం చెప్పటం భాషనేర్పటం ఒకటి కాదని, భాషనేర్పటం ప్రధాన ధ్యేయంగా ఉన్నప్పుడు వ్యాకరణం అంటే ఫార్మల్ గ్రామర్ అవసరం ఏమీలేదని గ్రహించటం,ఎరుగ చెప్పటం చాలా కష్టం.

ఇది ఇట్లా ఉండగా భాషాబోధన అంటే శబ్దవిశ్లేషణ, సూత్ర పరిశీలన కాదన్న సంగతి ఇటీవల చాలా మంది గుర్తించారు. పదాలు కాదు ముఖ్యం వాక్యాలు అని గమనించారు. కాబట్టి భాష నేర్పడమంటే వాక్యాలు నేర్పటమనే అభిప్రాయం వ్యాప్తి చెందింది. భాషాశాస్త్ర పరిశోధనలో వాక్య నిర్మాణం మీద జరిగిన పరిశోధన ఈ అభిప్రాయాన్ని అంటే వాక్యబోధనే భాషాబోధన అనే అభిప్రాయాన్ని బలపరిచింది.

అయితే భాషనేర్పటమంటే వాక్యాలు తయారు చేయటం, నేర్పటం కాదు. ఏరకపు వాక్యాలు ఏ సందర్భంలో వాడతారో నేర్చుకోవాలి. ఒక స్వల్పమైన ఉదాహరణ తీసుకోండి.

లిస్కర్ గారి పుస్తకంలో 'thank' అనే ఇంగ్లీషు మాటకు ధన్యవాదాలు అని వాడాడు. బహుశా కొంతమంది కృతజ్ఞతలు అని వాడతారు. కాని 'thank' కి "ధన్యవాదాలు" అని చెపితే తెలుగు చెప్పినట్టుకాదు. బ్యాంకులో సంతకం పెట్టడానికి కలం ఇచ్చినపుడో రైల్లో చదువుకోటానికి పేపరు ఇచ్చినపుడో, హోటల్లో తాగటానికి మంచినీళ్ళిచ్చినప్పుడో 'thank's అనొచ్చు కాని తెలుగులో ధన్యవాదాలు అనిగాని, కృతజ్ఞతలు అనికానీ అంటే ఎబ్బెట్టుగా ఉంటుంది. అందుకు కారణం స్పష్టమే. మన సంప్రదాయంలో చిన్నచిన్న పనులను ప్రత్యేకంగా గుర్తించి పేర్కొనే అలవాటు లేదు. కృతజ్ఞతలు చెప్పటం ఎంతో గొప్ప సహాయాలకు గాని జరగదు. పైగా కృతజ్ఞతలు, ధన్యవాదాలు అనేది మాట్లాడే భాషలో వినలేదు. ఉత్తరాల్లోనో, పుస్తకాల ముందు మాటల్లోనో రాతలో కనిపిస్తుంది.

తెలుగు నేర్చుకోటానికి తయారుచేసే పుస్తకాలలో కొట్టవచ్చేట్టు కనిపించే ఇంకో ప్రధానలోపం మాట్లాడేభాషకూ రాసేభాషకూ భేదాన్ని గమనించకపోవటం. కొన్ని రకాల మాటలూ, వాక్యాలూ మాట్లాడే భాషలో ఉండవు. రాసే భాషలో కనిపిస్తయ్.

కొన్ని పుస్తకాల్లో వాక్య నిర్మాణానికి ఇచ్చినంత ప్రాముఖ్యం వాక్యప్రయోగానికి, ప్రయోగ వివరణకు ఇచ్చినట్టు కనపడదు. ఉదాహరణకు నా చేతికి అందుబాటులో ఉన్న A Basic Course in Modern Telugu (మా గురువుగారు భద్రిరాజు కృష్ణమూర్తిగారు, మిత్రులు శివానందశర్మ కలిసి తయారు చేసింది) అనే పుస్తకంలో నుంచి. ఈ పుస్తకంలో నుంచి ఉదాహరణలిస్తున్నంత మాత్రాన నా వ్యాఖ్యలు ఈ పుస్తకానికి పరిమితం కావు. సాధారణంగా తెలుగు నేర్చుకోటానికి పుస్తకాలు రాసేవాళ్ళు అశ్రద్ధచేసే విషయాలివి. ఉదాహరణకు పైన పేర్కొన్న పుస్తకంలో 19వపేజీలో

అదిపెద్దపెట్టా?
అవునండి అది పెద్ద పెట్టే
కాదండి అది చిన్న పెట్టే.

ఈ సంభాషణ చదివితే తెలుగువాళ్లు కంటికి కనిపించే వస్తువులను కూడా ఇట్లా ప్రశ్నిస్తారా? అనే సందేహం వస్తుంది.

సాధారణ సంభాషణ పూర్తి వాక్యాల్లో జరగదు. వాక్య భాగాలతోనే జరుగుతుంది. తెలిసిన విషయ భాగాన్ని అవ్యక్తంగా వదిలెయ్యటానికి తెలుగువంటి భాషలు అనుమతిస్తే. ఉదాహరణకు 46వ పేజీలో ఈ సంభాషణను గమనించండి.

మేష్టరు గారు ఊళ్లో ఉన్నారా?

అవునండి మేష్టరు గారు ఊళ్లోనే ఉన్నారు.

లేరండీ మేష్టరు గారు ఊళ్లో లేరు.

ఈ రకమైన సంభాషణలో వాక్యాలు సరైనవే. ప్రశ్నోత్తర సంభాషణ క్రమం సహజంగా లేదు. ప్రశ్నోత్తర క్రమంలో భాషా వ్యవహర్తలు తమకిద్దరికి తెలిసిన విషయాన్ని redundant information వదిలేస్తారు. నిజానికి పై ప్రశ్నకు "ఆ" అనేది ఒకటే సమాధానం కావచ్చు. ఉన్నారు అనే ఒక్కమాటే సమాధానం కావచ్చు.

పైగా భాషా వ్యవహారం కేవలం ప్రశ్నోత్తరక్రమం కాదు. ప్రశ్నోత్తర సంభాషణలోనూ సమాధానాలు ప్రశ్నపద్ధతికి మాత్రమే, పరిమితమై ఉండవు. ఉదాహరణకు మేష్టరుగారు ఊళ్ళో ఉన్నారా? అన్న పై ప్రశ్నకు లేరు, ఢిల్లీ వెళ్ళారు. వారం రోజుల్లో తిరిగి వస్తారు అనే సమాధానం ఉండొచ్చు. అల్లాగే మీ నాన్నగారు ఇంట్లో ఉన్నారా అన్న ప్రశ్నకు అవునంటే మానాన్నగారు ఇంట్లోనే ఉన్నారు. లేకపోతే "లేరండీ మానాన్నగారు ఇంట్లోలేరు" అనే సమాధానాలను ఈ మార్గంలో ఊహించండి, ఎంతకృత్రిమంగా ఉంటయ్యో పై ప్రశ్నకు. ఉన్నారు. స్నానం చేస్తున్నారు. వస్తారు, కూర్చోండి అని కాని, టెలిఫోను చెయ్యటానికి పక్కింటికి వెళ్ళారు. ఇప్పుడే వస్తారు కూర్చోండి, అని కాని, అయ్యో, ఇప్పుడే బయటికి వెళ్ళారు, అని కాని సహజమైన వ్యవహారం ఉంటుంది. సంభాషణను నిబంధిత స్పందన-ప్రతిస్పందన చర్యలు (Conditioned stimulus response activity) భావించటం వల్ల ఈ చిక్కు వస్తున్నదను కుంటాను.

భాషలో ఒకే అర్థాన్ని బోధించడానికి రెండు మూడు రకాల వాక్యభేదాలుంటాయి. అవి సమానార్థకంగా కనిపించినా అవి వ్యక్తంచేసే తీరు ప్రయోగ సందర్భాన్ని అనుసరించి ఉంటుంది. ఉదాహరణకు ఈ రెండు వాక్యాలనూ గమనించండి.

1. ఏజాతి తన్ను చూసి తాను నవ్వుకోలేదో ఆజాతి ఎక్కువకాలం ఆరోగ్యంగా జీవించలేదు.
2. తన్నుచూసి తాను నవ్వుకోలేని జాతి ఎక్కువ కాలం ఆరోగ్యంగా బతకలేదు.

స్థూలదృష్టికి ఈ రెండు వాక్యాలూ సమానార్థకాలే కాని అర్థాన్ని వ్యక్తం చేసే తీరులో భేదం ఉంది. రెండో వాక్యం కేవలం విషయ ప్రతిపాది. మొదటి వాక్యం ఆ ప్రతిపాదిత విషయం మీద వ్యక్తికున్న ప్రత్యయాధిక్యం, ఉద్వేగం తెలుస్తె. ఉద్వేగం అవసరం లేనిచోట మొదటి రకం వాక్యాలుపయోగిస్తే అసంబద్ధంగా ఉంటుంది. ఉదాహరణకు దుస్తులు వేసుకోబోతున్న భర్త భార్యనుద్దేశించి అనటానికి వీలున్న వాక్యాలు చూడండి.

3. ఏ లాగు యాక్సు టైలర్సు దగ్గర కుట్టించుకున్నానో ఆలాగుకనపట్టంలేదేం?

4. యాక్సు టైలర్సు దగ్గర కుట్టించుకున్న లాగు కనపడటంలేదేం? రెండో వాక్యం సరిపడుతుంది. కాని మొదటివాక్యం అవసరంలేనే చోట ఉద్వేగాన్ని ప్రదర్శించటం వల్ల సాధారణ వ్యవహార ప్రయోగ యోగ్యం కాదు. ఒక మనిషితో మాట్లాడేటప్పుడు సభలో ఉపన్యసిస్తున్నప్పటిలాగా నాటక ఫక్కీలో మాట్లాడినట్టుంది

అల్లాగే ఇటీవల కాలంలో జరిగింది. వాక్యాలు ఆధునిక భాషలో ప్రచారంలోకి వచ్చినై. "ఆయన వచ్చాడు" అనటానికి బదులు అయన రావటం జరిగింది, అనొచ్చు. ఈ రెండూ స్థూలదృష్టికి సమానార్థకాలు. ఈ వాక్యాలను క్రియాసృష్టి గారడీ వాక్యాలని వ్యవహరిస్తున్నాను. మూలవాక్య నిర్మాణంలేని అదనపు క్రియ గారడీవాడి సృష్టిలాగే ఈ వాక్యాల్లోకి వచ్చింది కాబట్టి దీనికా పేరు పెట్టాను. ఈ గారడీ వాక్యాలు కర్తృ ప్రాధాన్య న్యూనీకరణలో కర్మణి వాక్యాలతో సమానం. క్రియాంతర్గత వ్యాపార పురస్కరణం అధికం.

ఈ గారడీ వాక్యాల ప్రాచుర్యం రచనా భాషలోనూ, ఉపన్యాసాల్లోనూ పెరుగుతున్నది. మాట్లాడే భాషకు కూడా వ్యాపిస్తున్నది. కర్మణి వాక్యాల మీద అకారణ వ్యతిరేకత కనపరచేవారు కూడా గారడీ వాక్యాలు నిరభ్యంతరంగా వాడుతున్నారు. రంగనాయకమ్మగారి నవలల్లో కర్మణి వాక్యాలు కళ్లల్లో వత్తులు వేసుకొని వెతికినా కనపడవు, కాని గారడీ వాక్యాలు అడపాదడపా తగుల్తూనే ఉంటై. అయితే ఈ గారడీ వాక్యాలయినా అన్నిచోట్లా సరిపడవు. ఉదాహరణకు అన్నం తిన్నావా? అడిగితే నేను అన్నం తినటం జరగలేదు అంటే అర్థం అవుతుందిగాని, ఆ వాక్యం ప్రయోగించినవారి మానసికారోగ్యాన్ని గురించి శంకిస్తాం. అట్లా కర్మణి వాక్యాలమధ్య కూడా. అయితే కర్మణి వాక్యాలు సంభాషణ క్రమంలో రావు. రచనా భాషలోను, ఉపన్యాసం వంటి బహుజనోద్దిష్ట వ్యవహారంలోనూ వస్తాయి. అక్కడయినా వీటి ప్రయోజనాన్ని తెలుసుకొని సందర్భ శుద్ధితో ప్రయోగించాల్సి ఉంటుంది.

ప్రతిభాషలోనూ నిశ్చయ – వ్యతిరేకార్థక వాక్యాల భేదం అందరూ ఎరిగిందే. కాని నిశ్చయార్థక వాక్యాల క్రియను వ్యతిరేక క్రియలుగా మారిస్తే వ్యతిరేక వాక్యాలౌతాయని రెంటికి మధ్యన యాంత్రిక (Mechanical) సంబంధం ఉందనుకొంటాం. కాని అది సరికాదు.

ఒక వాక్యానికి అభిధార్థమే కాకుండా అనుబంధాలుంటై. వీటినే ఇంగ్లీషులో Presuppositions అంటారు. అవి తెలుసుకోకపోతే భాషా ప్రయోగంలో చిక్కులు వస్తయ్. అంతేకాక ఒకప్రశ్నకు సమాధానం చెప్పేటప్పుడు సాధ్యమైన నిశ్చయార్థక వాక్యానికి యాంత్రికమైన వ్యతిరేకార్థక వాక్యం సమాధానంగా సరిపడదు.

క. "మా ఇంటికి వెళ్తాం, వస్తావా?"
"రాను'

ఈ సంభాషణలో ప్రశ్నకు ఇచ్చిన సమాధానం వస్తాను–అనే నిశ్చయార్థక సమాధానానికి క్రియ. కాని ఈ క్రియాప్రయోగం మర్యాదకర మైందికాదు. ఎందువల్లనంటే పై ప్రశ్న కేవలం ప్రశ్నకాదు. ఇందులో అనుబంధంగా ఆహ్వానం కూడా ఉంది. ఆ ఆహ్వానాన్ని మొదటగా తిరస్కరించకుండా సమాధానం ఉండాలి.

ఎవరింటికన్నా వెళ్తే కాఫీ తాగుతారా అంటే తాగను, అని కానీ, ఒద్దు అని అనకుండా అక్కర్లేదు; అనే సమాధానం సందర్భోచితంగా ఉంటుంది. అంటే కాఫీ తాగుతారా? అనే ప్రశ్నకు మీకిప్పుడు కాఫీ కావాలా? అనే అనుబంధార్థం ఉంది. అంటే వాక్యాల ప్రధాన, అనుబంధార్థాలను బట్టి భాషాబోధన ఉండాలి గాని కేవలం వాక్యాలనుబట్టి, వాక్య నిర్మాణాన్ని బట్టికాదు.

అట్లాగే ఈకింది వాక్యాలు చూడండి.

6. అతను బావిలో పడి రెండు సంవత్సరాలయింది.

7. అతను బావిలో పడక రెండు సంవత్సరాలయింది.

ఈ పై రెండు వాక్యాల అనుబంధార్థాల్లో భేదం ఉంది. రెండో దాంట్లో అతను అలవాటుగా బావిలో పడతాడన్న అనుబంధార్థం ఉంది. మొదటి దాంట్లో ఆ అర్థచ్ఛాయ లేదు.

దీన్ని బట్టి వాక్యానికున్న ప్రధాన అనుబంధార్థ భేదాలు ముఖ్యమని వ్యతిరేక వాక్యాల అనుబంధార్థాలు నిశ్చయార్థకాల అనుబంధార్థాలకన్నా భిన్నమని భాషాబోధనలో ఇవి గ్రహించాల్సిన అవసరముందని తెలుస్తుంది.

ప్రామాణిక భాషావాదం, శిష్ట వ్యావహారిక భాషావాదం మొదలైన వాదాలవల్ల సర్వప్రయోజనాలకు ఒకే భాష ప్రయోగించవచ్చుననే భ్రమ చాలా మందికి ఉంది. అట్లాకాకుండా భిన్న సందర్భాలననుసరించి భాషాభేదం ఉంటుంది. ఈ భేదం పదజాలంలోనే కాక వాక్యనిర్మాణ ప్రయోగాల్లోకూడా ఉంటుందని బోధకులు గ్రహించటం అవసరం. సంభాషణ వేరు, ఉపన్యాసం వేరు, కథా కథనం వేరు, వ్యాసరచన వేరు, లేఖా రచన వేరు, వార్తారచన వేరు. ఉన్నత స్థాయీ భాషాబోధనలో ఈ భేదాలను గుర్తుంచుకోవటం అవసరం.

(మిగతా 28వ పేజీలో)

# శిష్ట వ్యావహారిక భాష : చరిత్ర

**ఆచార్య.యం.ఆర్.అప్పారావు,**
అధ్యక్షులు,విద్యా విషయకస్థాయీసంఘం,
తెలుగు అకాడమి,హైదరాబాదు.

భావప్రకటన సాధనం భాష. నిత్యవ్యవహారంలో పరస్పరం భావవినిమయానికి, సులభగ్రహణకు భాష తోడ్పడినట్లు మరేదీ తోడ్పడదు. వివేచనలో బహిర్గతమయిన అంశాలూ, పరిశోధనల ఫలితంగా వెలువడిన అంశాలు భాషావాహికద్వారా జన బాహుళ్యానికి ఉపకారకాలు కావాలి.

అయితే భాష ప్రవాహం వంటిది. కొత్తనీరు, పాతనీరు, కశ్మల వస్తు సముదాయమూ ప్రవాహంలో చోటు చేసుకొన్నట్లే భాషలో కూడా ప్రాంతీయతలవల్ల, విభిన్న జాతుల సమ్మేళనం వల్ల, అన్యదేశీయుల సంపర్కం వల్ల, వ్యక్తుల ఉచ్చారణల తేడాలవల్ల ఎన్నో మార్పులు చోటు చేసుకొంటాయి. ప్రవాహానికి రక్షణగా రెండువైపులా గట్లున్నట్లే భాషకు కూడా నియమనిబంధనలు ఉన్నాయి. ఏ భాష విషయంలో అయినా ఇది సర్వసామాన్యమే. ఇంత మహత్తరమైన భాష రాబోయే తరాలవారికి "విజ్ఞానపేటిక" కావాలని భాషకు వాగ్వ్యవహారమే కాక లేఖన వ్యవహారాన్ని కూడా సృష్టించారు.

కాగా సామాన్య వ్యవహారానికి ఉపయోగపడుతున్న భాషకీ, గ్రాంథికమైన భాషకీ భేదం స్వల్పంగా ఉండటం సహజం.

తెలుగులో వ్యావహారిక భాషకీ గ్రాంథిక భాషకీ భేదం ఎక్కువగా ఉన్నట్లు కన్పిస్తుంది-- భాషలన్నింటిలోను తెలుగు భాష గొప్పది అనడంలో సందేహం లేదు. "దేశ భాషలందు తెలుగు లెస్స" అని కృష్ణదేవరాయలు చెప్పాడు. అక్షరాస్యతను అభివృద్ధి చేయవలసిన మనదేశంలో విభిన్న భాషలు-- విభిన్న సంస్కృతులు-- విభిన్న బహుముఖమైన రాజకీయ పరిస్థితులుగల మనదేశంలో విజ్ఞాన శాస్త్ర పరిచయం కలిగించడానికి అనువైనది తెలుగు. అందువల్ల తెలుగు సమగ్రంగా అభివృద్ధి చెందాలి. విజ్ఞాన సముపార్జనకు కావలసిన శబ్దసంపద సుసంస్కృతమై ప్రాథమిక స్థాయి నుంచి విశ్వవిద్యాలయ స్థాయివరకు విద్యార్థి అవగాహనకు అందుబాటులో ఉండాలి. ప్రస్తుతం మన తెలుగులో ఆ సౌలభ్యం లేనందువల్ల ఎంతోకాలంగా గ్రాంథిక వ్యావహారిక భాషా వివాదాలు, వాటి తర్జనభర్జనలూ, వాటిపై మేధావుల పరిశోధనలూ, పరిశీలనలూ, నేటివరకూ సాగుతూ వస్తున్నవి. ఇటీవల విశ్వవిద్యాలయ స్థాయి విద్యార్థులకు ఈ ప్రయోజనం అందించే ప్రయత్నంగా లాంగ్వేజీ కమిటీ అకడమిక్ కౌన్సిల్‌లో ప్రతిపాదించిన తీర్మానాలు ఆమోదం పొంది కార్యరూపం ధరించాయి. ఈ పరిస్థితి రావడానికి దోహదం చేసిన పూర్వరంగ పరిశీలన మనకిప్పుడు అప్రస్తుతం కాదు.

వ్యావహారిక భాషోద్యమం 1910లో ప్రారంభమయ్యిందని అనుకోవచ్చు. అంతకుముందు నుంచీ రచనావ్యాసంగం వ్యావహారిక భాషలో జరగాలని విజ్ఞుల అభిప్రాయం బలంగా ఉన్నా విద్యార్థుల పాఠ్యపుస్తకాల స్థాయి నుంచి ఆ విధమైన రచన జరిపించాలన్న పట్టుదల విద్యాశాఖాధికారులలో 1920 నుంచే హెచ్చింది. 1903లో అప్పటి గవర్నరు జనరల్ కర్జన్ విద్యాభివృద్ధిని గురించి సమగ్ర నివేదిక తయారుచేసేందుకు ఒక సంఘాన్ని నియమించాడు. ఆ సంఘ నివేదిక "పట్టభద్రులు తామునేర్చిన విషయాలు జన సామాన్యానికి సుబోధకంగా తెలియజెప్పగల శక్తిసామర్థ్యాలు తమ విద్యార్జన పద్ధతుల వల్ల పొందలేకపోయారు" అన్న సారాంశాన్ని సూచించింది; దేశ భాష నిర్లక్ష్యం చేయబడిందని గౌరవమైన స్థానం దానికివ్వలేదనీ విజ్ఞులు అభిప్రాయపడ్డారు. విజ్ఞాన శాస్త్రాల ఆధునిక భావాలను

దేశభాషలో వివరించే రచయితలను ప్రోత్సహించాలనే అటువంటి పుస్తకాలు రాయించాలని, దీనికి ప్రాతిపదికగా ఉన్నత పాఠశాలల్లో, కళాశాలల్లో మాతృభాషలో వ్యాసరచన నిర్బంధ పాఠ్యాంశంగా ప్రవేశపెట్టాలని అప్పటి ప్రభుత్వం సంకల్పించింది. అనువాదం, వ్యాసరచన నిర్బంధం చేయడంలో విద్యార్థులకు ఏ శైలి సుగమం అన్న మీమాంస ఏర్పడింది. అప్పటి విద్యాశాఖాధికారులకు తెలుగు భాషలో గ్రాంథిక వ్యావహారిక శైలులకు ఉన్న వ్యత్యాసం ఎంతో ఆశ్చర్యం కలిగించింది. కారణాలు తెలుసు కోవడానికి జె.వి. ఏట్స్, పి.టి. శ్రీనివాసయ్యంగార్, శ్రీ గురజాడ అప్పారావు, ఆ తరువాత శ్రీ గిడుగు రామమూర్తి పంతులు గార్లను కలుసుకొని చర్చించడం జరిగింది. జీవద్భాషలో ఉన్న సూక్తి అందచందాలు, సరళశైలి గల భాషే పాఠ్య గ్రంథాలలో చోటుచేసుకోవాలనీ ఆ విధమైన విధానం విద్యార్థులలో వైజ్ఞానిక వికాసం కలిగించగలదనే స్థూలాభిప్రాయం వారి చర్చలలో బహిర్గతమైంది. మెట్రిక్యులేషన్ స్థానంలో స్కూలుఫైనల్, యఫ్.ఎ.స్థానంలో రెండు సంవత్సరాల ఇంటరుమీడియేట్ తరగతులూ వచ్చాయి. విద్యార్థులు అధ్యయనం చేయవలసిన విషయ ప్రాధాన్యంగల పాఠ్య ప్రణాళికలో చాలా మార్పులు వచ్చాయి. పాఠ్యాంశాలూ, పరీక్షాంశాలూ ఒకటే కావడంవల్ల వ్యాసరచనకూ అనువాదానికి ఉండవలసిన శైలిని గూర్చిన ప్రస్తావన కూడా తలెత్తింది. వ్యావహారిక భాషే అందుకు అనువైన భాషగా ఆధునిక భావాలున్న విద్యావేత్తలు సూచించగా, పూర్వాచార పరాయణులైన పండితులు ఆ సూచనను తిరస్కరించారు. శ్రీ గిడుగువారు జీవద్భాషా ప్రాశస్త్యాన్ని కావ్యభాష నిరుపయోగతను, ఎలుగెత్తి చాటుతూ ఉపబలకంగా ఆంగ్లభాషా సంప్రదాయవాలను, పాశ్చాత్య భాషా పరిణామాలను విశదం చేశారు. అయితే పండితులు వారి వాదాన్ని అంగీకరించలేదు. శ్రీ పి.టి.శ్రీనివాసయ్యంగార్ వ్రాసిన లాంగ్వేజ్ లైఫ్ అండ్ డెత్ అన్న పుస్తకం పండితులకు మరింత ఆవేశాన్ని కలిగించింది. అదే సమయంలో రచనా స్వాతంత్ర్యం అవలంబించి శ్రీ సెట్టి లక్ష్మీ నరసింహంగారు రచించిన "గ్రీకు పురాణగాథలు" స్కూలు ఫైనలు పాఠ్య గ్రంథంగా నిర్ణయింపబడడం పుండుపై కారం అయింది. ఆ "గ్రీకు పురాణ గాథలు" పాఠ్యగ్రంథంగా ఉండరాదని ఆందోళన లేవదీశారు. శ్రీ పి.టి.శ్రీనివాసయ్యంగార్, శ్రీ ఏట్స్, శ్రీ గురజాడ, శ్రీ గిడుగు దుష్టచతుష్టయం అనీ, తెలుగుభాషకు ద్రోహం తలపెట్టారని ఆందోళన లేవదీశారు. ఈ ఆందోళన చేసే వర్గంవారికి శ్రీ జయంతి రామయ్యపంతులు నాయకత్వం లభించింది. స్కూలు ఫైనలుస్థాయిలో తెలుగు అనువాదంలో, వ్యాసరచనలో వ్యావహారిక భాషను అనుమతిస్తూ జారీచేసిన తీర్మానాన్ని వెంటనే ఉపసంహరించాలని పెద్ద పెట్టున మహజర్లు ప్రభుత్వ దృష్టికి వచ్చాయి.

గ్రాంథిక భాషలో మార్పులు రాలేదని అనేక మాండలికాలలో త్వరితగతిని మారిపోయే వ్యావహారిక భాషకంటె గ్రాంథిక భాషే ఉపాదేయమని ఆ మహజర్లు పెట్టినవారి వాదం. మద్రాసు విశ్వవిద్యాలయం వారు గ్రాంథిక వ్యావహారిక భాషావాదుల సంఖ్య సమానంగా ఉండేటట్లుగా ఒక సంఘాన్ని నియమించారు. తటస్థుడిని ఆ సంఘానికి అధ్యక్షుడిగా చేశారు. రాజధానీ కళాశాలాధ్యాపకులైన శ్రీ ఎమ్.రంగాచార్యులుగారే ఆ అధ్యక్షులు. ఈ సభ్యులు చాలాసార్లు సమావేశాలు జరిపి శిష్ట వ్యవహారానికి అనుకూలంగా ఒక తీర్మానాన్ని ఆమోదించారు.

ఈ తీర్మానం వ్యావహారిక భాషావాదులకు కొంత తృప్తినిచ్చింది. ఈ తీర్మానానికి ఆమోదం తెలుపుతూ ఆధునిక భాష అంటే ఏమిటో వివరిస్తూ స్కూలు ఫైనలుబోర్డు ఒక వివరణ ప్రకటించింది.

1912 వ సంవత్సరానికల్లా స్కూలు ఫైనలు పరీక్షలో వ్యాసరచనకు, అనువాదాలకు వ్యావహారిక భాష ఉపయోగించవచ్చని అనుమతి లభించింది. విశ్వవిద్యాలయంవారికమిటీలో శ్రీ గురజాడ అప్పారావు, శ్రీ పి.టి.శ్రీనివాసయ్యంగార్ ఇద్దరూ ఇంటర్మీడియేట్ కాంపోజిషన్ కమిటీ సభ్యులు (ఉనుచు) ఉంచు, (కాగు) కాగు, (అదియ) అది, తాటాకు మొదలయిన పద స్వరూపాలూ, వాళ్ళు, అల్లుళ్ళు, నోటికి, సీటికి, అందుకు మొదలైన విభక్తి రూపాలూ, చేస్తాను, చేసీ, చేయక, చదివితే, పద్యాము, వంటి

క్రియారూపాలు, అపనమ్మకము, దురలవాటు, గతనెల, గ్రామమునసబు, గర్భగుడి, మొదలైనవైరి సమాసాలూ, సాధువులే అని అంగీకరించవచ్చని పై కమిటీ వారు సూచించారు. ఈ తీర్మానం ఒక రకంగా వ్యావహారిక భాషావాదుల విజయంగా పేర్కొనవచ్చు. అది స్వల్పకాలికమే అయింది. ఈ లోపుగా వ్యావహారిక భాషని గ్రామ్యభాషగా చిత్రించి దేశంలో పెద్ద పెట్టున ఆందోళన జరిగింది. ప్రభుత్వం మీద ఒత్తిడి వచ్చింది. గ్రాంథికభాషావాదులు, ఆంధ్రదేశమంతా గొప్ప అలజడి లేవదీశారు. పత్రికలు ఏదో ఒక పక్షాన్ని వహించి బాకా ఊదాయి. మాండలికాలవల్ల వ్యావహారిక భాష ఆయా ప్రాంతాల వాళ్లకే అవగతమౌతుందనీ, మిగిలిన ప్రాంతాలవాళ్లకి తెలియదని ఏకరూపత ఉండదని, అందువల్ల ఆ పదాల అవగాహన విద్యార్థులకుండదని వ్యాకరణ నియమం లేని కారణంగా సమగ్ర పద స్వరూపం ఉండదని విద్యార్థి విజ్ఞాన పాండిత్య సంపాదనకు వీలుకాదనీ ఆ వాద సారాంశం. ఈ విధమైన అలజడి ఫలితంగా 1913లో విస్తృత ప్రాతిపదికమీద శ్రీయుతులు వేదం వెంకట్రాయశాస్త్రి, కొమర్రాజు లక్ష్మణరావు, జయంతి రామయ్యపంతులు గ్రాంథికభాషా ప్రతినిధులుగానూ, శ్రీయుతులు గిడుగు రామమూర్తి, గురజాడ అప్పారావు, బుర్రా శేషగిరిరావు మొదలయిన వారు వ్యావహారిక భాషా ప్రతినిధులుగానూ నిలిచారు.

"వ్యాసరచనకు గ్రంథములందలి రూపములున్నూ, వాడుకలో గల రూపములున్నూ ప్రయోగార్హములే" అని తీర్మానించి ఆమోదించారు. ఇటువంటి పద పట్టికల తయారీకి వెంకట్రాయశాస్త్రి, లక్ష్మణరావు, అప్పారావుగారలతో ఒక ఉపసంఘం ఏర్పడింది. నామవాచక, సర్వనామ క్రియారూపాల వర్గీకరణం రెండు నెలల్లో పూర్తి చేయాలని కమిటీ ఆదేశించింది. ఉపసంఘంలో సభ్యులు, సర్కారు జిల్లాల వాళ్లు కాబట్టి రాయలసీమకు ప్రాతినిధ్యం ఇవ్వాలంటూ తెలుగు పెద్దలు విశ్వవిద్యాలయంవారికి మహజరు పంపి ఆందోళన చేశారు. తత్ఫలితంగా రాయలసీమ ప్రతినిధులుగా శ్రీయుతులు కోలాచలం శ్రీనివాసరావు, టి.శంకరలింగం పిళ్లె, నాగపూడి కుప్పుస్వామయ్య, జారిప్లవు కె.సుబ్బారెడ్డి ఉపసంఘ సభ్యులయ్యారు. పదపట్టికల తయారీలో అభిప్రాయభేదాలు రావడం, గురజాడవారి డిసెంట్ నోట్‌లో గ్రాంథిక భాషావాదుల అభిప్రాయం నెగ్గడం జరిగింది. మద్రాసు విశ్వవిద్యాలయం తన సిండికేట్‌లో 1914 ఆగస్టు 14వ తేదీన తీర్మానం చేసింది. ఈ కారణంగా అంతకుముందు వ్యావహారిక భాషను గురించి తామే ఇచ్చిన అనుమతి ఉపసంహరింపబడింది. గురజాడవారి కన్యాశుల్కం, గిడుగు వారు ఆంధ్రప్రాంతమంతా తిరిగి సేకరించిన నిదర్శనాల ఫలితంగా వ్యాసావళి, గద్యచింతామణి ఆంధ్ర పండిత భిషక్కుల భాషా భేషజం, బాలకవి శరణ్యం వెలుగులోకి రావడం వల్ల వ్యావహారిక భాషోద్యమానికి జయపతాక ఎగరవేసినట్లయింది. బ్రౌనుదొర 1852లో వ్యావహారిక భాషలో నిఘంటువు రచించారు. ఇంగ్లీషులో తెలుగు వ్యావహారిక భాషా నిఘంటువు రచించిన గెలట్టీదొర ప్రభుత్వ వ్యవహారాలు ఏ భాషలో నిర్వహించుకుంటారని ఆక్షేపించాడు. గ్రాంథిక భాషావాదులు గూడా కొంత తెప్పరిల్లి వాస్తవాన్ని గుర్తించి సులభశైలిలో నియమాలు పాటిస్తూ గ్రంథరచన చేయాలనడం ఆరంభించారు. వివిధ మండలాల్లో శిష్ట వ్యావహారికం వివిధ రీతుల్లో ఉన్నప్పుడు పాఠ్య పుస్తకాల్లో భాష ఏ ప్రాంతం భాష కావాలి అని కొందరి తర్కం; ఇది నిలవని తర్కం, దినపత్రికల్లో, కథల్లో, నవలల్లో అఖిలాంధ్ర దేశం ఏ భాష వాడుతున్నారో దాన్నే ఉపయోగించవచ్చన్నారు. వ్యావహారిక భాషకు పోనుపోను బలం ఏర్పడింది. సర్వత్రా వ్యావహారిక రచనకు ఆదరం హెచ్చింది. తమ రచనలకు వ్యావహారికంలో కూడా ప్రామాణికత ఏర్పరచుకోవద్దా? అనే భావం పండితుల్లో సైతం కలిగింది. తత్ఫలితంగా వాఙ్మయ మహాధ్యక్షులు వజ్ఝలమూడి వారి వ్యావహారిక భాషా వ్యాకరణం వంటివి వచ్చాయి. కోకొల్లలుగా రచనలు వ్యావహారికంలో ఆమోదయోగ్యంగా వస్తున్నాయి.

వ్యావహారిక భాషా వాదానికి సంబంధించిన వెనకటి చరిత్ర పరిశీలించినమీదట శ్రీ యల్.బుల్లెయ్య ఆంధ్రవిశ్వవిద్యాలయ వైస్-ఛాన్సలర్‌గా ఉండగా, నా అధ్యక్షతన తెలుగు లాంగ్వేజ్ కమిటీ ఏర్పడి కొన్ని

సూచనలు చేసింది. ఆ సూచనలు అకడమిక్ కౌన్సిల్‌లో ఆమోదించారు.

విద్యార్థులు శాస్త్రీయ విషయాలు మరింత సమర్థవంతంగా నేర్చుకోవడానికి, నేర్చినవాటిని సమగ్రంగా విశదీకరించడానికి వ్యావహారిక భాషకున్న ప్రాధాన్యం ఎప్పుడో విదితమైన దనడంలో పొరపాటు లేదు.

ఇన్నేళ్ళుగా జరిగిన కృషి వల్ల వ్యావహారిక భాషా ప్రాభవం జనజీవనంలో ఎంతగా పెరిగిందో తేటతెల్లమే. అకడమిక్ కౌన్సిల్లో అంగీకృతాలయిన సూచనల ప్రకారం విద్యార్థులు జవాబులు రాయడానికి శిష్టవ్యావహారికం గానీ గ్రాంథిక భాషగానీ వాడవచ్చన్న సూచన అమలులోకి వచ్చింది. పాఠ్య గ్రంథాల రచయితలు వ్యావహారిక భాష వ్యక్తిత్వాన్ని గుర్తించి కృషి చేస్తున్నారు. ఆ కృషి ఫలితంగా ఎన్నో శాస్త్రీయ గ్రంథాలను అకాడమీలు, విశ్వవిద్యాలయాలు శిష్టవ్యావహారికంలో వెలువరించడం, విద్యార్థులకు అవెంతగానో ఉపకరించడం ప్రత్యక్షంగా కనబడుతున్నదే. ఈ విధంగా వ్యావహారిక భాషోపయోగం విద్యార్థులలో వైజ్ఞానిక ప్రగతికి మూలం అనడంలో అతిశయోక్తి లేదు.

**బోధనామాధ్యంగా తెలుగు :**

ప్రపంచంలో ఏ దేశంలోనైనా మాతృభాష ద్వారానే సకల విద్యలు నేర్చుకోడం జరుగుతుంది. అన్ని వ్యవహారాలకూ అంటే సాంఘిక, ఆర్థిక, రాజకీయ, న్యాయశాస్త్ర, విద్యా విషయక తదితర రంగాలకు మాతృభాషే మాధ్యం.

భారతదేశంలో బ్రిటీషు పరిపాలనా కాలంలో మెకాలే ఇంగ్లీషు భాషను అన్నిరంగాలలో ప్రవేశ పెట్టాడు. అప్పటినుంచి మనకు 1947లో స్వాతంత్ర్యం వచ్చేవరకు ఇదే విధానం కొనసాగింది. స్వతంత్ర్యం వచ్చిన తర్వాత దేశంలో త్రిభాషాసూత్రం సార్వత్రికంగా ఆమోదించబడింది. అవి: దేశభాష హిందీ, మాతృభాష, ఆంగ్లం. ఈ సూత్రం జయప్రదంగా దేశంలో అమలు జరుపబడుతున్నది. అయినా ఇప్పటికీ అంటే 1988 లో కూడా ఆంగ్ల భాషావ్యామోహం అత్యధికంగా ఉంది. తల్లిదండ్రులు పిల్లలను కాన్వెంటు స్కూళ్లకు, ఆంగ్ల భాషామాధ్యమం గల స్కూళ్లకు, కాలేజీలకు పంపుతున్నారు. దీనికి కారణాలున్నాయి. అవి:

1. మాతృభాషలో సరైన పఠన గ్రంథాలలోపం. స్కూళ్ళకు, కాలేజీలకు యూనివర్శిటీ స్థాయిలకు అవసరమయే పాఠ్య గ్రంథాలలో కొన్ని భాగాలు అసలే లేకపోవడం, ఒకవేళ ఉన్నా ఏ ఒకటి రెండు పాఠ్యగ్రంథాలో మాత్రమే ఉండటం.
2. ఇంతవరకు దక్షిణ భారతంలో స్నాతకోత్తర స్థాయిలో ఆంగ్లభాషే మాధ్యమంగా ఉండడం.
3. ఇంజనీరింగ్-సాంకేతిక విద్యల్లో, న్యాయశాస్త్ర విద్యల్లో వైద్యవిద్యల్లో పఠన గ్రంథాలు పూర్తిగా లోపించడం. కోర్టుల్లో, ఇంజనీరింగ్ కాలేజీల్లో, వైద్య విశ్వవిద్యాలయాల్లో ఇప్పటికి ఇంగ్లీషుభాషే మాధ్యమంగా ఉండడం.
4. విదేశాలకు వెళ్లదలచే వారికి, ఇంగ్లీషులో చదవాలని ఆసక్తి ఉండడం.
5. అఖిలభారత పరీక్షలలో అంటే I.A.S., I.F.S., I.P.S., మొదలయిన పరీక్షలలో ఆంగ్లం, హిందీ మాత్రమే మాధ్యమాలుగా ఉండడం.

ఈ పై కారణాలవల్ల ఇంగ్లీషు భాష చాలావరకు అమలులో ఇప్పటికీ – 1988 వరకు ఉన్నది.

ఈ పరిస్థితి మారాలంటే మాతృభాషలో పాఠ్య గ్రంథాలు అన్ని రంగాలలో విరివిగా లభించాలి. కళాశాలల్లో, విశ్వవిద్యాలయాల్లో, స్నాతకోత్తర స్థాయి వరకు మాతృభాషామాధ్యమం ఉండాలి. కోర్టుల్లో, వైద్యవిశ్వవిద్యాలయాల్లో, వ్యవసాయ, ఇంజనీరింగ్ విశ్వవిద్యాలయాల్లో మాతృభాషా మాధ్యమం ఉండాలి. ఈ కార్యం సాధించడానికి ఒక ఉన్నత సంస్థను ప్రభుత్వాలు స్థాపించాలి. కావలసినన్ని నిధులు ఈ సంస్థలకు అందజేయాలి. ఈ ఆశయాల సాధనకే ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తెలుగు అకాడమీని 1968లో స్థాపించడం జరిగింది.

అప్పటినుంచి తెలుగు అకాడమీ ఇంటర్మీడియట్, డిగ్రీ, స్నాతకోత్తర స్థాయిల్లో మానవిక, విజ్ఞాన శాస్త్రాల పాఠ్య గ్రంథాలను, సంప్రదింపు గ్రంథాలను, అనువాదాలను, జనబాహుళ్యానికి ఉపయోగించే వివిధ పుస్తకాలను, నిఘంటువులను ప్రచురించి, తెలుగు భాషకు, ప్రజలకు సేవ చేస్తున్నది.

*****

(తెలుగు నేర్చుకోవటమంటే ......) (. . వ పేజీ తరువాయి )

చివరగా ఒక్కమాట. తెలుగు లిపి అశాస్త్రీయమైనదని, బహుకష్టమైందని, అందుకని భాషాబోధనలో రోమన్ లిపి వాడకం మంచిదనే వాదం ఒకటి కొందరి దగ్గర్నుంచి వినవస్తున్నది.

శాస్త్రీయమైన లిపి ప్రపంచంలోనే లేదు. అసలు శాస్త్రీయమైన లిపి అనే మాటే అర్థం లేనిది. భాష అవసరాలకు ఉన్న లిపి సరిపోతుందా లేదా అనేదే ప్రశ్న. సరిపోతుందని నా అభిప్రాయం.

తెలుగు లిపికి, ధ్వనికి ఉన్న సంబంధం అత్యంత సన్నిహితమైనది. ఒక్కసారి నేర్చుకొంటే చాలు. ప్రతి మాటకూ స్పెల్లింగు నేర్చుకోనక్కర్లేదు. లిపితో ప్రారంభించటమే ప్రయోజనకరమైందని నా అనుభవం.

# "తెలుగు భాషాభివృద్ధిలో పత్రికల పాత్ర"

జి. కృష్ణ
ప్రత్యేకకరస్పాండెంట్(రిటైర్డ్)
ఇండియన్ఎక్స్‌ప్రెస్

పత్రికలను వెలయించడమే సాహిత్య సేవ, ప్రజాసేవ అనుకొనగలిగితే, గత నూట యాభై సంవత్సరాలలో అచ్చుఅయిన అక్షర కోటులన్నీ కలిసి మానవాళికి ఎన్ని ఉత్తమోత్తమ పునర్జన్మలో కలిగించి ఉండేవి.

తెలుగు పత్రికలు వెలసిన నాటినుంచీ, అవి తెలుగు సాహిత్యసేవ చేస్తున్నట్లే కదా! వాస్తవానికి తెలుగులో ఎవడు ఏది అన్నా, ఏది వ్రాసినా, అది సాహిత్యసేవ అనాల్సిందే.

ఇంగ్లీషు భాషకు ఒక ప్రమాణం నెలకొని ఉన్నట్లు తెలుగుకు ఒక పద్ధతి ఏర్పడటం ఇప్పట్లో అసాధ్యం. ఇంగ్లీషును పత్రికలలో వ్రాసినపుడు కూడా చాలా వరకు వాళ్ళకు ఉన్న వ్యాకరణాలనీ అనుసరిస్తారు. తెలుగును పత్రికలలో వ్రాస్తున్నపుడు ఏ విధంగానూ వ్యాకరణ జోక్యం వాటిల్లరాదు. తెలుగులో ఉన్న వ్యాకరణాలు చెల్లవు. అసలు తెలుగు భాష స్వరూపం ఇప్పటికీ అవగతం కాలేదు. అందువలన ఆ భాష కావ్య, పురాణ, గేయ, నవలా, కథా రచనలకు పరిమితం. చాలా సంకట పరిస్థితి. ఆధునిక వ్యవహారాలను ఏ కొద్దిగానైనా వ్రాస్తూ ఉండే వాళ్ళు పత్రికలవాళ్ళే. సాహిత్యాన్ని వ్రాస్తున్నామనే రచయితలు మాత్రం కాదు.

స్వాతంత్ర్యం రాకమునుపు, ఆర్థిక వ్యవహారాలను గురించి అయినా కొందరు రచయితలు తరచు వ్యాసాలు వ్రాసేవారు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, తగ్గినై. కొంతకాలానికి బాగా తగ్గినై. తగ్గినై అంటే అసలే ఎవ్వరూ వ్రాయడం లేదని కాదు. పూర్వం తెలుగులోనే వ్రాసేవారు. స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, ఇంగ్లీషు కూడా మన భాషేననే వాదం ఒకటి పెద్దలే లేవదీశారు. పైగా తెలుగుకంటే ఇంగ్లీషే జనాలకు సుబోధకం అనే వాదం కూడా ప్రచారం చేశారు. అందువలన, ఆధునిక వ్యవహారాలపై వ్రాసేవారు చాలా వరకు తెలుగు భాషను ఇంగ్లీషు భాషకు అనులేఖనంగా రూపొందించడం ఒక నోంపుగా, ఒక నోకుగా అవలంబిస్తున్నారు.

నేను ఈ వ్యాసాన్ని పూర్వం వారు వ్రాసిన వ్యాసాలకు జాబితాగా రూపొందిస్తే, నా విధిని నిర్వర్తించినవాడినవుతాను. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారు ప్రచురించిన వ్యాస సూచీ నుంచి కొన్ని వ్యాసాల పేర్లు, కొందరు రచయితల పేర్లూ ఇక్కడ ఉటంకించి సంకలనకర్త శ్రీ ఎన్.ఎస్. కృష్ణమూర్తికి కృతజ్ఞుడను అని వ్రాసుకుంటే గంభీరంగా, పెద్దమనిషి తరహాగా ఉండి పోతుంది గదా!

దాదాపు నూటయాభై ఏళ్ళ కిందట – – – వర్తమాన తరంగిణి అనే పత్రిక ఆంధ్రభాషకు సేవ చేయడానికి కొంత కృషి చేసిన మాట వాస్తవం. దాని సంపాదకుడు పువ్వాడ వెంకటరావు ఆ ఉన్న అవకాశంలోనే సి.పి. బ్రౌన్ పరిశోధనలకు తోడ్పడ్డాడు. పరిశోధనా వ్యాసంగం సాంప్రదాయిక సాహితీపరులకు కొత్త. పూర్వంవారు ఏమన్నారా, దానిని పునఃప్రచురించి జనులకు నూతన ఆలోచనావసరం వాటిల్లకుండా ఎట్లా ఎంత బాగా చేయడమా అనేదే కదా అప్పటికి (ఇప్పటికీ కూడా) చదువుకున్నవారి ప్రధాన వ్యాసంగం. కొత్త కృషిని కూడా పాతపద్ధతులలోనే కొనసాగించి, కొత్తదనాన్ని నశింపచేయడం మరొక వ్యాసంగం అయింది.

బ్రౌన్ శబ్దకోశాలు వెలయించాడు. కొన్ని పాతపుస్తకాలను కొత్త పద్ధతిలో వెలయించాడు. అదే కృషిని తర్వాత వారు కూడా కొనసాగించారు — ఏమైనా మెరుగు చేశారా? ఇన్ని ఏళ్ళయినా ఈ కాలానికి తగిన శబ్దకోశాలు వెలువడుతున్నాయా? శబ్దకోశాలు ఇటీవల

తయారైనవి కూడా, పాత పద్ధతివే కావడం చెప్పుకోదగ్గ విశేషం.

బ్రహ్మసమాజం ధర్మమా అని సాంఘిక సంస్కరణల కోసం పలువురిలో ఆసక్తి కలిగింది. సాంఘిక దురాచారాలను కొన్నింటిని మానుకోవలసిందిగా అంతకుముందు కూడా పత్రికలలో వ్యాసాలు వెలువడేవి. ఆడంబరాలు వద్దని వీటి సారాంశం. బ్రహ్మ సమాజం అంతకంటే ముందుకు వోయింది. ఆచార సంప్రదాయాల పేర నెలకొన్న అజ్ఞాన పిశాచాన్ని కొంతదూరమైనా తరిమి కొట్టడానికి పూనుకుంది. దీనికోసం బాగా ప్రచారం చేయ సమకట్టారు కానీ, భాషా సంప్రదాయాలు మార్చకుండా ప్రచార సరళిని ఎట్లా మెరుగు చేయగలుగుతారు? కందుకూరి వీరేశలింగం గారి శైలి ఆధునికమేనా? ఆయన ఆంగ్ల రచనలను తెలుగీకరించినంత మాత్రాన అది ఆధునికం అవుతుందా? ఏది ఏమైనా, భాష ఒకకొంత పల్చబడి, తెలుగు భాషా వినియోగదార్లకు కొంత పాపభీతిని తగ్గించింది.

భాషాసాంకర్యానికి ఎవ్వరూ ఏనాడూ వెరపు చూపలేదు. నూట యాభై ఏళ్ళ నాడు వెలువడిన తెలుగు పత్రికలలో వ్రాసిన భాష అతి నికృష్టమైన సంకరభాష. వాళ్ళకు సంపాదకుడు, విలేఖరి, వగైరా పదవులు కూడా తెలుగులో స్ఫురించలేదు. అది మహారాష్ట్ర నుంచి కొమర్రాజు వెంకట లక్ష్మణరావు తెచ్చి పెట్టినవి.

పానుగంటి లక్ష్మీనరసింహారావు గారు తెలుగు భాష పట్ల జనాలకు మోజు కల్పించాడు. అది వ్యావహారికం కాదు. దానిని ఆయనగారి వ్యావహారికం అందాం. ఆయన ఎవ్వరో ఇంగ్లీషు రచయితలను పోలి వ్రాసినాడని విన్నాను. కానీ అటువంటి శైలి ఇంగ్లీషులోనూ లేదు. ఆయన భాషకూ, భావానికీ సమైక్యం కుదిరి ప్రజలను అలరించగలిగింది. ఒక్కొక్క చోట జటిలభాష...... కానీ సుబోధకమే అయింది. ఒక వృద్ధుని ఒకప్పుడు అడిగాను, పానుగంటి వారి, సాక్షి, పత్రికలో వెలువడే కాలంలో ఆయన ఏమనుకునే వాడని. ఆయన ఒక పాకలో కూర్చునే వాడట, పది మంది అక్కడ పోగయ్యే వారట. ఆయన ఇక తంబూరాను ఎత్తి పట్టి నట్లు పత్రికను ఎత్తిపట్టి, సాక్షి శైలికి అనువుగా ఉదాత్తానుదాత్తాలతో గొంతులో కూర్చుకున్న నటనా కౌశలంతో చదువుతుంటే, జనం హాయిగా వినేవారట. పానుగంటికి సంక్రమించిన జనాదరణ మరెవ్వరికి ప్రాప్తించి ఉండదు. చదివే రీతిని బట్టి సాహిత్యం అర్థమవుతుంది. సాక్షిని నేటికి గూడా చదువుకోవచ్చు గదూ।

పానుగంటివారి సాక్షి వగైరాలు వెలువడక ముందే, పందొమ్మిదవ శతాబ్దం ముగిసేముందే, తెలుగు పత్రికలపైన ప్రభావం నెరపే వైఖరులను అవలంబించాయి. ఒక్కటి సుజనరంజని. దానిలోనే తెలుగు సాహిత్యానికి సంబంధించిన ఇతిహాసం కొద్దికొద్దిగా వెలువడ సాగింది. సాహిత్యానికి సంబంధించిన వివాదాలు కూడా దానిలో వెలువడేవి. మరొకటి శశిరేఖ - - - దానిలో కాంగ్రెసు సంస్థ వార్తలు వెలువరించేవారు. అంటే రాజకీయ వార్తలు - - - ఆ పత్రిక కాంగ్రెసు ప్రాదుర్భావంలో తలఎత్తినది. అంటే, సాహితీ వివాదాలు, సాహితీ ఇతిహాసం, రాజకీయ రచనలు ప్రారంభమైనవి. వేరే పత్రికలు ఉన్నప్పటికీ వీటి ప్రభావం ప్రస్ఫుటం. కొంచెం కొత్తదనం అప్పట్లో.

సాహిత్యానికి సంబంధించిన వివాదాలు బాగానే కొనసాగినాయి. నెల్లూరు నుంచి అముద్రిత గ్రంథ చింతామణి అనే పత్రిక వెలువడేది. దానిలో వివాదాలు బాగా నడిచేవి. వీటిని చదువుకొనగా కొమర్రాజు వెంకట లక్ష్మణరావుగారికి వ్యాకరణం క్షుణ్ణంగా అబ్బినదట. ఆ పత్రికలో మండపాక పార్వతీశ్వర శతావధాని సుదీర్ఘ వ్యాసాలు, లేఖలు, ఛందస్సులోనే వ్రాసేవాడు. అప్పట్లో అది ప్రజ్ఞ.

కాంగ్రెసు ఆవిర్భావం వలన సాంఘిక సంస్కరణలకు సంబంధించిన రచనలు కొత్త రూపం దాల్చాయి. రాజకీయ పరిస్థితి దేశానుకూలం అయితే సాంఘికమైన మార్పులు సుగమం అవుతవని అప్పట్లో ఆశించినట్లు కనపడుతుంది. ఆ ఆశ పేరాశ అని ఇప్పుడు బాగా తెలిసి వస్తున్నది కదూ। సంస్కారం లేనివారు సంస్కరణలు చేసుకోలేరు.

కృష్ణాపత్రికలో అనువాదాలుగానో, స్వతంత్ర రచనలుగానో, మొత్తానికి ఆర్థిక రాజకీయ పరిస్థితులపైన

ప్రబోధపూర్వక వ్యాసాలు వెలువడేవి. అప్పటికి బెంగాలు విభజన ధర్మమా అని ప్రజలు అలజడి చెంది ఉన్నారు. కృష్ణాపత్రిక రచనలు దేశభక్తులకు ప్రబోధం కలిగించాయి. అప్పటికి ఆ పత్రికా రచనలు కొంత అవసర చైతన్య కల్పనకు దారితీశాయి. ఒక ఒరవడి కూడా నెలకొన్నది.

ఆంధ్రపత్రికలో రచనలకు ఎక్కువ అవకాశం చిక్కింది.

దైనిక పత్రికగా, అది ఎక్కువ వార్తలు ఇవ్వగలగడం సహజమే. దైనిక వార్తలు అనేక విశేషాలకు తప్పక సంబంధించి ఉంటాయి కదా. కేవలం సాంప్రదాయిక సాహిత్య విశేషాలేకాక, ఆర్థిక, వైజ్ఞానికాది వివిధ వార్తలు కూడా వెలువడుతూ ఉంటాయి కదా, ఆ కాలంలో కాంగ్రెసువారు తమ విధానాలను, వైఖరులను వివరించే రచనలు చేసుకొనేవారు. వాటి అనువాదాలు వివిధ భాషల పత్రికలలో వెలువడినట్లే, ఆంధ్రపత్రికలోనూ వెలువడేవి. ఆంధ్రపత్రిక వారపత్రికలో కథలు వగైరాలతో పాటు, ప్రముఖుల వ్యాసాలు, వ్యాఖ్యలు కూడా వెలువడేవి కదా!

ఇదికాక, కొమర్రాజు వెంకట లక్ష్మణరావు ఐతిహాసిక వ్యాస రచనకు మంచి మలుపు ఇచ్చాడు. వివిధ శాస్త్రాలకు చెందిన వ్యాసాలు కూడా వెలువడసాగినాయి. సాధ్యమైనంత సహజమైన తెలుగులో రచనలు రూపొంది ఉండేవి. ఇప్పటిలాగా, అప్పట్లో జనాలకు తెలుగు కంటే ఇంగ్లీషే బాగా అర్థం అవుతుందనే మేధావులు ఉండే వారు కారు.

కొమర్రాజు వారి మూలంగా ఐతిహాసిక శాసనాలను గురించిన వ్యాసాలు కూడా పత్రికలకు ప్రచురణ యోగ్యాలైనాయి. పాఠకులకు ఇతిహాసం పట్ల ఆసక్తి వృద్ధి కాసాగింది. కాకపోతే, ఇతిహాసాన్ని కవుల రచనలతో పోల్చుకొని, కవుల పట్ల అభిమానం వలన, శాసనాల భాషను అపార్థం చేసుకోవడం కూడా కొంత జరిగింది. పూర్వకవుల అతిశయోక్తులను గుర్తించడానికి కొంతకాలం పట్టింది.

తెలుగు కవులు ఏమీ స్వతంత్రంగా వ్రాయలేదనీ, అనువాదాలు, అనుకరణలు, అతిశయోక్తులు చేసినారనీ త్రిలింగ పత్రికలో ధారావాహికంగా వ్యాసాలు వ్రాశాడు అక్కిరాజు ఉమాకాంతం.

భారతిలాంటి పత్రికలలో శబ్దచర్చలు తరుచు జరుగుతూ ఉండేవి. అనేక పాత శబ్దాల అర్థాలను గురించి దీపాల పిచ్చయ్యశాస్త్రి, వేటూరి ప్రభాకరశాస్త్రి ప్రభృతులు వ్యాసాలు వ్రాస్తూ ఉండేవారు. మల్లంపల్లి సోమశేఖరశర్మ ప్రభృతులు శాసనాలను గురించి వ్రాసేవారు. శర్మగారు శాసన సేకరణకోసం, శిల్ప సందర్శనంకోసం చేసిన "యాత్రలు" పఠనీయమైనవి. ఆయనే ఫోటోలు కూడా తీసి వ్యాసాలకు జోడించే వాడు.

ఎందరు ఏమి వ్రాసినా సాహిత్యం చాలా వరకు సాంప్రదాయిక మార్గంలాగే ఉండేది. అంటే పద్యాలు, గేయాలు, కథలు, నవలలు, సాహితీ వ్యాసాలు, సాహితీ శాపనార్థాలు లాంటివే.

తలిశెట్టి రామారావుగారి వ్యంగ్యచిత్రాల లాంటి రచనలూ వెలువడేవి. మచ్చుకు ఒకటి రెండు-

కొత్తపల్లి సూర్యారావుగారు ఉన్మాద సహస్రం అనే కావ్యం వ్రాశాడు. దానిని సమీక్షించిన గన్నవరపు సుబ్బరామయ్యగారు, కావ్యం బాగుందని శ్లాఘిస్తూ ఆ కావ్యరచనే వెయ్యిన్నొకటవ ఉన్మాదం అన్నాడు. పరశురామకవిగారి పద్యోపన్యాసం ధారావాహికగా భారతిలో వెలువడిన వచన రచన. అప్పటి ఛందోరుగ్మతపై ఇది మంచి నిదానం.

తెలుగువారికి హాస్యం, చమత్కారం తక్కువ. బువ్వనిషా అనుభవించేవారికి, హాస్యాలకు చమత్కారాలకు "సందు" తక్కువ. భమిడిపాటి కామేశ్వరరావుగారు ఈ కొరత తీర్చారు. ఇప్పటికీ ఆయన పల్లెటూరి బడి తనిఖీ తంతు, అద్దెకొంపలు, నామీదేనర్రోయ్, ఎన్నికల మజా వగైరాలు చాలా చాలా "ప్రస్తుతాలు" అనవచ్చు.

గోల్కొండ పత్రిక, ఒక నికృష్ట రాజకీయ వ్యవస్థను తట్టుకొని తెలుగు భాషను సేవించుకొన్నది. అది నిజంగా సాహసమే. గ్రాంథికం, వ్యావహారికం, అని కొట్లాడుకునేవారికి గోల్కొండ సంపాదకుడు సురవరం ప్రతాపరెడ్డిగారి శైలి కనువిప్పుగా ఉండాలి. పల్లెటూరి పెద్దలు హాయిగా గొప్ప విశేషాలను ముచ్చటించుకున్నట్లు ఆయన తన భాషను రూపొందించుకున్నాడు. భాషామర్యాదలు ఎరిగిన వ్యక్తి.

భాష మారుతూ ఉంటుంది. ఒరవడి ఒకటి ఉంటే, దానిని బట్టి అవసర మార్పులు చేసుకుంటూ ఉండవచ్చు.

ఇప్పటివరకూ సంప్రదాయ సాహిత్యం, ప్రబోధ రాజకీయ సాహిత్యం మటుకే ఈ వ్యాసంలో ప్రసక్తమయింది. ఇతిహాసం, ఆర్థిక శాస్త్రం సంగతి కూడా పేర్కొన్నప్పటికీ, అనేక ఇతర శాస్త్రీయ విశేషాలకు సంబంధించి పత్రికల ద్వారా వెలువడిన రచనల సంగతి వ్రాయలేదు. ఎక్కువలేదు. అందువలన వ్రాయలేదు.

కానీ, దైనిక పత్రికలలో పనిచేసేవారు శాస్త్రీయ విశేషాలను తరుచు వార్తలుగా వ్రాస్తూనే ఉన్నారు. వీటిని మినహాయిస్తే, ఏ శాస్త్రవేత్త కూడా శాస్త్రీయ పరిశోధనలపై విశేషాలపై వ్యాసాలు వ్రాయడం లేదు. వాళ్ళకు ఇంగ్లీషులో ఈ విశేషాలు వెలువడ్డే చాలు కదా! అందరూ వ్రాయలేరు. వ్రాసేవాళ్ళు నూటికి కోటికి ఉండవచ్చు. తెలుగులో వ్రాయడానికి అర్థజ్ఞానం ఉండాలి గదా!

శాస్త్రీయ విశేషాలపై వ్రాయడం అట్లా ఉంచండి. అందరం వినడానికి ఇచ్చగించే సంగీతాన్ని గురించైనా తగు వ్యాసాలు వెలువడుతున్నవా? ఎంతకూ నన్నయ్య ఇట్లా రమ్యంగా చెప్పాడు అనీ, తిక్కన అట్లా నాటకీయతతో వచించాడనీ, ఎర్రన ఇట్లా పూర్వకవి లాగా వ్యక్తం చేసినాడనీ తప్ప, వేరే విధమైన రచనలు చాలా తక్కువ. వ్యాకరణాలపైన బళ్ళ కొలదీ వ్యాసాలు దేనికో,

భాష వృద్ధి కావాలంటే, శాస్త్రీయ శబ్దాలు కూడా సాహిత్యంలో చోటు చేసుకోవాలి. మనకు శాస్త్ర పరిశోధన దూరం. ఆ శబ్దాలు, ఆ భావాలు, మన భాషలో మనవిగా చేరే అవకాశం ఎట్లా కలుగుతుంది? చివరకు పరిపాలనాపరిభాష కూడా మన భాషలోకి ఔరదా మరి!

ఇంతకూ -- పత్రికా రచయితలు తమకు చేతనైన ఆధునిక పరిభాషను ఉపయోగించడం తప్ప, సాహితీ రచయితలు మన భాషకు చేసిన సేవ శూన్యం ! ఏ వేటూరి శివరామశాస్త్రి లాంటి పండితుడో పూర్వీకులు వాడిన కొంత శాస్త్రీయ పరిభాషను ఉపయోగించి వ్యాసాలు వ్రాశాడు. స్వల్పమే. ఇట్లాగే గొబ్బూరి వెంకటానంద రాఘవరావు, వసంతరావు వెంకటరావు గార్ల వ్యాసాలు.

అసలు తెలుగు పత్రికలకు శాస్త్రీయ విశేషాలు వ్రాయడానికి తగు సిబ్బంది ఉన్నారా- అనేది పెద్ద ప్రశ్న. అందరూ రాజకీయాలకే అంకితులు - - - ఇదే సర్వ సాధారణం.

తెలుగు పత్రికలు చేసిన భాషాసేవ, ఆధునిక తెలుగు భాషావసరాలను తీర్చేది కాదు.

# తెలుగు పత్రికా రచన వికాసం

వాకాటి పాండురంగరావు
కల్చరల్ ఎడిటర్, న్యూస్‌టైమ్

"అయ్యో, ఏ దినపత్రిక చూచినా ఏమున్నది సంతోషకారణం? కాల్పులు, హత్యలు, ఆత్మహత్యలు, మానభంగాలు, సజీవ దహనాలు, అవినీతి . . . అబ్బబ్బ . . . ఈ దేశం ఏమయి పోతుందోనని భయం వేస్తుంది-" అన్నాడు రామమూర్తి చేతిలోని పత్రికనవతల పడేస్తూ .ఆయన మిత్రుడు సోమశేఖరం......." రామ్మూర్తీ! దేశం అను, సంఘం అను, అది పదేళ్ళకింద ఎలావుందో ఇప్పుడూ అలాగే వుంది. నువ్వు ఏకరవు పెట్టినజాబితా అంతా అప్పుడూవుండిందే. . . ఎటొచ్చీ అప్పుడిన్ని పత్రికలూ, విలేకరులూ లేరు. అంచేత మనకు తెలిసి ఏడిసేది కాదు. నువ్వు అనవసరంగా బెంగెట్టుకోకు" అని ఓదార్చాడు.

ఇది హాస్యంపు చెణుకే అయినా అందులో నిజం పాలు చాలానే వున్నది. ఆ నిజానిదే గత నాలుగు దశాబ్దాలలో తెలుగు దినపత్రికారంగ వికాసంలో పెద్దపీట.

వికాసం అంటే అభివృద్ధి; అభివృద్ధి అంకెలలో వుంటుంది, అంతరాత్మలోనూ వుంటుంది. ఆ రెండు కోణాలనుంచి చూస్తేగాని నలభైయేళ్ళల్లో మన దినపత్రికలు ఏయే రంగాలలో ఎన్నెన్ని అంగలు వేశాయో, అవన్నీ కూడా ముందుకేనా - అన్నది తేలదు.

ఆ ఉద్దేశంతోనే నలభై వత్సరాల కొండకిది నాలుగుపుటల అద్దం.

1950 ప్రాంతంలో మద్రాసులో కాలేజిలో చదువుకునే రోజుల్లో అక్కడి రిక్షాలాగే మనిషి కూడా బేడ (అనగా రెండు అణాలు, అంటే ఇప్పటి 12 పైసలు) పెట్టి ఒక తమిళ దినపత్రిక కొనుక్కుని, సవారీలు లేని క్షణాల్లో మధ్య మధ్య ఆ దినపత్రిక చదవడం చూచి నేను ఆశ్చర్యపడేవాడిని. ఆ రోజుల్లోనే ఏ గుంటూరో, విశాఖపట్నమో వెళ్ళాలని రైలెక్కి- ఒక దినపత్రిక కొనుక్కుంటే- నెల్లూరు దాటకముందునుంచే - "మాస్టారూ, ఒక్కసారి ఆ పత్రికనిస్తారూ" అనే ముష్టి ప్రారంభం అయ్యేది.కాని నేడు ఆ "సీను" ఎక్కడో కాని తటస్థపడదు. కాఫీ, టీలలాగే దినపత్రిక సామాన్యుడి సుప్రభాతగీతంలా ఒక ముఖ్య చరణం అయి కూచుంది. అది చాలా హర్షించవలసిన విషయం. అయితే మలయాళం, బెంగాలీ, తమిళం లాంటి భాషలతో పోలిస్తే మన దినపత్రికల అమ్మకాలు అంతగా పెరగలేదు. కాని సగటు తెలుగు మనిషి దినపత్రిక కొనడం, లేదా చదవడం, దానిలోని వార్తల గురించి చర్చించడం, ఆ వార్తలకు వ్యాఖ్యలకు స్పందించడం, లేఖలు రాయడం,- వంటివి శుభపరిణామాల కిందే పరిగణించాలి.

కేవలం గణాంకాలు మాత్రమే తీసుకున్నా గత దశాబ్దంలో మన దిన పత్రికల అమ్మకం గణనీయంగా పెరిగింది. 1976 * లో అన్ని తెలుగు దినపత్రికలూ కలిపి 2,16,000 ప్రతులు రోజూ అమ్మగా 1983 నాటికి 6,00,000 అమ్ముడయ్యాయి. అనగా మూడింతలు పెరిగాయన్నమాట, అయితే ఈ 76-83 మధ్య కేవలం పెరుగుదల తీసుకుంటే పంజాబీ, అస్సామీ దినపత్రికల తర్వాతే మనం వున్నాము అని గుర్తుంచుకోవాలి. లక్షకన్నా ఎక్కువ ప్రతులు అమ్మే దినపత్రికలు మనకు రెండు మూడింటికన్నా లేవు. అందుకు, అక్షరాస్యతస్థాయి, అలవాట్లు, డబ్బు ఖర్చు చేసే రీతులు వంటి అనేకానేక ఇతర కారణాలున్నాయి.

దినపత్రికల సంఖ్య ఎక్కువవడానికి ముఖ్యకారణం ఒకటివుంది. అది- "తమది" అన్న ఒక దృక్పథానికి

ప్రాధాన్యత ఇవ్వాలి అన్న తపన ఏర్పడి, ఆ తపనకు అర్థబలమూ, అంగబలమూ తోడవడం (అంటే దినపత్రికలు "ఏదయినా ఒక దృక్పథం పట్ల" బాహాటంగా నిలబడాలా, అన్ని దృక్పథాలకు తావునిచ్చే "రచ్చబండ"గా వుండాలా ?– అన్నది నేడు అడుగున పడిపోయిన ముఖ్యసూత్రం, దీనిని గురించి తరువాత మాట్లాడుకుందాం). ఇంకొక కారణం దినపత్రికలద్వారా సమాజంలో ప్రాచుర్యమూ ప్రాబల్యమూ వస్తాయి అన్నప్రోద్బలం.

ఎప్పుడయితే ఈ రెండూ కారణాలయ్యాయో అప్పుడు వ్యాపార, రాజకీయాలు వలెనే పత్రికారంగంలోనూ "పోటీ" మొదలయింది. భారీ మొత్తాల పెట్టుబడి పెట్టాక వాటిపై తగు లాభాలు రావాలని చూడడం సహజం. అంచేత దినపత్రికల అమ్మకం, ఆ అమ్మకపు సంఖ్యపై ఆధారపడి వచ్చే ప్రకటనలు ముఖ్యం అయ్యాయి. ఈలోగా ముద్రణకు సంబంధించిన సాంకేతిక పరిజ్ఞానం శరవేగంతో ముందడుగు వేసింది. అందుచేత, చేతనయినంతమేరకు ఆ పరిజ్ఞానాన్ని, లక్షలాది రూపాయలు వెచ్చించి అయినాసరే, వాడుకోవడం తప్పనిసరిఅయింది. దినపత్రికలలో రంగులతో ముద్రణ, ఒకే కేంద్రంలో పత్రికను తయారుచేసి నిమిషాలమీద వందలమైళ్ళవతలవుండే నగరాలకు దాని ప్రతిబింబాలను పంపగల "ఫాసిమిలి" విధానం అమలు, ముద్రణ నాణ్యతలో ముందడుగు– వంటి శుభ పరిణామాలు గత అయిదారేళ్ళలో కలిగాయి.

దీనికి అనుగుణంగానే – "వార్తలు–ఫోటోలు–శీర్షికలు–" వీటి సమాహారాన్ని సర్వాంగ సుందరంగా తీర్చిదిద్దాలి, ఇచ్చే వార్తను అందంగా కనపడేలా అమర్చాలి, అనే కొత్త జిజ్ఞాస ఉదయించింది. ఈ మంచి పరిణామం వలన దినపత్రికలు పంచాంగాల్లా వుండడం మానేసి పంచరంగుల చిలకల్లా వుంటున్నాయి. పశ్యేమ శరదశ్శతమ్!

ఇవన్నీ కూడా దినపత్రికల "ఆకార" విషయాలు. కాని ఇంతకన్న గొప్ప అభివృద్ధి దినపత్రికల చక్షువులు రాష్ట్రంలోని మారుమూలల్లోకి ప్రసరించడం. అంటే ఇంతకుముందు పి.టి.ఐ (ప్రెస్ ట్రస్ట్ ఆఫిండియా), యు.ఎన్.ఐ (యునైటెడ్ న్యూస్ఆఫిండియా) వంటి వార్తాసంస్థలు, జిల్లా కేంద్రాలలో స్వంత విలేకరులు – వీటిమీద మాత్రమే ఆధారపడిన పత్రికలిప్పుడు మారుమూల గ్రామాలలో తమ తమ విలేకరులను నియమించుకుంటున్నాయి. ఇది మహత్తర పరిణామం. దీని వలన ఆ కుగ్రామాలలో జరిగే అత్యాయాలు, అక్కడి నోరులేని వర్గాల కష్టాలు– "ఏమిటీ ఈ అన్యాయం?" అని అడిగేవారి ముందరకు, ఏలినవారి ముందరకు కుప్పతిప్పలుగా వచ్చి పడుతున్నాయి. న్యాయం జరిగినా జరగకపోయినా "ఇంత అన్యాయం జరుగుతోంది" అన్న కఠోర సత్యం సమాజం వాకిలి ముందర కన్నీటి ముగ్గుగా పరచుకుంటూంది. ఏదో మారుమూలకదా అని ఏ రాజకీయ నాయకుడో, పోలీసు అధికారో మరొకరో అవాకులు పలికితే మరుసటి ఉదయం అది వార్తగా వసుధ ఎదుట వాలుతున్నది. ఆ కారణంగా పత్రికలు దుశ్శాసనుల పాలిటి సింహస్వప్నాలుగా మారాయి. ప్రజాస్వామ్యానికి పత్రికలు ప్రాణప్రదాలు అన్న సత్యం అనునిత్యం రుజువు అవుతున్నది. ఆ విధంగా పత్రికలు సమాజ కల్యాణానికి పౌరోహిత్యం వహిస్తున్నాయి.

ఒక దశాబ్దం కిందవరకు దినపత్రిక అంటే "వార్తలు మరియు వ్యాఖ్యలు" అన్న పరిమిత భాష్యం వుండేది. కాని నేడది పా.చిం.పచ్చడి! పిల్లలు, స్త్రీలు, యువజనులు–వారికి ఆసక్తి కల్గించే విషయాలు, వైజ్ఞానిక రచనలు, వినిమయదారులు, వ్యాపారులు వంటి ప్రత్యేక వర్గాల వారి అవసరాలకనుగుణమయిన వ్యాసాలు– ఇవన్నీకాక నవలలు, కార్టూనులు, వాక్టూనులు (లేదా కార్టూన్ కవితలు)– ఇట్లా దినపత్రిక షడ్రసోపేతంగా అలరారుతూంది. ఆదివారం సంచికలు అభిసారికలై అంగడి ముందర వేలాడుతున్నాయి. పోటీకారణంగా ప్రతి పత్రిక, ప్రతి దినం కదనరంగంలో సైనికుడిలా అప్రమత్తంగా వుంటూంది. దానితో పాఠకుడికి ఇప్పుడు అభిరుచినిబట్టి ఎంపిక చేసుకోవడానికి ఎన్నో పత్రికలుంటున్నాయి. సంఖ్యలో, సాంకేతిక పరిజ్ఞానపు వాడకంలో, అందంలో, హంగుల్లో శీర్షికల వైవిధ్యంలో,

విస్తృతంగా వార్తలు సేకరించడంలో వాటిని త్వరితంగా అందించడంలో– మన దినపత్రికలు సాధించిన అభివృద్ధి నిజంగా గర్వకారణమే!

వీటన్నిటికన్నా మనం తలఎత్తి నిలబడేలా– పత్రికలు కృషి చేస్తున్నరంగం ఒకటి వుంది. అది ఎంతటి వారినయినా, ఎంతటి ఇబ్బందికరమయిన ప్రశ్నలనయినా అడిగి–రచ్చకీడ్చి, రట్టుచేసి ప్రజాభిప్రాయం అన్న న్యాయస్థానం ముందర వారిని హాజరుపరచడం। సత్యం అన్నది పరమావధి అయినప్పుడు దాని అజేయమయిన శక్తి, ఆ సత్యం పక్కన నిలబడినవారిని ఆవహిస్తుంది. అది పత్రికలద్వారా ప్రత్యక్షమయినప్పుడు సత్యం విజయము, సమాజం అభ్యుదయమూ కలిసి సాక్షాత్కరిస్తాయి. అటువంటి సన్నివేశాలు అరుదుగానే వచ్చినప్పటికీ అవే జాతి మనుగడకు ప్రాణవాయువుల నిక్షేపాలు. అందుకు ఒక్క ఉదాహరణ చాలు.

1984లో అధిక సంఖ్యాకుల మద్దతు వున్నప్పటికీ, ఆంధ్రప్రదేశ్‌లో బాహాటంగా అన్యాయానికి పాల్పడి, ఎన్.టి.రామారావు ప్రభుత్వాన్ని కూలగొట్టినప్పుడు – ఆ కురు సంతానంమీద ప్రజలు ప్రకటించిన ఆగ్రహాన్ని అక్షర తూణీరాలుగా, మాటల తూటాలుగా మార్చి–యుద్ధం చేశాయి పత్రికలు! అసత్యం అపత్యం అయింది; అబద్ధం మరణించింది. నిజం గెలిచింది. ఇక్కడ గుర్తుంచుకోవలసినది వ్యక్తులను కాదు, సత్యాన్ని, ఆ ధర్మయుద్ధంలో ధనంజయులయి నిలిచిన పత్రికలను!

అందువలననే పత్రికలెప్పుడూ ప్రభుత్వాలకు పక్కలో బల్లెంలా వుంటాయి. అందుకనే పత్రికల పేరు చెబితేచాలు పదవులలో వున్నవారు కస్సుబుస్సుమంటుంటారు. ఈ "వైరం" అట్లా వుంటేనే సమాజానికి వరం. అట్లాకాకుండా పత్రికలూ ప్రభుత్వాలూ "భాయీ–భాయీ" అయితే నిజానికి నుయ్యి, సమాజానికి గొయ్యి శరణ్యం అవుతాయి. అధికారంలో వున్నవారికి సహజంగా నోరు ఎక్కువగా పనిచేస్తుంది; కళ్ళు, చెవులు మూసుకుపోతాయి. ఆ కళ్ళకు, చెవులకు శస్త్ర చికిత్స చేసి తెరిపించడం, ఆ నోటిని కుట్టడం పత్రికల మొదటి పని. కనుకనే అన్నింటా సర్కారు వారి పంక్తిని కూచునే పత్రికలన్నా, పత్రికల వారిని ప్రతిరోజూ మెచ్చుకునే ప్రభుత్వం అన్నా– ఒ కంట కనిపెట్టి వుండాలి. పత్రిక అనే నాణెపు "బొమ్మ" ను చూశాము. ఇప్పుడిక "బొరుసు"ను చూద్దాము.

మన దేశానికి స్వాతంత్ర్యానికి రాక పూర్వం, స్వాతంత్ర్యానంతరం అని రెండు యుగాలుగా భాగించుకుంటే స్థూలంగా కొన్ని నిజాలు కనబడతాయి. అవి అప్రియాలే అయినా సత్యాలు మరి।

పూర్వయుగంలో దేశభక్తుడయిన పాత్రికేయుడు ప్రధాన పాత్రధారి అయితే ఇప్పుడు యజమాని అయిన పాత్రికేయుడు ఆ స్థానంలో వున్నాడు (అంటే యజమాని అయినంత మాత్రాన దేశభక్తి వుండదని తాత్పర్యంకాదు., "యజమాని–పాత్రికేయుడు" అన్న సంయుక్త నామంలో "పాత్రికేయుడు" అంటే పత్రికా రచనా రంగానికి సంబంధించిన వాడు– అని చెప్పుకోవలసి వుంటుంది).

దినపత్రిక స్థాపన, నిర్వహణలకు కోట్లాది రూపాయలు పెట్టుబడి అవసరం అయినప్పుడు ఆ నిధులను సమకూర్చుకోగలవాడే దానికి సర్వం సహాధికారి కావడంలో ఆశ్చర్యం ఏమీలేదు, అవగుణం అంతకన్నాలేదు. కేవలం పత్రికా రచనా సామర్థ్యం వున్నవారు బ్రతుకుతెరువుకోసం జీతగాళ్ళుగా రూపొందడమూ సహజ పరిణామమే। రచనా సామర్థ్యమూ, ప్రజ్ఞాపాటవాలూవున్న ఒకరిద్దరు యజమానులయిన సంపాదకులంటూ వుంటే వారినలా వుంచి మనం ఆలోచన అన్న ఆకురాయిమీద ఒరిపిడి పెట్టవలసిన ముఖ్య విషయం ఒకటి వున్నది.

ఒక యజమాని, సమర్థుడయిన పత్రికా రచయిత తన దగ్గర వున్నప్పుడు అతగాడి వృత్తి విద్యా కౌశల్యానికి ఏపాటి గౌరవము, స్వేచ్ఛ ఇస్తున్నాడు అన్నది ఒక తూకపురాయి కాగా– బ్రతుకు తెరువు బరువులో అంతర్లీనమైన భయము, బాధ్యత అలా వుండగా కూడా తానా వృత్తిపరంగా ఎంతవరకు తలెత్తినిలబడి పత్రికా రచన అన్న తపోవనంలో తాపసివలె, విలువలకు, ధర్మానికి కట్టుబడి వుండగల్గుతున్నాడు అన్నది రెండవ తూకపురాయి అవుతోంది. ఆ సమతూకం సిద్ధించినప్పుడే–ఒక ఖాసా

సుబ్బారావు, ఒక చింతామణి, ఒక ఫ్రాంక్ మోరేస్, ఒక వీరేశలింగం ఉదయిస్తారు.

నేటి తెలుగు దిన పత్రికాకాశంలో అటువంటి అవకాశాలు వున్నాయి అనగల్గినవాడు చాలగొప్ప ఆశావాది! ఆ వ్యక్తికి నాజోహార్లు!

పత్రికా రచనకు సంబంధించి ఆంగ్లంలో ఒక సూక్తి వుంది- "యథార్థం అన్నది పవిత్రం; భాష్యం అన్నది వైయక్తికం" అని . . . అందుకనే వార్తలువేరు., వ్యాఖ్యలు వేరు. జరిగినది వేరు; దానిమీద పత్రికా రచయితగా నా అభిప్రాయం వేరు. ఈ సరిహద్దు చెరిగినప్పుడు, నా అభిప్రాయం వార్తగా చలామణీ చేయడానికి పత్రికా రచయితగా నేను యత్నిస్తాను. అక్కడ సత్యాసత్యాల మధ్య వ్యత్యాసం లుప్తమయి పాత్రికేయ నిరంకుశత్వం నిలబడుతుంది.

కుత్తుకలు తప్ప కూరగాయలు తరగననే కత్తి ఎంత ప్రమాదకరమో-కాలకూటం తప్ప తాగేనీరు నా ద్వారా, రానివ్వను- అనే కుళాయి ఎంత ప్రమాదకరమో-
వార్తను వ్యాఖ్యను కలిపిన గరళం అంతకన్న ప్రమాదకరం; హేయపాత్రం.

దురదృష్టవశాత్తు పత్రికల కలాలు, గళాలు ఈ విచక్షణను కోల్పోయి- "నేను మెచ్చిన వాడి మొహం మీద మొటిమ గారాల చందమామ., నాకు నచ్చని చంద్రబింబం నీలాకాశంమీద బొల్లిమచ్చ" అన్న చందాన వార్తలు ఇవ్వడంలో, వాటికి శీర్షికలుంచడంలో పక్షపాతం చూపడం ఈ దశాబ్దపు అనారోగ్య లక్షణాలలో మొదటిది.

"సంపాదకీయం","అభిప్రాయవ్యాసం"," సంపాద కుడికి ఉత్తరాలు"- "ఇవన్నీ కలిపి దినపత్రికలలో ఒక పుటలో వేస్తారు; ఆ పుటలో వార్తలుండవు; అన్నీ అభిప్రాయాలే వుంటాయి. అన్నిరకాల అభిప్రాయాలూ వుండాలి. అవన్నీ చదివి పాఠకుడు తనకుతానై మంచిచెడ్డలు తేల్చుకోవాలిఅన్నది ప్రధాన ఉద్దేశం. అందుకనే ఆ పుటను "అభిప్రాయాల పుట" (Opinion Page) అని అభివర్ణిస్తారు. కాని నేటి దిన పత్రికలలో ఇంచుమించు అన్ని పుటలూ అభిప్రాయాల పుటలుగా కనపడడం అరుదు కాదు.

ఆ కారణంగా ఒక పత్రిక కొవ్వొత్తిని సూర్యుడిగా స్తుతిస్తుంది. ఇంకొక పత్రిక సూర్యుడిని కొలిమిగా తూలనాడుతుంది. ఏది నిజమో తెలియక ప్రజలు అయోమయంలో పడి విచక్షణ కోల్పోతారు. నిజాన్ని గుర్తించే శక్తికి దూరం అవుతారు. క్రమంగా అటువంటి సమాజం తనకు కావలసినదేదీ తెలుసుకోలేక చీకటిలో పడిపోతుంది. ఆ పతనానికి పత్రికలు కారణం కావడం కన్నా బాధాకరమైన విషయం ఏమున్నది?

"The Distident Press" అన్న తన పరిశోధనాత్మకమైన పుస్తకంలో లారెన్ కెస్లర్ "పత్రికలు రచ్చబండలవలె వుండాలి. అక్కడ అన్నిరకాల అభిప్రాయాలకు సమానావకాశా లుండాలి" అంటాడు. అట్లా అవకాశం లేని కారణంగానే సమాజంలో విభేదాలు ఎన్నివున్నాయో అవన్నీ ప్రాతిపదికలుగా పత్రికలు బయలుదేరుతున్నాయి. ఇది సుక్షేత్రమయిన మాగాణిలో కలుపు మొక్కలు పుట్టడంలాటిది.

పత్రిక యాజమాన్యం వ్యక్తిగత విలువలకు భిన్నమయిన అభిప్రాయంకాని వార్తగాని వస్తే దానికి ఎదురయ్యే ఆటంకాలు మూడురకాలు అని లారెన్ కెస్లర్ వర్గీకరించాడు. అవి-

1. సమాజంలోని ఆ (తమకు సరిపడని) వర్గంవారి ఊసే తమ పత్రికలో రాకుండా నిషేధించడం.
2.అటువంటి వర్గంవారి ఆశయాలు, ప్రణాళికలు, కార్యక్రమాలు- వీటిని గురించి విస్మరించడం; అయితే వారు జరిపే ధర్నాలు, ఘెరావోలు, ప్రదర్శనలు మొదలయినవాటి వార్తలుమాత్రంవేయడం.
3.ఆ వర్గం వారి గురించి ఏమి వేసినా, హేళన, ఎద్దేవా, ఎత్తిపొడుపులతో వేయడం; వారితో చర్చకుగాని, వివరణలకుగాని చోటివ్వకపోవడం

ఇంచుమించుగా మన దినపత్రికలన్నిటా ఈ రాగద్వేషాల నీడలు ప్రసరించడం, ఆయా సందర్భాలలో దెబ్బతిన్న వర్గం ధ్వజమెత్తడం, అదే తమ వర్గం వారా

పనిని చేసినప్పుడు మురిసిపోవడం- జరుగుతున్నది. త్రాసుముల్లు శాశ్వతంగా ఒక సిబ్బివైపువాలివున్నప్పుడు ఆ త్రాసు సాయంతో జరిగే వ్యాపారంలో న్యాయం ఏమాత్రం వుంటుంది!

ఇకపాత్రికేయులెట్లా వున్నారో చూద్దాం.

-"దీపం వెలుగునివ్వాలిఅంటే అది తాను వెలుగుతూ వుండాలి-" అన్న రవీంద్రుడి సూక్తి పత్రికా రచయితలకు మరింతగా వర్తిస్తుంది. కనీసం ఆంగ్లం, తెలుగుభాషలలో చెప్పుకోదగిన ప్రవేశం, విస్తృతంగా గ్రంథపఠనం, వివిధరంగాల . పారిభాషిక పదావళితో పరిచయం, తెలియని విషయాలమీద ఏదన్నా వివరం కావలసినప్పుడు అదెక్కడ లభ్యం అవుతుందోనన్న జ్ఞానం, బాధ్యత, శీలం, జ్ఞానతృష్ణ- ఇవి కనీస అవసరాలు. నేటి దినపత్రికలలోని వివిధస్థాయి పత్రికా రచయితలలో సగానికి సగంమందిలో ఈ లక్షణాలు అంత స్పష్టంగా కనపడవు అనడం అతిశయోక్తి కాదేమో!

పత్రికా రచన వృత్తిగా స్వీకరించిన వాడికి-"యాజమాన్యంలో ఎవరికయినా తుమ్మొస్తే తన ముక్కు వూడిపోతుందేమో"నన్న భయంతో నిండిన వాతావరణం, ఏదన్నా ఒకరంగంలో కృషి చేద్దాం అంటే అందుకుతగిన గ్రంథాలయం, ఆర్థిక ప్రోత్సాహం వంటివి లేకపోవడం, వృత్తిపరంగా నిష్కల్మషంగా ఒకచోటచేరి చర్చించుకొని కొత్తవి నేర్చుకుని పెరిగే అవకాశాల లేమి, వార్తలు "రాసే" లేదా "కత్తిరించి అతికించే" పాత్రికేయ-గుమాస్తాల కన్నా ఎక్కువ హెూదా, గౌరవం, వేతనం, ఉద్యోగ భద్రత లేకపోవడం-ఇవన్నీ కలిసి ఈ రంగంలోని నేటి యువతరంలో ఒకరకమయిన స్తబ్ధత, నిరాశ, నిస్పృహాలకు దారితీస్తుండడం-పత్రికా రచయితలు బయటకు చెప్పలేని చేదు నిజాలు.

అటు దారిచూపే వారూ లేక, ఇటు స్వంతంగా ఉత్సాహమూ లేక "చెప్పింది చేయడం" అలవాటయిన పత్రికా రచయితల వృత్తి కౌశల్య దారిద్ర్యం నేటి వార్తాపత్రికలలో రోజూ కనపడుతూనే ఉంటుంది. మచ్చుకు కొన్నిచూద్దామా?

అది "అన్నప్రాశనమా", "అన్నప్రాశ"యా లేక "అన్నప్రాసా"?- మూడు పుటలలో ఒకే శబ్దాన్ని మూడు విధాలుగా అచ్చువేసినదొక పత్రికయితే 'Plant Engineer' అన్న ఉద్యోగాన్ని "మొక్కల ఇంజనీరు"గా మార్చింది ఇంకొకటి.

తెలుగు పదాలకే కరువేర్పడినట్లుగా, శీర్షికలలో "ఫస్టు, బెస్టు", లాటి ఆంగ్ల పదాలతో ప్రాసక్రీడలాడడం, "దొంగ దొరికిపోయాడోచ్" లాటి పేలవము, శైశవ సూచమూ అయిన శీర్షికలు పెట్టి, ఆ అపరిపక్వతను ప్రజలభాషగా వర్ణించడానికి ఆత్మవంచన అన్న వర్ణనే సరిపోతుంది!

సుప్రసిద్ధ సినిమానటుడు రాజ్‌కపూర్ కుటుంబ సభ్యులందరూ వున్న ఫోటోవేసి, అందులో రాజ్‌కపూర్‌ను, అతడి పిల్లలను పేర్కొని, అసలా వంశానికి మూలపురుషుడు, గొప్పనటుడు అయిన పృథ్వీరాజ్‌కపూర్ ఫోటోలో వున్నా, అతడిని పేర్కొనకపోవడాన్ని "పగలే చీకటి"గా పేర్కొనవచ్చునేమో!

"అసలు ఆ సభకు విలేకరులెవ్వరూ హాజరుకాలేదు" అంటూ తమ విలేకరి సభ జరిగిన నాలుగు రోజులయ్యాక ఇంట్లో కూచుని రాసిన **కల్పితగాథను** వార్తగా వేసిన పత్రికనేమనాలి?

మరో అంశం వుంది. ప్రతి వార్తను జనానికి **భీతి** లేదా జుగుప్స కలిగేలా గోరంతలు కొండంతలు చేసి రాయడం, "అదుగో పులి" మనస్తత్వానికి నిదర్శనం. ఆంగ్లంలోనయితే దీన్ని sensationalization అంటారు; దానితోబాటు అసభ్యత (vulgarization) కూడా జోడయితే అంతకన్న జబ్బుండదు. హైదరాబాదులోని ఒక అమ్మాయిల కాలేజి హాస్టల్‌లోకి అర్ధరాత్రివేళ తాగిన జులాయి వ్యక్తులు వచ్చి ఆమెను కత్తితో పొడిచి, బలాత్కరించబోతే ఆమె వారినెదుర్కొని బయటపడినప్పుడు - ఏకంగా ఆ హాస్టలులోని బాలికలనందరినీ అవమానపరిచేలా రాసిన ప్రతికలమూ బూతుసిరాలో ముంచి రాసినదే!

చార్మినార్‌మీద నుండి దారిద్రపీడితులయిన నల్గురు సోదరీమణులొక్కొక్కమ్మడిగా కిందకు దూకి ఆత్మహత్య చేసుకుంటే– ఆ మరురోజు పత్రికలో– "ఆమె ఆ ఎత్తునుండి ఆఖరిసారిగా చూచింది, ఆ కళ్ళల్లో ఎన్ని ఆశలు, ఎన్ని నిరాశలు, నిండిపొంగాయో। ఆమె సోదరీమణులవైపు ప్రేమగా అఖరుసారి చూచింది" అంటూ కవిత్వం స్రవించిన పాత్రికేయుడు ఉమ్మెత్తకాయలు తిని వుండాలి! ఇట్లాటి కుహనా సానుభూతి స్రావాలు సినీ గ్లిసరిన్ బాష్పాలకు అక్షర రూపాలు.

ఇక పరిశోధనాత్మక పత్రికారచన మనకింకా అలవడనేలేదు; చేతనయినంత దుమ్ము ఎవడినెత్తినో మొదటిపుటలో పోసి తాటికాయలు అమ్మడం, వాడు రుజువులతో సహా మనం రాసింది తప్పని రుజువు చేస్తే అయిదోపుటలో మారుమూల ఉసిరికాయలు రాల్చడం– ఈ పరిధిని వదలిఎదగలేదు మన పరిశోధనా వ్యాసంగం!

అంటే సమాజానికి "ఆంటినా" లవలె ఎత్తుగా నిలబడి, ఈనాటి అయోమయానికి ఆకర్షణల వలయానికి ఆవల ఉండి, తాము పంకం మధ్య పంకజాల వికసించవలసిన పత్రికలు ఇంకా ఎదగవలసిన ఎత్తులు ఉన్నాయి అవి స్పష్టం.

పత్రికలూ, వాటిలో పనిచేసేవారూ కూడా సమాజంలోని భాగాలే కనుక సమకాలీన పరిస్థితుల ప్రభావాలకు అతీతంగా వుండడం సుసాధ్యంకాదు. అట్లాగే ఆదర్శప్రాయమైన పరిస్థితులు లేనందున ఆదర్శప్రాయమైన పత్రికా రచన కనపడడం కష్టం అని సరిపెట్టుకోవచ్చును.

అయినా రేపు ఇవాళ కన్న బాగుండాలిఅనీ, రేపటి మన సమాజం ఇవాళ్టి దానికన్న నిండుగా సుఖంగా వుండాలిఅనీ– మన మందరమూ కోరడం సహజం కనుక మన పత్రికలూ ఇప్పటికన్న పరిపూర్ణంగా వుండాలిఅని ఆశించడమూ సహజమే।

ఆవేశాలకు తావివ్వని ఆత్మపరిశీలనకన్న అభివృద్ధికి రాజమార్గం వుండబోదు.

అనేక అంశాలలో ఆరోగ్యము, బలమూ, సత్ సంప్రదాయమూ కలిగిన మన తెలుగు పత్రికలు, బలహీనమయిన అంశాలను నిర్భయంగా ఎదుర్కొని, వాటిని నిర్జించి– "నానాటికీ క్లిష్టతరం అవుతున్న ప్రపంచాన్ని తాము అర్థం చేసుకుని, అందులో జీవించడానికి వలసిన సమాచారాన్ని, మార్గ నిర్దేశనాన్ని పత్రికలు ఇవ్వాలిఅని నేటి పాఠకులు ఎదురు చూస్తున్నారు–" (1979లో అమెరికాలో రూత్ క్లార్క్ నిర్వహించిన అభిప్రాయసేకరణ– పుస్తకంలోని సూచన). ఆగురుపీఠాన్ని తెలుగు పత్రికలు అధిష్ఠించాలి

ఆ కోరిక మనందరిదీను!

బుడ్డిగ సుబ్బరాయన్
పూర్వ కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ
హైదరాబాదు.

# విద్యాసాంస్కృతిక రంగాల్లో తెలుగు బాలల పురోభివృద్ధి: బాలల అకాడమీ పాత్ర

## నాందీప్రస్తావన

పిల్లలున్నచోటు కంటే వేరే స్వర్గం లేదని అన్నారు. పిల్లల్ని పువ్వులతో పోల్చారు. వారిని క్రమశిక్షణలో పెంచకపోతే అది నరకమే అన్నాడు స్విన్‌బర్గ్. మొక్కయి వంగనిది మ్రానై వంగునా అన్న సూక్తిని దృష్టిలో ఉంచుకుని- "కేచ్ దెమ్ యంగ్" అంటూ లేత వయస్సులోనే వారిలో జాతీయభావం, త్యాగబుద్ధి, భూతదయ, సత్ప్రవర్తన, మనోనిబ్బరం నైతిక విలువల పట్ల గౌరవభావం, క్రియాశీల కార్యక్రమాల పట్ల ఆసక్తి, పని విలువ అంటే డిగ్నిటీ ఆఫ్ లేబర్, ఆత్మవిశ్వాసం, ధైర్యసాహసాలు, స్వావలంబన, కార్యదీక్ష, నాయకత్వ, సామర్థ్య లక్షణాలను ఇనుమడింప చేసి బాలబాలికలను ఉత్తమ పౌరులుగాను ఒక యువశక్తిగాను పిల్లల్ని తీర్చిదిద్దడానికి ప్రపంచమంతటా నేటి సభ్య సమాజం అనేక కార్యక్రమాలకు రూపకల్పన చేసి చేపట్టి అమలు చేస్తున్నది.

## రష్యాలో యంగ్ పయనీర్స్ క్యాంప్స్

మాటవరుసకు రష్యా విప్లవం జరిగిన తొలిసమయంలోనే ఆ దేశం అధినేత లెనిన్ శ్రద్ధాసక్తులతో పిల్లల ఇతోధికాభివృద్ధికి "యంగ్ పయనీర్స్ కాంప్స్" అనబడే బాల శిబిరాలను దేశం నాలుగు మూలల్లోనూ స్థాపనకు కారకుడయ్యాడు. ఇప్పుడు ఆ దేశంలో ఏభయివేల పైగా బాల శిబిరాలు పిల్లల సర్వతోముఖాభివృద్ధికి అనువయిన వసతులలో పని చేస్తున్నాయి. అట్టి వాటిలో ముఖ్యమయినది నల్ల సముద్రతీరమున క్రిమియాలో ఉన్న "ఆర్టెక్" శిబిరం ఒకటి. మన దేశం నుండి ప్రతి ఏడాదీ ఒక బాలల బృందం ఈ ఆర్టెక్ శిబిరంలో కొన్నాళ్లు గడుపుతూ ఉంటుంది.

ఇలాగే చైనా, హంగేరీ, చెకోస్లోవేకియా, బల్గేరియా మున్నగు దేశాల్లో పిల్లల సంక్షేమం పట్ల పటిష్ఠమయిన ఏర్పాట్లు చేశారు. అమెరికాలో 4-ఎచ్ క్లబ్బులు- యునైటెడ్ స్టేట్సులో బోయ్స్ క్లబ్స్ ఆఫ్ అమెరికా, ఫ్యూచెర్ ఫార్మర్స్ ఆఫ్ అమెరికా, గర్ల్ క్లబ్ ఆఫ్ అమెరికా, 4-ఎచ్.హెడ్, హార్ట్, హేండ్, హెల్త్ క్లబ్బులు, ఇల్లా ఎన్నో వ్యవస్థాగత ఏర్పాట్లున్నాయి.

ఇందులో 4-ఎచ్ క్లబ్బులు చెప్పుకోతగ్గవ్యవస్థ. వీటి ధ్యేయమేమంటే...

నా మేధస్సును స్పష్టమైన, స్వచ్ఛమైన ఆలోచనలతో నింపి

నా హృదయంలో ఔదార్యానికి, ఆత్మవిశ్వాసానికి చోటుయిచ్చి

నా చేతులను సమాజ సేవకు, ఉత్తమ కార్యాలకు అప్పగించి

నా ఆరోగ్యాన్ని, శక్తిని ఉత్తమ జీవనానికి వినియోగించి

నా ఉద్యమానికి, నా సంఘానికి, నా రాష్ట్రానికి, నా దేశానికి

అంకితం చేస్తాను అనే ప్రతిజ్ఞ తీసికొని 4-ఎచ్ క్లబ్బులు పని చేస్తున్నాయి.

మనదేశంలో చిరువయస్సులో ఉన్న బాలబాలికలకు ఇటువంటి పాఠ్యశాలేతర కార్యక్రమాలు బహు తక్కువ. అయినా అవి పట్టణప్రాంతాలకే పరిమితం. గ్రామీణప్రాంతాల్లో మరీ తక్కువ. పాఠశాలల్లో బాలభట శిక్షణ స్కౌట్స్, మగ పిల్లలకూ, గైడ్స్ ఆడపిల్లలకూ, నేషనల్ కేడెట్ కోర్, ఆక్జిలరీ కేడెట్ కోర్ వంటివి కొద్దిమంది పిల్లలకే అందుబాటులో ఉన్నాయి. జవహర్ బాలభవన్ వ్యవస్థ

దేశం అంతటా వ్యాపించింది. మన రాష్ట్రంలో ఈ వ్యవస్థ 1966లో నెలకొని ప్రస్తుతం రాష్ట్రంలో అక్కడక్కడ దాదాపు ముప్పయి కేంద్రాలద్వారా అందుబాటులో ఉంది.

## ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ: బాలల సర్వతోముఖాభివృద్ధి:

ఈ నేపథ్యంలో దాదాపు పన్నెండు ఏళ్ల క్రింద (1975)లో మన రాష్ట్ర ప్రభుత్వం రాష్ట్రంలోని పిల్లల సర్వతోముఖ సంక్షేమానికి ఒక యోచన చేసింది. పదిహేను ఏళ్లలోపు పిల్లల మనోవికాసానికి విజ్ఞానంతోబాటు వినోదాన్ని అందిస్తూ వారిలో అణిగిమణిగి ఉన్న సృజనాత్మక శక్తులను వెలికితీసి బాలబాలికల సర్వతోముఖాభివృద్ధికి అనువగు దోహదాలను సమకూర్చేందులకై రాష్ట్ర ప్రభుత్వం 1976లో ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ అనే రాష్ట్రస్థాయి సంస్థలను వ్యవస్థాపించింది. మార్చి 4, 1976వ తేదీన విద్యాశాఖ జి.వో.నెం.27 విడుదల చేసిన తరువాత ఆ ఏడు సెప్టెంబరు 14-9-1976లో రాష్ట్రపతి ఫక్రుద్దీన్ అలీ అహ్మద్ ప్రారంభోత్సవం చేయడంతో పని పుంజుకుంది. ఈ సంస్థ బాలబాలికల్లో సృజనాత్మక, సాహిత్య, సాంస్కృతిక ప్రతిభాపాటవాలను తగు కార్యక్రమాల ద్వారా ఇనుమడింపచేసి ప్రోత్సహించడం ఒక ధ్యేయం. ఈ లక్ష్యసాధనకు లోబడి 1976 నవంబరు 14 బాలల దినోత్సవం జవహర్‌లాల్ నెహ్రూ జన్మ దినోత్సవంనాడు రాష్ట్రమంతటా సాంస్కృతిక ప్రతిభ,పాటవ పోటీలు నిర్వహించడానికి ప్రారంభోత్సవం జరిగింది. నాటికలు, నృత్యనాటిక, బుర్రకథ, కూచిపూడి, భరతనాట్యం, జానపదాది రంగస్థల కళలలోనూ, వక్తృత్వం, గేయరచన, వ్యాసరచన వంటి సాహిత్య ప్రక్రియల్లోనూ ఇంకా ఫోటోగ్రఫీ, వర్ణచిత్రణ వంటి సృజనాత్మక కళలందూ ఈ పన్నెండు ఏళ్లు ప్రతి ఏడాదీ బాలల దినోత్సవ సందర్భంలో రాష్ట్రమంతటా ప్రతి జిల్లా కేంద్రంలోనూ నిర్వహించడానికి ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ ఆయా జిల్లా విద్యాశాఖాధికారుల సహకారాలతో నిర్వహించి ప్రతిభను చూపడం, ఉత్తములుగా ఎంపికైన వారికి యోగ్యతా పత్రాలు (గ్రీన్‌సర్టిఫికెట్సు) ఇయ్యడం చేసింది.

## ఆంధ్రప్రదేశ్ దర్శన్

రాష్ట్రంలోని వివిధ ప్రాంతాలలో ఉన్న బాలబాలికల మధ్య పరస్పర అవగాహన పెంపొందించడానికి "ఆంధ్రప్రదేశ్ దర్శన్" అనే పర్యటన కార్యక్రమం ప్రయోగస్థాయిలో 1977లో నిర్వహించి బాలల అకాడమీ కృతకృత్యమైంది. ప్రతి జిల్లాలోను రెండు మూడు చోట్ల "నీకు తెలిసిన ఆంధ్రప్రదేశ్" అన్న శీర్షిక పై ఒక పోటీ పరీక్ష పెట్టి జిల్లాకు ఇద్దరు బాల అభ్యర్థులను ఒకరు పట్టణ ప్రాంతం మరొకరు గ్రామీణ ప్రాంతం వారు ఎంపిక చేసి మొత్తం 44 మందిని 34 రోజులపాటు రెండు బస్సులలో మొత్తం 6,500 కిలోమీటర్లు ఒక నిర్దిష్ట పర్యటన మార్గం వెంట సాంస్కృతిక చారిత్రాత్మక, పారిశ్రామిక, వ్యవసాయక పరిశోధన కేంద్రాలు వినోద యాత్రా స్థలాలు సందర్శించడానికి ఏర్పాట్లు చేసింది. ఈ పర్యటనను 70 ని.వర్ణచిత్రంగా 1979లో విడుదల చెయ్యడం జరిగింది.

## బాలచంద్రిక

పిల్లల మనోవికాసానికి వినోదానికి విజ్ఞానం అందించడానికి ఒక సచిత్ర మాసపత్రికను అందించడం బాలల అకాడమీ ధ్యేయాల్లో ఒకటి. అంతర్జాతీయ బాలల సంవత్సరం 1979 సందర్భంగా బాలచంద్రికను అనేక శీర్షికలతో రూపకల్పన చేసి మార్చి 1979 నుండి ప్రచురిస్తున్నది. ఆనాటి నుండే ఈ పత్రికను రాష్ట్రంలోని సుమారు నలభయివేల ప్రాథమిక పాఠశాలలకు అందునట్లు ఇప్పటికి రాష్ట్ర ప్రభుత్వ ఉత్తర్వుల మేరకు ఏర్పాట్లు చేశారు. "బాలప్రాథమిక పాఠశాలలో బాలచంద్రిక"కు పఠన సమయాన్ని కేటాయించి దానిని బాలచంద్రిక పీరియడ్ అంటున్నారు. "బాలచంద్రిక"లో కథలు, గేయాలు, గేయ కథలు, పద్యామృతం వంటి శీర్షికలతోబాటు విజ్ఞాన చంద్రిక ద్వారా శాస్త్ర ప్రగతిని పరిచయం చేస్తున్నారు.

## పిల్లలకో మంచి పుస్తకం

బాలచంద్రిక ద్వారా ఎప్పటికప్పుడు గుళికల ద్వారా బాల సాహిత్య పఠన సామగ్రి అందిస్తూ ఒక సువ్యవస్థిత కార్యక్రమం రూపొందించి పిల్లలకో మంచి పుస్తకం అనే పథకం 1979 నుండి నిర్వహించి ఇప్పటికే సుమారు డెబ్బయి పిల్లల పుస్తకాలను విడుదల చేసింది. ఇందులో బుజ్జికథలు ఎనిమిది ఏళ్లలోపు వయస్సులో ఉన్న పిల్లలకు ఉద్దేశితమైన సచిత్ర కథలు– బాతు – బంగారు గుడ్డు, నాన్నా–పులి, గుర్రం–గాడిద వంటి 8 పుస్తకాలు ఈ కోవకు చెందుతాయి. దళసరి 120 గ్రాముల కాగితమునుపయోగించి రంగుల చిత్రాలతో పెద్ద అక్షరాలతో పిల్లలకు రంజింపచేసేలా ఉంటాయి. "పంచదార చిలక" పుస్తకాలు 8 ఏళ్ళు పైబడిన వారికి బొమ్మల ద్వారా (కామిక్స్) కథ చెప్పేవి. డి.రామలింగం ప్రత్యేకంగా రచించిన స్వరాజ్యం నా జన్మహక్కు అను పుస్తకం 12 ఏళ్లకు పైబడిన వారికి ఉద్దేశితమైంది. ఈ పుస్తకం తెలుగు విశ్వవిద్యాలయం వారి బహుమతికి అర్హమైందిగా 1986లో నిర్ణయించారు. "మల్లెపూదండ" మన పూర్వకవులను పిల్లలకు తాత మనవరాళ్లకు పరిచయం చేస్తున్నట్లు బొమ్మకంటి శ్రీనివాసాచార్యులు ప్రత్యేకంగా రచించారు. ఇంక బాలసాహిత్యంలో వైతాళికులయిన అనేకమంది గిడుగు వెంకట సీతాపతి, న్యాయపతి రాఘవరావు, న్యాయపతి కామేశ్వరి, చల్లా రాధా కృష్ణశర్మ, మండా సూర్యనారాయణ, ఏడిద కామేశ్వరరావు, కవిరావు, అలపర్తి సుబ్బారావు, తేకుమళ్ల కామేశ్వరరావు, ఎల్లోరా, వెలగా వెంకటప్పయ్య, కల్వి గోపాలకృష్ణ మున్నగువారి ఉత్తమ రచనలను బాలసాహిత్య సంకలనాలను బాలల అకాడమీ పొందుపరచడం జరిగింది.

## చిలక పలుకులు

శ్రవణమాధ్యమం ద్వారా బాల సాహిత్యం ఎదిగే పిల్లలకు అందించడం బాలల అకాడమీ చేపట్టిన ప్రయోగాత్మక వినూత్న పథకం. ఎలక్ట్రానిక్ మీడియా ద్వారా అంటే ప్రీ-రికార్డెడ్–ఆడియో కాసెట్ల ద్వారా అకాడమీ అనుబంధ విభాగం సెంటర్ చైల్డ్ ఆర్ట్ కమ్యూనికేషన్ మెటీరియల్స్ చేపట్టి నిర్వహించింది. ఈ విభాగం తీవ్రకృషి ఫలితంగా "గప్–చిప్ చందమామరావే, జనగణమన, తోటతల్లి, లాలిశ్యామాలాలి, జడకోలాటం, చక్కని సలహా, పులిమీద పుట్ర మొత్తం పన్నెండు కాసెట్ల ద్వారా 0–14 ఏళ్లు వయోవర్గంలో ఉన్న పిల్లలకు జోలపాటలు, బాలగేయాలు, కథలు, గేయ కథలు, కోలాటపు పాటలు, దేశభక్తి గేయాలు మున్నగు బాలసాహిత్య ప్రక్రియలు ఈ చిలకపలుకులు చోటు చేసుకున్నాయి. ఈ శ్రవణ మాధ్యమానికి ముద్రణ మాధ్యమానికి అనుబంధించి కేసెట్టు బొమ్మల పుస్తకాలను కూడా ఆంధ్రప్రదేశ్ బాలల అకాడమీ సిద్ధపరచి అందించింది. పిల్లలు ఈ చిలక పలుకుల్ని అనేక విధాలుగా వినియోగించుకోవచ్చును. కాసెట్టు రికార్డరు ద్వారా వాటిని ఆనందించవచ్చును. "చిలకపలుకులు" బొమ్మల పుస్తకాలు ఎవరయినా బిగ్గరగా చదివితే బొమ్మలు చూస్తూ విని ఆనందించవచ్చును. ఇలా బహుళార్థకంగా ఈ చిలకపలుకులు పిల్లలకు ఉపయోగపడేలాగున రూపకల్పన చేయబడింది.

## ప్రతిబడికీ బాల సరస్వతీ పీఠం

పైన చెప్పిన విధంగా పిల్లల పుస్తకాల ద్వారా పఠన సామాగ్రి (రీడింగ్ మెటీరియల్స్)ని సిద్ధపరచడం ఒక ఎత్తు. వీటిని ఎక్కడో మారుమూలన పల్లెలో ఉన్న బీదా , సాదా పిల్లలకు ఈ పఠన సామాగ్రి అందచేయడానికి గాను బాలల అకాడమీ "ప్రతిబడికీ బాల సరస్వతీ పీఠం అనే ఒక వినూత్న పథకాన్ని రూపకల్పన చెయ్యగా ప్రభుత్వం అంగీకరించి నిధులు మంజూరు చెయ్యగా 1986–87లో రాష్ట్రంలోని అయిదు వేల ప్రాథమిక పాఠశాలలకు ఒక్కొక్క దానికి ఎనభై ఆరు రూపాయల విలువగల ఇరవయి పుస్తకాలు, ఒక ఆడియో కాసెట్టుగల బాల సరస్వతీ పీఠాలు అందాయి. అంటే మండలానికి నాలుగయిదు పీఠాలు చొప్పున జిల్లాకు రెండువందల పీఠాలు అందాయని చెప్పవచ్చును. ఇటువంటి పథకం ప్రస్తుతం "ఆపరేషన్ బ్లాక్ బోర్డ్ పథకంలో 1600 రూ.ల విలువగల రెండు వందల పుస్తకాల పీఠాలు గల పఠన

సామాగ్రిని (రీడింగ్ మెటీరియల్స్) ప్రతి పాఠశాలకు అందించడానికి కేంద్ర ప్రభుత్వం రూపొందించి అమలు చేస్తుంది.

## బొమ్మలాట (పప్పెట్రీ )

బాలబాలికలకు సంబంధించిన ఈ కార్యక్రమములతో బాటు ప్రయోగస్థాయిలో బొమ్మలద్వారా చిన్న వయస్కులకు కథలు, పాఠ్య సామగ్రిని అందివ్వడానికి పప్పెట్రీ విభాగం ద్వారా 40 ని. విప్లవవీరుడు అల్లూరి సీతారామరాజు కథ, భలే తీర్పు, నాన్నా-పులి గేయ రూపకాలు వంటి బొమ్మలాటలు సిద్ధపరచి అందించడం జరిగింది.

ఇంకను పిల్లల మనోవికాసానికి అవసరమయిన కార్యక్రమాలు-బాలల ఫిల్మోత్సవాలు, పిల్లల చలన చిత్ర ప్రదర్శనలు బాలల అకాడమీ నిర్వహించింది. బాల సాహిత్యకారులకు దోహదాలు కల్పించడానికి అప్పుడప్పుడు బాల సాహిత్య శిక్షణ శిబిరాలు, బాలసాహిత్యకారులు- చిత్రకారుల గోష్ఠులు నిర్వహించి బాలల సంక్షేమ రంగంలో బాలల అకాడమీ 1976 నుండి 8 8 వరకూ ఈ పన్నెండు ఏళ్ళూ పాలు పంచుకుంటున్నది.

# భారతదేశంలో స్త్రీ విద్య - నాడు, నేడు

**శ్రీమతి వనజా అయ్యంగార్**
పూర్వ ఉపాధ్యక్షురాలు, శ్రీపద్మావతి మహిళా విశ్వవిద్యాలయం,
తిరుపతి.

## 1. అప్పుడు

మనం గతం గురించి చర్చించేటప్పుడు, మనకు వారసత్వం వల్ల సంక్రమించిన, పరస్పరం విరోధించే ఎన్నో గతాలను మనం మరచిపోతాం. అంతేకాదు అవేవీ ఎప్పుడూ సమగ్రం కావు. ఇది స్త్రీ విద్య పట్ల కూడా వాస్తవమే.

ఆంగ్లేయుల పాలనలో మనది నిరక్షరాస్యత ఉన్న దేశమే. గాంధీగారన్నట్లు రాజ్యం నడపడానికి కొంతమంది గుమస్తాలను తయారు చేసింది. భూస్వామ్య విలువల విధానానికి తోడు, స్త్రీలను వాళ్ళ అమాయకత్వం నుంచి రక్షించాలి అంటూ జ్ఞానానికి ప్రపంచానికి దూరంగా కట్టుదిట్టంగా ఇళ్ళలో నుంచి బయటికి రానివ్వలేదు. ఈ వలస విధానమూ భూసామ్యమూ కలిసి వైజ్ఞానిక కుటుంబాలని చెప్పుకొనే వాళ్ళమీద కూడా సంవృత స్థలఖితి ప్రభావాన్నిచూపాయి.

వీటికి ప్రతికూలంగా ఆధునిక జీవితం, స్వాతంత్ర్యోద్యమాల ఒత్తిడి ఉంది. ఆధునిక జీవితం ఇంటిమీద దండెత్తింది. చదువుకున్న పురుషులు చదువులేని భార్యల్ని కోరుకోలేదు. వాళ్ళ పిల్లలు చదువులేని తల్లుల్ని కోరుకోలేదు. మధ్యతరగతి, పైతరగతి స్త్రీలు కూడా అజ్ఞానంలోనూ, చీకటిలోనూ ఉండాలని కోరుకోలేదు. వాళ్ళకు అన్నీ తెలియాలి అనుకున్నారు. వాళ్ళు జ్ఞానమూ చదువూ కావాలనుకున్నారు. వీటన్నిటి ఫలితంగా దేశంలో బాలికా పాఠశాలలూ, మహిళా కళాశాలలూ నెలకొన్నాయి. కాని స్త్రీలు సహాయకస్థితి మూలభావనలోనే ఉండిపోయారు. మహా అయితే ఈ విద్య స్త్రీలను మంచి భార్యలుగా, మంచి తల్లులుగా మలచడానికే ఉద్దేశించింది కానీ మంచి స్త్రీలుగా, మంచి మనుషులుగా కనీసం దేశపౌరులుగా మలచడానికి ప్రయత్నించలేదు.

కానీ ఎలాగయితేనేమి, ఈ ఉదార ప్రవాహంలో గొప్ప అగ్రగాములయిన కేశవ చంద్రసేన్, న్యాయమూర్తి యమ్.జి. రనడే, స్వామి దయానంద సరస్వతి, ఈశ్వరచంద్ర విద్యాసాగర్, గోపాలకృష్ణ గోఖలే, పండిత రమాబాయి సరస్వతి, కందుకూరి వీరేశలింగంపంతులు, చిలకమర్తి లక్ష్మీనరసింహం, గురజాడ అప్పారావు, మరికొందరు బయలుదేరారు. వాళ్ళ భావాలతో, వాళ్ళ రచనలతో స్త్రీల కోసమే స్త్రీవిద్య అని స్త్రీవిద్యకు సహకరించారు. కానీ అప్పుడు వారికృషి కొద్దిమంది పైతరగతి వారికే పరిమితమయిపోయింది.

మహాత్మాగాంధీ గొప్పనాయకుడుగా సాగిన స్వాతంత్ర్య పోరాటమే దీనికి శక్తిమంతమయిన ప్రేరణను కలిగించింది. స్త్రీల గురించి గాంధీజీకి దృఢమైన, ఒక్కొక్కప్పుడు ప్రాచీనరీతికి సంబంధించిన అభిప్రాయాలుండేవి. కానీ అన్నింటిని మించి, ఆయన అనంతదయామూర్తి. జాతీయదాస్య విముక్తికి గొప్పనాయకుడు. కాబట్టి ఆయనే స్త్రీవిద్యకు కొత్త పరిమాణం ప్రసాదించాడు. ఇది పోరాటం ద్వారా విద్య అనే పరిమాణం. లక్షలకొద్దీ భారతీయ స్త్రీలను స్వాతంత్ర్య పోరాటానికి ఆయన తీసుకొని వచ్చాడు. ఈదివ్య కృషిలో సమాన భాగస్వామ్యం స్త్రీలకు కూడా ఉందన్న భావన వారిలో నాటాడు. వాళ్ళను ఇళ్ళనుంచి బయటికి, విశాల ప్రపంచ సంక్షోభంలోకి యుద్ధంలోకి తెచ్చాడు గాంధీజీ. కస్తూర్బాగాంధీ, సరోజినీనాయుడు, మీరాబెహన్ ఆయన దృక్పథానికి సంకేతాలు. రవీంద్రనాథ టాగూర్ స్త్రీల బంధవిమోచనంలో విద్యకు గల ప్రముఖ స్థానాన్ని నొక్కి వక్కాణించాడు. భారతస్త్రీలు ఆధునికులు కావాలని

ఆయన నమ్మాడే కానీ ఆధునిక భారతీయులు అనుకరణల ద్వారా మేమ్‌సాహెబ్‌లు కాగూడదని భావించాడు. స్వాతంత్ర్య పోరాటంలో స్త్రీలు పాల్గొనడాన్ని టాగూరు కాదనలేదు. కానీ స్త్రీలకు సంబంధించినంతవరకు వారి విద్యా, బంధవిమోచనాల విలువల పట్ల ఆయనకు కొన్ని మినహాయింపులున్నాయి. ఆధునిక విద్యతోపాటు హస్తకళలకూ, శ్రమకు ఆయన ఉన్నత స్థానం ఇచ్చాడు. దానికి సాక్ష్యం శాంతినికేతనం. ఇది "నయీతాలిమ్" లేదా వార్ధాలోని విద్యా విధానంలో గాంధీజీ హస్తకళలకూ, శారీరక శ్రమకూ ఇచ్చిన ప్రాముఖ్యాన్ని పోలి ఉంది.

## 2. ఇప్పుడు

స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత అక్షరాస్యతా వ్యాప్తిలోనూ, విద్యలోనూ బాగా అభివృద్ధి చెందింది. అయినా ఇంకా చేయవలసింది పెద్ద మొత్తంలో మిగిలి ఉంది. మనం సాధించవలసింది సాధించాం, గుణాత్మకంగా ఉన్నతస్థాయికి చేరుకున్నాం అన్నవి మనల్ని గుడ్డివాళ్ళను చేయగూడదు. పరిమాణాత్మకంగా, విభిన్న స్థాయిల్లో లాంఛనప్రాయమైన విద్య అందించడం కోసం విద్యాసంస్థల సంఖ్య 1951-52 లో 2,33,000 ఉండగా 1984-85 నాటికి 7,55,000 చేరుకొంది. అదే కాలంలో నమోదయిన విద్యార్థినుల సంఖ్య 24 మిలియన్‌ల (24000000) నుంచి ఒక్కసారిగా 135 మిలియన్లకు చేరుకొంది. 1950-51 లోని విద్యా సంబంధి మానవశక్తి జాతీయ నిల్వ 4 మిలియన్‌ల నుంచి 1984-85 నాటికి 48 మిలియన్‌లకు చేరుకొంది. ఉన్నతస్థాయి విద్యాసంస్థలు ఇంకా వేగంగా పెరిగిపోయాయి. కానీ వివిధస్థాయిల్లో విద్యార్థి, విద్యార్థినుల నమోదు పెరుగుదలలోని భేదాత్మకాలను ఎవరైనా చూస్తే విద్యను సాధించడాల్లో పెద్ద అంతరం కనిపిస్తుంది. ప్రాథమిక, మాధ్యమిక పాఠశాలను విడిచి వెళ్లే విద్యార్థులు, విద్యార్థినుల్లో విద్యార్థినుల రేటు ఎక్కువ. మొత్తం మీద స్వాతంత్ర్యం వచ్చిననాటికి అక్షరాస్యత రేటు 15% కాగా ఇప్పటికి అది 37.1% కి పెరిగింది. కానీ ఇప్పటికీ అన్ని రాష్ట్రాల్లోనూ విద్యావ్యయం అపరిమితంగా చేస్తున్నా స్త్రీల అక్షరాస్యత తక్కువ స్థాయిలోనే ఉంది. ప్రపంచంలో పెద్ద మొత్తం నిరక్షరాస్యులతో భారతదేశం 21వ శతాబ్దంలో ప్రవేశించబోతూ ఉంది. 1971 గణాంకాలననుసరించి గ్రామీణస్త్రీ అక్షరాస్యత 13.2% కాగా నగరాల్లో ఇది 42.3% ఉంది. సుమారు 83 జిల్లాల్లో స్త్రీ అక్షరాస్యత 5% కన్న తక్కువ ఉంది. 113 జిల్లాల్లో స్త్రీ అక్షరాస్యత 5-10% మధ్య ఉంది. షెడ్యూల్డు కులాల్లో 6.4% షెడ్యూల్డు తెగల్లో 3.58% ఉంది. 1981 జనాభా లెక్కల ప్రకారం అక్షరాస్యులయిన స్త్రీలు కేరళలో అత్యధికంగా ఉన్నారు. (మగవాళ్ళు 75% ఉండగా స్త్రీలు 65.73% ఉన్నారు). అలాగే ఉత్తర ప్రదేశ్‌లో స్త్రీల అక్షరాస్యత అతిస్వల్పంగా ఉంది (మగవాళ్ళు 38.76% ఉండగా ఆడవాళ్ళు 10.04%).

సాధారణ విద్యకున్న పరిమితులే స్త్రీ విద్యకు కూడా ఉండి నష్టపోయినట్లు దీనివల్ల స్పష్టమవుతుంది. అయితే స్త్రీవిద్యకు మరికొన్ని ప్రత్యేక పరిమితులు కూడా ఉన్నాయి. ఇవి సాంఘిక, ఆర్థిక, సాంస్కృతిక పరిమితులు. ఇవన్నీ ఉన్నా ఏవిధంగానూ తక్కువ అంచనా వేయదగని, గొప్ప మార్పు మాత్రం వచ్చింది. స్త్రీలు నిరక్షరాస్యులుగా, విద్యలేనివారుగా కొంత విద్య నేర్చిన వారుగా ఉండాలని ఇంక ఎంత మాత్రం పరిగణించడం సహజంకాదు. అక్కడక్కడ స్త్రీవిద్య పట్ల నిరసన మిగిలే ఉంది. ఇది ఎంతమాత్రం ఆదరించదగింది కాదు. ఏమైనా స్త్రీవిద్య పట్ల ప్రత్యేకమైన అభిప్రాయాలు ఉన్నాయి. వారికి నేర్పే అంశాల్లో గృహ విజ్ఞానశాస్త్రం వంటి స్త్రీ విషయకాంశాలు చేర్చటం వల్ల వారికుండే స్త్రీ విధులను నెరవేర్చి మంచి భార్యలుగా, తగిన భార్యలుగా ఉండగలుగుతారు. స్వాతంత్ర్యం నాటికి స్త్రీవిద్య పట్ల ఈ దృక్పథం ఉండేది. అది ఇప్పటికీ కొంత కనిపిస్తూ ఉంది.

తక్కువ ఆదాయంగల వర్గాలలోని స్త్రీలలో నిరక్షరాస్యత రేటు అంత ఎక్కువగా ఉండడానికి ఇది ఒక కారణం. ముఖ్యకారణం పేదరికమే అనుకోండి. కానీ దురదృష్టవశాత్తు, మొదటి నుంచి పేదరికం నిర్మూలన కార్యక్రమాల్లో నిరక్షరాస్యతా నిర్మూలనను చేర్చలేదు. దానిపై ఏ ఉద్యమాలూ లేదు. పేదవారు ఈ నిర్మూలనకవతలే ఉండి పోయారు. కానీ పేదస్త్రీలు మరీ అంధకార బంధురంలో ఉండిపోయారు.

గ్రామీణ ప్రాంతాల్లోని పేదకుటుంబాల్లోని బాలికలు బాధపడే ప్రత్యేక అశక్తతలపై ప్రాథమిక విద్యా స్థాయిలో కూడా ఏ జాగ్రత్తలూ తీసుకోలేదు. తల్లి పనిపాట్లకు పోయినప్పుడు మిగిలిన చిన్నపిల్లల బాధ్యతలు వహించే బాలికలకు తగినట్లు బడివేళల్లో మార్పులు చేయలేదు. 1984-85 జనాభా లెక్కలు ఇలా చూపాయి : ప్రాథమిక స్థాయిలో బాలుర నమోదులో బాలికల నమోదు 66% ఉండీ, అది మాధ్యమిక తరగతుల్లో బాలుర సంఖ్యలో సగమే ఉంది.

సమాజంలో మధ్య తరగతి, ఉన్నత తరగతులకు సంబంధించినంతవరకు సెకండరీ, ఉన్నత విద్యాస్థాయిల్లో పరిస్థితి కొంత మెరుగుగానే ఉంది. 1911-1925 సం.లలో దేశంలో చాలా ప్రాంతాల్లో కొన్ని మహిళా కళాశాలలు వెలిశాయి. అయితే అందులో స్త్రీలకు ప్రత్యేక పాఠ్యక్రమం ఉండాలన్న ఉద్ఘాటన ఉంది. స్వాతంత్ర్యం వచ్చినప్పటి నుంచి జూనియర్, డిగ్రీ కళాశాలల స్థాయిలో అపరిమిత విస్తృతి మహిళా కళాశాలలకు ఉంది. స్వాతంత్ర్యానంతరం స్త్రీల కోసం ఏర్పడిన ఉన్నత పాఠశాలల, కళాశాలల సంఖ్య పదిరెట్లు పెరిగింది. వందలకొద్ది బాలికలు ప్రతి పెద్ద నగరంలో ప్రవేశం కోసం జాబితాలో నిరీక్షిస్తున్నారు. ఇప్పుడు, బాలబాలికలు ఒకే పాఠ్యప్రణాళిక చదువుతున్నారు. వారికి బాలురతోపాటు సమానావకాశాలు, స్నాతక, స్నాతకోత్తర స్థాయిల్లోనే కాకుండా వృత్తి విద్యా తరగతుల్లోనూ లభించాయి. చాలామంది స్త్రీలు మెడిసిన్, నర్సింగ్, న్యాయశాస్త్ర విద్యలలో ప్రవేశించ గలుగుతున్నారు. రేడియో ప్రసారకేంద్రాల్లోనూ, పత్రికారచనల్లోనూ ఇంకా వ్యాపారంలో ఇప్పుడు స్త్రీలు ప్రవేశిస్తున్నారు. కానీ సిద్ధాంతపరంగా స్త్రీలకు సమానావకాశాలున్నప్పటికీ ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక కారణాలవల్ల బాలురతో సమానంగా వాటిని వినియోగించుకోలేక పోతున్నారు. విద్యావంతులయిన స్త్రీలు పదవులు చేపట్టి మగవారికి తీసిపోమని చూపినవారు ఏ కొద్దిమందో మాత్రమే. దిగువ శ్రేణిలో ఉన్న టైపిస్టులు, స్టెనోలు, సెక్రటరీలు వగయిరా ఉద్యోగాలకి స్త్రీలకు ప్రత్యేకీకరణ కనిపిస్తూంది.

## సమ్యగ్దృష్టి

పురుషుల కోసం విద్య అన్నదానికి అర్థమైనదే సరిగా స్త్రీలకోసం విద్య అన్నదానికి అర్థం. బాగా చదువుకున్న స్త్రీలకు విద్యాపరమార్థమైన జీవన మార్గం సుగమంగా సాగడానికి స్వయం విద్యతోపాటు అదనంగా వ్యక్తిత్వ హోదా, ఆత్మవిశ్వాసం చేకూరాలి. దానిద్వారా ఉన్నత పదవులు పొందుతారు. భారతజాతి పురోగామి నాయకులు కాకపోయినప్పటికీ విద్యావంతులలో ప్రేరేపకులు ఉన్నారు - ఏ రకమయిన విద్య అయినా, ఏ స్థాయిలోని విద్య అయినా ఎల్లప్పుడూ మంచి తల్లుల్ని, మంచి భార్యల్ని తయారుచేస్తుంది. అది మంచిదే. కానీ స్త్రీలు అంతకుమించి శక్తిమంతంగా సమాజానికి ఉపయోగపడాలి. ఇందుకు సరైన విద్యావకాశాలు, ఉద్యోగావకాశాలు స్త్రీలకు కల్పించాలి.

సంప్రదాయపరమైన ఉపాధి రంగాల్లోనే కాక అభివృద్ధి రంగాల్లోనూ స్త్రీలను సుశిక్షితులను చేసి మగవారితోపాటు సమానావకాశాలు కల్పించాలి. నర్సులూ, డాక్టర్లుగానే కాక కంప్యూటర్ ఆపరేటర్లుగానూ స్త్రీలు ఉన్నారు. కాని కంప్యూటర్ ప్రోగ్రామర్లుగా, ఇంజనీర్లుగా పురుషులు మాత్రమే ఉంటున్నారు. కొఠారీ కమీషన్ తన నివేదికలో స్త్రీవిద్యకు కొన్ని ప్రత్యేక పరిధుల్లో ఉపాధి అవకాశాలు కల్పించింది. అవి - బోధన, సామాజిక సేవ, నర్సింగ్, పోషకాహార సేవ మొదలయినవి. కానీ ఈనాడు ఈ జాబితాకు అదనంగా సమాజం పొందుతున్న సాంకేతిక ప్రగతి ఆధారంగా మరికొన్నిటిని చేర్చవలసి ఉంటుంది అవి : నిర్వహణాధ్యయనం; కంప్యూటర్ సాఫ్టువేర్, హార్డువేర్, అనుప్రయుక్త ఎలక్ట్రానిక్స్, సమాచార మాధ్యమం; వీటికి సంబంధించిన ఇతర విషయాలు మొదలయినవి. (ఇవి ఇప్పుడు మగవారి పరిధిలో ఉన్నాయి). స్త్రీలు అటు ఇంటా ఇటు బయటా సమంగా శ్రమించ వలసి ఉంది. స్త్రీ ఇంట్లో పనిపాట్లు చూసుకుంటూ శిశు సంరక్షణను కొనసాగిస్తుంది. ఇందుకుగాను బయట క్రెష్‌లూ, శిశుసంరక్షణ కేంద్రాలూ, ఉద్యోగినుల వసతి గృహాలు వగయిరాలు చట్టబద్ధంగా నిర్వహించాలి.

అప్పుడే స్త్రీ అన్ని రంగాల్లోనూ ప్రవేశించి జాతీయ ఆర్థిక పరిస్థితుల్లో ప్రత్యక్షంగా పాల్గొనే అవకాశం లభిస్తుంది. దేశంలోని స్త్రీజనాభా బంధవిముక్తి పొందినప్పుడే ప్రగతి సాధ్యమవుతుంది. ఇందుకుగాను మౌలికంగానే ప్రయత్నం జరగాలి. స్త్రీలకు సంబంధించినంత మట్టుకు నిరక్షరాస్యతా నిర్మూలనకు, వయోజన విద్యకు ప్రత్యేక ప్రాధాన్యం ఇవ్వాలి. ఇందుకుగాను ప్రత్యేక వ్యూహాలు కల్పించి నిర్దిష్టమైన లక్ష్యాలతో సరయిన నిధులతో కాలపరిమితి కార్యక్రమాలు సాధించాలి. దూరవిద్యా పద్ధతులను పూర్తిగా ఉపయోగించాలి. ఇప్పటివరకు దూరవిద్యను అధికంగా ఉన్నత విద్యావ్యాప్తికే వినియోగిస్తున్నారు. జాతీయ సార్వత్రిక విశ్వ విద్యాలయ అంకురార్పణతో దూరవిద్య శక్తిమంతంగా ఉపయోగించడానికి వీలయింది. దీనివల్ల సామూహిక విద్య, స్త్రీలకు ప్రయోజనాత్మకంగా అక్షరాస్యత, ఆరోగ్య సంరక్షణ, జనాభా నియంత్రణ, జాగృతి కార్యక్రమాలు మొదలయిన వాటిలో దూరవిద్య సాంకేతికత ఉపయోగ పడుతూంది.

## ముగింపు

ముగింపుగా, మనకు స్వాతంత్ర్యం వచ్చిన మొదట్లో కంటె ఇప్పుడు స్త్రీల కోసం విద్య మెరుగయింది. ఇప్పుడు భారతదేశంలో సమాజం స్త్రీ పురోగతికి వ్యతిరేకంగా లేదు. వచ్చిన అవకాశాల్ని ఇంకా పురోన్నతికి ఉపయోగించుకుంటూ స్త్రీలు హక్కు సాధించారు. జయం పొందడానికి పురుషుల కంటె స్త్రీలు ఎక్కువ పోరాటం సాగించినప్పటికీ పురుషుల్లాగానే వారి హక్కును వారు పొందుతున్నారు. కానీ దీనికి కారణం సాంఘిక విధానం మొత్తం. అందులో విద్య ఒక అంతర్విధానమే. మరో మాధ్యం ద్వారా నూత్న సాంఘిక వాతావరణం నెలకొనాలి. దీనివల్ల స్త్రీల పట్ల విచక్షణను ప్రతిఘటించడం జరగాలి. ఈ స్త్రీల పట్ల విచక్షణకు విరుద్ధంగా సాగే పోరాటాన్ని కేవలం "మహిళా ఉద్యమాలకు" మాత్రమే విడిచిపెట్టగూడదు. అది మనదేశం, సమాజంలోని ఆధునికత్వానికి భాగంకావాలి.

వివిధ విద్యాస్థాయుల్లో సంబంధమున్న, సముచితమైన వ్యూహాల్ని నిర్వహిస్తూ స్త్రీవిద్యలోకి అదనపు ఉత్పాదకాలను ప్రవేశపెట్టాలి. అంతేకాక గ్రామీణ, నగర పునశ్చరణలు ఇందులో చోటు చేసుకోవాలి. తక్కువ ఆదాయ వర్గాల మహిళలకు ఉపకారవేతనాదులు కల్పించాలి. మహిళలకు ఉన్నత పాఠశాలల్లో, కళాశాలల్లో మరికొన్ని నెలకొల్పాలి. అందులో అవసరమయితే కోర్సులకు రిజర్వేషన్లు కూడా ఉంచాలి.

మహిళలకు అదనపు ఉద్యోగావకాశాలు సృష్టించాలి. ఉద్యోగాలకు రిజర్వేషన్లు కల్పించడంలో జాతీయ స్థాయిలో వీరిపట్ల ప్రత్యేక శ్రద్ధ వహించాలి. దీనివల్ల వాళ్ల అశక్తతలను అధిగమించడానికి మార్గం ఏర్పడుతుంది. అంతేకాకుండా ఉద్యోగ / స్వయం ఉపాధి అవకాశాల సమస్యలను పరిష్కరించవచ్చు.

చివరిగా, స్త్రీలకు పురుషులకు విద్య ఉండాలి. స్త్రీలకు ప్రత్యేకంగా విద్య అన్నిస్థాయుల్లోనూ దేశమంతటా ఉండాలి. ఇది వాళ్ళకు దానంగా భావించగూడదు. మనజాతి నాగరకతకు, పరిణామానికి, అవసరానికి అది తప్పదని గ్రహించాలి.



# సాంకేతిక విద్య నేడు - రేపు

ఆచార్య జె.ఆర్. శాస్త్రి
డెవలప్‌మెంట్ ఆఫీసర్
సాంకేతిక విద్యాశాఖ సంచాలకుల కార్యాలయం
పుష్పాంజలి కాంప్లెక్సు, కోఠి,
హైదరాబాదు.

స్వాతంత్ర్యము లభించినది మొదలు మన దేశములో సాంకేతిక విద్య మూడు స్థాయిలలోను అంటే (డిగ్రీ, డిప్లొమా మరియు ఆర్టిజన్‌లో) గణనీయమైన అభివృద్ధిని సాధించింది. ఈనాడు మన దేశంలో ఆరు (6) స్వతంత్ర ప్రతిపత్తి కలిగిన ఇండియన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ వివిధ శాఖలలోను ప్రతి సంవత్సరము సుమారు వెయ్యిమంది సాంకేతిక ఇంజనీరు శాస్త్రజ్ఞులను తయారు చేస్తున్నాయి. ఇంతేకాకుండా ఈ దేశంలో 150 ఇంజనీరింగు కళాశాలలు మరియు 450 పాలిటెక్నిక్కులు ప్రతి సంవత్సరము సుమారు 30 వేలు, 70 వేల విద్యార్థిని విద్యార్థులకు ప్రవేశము కల్పిస్తున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో ఈనాడు 27 యూనివర్సిటీలు మరియు ప్రైవేటు ఇంజనీరింగు కళాశాలలో సుమారు 5,400 విద్యార్థిని విద్యార్థులకు 12 ఇంజనీరింగు శాఖలలో ప్రవేశము కల్పించటం జరిగింది. అదేవిధంగా 82 ప్రైవేటు మరియు ప్రభుత్వ సాంకేతిక విద్యా కళాశాలలందు సుమారు 11,000 విద్యార్థిని విద్యార్థులకు ప్రవేశాన్ని కల్పించటం జరిగింది. (ఇంజనీరింగు కళాశాలలోను, పాలిటెక్నిక్ సీట్ల వివరములు జతచేయడం జరిగింది.)

సాంకేతిక విద్యాభివృద్ధి యొక్క ప్రధాన ఆశయాలు. (అ) భావి యువతరం వారికి క్రమబద్ధమైన సాంకేతిక శిక్షణను కల్పించి వారు రాష్ట్ర పారిశ్రామిక అభివృద్ధి, ఉత్పత్తి, పెంపుదలలో తమ స్థాయిలలో కర్తవ్యాన్ని నిర్వహించటం. (ఆ) రాష్ట్రములో గల అనార్గనైజ్‌డ్ సర్వీసెస్ విభాగములలో స్వయం ఉపాధి పథకములను చేపట్టి నిద్వారా గ్రామీణ అవసరాలను తీర్చిదిద్దుట. పైన నుదహరించిన ప్రధాన ఆశయాల నిర్వాహణలో రాష్ట్ర సాంకేతిక విద్యాశాఖ ప్రశంసాపాత్రమైన విధిని నిర్వహిస్తోంది అనుటలో ఏ మాత్రం అతిశయోక్తి లేదు.

స్వాతంత్ర్యము లభించినది మొదలు మన దేశ పారిశ్రామికాభివృద్ధి రంగములో ఈ సాంకేతిక కళాశాలల నుండి పట్టభద్రులైన యువతీ యువకులు ప్రశంసాపాత్ర మైన రీతిలో తమ విధులను నిర్వహించారు. దీనివలన మన దేశము సాంకేతిక పరంగా పారిశ్రామికాభివృద్ధిని సాధించింది. ఇందులో ముఖ్యముగా చెప్పుకోదగ్గవి: ఇండియన్ రైల్వేస్ వారి అధీనములో గల ఇంటగ్రల్ కోచ్ ఫ్యాక్టరీ, హిందుస్థాన్ లిమిటెడ్ వారి దేశములోని వివిధ రాష్ట్రములలో గల మెషిన్ టూల్స్ కర్మాగారములు, హిందుస్థాన్ ఎయిరోనాటిక్సు లిమిటెడ్ వారి విమానములు దాని సంబంధిత పరికరములు ఉత్పత్తి చేయు, కర్మాగారములు, మోటారు కార్ల ఫ్యాక్టరీలు, దేశములో నలుమూలల గల ఫర్టిలైజర్ ఫ్యాక్టరీలకు కావలసిన పరికరముల ఉత్పత్తి చేయు కర్మాగారములు, డిఫెన్సు పనిముట్లు అనుబంధిత పరిశ్రమల కర్మాగారములు , ఇతర భారీ పరిశ్రమల కర్మాగారములు. మూడు స్థాయిలలో సాంకేతిక విద్య జయప్రదముగ పూర్తి చేసిన యువతీ యువకులు కష్టించి పనిచేసి భారతదేశమునకు ప్రపంచములోని యితర అభివృద్ధి చెందిన దేశాలతో సమానంగా సాంకేతిక రంగములో ఒక ప్రత్యేకతను కల్పిచారు. ఇంతేకాకుండా, భారతదేశం ఎలక్ట్రానిక్స్ సంబంధిత పరిశ్రమల తయారీలోను, అణుశక్తి రియాక్టర్లు, అణుశక్తి సంబంధిత పరికరముల తయారిలోను ఒక వైశిష్ట స్థానము సంపాదించుటలో ఈ సాంకేతిక విద్య సముపార్జన ఎంతగానో దోహదపడింది.

ఈ సాంకేతిక విద్య ఇంజనీరింగ్ కళాశాలలో సివిల్ ఇంజనీరింగ్ విభాగము, ఎలక్ట్రికల్ మరియు కమ్యూనికేషన్ ఇంజనీరింగ్ విభాగము, కంప్యూటర్ ఇంజనీరింగ్ విభాగము, ఎలక్ట్రానిక్స్ మరియు కమ్యూనికేషన్ ఇంజనీరింగ్ విభాగము, కెమికల్

ఇంజనీరింగ్ విభాగము, మెటలర్జికల్ ఇంజనీరింగ్ విభాగము, ఫార్మసీ విభాగము, బయోమెడికల్ ఇంజనీరింగ్ విభాగము, మైనింగ్ ఇంజనీరింగ్ విభాగములలో ఇంటర్మీడియట్ పరీక్ష పూర్తి చేసిన విద్యార్థిని విద్యార్థులకు ప్రవేశ పరీక్షను నిర్వహించి ఆ ప్రవేశ పరీక్షలో విద్యార్థిని విద్యార్థులు సంపాదించుకున్న మెరిట్ ప్రాతిపదికపైన యూనివర్సిటీ మరియు ప్రైవేటు ఇంజనీరింగ్ కళాశాలలో ప్రవేశాన్ని మన రాష్ట్ర ప్రభుత్వం వారు కల్పిస్తున్నారు. అదేవిధంగా పదవ తరగతిలో పాసైన విద్యార్థిని విద్యార్థులు ప్రవేశ పరీక్షలో తెచ్చుకున్న మెరిట్ ప్రాతిపదిక పైననే రాష్ట్రములో గల ప్రైవేటు మరియు ప్రభుత్వ పాలిటెక్నికులలో వీరికి ప్రవేశాన్ని ఇస్తున్నారు. ఈ పాలిటెక్నిక్‌లలో మొత్తం 23 ( ఇంజనీరింగ్ - నాన్ - ఇంజనీరింగు) విభాగములలో శిక్షణ ఇస్తున్నారు.

## సాంకేతిక ఉపాధ్యాయ శిక్షణ సంస్థలు :

దేశములోని వివిధ రాష్ట్రాలలో సాంకేతిక విద్య నిర్వహిస్తున్న పాత్రకు ఒక క్రమబద్ధమైన శిక్షణ కల్పించుటకు వీలుగా పూర్తి స్వయం ప్రతిపత్తి అధికారములతో నాలుగు సాంకేతిక ఉపాధ్యాయ శిక్షణా సంస్థలను మద్రాసు, కలకత్తా, భోపాల్ మరియు చండీగర్‌లలో ఏర్పాటు చేయటం జరిగింది. ఈ సాంకేతిక ఉపాధ్యాయ శిక్షణ సంస్థలు అనుబంధ రాష్ట్రములలో ఎక్స్‌టెన్‌షన్ కేంద్రములను ఏర్పాటు చేసి ఆయా రాష్ట్ర ప్రభుత్వముల సహకారంతో అనేక స్వల్పవ్యవధి ఉపాధ్యాయ శిక్షణ కార్యక్రమములను నిర్వహించి సాంకేతిక ఉపాధ్యాయులందరికి ఈ శిక్షణ కార్యక్రమములలో మంచి తర్ఫీదునిచ్చి సాంకేతిక విద్య విలువలను, ప్రమాణములను పెంచుటలో ఎంతో కృషి చేస్తున్నారు.

ఆంధ్రప్రదేశ్‌లో రాష్ట్రావతరణ తరువాత సాంకేతిక విద్య చక్కటి అభివృద్ధిని సాధించింది. రాష్ట్ర ప్రభుత్వ నిర్దిష్ట కార్యక్రమము ఆధారంగా ప్రతి రెండు జిల్లాలకు ఒక ప్రభుత్వ మహిళాపాలిటెక్నిక్ కళాశాలను, ప్రతి ఒక జిల్లాకు ఒక రాష్ట ప్రభుత్వ పాలిటెక్నిక్ కళాశాలను ప్రారభించుట జరిగింది. ఎనిమిది క్రొత్త మహిళా పాలిటెక్నిక్ కళాశాలలను స్థాపించటం జరిగింది. రాష్ట్రములో ఈనాడు మొత్తం 19 మహిళా పాలిటెక్నిక్ కళాశాలలు పనిచేస్తున్నవి.

ఇంతేకాకుండా రాష్ట్రములో బడుగు వర్గాల శ్రేయస్సుకై షెడ్యూల్డు ట్రైబుల వారికి, షెడ్యూల్డు కులాలవారికి ప్రత్యేకించి మన రాష్ట్రములో ప్రాంతమునకు ఒకటి చొప్పున ఆరు రెసిడెన్షియల్ పాలిటెక్నిక్‌లు ఏర్పాటు చేయటం జరిగింది. రాష్ట్రములో పారిశ్రామిక అవసరములకు అనుగుణంగా మారుతున్న సమాజమునకు పనికివచ్చే క్రొత్త పోస్టు డిప్లొమా కోర్సులను రూపొందించి మూడు ఎడ్వాన్స్ టెక్నీషియన్ ఇన్స్టిట్యూట్‌లను ప్రారంభించిరి.

1983వ సంవత్సరమునకు ముందు ప్రైవేట్ ఇంజనీరింగ్ కళాశాలలు, ప్రయివేటు పాలిటెక్నిక్ యాజమాన్యము వారు వసూలు చేస్తున్న కేపిటేషన్ ఫీజును పూర్తిగా రద్దు చేసి సాంకేతిక విద్యావకాశములు అందరికి అందుబాటు చేయాలనే దృఢనిశ్చయముతో దాని స్థానే ఇంజనీరింగు కళాశాల ప్రవేశమునకు ఒక ప్రవేశ పరీక్షను, అదేవిధంగా పాలిటెక్నిక్ కళాశాల ప్రవేశమునకు మరియొక ప్రవేశ పరీక్షను నిర్వహించి, ఈ ప్రవేశ పరీక్షలలో విద్యార్థులు సంపాదించుకున్న మెరిట్ ప్రాతిపదిక పైన ఈ సాంకేతిక విద్య కళాశాలలో ప్రవేశాన్ని అర్హులైన విద్యార్థిని విద్యార్థులందరికి కల్పించుట జరిగింది.

ఈ రాష్ట్రములో మొత్తం భారతదేశములో గల మొట్టమొదటి సాంకేతిక విశ్వవిద్యాలయం 1972లో ప్రభుత్వ ఆధీనంలో నిర్వహించబడుతున్న నాలుగు ఇంజనీరింగు కళాశాలలతో జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం ఏర్పాటు చెయటం జరిగింది. ఈ సాంకేతిక విశ్వవిద్యాలయం ఇంజనీరింగ్ - నాన్ - ఇంజనీరింగ్ విభాగములలో వివిధ రకములైన క్రొత్త కోర్సులను క్రమ పద్ధతిలో నిర్వహించి యిందు జయప్రదముగా విద్యాభ్యాసము పూర్తి చేసుకొన్న యువతీ యువకులు రాష్ట్రములో వివిధ రంగములలో ఉన్నత పదవులనధిష్టించి రాష్ట్రాభివృద్ధికి వారి కృషిని నిర్వహించుటకు తోడ్పడింది. ఈ సాంకేతిక విశ్వవిద్యాలయములో, సాంకేతిక పరిశోధనలో

గణనీయమైన కృషిని సాధించిన వారు రాష్ట్ర పారిశ్రామిక అభివృద్ధి, ఉత్పత్తి పెంపుదలకు తోడ్పడుతున్నారు.

సాంకేతిక విద్యాశాఖ 1983వ సంవత్సరము నాటి బడ్జెట్ కేటాయింపు ఎనిమిది కోట్ల రూపాయలు కాగా నేడు రాష్ట్ర సాంకేతిక విద్యాశాఖ వార్షిక బడ్జెట్ కేటాయింపు 24 కోట్ల రూపాయలకు పెరిగింది. సాంకేతిక విద్య ఎంతో వ్యయ ప్రయాసలతో కూడుకున్న విషయం. సాధారణముగా ఒక పాలిటెక్నిక్ కళాశాలను ఏర్పాటు చేయాలంటే సుమారు 285 లక్షల రూపాయలు ఖర్చు అవుతుంది. అదేవిధంగా ఒక ఇంజనీరింగ్ కళాశాలను స్థాపించాలంటే సుమారు 10 కోట్ల రూపాయల వరకు ఖర్చు అవుతుంది. సాంకేతిక విద్యకు వుండే విలువల దృష్ట్యా ప్రభుత్వం ఈ ఆర్థిక ప్రయాసలను కూడా లక్ష్య పెట్టకుండా తమకుగల పరిధిలో ఈ పాలిటెక్నిక్ కళాశాలలకు, ఇంజనీరింగ్ కళాశాలలకు, కావలసిన వనరులను కల్పిస్తోంది. రాష్ట్ర ప్రభుత్వం పాలిటెక్నిక్ కళాశాలలోని యంత్రముల ఆధునీకరణకు సుమారు 650 లక్షల రూపాయల వరకు ఖర్చు చేయటం జరిగింది.

1983వ సంవత్సరములో పూర్తి స్వయం ప్రతిప్రత్తితో రాష్ట్ర సాంకేతిక విద్యా మరియు శిక్షణ మండలిని ఏర్పాటు చేయటం జరిగింది. ఈ శిక్షణ మండలిని సామాజిక అవసరములను దృష్టిలో నుంచుకొని మారుతున్న కాలానికి అనుగుణంగా సాంకేతిక విద్యాశాఖ క్రొత్త కోర్సులను ఎక్స్‌పర్ట్ కమిటీల సిఫారసు మేరకు రూపొందించి ఆయా కోర్సులను రాష్ట్రములో గల వివిధ పాలిటెక్నిక్ కళాశాలలో ప్రవేశపెడతారు. కొత్తగా రూపొందించిన కోర్సులలో ముఖ్యముగా చెప్పుకోదగ్గవి (అ) పోస్టు డిప్లొమా కోర్సులు (ఆ) డిప్లొమా కోర్సు, కామర్సు మరియు కంప్యూటర్ ప్రాక్టీసు (ఇ) కంప్యూటర్ విభాగములో డిప్లొమా కోర్సు (ఈ) ఎలక్ట్రానిక్స్ మరియు ఎలక్ట్రికల్ ఇంజనీరింగ్‌లో డిప్లొమా కోర్సు (ఉ) ఎకౌంటింగ్ మరియు టాక్సేషన్‌తో డిప్లొమా కోర్సు. ఇంతేకాకుండా రాష్ట్ర సాంకేతిక విద్యాశాఖమండలివారు ఇంకా క్రొత్త కోర్సులను హోటలజీ, మార్కెటింగ్ - సేల్సు మేనేజిమెంట్‌లలో పార్య ప్రణాళికలను రూపొందించటం జరిగింది. ఈ కోర్సులను కూడ రానున్న సంవత్సరములలో కొన్ని పాలిటెక్నిక్ కళాశాలలో ప్రవేశపెడతారు.

సాధారణముగా ఈ పాలిటెక్నిక్ కళాశాలలను ఎంపిక చేయటంలో గాని, దానిలో కోర్సులను నిర్ణయించుటలో గాని ఆయా ప్రాంతములో గల ఉపాధి అవకాశములు, వనరులను దృష్టిలో నుంచుకొని తగు నిర్ణయము తీసుకొనుట జరుగుతుంది.

సాంకేతిక విద్యాశాఖ శిక్షణ మండలి పాలిటెక్నిక్ పరీక్షలకే పరిమితం కాకుండా రాష్ట్రంలో సుమారు 340 కేంద్రములలో టైపురైటింగ్, షార్టుహాండు, వ్యవసాయము మరియు ఇతర టెక్నికల్ పరీక్షలను ప్రతి సంవత్సరము నిర్వహించి, వివిధ శాఖలలో శిక్షణ పొంది పరీక్షలలో కృతార్థులైన యువతి యువకులకు సర్టిఫికేట్లు ఇవ్వటం జరుగుతోంది.

### అప్రెంటిస్‌లో శిక్షణావకాశములు :

ఇంజనీరింగ్ కళాశాలలోను, పాలిటెక్నిక్ కళాశాలలోను విద్యార్థిని విద్యార్థులకు యిచ్చు శిక్షణద్వారా వారు పారిశ్రామిక అవసరములకు పూర్తిగా పనికివచ్చే స్థితికిరారు. ఈ శిక్షణ తరువాత కొంత ప్రత్యేకించి పారిశ్రామిక సంస్థలలో అప్రెంటిస్ శిక్షణానంతరం వారు పారిశ్రామిక సంస్థల విధి నిర్వహణను పూర్తిగా చేయగలుగుతారు. ఇందుకుగాను సాంకేతిక విద్యాశాఖ సంచాలకులు, దక్షిణభారత అప్రెంటిస్ శిక్షణ మండలి సంచాలకులు వారి సహకారముతో రాష్ట్రములోగల 168 సంస్థలలో సుమారు 1,200 విద్యార్థిని విద్యార్థులకు అప్రెంటిస్ శిక్షణావకాశము కల్పిస్తున్నారు. ఈ అప్రెంటిస్ శిక్షణ కాలములో నెలకు చేయబడ్డ ప్రతి విద్యార్థిని విద్యార్థులకు నెలకు రు. 500/- చొప్పున ఒక సంవత్సర కాలము పారితోషికము లభించగలదు. అదేవిధముగా ఇంజనీరింగ్ కళాశాలలో ఉత్తీర్ణులైన యువతీ యువకులకు నెలకు రు. 750/-ల చొప్పున ఒక సంవత్సరము అప్రెంటిస్ శిక్షణ కాలము నందు ఈ పారితోషికము లభించగలదు. ఈ శిక్షణావకాశములు విస్తృత పరిచే కార్యక్రమములో రాష్ట్ర ప్రభుత్వం వారు మరికొన్ని పారిశ్రామిక సంస్థలను ఈ అప్రెంటిస్ శిక్షణ

పరిధిలో తీసుకొను వచ్చుటకు ప్రయత్నిస్తున్నారు. ఈ అప్రెంటిస్ శిక్షణ వలన రాష్ట్రములో సుమారు 1000 మంది ఇంజనీరింగ్ డిగ్రీ పాసైన విద్యార్థిని విద్యార్థులు మరియు 4000 మంది పాలిటెక్నిక్ కోర్సులలో శిక్షణ పూర్తి చేసిన విద్యార్థిని విద్యార్థులకు అవకాశము కల్పించుటకు సాంకేతిక విద్యాశాఖ కృషి చేస్తోంది.

సాంకేతిక విద్యాశాఖ సంచాలకులు, "సూపర్‌వైజరీ డెవలప్‌మెంటు కార్యక్రమము" ద్వారా రాష్ట్రములో గల పాలిటెక్నిక్ కళాశాలలో ఆఖరి సంవత్సరము చదువుకుంటున్న విద్యార్థిని విద్యార్థులకు వివిధ రకములయిన పరిశ్రమలలో ఉన్నత పదవులు నధిష్ఠించిన ప్రతిభావంతులను, పారిశ్రామిక వేత్తలను ఆహ్వానించి పాలిటెక్నిక్ చదువు పూర్తియైన విదప విద్యార్థిని విద్యార్థులకు కల ఉపాధి అవకాశములు, స్వయం ఉపాధి పథక వివరములతో కూడిన కార్యక్రమాన్ని అందిస్తున్నారు. ఇంతేకాకుండా ఈ కార్యక్రమములోని ఒక భాగంగా విద్యార్థిని విద్యార్థులకు " మాక్ మోడలు ఇంటర్వ్యూస్ " ద్వారా ఇంటర్వ్యూలకు సంబంధించిన పూర్తి వివరముల కార్యక్రమాన్ని నిర్వహిస్తున్నాము. దీనివలన విద్యార్థిని విద్యార్థుల చదువు పూర్తియైన విదప వారికి గల ఉపాధి అవకాశములను గురించి తెలుసుకొనుటయే కాకుండా ఇంటర్వ్యూలలో ప్రవర్తించ వలసిన తీరులు, మెళకువలను గురించి కూడ తెలుసుకొనగలుగుతున్నారు. ఈ కార్యక్రమము అమలు చేయుటకు రాష్ట్ర ప్రభుత్వం వారు ఒక లక్ష రూపాయల నిధులను మంజూరు చేశారు.

## పాలిటెక్నిక్ కోర్సులు పూర్తి చేసిన విద్యార్థిని విద్యార్థులకు పై చదువులు చదువుటకు గల అవకాశములు:

ఈ రాష్ట్రములో ప్రతి సంవత్సరము సుమారు 5000 మంది విద్యార్థిని విద్యార్థులు పాలిటెక్నిక్‌లో గల ఇంజనీరింగ్ విభాగములో శిక్షణ జయప్రదముగా పూర్తి చేయుచున్నారు. ఈ పాలిటెక్నిక్ శిక్షణ పూర్తిగా "టెర్మినల్ కోర్సెస్" అయినప్పటికి అర్హత కలిగిన విద్యార్థిని విద్యార్థులు పై చదువులు చదువుకొనుటకు అవకాశము కల్పించే సదుద్దేశ్యముతో రాష్ట్రములో గల ఏడు యూనివర్సిటి ఇంజనీరింగ్ కళాశాలలోను పాలిటెక్నిక్ పాసైన విద్యార్థిని విద్యార్థులు నాలుగు సంవత్సరముల పార్ట్ - టైము బి.ఇ. డిగ్రీ కోర్సులు నిర్వహించుట జరుగుతోంది. ఇందులో 770 విద్యార్థిని విద్యార్థులకు సివిల్, మెకానికల్, ఎలక్ట్రికల్ మరియు ఎలక్ట్రానిక్స్‌లో ప్రవేశాన్ని కల్పిస్తున్నాయి. ఇంతేకాకుండా రాష్ట్రములో గల పదకొండు ప్రైవేటు ఇంజనీరింగ్ కళాశాలలలోను పాలిటెక్నిక్ డిప్లొమా పాసైన విద్యార్థిని విద్యార్థులకు మూడు సంవత్సరముల ఫుల్ టైము కోర్సులను నిర్వహించటము జరుగుతోంది. ఇందులో సుమారు ఆరు వందల మంది విద్యార్థిని విద్యార్థులకు ప్రవేశము కల్పించటము జరుగుతోంది. ఇంతేకాకుండా పాలిటెక్నిక్ పాసైన విద్యార్థిని విద్యార్థులకు ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంజనీరింగ్ వారు నిర్వహిస్తున్న ఎ.ఎమ్.ఐ.ఇ పరీక్షలకు ఎలక్ట్రానిక్స్ మరియు టెలికమ్యూనికేషన్ ఇంజనీరింగు వారు నిర్వహిస్తున్న ఎ.ఎమ్.ఐ.టి.ఇ పరీక్షలు చదువుకొనుటకు అందరికి అర్హత కలదు. ఇది మాత్రమే కాకుండా జవహర్‌లాల్ నెహ్రూ సాంకేతిక విశ్వవిద్యాలయం వారు నిర్వహించే కాంటాక్ట్ కమ్ - కరస్పాన్‌డెన్సు పరీక్షలు చదువుకొనుటకు కూడ వీరికి అర్హత కలదు. ఈ విధంగా మన రాష్ట్రములో పాలిటెక్నిక్ చదువు పూర్తి చేసిన విద్యార్థిని విద్యార్థులకు పై చదువులకు గల అవకాశములు మన దేశములో మరియే ఇతర రాష్ట్రములో లేవనటంలో ఎంతమాత్రం అతిశయోక్తి లేదు.

## ఇంజనీరింగ్ విద్యాసంస్థలు - పారిశ్రామిక సంస్థలు - సమన్వయ కృషి :

సాంకేతిక విద్య ద్వారా జాతి ప్రజ యొక్క దైనందిన అవసరములు తీర్చుటయే కాకుండా, రాష్ట్రములోని పారిశ్రామిక సంస్థలకు కావలసిన సాంకేతిక సిబ్బందిని మంచి శిక్షణతో తీర్చిదిద్ది ఈ పారిశ్రామిక సంస్థల ఉత్పత్తి, పెంపుదలకు ఇతోధిక ప్రోత్సాహము కల్పించవలసి ఉంటుంది. సాంకేతిక విద్యా సంస్థలలో ఇచ్చిన శిక్షణ పారిశ్రామిక ఉత్పత్తి పెంపుదలకు ఎంతగానో సహాయపడుతుంది. దేశములో స్వాతంత్రము వచ్చినది మొదలు కేంద్ర రాష్ట్ర ప్రభుత్వాలు సాంకేతిక కళాశాలల - పారిశ్రామిక సంస్థల మధ్య సరియైన సమన్వయ సాధనకు గట్టి కృషి చేస్తున్నారు. కాని

ఈ కృషి ఆశించిన మేరకు ఫలితాలను అందించలేకపోయింది. దీనికి పూర్తి బాధ్యత సాంకేతిక విద్యాశాఖలలో పనిచేస్తున్న ఉపాధ్యాయ వర్గం వారు, అదేవిధంగా పారిశ్రామిక వేత్తలు, వహించవలసి ఉంటుంది.

రాష్ట్రములో ఇంటర్‌మీడియట్ విద్యాశాఖ వారు నడుపుతున్న వొకేషనల్ కోర్సెస్ జయప్రదముగా నిర్వహించుటలో సాంకేతిక విద్యాశాఖ వారు తమ పూర్తి సహాయసహకారములను అందిస్తున్నారు. రాష్ట్ర యువశక్తి వారు నిర్వహిస్తున్న యువశక్తి శిక్షణ కార్యక్రమములలో సాంకేతిక విద్యాశాఖ వారు, మోటార్ వైండింగ్, స్కూటర్ల రిపేరు మరియు సర్వీసింగు కోర్సుల నిర్వహణకు రాష్ట్రములోని వివిధ పాలిటెక్నిక్‌లలో యువతీ యువకులు వివిధ రకములయిన సాంకేతిక విద్యను సముపార్జించుకొని చిన్నతరహా సర్వీసింగు కేంద్రములను ఏర్పరుచు కొనుటకు పూర్తి ప్రోత్సాహాన్ని కల్పిస్తున్నారు.

భారత సాంకేతిక విద్యామండలిని, సాంకేతిక విద్యా ప్రమాణములను పెంచుటకు వీలుగ పూర్తి అధికారములతో స్వయం ప్రతిపత్తి గల సంస్థగా కేంద్ర ప్రభుత్వము రూపొందించుట జరిగినది. ఈ సాంకేతిక విద్యామండలి రాష్ట్రములలో గల సాంకేతిక విద్యాశాఖ మండలులతో సంప్రదించి మారుతున్న కాలానికి అనుగుణంగా క్రొత్త కోర్సులను రూపొందించటం, ఇంజనీరింగ్ కళాశాలల, పాలిటెక్నిక్ కళాశాలలకు కావలసిన సాధన సంపత్తిని రూపొందించుట, ఈ క్రొత్తగా ఏర్పాటుచేసిన కళాశాలలకు గుర్తింపు కల్పించుట మరియు ఇంజనీరింగ్, పాలిటెక్నిక్ కళాశాలలో పనిచేయు సిబ్బందులకు కావలసిన ప్రత్యేక వేతనములు, పనితీరులకు సమగ్రమయిన పథకములను రూపొందించుట సాంకేతిక విద్యాప్రమాణమును అభివృద్ధిచేయుటకు నిర్దిష్టమైన కార్యక్రమములను తయారు చేసి రాష్ట్రముల సహకారములతో సాంకేతిక విద్యా విలువలను పెంపొందించుటకు ఈ సంస్థ ఎంతగానో సహాయపడుతోంది. ఇంతేకాకుండా ఈ భారతీయ సాంకేతిక విద్యామండలి సాంకేతిక విద్యను నిర్వహిస్తున్న కళాశాలలు - పరిశ్రమల మధ్య ఇతోధిక సంబంధములను పెంచుటకు విశేషమైన కృషిని స[illegible]వహిస్తుంది.

భారత సాంకేతిక విద్యామండలిదేశములోని వివిధ రాష్ట్ర సాంకేతిక విద్యామండలితో సంప్రదించి మారుతున్న కాలానికి అనుగుణంగా మన దేశ పారిశ్రామికాభివృద్ధికి పనికివచ్చు క్రొత్త కోర్సులను రూపొందించవలసి ఉంటుంది. ఈ క్రొత్త కోర్సులలో ముఖ్యముగా చెప్పదగ్గవి, కంప్యూటరు సైన్సు, కంప్యూటరు ఇంజనీరింగు విభాగములలో నాలుగు సంవత్సరముల డిగ్రీ కోర్సులు, రాబటిక్సు విభాగములో కోర్సులు, పెట్రోకెమికల్సు విభాగములో మరికొన్ని ప్రత్యేకమైన కోర్సులు. ఇంతేకాకుండా మన దేశములో ఎంతో ఖర్చుతో నిర్వహిస్తున్న ఐ.ఐ.టిలు ప్రాంతీయ ఇంజనీరింగు కళాశాలల నుండి పట్టభద్రులైన విద్యార్థులు ఎక్కువ స్థాయిలో ఇతర దేశములకు ఉద్యోగాన్వేషణకై, పై చదువులు చదువుటకై వెళ్ళుచున్నారు. దీనిని కూడ కొంతవరకు భారత సాంకేతిక విద్యామండలి ఈ పట్టభద్రులైన విద్యార్థులు ఇతర దేశముల పై మోజు చూపించుటకు గల కారణములు పరిశీలించి, కేంద్రప్రభుత్వము దాన్ని నిరోధించుటకు కావలసిన సూచనలు ఇవ్వవలసి ఉంటుంది. రానున్న సంవత్సరములలో భారత సాంకేతిక విద్యామండలి కృషితో ఈ దేశములోని సాంకేతిక విద్య భారతదేశములోని అన్ని రాష్ట్రములలో పారిశ్రామికాభివృద్ధి, ఉత్పత్తి పెంపుదలకు పూర్తి దోహదం చేకూర్చటానికి కావలసిన సలహాలను, సూచనలను అందిస్తుందని ఆశిద్దాం.

## ఆంధ్రప్రదేశ్‌లోని సాంకేతిక విద్యా వివరణలు

**1. ఇంజనీరింగు కళాశాలలు:**

| | 1988 | 1972 |
|---|---|---|
| అ) యూనివర్సిటీల వారి యాజమాన్యంలోనివి | 8 | 4 ప్రభుత్వ ఇంజనీరింగు కళాశాలలు |
| ఆ) ప్రయివేటు మేనేజిమెంటులో పనిచేయుచున్నవి | 16 | - |
| ఇ) కెమికలు, ఫారసి, మైనింగు ఇంజనీరింగు కళాశాలలు (యునివర్సిటీ ఆధీనములోనివి) | 4 | 4 |

**2. పాలిటెక్నికు కళాశాలలు :**

| | 1988 | 1973 |
|---|---|---|
| అ) బాలుర పాలిటెక్నికు కళాశాలలు | 50 | 18 |
| ఆ) బాలికల పాలిటెక్నికు కళాశాలలు | 19 | 2 |
| ఇ) ప్రభుత్వ మోడలు రెసిడెన్షియల్ పాలిటెక్నికు కళాశాలలు | 6 | - |
| ఈ) ఎడ్వాన్సు టెక్నిషియను సంస్థలు | 3 | - |
| ఉ) ప్రభుత్వ బాలికల వొకేషనలు శిక్షణా సంస్థలు | 2 | 2 |

**మొత్తం ఇంజనీరింగు కళాశాలలోని సీట్లు: 5405**

| | | |
|---|---|---|
| 1. | సివిలు ఇంజనీరింగు విభాగము | 1657 |
| 2. | ఎలక్ట్రికల్ ఇంజనీరింగు విభాగము | 499 |
| 3. | ఎలక్ట్రానిక్సు ఇంజనీరింగు విభాగము | 1110 |
| 4. | మెకానికల్ ఇంజనీరింగు విభాగము | 1,531 |
| 5. | కంప్యూటరు ఇంజనీరింగు విభాగము | 147 |
| 6. | బయోమెడికలు ఇంజనీరింగు విభాగము | 10 |
| 7. | కెమికల్ ఇంజనీరింగు విభాగము | 165 |
| 8. | మెటలర్జి విభాగము | 47 |
| 9. | మైనింగు ఇంజనీరింగు విభాగము | 25 |
| 10. | ప్రొడక్షను ఇంజనీరింగు విభాగము | 100 |
| 11. | ఆర్కిటెక్చరు శాఖ | 60 |
| 12. | మెరైను ఇంజనీరింగు విభాగము | 9 |
| 13. | అప్లైడు ఆర్టు | 45 |

**పాలిటెక్నికులలోని సీట్ల వివరాలు :**
**నిర్వహిస్తున్న కోర్సులు : 26**

| | | |
|---|---|---|
| 1. | సివిల్ ఇంజనీరింగు శాఖ | 2,805 |
| 2. | ఎలక్ట్రికల్ ఇంజనీరింగు శాఖ | 1,040 |
| 3. | మెకానికల్ ఇంజనీరింగు శాఖ | 2,355 |
| 4. | ఎలక్ట్రానిక్సు ఇంజనీరింగు శాఖ | 1,860 |
| 5. | ఆటోమొబైలు ఇంజనీరింగు శాఖ | 240 |
| 6. | ఆర్కిటెక్చరు శాఖ | 230 |
| 7. | కంప్యూటరు ఇంజనీరింగు శాఖ | 150 |
| 8. | ఫార్మసీ శాఖ | 500 |
| 9. | కామర్సు మరియు కంప్యూటరు శాఖ | 790 |
| 10. | కెమికల్ ఇంజనీరింగు శాఖ | 40 |
| 11. | మైనింగు ఇంజనీరింగు శాఖ | 160 |
| 12. | మెటలర్జి ఇంజనీరింగు శాఖ | 130 |
| 13. | సాండ్‌విచ్ మెకానికల్ ఇంజనీరింగు శాఖ | 30 |
| 14. | సాండ్‌విచ్ ఎలక్ట్రానిక్సు శాఖలు | 120 |
| 15. | సుగరు టెక్నాలజి | 24 |
| 16. | ప్రింటింగు శాఖలు | 90 |
| 17. | లెదరు టెక్నాలజి | 30 |
| 18. | టెక్స్‌టైలు టెక్నాలజి | 60 |
| 19. | సిరమిక్సు శాఖ | 60 |
| 20. | ఇతర నాన్-ఇంజనీరింగు శాఖలు(7) | 185 |
| | | (10,869) |

## సాంకేతిక విద్య నేడు - రేపు



అనుబంధం
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
సాంకేతిక విద్యాశాఖ
ప్రభుత్వ మరియు ప్రయివేటు పాలిటెక్నిక్‌లు / ఇంజనీరింగు కళాశాలలు(యునివర్సిటీ మరియు ప్రయివేటు)వివరాలు : (జిల్లాలవారీగా)

| | పాలిటెక్నిక్‌లు | | ఇంజనీరింగు కళాశాలలు | |
|---|---|---|---|---|
| | ప్రభుత్వ | ప్రయివేటు | యూనివర్సిటీ | ప్రయివేటు |
| శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయ పరిధిలోవి | 15 | 6 | 2 | 3 |

| | వివిధశాఖలు | నిర్దేశించిన సీట్లు |
|---|---|---|
| **నెల్లూరు జిల్లా: ప్రభుత్వ పాలిటెక్నిక్‌లు** | | |
| 1.ప్రభుత్వ పాలిటెక్నిక్:నెల్లూరు(1960) | సివిలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | మెకానికలు | 50 |
| | డి.సి.సి.పి. | 45 |
| 2.ప్రభుత్వ మహిళా పాలిటెక్నిక్:నెల్లూరు (1984) | డి.సి.సి.పి. | 45 |
| | డి.డి.ఎస్. | 30 |
| | ఎలక్ట్రానిక్స్ | 50 |
| 3.ప్రభుత్వ పాలిటెక్నిక్:గూడూరు(1968) | సివిలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | మెకానికలు | 50 |
| | మైనింగు | 40 |
| 4.ప్రభుత్వ సిరమిక్సు ఇన్‌స్టిట్యూట్, గూడూరు(1988) | సిరమిక్సు టెక్నాలజీ | 60 |
| **ప్రయివేటు ఇంజనీరింగు కళాశాలలు:** | | |
| 1.ఎన్.బి.కె.ఆర్.ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ టెక్నాలజీ,నెల్లూరు(1980) | సివిలు | 60 |
| | ఎలక్ట్రికలు | 6 |
| | ఎలక్ట్రానిక్సు | 60 |
| | మెకానికలు | 60 |
| **చిత్తూరు జిల్లా : ప్రభుత్వ పాలిటెక్నిక్‌లు :** | | |
| 1.ఎస్.వి.ప్రభుత్వ పాలిటెక్నిక్: తిరుపతి (1957) | సివిలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| | ఫార్మసి | 40 |
| | మెకానికలు | 50 |
| | షుగర్‌టెక్నాలజీ | 12 |
| 2.ఎడ్వాన్సుటెక్నీషియను శిక్షణా సంస్థ (1985) | భూగర్భజల శాస్త్రము | 20 |
| | కంప్యూటరు | 20 |
| | ఫారమ్‌మెషినరి | 20 |
| **పార్టు టైం డిప్లొమా కోర్సులు :** | సివిలు | 30 |
| | ఎలక్ట్రానిక్సు | 30 |
| | మెకానికలు | 30 |
| 3.ప్రభుత్వ మోడలు రెసిడెన్షియలు పాలిటెక్నిక్,మదనపల్లి(1987) | సివిలు | 40 |
| | మెకానికలు | 40 |
| | ఎలక్ట్రానిక్సు | 40 |
| 4.ప్రభుత్వ మహిళా పాలిటెక్నిక్, పలమనేరు(1985) | ఆర్కిటెక్చరు | 40 |
| | సివిలు | 50 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| **ప్రయివేటు పాలిటెక్నిక్‌లు :** | | |
| 1.శ్రీమతి పద్మావతి మహిళా పాలిటెక్నిక్, తిరుపతి(1975) | ఎలక్ట్రానిక్సు | 50 |
| | ఫార్మసి | 30 |
| | డి.సి.పి. | 45 |
| | డి.సి.ఎఫ్.టి | 30 |
| 2.ఎస్.వి.ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ట్రెడిషనలు ఆర్ట్సు మరియు స్కల్ప్చర్ తిరుపతి | డి.టి.ఎస్.ఎ. | 20 |
| **ఇంజనీరింగు కళాశాలలు :** | | |
| 1.శ్రీవెంకటేశ్వర విశ్వవిద్యాలయ ఇంజనీరింగు కళాశాల, తిరుపతి (1955) | సివిలు | 60 |
| | ఎలక్ట్రికలు | 20 |
| | ఎలక్ట్రానిక్సు | 20 |
| | కెమికలు | 15 |
| | మెకానికలు | 40 |
| **పార్టుటైంకోర్సులు:** | సివిలు | 30 |
| | ఎలక్ట్రికలు | 30 |
| | మెకానికలు | 30 |
| | ఎలక్ట్రానిక్సు | 20 |
| **పోస్టుగ్రాడ్యుయేటు కోర్సులు: (1959)** | సివిలు | 10 |
| | మెకానికలు | 10 |
| | ఎలక్ట్రానిక్సు | 10 |
| **కడప జిల్లా :** | | |
| ప్రభుత్వ మహిళా పాలిటెక్నిక్:కడప (1985) | సివిలు | 50 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| | ఫార్మసి | 30 |

| | | |
|---|---|---|
| 2.ప్రభుత్వ పాలిటెక్నిక్,ప్రొద్దుటూరు (1958) | సివిలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | మెకానికలు | 40 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |

**ప్రయివేటు పాలిటెక్నిక్‌లు :**

| | | |
|---|---|---|
| 1.వై.ఎస్.ఆర్.ఆర్.పాలిటెక్నిక్, పులివెందుల (1980) | సివిలు | 70 |
| | మెకానికలు | 70 |
| | మైనింగు | 40 |
| 2.ఎస్.వి.సి.పాలిటెక్నిక్,బద్వేలు (1984) | సివిలు | 75 |
| | మెకానికలు | 75 |
| | ఫార్మసి | 30 |

**3. ప్రైవేటు ఇంజనీరింగు కళాశాల :**

| | | |
|---|---|---|
| 1.కె.ఎస్ఆర్.ఎం.ఇంజనీరింగు కళాశాల,కడప (1980) | సివిలు | 60 |
| | ఎలక్ట్రికలు | 30 |
| | ఎలక్ట్రానిక్సు | 30 |
| | మెకానికలు | 60 |
| 3 సంవత్సరాల పుల్‌టైం డిగ్రీ కోర్సు (డిప్లమా హోల్డర్లకు మాత్రం) | ఎలక్ట్రానిక్సు | 40 |

**అనంతపురం జిల్లా :**

| | | |
|---|---|---|
| 1.ప్రభుత్వ పాలిటెక్నిక్,అనంతపురం (1960) | ఆటోమొబైలు | 40 |
| | సివిలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| 2.ప్రభుత్వ మహిళా పాలిటెక్నిక్, హిందూపురం (1985) | సివిలు | 50 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| | ఫార్మసి | 30 |
| | డి.సి.పి. | 40 |

**ఇంజనీరింగు కళాశాల :**

| | | |
|---|---|---|
| 1.ఇంజనీరింగు కళాశాల, అనంతపురం (1946) | సివిలు | 60 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | ఎలక్ట్రానిక్సు | 40 |
| | మెకానికలు | 40 |
| **పార్టుటైం డిగ్రీ కోర్సులు** | సివిలు | 30 |
| | ఎలక్ట్రికలు | 30 |
| | ఎలక్ట్రానిక్సు | 20 |
| | మెకానికలు | 30 |
| **పోస్టు గ్రాడ్యుయేటు డిగ్రీ కోర్సులు** | సివిలు స్ట్రక్చర్సు | 10 |
| | ఎలక్ట్రికలు | 10 |
| | మెకానికలు | 10 |
| | రెఫ్రిజిరేషను | |

**కర్నూలు జిల్లా :**

| | | |
|---|---|---|
| 1.ఇ.ఎస్.సి. ప్రభుత్వ పాలిటెక్నిక్, నంద్యాల (1960) | సివిలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | మెకానికలు | 50 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| 2.ప్రభుత్వ మోడలు రెసిడెన్షియలు పాలిటెక్నిక్ శ్రీశైలం (1985) | సివిలు | 60 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | మెకానికలు | 50 |
| 3.ఎస్.జి.వి.ఆర్.ప్రభుత్వ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఫార్మసి,కర్నూలు (1984) | ఫార్మసి | 60 |

**ప్రైవేటు పాలిటెక్నిక్‌లు**

| | | |
|---|---|---|
| 1.టి.జి.యల్.సి.పాలిటెక్నిక్, ఆదోని (1982) | సివిలు | 50 |
| | మెకానికలు | 50 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| 2.వాసవి పాలిటెక్నిక్, బనగాపల్లి (1984) | సివిలు | 60 |
| | ఎలక్ట్రానిక్సు | 60 |
| | మెకానికలు | 60 |

**ప్రయివేటు ఇంజనీరింగు కళాశాల :**

| | | |
|---|---|---|
| 1. జి.పి.ఆర్. ఇంజనీరింగు కళాశాల, కర్నూలు (1984) | సివిలు | 60 |
| | ఎలక్ట్రానిక్సు | 60 |
| | మెకానికలు | 60 |

**ఆంధ్ర విశ్వవిద్యాలయ పరిధిలోనివి :**

| | | | |
|---|---|---|---|
| ప్రభుత్వ పాలిటెక్నిక్‌లు: | 16 | యూనివర్సిటి ఇంజనీరింగు కళాశాలలు | 3 |
| ప్రైవేటు " " | 12 | ప్రయివేటు ఇంజనీరింగు కళాశాలలు: | 7 |

| | కోర్సుల జాబితా | నిర్దేశించిన సీట్లు |
|---|---|---|
| **శ్రీకాకుళం జిల్లా :** | | |
| 1.ప్రభుత్వ పాలిటెక్నిక్, శ్రీకాకుళం | సివిలు | 50 |
| | ఎలక్ట్రికలు, | |
| | ఎలక్ట్రానిక్సు | 40 |
| | మెకానికలు | 50 |
| | డి.సి.సి.పి. | 45 |
| **విజయనగరం జిల్లా :** | | |
| 1.ప్రభుత్వ పాలిటెక్నిక్, విజయనగరం | సివిలు | |
| | ఇంజనీరింగు | 50 |
| | మెకానికలు | 50 |
| | మెటలర్జీ | 30 |

**విశాఖపట్నం జిల్లా :**

| సంస్థ | కోర్సు | సీట్లు |
|---|---|---|
| 1.ప్రభుత్వ పాలిటెక్నిక్, విశాఖపట్నం (1956) | సివిలు ఇంజనీరింగు | 50 |
| | మెకానికలు | 50 |
| | మెటలర్జి | 35 |
| | మెకానికలు (సాండ్‌విచ్) | 30 |
| | కెమికలు | 20 |
| | ఫార్మసి | 40 |
| | పార్టుటైం | |
| | సివిలు | 40 |
| | మెకానికలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| 2.ఎడ్వాన్సుటెక్నిషియను ఇనిస్టిట్యూట్(1985) | పెట్రోకెమికల్సు టెక్నాలజి | 20 |
| | ఫౌండ్రిటెక్నాలజి | 20 |
| | ప్లాంటుఇంజనీరింగు మెయింటైనెన్సు | 20 |
| | వెల్డింగుటెక్నాలజి | 20 |
| | ప్లాస్టిక్‌టెక్నాలజి | 20 |
| 3.ప్రభుత్వ మహిళా పాలిటెక్నిక్, భీమునిపట్నం(1984) | డి.సి.పి. | 45 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| 4.ప్రభుత్వ పాలిటెక్నిక్,నర్సీపట్నం (1985) | మెకానికలు | 50 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| | మైనింగు | 40 |
| 5.ప్రభుత్వ మోడలురెసిడెన్షియలు పాలిటెక్నిక్,పాడేరు(1984) | సివిలు | 50 |
| | మెకానికలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |

**ఇంజనీరింగు కళాశాలలు :**

| సంస్థ | కోర్సు | సీట్లు |
|---|---|---|
| 1.ఆంధ్రవిశ్వవిద్యాలయ ఇంజనీరింగు కళాశాల విశాఖపట్నం(1955) | సివిలు | 60 |
| | మెకానికలు | 30 |
| | మెక్‌మెరైను | 8 |
| | మెటలర్జి | 17 |
| | ఎలక్ట్రికలు | 30 |
| | ఎలక్ట్రానిక్సు | 30 |
| | కంప్యూటరు సైన్సు | 17 |
| | కెమికలు | 60 |
| పార్టుటైం | సివిలు | 30 |
| | ఎలక్ట్రికలు | 30 |
| | ఎలక్ట్రానిక్సు | 20 |
| | మెకానికలు | 30 |
| పోస్ట్‌గ్రాడ్యుయేట్ కోర్సులు | కెమికలు | 60 |
| | సివిలు | 12 |
| | మెకానికలు | 12 |
| | ఎలక్ట్రికలు | 12 |
| | ఎలక్ట్రానిక్సు | 12 |
| | కంప్యూటర్సు | 12 |
| 2.ఆంధ్రవిశ్వవిద్యాలయసైన్సు, టెక్నాలజీకళాశాల విశాఖపట్నం(1931) | ఫార్మసి | 30 |

**3. ప్రయివేటు ఇంజనీరింగు కళాశాల**

| సంస్థ | కోర్సు | సీట్లు |
|---|---|---|
| 3.గాంధీ ఇనిస్టిట్యూట్ ఆఫ్ ఇంజనీరింగు, విశాఖపట్నం(1980) | సివిలు | 120 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| | మెకానికలు | |
| 4.ఇనిస్టిట్యూట్ ఆఫ్ హోటలు మేనేజిమెంటు,విశాఖపట్నం కేంద్రప్రభుత్వ సంస్థ(1988) | రిసెప్షను | 10 |
| | రెస్టారెంటు, కౌంటరు సర్వీసు | 15 |
| | కుక్కరు | 15 |

**తూర్పుగోదావరి జిల్లా :**

| సంస్థ | కోర్సు | సీట్లు |
|---|---|---|
| 1.ఆంధ్రాపాలిటెక్నిక్,కాకినాడ(1946) | ఆటోమొబైలు | 40 |
| | ఆర్కిటెక్చరు | 50 |
| | సివిలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| | మెకానికలు | 50 |
| పార్టుటైంకోర్సులు | సివిలు | 30 |
| | ఎలక్ట్రికలు | 20 |
| | మెకానికలు | 30 |
| 2.ప్రభుత్వ మహిళా పాలిటెక్నిక్,కాకినాడ (1961) | ఆర్కిటెక్చర్ | 30 |
| | సివిలు | 50 |
| | డి.సి.పి. | 45 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| | ఫార్మసి | 30 |

| | | |
|---|---|---|
| 3.ప్రభుత్వ మోడలురెసిడెన్షియల్ | కంప్యూటరు | |
| పాలిటెక్నిక్,రాజమండ్రి(1987) | సైన్సు | 40 |
| | ఎలక్ట్రానిక్సు | 40 |
| | మెకానికలు | 40 |

ఇంజనీరింగు కళాశాలలు :

| | | |
|---|---|---|
| 1.జవహర్‌లాల్‌నెహ్రూ సాంకేతికవిశ్వ | సివిలు | 60 |
| విద్యాలయఇంజనీరింగుకళాశాల,కాకినాడ | ఎలక్ట్రికలు | 40 |
| (1946) | ఎలక్ట్రానిక్సు | 40 |
| | మెకానికలు | 40 |
| పార్టుటైం డిగ్రీకోర్సులు | సివిలు | 30 |
| | ఎలక్ట్రికలు | 30 |
| | ఎలక్ట్రానిక్సు | 20 |
| | మెకానికలు | 30 |
| పోస్టుగ్రాడ్యుయేట్‌కోర్సులు | సివిలు | 10 |
| | ఫౌరంమెషినరి | 10 |
| | పవరుసిస్టమ్సు | 10 |

పశ్చిమ గోదావరి జిల్లా : ప్రయివేటు పాలిటెక్నిక్‌లు

| | | |
|---|---|---|
| 1.శ్రీముళ్లపూడివెంకటరాయ మెమోరియలు | సివిలు | 60 |
| పాలిటెక్నిక్,తణుకు(1950) | ఎలక్ట్రికలు | 60 |
| | మెకానికలు | 60 |
| 2.సర్‌సి.ఆర్.రెడ్డిపాలిటెక్నిక్,ఏలూరు | సివిలు | 60 |
| (1980) | ఎలక్ట్రికలు | 60 |
| | మెకానికలు | 60 |
| 3.కల్నల్‌డి.యస్.రాజుపాలిటెక్నిక్, | సివిలు | 60 |
| పోడూరు(1981) | ఎలక్ట్రానిక్సు | 60 |
| | మెకానికలు | 60 |
| 4.ఎం.ఆర్.కా.పాలిటెక్నిక్,పీరవాసరం | సివిలు | 60 |
| (1981) | ఎలక్ట్రానిక్సు | 60 |
| | మెకానికలు | 60 |

ప్రయివేటు ఇంజనీరింగు కళాశాలలు :

| | | |
|---|---|---|
| 1.ఎస్.ఆర్.కె.ఆర్.ఇంజనీరింగుకళాశాల | సివిలు | 65 |
| భీమవరం(1980) | ఎలక్ట్రానిక్సు | 65 |
| | మెకానికలు | 50 |
| ఫుల్‌టైం 3 సంవత్సరాల ఇంజనీరింగు డిగ్రీ | మెకానికలు | 40 |
| కోర్సు(డిప్లొమా ఉత్తీర్ణులకు పరిమితం) | ఎలక్ట్రానిక్సు | 40 |
| (1986) | | |

కృష్ణా జిల్లా :

| | | |
|---|---|---|
| 1.ప్రభుత్వ పాలిటెక్నిక్,విజయవాడ(1946) | సివిలు | 50 |
| | ఎలక్ట్రికల్ | 40 |
| | మెకానికల్ | 50 |
| | మెటలర్జి | 35 |
| పార్టుటైము | సివిలు | 30 |
| | ఎలక్ట్రికలు | 30 |
| | మెకానికలు | 30 |

ప్రయివేటు పాలిటెక్నిక్‌లు:

| | | |
|---|---|---|
| 2.వి.కె.ఆర్.మరియు వి.ఎస్.బి. | ఆటో | |
| పాలిటెక్నిక్, గుడివాడ(1981) | మొబైలు | 40 |
| | సివిలు | 70 |
| | మెకానికలు | 70 |
| 3.ఎ.ఎస్.ఎమ్.మరియు | | |
| వి.వి.ఆర్.ఎస్.పాలిటెక్నిక్ | సివిలు | 60 |
| గుడ్లవల్లేరు(1981) | ఎలక్ట్రానిక్సు | 60 |
| | మెకానికలు | 60 |
| 4.శ్రీవరలక్ష్మి పాలిటెక్నిక్,మచిలిపట్నం | సివిలు | 60 |
| (1982) | ఎలక్ట్రానిక్సు | 60 |
| | మెకానికలు | 60 |
| 5.శ్రీమతికోటమ్మారెడ్డి మహిళా | హోటలు | |
| పాలిటెక్నిక్,పామర్రు(1987) | మేనేజిమెంటు | |
| | మరియు అప్లైడు | |
| | న్యూట్రిషను | 60 |
| | కంప్యూటరు | |
| | ఇంజనీరింగ్ | 60 |
| | ఇంటీరియరు | |
| | డెకరేషను | 30 |
| | ఎలక్ట్రానిక్సు | 30 |
| 6.కె.ఇ.ఎస్.మహిళా పాలిటెక్నిక్, | సివిలు | 60 |
| విజయవాడ(1981) | ఎలక్ట్రానిక్సు | 60 |
| | ఫార్మసీ | 40 |

ప్రయివేటు ఇంజనీరింగు కళాశాలలు

| | | |
|---|---|---|
| 1.వి.ఆర్.సిద్ధార్థ ఇంజనీరింగుకళాశాల | సివిలు | 60 |
| విజయవాడ(1977) | ఎలక్ట్రికలు | 60 |
| | మెకానికలు | 120 |
| | ఎలక్ట్రానిక్సు | 40 |

| | | |
|---|---|---|
| 2.కె.ఎల్.ఇంజనీరింగుకళాశాల, | సివిలు | 60 |
| విజయవాడ(1980) | కంప్యూటరు | 40 |
| | మెకానికలు | 120 |
| | ఎలక్ట్రానిక్సు | 60 |
| 3సంవత్సరముల ఫుల్‌టైము ఇంజనీరింగు డిగ్రీ కోర్సు (డిప్లొమా ఉత్తీర్ణులకు పరిమితం) | | |
| 3. ఎస్.వి.హెచ్. ఇంజనీరింగుకళాశాల, | మెకానికలు | 40 |
| మచిలీపట్నం(1980) | సివిలు | 40 |
| | ఎలక్ట్రికలు | 30 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| 3 సంవత్సరాల ఫుల్‌టైము ఇంజనీరింగు కోర్సు (డిప్లమా ఉత్తీర్ణులకు పరిమితం (1986) | ఎలక్ట్రికలు | 40 |

గుంటూరు జిల్లా :

| | | |
|---|---|---|
| 1.ఎమ్.బి.టి.ఎస్.ప్రభుత్వ పాలిటెక్నిక్ గుంటూరు(1960) | సివిలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | మెకానికలు | 50 |
| 2.ప్రభుత్వమహిళాపాలిటెక్నిక్,గుంటూరు (1960) | ఎలక్ట్రానిక్సు | 50 |
| | ఫార్మసీ | 30 |
| | డి.సి.పి. | 45 |
| | డి.ఎమ్.సి.పి | 20 |
| 3.ప్రభుత్వ టెక్సటైలుటెక్నాలజీ ఇన్స్టిట్యూట్,గుంటూరు(1985) | టెక్స్‌టైలు టెక్నాలజీ | 60 |

ప్రయివేటు పాలిటెక్నిక్‌లు

| | | |
|---|---|---|
| 4.చంద్రు రంగనాయకులుపాలిటెక్నిక్, చిలకలూరిపేట(1982) | సివిలు | 60 |
| | ఎలక్ట్రానిక్స్ | 60 |
| | మెకానికలు | 60 |

ప్రయివేటు ఇంజనీరింగ్ కళాశాలలు:

| | | |
|---|---|---|
| 1.బాపట్లఇంజనీరింగ్‌కళాశాల బాపట్ల(1981) | సివిలు | 60 |
| | ఎలక్ట్రానిక్స్ | 60 |
| | మెకానికలు | 120 |

ఫుల్‌టైము 3 సంవత్సరముల ఇంజనీరింగు కోర్సు (డిప్లొమా ప్యాసైనవారికి మాత్రం) సివిలు 40

| | | |
|---|---|---|
| 2.ఆర్.వి.ఆర్.జె.సి.ఓ.వి. ఇంజనీరింగ్ కాలేజీ,గుంటూరు(1984) | సివిలు | 60 |
| | ఎలక్ట్రానిక్సు | 60 |
| | మెకానికలు | 120 |

ప్రకాశం జిల్లాప్రయివేటు పాలిటెక్నిక్‌లు

| | | |
|---|---|---|
| 1.ఎస్.వి.కె.వి. పాలిటెక్నిక్,కంభం(1981) | సివిలు | 60 |
| | మెకానికలు | 60 |
| | ఎలక్ట్రానిక్సు | 60 |
| 2.డి.ఎ.ప్రభుత్వ పాలిటెక్నిక్,ఒంగోలు (1982) | సివిలు | 50 |
| | ఆటో మొబైలు | 40 |
| | మెకానికలు | 40 |
| 3.ప్రభుత్వ మహిళాపాలిటెక్నిక్, ఈతముక్కల(1986) | ఎలక్ట్రానిక్సు | 40 |
| | కంప్యూటరు ఇంజనీరింగు | 30 |
| 4.ఎస్.వి.ఎడ్యుకేషనల్‌సొసైటీ పాలిటెక్నిక్,గిద్దలూరు(1988) | మెకానికలు | 60 |
| | సివిలు | 60 |
| | ఎలక్ట్రానిక్సు | 60 |

ఉస్మానియా విశ్వవిద్యాలయ పరిధిలోని పాల్‌టెక్నిక్ (ప్రభుత్వ మరియు ప్రయివేటు), ఇంజనీరింగు కళాశాలల (యునివర్సిటి మరియు ప్రయివేటు)

| | | ఇంజనీరింగు కళాశాలలు | |
|---|---|---|---|
| ప్రభుత్వయాజమాన్యంలోనివి | 27 | యూనివర్సిటీ | 6 |
| ప్రయివేటుయాజమాన్యం లోనివి | 5 | ప్రయివేటు | 6 |

వివరములు
ఖమ్మం జిల్లా

| | కోర్సుల నిర్దేశించిన వివరములు | సీట్లు |
|---|---|---|
| 1.ప్రభుత్వ పాలిటెక్నిక్,కొత్తగూడెం (1958) | సివిలు | 50 |
| | మెకానికలు | 50 |
| | మైనింగు | 40 |
| 2.ప్రభుత్వమోడలురెసిడెన్షియల్ పాలిటెక్నిక్,భద్రాచలం(1985) | సివిలు | 50 |
| | మెకానికలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |

ప్రయివేటు పాలిటెక్నిక్

| | | |
|---|---|---|
| 1.ఎస్.ఇ.ఎస్. మరియు ఎస్.ఎస్.ఎమ్ పాలిటెక్నిక్,ఖమ్మం(1981) | సివిలు | 60 |
| | మెకానికలు | 60 |
| | ఎలక్ట్రానిక్సు | 60 |

ఇంజనీరింగు కళాశాల

| | | |
|---|---|---|
| 1.ఉస్మానియా విశ్వవిద్యాలయంమైనింగు స్కూలు కొత్తగూడెం(1957) | మైనింగు | 9 |

### వరంగల్ జిల్లా :

| | | |
|---|---|---|
| 1. ప్రభుత్వ పాలిటెక్నిక్ వరంగల్ (1956) | సివిలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | మెకానికలు | 50 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| పార్టుటైము డిప్లొమా కోర్సులు | సివిలు | 30 |
| | ఎలక్ట్రికలు | 20 |
| | మెకానికలు | 20 |
| ప్రభుత్వ మహిళా పాలిటెక్నిక్, వరంగల్ | ఫార్మసీ | 30 |
| (1980) | డి.సి.పి | 45 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |

### ఇంజనీరింగు కళాశాలలు

| | | |
|---|---|---|
| 1. రీజనల్ ఇంజనీరింగ్ కాలేజీ, వరంగల్ | సివిలు | 75 |
| (1959) | ఎలక్ట్రికలు | 50 |
| | మెకానికలు | 55 |
| | ఎలక్ట్రానిక్సు | 30 |
| | కెమికలు | 30 |
| | మెటలర్జీ | 30 |
| పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులు | సివిలు | 20 |
| | ఎలక్ట్రికలు | 20 |
| | మెకానికలు | 20 |
| పార్టుటైము డిగ్రీ కోర్సులు | సివిలు | 30 |
| | ఎలక్ట్రికలు | 30 |
| | ఎలక్ట్రానిక్సు | 20 |
| | మెకానికలు | 30 |

### ప్రయివేటు ఇంజనీరింగు కళాశాల

| | | |
|---|---|---|
| 1. కాకతీయ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ | సివిలు | 75 |
| టెక్నాలజీ మరియు సైన్సు, వరంగల్ (1980) | మెకానికలు | 75 |
| | ఎలక్ట్రానిక్సు | 30 |
| ఫుల్‌టైము 3 సంవత్సరముల డిగ్రీ కోర్సు (డిప్లమా హోల్డర్సుకు మాత్రమే) | మెకానికలు | 40 |
| 3. ప్రభుత్వ వొకేషనల్ ఇన్‌స్టిట్యూట్ | టి.సి.సి. (క్రాఫ్ట్సు) | 60 |
| వరంగల్ (1954) | సిసిసి (డిఎసిసి) | 50 |

### మెదక్ జిల్లా

| | | |
|---|---|---|
| 1. ప్రభుత్వ పాలిటెక్నిక్, జహీరాబాదు | సివిలు | 50 |
| (1979) | ఎలక్ట్రికలు | 40 |
| | మెకానికలు | 30 |
| 2. ప్రభుత్వ మహిళా పాలిటెక్నిక్, మెదక్ | సివిలు | 40 |
| (19[illegible] | ఎలక్ట్రానిక్సు | 40 |
| | కంప్యూటరు ఇంజనీరింగు | 30 |
| 3. ప్రభుత్వ మోడలు రెసిడెన్షియల్ | ఆటో | |
| పాలిటెక్నిక్ గజ్వేలు (1988) | మొబైలు | 40 |
| | ఎలక్ట్రానిక్సు | 40 |
| | డి.సి.పి. | 40 |

### మహబూబ్‌నగర్ జిల్లా

| | | |
|---|---|---|
| 1. ప్రభుత్వ పాలిటెక్నిక్, మహబూబ్‌నగర్ | సివిలు | 50 |
| (1956) | ఎలక్ట్రికలు | 40 |
| | మెకానికలు | 50 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| 2. కె.డి.ఆర్. పాలిటెక్నిక్, వనపర్తి (1959) | సివిలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | మెకానికలు | 50 |
| | డి.సి.పి | 45 |

### ఆదిలాబాదు జిల్లా

| | | |
|---|---|---|
| 1. ఎస్.జి. పాలిటెక్నిక్, ఆదిలాబాదు (1960) | సివిలు | 50 |
| | మెకానికలు | 50 |
| | డి.సి.పి | 45 |

### నిజామాబాదు జిల్లా

| | | |
|---|---|---|
| 1. ప్రభుత్వ పాలిటెక్నిక్, నిజామాబాదు | సివిలు | 50 |
| (1959) | మెకానికలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | సుగర్ టెక్నాలజీ | 12 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| 2. ప్రభుత్వ మహిళా పాలిటెక్నిక్, | సివిలు | 50 |
| నిజామాబాదు (1985) | ఎలక్ట్రానిక్సు | 50 |
| | ఫార్మసీ | 30 |

### కరీంనగర్ జిల్లా

| | | |
|---|---|---|
| 1. ఎస్.ఆర్.ఆర్.ఎస్. పాలిటెక్నిక్, | సివిలు | 50 |
| సిరిసిల్ల (1979) | ఎలక్ట్రికలు | 40 |
| | డి.సి.పి. | 45 |

**నల్గొండ జిల్లా**

| సంస్థ | కోర్సు | సీట్లు |
|---|---|---|
| 1. ప్రభుత్వ పాలిటెక్నిక్, నల్గొండ (1980) | సివిలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | మెకానికలు | 50 |
| 2. ప్రభుత్వ మహిళా పాలిటెక్నిక్, సూర్యాపేట (1988) | ఎలక్ట్రానిక్సు | 50 |
| | డి.సి.పి | 50 |

**రంగారెడ్డి జిల్లా**

| సంస్థ | కోర్సు | సీట్లు |
|---|---|---|
| 1. జవహర్‌లాల్ నెహ్రూ ప్రభుత్వ పాలిటెక్నిక్ రామాంతపూర్, హైదరాబాదు (1957) | సివిలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | కెమికలు | 20 |
| | మెటలర్జి | 30 |
| | మెకానికలు | 50 |
| 2. శ్రీ సంజయ్ మెమోరియల్ ప్రభుత్వ పాలిటెక్నిక్ వనస్థలిపురం (1984) | ఆర్కిటెక్చరు | 40 |
| | ఆటోమొబైలు | 40 |
| | డి.సి.పి | 45 |
| 3. ఎడ్వాన్సు టెక్నీషియను శిక్షణా సంస్థ రామంతపూర్ (1985) | ఎన్విరాన్‌మెంటలు ఇంజనీరింగు | 20 |
| | రెఫ్రిజిరేషను | 20 |
| | ఇన్‌స్ట్రుమెంటేషను | 20 |
| | ఇండస్ట్రియల్ మేనేజిమెంటు | 20 |
| | ఫర్మెంటేషను టెక్నాలజీ | 20 |

**ఇంజనీరింగు కళాశాల**

| సంస్థ | కోర్సు | సీట్లు |
|---|---|---|
| 1. జె.ఎన్.టి.యు. కాలేజీ ఆఫ్ ఇంజనీరింగు కుక్కడపల్లి హైదరాబాదు (1965) | సివిలు | 60 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | మెకానికలు | 40 |
| | ఎలక్ట్రానిక్సు | 40 |
| | కంప్యూటరు ఇంజనీరింగు | 40 |
| పార్టుటైము డిగ్రీ కోర్సులు | మెకానికలు | 30 |
| | ఎలక్ట్రికలు | 30 |
| | సివిలు | 30 |
| | ఎలక్ట్రానిక్సు | 20 |

**హైదరాబాదు మరియు సికిందరాబాదు**

| సంస్థ | కోర్సు | సీట్లు |
|---|---|---|
| 1. ప్రభుత్వ పాలిటెక్నిక్, హైదరాబాదు (1923) | ఆటోమొబైలు | 40 |
| | సివిలు | 50 |
| | ఎలక్ట్రికలు | 40 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| | కంప్యూటరు ఇంజనీరింగు | 40 |
| | ఫార్మసీ | 40 |
| పార్టుటైము డిప్లమా కోర్సులు | సివిలు | 40 |
| | ఎలక్ట్రికలు | 50 |
| | ఎలక్ట్రానిక్సు | 40 |
| | మెకానికలు | 50 |
| 2. క్యూ.క్యూ. పాలిటెక్నిక్, పాతసిటి, హైదరాబాదు (1985) | సివిలు | 50 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| | మెకానికలు | 50 |
| 3. ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఎలక్ట్రానిక్సు, సికిందరాబాదు (1982) | కంప్యూటరు ఇంజనీరింగు | 40 |
| | కమ్యూనికేషను ఇంజనీరింగు | 40 |
| | ఇండస్ట్రియల్ ఎలక్ట్రానిక్సు | 40 |
| 4. ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ప్రింటింగు టెక్నాలజి సికిందరాబాదు (1977) | లితోగ్రఫి | 30 |
| | లెటరుప్రెస్ | 30 |
| 5. ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ లెదర్ టెక్నాలజీ, హైదరాబాదు (1983) | లెదరు | 30 |
| 6. శ్రీమతి దుర్గాబాయి దేశ్‌ముఖ్ మహిళా సాంకేతిక శిక్షణ సంస్థ, హైదరాబాదు (1983) | సివిలు | 50 |
| | ఆర్కిటెక్చరు | 30 |
| 7. డొమెస్టిక్ సైన్సు శిక్షణ సంస్థ, సికిందరాబాదు (1950) | డి.డి.ఎస్ | 25 |
| 8. ప్రభుత్వ వొకేషనలు శిక్షణ సంస్థ బషీర్‌బాగ్, హైదరాబాదు (1954) | టి.జి.సి.(క్రాఫ్ట్సు) | 60 |
| | డి.సి.పి | 50 |

**ప్రయివేటు పాలిటెక్నిక్‌లు**

| సంస్థ | కోర్సు | సీట్లు |
|---|---|---|
| 1. కమాలా నెహ్రూ మహిళా పాలిటెక్నిక్ హైదరాబాదు (1957) | ఆర్కిటెక్చర్ | 40 |
| | సివిలు | 50 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| | డిఎమ్‌సిడి | 30 |
| | కేటరింగు మరియు ఫుడ్ టెక్నాలజీ | 30 |
| | డి.సి.పి | 60 |
| | ఫార్మసి | 40 |
| 2. సెంట్రలు కామర్సు ఇన్‌స్టిట్యూట్, సికిందరాబాదు (1972) | డి.సి.పి | 100 |
| 3. స్టాన్లి జూనియర్ కాలేజి, హైదరాబాదు | డి.సి.పి | 40 |

| | | |
|---|---|---|
| (1980) | | |
| 4.సి ఎస్ ఐ ఇవామేరి సాంకేతికసంస్థ | డిసివి | 40 |
| సికిందరాబాదు(1980) | | |

**ఇంజనీరింగు కళాశాలలు**

| | | |
|---|---|---|
| 1.ఉస్మానియా విశ్వవిద్యాలయం | సివిలు | 60 |
| ఇంజనీరింగుకళాశాలహైదరాబాదు(1929) | ఎలక్ట్రికలు | 60 |
| | మెకానికలు | 60 |
| | ఎలక్ట్రానిక్సు | 50 |
| | బయో ఇంజనీరింగు | 10 |
| | కంప్యూటరు ఇంజనీరింగు | 30 |
| 2.ఉస్మానియా విశ్వవిద్యాలయ | | |
| టెక్నాలజీకళాశాలహైదరాబాదు(1929) | కెమికలు | 60 |
| 3.జెఎన్‌టియు ఇంజనీరింగుకళాశాల, | సివిలు | 20 |
| హైదరాబాదువికెకోర్సులు | ఎలక్ట్రికలు | 20 |
| | మెకానికలు | 20 |
| | ఎలక్ట్రానిక్సు | 20 |
| | ఎమ్‌బిఎ | 20 |
| 4.జెఎన్‌టియుఫైన్ ఆర్ట్స్ కాలేజీ | ఆర్కిటెక్చరు | 30 |
| హైదరాబాదు(1940) | అప్లైడుఆర్ట్సు | 45 |
| 5.ఉస్మానీయా విశ్వవిద్యాలయఇంజనీరింగు | | |
| కళాశాల (పోస్ట్‌గ్రాడ్యుయేట్ | సివిలు | 30 |
| కోర్సులు) | మెకానికలు | 10 |
| | ఎలక్ట్రికలు | 30 |
| | ఎలక్ట్రానిక్సు | 20 |
| పార్టుటైము డిగ్రీకోర్సులు | సివిలు | 30 |
| | ఎల్కక్ట్రికలు | 30 |
| | మెకానికలు | 30 |
| | ఎలక్ట్రానిక్సు | 20 |
| 6.ఉస్మానియా విశ్వవిద్యాలయటెక్నాలజీ | | |
| కళాశాల,హైదరాబాదు (1929) | కెమికలు | 30 |
| (పోస్ట్‌గ్రాడ్యుయేట్‌కోర్సులు) | | |

**ప్రయివేటు ఇంజనీరింగు కళాశాలలు**

| | | |
|---|---|---|
| 1.మాతృశ్రీ ఇంజనీరింగుకళాశాల, | సివిలు | 120 |
| హైదరాబాదు(1981) | ఎలక్ట్రికలు | 60 |
| | మెకానికలు | 60 |
| | ఎలక్ట్రానిక్సు | 40 |
| | కంప్యూటరు ఇంజనీరింగు | 30 |
| 3సంవత్సరముల ఫుల్‌టైముకోర్సు | | |
| డిప్లమాహోల్డర్సు మాత్రమే | ఎలక్ట్రానిక్సు | 40 |
| 2.చైతన్య భారతి ఇంజనీరింగుకళాశాల, | సివిలు | 120 |
| హైదరాబాదు(1979) | ఎలక్ట్రానిక్సు | 40 |
| | కంప్యూటరు ఇంజనీరింగు | 20 |
| | మెకానికలు | 120 |
| 3సంవత్సరముల పూర్తికాలపుకోర్సు | సివిలు | |
| డిప్లమాహోల్డర్సుకు) | ఎలక్ట్రానిక్సు | 40 |
| 3.వాసవి ఇంజనీరింగుకళాశాల | సివిలు | 60 |
| హైదరాబాదు 11981) | ఎలక్ట్రానిక్సు | 40 |
| | మెకానికలు | 100 |
| 3సంవత్సరాల పూర్తికాలపుకోర్సు | సివిలు | 40 |
| డిప్లమాహోల్డర్సుకుమాత్రం | | |

**మైనారిటీ ఇంజనీరింగు కళాశాలలు**

| | | |
|---|---|---|
| 1.దక్కన్ ఇంజనీరింగుకళాశాల, | సివిలు | 60 |
| హైదరాబాదు(1984) | ఎలక్ట్రికలు | 40 |
| | మెకానికలు | 45 |
| | ఎలక్ట్రానిక్సు | 35 |
| 2.ఎమ్.జె.ఇంజనీరింగుకళాశాల, | ఆర్కిటెక్చరు | 30 |
| హైదరాబాదు(1980) | సివిలు | 30 |
| | ఎలక్ట్రానిక్సు | 35 |
| | మెకానికలు | 45 |

# ఆంధ్రప్రదేశ్‌లో వయోజన విద్య పురోభివృద్ధికి జరిగిన కృషిలో రాష్ట్ర కేంద్ర ప్రభుత్వాల పాత్ర

జె.వి.ఆర్.ఆర్. ప్రసాద్
ఉపసంచాలకులు
వయోజన విద్యా శాఖ
రంగారెడ్డి జిల్లా

"విద్యతేలభ్యతే జ్ఞానమ్" అంటున్నారు మన శ్రుతులు. విద్య మానవునికి మూడవ నేత్రం, విద్య లేనివాడు వింత పశువు అంటున్నాయి మనశాస్త్రాలు. అందువల్లే మన భారతీయ ప్రాచీన విద్యా విధానంలో జ్ఞాన సముపార్జనకే ఎక్కువ ప్రాధాన్యత యివ్వబడింది. బ్రహ్మచర్యం, అరణ్యా కళాశాలలో గురు శుశ్రూష మొదలైనవి, సచ్ఛీలతను, వ్యక్తిత్వాన్నీ, ఆత్మ నిశ్చలతను పెంపొందించడానికి విద్యా విధానంతో ఏర్పాటు చేసిన నిబంధనలు. మానవ మస్తిష్కం నుండే సర్వ విజ్ఞానం ఉద్భవిస్తోంది. మనిషిమనసులోనే సర్వశక్తులు సమస్త విజ్ఞానం నిక్షిప్తమై ఉన్నాయి. అనంతమైన విశ్వ గ్రంధాలయమంతా మనిషి మస్తిష్కంలోనే నిక్షిప్తమైఉంది. అయితే దీనికి అవిద్య అనే పొర ఆవరించిఉంది. దానిని తొలగించి మనిషిలోని విజ్ఞాన దీపాన్ని వెలిగించడానికి, అక్షరాస్యత అనే దివ్వె చాలా అవసరం.

ప్రస్తుత యాంత్రిక యుగంలోనే కాకుండా, ప్రపంచ గత చరిత్ర చూస్తే, ముఖ్యంగా భారతదేశంలో, వేద, ఉపనిషత్ కాలంలో కూడా "స్త్రీ విద్యకు ఉన్న ప్రాధాన్యతను గుర్తించవచ్చు. "మైత్రేయి, గార్గి, శారద వంటి అనేక మంది వనితలు ఎంతో గౌరవనీయమైన ఋషి స్థానాన్ని పొందటమేకాక, యాజ్ఞవల్క్యుని వంటి మహర్షిని వెయ్యిమంది విద్యాప్రవీణులు పాల్గొన్న నిండు సభలో బ్రహ్మ విద్యాపరమైన వేదాంత చర్చలో "గార్గి" ధైర్యంతో సవాలుచేసిఎదుర్కోవడం, ఆదిశంకరాచార్యుల వారితో భర్త తరపున వాదనకు దిగిన మండనమిశ్రుని భార్య శారదాదేవి వంటి వారిని ఎంతోమందిని ఇందుకు ఉదాహరణగా పేర్కొనవచ్చు కానీ, తదుపరి క్షీణ యుగాల్లో, దశల్లో మాత్రం ఛాందసులు కొంతమంది కొన్ని వర్గాలకు వేద పఠనం నిషేధించడంతోపాటు, స్త్రీలవాక్కులను కూడా హరించి వేయడం జరిగింది. "న స్త్రీ స్వాతంత్ర్యమర్హతి", స్త్రీ బుద్ధి : ప్రళయాంతక: వంటి తిరోగమన సూత్రాలతోనూ, సాంఘికపరమైన కట్టుబాట్లనెడి యినుప కచ్చడాలతోనూ బంధించి వారిలో నిస్సహాయతను పెంచి సృజనాత్మకతను చంపి, అవిద్యను పెంచి పోషించడం జరిగింది. నిరక్షరాస్యత పెరగడానికి, ప్రాచీన భారతీయ విజ్ఞాన వీచికలు మరుగున పడడానికి. అనేక యుద్ధాలు, విదేశీ దండయాత్రలు, రాజకీయ, సాంఘిక, ఆర్థిక మార్పులు, పరపీడన పరాయణత్వం ఎంతగానో దోహద పడ్డాయి. పూర్వకాలంలో విద్యఆవశ్యకతను గుర్తించలేదని కాని, అక్షరాస్యత వ్యాప్తికి కృషి జరగలేదని కాని చెప్పలేం. చరిత్ర పరిశీలిస్తే అక్షరాస్యత సార్థకతను, విద్య ప్రయోజనాన్ని, నిరక్షరాస్యత వల్ల కలిగే ప్రమాదాలను ఆనాటి సమాజం స్పష్టంగానే ఉచ్చరించిందని చెప్పవచ్చు. ఉదాహరణకు రెండు వేల సంవత్సరాలకు పూర్వం దక్షిణ భారతదేశంలో కవి, యతి పుంగవుడు అయిన "శ్రీ తిరువళ్లువారు" నిరక్షరాస్యత వల్ల కలిగే ప్రమాదాలను గురించి ప్రజలను ఈ విధంగా హెచ్చరించాడు.

"నిరక్షరాస్యుడు చవిటి భూమి వంటి వాడని, అతని ఉనికి నిమిత్తమాత్రమనీ, విలువ లేనిదనీ ఒకవేళ నిరక్షరాస్యుడు తన కష్టంతో సంపదను సృష్టించినా, తెలివితేటలను, జ్ఞానాన్ని ప్రదర్శించినా, అవి రాణింపుతేనివి, విద్యావంతులచే గుర్తించబడనివి అవుతాయని" పేర్కొన్నాడు. ప్రస్తుత సమాజంలో కూడా మనం ఇది గమనిస్తూనే ఉన్నాం. ఈ నిరక్షరాస్యత వలనే మనిషి ఆర్థిక, సాంఘిక, రాజకీయ దోపిడీకి గురౌతున్నాడు. అవిద్య వల్లే జనాభా పెరుగుతోంది.

అవిద్య వల్లే పేదరికం పెరుగుతోంది. చివరికి ఈ అవిద్య వల్లే మనదేశం ప్రపంచంలోని సభ్యదేశాల్లో అక్షరాస్యతలో 120 స్థానంలో ఉండి తలవంచుకోవాల్సి వచ్చింది. అందువల్లే మన జాతిపిత "మహాత్మాగాంధీ" నిరక్షరాస్యత మన దేశానికి ఒక శాపం, తలవంపులు తెస్తున్న కళంకం, దీన్ని తొలగించి తీరాలి అన్నారు. ఆస్ఫూర్తితో మన భారత రాజ్యాంగం ఆర్టికల్ 45 లో రాజ్యాంగం ప్రారంభమైన 10 సంవత్సరాల లోపు దేశంలోని 14 సం.లోపు బాలబాలికలందరికీ, ఉచిత నిర్బంధ ప్రాథమిక విద్య అమలు పరచాలని నిర్ద్వందంగా నిర్దేశించుకున్నాం కానీ అనేక ప్రతి బంధకాల వల్ల ఆ కాల పరిమిత గడువును పొడిగించుకుంటూ వస్తున్నాము. ఈ గడువు ప్రస్తుతం 1995 వరకు పొడిగించుకోవలసి వచ్చింది. అయితే 8వ ప్రణాళికాంతానికైనా (1995) గమ్యాన్ని సాధించి దేశంలో నిరక్షరాస్యతను నిర్మూలించగలుగుతామా అనే సందేహాన్ని నివృత్తి చేసుకోవాలంటే యుద్ధ ప్రాతిపదికపై కృషి చేయవలసిన పరిస్థితి ఎంతైనా ఉంది. ఎందువల్లనంటే స్వాతంత్ర్యానంతరం దేశవ్యాప్తంగా నిరక్షరాస్యత నిర్మూలనకై కొంత కృషి జరిగింది కానీ పెరుగుతున్న జనాభాకు చాలినంత జరగలేదు.

ముఖ్యంగా నిర్బంధ ఉచిత, ప్రాథమిక విద్యా విధానం సక్రమంగా, సమర్థవంతంగా, అమలు జరిగి ఉంటే ఈనాటికి, స్వాతంత్ర్యానంతరం నాలుగు దశాబ్దాలు పూర్తి అయిన తరువాత మనం వయోజన విద్యా కార్యక్రమం తదితర నిరక్షరాస్యతా నిర్మూలన కార్యక్రమాలపై వ్యూహరచన చేసి నిధులు వెచ్చించవలసిన ఆవశ్యకత లేదు.

ఈ శతాబ్దం మొదటి నుండి 1981 వరకు మన దేశంలో అక్షరాస్యత పెరుగుదలను గమనిస్తే పరిస్థితి అర్థమవుతుంది.

1951 నుండి (స్వాతంత్ర్యానంతరం) 1981 వరకు 30 సంవత్సరాల కాలంలో దాదాపు 20 శాతం పెరిగింది. అంటే సాంవత్సరిక పెరుగుదల రేటు ఒక్క శాతం కూడా లేదు. పెరుగుతున్న జనాభా వల్ల మన ప్రణాళికలు తారుమారు అయి అనుకున్న విధంగా ఫలితాలను సాధించలేక పోయాయని చెప్పుకోవచ్చు. కానీ ఇదే విధమైన కృషి కొనసాగితే మనం 21 శతాబ్దం 2001 వ సంవత్సరంలోనికి 110 మిలియన్ల (15-35 సంవత్సరం మధ్య వయసు గల) నిరక్షరాస్యులైన వయోజనులతో ప్రవేశిస్తామని, మన ప్రస్తుత పరిస్థితులు, లెక్కలు చెబుతున్నాయి. ఈ ప్రమాదాన్ని దృష్టిలో ఉంచుకొని అక్షరాస్యతను పెంపొందించవలసిన అవసరాన్ని వక్కాణిస్తూ మన భారత ప్రధాని శ్రీ రాజీవ్‌గాంధీ ఏడవ పంచవర్ష ప్రణాళికకు ముందు మాట చెప్తూ "అభివృద్ధి అనేది కేవలం ఫ్యాక్టరీలు, రోడ్లు, ఆనకట్టలు

| అక్షరాస్యత శాతం | | | |
|---|---|---|---|
| సంవత్సరం | | | |
| | మొత్తం | పురుషులు | స్త్రీలు |
| 1901 | 5.35 | 9.83 | 0.60 |
| 1911 | 5.92 | 10.56 | 1.05 |
| 1921 | 7.16 | 12.21 | 1.81 |
| 1931 | 9.50 | 15.59 | 2.93 |
| 1941 | 16.50 | 24.90 | 7.30 |
| 1951 | 16.67 | 24.95 | 7.93 |
| 1961 | 24.02 | 34.44 | 12.95 |
| 1971 | 29.45 | 39.45 | 18.69 |
| 1981 | 36.23 | 46.89 | 24.82 |

పై పట్టికను గమనిస్తే, 81 సం.ల కాలంలో కేవలం 31 శాతం అక్షరాస్యత పెరిగింది.

నిర్మించినంత మాత్రాన సాధ్యపడదు ప్రజలు, భౌతికంగా, సాంస్కృతికంగా, అధ్యాత్మికంగా అభివృద్ధి చెందినపుడే నిజమైన అభివృద్ధి సాధ్యపడుతుంది. మానవతా విలువలు కాపాడుకోవాలి. అంతేగాక మానవ వనరులను అభివృద్ధి చేసుకోవడానికి అక్షరాస్యత ఒక ముఖ్యమైన అంశం" అన్నారు.

స్వాతంత్ర్యానంతరం విద్యాభివృద్ధికోసం జరిగిన కృషి గణనీయమైనదే. కానీ అక్షరాస్యతా శాతం పెరగటంతోపాటు నిరక్షరాస్యుల సంఖ్య కూడా పెరగటం గమనించాలి.

చేయడానికి వయోజన విద్యా కేంద్రాలను ప్రారంభించడం. మన రాష్ట్రంలో ఒక కోటిమందిని (15-35) అక్షరాస్యులుగా చేయడం.

అక్షరాస్యతతోపాటు వయోజనులలో సాంఘిక చైతన్యాన్ని కలిగించి, వృత్తి విద్యా నైపుణ్యాన్ని పెంపొందించడం. వివిధ అభివృద్ధి శాఖల సహకారంతో గ్రామీణ వృత్తి విద్యలలో వయోజనుల నైపుణ్యాన్ని పెంచడం. అభివృద్ధి శాఖల నిపుణులు, వ్యవసాయం, పశుపోషణ సహకారం, ఆరోగ్యం, కుటుంబ సంక్షేమం మొదలైన విషయాల గురించి బోధిస్తారు.

| | అన్ని వయసులవారు | | 15-35 సం.లోపు వయసువారు | |
|---|---|---|---|---|
| | 1951 | 1981 | 1951 | 1981 |
| | మిలియన్లు | మిలియన్లు | మిలియన్లు | మిలియన్లు |
| నిరక్షరాస్యులు | 300 | 437 | 91 | 110 |
| అక్షరాస్యులు | 60 | 247 | 27 | 111 |
| అక్షరాస్యతాశాతం | 16.67 | 36.23 | 22.7 | 50.0 |

అక్షరాస్యత శాతం పెరిగినా, అక్షరాస్యుల సంఖ్యవృద్ధిచెందినా నిరక్షరాస్యులు కూడా పెరిగారు. దీనికి కారణం అదుపు తప్పిన జనాభా పెరుగుదల కాబట్టి నిరక్షరాస్యత, జనాభా పెరుగుదల పరస్పరాధారాలనడం నిస్సందేహం. ఈ రెండిటిని వెన్నంటి పేదరికం వృద్ధి చెందుతుంది కాబట్టి ఈ మూడింటిని కలిపి నిర్మూలించకపోతే దేశంలో ఏ అభివృద్ధి ప్రణాళిక కూడా సఫలీకృతం కాదు. కాబట్టి వయోజన విద్యా కార్యక్రమాన్ని దేశమంతటా అమలు జరపాలని కేంద్ర ప్రభుత్వం 1977 సం.లో నిర్ణయించింది. 2-10-1978 తేదీ (గాంధీజీ జన్మదినం) నాడు దేశమంతటా జాతీయ వయోజన విద్యా కార్యక్రమం పెద్ద ఎత్తున ప్రారంభమైంది.

### వయోజన విద్యా కార్యక్రమం ఉద్దేశ్యాలు

15-35 సంవత్సరాల మధ్య వయస్సుగల దేశంలోని 10 కోట్ల నిరక్షరాస్యులను అక్షరాస్యులుగా

జాతీయ వయోజన విద్యా కార్యక్రమంలో స్త్రీలను, షెడ్యూల్డు కులాలు, తెగల వారిని అక్షరాస్యులుగా చేయడానికి ప్రత్యేక శ్రద్ధ తీసుకొనబడుతోంది. మనదేశంలో పురుషుల అక్షరాస్యత శాతం 46.89 ఉంటే స్త్రీల అక్షరాస్యత శాతం 24.82 మాత్రమే ఉంది. ఇక షెడ్యూలు కులాలు, తెగలవారి పరిస్థితి మరీ అధ్వాన్నంగా ఉంది. 1981 నాటికి మన దేశంలోని షెడ్యూలు కులాల వారిలో నూటికి 21.38 మాత్రమే అక్షరాస్యులు, వారిలో 31.12 శాతం పురుషులు కాగా 10.39 శాతం మంది స్త్రీలు మాత్రమే అక్షరాస్యులు. షెడ్యూలు తెగలలో 16.35 శాతం అక్షరాస్యులు కాగా వీరిలో పురుషులు 24.52, శాతం స్త్రీలు 8.04 శాతం, అజ్ఞానం, మూఢనమ్మకాలు, అనారోగ్యం మొదలయిన సామాజిక రుగ్మతలు ముఖ్యంగా ఎస్.సి, ఎస్.టి తదితర నిమ్న జాతులలో బాగా వ్యాపించి ఉన్నాయి. వీటిని తొలగించడానికిగాను వీరందరిని వయోజన విద్యా కార్యక్రమం పరిధిలోకి తేవాలి.

ఇక మన ఆంధ్రప్రదేశ్‌లో విద్యావ్యాప్తిని పరిశీలిస్తే భారతదేశంలో విద్యా విషయకంగా వెనుకబడిన 9 రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. 1981 జనాభా లెక్కల ప్రకారం మన దేశంలోని రాష్ట్రాలు కేంద్ర పాలిత ప్రాంతాలతో పోలిస్తే మన రాష్ట్రం అక్షరాస్యతలో 23వ స్థానంలో ఉంది. స్వాతంత్ర్యానంతరం రాష్ట్రంలో విద్యావ్యాప్తి కొరకు జరిగిన కృషి ఫలితంగా

1951లో అక్షరాస్యత శాతం 18.1 కాగా
1961లో అక్షరాస్యత శాతం 21.2
1971లో అక్షరాస్యత శాతం 24.57
1981లో అక్షరాస్యత శాతం 29.94

అయినా జాతీయ స్థాయికి ఇంకా చాలా తక్కువగా ఉన్నాం. మన రాష్ట్రంలో ఇంకా నూటికి 70 మంది నిరక్షరాస్యులుగా ఉన్నారంటే, చాలా విచారించమలసిన విషయం. గత 30 సంవత్సరాలుగా ఆంధ్ర రాష్ట్రంలో ప్రభుత్వపరంగాను, సేవా సంస్థల పరంగాను, శ్రీ గాడిచర్ల వారి సర్వోత్తమరావు గారి లాంటి పెద్దలు నడిపిన వయోజన విద్య, గ్రంథాలయ ఉద్యమాల ఫలితంగా కొంత కృషి నిరక్షరాస్యతా నిర్మూలనకు జరిగినప్పటికీ సాధించవలసినంత అక్షరాస్యతా శాతాన్ని సాధించలేక పోయామని పైన పేర్కొన్న సంఖ్యా వివరాలు చెపుతున్నాయి. దీనికి పెచ్చు పెరిగిన జనాభా ఒక ముఖ్య కారణం కావచ్చు. 3 దశాబ్దాల కాలంలో పెరిగిన అక్షరాస్యత శాతం కేవలం 11.93 మాత్రమే. అంటే సాంవత్సరిక అక్షరాస్యత పెరుగుదల శాతం కేవలం 00.39 అన్నమాట. ఈ విధమైన నత్తనడకతో మనం సంతృప్తికరమైన, గౌరవప్రదమైన అక్షరాస్యత శాతాన్ని ఎప్పటికి సాధించగలుతాం, నిరక్షరాస్యత పెనుభూతాన్ని ఎప్పటికి నిర్మూలించగలుగుతాం, అన్నది పెద్ద సవాల్. ఇట్టి పరిస్థితుల్లో వయోజన విద్య ఆవశ్యకతను నొక్కి చెప్పవలసిన పనిలేదు.

ఆంధ్రప్రదేశ్‌లో వయోజన విద్యా వ్యాప్తికి జరిగిన కృషి దేశ స్వాతంత్ర్యానికి ముందు 100 సం.ల నుండి కొనసాగింది. ఈ అవిరళ కృషిలో నికొన్ని ముఖ్య ఘట్టాలు ఇక్కడ ప్రస్తావించవలసిన ఆవశ్యకత ఎంతైనా ఉంది.

1. 1848వ సంవత్సరంలో క్రైస్తవ మత వ్యాప్తికి సంబంధించిన కార్యక్రమంలో భాగంగా మొదటిసారిగా "గుంటూరు ఆంధ్ర ఎవేంజిలికల్ చర్చి ఆధ్వర్యంలో అక్షరాస్యతా కృషి ప్రారంభమైంది.

ఎంతోమంది దేశభక్తులు, వారు నెలకొల్పిన కొన్ని విద్యాసంస్థల ద్వారా వయోజన విద్యా ఉద్యమానికి తోడ్పడ్డారు. తెలుగువారిలో వయోజన విద్యావ్యాప్తికి కృషి చేసిన మహానుభావులలో ప్రాతః స్మరణీయుడు వయోజన విద్యా పితామహుడు శ్రీ "గాడిచర్ల హరి సర్వోత్తమరావు" గారు.

2. వారు 1907లో రాజమండ్రి టీచర్సు ట్రైనింగ్ కళాశాలలో విద్యార్థిగా ఉంటూనే రాత్రి పాఠశాల ప్రారంభించి వయోజన విద్యా వ్యాప్తికి నడుముకట్టారు. ఇది చేయరాని తప్పుగా బ్రిటీష్ ప్రభుత్వం భావించి శ్రీ గాడిచర్ల హరి సర్వోత్తమరావును కళాశాలనుండి బర్తరఫ్ చేయడమేగాక ఆయన ఎమ్.ఎ డిగ్రీని కూడా రద్దు చేసి జైలుకు పంపింది. దీనివల్ల ఆయనలో ఉత్సాహం పెరిగిందే కానీ తగ్గలేదు. 1914 నుండి 1915 వరకు ఆయన ఆంధ్రపత్రికకు ప్రధాన సంపాదకుడుగా పనిచేసి, సామాన్య ప్రజానీకానికి సరళభాషలో వార్తలు అందించి పఠనాశక్తిని పెంచారు. ఆంధ్రప్రాంతంలో అనేక పఠనాలయాలు, గ్రంథాలయాల స్థాపనకు కృషిచేశారు.

3. 1918వ సంవత్సరంలో శ్రీ గాడిచర్ల సర్వోత్తమరావుగారి ప్రోత్సాహంతో పేరాల గ్రామంలో మార్కండేయ గ్రంథాలయానికి అనుబంధంగా వయోజన విద్యా కేంద్రం నిర్వహించబడింది.

4. 1929వ సం.లో తాడేపల్లిగూడెంలో శ్రీ శనివారపు సుబ్బారావు, శ్రీ కవిదిండి గంగరాజు, భమిడిపాటి సత్యనారాయణ గార్లచే గ్రామీణ పునర్నిర్మాణ బోధనా తరగతుల నిర్వహణ, యువజనులలో అక్షరాస్యత ద్వారా రాజకీయ, ఆర్థిక, సాంఘిక విజ్ఞానాన్ని కలిగించడానికి కృషి జరిగింది. వీటిని వసంత ఋతు విద్యాలయాలనేవారు.

5. 1931లో పైన చెప్పిన ఆశయాలతో మరొక కేంద్రాన్ని శ్రీ నరసింహదేవర సత్యనారాయణ, డాక్టర్ పాలకొడేటిగురుమూర్తి, గరిమెళ్ల సత్యనారాయణగార్లు రాజమహేంద్రవరంలో నిర్వహించారు.

6. 1933 డిశంబరు 23వ తేదీన, ఆచార్య రంగాచే స్థాపించబడిన "రామనీడు వయోజన విద్యా సంస్థ"ను "రంగా గ్రంథాలయాన్ని" నిడుబ్రోలులో మహాత్మాగాంధీ ప్రారంభోత్సవం చేశారు. రైతు ఉద్యమ నాయకుడైన శ్రీ రంగా ఆంగ్లంలో వయోజన విద్యపై పుస్తకం కూడా వ్రాశారు.

7. 1934వ సంవత్సరంలో గాంధీజీ చేపట్టిన నిర్మాణ కార్యక్రమంలో వయోజన విద్యా వ్యాపకం చేర్చబడింది. వసంత ఋతువులో ఆచార్య రంగా గారిచే రైతాంగ విద్యాలయం నిర్వహించబడింది. పుల్లంపేట (కడప జిల్లా)లో కార్యంపూడి నాగేంద్రుడుగారిచే వయోజన విద్యాకేంద్రం నిర్వహించబడింది.

8. 1935లో నిడుబ్రోలులో శ్రీ శనివరపు సుబ్బారావుగారిచే వారాంతపు రైతు పాఠశాలలు నిర్వహించబడ్డవి.

శ్రీ రెబ్బాప్రగడ నరసింహశర్మ గారిచే కొవ్వూరులో ప్రచారక విద్యాలయం నిర్వహించబడింది.

9. 1936వ సంవత్సరంలో ఆంధ్ర జమీన్ రైతు సంఘంవారు పశ్చిమ గోదావరి రైతుల పాఠశాలను నడిపారు.

10. 1937లో "ఆంధ్ర దేశ వయోజన విద్య సంఘం స్థాపించబడింది. పూర్వపు హైదరాబాదు రాష్ట్రంలో ఆంధ్ర సారస్వత పరిషత్ వారు అక్షరాస్యత కేంద్రాలను నడిపారు. అఖిలభారత విద్యార్థి ఫెడరేషన్‌వారు సర్కార్ ప్రాంతంలో కొన్ని వయోజనా విద్యా తరగతులు నిర్వహించారు.

కొత్తగా ఏర్పడిన కాంగ్రెసు ప్రభుత్వం వయోజన విద్యా బోధనకు ప్రోత్సాహం ఇవ్వడం జరిగింది. 1937వ సం.లో ఆంధ్ర సోషలిస్టు పార్టీవారు కొత్తపాలెం, మన్నేవవారిపాలెంలో వేసవి పాఠశాలను నిర్వహించారు. 1935లో శ్రీ బులుసు సాంబమూర్తి వేసవి పాఠశాలను మద్రాస్‌లో నిర్వహించారు.

11. గ్రంథాలయ పితామహ అయ్యంకి వెంకటరమణయ్య గారు తమ ఉద్యమంలో వయోజన విద్యా వ్యాప్తికి ఎక్కువ ప్రాధాన్యమిచ్చారు. గ్రంథాలయ, వయోజన విద్యా ఉద్యమాలలో కీ.శే.గోపరాజు రామచంద్రరావుగారు (గో.రా) కీ.శే.అయ్యదేవర కాళేశ్వరరావుగారు కూడా చాలా కృషి చేశారు.

12. 1936వ సం.లో ఆంధ్ర విద్యార్థి సంఘం ఆధ్వర్యంలో విశాఖపట్టణంలో వయోజన విద్యా కేంద్రాల నిర్వహణ జరిగింది.

13. అక్షరాస్యత నిపుణుడుగా ప్రపంచంలో పేరుపొందిన డాక్టర్ ఎఫ్.సి.లాబక్ వయోజన విద్యా ప్రచార నిమిత్తం 1939లో మన దేశం వచ్చి "EACH ONE TEACH ONE" నినాదాన్నిచ్చారు "INDIA SHALL BECOME LITERATE". అనే పుస్తకాన్ని రాశారు. తెలుగు తమిళంలోను అక్షరాభ్యాస పటాలను తయారు చేశారు. వాటిని క్రిష్టియన్ లిటరేచర్ సొసైటీవారు ప్రచురించారు. అవి బహుళ ప్రచారంలోకి వచ్చాయి. 1939 జనవరిలో దక్షిణ భారత వయోజన విద్యా సభలు మద్రాస్‌లో జరిగాయి. రాష్ట్రంలో ఊరూరా గ్రంథాలయాలు, రాత్రి పాఠశాలలు ఏర్పడ్డాయి.

శ్రీ చివుకుల శేషశాస్త్రిగారి "నిరక్షరాస్యత నిర్మూలింపుడు" "విద్యావ్యాప్తి చేయండోయ్" వంటి గేయాలు ప్రచారమయ్యాయి.

14. 1940లో గూడూరులో వయోజన విద్యా ప్రచారమండలి స్థాపించబడింది.

వయోజన విద్యా ప్రచారానికి, వ్యాప్తికి అప్పటి బ్రిటిష్ ప్రభుత్వపు సహాయ సహకారాలు ఏ మాత్రం ఉండేవికావు. కాగా రాత్రిబడులు ప్రభుత్వ ద్రోహానికి గుర్తింపుగా భావించి 1940లో రక్షణ చట్టం నిబంధనల పేరుతో వాటిని నిషేధించారు.

15. 1941వ సంవత్సరంలో తెనాలిలో ఆంధ్రదేశ గ్రంథాలయ వయోజన విద్యా మహాసభ నిర్వహించబడింది.

ఆ సభలో అనేకమంది ప్రముఖులు బ్రిటిష్ ప్రభుత్వం విధించిన నిషేధపు ఉత్తర్వులను గర్హించారు. రాష్ట్రమంతా ఆందోళన కొనసాగింది. ఫలితంగా నిషేధాజ్ఞలు రద్దయ్యాయి. మరల వయోజన విద్యా ప్రచారం రాత్రి పాఠశాలలో రూపంలో ప్రారంభమయ్యింది.

ఆంధ్ర గ్రంథాలయం—త్రైమాస పత్రిక-వయోజన విద్యాసంచిక (జూలై-అక్టోబర్ 1941) ప్రచురణ జరిగింది.
ఆంధ్ర రాష్ట్ర విద్యార్థి సంఘ ఆధ్వర్యంలో కృష్ణ, గుంటూరు, తూర్పుగోదావరి జిల్లాలలో వయోజన విద్యా శిక్షణా శిబిరాల నిర్వహణ జరిగింది.

కడప జిల్లా విద్యార్థి సంఘం ఆధ్వర్యంలో జిల్లాలో వయోజన విద్యా కేంద్రాల నిర్వహణ జరిగింది. కృష్ణాజిల్లా యువజన సంఘం చేత పది కేంద్రాలలో వయోజన విద్యా కేంద్రాలు నిర్వహించబడ్డాయి.

16. 1942వ సంవత్సరంలో ఆంధ్ర దేశ గ్రంథాలయ మహాసభలలో వయోజనవిద్యాశాఖ ఏర్పాటు.

17. 1946వ సంవత్సరంలో దక్షిణ భారత వయోజన విద్యా సంఘానికి గాడిచర్ల వారి సర్వోత్తమరావుగారు అధ్యక్షునిగా ఎన్నికయ్యారు.

18. వయోజన విద్యావ్యాప్తికి అనేక పథకాల అమలుకు శ్రీ గాడిచర్ల వారిని, ఆంధ్రప్రాంతం నుండి గౌరవ వయోజన విద్యా డైరక్టరుగా నాటి విద్యామంత్రి శ్రీ అవినాశిలింగం చెట్టి నియమించారు.

19. 1949లో ప్రభుత్వ ఆధ్వర్యంలో వయోజన విద్యా బోధనకు విద్యా బోధకుల శిక్షా కార్యక్రమం ప్రారంభం.

20. 1950లో హైదరాబాదులోని ఆంధ్ర సారస్వత పరిషత్తు ఆధ్వర్యంలో వయోజన విద్యా బోధనలో 100 మంది కార్యకర్తలకు ఆరు రోజుల శిక్షణ నిర్వహించబడింది.

21. వేటపాలెం, మహానంది, నందలూరు, ఏటములు, కోదాడు, విజయనగరం, హైదరాబాదు ఆనాటి ముఖ్యమైన కొన్ని వయోజన విద్యా శిక్షణా కేంద్రాలు, డాక్టరు భోగరాజు పట్టాభి సీతారామయ్యగారు చాగల్లులో వయోజన విద్యా కేంద్రాన్ని నిర్వహించి వయోజన విద్యా ఉద్యమానికి సహకరించారు.

22. 1963లో రాష్ట్రంలో ప్రతి పంచాయతీ సమితిలో 10 వయోజన విద్యా కేంద్రాలు నడపబడ్డాయి.

23. 1965–66లో మూడు పంచాయితీ సమితులలో మొత్తం వంద వయోజన విద్యా కేంద్రాలు నిర్వహించబడ్డాయి. ఆ సంవత్సరం ఆరువేలమంది అక్షరాస్యులయ్యారు.

24. 1967వ సంవత్సరంలో రాష్ట్రంలోని 14 సమితులలో వయోజన విద్యా కేంద్రాలు నిర్వహించి 18,000 వేల మందిని అక్షరాస్యులుగా చేశారు. రాష్ట్ర ప్రభుత్వం గ్రాంటు ఆపివేయడం వల్ల ఈ పథకం 1967లో ఆగిపోయింది.

25. 1966లో హైదరాబాదు ఆంధ్ర మహిళాసభ ఆధ్వర్యంలో షాద్ నగర్‌లో కర్షకవృత్తి విద్యా పథకం ప్రారంభం అయింది. నిరక్షరాస్యత నిర్మూలనపై ఆంధ్రమహిళా సభ దీనిని నిర్వహించింది.

26. 1970లో శ్రీకార్యంపూడి నాగేంద్రుడుగారిచే "విద్యాజ్యోత్స్న" వయోజన విద్యా మాసపత్రిక ప్రారంభించబడింది.

27. ఆంధ్ర మహిళాసభ హైదరాబాదులో 1971లో సాక్షారతాభవన్ (లిటరసీ హౌస్) స్థాపించింది. వివిధ జిల్లాల్లో "కర్షక వృత్తి విద్యా కేంద్రాలు" నడిపే బాధ్యతను రాష్ట్ర ప్రభుత్వం ఆంధ్ర మహిళాసభకు అప్పగించింది. 1978 వరకు ఈ కర్షక వృత్తి విద్యా కేంద్రాలు నడప బడ్డాయి.

28. 1972లో తిరుపతి శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయంలో వయోజన విద్యా విభాగం ప్రారంభమైంది.

29. 1973లో శ్రీ , వారి ఆదిశేషువుగారి సలహాపై ఆంధ్రప్రదేశ్ గాంధి స్మారక నిధి వయోజనులకోసం వెయ్యి పుస్తకాల ప్రచురణకు పథకం ఆమోదం అయ్యింది.

30. మహబూబునగర్ జిల్లాలో 1974లో న్యూఢిల్లీలోని సాంఘికాభివృద్ధి సంఘంవారు స్త్రీలకు సాంప్రదాయేతర విద్యా (Non formal Education) విధానంలో పిల్లల పెంపకం పోషకాహారం, ఆరోగ్యం, కుటుంబ విషయాలపై ప్రత్యేక బోధన గావించారు.

1975లో ఆంధ్రప్రదేశ్ మహిళా సమాఖ్య భారత్, భారత మహిళా సమాఖ్య కార్యక్రమంలో ఒక

భాగంగా 18 జిల్లాలలో వయోజన మహిళలకు విద్య గరపేందుకు 355 కేంద్రాల స్థాపన జరిగింది. 1975-76లో రాష్ట్రప్రభుత్వం 15-25 మధ్య వయసుగల నిరక్షరాస్యులకు కృష్ణా, ఖమ్మం జిల్లాలలో జిల్లాకు 150, 1976-77లో కడప, ఆదిలాబాదుజిల్లాలలో జిల్లాకు 100 సాంప్రదాయేతర విద్యా కేంద్రాలను నిర్వహించింది. రాష్ట్ర ప్రభుత్వం 1978-79లో 6 జిల్లాలలో 300 కర్షక వృత్తి విద్యా కేంద్రాలను, 6 జిల్లాలలో 700 సాంప్రదాయేతర విద్యా కేంద్రాలను నిర్వహించింది. 1978 లో జాతీయ వయోజన విద్యా పథకం దేశవ్యాప్తంగా ప్రభుత్వపరంగా ప్రారంభం కావడంతో రాష్ట్రప్రభుత్వం వయోజన విద్యా శాఖను ప్రారంభించింది. అదే సంవత్సరం హైదరాబాద్ ఉస్మానియా విశ్వవిద్యాలయంలో వయోజన విద్యా విభాగం స్థాపించబడింది. శ్రీ వెంకటేశ్వర విశ్వ విద్యాలయం వారు యమ్.ఏలో వయోజన విద్యా కోర్సును ప్రారంభించారు. 1979 డిశంబర్‌లో రాష్ట్రంలో ప్రభుత్వ యాజమాన్యంలో ఒక్కొక్క ప్రాజెక్టుకు మూడు వందల వయోజన విద్యా కేంద్రాల వంతున 23 వయోజన విద్యా ప్రాజెక్టులు ప్రారంభించబడ్డాయి.వీటిలో 18 ప్రాజెక్టులకు కేంద్ర నిధులు, ఐదు ప్రాజెక్టులకు రాష్ట్ర నిధులు, కేటాయించబడ్డాయి. దశలవారీగా ఈ ప్రాజెక్టుల సంఖ్య పెంచబడుతూ ఉంది. రాష్ట్రంలో ఆనాటికి ఉన్న 15-35 సంవత్సరాల మధ్య వయస్సుగల ఒక కోటి నిరక్షరాస్యులను 1984 నాటికి అక్షరాస్యులుగా చేయడం ముఖ్య ఉద్దేశ్యంగా కార్యక్రమం ప్రారంభమయ్యింది.

1978 నాటికి మన రాష్ట్రంలో వయోజన నిరక్షరాస్యుల సంఖ్య 110 లక్షలుగా అంచనా వేయబడింది. కాగా వివిధ కార్యక్రమాల కింద నేటివరకు 25 లక్షలమందిని అక్షరాస్యులను చేయడం జరిగింది. అయితే 1987-88నాటికి మిగిలిన అక్షరాస్యుల సంఖ్య 85 లక్షలుగా ఉంది. కానీ అంచనాల ప్రకారం 1994-95 నాటికి నిరక్షరాస్యుల సంఖ్య 95.96 లక్షలకు పెరుగుతుందని భావించబడింది. 1980 నాటికి ఉన్న 23 ప్రాజెక్టులు 1982-83 నాటికి 28గాను, 1983-84 నాటికి 29గాను, 1984-85 నాటికి 38 గాను, 1985-86 నాటికి 51గాను, 1986-87 నాటికి 46గాను, 1987 -88 నాటికి 52గాను సంఖ్య పెరిగింది. కానీ 1994-85 నాటికి 95.96 లక్షల మంది నిరక్షరాస్యులను అక్షరాస్యులుగా చేయడానికి 224 ప్రాజెక్టులు ఒక్కొక్కటి 300 వయోజన విద్యా కేంద్రాల చొప్పున కావలసి ఉన్నవి. ఇన్ని ప్రాజెక్టులు ప్రారంభించిన ఇతర సంస్థలద్వారా వయోజనవిద్యా కార్యక్రమాన్ని నిర్వహించినా, అనుకున్న గమ్యాన్ని చేరడానికి పూర్తి అక్షరాస్యత సాధించడానికి, ప్రతి ఒక్కరిలోనూ ముఖ్యంగా కావలసిన చిత్తశుద్ధితో కూడిన కృషి.

### జాతీయ అక్షరాస్యతా ఉద్యమము

5-5-1988 తారీఖున మన ప్రధానమంత్రి ఈ జాతీయ అక్షరాస్యత ఉద్యమాన్ని (ఎన్.ఎల్.ఎమ్) జాతికి అంకితం చేస్తూ జ్యోతిని వెలిగించారు. దీని ముఖ్య ఉద్దేశ్యం 1990 నాటికి 30 మిలియన్లు, 1995 నాటికి 50 మిలియన్లు 15-35 మధ్య వయస్కులైన నిరక్షర వయోజనులను అక్షరాస్యులుగా చేయడం. అంటే 8వ పంచవర్ష ప్రణాళిక చివరినాటికి 8 కోట్ల మంది నిరక్షర వయోజనులకు క్రియాశీల అక్షరాస్యతను బోధించడం, సాంఘిక, ఆర్థిక తదితర విషయాలను తెలియజెప్పడం.

ఈ కార్యక్రమంలో అతి ముఖ్య అంశం "జన శిక్షణ నిలయం", అక్షరాస్యత అనంతర కార్యక్రమం నిరంతర విద్యా విధానం ఈ జన శిక్షణానిలయం ద్వారా నిర్వహించబడతాయి. 5,000 జనాభా కలిగిన 4, 5 చిన్న గ్రామాలకు ఒక జన శిక్షణా నిలయం ఏర్పాటు చేయబడుతుంది. అభ్యాసకులు వారి అక్షరాస్యత, గణిత నైపుణ్యాన్ని పెంచుకోవడమేగాక అనేక అభివృద్ధి కార్యక్రమాలకు చెందిన ఆధునిక సమాచారాన్ని అందించే గవాక్షాలుగా కూడా ఈ జన శిక్షణా నిలయాలు పని చేస్తాయి. ప్రతి జన శిక్షణా నిలయాన్ని నిర్వహించేందుకు "ఒక ప్రేరక్" ఉంటాడు. 1990 నాటికి దశలవారీగా 60,000 జన శిక్షణా నిలయాలు ఏర్పాటు చేయబడతాయి.

1987 నుండి 1990 వరకు జాతీయ అక్షరాస్యత ఉద్యమ నిర్వహణ కోసం 550 కోట్లు కేటాయించారు. ఇందులో రూ.340 కోట్లు కేంద్ర ప్రభుత్వ వాటాగాను, రూ.210 కోట్లు రాష్ట్ర ప్రభుత్వ వాటాగాను ఉంటుంది.

ప్రభుత్వపరంగా నిర్వహింపబడే కార్యక్రమానికి తోడుగా స్వచ్ఛంద సంస్థలను కనుగొని, వయోజన విద్యా కేంద్రాల, నిర్వహణ నిరంతర విద్యా కేంద్రాలు, నిర్వహించడం కార్యకర్తలకు, ప్రేరక్‌లకు తగు శిక్షణనివ్వడం, బోధనాభ్యసన పరికరాలను సిద్ధం చేయడం, బోధనోపకరణాలుగా దృశ్యశ్రవణ పరికరాలను సమకూర్చుకొనే బాధ్యతలను వారికి అప్పగించవలసి ఉంది. 1990 నాటికి సుమారు 1,000 వరకు స్వచ్ఛంద సంస్థలను ప్రోత్సహించాలని నిర్ణయించబడింది.

విశ్వవిద్యాలయాలు, కళాశాలలు కూడా ఇందులో భాగంగాచేర్చబడ్డాయి."క్రియాశీల అక్షరాస్యతకోసం సామూహిక కార్యక్రమం" పేరుతో వయోజన విద్యావ్యాప్తి జరుగుతుంది. సాంకేతిక పరికరాలతో విద్యాబోధనచేయడంకోసం వయోజనవిద్యా కార్యక్రమములో నూతన సాంకేతిక బోధనోపకరణాలను ప్రవేశపెట్టేందుకు గాను ప్రయోగాత్మకంగా చేపట్టేందుకు నలభై జిల్లాలు దేశవ్యాప్తంగా ఎంపిక చేశారు. మనరాష్ట్రంలో అ[illegible] చెందిన జిల్లాగా హైదరాబాదు జిల్లాను, వెనుకబడిన జిల్లాగా అదిలాబాద్ జిల్లాను ఎంపిక చేశారు.

వనరుల సమీకరణ కోసం కేంద్రస్థాయిలో కార్యక్రమానికి కావలసిన సాంకేతికవనరులను "వయోజన విద్య జాతీయ సంస్థ" (ప్రస్తుత విద్యా డైరెక్టరేట్) సమకూర్చుతుంది.

రాష్ట్రస్థాయిలో రాష్ట్ర వనరుల కేంద్రాలు వయోజన విద్యా కార్యక్రమం అమలుపరచడానికి కావలసిన సాంకేతిక సహాయాన్ని అందజేస్తాయి. జిల్లా స్థాయిలో కార్యక్రమానికి కావలసిన వనరుల సహాయానికి ముఖ్యంగా క్షేత్ర స్థాయిలోని కార్యకర్తలకు ఉపాధ్యాయులకు శిక్షణ జరుపడానికి, జిల్లా విద్య, శిక్షణ సంస్థలో భాగంగా జిల్లా వనరుల కేంద్రాలను (డి.ఆర్.యు) (Dist Resource Units) ఏర్పాటు చేస్తారు. జాతీయ అక్షరాస్యత ఉద్యమం అమలు జరిగే విధానం ఈ విధంగా ఉంటుంది. జాతీయ స్థాయిలో పథక రచన చేసి అమలుపరచడానికి గాను మానవ వనరుల శాఖామాత్యుల అధీనంలో ఒక (National Literacy Mission Authority) జాతీయ అక్షరాస్యత ఉద్యమ సంస్థ ఏర్పాటు అయ్యింది. ఇందులో వివిధ రాజకీయ పార్టీలు, వివిధ అభివృద్ధి శాఖలు సభ్యత్వాన్నిపొంది ఉంటాయి.

అదేవిధంగా రాష్ట్రస్థాయిలో ముఖ్యమంత్రి లేక విద్యాశాఖామాత్యుల నేతృత్వంలో "రాష్ట్ర అక్షరాస్యత ఉద్యమ సంస్థ" ఏర్పడుతుంది. ఇది రాష్ట్రస్థాయిలో వయోజన విద్యా కార్యక్రమానికి పథక రచన చేసి అమలుపరచే బాధ్యత స్వీకరిస్తుంది. జిల్లాస్థాయిలో "జిల్లా విద్యా బోర్డులు" ఏర్పడి వయోజన విద్యతో సహా అన్నిరకాల విద్యా కార్యక్రమాలనుప్రణాళికాబద్ధంగా పరిపాలించేందుకు బాధ్యత వహిస్తాయి. ఈ విద్యా బోర్డులు వివిధ సంస్థల ద్వారా జరిగే విద్యా కార్యక్రమాలను అనుసంధానం చేస్తాయి.

ఇంతవరకు జరిగిన కృషి కొంతమాత్రమే చేయవలసిన కృషి ఎంతోఉంది. దీనికి చిత్తశుద్ధికావాలి. దీనిని అందరికి అందించడానికి ప్రభుత్వపరంగా జరుగుచున్న కృషి ఏమాత్రం చాలటం లేదు. స్వచ్ఛంద సంస్థల,వ్యక్తుల కృషి ఎంతో అవసరమై ఉంది.

అజ్ఞానాంధకారాన్ని తొలగించి, ప్రాచీన భారతీయ విజ్ఞాన పీఠికలను వెదజల్లి మన ఔన్నత్యాన్ని పునరుద్ధరించేందుకు సగౌరవంగా 21వ శతాబ్దంలోకి మన జాతి ప్రవేశించడానికి ఈనాడు కోట్లాది నిరక్షరాస్యులలో "అక్షర దీపాలు" వెలిగించవలసిన సమయం.

ఇది అందరి కర్తవ్యం-దీనికోసం అందరూ ఉద్యమించాలి.

# ఆంధ్రప్రదేశ్ గురుకుల విద్యాలయాలు వాటి ప్రగతి

బి.కొండారెడ్డి
కార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ గురుకుల విద్యాలయాల సంస్థ,హైదరాబాదు

అనువాదం
దామరాజు సుబ్బారావు
తెలుగు అకాడమి,హైదరాబాదు

## 1. చారిత్రక రూప చిత్రణ (Historical sketch)

మన రాష్ట్రంలో ఉన్న పాఠశాలలు, ముఖ్యంగా గ్రామీణ ప్రాంతాల్లో ఉన్నవి, అనేక లోపాలతో బాధపడుతున్నాయి. భౌతిక వసతులు, అర్హతగల సిబ్బంది, తగినన్ని పరికరాలు లేకపోవడం అనే లోపాలవల్ల ప్రమాణాలు దిగజారిపోవటానికి కారణం అవుతున్నాయి. ఎంతటి ప్రజ్ఞావంతులైనా గ్రామీణ ప్రాంతాల్లో అధ్యయనంచేసే విద్యార్థులు ఈ ప్రతికూల పరిస్థితుల్లో మెలగవలసినవారే. ఇంతేకాక గ్రామీణప్రాంతాల్లో నివసించే, ఆర్థికంగా వెనకబడిన తల్లితండ్రులు పట్టణప్రాంతాల్లోని మంచి పాఠశాలకు వారి పిల్లలను పంపలేరు. ఎందువల్లనంటే అది చాలా ఎక్కువ ఖర్చుతో కూడినపని. 1971 సంవత్సరంలో నల్లగొండ జిల్లాలో సర్వేల్ (Survail) గ్రామంలో మొట్టమొదటి గురుకుల పాఠశాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం స్థాపించింది. గ్రామీణ ప్రాంతాల్లోని విద్యావిషయికంగా వెనుకబడిన ప్రతిభావంతులైన పిల్లలకు సాంఘిక న్యాయం చేకూర్చటమనేదే ఈ గురుకుల పాఠశాలల వెనక ఉన్న తత్వం. ఇవే లేకపోతే రసాయన ప్రయోగశాల, గ్రంథాలయం, బోధనోపకరణాలు (Educational aids) మొదలైన ఆధునిక వసతులున్న పాఠశాలలో ప్రతిభావంతమైన బోధనను పొందటానికి అవకాశం ఉండేదికాదు. సిబ్బంది, విద్యార్థులు కలిసి మెలసి పాఠశాల ప్రాంగణంలోనే ఉంటూ పరస్పర లాభదాయకమైన ప్రయోజనాలకు కాలాన్ని అంతటిని ఉపయోగించటం కోసం ఇటువంటి పాఠశాలలను స్థాపించడం శ్లాఘనీయం. ఈ విధమైన సాంఘిక జీవనం, బోధకులు (teacher and the taught) బోధితుల మధ్య వ్యక్తిగత సత్‌సంబంధాలు ఏర్పడేందుకు దోహదం చేస్తుంది. ఇది పర్యవేక్షణాయుత అధ్యయనానికి (Supervised study) వీలు కల్పిస్తుంది. సమానత్వాన్ని పెంపొందిస్తుంది. పిల్లల్లో తమతోటి వారు అనే భావన కలిగిస్తుంది. కుల, వర్గ, ప్రాంతీయ, మతపరమైన భేదాలను తొలగిస్తుంది; సహకారజీవనాన్ని చేకూరుస్తుంది. విద్యావిషయక దృష్టితో చూస్తే, ఒక వ్యవస్థ విద్యార్థి వసతిగృహం అదే వ్యవస్థ ఆధ్వర్యంలో ఉండటం ఒక వరమే. ఉపాధ్యాయులు, విద్యార్థులు ఒకే ఆవరణలో నివసించడంవల్ల అద్భుత ఫలితాలు వస్తాయి.

## 2. సంస్థాస్థాపన (Establishment of the Society)

1972లో ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాల సంస్థ అనే పేరుతో స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఏర్పాటు చేసింది. ఆంధ్రప్రదేశ్ (తెలంగాణ ప్రాంతం) ప్రభుత్వం సంఘాల రిజిస్ట్రేషన్ చట్టం (Public Societies Registration Act) 1350 ఫసలీ కింద ఇది రిజిస్టర్ చేసినారు. 1972 - 73 సంవత్సరంలో సర్వేల్ (Survail) లోని గురుకుల పాఠశాలను ప్రభుత్వం గురుకుల పాఠశాలల సంస్థకు అప్పగించింది. అదే సంవత్సరంలో గుంటూరు జిల్లాలో తాడికొండ లోనూ, అనంతపురం జిల్లాలో కొడిగినహళ్ళి లోనూ ఈ సంస్థ గురుకుల పాఠశాలలను ఆరభించింది. ఈ సంస్థను స్వతంత్ర ప్రతిపత్తిగల సంస్థగా , విద్యాశాఖ కార్యదర్శిని దాని అధ్యక్షులుగా ఏర్పరచి అన్ని గురుకుల పాఠశాలలను ఈ సంస్థకు అప్పగించడంలో ముఖ్యోద్దేశం ఏమంటే, దక్షతను చేకూర్చడమూ, విషయాలను త్వరగా పరిష్కారం చేయడమూ,ఎటువంటి జాప్యం లేకుండా పరిపాలనను నిర్వహించడమూ ఈ సంస్థలకు, పిల్లలకు

ప్రత్యేక శ్రద్ధాసక్తులను చూపటమే ప్రభుత్వం అభిలషించింది. తరువాత, దీనికి ఆంధ్రప్రదేశ్ గురుకుల విద్యాలయాల సంస్థ (A.P.Residential Educational Institutions Society) అనే పేరుతో ఆ విధంగా వ్యవహారించడంమొదలుపెట్టారు.

3. సంస్థ ధ్యేయాలు లక్ష్యాలు (Aims and objectives of the Society) :

ఎ) ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో నివసించే ప్రతిభావంతులైన, యోగ్యులైన పిల్లలకు గురుకుల పాఠశాలలనూ, కళాశాలలనూ గురుకుల విధానంలో లేదా తపోవన భావన పద్ధతిలో (Tapovana Concept) వ్యవస్థీకరించడం, పోషించడం, నియంత్రించడం నిర్వహించడం; అవసరమైన అన్ని చట్టాలూ, చర్యలు చేయడం (to do all acts and things) లేదా ఇటువంటి పాఠశాల ప్రగతికి దోహదంచేసే చర్యలుచేపట్టడం.

బి) రాష్ట్రంలో మరి ఏ ఇతర వ్యక్తి అయినా వ్యక్తిగత హోదాలో ఇదే మాదిరి గురుకుల పాఠశాలలనూ కళాశాలలనూ నిర్వహిస్తే వాటిని దీనికి అనుబంధం చేయడం,వాటికిగుర్తింపుఇవ్వడం.

సి) సంస్థ స్థాపించిన లేదా అనుబంధం చేసిన లేదా గుర్తింపు ఇచ్చిన గురుకుల పాఠశాలల్లోనూ, కళాశాలల్లోనూ, విద్యార్థుల విద్యకు సంబంధించిన పాఠ్య ప్రణాళిక (Curricullum) పాఠ్యక్రమం (Syllabus) పరీక్షలపథకమూ వాటిని నిర్వహించడమూ వంటి ఇతర కార్యక్రమాలను తయారు చేయడం, ప్రవేశ పెట్టడం, పర్యవేక్షించడం వాటిని కాలానుగుణంగా మార్పుచేయడం.

(డి) గురుకుల పాఠశాలలోని సిబ్బంది, విద్యార్థుల ప్రయోజనం కోసం అధ్యయన కోర్సులు, సమావేశాలు (conferences) ఉపన్యాస - సదస్సు - కార్యగోష్ఠులు (Lecture - seminar -workshops), అధ్యయన పర్యటనలు (Study tours) వంటి వాటిని నిర్వహించడం.

(ఇ) సంస్థ ఆధ్వర్యంలో పాఠశాలల్లో బోధన, పరిపాలన , సాంకేతిక గుమాస్తా వర్గీయ, తదితర పదవులను ఏర్పరచటం; ఈ ఉద్యోగాలకు అభ్యర్థులను నియుక్తులను చేయడం, వారికి ప్రమోషన్‌లు ఇవ్వడం, బదిలీలు చేయడం. ఇంతేకాక అక్కడ సిబ్బందికి శిక్షణను ఏర్పాటు చేయడం.

(ఎఫ్) అవసరమని భావించిన ఇతర సంఘాలను లేదా ఇతర అంగాలను ఏర్పాటు చేయడం, సంస్థ అధికారాలకు, విధులకు, ధారణావధికి (tenure) ఇంకా ఇతరాలకు సంబంధించిన ఉపనియమావళిని (Bye-laws)ఏర్పరచడం.

(జి) సంస్థ ప్రయోజనాల లక్ష్యాల సాధనకు అవసరమైన విధానంలో ఆస్తిని ఆర్జించడం (acquire) కాపాడటం (hold)అమ్మివేయడం

(హెచ్) ఒకనిధి(fund)ని ఏర్పాటుచేసి దానికి

(i) కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు అందజేసిన ద్రవ్యాన్నిజమకట్టడం.

(ii) సంస్థకి అందిన అన్ని రుసుములు (Fees) ఇతర ఛార్జీలుజమకట్టడం

(iii) గ్రాంట్‌లు, బహుమతులు, విరాళాలు, ఉపకారాలు (Benefactions) వీలునామాద్వారా వదలిన ఆస్తులు లేదా ఇటువంటి వేటిద్వారానైనా లభించినధనాన్నిజమకట్టడం

(iv) ఏ ఇతర విధానంలో లేదా ఏ ఇతర వనరుల నుంచి అయినా సంస్థకు లభించిన ధనాన్ని జమకట్టడం.

(ఐ) సంస్థ లక్ష్యాలను పూర్తిగా కాని, పాక్షికంగా కాని పోలిన ఏ ఇతర వ్యవస్థ, సంస్థ లేదా సంఘానికి (association) చందా ఇవ్వటం, లేదా ఆ సంస్థలో సభ్యత్వం పొందటం, లేదా ఆ సంస్థతో సహకరించటం

(జె) సంస్థ అన్ని లక్ష్యాలు లేదా ఏ ఒక్క లక్ష్యాన్ని అయినా సాధించటానికి అనుషంగికంగా

అవసరమైన చట్టపరమైన అన్ని చర్యలను, (to do all such acts and things)తీసుకోవడం.

**4. పాలకమండలి ఏర్పాటు** (Constitution of Board of Governors) :

విద్యాశాఖ కార్యదర్శి అధ్యక్షులుగా ఉండే పాలకమండలికి సంస్థ నిర్వహణాధికారాలు ఉన్నాయి. జి.ఓ. ఎం.ఎస్. నెం. 629, విద్యాశాఖ తేది 2.3.72 అనుసరించి పాలకమండలి ఏర్పాటయింది. కాలానుగుణంగా మార్చ చేసినపాలకమండలి నియామకం కింది విధంగా ఉంది.

**పదవిరీత్యా సభ్యులు** (Exofficio members):

I. అధ్యక్షులు —
ప్రభుత్వ విద్యాశాఖకార్యదర్శి

II. సభ్యులు
1.ప్రభుత్వ ఆర్థికశాఖకార్యదర్శి
2.ఉన్నత విద్యాశాఖ సంచాలకులు
3.పాఠశాల విద్యాశాఖ సంచాలకులు
4.ఎస్.సి.ఇ.ఆర్.టి. సంచాలకులు
5.గిరిజన సంక్షేమశాఖ సంచాలకులు
6.రోడ్లు, భవనాలశాఖ - ప్రధాన ఇంజనీర్
7.హైదరాబాద్ పబ్లిక్ స్కూలు ప్రధానాచార్యులు
8.ఆంధ్రప్రదేశ్ గురుకుల కళాశాల ప్రధానాచార్యులు

III. సభ్యకార్యదర్శి
ఆంధ్రప్రదేశ్ గురుకుల విద్యాసంస్థల మండలి

**నామ నిర్దిష్ట సభ్యులు** (Nominated members):

1. ఒక ఎస్.సి.ఇ.ఆర్.టి. నామ నిర్దిష్టుడు (సంచాలకులు, NCERT న్యూఢిల్లీ నామనిర్దేశంచేయాలి) — సభ్యులు
2. ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాల ప్రధానోపాధ్యాయులు (అధ్యక్షులు నామ నిర్దేశంచేయాలి) — సభ్యులు
3. ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాల ఉపాధ్యాయులనుంచి ఒక ప్రతినిధి (అధ్యక్షులు నామనిర్దేశంచెయ్యాలి) — సభ్యులు
4. ఐదుగురు ప్రముఖ విద్యావేత్తలు (ప్రభుత్వం నామనిర్దేశంచెయ్యాలి) — సభ్యులు (5)

సంస్థకు రెండు స్థాయి సంఘాలను పాలకమండలివారు కిందిసభ్యులతో ఏర్పాటు చేశారు.

**(ఎ) పరిపాలన ఆర్థిక వ్యవహారాల స్థాయీ సంఘం :-**

1. సంస్థ అధ్యక్షులు
2. ప్రభుత్వ ఆర్థిక శాఖ కార్యదర్శి లేదా ఉపకార్యదర్శి స్థాయికి తక్కువ కాకుండా ఆర్థిక శాఖ కార్యదర్శి నామనిర్దేశంచేసినవారు.
3. ఉన్నత విద్యాశాఖ సంచాలకులు.
4. పాఠశాల విద్యాశాఖ సంచాలకులు
5. రోడ్లు-భవనాలు శాఖ ప్రధాన ఇంజనీర్
6. ఆంధ్రప్రదేశ్ గురుకుల విద్యా సంస్థల మండలి కార్యదర్శి

**(బి) విద్యావిషయిక స్థాయీ సంఘం** :(Standing commitee for Academic matters) ;

1. సంస్థ అధ్యక్షులు
2. ఉన్నత విద్యాశాఖ సంచాలకులు
3. పాఠశాల విద్యాశాఖ సంచాలకులు
4. ఎస్.సి.ఇ.ఆర్.టి సంచాలకులు
5. గిరిజన సంక్షేమ సంచాలకులు
6. పాలకమండలిలో సభ్యులుగా ఉన్న ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాల ప్రధానాచార్యులు
7. ఆంధ్రప్రదేశ్ ఆశ్రమ విద్యాసంస్థల మండలి - కార్యదర్శి

5. సంస్థల పెరుగుదల (Growth of Institutions): సంస్థల పెరుగుదల సంవత్సరం వారీగా కిందచూడవచ్చు.

| క్రమసంఖ్య | సంవత్సరం | సంస్థల సంఖ్య | | | |
|---|---|---|---|---|---|
| | | పాఠశాలలు | జూనియర్ కళాశాలలు | డిగ్రీ కళాశాలలు | మొత్తం సంస్థలు |
| 1. | 1971-72 | 1 | - | - | 1 |
| 2. | 1972-73 | 3 | - | - | 3 |
| 3. | 1973-74 | 3 | - | - | 3 |
| 4. | 1974-75 | 3 | - | - | 3 |
| 5. | 1975-76 | 4 | 1 | - | 5 |
| 6. | 1976-77 | 4 | 1 | - | 5 |
| 7. | 1977-78 | 4 | 1 | - | 5 |
| 8. | 1978-79 | 4 | 1 | - | 5 |
| 9. | 1979-80 | 6 | 1 | - | 7 |
| 10. | 1980-81 | 7 | 1 | - | 8 |
| 11. | 1981-82 | 10 | 1 | - | 11 |
| 12. | 1982-83 | 10 | 1 | 1 | 12 |
| 13. | 1983-84 | 52 | 1 | 1 | 54 |
| 14. | 1984-85 | 57 | 1 | 1 | 59 |
| 15. | 1985-86 | 67 | 3 | 1 | 71 |
| 16. | 1986-87 | 77 | 4 | 1 | 82 |
| 17. | 1987-88 | 79 | 5 | 1 | 85 |

పైపట్టికలో 1983 - 84 నుంచి సంస్థల సంఖ్యలో పెరుగుదల ఎక్కువగా ఉన్నదని కనిపిస్తూ ఉంది. కింది పట్టిక రాష్ట్రంలోని మూడు ప్రాంతాలలో నెలకొని ఉన్న సంస్థల వివరాలు తెలుపుతుంది.

| క్రమ సంఖ్య | సంస్థల వివరాలు | నెలకొన్న పాఠశాలల సంఖ్య | | | |
|---|---|---|---|---|---|
| | | ఆంధ్ర | తెలంగాణ | రాయలసీమ | మొత్తం |
| 1. | బాలుర సాధారణ గురుకుల పాఠశాలలు | 9 | 10 | 4 | 23 |
| 2. | బాలికల సాధారణ గురుకుల పాఠశాలలు | 9 | 10 | 4 | 23 |
| 3. | గిరిజన బాలుర గురుకుల పాఠశాలలు | 15 | 9 | 1 | 25 |
| 4. | గిరిజన బాలికల గురుకుల పాఠశాలలు | 1 | 2 | - | 3 |
| 5. | బాలురుకు మాత్రమే ఉర్దూ గురుకుల పాఠశాలలు | - | 1 | - | 1 |
| 6. | వెనుకబడిన తరగతుల బాలురకు మాత్రమే గురుకుల పాఠశాలలు | 1 | 1 | 1 | 3 |
| 7. | సహవిద్య గురుకుల పాఠశాలలు | 1 | - | - | 1 |
| 8. | బాలురు సాధారణ గురుకుల జూనియర్ కళాశాలలు | 1 | - | - | 1 |
| 9. | గిరిజన బాలుర గురుకుల జూనియర్ కళాశాలలు | 1 | 2 | - | 3 |
| 10. | సహవిద్య గురుకుల జూనియర్ కళాశాల | 1 | - | - | 1 |
| 11. | గురుకుల డిగ్రీ కళాశాల (బాలురకు) | 1 | - | - | 1 |
| | మొత్తం | 40 | 35 | 10 | 85 |

**1988-89లో ఆరంభించవలసిన కొత్త సంస్థలు:** 1988-89 లో కింది గురుకుల విద్యాసంస్థలు ఆరంభమవుతాయి.

(ఎ) వెనకబడిన తరగతులవారికి 3 పాఠశాలలు : ఆంధ్రప్రాంతంలో నెల్లూరు జిల్లాలో కోట (Kota) లో ఒకటి; రాయలసీమ ప్రాంతంలో అనంతపురం జిల్లాలో లేపాక్షిలో (Lepakshi) ఒకటి; తెలంగాణ ప్రాంతంలో మెదక్ జిల్లాలో దౌలతాబాద్ (Doulatabad)లో ఒకటి.

(బి) నెల్లూరు జిల్లాలో చిట్టేడు (Chittedu) లో వెనకబడిన తరగతుల వారికి (యానాదులు) ఒక గురుకుల పాఠశాల.

(సి) ఆంధ్ర ప్రాంతంలో గుంటూరులో ఒకటి; రాయలసీమ ప్రాంతానికి కర్నూలులో ఒకటి; తెలంగాణా ప్రాంతంలో నిజామాబాద్‌లో ఒకటి; మొత్తం మూడు ఉర్దూ మాధ్యమంలో గురుకుల పాఠశాలలను ఆరంభించటానికి ప్రతిపాదనలు చేశారు.

కర్నూలులోని సిల్వర్ జూబ్లి ప్రభుత్వ డిగ్రీ కళాశాలను ఆంధ్రప్రదేశ్ గురుకుల విద్యాలయాలసంస్థ 1988-89 నుంచి అధీనం చేసుకోవటానికి ప్రభుత్వం ఆదేశాలను జారీ చేసింది.

**6. విద్యార్థుల సంఖ్య - పెరుగుదల :**

8వ తరగతిలో 108 మందితో, 5వ తరగతిలో 36 మందితో మొత్తం 144 మంది విద్యార్థులతో రాష్ట్రంలో మొదటి గురుకుల పాఠశాల ఆరంభమయింది. ఉన్నటువంటి సంస్థల్లో ఉన్నత తరగతులు ఆరంభించడం వల్లా, సంవత్సరం తరవాత సంవత్సరంలో కొత్త సంస్థలు ఆరంభించడంవల్లా లబ్ధిదారుల సంఖ్య క్రమంగా వృద్ధి చెందుతూ వచ్చింది. 1983-84 సంవత్సరానికి ముందు గురుకుల విద్యా సంస్థల నుంచి మొత్తం లబ్ధిదారుల సంఖ్య 340. అయితే 1987-88 నాటికి లబ్ధిదారుల సంఖ్య 22,975 పెరిగింది.

**7. సాఫల్యాలు (Achievements) :**

తొలిదశ నుంచి ఎస్.ఎస్.సి, ఇంటర్‌మీడియట్ పబ్లిక్ పరీక్షల్లోనూ గురుకుల విద్యాసంస్థలు, గురుకుల జూనియర్ కళాశాలలూ అద్భుతమైన ఫలితాలను సాధిస్తున్నాయి. గురుకుల పాఠశాలలు 1974లో మొదటి జట్టు విద్యార్థులను ఎస్.ఎస్.సి. పబ్లిక్ పరీక్షకు పంపాయి; విద్యార్థులు అందరూ మొదటి శ్రేణిలో ఉత్తీర్ణులు అయ్యారు. రెండో జట్టునుంచి ఎస్.ఎస్.సి పబ్లిక్ పరీక్షల్లో రాష్ట్రంలోని శ్రేణుల్లో ఎక్కువభాగం గురుకుల పాఠశాలలు పొందడం ఆరంభించాయి. ఇదే మాదిరిగా ఇంటర్‌మీడియట్ రెండో సంవత్సరం పబ్లిక్ పరీక్షకు 1977లో మొదటి జట్టును పంపారు; ఫలితాలు అద్భుతంగా వచ్చాయి. మార్చి 1988లో ఎస్.ఎస్.సి. పబ్లిక్ పరీక్షకు ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాలలనుంచి హాజరు అయిన విద్యార్థులే 2, 3, 4, 5, 7, 8, 9, 10 శ్రేణులు దక్కించుకున్నారు.

నాగార్జునసాగర్‌లోని గురుకుల జూనియర్ కళాశాల విద్యార్థులకు I, II, III, IV, VI, VII శ్రేణులు దక్కించుకున్నారు. విద్యాసాఫల్యాలకి (Scholastic achievements) తోడు గురుకుల విద్యాసంస్థలలోని విద్యార్థులు క్రీడారంగంలో, సైన్స్ టాలెంట్ సెర్చ్ పరీక్షలు, స్కౌట్స్, గైడ్స్; మేథమేటికల్ ఒలంపిడ్ వంటి ఇతర కరికులర్, కో-కరికులర్ కార్యకలాపాలలో వారివారి సంస్థలకు విజయవిశిష్టతలు (laurels)చేకూర్చగలిగారు.

**8. ప్రవేశాలు (Admissions) :**

ప్రవేశ పరీక్షలను నిర్వహించి, ప్రతిభ ఆధారంగా గురుకులపాఠశాలల్లో ప్రవేశంకల్పిస్తారు.

**9. ఈ సంస్థలలో దినచర్య; సంఘటనల కాలెండర్**

**(Daily routine in the Institutions and calender of events)**

స్థానిక అవసరాలకు తగినట్లుగా ఋతువులు, వాతావరణ పరిస్థితులకు సరిపోయే విధంగా కాలమానంలో (timing) స్వల్పమైన మార్పులు మినహా సంస్థలలో దినచర్య ఇంచుమించు ఒకే విధంగా ఉంటుంది.

**ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాల సర్వేల్‌లో దినచర్య :** (Daily Routine in A. P. R. School, Survail)

| | | | | |
|---|---|---|---|---|
| 5.30 | ఉదయం | 6.15 | ఉదయం | సాముదాయిక ప్రార్థన; వ్యాయామ అభ్యాసాలు |
| 6.15 | ఉదయం | 7.15 | ఉదయం | స్వేచ్ఛాసమయం |
| 7.15 | " | 9.00 | " | బోధన |
| 9.00 | " | 9.30 | " | పొద్దుటి ఫలహారం (Break fast) |
| 9.30 | " | 1.00 | మధ్యాహ్నం | బోధన (15 నిమిషాల విరామంతో) కొనసాగుతుంది. |
| 1.00 | మధ్యాహ్నం | 2.30 | " | పగటి భోజనం, విశ్రాంతి |
| 2.30 | " | 3.30 | | పర్యవేక్షిత అధ్యయనం |
| 3.30 | " | 5.00 | " | శాస్త్రంలో ప్రయోగాలు<br>ఎక్స్ట్రాకరికులర్ వ్యాసంగాలు, సౌంట్, తోటపని, సాంస్కృతిక సమావేశం, క్లబ్ వ్యాసంగాలు, పని అనుభవము, గ్రంథాలయ పఠనం మొదలైనవి టైమ్‌టేబిల్ అనుసరించి ఉంటాయి. |
| 5.00 | " | 5.15 | " | టీ |
| 5.15 | " | 6.15 | " | ఆటలు |
| 6.15 | " | 7.30 | " | విశ్రాంతి, గ్రంథాలయ, రీడింగ్‌రూమ్ |
| 7.30 | " | 8.00 | " | రాత్రి భోజనం |
| 8.00 | " | 9.30 | " | స్వయం అధ్యయనం, చదవటం |
| 9.30 | " | – | – | నిద్ర |

## సంఘటనల కేలండర్

ఉన్నత పాఠశాల విభాగం 220 రోజులు, 5 నుంచి 7 తరగతుల విభాగం 200 రోజులు సంస్థ పని చేస్తుంది. తగినంత ముందుగానే మూడు సంస్థల అధిపతులు కమిటీగా ఉండి విద్యాసంవత్సరానికి సంఘటనల కేలండర్‌ను తయారు చేస్తారు; దీన్ని కార్యదర్శికి సమర్పించి ఆమోదం పొందుతారు. కరికులర్, కో-కరికులర్ వివిధ వ్యాసాంగాలు, సెలవులు, పరీక్ష తేదీలు, అంతిమ సెలవులు (Terminal holidays), విహారయాత్రలు, వార్షిక విద్యాసంబంధ ప్రణాళికను (annual academic plan) ప్రతి ఉపాధ్యాయుడూ తయారు చేస్తాడు. విద్యాసంబంధమైన కృషికి భౌతిక వనరులకు లోబడి పెంపుకోసం వార్షిక ప్రణాళికను పాఠశాల సిద్ధపరుస్తుంది. పాఠశాల తెరిచే రోజుకు విద్యార్థులు వస్తారు. కనుక వారు రాకముందే కనీసం వారం రోజులైనా ముందుగానే ఉపాధ్యాయులు వచ్చి ఈ పని ని నిర్వహిస్తారు. ప్రతి శాఖకు (Discipline) ఒక క్లబ్ ఉంటుంది. వారు వ్యాసక్తులకు, సంభాషణలకు, పత్రాలను చదవటానికి ఒక ప్రణాళికను తయారు చేస్తారు. అంతేకాక ఫాకల్టీ (Faculty) సమావేశాలను ప్రతినెలా నిర్వహిస్తారు.

సాధ్యమైనంతమేరకు వీటన్నిటిని కూడా సంఘటనల కేలండర్‌లో చూపిస్తారు. స్వాతంత్ర్యదినోత్సవం, బాలల దినోత్సవం, గాంధీ జయంతి, యు.ఎన్.వో దినోత్సవం, ఉపాధ్యాయ దినోత్సవం, ఆంధ్రరాష్ట్రావతరణ దినోత్సవం, ప్రపంచ ఆరోగ్య దినోత్సవం, వినాయకచవితి, దీపావళి, ఇదుల్-ఫితర్ (రంజాన్) క్రిస్మస్ వంటి ముఖ్యమైన జాతీయపండుగలు మతపరమైన పర్వదినాలను (Religious festivals) కూడా కేలండర్‌లో చూపిస్తారు.

### 10) సంస్థలు అందించే విద్యార్థివసతి గృహ సౌకర్యాలు, ఇతర సౌకర్యాలు :

(Hostels and other amenities provided in the Institutions) :

**నియమిత ఆహారం; వసతి గృహం** (Diet and Hostel):

పాఠశాలలో రుసుము లేకుండానే విద్యార్థులకు భోజన-వసతి (Boarding and Lodging) సౌకర్యాలు కల్పిస్తారు. తల్లితండ్రుల వార్షిక ఆదాయం అనుసరించి విద్యార్థుల నుంచి నామమాత్రపు నిర్వహణ ఖర్చులన

camps) అధ్యక్ష బాల భటులకు శిక్షణ ఇచ్చే శిబిరాలు (Camps for training president scouts) నిర్వహించారు; కొంత మంది విద్యార్థులకు అధ్యక్ష బాలభటులుగా శిక్షణ కూడా ఇచ్చారు. సంవత్సరం అంతటా బాలభటులకు అనేక అభ్యాసాలను (Hikes) వ్యాసాంగాలను (Activities) ఏర్పాటు చేశారు. 1973లో తిరుపతిలో ఏర్పాటుచేసిన బాలభట కేమ్‌పోరీలో (Camporee) ఆ సంవత్సరపు రాష్ట్ర రోలింగ్‌షీల్డ్‌ను (State Rolling shield for the year), దానితోపాటు అనేక పోటీలలో అనేక బహుమతులను సర్వేల్ (Survail) విద్యార్థులు గెలుచుకున్నారు. ఇంతేకాక అనేక ప్రవీణత బాడ్జీలు (Proficiency badges) కూడా గ్రహించారు. ఫరీదాబాదులో ఏర్పాటైన జంబోరీ (Jamboree) లో విద్యార్థులుపాల్గొన్నారు.

**15. గృహవ్యవస్థ (House system) :**

40 లేదా 50 మంది ఉండే గృహాలుగా (Houses) విద్యార్థులు అందరిని విభజిస్తారు. ప్రతి గృహానికి ఒక గొప్ప శాస్త్రజ్ఞునిపేరు, విద్యావేత్త పేరు, లేదా జాతీయ లేదా రాష్ట్ర నాయకునిపేరు పెడతారు. ఆ గృహానికి సంబంధించిన విద్యార్థుల అవసరాలు, సంక్షేమం, పర్యవేక్షణను చూడటానికి ఒక హౌస్‌మాస్టర్ (House Master) ఉంటారు. పరిపాలనా సౌలభ్యంకోసం ప్రతి గృహాన్ని (House) 10 మంది విద్యార్థులు ఉండే విధంగా 4 లేదా 5 సమూహాలుగా విభజిస్తారు. ఒక్కొక్క సమూహానికి ఒక నాయకుడు (Group leader) ఉంటారు. సమావేశాలకు, ఉత్సవాలను ఏర్పాటు చేయటానికి తరగతి విద్యార్థి నాయకులు, పాఠశాల విద్యార్థి నాయకులు ఉంటారు. వీరికి నాయకుని పాత్ర నిర్వహించటానికి శిక్షణ ఇస్తారు. అన్ని కార్యకలాపాల్లోనూ, సభలను ఏర్పాటు చేయడం లోనూ విద్యార్థులను కూడా కలుపుకొంటారు. భోజనశాలల్లో (Dining halls) విద్యార్థులు వంతులవారీగా భోజనాల ఏర్పాట్లను కూడా చేస్తారు. శ్రమ మాన్యత (Dignity of labour) ను, సేవా ప్రవృత్తిని బోధించటానికి భోజనం చేసిన తరవాత విద్యార్థులు వారి పళ్ళాలను వారు శుభ్రపరుచుకొనే ఏర్పాటు చేశారు. జట్లుగా విద్యార్థులు వారు వారు నిద్రించే ప్రదేశాలనూ, నివసించే గదులనూ ఊడ్చి శుభ్రపరుచుకోవాలి.

**16. విహార యాత్రలు (Excursions)**

శాస్త్రీయంగానూ, చారిత్రకంగానూ ఆసక్తిదాయకమైన ప్రదేశాలకు ప్రతి సంవత్సరం విద్యార్థులను విజ్ఞాన పర్యటనకు (Educational tour) పంపుతారు. గత మూడు సంవత్సరాల్లోనూ అందుబాటులో ఉన్న నిధులకు తగినట్లుగా వివిధ స్థలాలకు విద్యార్థులను పంపారు. చదువు ఆటలు, సాంస్కృతిక వ్యాసంగాలు మొదలైన వాటిలో ప్రసిద్ధులైన విద్యార్థులను రాష్ట్రం వెలుపలి ప్రదేశాలకు ప్రోత్సాహకంగా పంపటమే సంస్థ ఉద్దేశం.

**17. శ్రవణ, దృశ్య పరికరాలు (A.V.Equipment) :**

ప్రతి పాఠశాలకూ ఒక కెమెరా, 16MM ప్రొజెక్టర్ ఉంటాయి. ప్రొజెక్టర్‌ను ఉపయోగించటానికి ఉపాధ్యాయులకు శిక్షణ ఇచ్చాం. అనేక ఏజన్సీల నుంచి విద్యావిషయక ఫిల్ములనూ శాస్త్రీయంగానూ, సాంస్కృతికంగానూ ఆసక్తి కలిగించే ఫిల్ములను పాఠశాల ప్రదర్శనకు తీసుకొనివచ్చి సాయంత్రం పూట వారానికి ఒకసారి లేదా రెండుసార్లు కూడా ప్రదర్శిస్తారు. వీటివల్ల విద్యార్థులకు వినోదమేకాక విద్యావిషయిక విలువల పరిజ్ఞానం కూడా కలుగుతుంది. పాఠశాలలకు టేప్‌రికార్డులనూ, టి.వి., వి.సి.పి. మొదలైన వాటిని అందజేయటానికి ప్రయత్నాలు చురుకుగా సాగుతున్నాయి.

**18. కరికులమ్, విద్యావిషయక అభ్యాస కుశలతలు, పని అనుభవం :**

(Curriculum, Academic Practices and Work experience) :

అన్ని తరగతుల్లోనూ బోధన మాధ్యమం తెలుగు. ఈ పాఠశాలల్లో విద్య అభ్యసించే విద్యార్థులందరినీ, VII తరగతి కామన్ పరీక్షకు ఎస్.ఎస్.సి. పరీక్షకు హాజరు కావటానికి ప్రస్తుతం తరిఫీదు ఇస్తున్నారు. VII తరగతి కామన్ పరీక్షను అన్ని జిల్లాలలోనూ ఆయా జిల్లా విద్యాశాఖాధికారులు నిర్వహిస్తారు. అయితే ఎస్.ఎస్.సి. పరీక్షను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పరీక్షల కమీషనర్ నిర్వహిస్తారు. ప్రతి సంవత్సరం జూన్‌లో విద్యాసంవత్సరం ఆరంభమయి, తరవాతి సంవత్సరం ఏప్రియల్‌లో అంతమవుతుంది.

సంస్థ వసూలు చేస్తుంది. పాఠశాలలో చదివే విద్యార్థులంతా స్థానికులే (Residential Scholars). సిబ్బంది పిల్లలను మాత్రం అస్థానికులైన విద్యార్థులుగా (Non-residential scholars) ప్రవేశం కల్పిస్తారు. వ్యాయామక్రీడలు అయిన తరవాత ఉదయం విద్యార్థులకు ఒక కప్పు పాలు ఇస్తారు. రెండుగంటల తరవాత ఇడ్లీలు, పూరీలు, దోసె లేదా ఉప్మా వంటి పొద్దుటి ఫలహారం ఆవర్తితంగా కాఫీతోపాటు ఇస్తారు. మధ్యాహ్నపు భోజనం సుమారు 1.00 గంటకు ఉంటుంది. సాయంత్రం భోజనం 7.30 కు ఉంటుంది. భోజనంలో అన్నం పప్పు, కూర, పచ్చడి, సాంబారు లేదా రసం, మజ్జిగ ఉంటాయి. అప్పుడప్పుడు పండుగరోజుల్లోనూ, నెలవారిగా ఉండే మధ్యాహ్నపు భోజనంలోనూ మిఠాయిలు కూడా పెడతారు. ఒక ప్రాజెక్టుగా జాతీయ పోషకాహార సంస్థ, హైదరాబాదు నుంచి నిపుణులు వచ్చి పోషకసర్వే నిర్వహిస్తారు. ప్రతి సంవత్సర అనుక్రమం (Follow up) చేస్తారు. శాస్త్రజ్ఞుల జట్టు ఇచ్చిన సూచనలనుచాలామేరకుఆచరణలోపెట్టారు.

**11. ఆరోగ్య సంరక్షణ (Health Care) :**

ఇ.ఎన్.టి. (ENT) నిపుణులు, నేత్రవైద్యులు (Optholmologists), వైద్యులు (Physicians) మొదలైన వారితో ఏర్పడిన వైద్యుల బృందం పాఠశాల ఆరోగ్య చికిత్సాలయాన్ని ప్రతిసంవత్సరం వార్షిక తనిఖీ చేస్తుంది. అవసరమైన మందుల నిర్దేశాన్ని (Medical prescription) తీసుకొని, తగిన అనుక్రమ చర్యలను తీసుకొంటారు. అవసరమనితోస్తే తల్లిదండ్రులకు సమాచారం తెలుపుతారు. పాఠశాల ఆవరణంలో పూర్తికాలం పనిచేయటానికి అర్హతలున్న స్టాఫ్‌నర్సును నియోగిస్తారు. పిల్లలకు చికిత్స చేయటానికి అందుబాటులోనున్నచోట మందులను కొంటారు. వారానికి మూడుసార్లు సంస్థలకు వచ్చి విద్యార్థులను పరీక్షించి, మందులను నిర్ణయించటానికి దగ్గరలో ఉన్న ప్రాథమిక వైద్య కేంద్రాలనుంచి ప్రభుత్వ మెడికల్ ఆఫీసర్‌లను కోరారు. నెలకు రు.150 గౌరవవేతనం వారికి ఇస్తారు. ఆవర్తితంగా ఇనాక్యులేషన్, వేక్సినేషన్, గదుల్లో డి.డి.టి. చల్లడం వంటి కార్యకలాపాలను అవసరమయినప్పుడల్లా సమితి సిబ్బంది (Samithi staff)సహాయంతో చేస్తారు.

**12. పాఠ్యగ్రంథాలు, యూనిఫారాలు (Text books and uniforms) :**

పాఠశాల పనిచేసే కాలంలో ధరించటానికి తగినన్ని యూనిఫారాలను (నాలుగు) ప్రతివిద్యార్థికీ ఇస్తారు. స్కౌట్ యూనిఫారం, పి.టి. తరగతుల్లో ధరించటానికి తెల్ల చొక్కాలు, తెల్లబనీన్లు (రెండు జతలు) ఉత్సవ సందర్భాల్లో ధరించటానికి ఒక తెల్లచొక్కా, ఒక తెల్లపాంటు ఇస్తారు. వీటికితోడు ప్రతి విద్యార్థికీ కేన్‌వాస్ షూస్, ఒక జత చెప్పులు, రెండు దుప్పట్లు కూడా ఇస్తారు. గిరిజన విద్యార్థుల గురుకుల పాఠశాలల్లో విద్యార్థులకు చాపలను (Matresses) కూడా సంస్థ ఇస్తుంది. విద్యార్థులకు అవసరమైన పాఠ్యగ్రంథాలను సంస్థ ఇస్తుంది. అయితే పెన్సిల్స్, సిరా మొదలైనవాటిని విద్యార్థులే సమకూర్చుకోవాలి. సంస్థ ఖర్చుతో యూనిఫారాలు, ఇతర దుస్తులను సక్రమంగా ఉతకడానికి ఏర్పాట్లు ఉన్నాయి. ఆదివారాల్లోను, నెలవురోజుల్లోను సక్రమంగా క్షురకర్మను చేయిస్తారు. దీనికి అయిన ఖర్చును కూడా సంస్థభరిస్తుంది.

**13. పఠనమందిరం (Reading room) :**

చక్కగా అమర్చిన, దినదినాభివృద్ధి చెందుతూ ఉన్న గ్రంథాలయంతోపాటు జర్నల్స్, పీరియాడికల్స్‌తో కూడిన ఒక పఠనమందిరం కూడా ఉంది. లైబ్రరీ పీరియడ్‌లలో ఇచ్చిన గ్రంథాలతోపాటు విస్తృత పఠనానికి గ్రంథాలయం నుంచి కూడా గ్రంథాలను విద్యార్థులకు ఇస్తారు. ఎంపిక చేసిన, ప్రయోజనకరమైన దినపత్రికలు, వారపత్రికలు మేగజైన్‌లు వంటి వాటిని కొంటారు. వీటిని విద్యార్థుల ఉపయోగం కోసం పఠనమందిరంలో ప్రదర్శిస్తారు, ఈ ముఖ్యమైన పనిని ఉపాధ్యాయుడుగాని, గ్రంథాలయాధికారి గాని నిర్వహిస్తారు.

**14. బాలభట కార్యకలాపాలు (Scouting) :**

ఈ పాఠశాలల్లో అందరు విద్యార్థులూ బాలభటులే (Scouts or cubs) లేదా జూనియర్ బాలభటులే. ఉపాధ్యాయులందరూ బాలభట కార్యక్రమంలో శిక్షణ పొందుతారు. అందరు విద్యార్థులకూ బాలభటుల యూనిఫారం ఇస్తారు. పాఠశాలలో బాలభట ముఖ్య కేంద్రాల్లో గతంలో పాట్రల్ లీడర్‌ల శిక్షణ శిబిరాలు (Patrol leaders training

బోధన మాధ్యమం తెలుగయినా, ఈ పాఠశాలల్లో చదివే విద్యార్థులు హిందీ, ఇంగ్లీషులలో కూడా ఉన్నత ప్రమాణాలు సాధించడం ఈ సంస్థ ఉద్దేశం. ఇందుకుగాను విద్యార్థులందరూ, ఉపాధ్యాయ వర్గమూ పరస్పరం వారానికి నాలుగు రోజులు ఇంగ్లీషులోనూ రెండు రోజులు హిందీలోనూ తరగతి గదుల వెలుపల మాట్లాడుకుంటూ ఉంటారు. భాషానైపుణ్యాలను ప్రవర్ధన చేసేందుకు చర్చలు, రాత పత్రికలు, సంభాషణా బృందాలు (Conversation circles), క్విజ్ ప్రోగ్రామ్‌లు, వివిధ భాషాపోటీలు, వ్యాసరచనలు, నాలుగు భాషల్లోనూ నిర్వహిస్తారు. తెలుగు, హిందీ, ఇంగ్లీష్ భాషలతోపాటు అందరికీ సంస్కృతం కూడా బోధిస్తారు. ఎందువల్ల అంటే సంస్కృతం మన పురాతన సంస్కృతిని తెలిపేభాష. అంతేకాక అనేక భారతీయ భాషాపదాలకు ఆకరం. తరగతుల్లో నియత బోధనతోపాటు, విజ్ఞానశాస్త్రంలో ప్రయోగాల ప్రదర్శన, సాంఘికశాస్త్రంలో మేప్‌లు గీయటం కూడా విధిగా చేయాలి. తరగతిలో బోధించిన అంశాలలో విజ్ఞానాన్ని విస్తరింపజేయటానికి, అనుబంధం చేయటానికేగాక, విద్యార్థుల సహజ సామర్థ్యం, ఆసక్తి నైపుణ్యాలు, ప్రతిభ వృద్ధి చేయటానికి అనేక విద్యావిషయక అభ్యాస కుశలతలను ఎంపిక చేసుకొంటారు. ప్రతి సబ్జక్టుకూ ఒక సబ్జక్టు క్లబ్ ఆవర్తితంగా మూడు మాసాలకొకసారి రాతపత్రికను వెలువరిస్తుంది. ఉపన్యాసాలే కాక ముఖ్యమైన అంశాలపై ప్రాజెక్టుపని, యూనిట్ పరీక్షలు ఏర్పాటు చేస్తారు.

ఈ ప్రత్యేక సంస్థల్లో ఉపాధ్యాయుడు మార్గదర్శీ, విద్యార్థి కేంద్రమూ అవుతారు. బోధన అనేది ఉపాధ్యాయులూ, విద్యార్థులూ, ఉభయులూ పాలుపంచుకొనే అనుభవం. అంటే బోధన రెండు మార్గాల జరిగే రాకపోకలు (Two way traffic). విద్యార్థిలో అన్వేషణా ధోరణిని వృద్ధి చేయటం ఉపాధ్యాయుని లక్ష్యం. చివరకు ఇది విద్యార్థి అవసరాలను తీర్చాలి. లక్ష్యాత్మకంగా ఆలోచించి శాస్త్రీయ దృక్పథాన్ని విద్యార్థులలో పెంపొందించాలి. పరీక్షించిన దత్తాంశాలపై వారి నిర్ణయాలు ఆధారపడి ఉండాలి.

రసాయనశాలలో ఉపాధ్యాయుల మార్గదర్శకత్వంలో విద్యార్థుల పరిశోధనలు, ప్రయోగాలు చేస్తారు. తార్కికశక్తిని గణిత శాస్త్రాధ్యాపకులు పెంపొందింప చేస్తారు. ప్రజాస్వామిక సంఘంలో విజయవంతంగా నివసించటానికి ముందుగా అవసరమైన స్పష్టమైన ఆలోచనా సరళిని, భావాలను వ్యక్తం చేయటంలో కచ్చితత్వాన్ని స్పష్టతతో ప్రసంగించటం, రాయటం ద్వారా పెంపొందించేందుకు భాషాబోధకులు కృషి చేయాలి. సర్వ సమభావదృష్టిని, ప్రపంచ పౌరుణ్ణి అనే భావనను కలిగించటానికి సాంఘిక శాస్త్ర ఉపాధ్యాయులు ప్రయత్నిస్తారు. క్లబ్ వ్యాసంగాలను ఏర్పాటు చేయటం, సైన్సు ఫెయిర్‌లలోనూ, విద్యావిషయక, విజ్ఞాన శాస్త్ర ప్రదర్శనశాలలోనూ అన్ని పోటీలలోనూ బాలురు పాల్గొనే విధంగా ప్రోత్సాహించడం, అనేది ఆంధ్రప్రదేశ్ గురుకుల పాఠశాలల ప్రత్యేక లక్షణం.

పర్యవేక్షణలో అధ్యయనం, స్వయం అధ్యయనకాలం అనేవి గురుకుల పాఠశాలలోని అతి ముఖ్యమైన ప్రతిభావంతమైన విద్యావిధానాలు. వీటిలో అంశాలలో (Subjects) ఉపాధ్యాయులు ఇచ్చిన వివిధ నియోజనాలను (assignments) విద్యార్థులు చేపట్టి ఉపాధ్యాయుల మార్గదర్శకత్వంలో అధ్యయనం చేసి, పని చేస్తారు. ఈ గంటల్లో ఉపాధ్యాయుల మార్గదర్శకత్వం కనీసానికి పరిమితం. వారు విద్యార్థుల స్వయంకృషికి మాత్రమే దోహదం చేస్తారు.

భౌతిక, రసాయన శాస్త్రాల్లోనూ, జీవ శాస్త్రాలలోనూ ముఖ్యమైన ప్రయోగాల పట్టికను తయారు చేస్తారు. ఉన్నత పాఠశాల తరగతుల విద్యార్థులు మాత్రం ప్రయోగాలు చేసి, పరిశీలనలు చేసి అనుమితులను నమోదు చేస్తారు. నమోదు పుస్తకాలను రాస్తారు. ఇందుకు బల్లలు అమర్చి ఉంటాయి. అవసరమైనచోట విద్యార్థు లను 2 లేదా 3 ఉండే సమూహాలుగా చేస్తారు. గ్రంథాలయం అతి ముఖ్యమైన ఏజన్సీ. ఏ సంస్థలోనైనా ఉన్న గ్రంథాలయం నాణ్యం, దాన్ని ఉపయోగించడం ఆధారంగా బహుశా విద్యా ప్రమాణాన్ని నిర్ణయిస్తారు. ఈ గురుకుల పాఠశాలల్లో గ్రంథాలయానికి అధిక ప్రాముఖ్యం.

యస్.సి.ఇ.ఆర్.టి. (NCERT), సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీష్ అండ్ ఫారిన్ లాంగ్వేజెస్, రీజినల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీష్ వంటి సంస్థలు సిఫార్సు చేసిన పుస్తకాలేకాక ఇంకా విలువైన ఇతర పుస్తకాలను, సంప్రదించదగిన గ్రంథాలను ప్రతిసంవత్సరం కొనుగోలు చేస్తారు. గ్రంథాలయ పనులకోసం ప్రత్యేకంగా ఒక గంట కేటాయించినా, రోజంతా పుస్తకాలను ఇస్తారు. పఠనమందిరం తెరిచి ఉంచుతారు. ఈ గురుకుల పాఠశాలలన్నింటిలోనూ అర్హత పొందిన గ్రంథాలయాధికారి (Librarian) ఉంటారు. పఠన మందిరంలో అనేక మేగజైన్‌లూ, దినపత్రికలు, విద్యావిషయిక, విజ్ఞానశాస్త్ర మాసపత్రికలు, త్రైమాసికాలూ కూడా ఉంటాయి.

అన్ని పాఠశాలల్లోనూ పని అనుభవ (Work experience) కార్యక్రమం ఉంటుంది. విద్యార్థులు కూరగాయలకు పెరటితోటను పెంచుతారు., వారు నివసించే గదులకు దగ్గరగా పూలమొక్కలు పెంచుతారు. వంటవారు వంటలు చేయగా, ఒక జట్టు విద్యార్థులు భోజనం వడ్డిస్తారు. భోజనం చేసిన తరవాత విద్యార్థులు వారి వారి పళ్ళాలను శుభ్రం చేసుకొంటారు. విద్యార్థుల యూనిఫారాలు చొక్కాలు, నిక్కర్లు, పాంట్లు వంటివాటిని చాకలి ఉతుకుతాడు. కాని బనీన్లు, చెడ్డీలవంటి వాటిని విద్యార్థులే ఉతుక్కుంటారు. వీటితోపాటు ఇతర పనులు కూడా విద్యార్థులు చేస్తారు. గతంలోని వాయ్యర్ సెకండరీ బహుళార్థసాధక పాఠశాలలనుంచి కొంత యంత్ర సామగ్రిని గురుకుల పాఠశాలలకు తరలించటానికి ఇటీవలే ప్రభుత్వం అనుమతించింది. అందువల్ల వచ్చే విద్యాసంవత్సరం నుంచి ఇంకా ఎక్కువ సమగ్రంగా పని అనుభవ (Work experience) కార్యక్రమాన్ని ప్రవేశపెట్టాలనే ప్రతిపాదన ఉంది. ప్రస్తుతం యస్.సి.ఇ.ఆర్.టి. (NCERT) సహాయం, సహకారాలతో అందుబాటులో ఉన్న వనరులనుంచి పరిశుభ్రత, పెరటితోటల పెంపకం, చిన్న చిన్న రిపేర్లు (Minor repairs) చేపట్టింది. ఈ కార్యక్రమానికి కాలనిర్ణయపట్టికలో (Time table) కాలాన్ని కేటాయించారు. ముఖ్యంగా పరిశుభ్రతకు సంబంధించిన పని పెరటితోటల పెంపకం, మైనర్ రిపెయిర్‌లవంటి పరిశ్రమల ఆధారంగా ఉన్న పని అనుభవాన్ని అందుబాటులో ఉన్న వనరులతో చేస్తున్నారు. కార్ఖానాలు, సాంకేతిక సిబ్బంది లేని కారణంగా ప్రస్తుతానికి పరిశ్రమలు ఆధారంగా ఉండే పని అనుభవాన్ని చేపట్టలేదు. ఎరువుల గుంటలు (Compost pits) తయారీ, రోజు ప్రకటనలు తెలిపే బోర్డుమీద ఆహార పదార్థాల కెలొరీ విలువలు తెలుపుతూ రాయటం, మొక్కలు లేదా మడులు అవసరాలకు తగినట్లు ఎరువుల వాడకం, క్రిమి సంహారక మందుల వాడకం, విద్యార్థుల పళ్ళు, కళ్ళు, చెవులు, చర్మం పరీక్షించడం, అవసరమైన నివారణోపాయాలు చేపట్టడం, పెరటితోటలో అందమైన మొక్కల పెంపకం మొదలైనవి ఈ కార్యక్రమంలో ఉంటాయి.

క్రమబద్ధంగా ఆయా అంశాలు బోధించే ఉపాధ్యాయులు (Subject teachers) విద్యార్థులకు గృహనియోజనాలకు అదనంగా ముందుగా నిర్ణయించిన తేదీలలో నాలుగు మాసపరీక్షలు నిర్వహిస్తారు. ఈ పరీక్షల పత్రంలో వ్యాసరూప ప్రశ్నలు, లఘుసమాధాన ప్రశ్నలు, లక్ష్యాత్మక ప్రశ్నలు ఉంటాయి. ప్రోగ్రెస్‌కార్డులను తల్లిదండ్రులకు, అక్కడే వెంటనే అందుబాటులో ఉన్న హౌస్‌మాస్టర్లకు పంపుతారు. క్లాసులోని ప్రతి సబ్జక్టులోని ముఖ్యమైన శీర్షికలపై జ్ఞానం అవగాహన, అనువర్తనం, విద్యార్థుల నైపుణ్యాలు పరీక్షించడానికి యూనిట్ పరీక్షలు ఉపయోగించిన విద్యావిషయక అభ్యాస కుశలతలు, వాటి దక్షత ఫలితాలు చర్చించటానికి మాసం వారీగా సిబ్బంది సబ్జక్టు కమిటీల సమావేశాలు జరుపుతారు.

కళ, చిత్రలేఖనం, సంగీతం తరగతులను పాఠశాల ఏర్పాటు చేస్తుంది. వీటన్నింటికీ సాధారణంగా రెండేసి పీరియడ్‌లు కేటాయించినా అభిరుచి ఉన్నవారికి పాఠశాల పనికాలం తరవాత కొన్ని తేదీలలో ప్రత్యేకంగా, తీవ్రంగా తరిఫీదు ఇస్తారు. జాతీయ గేయాలను పాడటానికి విద్యార్థులకు శిక్షణ ఇస్తారు. కొంతమందికి సాంప్రదాయిక సంగీతంలో కూడా శిక్షణ ఇస్తారు. పాఠశాల బాండ్ వాయించటంలో బాలభటులకు శిక్షణ ఇస్తారు. చిత్రలేఖనంలో ప్రవేశమున్న విద్యార్థులకు చిత్రలేఖనంలోని పరీక్షలకు శిక్షణ ఇస్తారు. కళాప్రదర్శనను ఏర్పాటుచేస్తారు.

ఆటలు లేకుండా పనే ఉంటే బాలుడు మందగొడి అవుతాడు. బాలుర శరీరనిర్మాణం పెంపుచేయటానికి నిర్బంధ ఆటలతో సహా ఒక క్రమబద్ధ వ్యాయామాన్ని ఏర్పాటు చేస్తారు. దేహం ఆరోగ్యంగా ఉంటేనే మానసిక ఆరోగ్యం ఉంటుందనే సూత్రాన్ని కచ్చితంగా పాటిస్తారు. వాలీబాల్, బాడ్మింటన్, క్రికెట్, బాస్కెట్‌బాల్, ఖో-ఖో, కబడ్డీ, టెన్నికాయిట్ వంటి ముఖ్యమైన ఆటలకు అనేక కోర్టులు (Courts) వేశారు. కేరమ్స్, చదరంగం మొదలైన అంతర్-గృహ క్రీడలు కూడా ఏర్పాటు చేశారు. సాయంత్రం పూట బాలురు అందరూ విధిగా క్రీడల్లో పాల్గొంటారు. కొంతస్థాయిలో దక్షతను పొందిన ఆటగాళ్ళకు ప్రత్యేకమైన తరిఫీదు ఇస్తారు. పాఠశాలను హౌసెస్‌గా విభజిస్తారు. ఈ హౌసెస్‌మధ్య ఓడినవారిని తొలగించివేసే విధానంపై (Knock out basis) క్రీడలను నిర్వహిస్తారు. షీల్డులు, బహుమతులు వార్షికోత్సవం రోజున, పోటీలకు బహుమతులను ముఖ్యమైన సందర్భాల్లోను ప్రదానంచేస్తారు.

మందకొడిగా అభ్యసించేవారికి ప్రత్యేక తరగతులను, నిర్వహిస్తారు, తరిఫీదు ఇస్తారు. ప్రతిభావంతులైన వారికి ప్రత్యేక నియోజనాలు, సుసంపన్నత కలిగించే కార్యక్రమాలు అందజేస్తారు. కరికులమ్ పాఠ్యప్రణాళిక ఎస్.ఎస్.సి. కోర్సుకు చెందినవే అయినా తరగతిలో ఆయా పాఠ్యాంశాలలో అవధిని, గంభీరతను పెంచే విధంగా బోధించవలసిందిగా ఉపాధ్యాయులకు ఆదేశాలు జారీ చేశారు. ఇందుకు ప్రమాణ పాఠ్యగ్రంథాలు, ఉన్నతస్థాయి అన్వయ గ్రంథాలుఉపయోగించాలి.

ప్రతి సంవత్సరం వేసవి కాలంలోనూ, విద్యా సంవత్సరంలోనూ అయినా సరే, కేంద్రీయ విద్యాలయ సంఘటన్, బెంగుళూరులోని రీజినల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీష్ యస్.సి.ఇ.ఆర్.టి. వారు నిర్వహించే పునరభ్యసన (orientation) పునశ్చరణ (Refresher) కోర్సులకు వేసవి కాలపు శిక్షణ కోర్సులకు వివిధ అంశాలు (Subjects) బోధించే ఉపాధ్యాయులను పంపుతారు. వారు వారి విజ్ఞానాన్ని అభ్యసనాన్ని నిత్యం సంస్థలో చేసే పనిలో ఉపయోగించుకోవటానికి సలహాలను, సూచనలను ఇస్తారు. బోధనకు సహాయం చేసే అనుబంధ ప్రోజెక్టులను చేపట్టటానికి సూచనలను ఇస్తారు. వారి పనిని పరిశీలిస్తూ (నివేదికలను) కోరుతూ, ఆవర్తితంగా పరిశీలిస్తూ సంస్థ అధికారులు ఆయా విద్యాసంస్థలను సందర్శించినప్పుడుఅంచనావేస్తారు.

ఇంతేకాక పగటిపూట బోర్డర్లకే అయినా బులిటిన్ బోర్డు, మేప్‌తో న్యూస్ బోర్డులు మొదలైనవాటిని ఏర్పాటు చేస్తారు. క్విజ్‌ప్రోగ్రామ్‌లు, జనరల్‌నాలెడ్జి పరీక్షలు కూడా నిర్వహిస్తారు. ఇతర దేశాలలోఉన్న స్నేహితులతో, కొడిగినహాళ్ళలోని వారి ఖర్చుతో పెన్‌ఫ్రెండ్స్ క్లబ్ నిర్వహిస్తున్నారు. అవకాశం ఉన్నచోటల్లా లయన్స్‌క్లబ్‌వారి సహాయంతో వ్యాసంగాలను చేపట్టి పౌరసత్వం, ట్రాఫిక్ కంట్రోల్, ప్రజాస్వామిక జీవనం మొదలైన వాటి గురించి విద్యార్థులకు శిక్షణ ఇస్తున్నారు. అనుకరణ పార్లమెంటు (mock parliament) సాంస్కృతిక కార్యక్రమాలు, నాటకాలు, బుర్రకథ మొదలైన వాటిని ఏర్పాటు చేస్తారు. వినోదాన్ని, ఉపశమనాన్ని (Recreation & relief) కలిగించే సినిమాలను ప్రదర్శిస్తారు. వినోద కార్యక్రమాలనుఅప్పుడప్పుడు ఏర్పాటుచేస్తారు.

***

# ఇంటర్ విద్యాస్థాయి – ఆంధ్రప్రదేశ్ ఇంటర్మీడియట్ బోర్డు పాత్ర


డా. బి. మాధవరెడ్డి ఎమ్.ఎస్‌సి.,పిహెచ్.డి.
కార్యదర్శి,
ఆంధ్రప్రదేశ్ ఇంటర్మీడియట్ విద్యామండలి.
హైదరాబాదు.


## I. చారిత్రక పూర్వరంగం

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1964వ సంవత్సరంలో విద్యావిషయమై ఒక ముఖ్యమైన విధాన నిర్ణయం తీసికొన్నది. ఈ నిర్ణయం మేరకు ఉన్నత పాఠశాల (Secondary School) విద్యాస్వరూపంలో కొంత మార్పు కలిగింది. అప్పటి వరకు పదకొండు సంవత్సరాల కాలపరిమితి గల ఉన్నత పాఠశాల విద్య పది సంవత్సరాలకు పరిమితమయ్యింది. అప్పుడు అమలులో ఉన్న అత్యున్నత (Higher Secondary School) పాఠశాల విద్య మరియు బహుళార్థసాధక పాఠశాల (Multi purpose School system) విద్యా విధానాల బదులు రెండు సంవత్సరాల ఇంటర్మీడియట్ విద్యావిధానాన్ని ప్రవేశ పెట్టటం జరిగింది. అభివృద్ధి చెందుతున్న దేశాలలో గల పాఠశాలల మరియు కళాశాలల విద్యాప్రమాణాల స్థాయితో సరితూగాలనే ఉద్దేశమే ప్రభుత్వం ఈ నిర్ణయం తీసికోవటానికి కారణమయ్యింది. అనంతరం భారత ప్రభుత్వం నియమించిన కొఠారీ కమీషన్ సైతం ఈ విద్యా విధానాన్నే, అంటే 10+2+3 విద్యావిధానాన్నే సిఫారసు చేసింది. 1969–70 సంవత్సరంలో ఆంధ్రరాష్ట్రం భారతదేశంలో కెల్లా మొట్టమొదటిసారిగా ఈ విద్యావిధానాన్ని అమలులోకి తీసికొని వచ్చింది.

ప్రారంభంలో డిగ్రీ కళాశాలలలోని సంవత్సర కాల పరిమితి గల ప్రీ-యూనివర్సిటీ కోర్సుకు బదులుగాను, అప్పుడు అమలులో ఉన్న అత్యున్నత విద్యాపాఠశాలల మరియు బహుళార్థసాధక పాఠశాలలోను ఈ రెండు సంవత్సరాల ఇంటర్మీడియట్ విద్యావిధానాన్ని ప్రవేశ పెట్టటం జరిగింది.

ఈ ఇంటర్మీడియట్ స్థాయి విద్య అధిక బాగం విద్యార్థులకు తాత్కాలికమైన ఒక మజిలీ వంటిది. ఈ చదువుతోటే చాలా మంది విద్యార్థుల జీవికకు ద్వారాలు తెరుచుకుంటాయి. అంతేకాదు పనిచేయగల స్తోమతను కూడా కలిగిస్తుంది. మరెంతో మంది విద్యార్థులు ఉన్నత విద్యాభ్యాసం కావించటానికి సారథిలా ముందు నిలుస్తుంది. ఆ ఉన్నత విద్య, వృత్తి విద్య అయినా మరి ఏ ప్రత్యేకమైన చదువు అయినా గానీ ఈ స్థాయి విద్య విద్యార్థుల భవిష్యత్తును నందనవనంగా తీర్చిదిద్దుకోటానికి వారధిలా ఉపకరిస్తుంది. ఈ వయసులోనే విద్యార్థులలో రూపు దిద్దుకున్న ఆసక్తి అభిరుచులకు నిలకడఏర్పడుతుంది.

## II. ఇంటర్మీడియట్ విద్యామండలి పుట్టుక

10+2+3 విద్యావిధానాన్ని అమలులోకి తీసుకొచ్చిన 1969–70 సంవత్సరంలోనే తాత్కాలికంగా "ఇంటర్మీడియట్ స్టడీస్ బోర్డు" రాష్ట్రప్రభుత్వ అధ్వర్యంలో ఏర్పాటయ్యింది. ఉస్మానియా విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షుడు ఈ తాత్కాలిక బోర్డుకు మొట్టమొదటిసారిగా సభాపతి (Chairman) గా పనిచేయగలరని ప్రభుత్వం నిర్దేశించింది.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1971 వసంవత్సరంలో 1971 నెం.2 చట్టం ప్రకారం స్వయం పాలక సంస్థగా ఆంధ్రప్రదేశ్ ఇంటర్మీడియట్ విద్యామండలిని స్థాపించింది.

ఈ విద్యామండలిలో సభాపతి (Chairman) ఉపసభాపతి (Vice-Chairman), కార్యదర్శులతో పాటు

పదవిరీత్యా (Ex-officio) వివిధ విభాగాల అధిపతులు సభ్యులుగా ఉంటారు. ఈ సభ్యులతో పాటుగా నిర్దేశించబడిన సభ్యులు (Nominated members) సహ–ఎంపిక (Co-opted members) సభ్యులు కూడా ఈ విద్యా మండలిలో ఉంటారు.

ఆంధ్రప్రదేశ్ విద్యాశాఖా మాత్యులు ఈ విద్యామండలికి సభాపతిగాను,విద్యావిభాగపు ప్రభుత్వ కార్యదర్శి ఉపసభాపతిగాను పని చేస్తారు. ఉన్నత విద్యా సంచాలక కాడర్‌లో ఉండే ఈ విద్యామండలి కార్యదర్శి కార్య నిర్వహణ అధిపతిగా పని చేస్తారు.

పరిపాలన, ఆర్థిక, విద్యా సంబంధిత విషయాలపై విద్యామండలికి సలహాలు ఇచ్చేందుకు సిఫారసులు చేసేందుకు గాను పరిపాలన మరియు ఆర్థిక స్థాయీ సంఘం, విద్యావిషయక స్థాయీ సంఘం అనే రెండు స్థాయీ సంఘాలను ఏర్పాటు చేసింది. విద్యావిభాగపు ప్రభుత్వ కార్యదర్శి విద్యామండలికి ఉపసభాపతిగానే కాకుండా ఈ స్థాయీ సంఘాలకు సభాపతిగా కూడా వ్యవహరిస్తారు.

సబ్జెక్టుల వారీగా పాఠ్యప్రణాళిక, సిలబస్, నిర్ణీత పాఠ్యపుస్తకాలపై విద్యామండలికి తగిన సూచనలను ఇచ్చేందుకు గాను విద్యావిషయక స్థాయీ సంఘం సబ్జెక్టు కమిటీలను ఏర్పాటు కావించింది.

పరీక్షార్థుల అనుచిత ప్రవర్తనా సంఘటనలను పరిశీలించేందుకుగాను "అనుచిత ప్రవర్తనా పరిశీలక సంఘం" మరియు మన రాష్ట్రంలో మొదటి సంవత్సరం ఇంటర్మీడియట్ కోర్సులో ప్రవేశానికి అర్హతగా దేశంలోను విదేశాల్లోను వివిధ విద్యా సంబంధిత బోర్డులు జారీ చేసిన ధ్రువ పత్రాల సమతుల్యతను పరీక్షించేందుకుగాను "విలువ మదింపు సంఘం" అని మరో రెండు సంఘాలు కూడా పని చేస్తున్నాయి. 10+2+3 విద్యావిధానం అమలులోకి రావటంతో +2 నుంచి కూడా తెలుగు మాధ్యమంలో విద్యాబోధన ప్రారంభమయ్యింది.

## III. లక్ష్యాలు మరియు విధులు

రాష్ట్రంలో +2 స్థాయి విద్యా విధానం యొక్క విద్యాప్రమాణాలను కాలానుగుణంగా క్రమబద్ధం చేసి పరిరక్షించటం మరియు పరీక్షలను నిర్వహించటం అనే ఈ రెండూ విద్యామండలికి సంబంధించిన ముఖ్యమైన విధులు.

## IV.+2 స్థాయిలో విద్య పురోగతి

రాష్ట్రంలో 1969–70 సంవత్సరంలో +2 విద్యావిధానాన్ని ప్రవేశపెట్టిన నాటి నుండే ఈ స్థాయి విద్యకొరకు విద్యార్థుల నమోదు సంఖ్య విపరీతంగా పెరిగి పోయింది. ఈ నమోదు సంఖ్య 1969–70 సంవత్సరంలో 30,000 కాగా ప్రస్తుత విద్యా సంవత్సరంలో ఆ సంఖ్య 4.5 లక్షలకు పెరిగింది. రాష్ట్ర వ్యాప్తంగా గత 18 సంవత్సరాలుగా +2 స్థాయి విద్యను అందించే సంస్థలు 150 నుండి 764కు చేరుకున్నాయి.

+2 స్థాయిలో పెరుగుతున్న విద్యావకాశాలకు అనుగుణంగా రాష్ట్రంలో 8 ప్రాంతీయ కార్యాలయాలను స్థాపించి విద్యావిషయక పర్యవేక్షణ మరియు అదుపు వంటి విధులను విద్యామండలి వికేంద్రీకరించింది. హైదరాబాద్, వరంగల్, రాజమండ్రి, విశాఖపట్నం, గుంటూరు, తిరుపతి, కడప మరియు నిజామాబాద్ పట్టణాలలో ఈ ప్రాంతీయ కార్యాలయాలు నెలకొని ఉన్నాయి. ప్రాంతీయ తనిఖీ అధికారులు (R. I.Os) తమ అధికార పరిధిలో గల విద్యాసంస్థలలో నిర్ణీతమైన సిలబస్‌ను సకాలంలో పూర్తి చేయటం, విద్యాప్రమాణాలను పరిరక్షించటం, సమర్థంగా పబ్లిక్ పరీక్షలను నిర్వహించడం వంటి అంశాలను పర్యవేక్షిస్తారు.

వ్యక్తిగత కారణాల వలన కళాశాలలో ప్రవేశం పొందలేని విద్యార్థులకు, కళాశాలలో చేరగల ఆర్థిక స్థోమత లేని విద్యార్థులకు మరియు ఉద్యోగం చేస్తూ +2 స్థాయి విద్యావకాశాన్ని పొందగోరే వారికి ఆంధ్రప్రదేశ్ ఇంటర్మీడియట్ విద్యామండలి ఇంటర్మీడియట్ పబ్లిక్ పరీక్షలకు ప్రైవేట్ అభ్యర్థులుగా హాజరయ్యే సౌకర్యాన్ని కల్పించింది. కేవలం ఆర్ట్సు, హ్యూమానిటీస్ విభాగాలకే గాక సైన్సు సబ్జెక్టులకు సైతం ఈ సౌకర్యాన్ని

విస్తరింపచేయటం జరిగింది. జూనియర్ కళాశాలలు లేని మారుమూల పల్లె ప్రాంతాల్లో నివసించే విద్యార్థులకు ఈ పద్ధతి మహదావకాశమనే చెప్పాలి.

+2 స్థాయి విద్యలో 1979-80 సంవత్సరంలో వృత్తి విద్యాకోర్సులు ప్రవేశ పెట్టబడినాయి. ప్రస్తుతం ఈ విధానంలో విభిన్న రంగాలకు చెందిన 26 రకాల వృత్తి విద్యా కోర్సులు అందుబాటులో ఉన్నాయి. ఈ వృత్తి విద్యా కోర్సుల కోసం రాష్ట్రంలో 174 ప్రభుత్వ ప్రైవేటు డిగ్రీ మరియు జూనియర్ కళాశాలలలో 5,500 సీట్లు కేటాయించబడినాయి. నూతన విద్యా విధానం ప్రకారం 1990 సంవత్సరం నాటికి +2 స్థాయి విద్యావిధానంలో వృత్తి విద్యా కోర్సుల కొరకు విద్యార్థుల నమోదు పదిశాతం వరకు ఉండే విధంగా తగు చర్యలు తీసికోవటం జరుగుతోంది. 1988-89 విద్యాసంవత్సరంనుండి శిశు సంరక్షణ, సాధారణ భీమా, చేపల పెంపకం వంటి పలు అంశాలపై కూడా వృత్తి విద్యా కోర్సులను ప్రవేశ పెట్టేందుకు చురుకుగా సన్నాహాలు సాగుతున్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లో +2 స్థాయి విద్యా విధానంలో వృత్తి విద్యా కోర్సులను ప్రారంభించేందుకు 1987-88 సంవత్సరానికిగాను కేంద్ర ప్రభుత్వ సహాయంగా 563 లక్షల రూపాయలు మన రాష్ట్రానికి లభించింది.

రాష్ట్రంలో జూనియర్ కళాశాలలు లేని మండలాలలో 1988-89 విద్యా సంవత్సరానికి గాను దృశ్య శ్రవణ విద్యా సదుపాయాలు గల సార్వత్రిక ప్రవేశ కళాశాలలను ప్రారంభించాలని విద్యామండలి సంకల్పించింది. ఇందుకుగాను, ఆంధ్రప్రదేశ్ ఇంటర్మీడియట్ విద్యామండలి కేంద్రంలో సకల శాశ్వత సౌకర్యాలతో కూడిన దృశ్య శ్రవణ విద్యావిభాగాన్ని నెలకొల్పటం జరిగింది. మొదటి సంవత్సరం కోర్సుకు పాఠాలు రూపొందించటం దాదాపు పూర్తి కావచ్చింది. పల్లె ప్రాంతాలలోని యువత పట్టణాలకు తరలిపోకుండా వారి వారి ప్రాంతాలలో గల సామాజిక ఆర్థిక పరిస్థితుల పట్ల వారికి చక్కని అవగాహనను కలిగించటమే ఈ సార్వత్రిక ప్రవేశ కళాశాలల ప్రధాన ప్రయోజనం. ఆయా సబ్జెక్టులలో నిష్ణాతులైన ఉపాధ్యాయులు రూపొందించిన దృశ్య శ్రవణ పాఠాల ద్వారా విద్యా బోధన జరగటం వలన ఈ కళాశాలలలో విద్యా ప్రమాణాలు అత్యున్నత స్థాయిలో అలరారుతాయి.

ఆవర్తన గల ఖర్చు ఆవర్తన లేని ఖర్చు (Recurring & non-recurring expenditure) రెండూ కూడా ఈ కళాశాలల్లో సంప్రదాయక కళాశాలలతో పోల్చితే మూడవ వంతు మాత్రమే ఉంటుంది. ఈ విధంగా వ్యయభారం విషయంలో కూడా సార్వత్రిక ప్రవేశ కళాశాలలు ఉపయుక్తంగా భాసిల్లుతాయి.

## V. పరీక్షలు

పరీక్షల నిర్వహణలో జవాబు పత్రాల విలువ మదింపు, ఫలితాల ప్రచురణ వంటి అన్ని అంశాలు కూడా గణనయంత్రం (Computer) ద్వారా సకాలంలో అందించే ఆధునికమైన పద్ధతులు అమలులో ఉన్నాయి. 1988 మార్చి నెలలో జరిగిన పబ్లిక్ పరీక్షల ఫలితాలను కేవలం 33 రోజుల స్వల్ప వ్యవధిలోనే ప్రకటించి విద్యామండలి ఒక నూతన అధ్యాయాన్ని సృష్టించింది.

మన రాష్ట్రంలోనే గాక ఇతర రాష్ట్రాలలోను వృత్తి పరమైన సంస్థల్లో ప్రవేశం పొందగోరే విద్యార్థులకు ఈ సత్వర ఫలితాల ప్రకటన ఎంతగానో ఉపకరిస్తుంది. మొత్తం మీద గత సంవత్సరం ఉత్తీర్ణతా శాతం 32 కాగా ఈ సంవత్సరం ఆశాతం 37కి పెరగటం ఆశాజనకమైన విషయమే.

## VI. భవిష్యత్తులోని అభివృద్ధి ప్రోత్సాహక కార్యకలాపాలు

భవిష్యత్తులో కొద్ది సంవత్సరాల వరకు వృత్తిపరమైన ప్రతిభాపాటవాలను మెరుగు పరచేందుకుగాను జూనియర్ లెక్చరర్లకు వివిధ సబ్జెక్టులలో క్రమబద్ధంగా ఉద్యోగ కాలంలో శిక్షణ నివ్వాలని విద్యా మండలి తలపెట్టింది.

రాష్ట్రంలో +2 స్థాయి విద్యాప్రమాణాల పరిరక్షణ మెరుగు పరచుట వంటి అంశాలను పరిశీలించేందుకు

(monitor) విద్యావిషయక విభాగాన్ని ఏర్పాటు చేసే ఆలోచన విద్యామండలి పరిశీలనలో ఉంది. ప్రశ్నపత్రాలను రూపొందించుట, పాఠ్య ప్రణాళిక సమీక్ష, పాఠ్యపుస్తకాల రచన తదితర అంశాలపై ఈ విభాగం కార్య శిబిరం నిర్వహిస్తుంది.

మండల స్థాయిలో సహకార జూనియర్ కళాశాలలను స్థాపించాలనే ప్రభుత్వ విధాన నిర్ణయానుసారం ఈ కళాశాలలను ప్రారంభించేందుకు ప్రజలు పెట్టుకున్న దరఖాస్తులను విద్యామండలి క్షుణ్ణంగా పరిశీలిస్తోంది.

ప్రభుత్వంకల్పించే విద్యా సౌకర్యాలకుతోడు నీడగా సాంఘిక ప్రేరణయే ఊతంగాస్థాపించబడుతున్న ఈ సహకార జూనియర్ కళాశాలల వలన రాష్ట్రంలో విద్యావ్యాప్తిని మరింత త్వరితంగా సాధించే వీలుంటుంది. ఈ జూనియర్ కళాశాలలకు అనుబంధంగా పారిశ్రామిక శిక్షణా సంస్థలు కూడా పని చేస్తాయి. వృత్తి విద్యా విధానం జవజీవాలతో తొణికిసలాడటానికి ఈ సంస్థలు ఎంతగానో తోడ్పడుతాయి. అంతేగాక చదువు పూర్తి చేసి స్వయం ఉపాధిపథకం క్రింద ఆయా వృత్తులలో ప్రవేశించడానికి గానీ లేదా మరి ఏదైనా ఒక ప్రయోజనకరమైన స్వయం ఉద్యోగపథకాన్ని అమలు పరచుకోవటానికి గానీ విద్యార్థులకు ఈ పారిశ్రామిక శిక్షణా సంస్థలు స్ఫూర్తిని దీప్తిని కలిగిస్తాయి.

## VII. ముగింపు

+2 స్థాయి విద్యావిధానంలో విద్యాప్రమాణాలను పెంపొందించేందుకు గాను గత 18 సంవత్సరాలుగా అనేక చర్యలు తీసికొని నిరంతరం అవిరళ కృషి కొనసాగిస్తూండడం వల్ల ఆంధ్రప్రదేశ్ ఇంటర్మీడియట్ విద్యామండలి పలువురి ప్రశంసలకు పాత్రమైనది.

# ఇంటర్మీడియట్ విద్య, పరీక్షా విధానము - నేడు, రేపు

వి.యస్. రామచంద్రరావు
పరీక్షల నియంత్రణాధికారి
ఆం.ప్ర.ఇంటర్మీడియట్ విద్యామండలి

ఏడాది ముందు చూపుతో విత్తనాన్ని, పదేండ్ల ముందు చూపుతో పండ్లచెట్టును, వంద సంవత్సరాల ముందు చూపుతో విద్యావిధ్యానాన్ని నాటాలి అని మా గురువుగారు మాకు చిన్నప్పుడు చెప్తూ ఉండేవారు.

మనిషి జీవితంలో 15వ సంవత్సరం నుండి ఇరవయ్యో సంవత్సరం వరకు గల కాలం అత్యంత ప్రధానమైనది. ఈ ముఖ్యమైన వయసులోనే విద్యార్థి ఇంటర్మీడియట్ విద్యను అభ్యసిస్తాడు. ఈ దశ మానవ జీవితంలో అతి సున్నితమైనది. బాల్యదశనుంచి యౌవనదశలోకి అడుగుపెట్టే సుకుమారదశ. ఈ ప్రాయంలోనే విద్యార్థియొక్క అభిరుచులు, ఆసక్తిని కలిగించే అంశాలు ఒక ఇతమిత్థమైన రూపాన్ని సంతరించుకొని స్థిరత్వాన్ని పొందుతాయి. ఈ ఆసక్తి అభిరుచులే విద్యార్థికి తన భవిష్యత్ ప్రణాళికా రచనను రూపొందించుకునేందుకు తగిన స్తోమతను కలిగిస్తాయి. ఈ వయసులోనే విద్యార్థికి మొట్టమొదటిసారిగా ఐచ్ఛిక సబ్జెక్టులలోనుంచి తనకు నచ్చిన కోర్సును ఎంపిక చేసుకునే అవకాశం లభిస్తుంది. విద్యార్థికి అతనియొక్క అవసరాలకు, ఆసక్తికి, అభిరుచికి, భవిష్యత్తులో తాను ఊహించుకున్న ఆశయాలకు అనుగుణంగా కోర్సులను ఎంచుకునే స్వేచ్ఛ అతనికి ఉంది.

నిన్నటి నీరస, జడత్వమయమైన ప్రపంచం ఈనాడు లేదు. దేదీప్యమానంగా తేజరిల్లుతూ విశ్వమంతా తానేయై అల్లుకుంటూ వీరవిహారం చేస్తున్న విజ్ఞాన విస్ఫోటనం వలన ఆ నీరస ప్రపంచం చల్లగా తెరమరుగయ్యింది. క్రమంగా అంతరించి పోయింది. సాంకేతిక పరిజ్ఞానం రోజు రోజుకీ నూత్న వినూత్నంగా పరిమళించి పోతోంది. కొత్తపుంతలను తొక్కుతోంది. వివిధ రకాల సాంకేతిక పరిజ్ఞానపూరిత పరికరాలు విపణివీథిలో కదం తొక్కుతున్నాయి. రేడియో, టి.వి.లు ఒకప్పుడు వింత. కానీ ఈనాడు ఎటుచూసినా ఇవి కనిపిస్తున్నవి. తరానికీ తరానికీ మధ్యగల అంతరానికి ప్రతీకగా నిరంతరం నూతన సాంకేతిక పరిజ్ఞానం పరిఢవిల్లుతోంది. మనుషుల ఆలోచనలు కాలంతోపాటు మార్పు చెందుతున్నాయి. వారి భావాలు, అభిరుచులలో క్రమపరిణామం గోచరిస్తుంది. వారి మనోపరిధి వికసిస్తోంది. ముఖ్యంగా భావి భారతపౌరులైన బాలబాలికలలో ఈ అంశాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఆధునిక సాంకేతిక పరికరాలపట్ల వారు ఆకర్షింపబడుతున్నారు. తత్ఫలితంగానే విద్యతో పాటు తదితర అవసరాలకు, వాటి ప్రచారానికి ఈ పరికరాలు ఆవశ్యకమైనాయి. ప్రజాబాహుళ్యంలో విద్యపట్ల చక్కని అవగాహన కలుగజేయటానికి ఇటువంటి విజ్ఞానమయమైన రాకెట్ యుగంలో సామూహిక ప్రసార సాధనాల వినియోగం తప్పనిసరిగా మారింది. ఈ పద్ధతి వలన బోధనలోను, అభ్యాసంలోను, మదింపు వేయటంలోను అనూహ్యమైన మార్పులు సంభవించినాయి.

బోధన మరియు మదింపు వేయుట అనే ఈ రెండు అంశాలు కూడా ఏ విద్యావిధానంలో అయినా పరస్పర సమన్వయం కలిగి ఉండవలసిన విషయాలు. సుమారు 4.5 లక్షల మంది విద్యార్థులకు మార్చినెలలోను, రమారమి 2.5 లక్షలమంది విద్యార్థులకు సప్లిమెంటరీ పద్ధతిలోను పరీక్షలు నిర్వహించటం సామాన్యమైన విషయమేమీకాదు. విషయాలను అత్యంత గోప్యంగాను, విశ్వాసపాత్రంగాను, సరియైన విధంగాను, త్వరితగతిని నడపటానికి అచితూచి

అడుగువేయవలసి ఉంటుంది. సక్రమమైన నిర్ణయాలను తీసుకోవలసి ఉంటుంది. పరీక్షలను నిర్వహించటంలో ఆంధ్రప్రదేశ్ ఇంటర్మీడియట్ విద్యామండలి ఫలప్రదమైన సమర్థమైన సకల చర్యలను తీసుకుంటున్నది.

సమయంలోని ముఖ్యమైన సారం సమయపాలనం అనేది నిర్వివాదాంశం. ఆంధ్రప్రదేశ్ ఇంటర్మీడియట్ విద్యామండలి ఇంటర్మీడియట్ విద్యను అందిస్తున్న కళాశాలల ప్రధాన అధ్యాపకులందరికీ వార్షిక క్యాలెండర్‌ను పంపుతుంది. దాని ప్రకారం విద్యాసంవత్సరాన్ని కచ్చితంగా అమలుపరచే బాధ్యత ఆయా కళాశాలల ప్రధాన అధ్యాపకులపైన ఉంటుంది.

సైన్సు సబ్జెక్టులలో ప్రయోగాలకు సంబంధించిన పరీక్షలు ఫిబ్రవరి నెల చివరివారంలోను వ్రాత పరీక్షలు మార్చి రెండవభాగంలోను ప్రారంభమవుతాయి. మొదటి సంవత్సరాంతాన నిర్వహించే పరీక్షల వలన, విద్యార్థికి పాఠ్యాంశాల బరువు తగ్గి రెండవసంవత్సరం పరీక్షలను సమర్థంగా వ్రాయటానికి అవకాశం కలుగుతుంది. మొదటి సంవత్సరం పరీక్షలవలన విద్యార్థికి తన శక్తిసామర్థ్యాలపైన, సమర్థత పైన కొంత ఆకళింపు కలిగి రెండవ సంవత్సరం పరీక్షలో తదనుగుణంగా సరిదిద్దుకునే వీలుంటుంది.

విద్యార్థులకు ప్రయోజనకరమైన విధంగా + 2 స్థాయిలో సాలీనా పబ్లిక్ పరీక్షలను నిర్వహిస్తున్నది దేశం మొత్తంమీద కేవలం ఆంధ్రప్రదేశ్ ఇంటర్మీడియట్ విద్యామండలి ఒక్కటే. సముచితం గాను, పక్షపాతరహితంగాను పరీక్షలను నిర్వహించటానికి గాను ఒక కళాశాల విద్యార్థులు మరొక కళాశాల కేంద్రంలో పరీక్షలు వ్రాసే విధంగా అన్ని ముఖ్యపట్టణములలో వీలయినంతవరకు చర్యలు తీసుకోవడం జరుగుతున్నది. పరీక్షలు రాసే సమయంలో విద్యార్థుల అనుచిత ప్రవర్తనను అరికట్టటానికి ఈ పద్ధతి ఎంతో ఉపయుక్తంగా ఉందని పలువురు ప్రధాన అధ్యాపకులు తమ హర్షామోదాలను వెలిబుచ్చారు. ఈ చర్యలతోపాటు స్థానిక తనిఖీ దళాలను నియమించటం జరిగింది. ప్రశ్నాపత్రాల ప్యాకెట్లను పోలీసుఠాణాలలో భద్రపరచటానికి తగినచర్యలను తీసుకోబడ్డవి. పరీక్షలు నిర్వహించే ప్రతిరోజూ ముఖ్య అధీక్షకుడు మరియు కార్యాలయ సంబంధిత అధికారి ఇరువురూ పోలీసుఠాణాకు వెళ్ళి పరీక్షా సమయానికి అరగంట ముందుగా ప్రశ్నపత్రాలను పరీక్షా కేంద్రానికి తీసుకువచ్చే ఏర్పాటు ఉన్నది. జవాబు ప్రతులను అదేరోజు పరీక్ష పూర్తి అయిన వెంటనే తక్షణ మదింపు కేంద్రాల (Spot valuation centres) కు తరలించటం జరుగుతుంది. రాష్ట్రవ్యాప్తంగా వివిధ ప్రాంతాలలో 12 తక్షణ మదింపు కేంద్రాలు నెలకొని ఉన్నాయి. కంప్యూటర్ (Computer)ద్వారా కోడ్‌నంబర్లు (Code numbers) నిర్ణయించబడతాయి. ప్రతి జవాబుపత్రం కూడా ఈ విధంగా నిర్ణీతమైన కోడ్‌నంబర్లను కలిగి ఉంటుంది. ఒక అభ్యర్థి అయిదు ప్రశ్నపత్రాలకు జవాబులు వ్రాస్తే ప్రతి జవాబుపత్రానికి వేర్వేరు కోడ్‌నంబర్లను జతపరుస్తారు. అంతేగాక ఈ అయిదు జవాబుపత్రాలను కూడా విభిన్నమైన తక్షణ మదింపు కేంద్రాలకు పంపుతారు. కోడ్‌నంబర్లను జవాబుపత్రాలకు అతికించటంలో ఆంతరంగికత్వాన్ని నిష్కర్షగా పాటించటం జరుగుతోంది. ఈ విధంగా రహస్యంగా జతపరచిన జవాబుపత్రాల సంకేత సంఖ్యలు వెల్లడి అయిన సందర్భం ఒక్కటికూడా లేకపోవటం ఇంటర్మీడియట్ విద్యామండలి సమర్థతకు, ప్రజ్ఞాపాటవాలకు చక్కని నిదర్శనం. ప్రతిరోజు పరీక్షాధికారి రెండు విడతల చొప్పున 30 జవాబుపత్రాలను దిద్దవలసి ఉంటుంది. పరీక్షాధికారులు జవాబుపత్రాలను ముఖ్య పరీక్షాధికారి సమక్షంలో దిద్దుతారు. ఒక్కొక్క పరీక్షాధికారి దిద్దిన జవాబుపత్రాలలో నుంచి పదిశాతం జవాబుపత్రాలను ముఖ్య పరీక్షాధికారి పరిశీలిస్తారు. కోడ్‌నంబర్లను వెల్లడి చేయటం, ఫలితాలను రూపొందించడం, ఫలితాలను ప్రచురించటం, మార్కుల జాబితాలు ఉత్తీర్ణతా ధ్రువపత్రాల ప్రచురణ మొదలైనవన్నీ కూడా కంప్యూటర్ ద్వారానే నిర్వహించబడతాయి. ప్రమాణతను పరిరక్షించే ఉద్దేశ్యంతో ఈ వివరాలన్నిటినీ కూడా ప్రతిదశలోనూ తనిఖీ చేయటం సంభవిస్తుంది. ఈ సంవత్సరం పరీక్షలు జరిగిన కేవలం 32 రోజుల స్వల్ప వ్యవధిలోనే ఫలితాలను ప్రకటించడం జరిగింది. యావద్భారతదేశంలోనే నూతన

అధ్యాయాన్ని సృష్టించిన ఈ సంఘటన ఇంటర్మీడియట్ విద్యామండలికి సంతృప్తినిచ్చింది. వివిధ పరీక్షాధికారుల వలన అభ్యర్థుల మార్కులకు కలిగే మార్పులను సవరించే నిమిత్తం ఇంటర్మీడియట్ విద్యామండలి "ఇన్ బిల్ట్ మోడరేషన్" పద్ధతిని ప్రవేశపెట్టింది. ఈ పద్ధతి ప్రకారం పరీక్షలో అన్ని ప్రశ్నపత్రాలకు సమాధానాలు ఒకే పరీక్షలో వ్రాసిన అభ్యర్థికి సబ్జెక్టులో 30 శాతం మార్కులు వచ్చినా మొత్తం మీద సమష్టిగా 35 శాతం మార్కులు కనుక వచ్చినట్లయితే ఆ అభ్యర్థి ఉత్తీర్ణుల జాబితాలో చేరుతాడు.

అంతేకాదు ఆంధ్రప్రదేశ్ ఇంటర్మీడియట్ విద్యామండలి అభ్యర్థులకు జవాబు పత్రాల స్వయం గుర్తింపు అవకాశాన్ని కలుగజేస్తున్నది. సబ్జెక్టుకు 50 రూపాయల చొప్పున మూల్యం చెల్లించి అభ్యర్థి తన జవాబుపత్రాన్ని చూసుకోవచ్చు. ఈ పద్ధతి వలన, మార్కులు కూడటంలో ఏదైనా పొరబాటుదొర్లినా దాన్ని సరిదిద్దే అవకాశం ఉంటుంది. ఒకవేళ ఒకటి రెండు జవాబులకు పొరబాటున మార్కులు ఇవ్వనట్లయితే వాటికి మార్కులువేసి సవరించిన మార్కుల జాబితాలను అభ్యర్థులకు జారీచేయటం జరుగుతుంది. అంతేగానీ జవాబుపత్రాలను తిరిగి మదింపు వేయటం మాత్రం జరుగదు.

ఇంటర్మీడియట్ విద్యామండలిని వికేంద్రీకరించి ప్రతి మండలానికి కూడా పరీక్షలను నిర్వహించే అధికారాన్ని అప్పజెప్పేందుకు సన్నాహాలు ప్రారంభమైనాయి. విద్యార్థులు వ్రాసిన పరీక్షలకు విభాగాల (Division) వారీగా ఉత్తీర్ణతాస్థాయిని సూచిస్తున్న ప్రస్తుతపద్ధతికంటే శ్రేణి (Grade) పరంగా ఉత్తీర్ణతాస్థాయిని సూచించే ప్రతిపాదన పరిశీలించవలసియున్నది.



# సార్వత్రిక విశ్వవిద్యాలయాల అవసరం

**ఆచార్య వి.యస్.ప్రసాద్**
డైరక్టరు (ఎకడమిక్)
ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం

సార్వత్రిక విశ్వవిద్యాలయాలు సాంకేతిక రంగంలోని అభివృద్ధిని ఉన్నత విద్యావ్యాప్తికి ఉపయోగించుకోవడానికి ఏర్పాటు చేయబడ్డ విద్యాసంస్థలు. వీటి ఏర్పాటును ఉన్నత విద్యారంగంలో ప్రధానమైన మలుపుగా అనేకమంది భావిస్తున్నారు. దూరవిద్యా (Distance Education) భావన ఆధారంగా సార్వత్రిక విశ్వవిద్యాలయాలు ఏర్పాటు చేయబడ్డాయి. ప్రపంచంలోని దాదాపు 30 దేశాలలో – అభివృద్ధిచెందిన బ్రిటన్, రష్యా, కెనడా, ఆస్ట్రేలియా, ఇజ్రాయిల్ వంటి దేశాలతో పాటు అభివృద్ధి చెందుతున్న ఇండియా, పాకిస్తాన్, శ్రీలంక, చైనా వంటి దేశాలలో సార్వత్రిక విశ్వవిద్యాలయాలు ఉన్నాయి. సోషలిస్టు దేశాలలో పెట్టుబడిదారీ దేశాలల్లో సైనిక పరిపాలన ఉన్న దేశాలలో సార్వత్రిక విశ్వ విద్యాలయాలున్నాయి.

దూర విద్యాభావన సాంప్రదాయ విద్యాభావనకు, పద్ధతులకు భిన్నమైంది. ఆచార్య జి.రామిరెడ్డి సాంప్రదాయ విద్యకు ప్రధానంగా నాలుగు లక్షణాలున్నట్లుపేర్కొన్నారు. అవి:

1. విద్యను బోధించుటకు పూర్తికాలపు అధ్యాపకులు
2. విద్య నభ్యసించే పూర్తికాలపు విద్యార్థులు
3. క్లాసురూములో విద్యాబోధన
4. విద్యార్థులకు, అధ్యాపకులకు మధ్య ముఖాముఖి సంబంధాల ద్వారా విద్య.

దీనికిభిన్నంగా దూర విద్యాబోధనలో:

1. విద్యార్థులకు, బోధించేవారికి మధ్య భౌతికమైన దూరం ఉంటుంది.
2. బోధన అనేక మాధ్యమాలలో, అచ్చుపుస్తకాలు, రేడియో పాఠాలు, ఆడియో పాఠాలు, వీడియో పాఠాలు, ముఖాముఖి చర్చలు, సలహా సంప్రదింపులు మొదలైన భిన్న పద్ధతులల్లో ఉంటుంది.
3. ఇంటివద్దనే ఉండిచదువుకోవచ్చు.
4. సౌలభ్యాన్ని ఆసక్తిని బట్టి చదువుకొనే అంశాలను, కాలాన్ని విద్యార్థులే నిర్ణయించుకోవచ్చు.
5. పనిచేసుకొంటూ తీరిక సమయాల్లో ఉన్నత విద్యనభ్యసించవచ్చు.

పైన పేర్కొన్న స్వభావాలు కలిగిన దూర విద్యా భావన అనేక వ్యవస్థా రూపాలలో అనేక దేశాలలో ఆచరింపబడుతుంది. ఈ భావనకు కల్పించిన ఒక వ్యవస్థా రూపమే సార్వత్రిక విశ్వవిద్యాలయం లేక ఓపెన్ యూనివర్సిటీ.

సార్వత్రిక విశ్వవిద్యాలయాలు భారతదేశంలో ఏర్పాటు చేయాల్సిన అవసరం ఎందుకు వచ్చింది అనే ప్రశ్నను స్థూలంగా పరిశీలిద్దాం. ఒక్క మాటలో ఈ ప్రశ్నకు సమాధానం చెప్పాలంటే ఉన్నత విద్యావకాశాలను ఎక్కువ మందికి కల్పించాలనేది ఈ వ్యవస్థ ప్రధాన లక్ష్యం అని చెప్పవచ్చు.

ఒకప్పుడు చదువుకొనే అర్హత, శక్తి కొద్ది మందికి మాత్రమే పరిమితం అనే భావం సమాజంలో బలీయంగా ఉండేది. నేడు సిద్ధాంత రీత్యా ఆ భావాన్ని తిరస్కరించడం జరిగింది. ప్రజాస్వామ్యంలో అందరికీ విద్యావకాశాలుండాలనే భావం ప్రబలంగా ఉంది. భారతదేశంలో నేడు 17–23 సంవత్సరాల మధ్య

వయస్సులో ఉన్నవారిలో ఉన్నత విద్యనభ్యసించే వారు 5 శాతంలోపు ఉన్నట్లు తెలుస్తుంది. ఆర్థిక పరమైన వనరుల పరిమితి వల్ల సాంప్రదాయిక విద్యావిస్తరణ ద్వారా అందరికీ ఉన్నత విద్యావకాశాలు కల్పించడం సాధ్యంకాదు. ఈ పరిస్థితులలో ప్రత్యామ్నాయ పద్ధతుల కొరకు అన్వేషించడం సహజం. ఈ అన్వేషణలో దూరవిద్య ఒక ప్రత్యామ్నాయంగా రూపొందింది. దూరవిద్య ద్వారా, సాంకేతిక రంగంలో ముఖ్యంగా ప్రసార సాధనా పరికరాలలో జరిగిన విప్లవాత్మక అభివృద్ధిని ఉపయోగించుకొని, వివిధ వృత్తులలో ఉన్నవారికి, వారి పనికి ఆటంకం జరగకుండానే ఉన్నత విద్యను అభ్యసించడానికి సార్వత్రిక విశ్వ విద్యాలయాన్ని స్థాపించాలనే కృషి ప్రపంచంలోని వివిధ దేశాలలో జరుగుతుంది.

భారతదేశంలో మొట్టమొదటి సారిగా ఆంధ్రప్రదేశ్‌లో ఆచార్య జి.రామిరెడ్డి సారథ్యంలో "ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయాన్ని" 1982 లో స్థాపించారు. ఆ తరువాత జాతీయస్థాయిలో "ఇందిరాగాంధీ నేషనల్ ఓపెన్ యూనివర్సిటి" (1985) బీహార్‌లో "నలందా ఓపెన్ యూనివర్సిటీ"(1986), రాజస్థాన్‌లో "కోట ఓపెన్ యూనివర్సిటీ" (1987) స్థాపించబడ్డాయి. అనేక ఇతర రాష్ట్రాలలో కూడా సార్వత్రిక విశ్వవిద్యాలయాలు స్థాపించాలనే ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం 1983 – 84వ సంవత్సరం నుంచి బి.ఎ., బి.కాం., బి.యస్సీ కోర్సులను ప్రారంభించింది. ఆ తరవాత సంవత్సరాలలో పబ్లిక్ ఎకౌంటింగ్, పబ్లిక్ రిలేషన్స్‌లో పి.జి. డిప్లమాలను ప్రవేశపెట్టింది. లైబ్రరీ సైన్స్‌లో డిగ్రీ తరగతులను కూడా ప్రవేశ పెట్టింది. సామాజిక శాస్త్రాలు, వ్యాపార శాస్త్రాలలో, CESS వారి సహకారంతో ఎం.ఫిల్ కోర్సులను నడుపుతున్నది. 1983 సంవత్సరంలో 6,300 మంది విద్యార్థులతో ప్రారంభమైన విశ్వవిద్యాలయంలో నేడు దాదాపు 50 వేల మంది విద్యార్థులున్నారు. 1985 లో ఆచార్య ని. నారాయణ రెడ్డి ఈ విశ్వ విద్యాలయానికి ఉపాధ్యక్షుడైనారు. వారి సారథ్యంలో ఈ విశ్వవిద్యాలయంలో రానున్న సంవత్సరాలలో పోస్టు గ్రాడ్యుయేటు కోర్సులను డిప్లమా కోర్సులను ప్రవేశపెట్టాలని ప్రయత్నాలు జరుగుతున్నాయి.

ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయంలో చదువుతున్న విద్యార్థులలో దాదాపు 80 శాతం మంది కనీస అర్హతలు లేని వారికి నిర్వహించే పరీక్షలలో ఉత్తీర్ణులై వచ్చినటువంటి వారు. 30 శాతం మంది మహిళలు ఉన్నారు. ఎక్కువ మంది విద్యార్థులు 35 సంవత్సరాల వయస్సు లోపు వారు. జైలుశిక్ష అనుభవిస్తున్న వారు కూడా విద్యార్థులుగా ఉన్నారు. విద్యార్థులలో ఎక్కువ మంది పట్టణ ప్రాంతాలకు చెందిన వారయినప్పటికి మారుమూల గ్రామీణ ప్రాంతాలలో ఉండి చదువుకుంటున్నవారు కూడా ఉన్నారు. వివిధ వృత్తులకు చెందినవారు ఉన్నారు. ఈ విద్యార్థులందరికి సలహా సంప్రదింపులు, సంసర్గ తరగతులు నిర్వహించడానికి, ఇతర సదుపాయాలు కలుగ చేయడానికి రాష్ట్రంలోని అన్ని జిల్లాల్లో 57 స్టడి సెంటర్లు ఉన్నాయి.

సార్వత్రిక విశ్వవిద్యాలయాలు నేటి ఉన్నత విద్యావసరాలకు ఉపయోగమని భావించే అనేక మందితో పాటు, ఈ కొత్త ప్రయోగంపై తీవ్రమైన విమర్శలు అనుమానాలు వ్యక్తం చేసేవారు కూడా కొందరున్నారు. వ్యతిరేకాభిప్రాయాలలో కొన్నింటిని పేర్కొని, ఆ అభిప్రాయాలు ఎంతవరకు సబబో పరిశీలిద్దాం.

"సార్వత్రిక విశ్వవిద్యాలయాలు దేశంలో నిరుద్యోగాన్ని పెంచడానికి మాత్రమే దోహదం చేస్తాయి".

"సార్వత్రిక విశ్వవిద్యాలయాలు అంతర్జాతీయ ఆధునిక పరికరాల బహుళ జాతీయ సంస్థల ప్రయోజనాలకు మాత్రమే ఉపయోగపడతాయి".

"సార్వత్రిక విశ్వవిద్యాలయం విదేశాల నుంచి (బ్రిటన్) ఎరవుతెచ్చు కొన్న సంస్థ".

"సార్వత్రిక విశ్వవిద్యాలయాల వల్ల పేదవారికి సరి అయిన ఉన్నత విద్యావకాశాలు లేకుండా పోతాయి".

"సార్వత్రిక విశ్వవిద్యాలయం వల్ల ఉన్నత విద్యారంగంలో కొత్తవారికి ఉద్యోగావకాశాలు ఉండవు".

"సార్వత్రిక విశ్వవిద్యాలయాలు విద్యారంగంలోని సమస్యల నుంచి ప్రజల దృష్టిని మళ్ళించడానికి ప్రభుత్వం చేస్తున్న ప్రయత్నంలో భాగం".

"సార్వత్రిక విశ్వవిద్యాలయాలు ఆధునిక ఎలక్ట్రానిక్ పరికరాల పరిశ్రమల ప్రయోజనాల రక్షణకు ఉద్దేశించినవి".

"సార్వత్రిక విశ్వవిద్యాలయం ద్వారా విద్యారంగంపై ప్రభుత్వం అదుపు ఎక్కువ వుతుంది".

పైన పేర్కొన్న అభిప్రాయాలు కొందరు బహిరంగంగ చేస్తున్నవి., మరికొందరు మేధావులు తమ డ్రాయింగు రూముల్లో నిత్యం చేసే గాసిప్‌లో భాగంగా చేస్తున్నవి. ఈ అభిప్రాయాలు వ్యక్తం చేసే వారిని స్థూలంగా 4 రకాలుగా విభజించవచ్చు. మొదటి రకం ఈ వ్యవస్థని గురించిన సరి అయిన సమాచారం లేనందువల్ల వ్యక్తం చేస్తున్న అభిప్రాయాలు, రెండవ రకం ఈ ప్రభుత్వం చేస్తున్న ప్రతి పనిలో కుట్ర ఉందని భావించేవారు, మూడవరకం ప్రతిదాన్ని, తమ వరకు మినహాయింపుతో విమర్శించేవారు, నాలుగవ రకం సమాజ అభివృద్ధిని గురించిన ఒక నిర్దేశిత భావం, లక్ష్యంలో ఈ నూతన ప్రయోగాన్ని పరిశీలించేవారు. మొదటి రకం వారు వ్యక్తం చేసే అభిప్రాయాలను సరి అయిన సమాచారాన్ని అందించడం ద్వారా నివృత్తి చేయవచ్చు. సార్వత్రిక విశ్వవిద్యాలయాలను ఇంగ్లీషులో ఓపెన్ యూనివర్సిటీ అన్నప్పుడు మిగిలినవి క్లోజ్‌డ్ యూనివర్సిటీలా అని, చిన్న భార్య మంచిదంటే పెద్ద భార్య చెడ్డది అని అర్థం సూచించేటట్లుగా అడుగుతుంటారు. అది నిజం కావచ్చు, కాకపోవచ్చు. ఓపెన్ యూనివర్సిటీ అనే పేరు ఆ విద్యావ్యవస్థలో ప్రవేశాల విషయంలో, చదువుకొనే అంశాల విషయంలో కాలపరిమితి మొదలైన అనేక అంశాల విషయంలో ఆదృఢతను సూచించే వ్యక్తీకరణ అని భావించాలి. ఓపెన్ యూనివర్సిటీలో అందరికి డిగ్రీలిస్తారా అని కొంతమంది అడుగుతుంటారు. సరదాకే కావచ్చు కాని దీని వెనక కొంత వ్యంగ్యార్థం కూడా ఉంది. ఆసక్తి, శక్తి, ఉన్న అందరికి డిగ్రీ చదువుకోడానికి అవకాశం ఇచ్చే పద్ధతి ఓపెన్ యూనివర్సిటీ పద్ధతి అని మాత్రమే చెప్పవచ్చు. ఓపెన్ యూనివర్సిటీ అన్నారు కాబట్టి అప్లై చేసిన వారందరికి సీట్లు యివ్వాలి కదా అని భావించేవారు కూడా ఉన్నారు. చాలా కోర్సులలో అప్లై చేసిన వారందరికి సీట్లు ఇస్తున్నప్పటికి అన్నికోర్సుల విషయంలో ముఖ్యంగా సాంకేతిక పరమైన కోర్సుల విషయంలో ఈసూత్రాన్ని పాటించడం వీలు కాదు. ఓపెన్ యూనివర్సిటీ పేరులోని ఓపెన్ అనే పదాన్ని భావరీత్యా అర్థం చేసుకోవడం వల్ల ఉత్పన్నమయ్యే ప్రశ్నలివన్నీ. సార్వత్రిక విశ్వవిద్యాలయాన్ని గురించిన సమాచారాన్ని ఎక్కువ మందికి తెలియ చేయడం ద్వారా ఈ వ్యవస్థను గురించిన సరి అయిన అవగాహన కల్గించి మొదటి రకం అనుమానాలను నివృత్తి చేయవచ్చు.

రెండవ రకం విమర్శకులు, ఈనాడు అధికారంలో ఉండి ప్రభుత్వంపై నిర్దిష్టమైన వ్యతిరేకాభిప్రాయాలు కలిగి ఉన్నవారు. వారి దృష్టిలో ఈ ప్రభుత్వాలకు ప్రజాసంక్షేమం కోసం కృషి చేసే స్వభావం లేదు కాబట్టి, వారు చేసే పనులన్ని ఏదో రకంగా స్వలాభం కోసమే ఉంటాయని భావిస్తుంటారు. వాదన కోసం నేటి ప్రభుత్వాల స్వభావాన్ని గురించి వాళ్ళ అభిప్రాయాన్ని అంగీకరించినా మంచివాళ్ళు కూడా చెడ్డ పనులు అప్పుడప్పుడు చేస్తుంటారని, అదే విధంగా చెడ్డవాళ్ళు కూడ అప్పుడప్పుడు మంచిపనులు చేస్తుంటారని సామాన్య సత్యాన్ని విస్మరించకూడదు.

మూడవ రకం విమర్శకులు వీరందరికంటె ప్రమాదకారులు. వీరిలో ఎక్కువ మంది "సాంప్రదాయిక విశ్వవిద్యాలయాల్లోని "మేధావులు" కావడం గమనార్హం. "దేశంలోని నిరుద్యోగులింత మంది ఉండగా ఇంకొక విశ్వవిద్యాలయం ఎందుకు", "బి.ఎ., బి.కాం., ఎం.ఎ, ఎం.కాం, చదివిన వాళ్ళకూ ఉద్యోగాలు లేనప్పుడు మళ్ళా ఆ కోర్సులు మీ యూనివర్సిటీలో ఎందుకు పెడతారు". "ఉన్నత విద్యవల్ల సమాజానికి ఏమి ఉపయోగం ఉంది" లాంటి సమాజ శ్రేయస్సును కాంక్షించే ఫోజు పెడుతుంటారు. ఈ విమర్శలో కొంతవరకు సత్యం లేకపోలేదు.

వ్యవస్థలో పూర్తి మార్పులు వచ్చినపుడు మాత్రమే ఈ విమర్శకు సమాధానం దొరుకుతుంది. కాని ఇక్కడ ఈ విమర్శలు చేస్తున్న కొందరి ద్వంద్వ స్వభావాన్ని గుర్తించాలి. ఉద్యోగావకాశాలు, విశ్వవిద్యాలయాల, కళాశాలల స్థాపనకు గీటు రాయిగా తీసుకొంటే ఎన్నో విశ్వవిద్యాలయాలను, సాంకేతిక కళాశాలలను కూడా మూసెయ్యాల్సి ఉంటుంది. కొద్ది రోజుల క్రితం నేను ఒక ఇంజనీర్ల సమావేశంలో సార్వత్రిక విశ్వవిద్యాలయాన్ని గురించి మాట్లాడటం జరిగింది. ఆ సమావేశంలో ఒక ప్రసిద్ధ ఇంజనీరు, ఉద్యోగావకాశాలు లేనప్పుడు బి.ఎ.లు ఎమ్.ఎలు ఎందుకు బోధిస్తునారండి అని అడిగాడు. కొన్ని వేల మంది ఇంజనీర్లు నిరుద్యోగులుగా ఉన్నారు కదాండి, ఇంజనీరింగు కళాశాలలు మూసివెయ్యమని మీరెందుకడగడం లేదని అడిగితే అది వేరండి అన్నాడు. నేను కూడా ఇది వేరండి అని చెప్పాను. తమ పదవులు, ఉద్యోగాలకు అవసరమయినంత వరకు ఏ కోర్సులయినా ఫర్వాలేదు కాని, ఇతర విషయాలలో సమాజ అవసరాలు, సిద్ధాంతాలను గూర్చి మాట్లాడే వారు మనకు చాలా మంది తారసపడతారు. మామూలుగానయితే ఇటువంటి వారి అభిప్రాయాలను పెద్దగా పట్టించుకోనవసరం లేదు కాని, సమాజంలో వారికున్న స్థానాన్ని బట్టి, ప్రభావాన్ని కలుగజేసే శక్తిని బట్టి వారి అభిప్రాయాల్లోని ద్వంద్వత్వాన్ని బహిర్గతం చేయాల్సిన అవసరం ఉంది.

నాలుగవ రకం విమర్శకులు ఈ వ్యవస్థను గురించి ఒక నిర్దిష్ట భావజాలంతో, లక్ష్యంతో పరిశీలిస్తూ మార్పును కోరుతున్నవారు. వారు ఊహించే, నిర్మించాలనుకునే సమాజంలో విద్యావ్యవస్థ స్వభావం వేరుగా ఉండవచ్చు. వారు కోరుకునే సమాజ భావం దృష్టితో చూసినట్లయితే సార్వత్రిక విశ్వవిద్యాలయాల పాత్రను గురించిన వారి విమర్శలో నిజం ఉండవచ్చు. కాని సార్వత్రిక విశ్వవిద్యాలయాలు ఈ వ్యవస్థ మౌలిక స్వభావాలను మార్చే లక్ష్యాలతో ఏర్పాటయినవి కావు. నేడున్న వ్యవస్థ పరిధిలో మారుతున్న అవసరాలకు, పరిస్థితులకు అనుగుణంగా ఏర్పాటు చేయబడ్డ సంస్థలు ఉన్న వ్యవస్థ పరిధిలో అవసరాలకనుగుణంగా ఏర్పడ్డ వ్యవస్థను, వాటి పరిధినుంచి, భిన్నమైన ప్రమాణాలతో పరిశీలించడం సమంజసం కాదు.

సార్వత్రిక విద్యపై వస్తున్న విమర్శలన్నింటిని కొట్టివేయడం కాని, విమర్శకులందరిని శంకించడం కాని ఈ వ్యాసకర్త ఉద్దేశం కాదు. సార్వత్రిక విశ్వవిద్యాలయంలో పనిచేస్తున్నంత మాత్రాన మేము చేసేదంతా విమర్శనాతీతమని, లోపాతీతమని ఈ వ్యాసకర్త భావించడం లేదు. ఈ కొత్త ప్రయోగంలో అనేక పరిమితులున్నాయి. వాటిలో కొన్ని సామాజిక వ్యవస్థకు సంబంధించినవి, మరికొన్ని విశ్వవిద్యాలయ వ్యవస్థకున్న అంతర్గత పరిమితులు. సాంకేతిక పరికరాలు సమాజంలో అందరికి అందుబాటులోలేనపుడు, వాటిని ఉపయోగించుకొని ఉన్నత విద్యను అందరికి అందించాలనుకోవడం కష్టమైన పనే. సాంకేతిక పరికరాలను మన దేశంలో అభివృద్ధి చేసుకోనంత వరకు మన అవసరాలకు అనుగుణంగా వాటిని రూపొందించుకోనంతవరకు విదేశాలపై ఆధారపడటం తప్పదు. ప్రసారసాధనాలు పూర్తిగా ప్రభుత్వ అధీనంలో ఉన్నప్పుడు, వాటిని విద్యారంగంలో ఉపయోగించుకోవడంలో అనేక ఇబ్బందులున్నాయి. ఈ పరిస్థితుల నుంచి బయటుపడడానికి తీవ్రమైన కృషి చేయాల్సి ఉంటుంది. ఉన్నత విద్య అందరికి అందడం అనేది, దానికోసం వ్యవస్థలను ఏర్పాటు చేయడం పైననే కాకుండా, ఆ వ్యవస్థలను ఉపయోగించుకొనే శక్తి ప్రజలకు ఉండటం పైన కూడ ఆధారపడి ఉంటుంది. సామాజికంగా మౌఖిక సాంప్రదాయానికి అలవాటు పడ్డ మనందరికి, యంత్రపరికరాల ద్వారా, విషయాన్ని అవగాహన చేసుకోవడం అంత సులభం కాదు. నూతన ప్రయోగానికి అవసరమైన నైపుణ్యం కలిగిన మానవ వనరులు కూడా మనకు తగినంతగా లేవు. ఈ వ్యవస్థలో మనం ఏమీ చేయలేము అనే నిరాశా భావం అలుముకున్న వాతావరణంలో కూడా నూతన ప్రయోగాలు ఫలితాలను సాధించలేవు. విద్యావ్యవస్థ లక్ష్యాలకు సంబంధించిన స్పష్టత లోపించినపుడు కూడా నూతన ప్రయోగాలు
(మిగతా 144 వ పేజీలో)

షి. సత్యనారాయణ
ప్రాంతీయ సంచాలకులు
ఇందిరాగాంధి జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయం,
ప్రాంతీయకేంద్రం,
హైదరాబాదు.

# దూర విద్య : సార్వత్రిక విశ్వవిద్యాలయాలు

ఈనాడు కొద్దోగొప్పో ఆచరణలో ఉన్న "దూరవిద్య"కి ఎంతో చరిత్ర లేదు. "దగ్గర విద్యా" వేత్తలు దూరవిద్యను విద్యే కాదంటున్నారు ఇంకా. విద్యాభ్యాసానికి వీరి దృష్టిలో అధ్యాపకుడు ఉండాలి. అతడు పూర్తి కాలిక ఉద్యోగి అయి ఉండాలి. అతడు నాలుగు గోడల మధ్య తరగతిలో బోధించాలి. దాన్ని విద్యార్థి అర్థం చేసుకోవాలి, అభ్యసించాలి. విద్యాసంస్థలు నిర్ణయించే వేళలో, రీతుల్లో, పద్ధతుల్లో మాత్రమే బోధన అధ్యాపన జరగాలి. ఇలా జరక్కపోతే విద్యను చెప్పటం, నేర్చుకోవటం అసాధ్యమని, సాంప్రదాయికుల నమ్మకం. ఆధునిక సాంకేతిక విజ్ఞానాభివృద్ధి ఫలితంగా ఈ నమ్మకం క్రమంగా పటాపంచలవుతుంది. సమాచార ప్రసార సాంకేతిక విజ్ఞానం విద్యా బోధనాన్ని, అధ్యాపనాన్ని కఠిన నియమ నిబంధనల సంకెళ్ళ నుండి విముక్తి చేసి దూర స్థలాలన్నిటికీ, కోరిన వాళ్ళందరికీ విద్యను అందచేయడం సాధ్యమని నిరూపిస్తుంది. వెక్కు వర్ధమాన దేశాలు తమ సమాజాలను విద్యావంతం చేయడానికి ఆధునిక సమాచార ప్రసార సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించుకుంటున్నాయి. వార్తా సాంకేతిక విజ్ఞానం లేనప్పుడు, పెరగనపుడు దగ్గరి విద్య ఒక్కటే మార్గంగా ఉండేది. నేడు మార్గాలు బహుళం, బహుముఖం. దగ్గరి విద్యతో పాటు దూరవిద్య విద్యావిస్తృతికి దోహదకారయింది.

## దూరవిద్య, దూరబోధన, దూర అధ్యాపన

దూరవిద్య బహుముఖ బోధన, అధ్యాపన పద్ధతుల సమ్మిళితం. దూరవిద్య, దూరబోధన, దూరఅధ్యాపన, దూర అభ్యసనం పర్యాయ పదాలుగా వాడుకలోకి వచ్చాయి. బోధన దృష్ట్యా దూర బోధన, అధ్యాపన దృష్ట్యా దూర అధ్యాపన, రెండూ ఏకమైతే దూరవిద్య.

దూరవిద్య మాటలోని దూరం అధ్యాపకునికి అధ్యాయికి మధ్య ఉండే భౌగోళిక దూరాన్ని సూచిస్తుంది. దూరంలో ఉండే ఇద్దరిని ఏదో ఒక మాధ్యం కలుపుతుంది. అది అచ్చయిన పాఠం కావచ్చు, రేడియో కావచ్చు. టెలివిజన్ కావచ్చు, కంప్యూటర్ కావచ్చు, మరేదైనా ఇతర సమాచార సాధనం కావచ్చు. ఏదో ఒక మాధ్యమంలో అధ్యాపకుడు అధ్యాయి కలిసి ఉండటం దూరవిద్యా విధానానికి, మూలం. దీన్ని ఇంగ్లీషులో "టూ వే కమ్యూనికేషన్" అంటారు. ద్విముఖ సమాచార ప్రసారానికి వీలులేని ఏ విద్యా కార్యక్రమం దూరవిద్య కార్యక్రమం కాజాలదు. ఈ కారణంగానే "మీరంతట మీరు చదువుకోండి", "మీరంతట మీరు నేర్చుకోండి" అనే పుస్తకాలు దూర విద్యా సామాగ్రి కాదు. ఎందుకంటే "చదువుకోవడం" లో "నేర్చుకోవడం" లో ఈ పుస్తకాలు అధ్యాపకుడికి అధ్యాయికి మధ్య సమాచార ప్రసారానికి మాధ్యమాలు కావు. అధ్యాయి చదువుకొన్నదీ నేర్చుకొన్నదీ, అధ్యాపకుడు గాని అధ్యాపకుడున్న సంస్థ గానీ తెలుసుకోవడానికి ఆ పుస్తకాలు ఉపయోగ పడగలిగితే అపుడవి దూరవిద్యా విషయక సామాగ్రి అవుతాయి. అధ్యాయికి తాను ఎంత నేర్చుకొంది, ఎలా నేర్చుకొంది తెలియాలి. అధ్యాపకునికి తెలిసింది మళ్ళీ అధ్యాయికి తెలియాలి. ఇలా దూరవిద్యా పద్ధతిలో ఇద్దరి మధ్య ప్రసారం ఏదోరకంగా, ఏదో మాధ్యమంలో జరగటం దూర విద్యా విధాన లక్షణం.

## దూరవిద్య స్వరూపం, రకాలు

ఇప్పుడిపుడే ప్రపంచ వ్యాప్తమవుతున్న దూరవిద్య పలురకాల పేర్లతో పిలువబడుతుంది.

ఉదాహరణకి:
*కరస్పాండెన్స్‌స్టడీ
*హోమ్‌స్టడీ
*ఇండిపెండెంట్‌స్టడీ
*ఎక్స్టర్నల్‌స్టడీ
*అవుట్‌రీచ్
*ఎక్స్ట్రామ్యూరల్‌స్టడీస్ సిస్టమ్
*ఆఫ్‌క్యాంపస్‌ప్రోగ్రాం
*ఓపెన్‌లెర్నింగ్
*ఓపెన్‌ఎడ్యుకేషన్
*టెలిఎన్‌సెజ్నిజమెంట్
*ఫెర్న్‌స్టేడియం
*ఎడ్యుకేషన్‌ఎడిస్టన్స్‌యా
*టెలిడ్యూకాకో

ఒక్కొక్క ప్రాంతంలో ఒక్కొక్క పేరు ప్రసిద్ధి. ఆస్ట్రేలియాలో ఎక్స్టర్నల్ సిస్టమ్ అని, అమెరికాలో హోంస్టడీ, ఇండిపెండెంట్ స్టడీ అని, జర్మనీలో ఫెర్నె స్టడియం అని, ఇండియాలో కరస్పాండెన్స్ కోర్సులు అని వాడుక.

చెక్కు దేశాల్లో ఇటీవల వరకు దూరవిద్య కరస్పాండెన్స్ విద్య పేరున పిలవబడేది. 1982లో జరిగిన ఇంటర్నేషనల్ కౌన్సిల్ ఆఫ్ కరస్పాండెన్స్ ఎడ్యుకేషన్ (ఇ.సి.సి.ఇ) మహాసభలలో కౌన్సిల్ పేరును ఇంటర్నేషనల్ కౌన్సిల్ ఆఫ్ డిస్టెన్స్ ఎడ్యుకేషన్ (ఐ.సి.డి.ఇ", గామార్చటం జరిగింది. అప్పటినుంచి కరస్పాండెన్స్ తదితర పేర స్థానే డిస్టెన్స్ (దూర, అనే మాటను ఉపయోగించాలనే అభిలాష ఎక్కువయింది.

కరస్పాండెన్స్ అనే మాటలో అసందర్భం, అసంగతం ఏమిటి? కాలదోషం పట్టిందని ఎందుకు భావించారు.? కరస్పాండెన్స్ అనే మాట అచ్చయిన పాఠాలనే స్ఫురిస్తుంది గాని మరే ఇతర సమాచార ప్రసార సాంకేతిక విజ్ఞాన రూపాన్ని సూచించిందని, టెలిఫోన్, రేడియో, టెలివిజన్, ఆడియో క్యాసెట్, వీడియో టేప్ లాంటి ఆధునిక ప్రసార సాధనాలను మాధ్యమాలను సూచించటానికి "దూర" అనే మాట సరయిందని భావించటంతో పేరు మార్పు జరిగింది. మాధ్యమం ఏదైనా కరస్పాండెన్స్ జరిగేది దూరం నుంచే కాబట్టి "దూర@ అనే మాట ఉచితమని, భావించడం జరిగింది. ఈ ప్రభావానికి లోనై ఇండియాలోని కొన్ని విశ్వవిద్యాలయాల కరస్పాండెన్స్ కోర్సుల ఇన్‌స్టిట్యూట్స్ తమ పేర్లను డైరక్టరేట్స్ ఆఫ్ డిస్టెన్స్ ఎడ్యుకేషన్ అని మార్చుకుంటున్నాయి.

## దూరవిద్య చరిత్ర

దూరవిద్య తొలిదినాలు ఎప్పుడు? ఎక్కడ? ఎలా? వీటికి సమాధానాలు సరిగ్గా చెప్పుకోవటం కష్టం. కారణం స్పష్టమయిన, నిర్దుష్టమయిన ఆధారాలు లేకపోవటం, పరిశోధనలు జరగక పోవటం. అయితే దూరవిద్యావేత్తలు, పాలకులు, పరిశోధకులు, ప్రసార వ్యవస్థ, పరిశీలకులు, సాంకేతిక నిపుణులు భావించేది దూరవిద్య అవ్యవస్థీకృత రూపంలో 18 వశతాబ్దం తొలి దశాబ్దాల్లో మొదలయిందని.

1728 మార్చి 20న "ది బోస్టన్ గజెట్" లో ఫిలిప్స్ కొత్త తరహా షార్ట్‌హాండ్ పద్ధతిని నేర్పుతానని చేసిన ప్రకటనను దూరవిద్యకు తొలి తార్కాణంగా పేర్కొనవచ్చని దూరవిద్యా విధానం మీద విశేష కృషి చేస్తున్న బోర్జిహోంబర్గ్ అభిప్రాయం. దూరవిద్య ప్రారంభం మీద ఇంకా కృషి జరిగితే గాని స్పష్టమైన, విశ్వసనీయమైన ఆధారాలు దొరకవు. దూరవిద్యా విధానం అభివృద్ధికి కృషిచేసిన కొందరి పేర్లు, కొన్నిసంస్థల పేర్లు ఇవి.

*కేలిట్‌ఫిలిప్స్
*లుండ్స్‌వెకోబార్డ్
*ఐసాక్‌పెట్‌మన్
*అన్నాఇలియట్‌టికోన్నర్

* లండన్ యూనివర్సిటీ
* స్కెర్రీస్ కాలేజ్ ఆఫ్ ఎడ్యుకేషన్
* వౌక్స్ లించ్ కరస్పాండెన్స్ కాలేజ్
* ఆక్స్‌ఫర్డ్ డిప్లొమా కరస్పాండెన్స్ కాలేజ్
* ఇలినాయిస్ వెసియన్ కాలేజ్
* ఇటాకా కరస్పాండెన్స్ యూనివర్సిటీ
* చికాగో యూనివర్సిటీ ఎక్స్‌టెన్షన్ డిపార్ట్‌మెంట్
* స్వీడన్‌లో హెర్మాడ్స్
* ఆస్ట్రేలియాలో క్విన్స్‌లాండ్ యూనివర్సిటీ
* రష్యాలో సెంట్రల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ కరస్పాండెన్స్ ఎడ్యుకేషన్
* ఫ్రాన్స్‌లో గవర్న్‌మెంట్ కరస్పాండెన్స్ కాలేజ్

20 వ శతాబ్దం ఆరంభం నాటికి బాల్యావస్థలో ఉన్న దూరవిద్య క్రమేపీ బలం పుంజుకొని 1969 బ్రిటిష్ యూనివర్సిటీ స్థాపనతో ఒక విశిష్ట ప్రతిపత్తిని, గౌరవాన్ని పొందింది.

## దూరవిద్య నిర్వచనం

దూరవిద్య వేగంగా విస్తృతమవుతున్నా దానికొక నిశ్చిత స్వరూపం, నిర్వచనం లేదని పెక్కురి భావన. వివిధ, విభిన్న బోధన అధ్యాపన వ్యూహాలు, పద్ధతులు, ప్రక్రియలు, ఆచరణలు కలసిన దూరవిద్యా విధానానికి స్పష్టమైన స్వరూపం లేకపోవటంలోని ప్రత్యేకతను గుర్తించాలి. అభివృద్ధి చెందుతున్న ఏ వ్యూహాన్నైనా ఏ పద్ధతికైనా రూపంలో స్పష్టత రావటానికి చాలా కాలం పడుతుంది. ఇప్పుడిప్పుడే ఒక శాస్త్రంగా, ఒక విజ్ఞానంగా, ఒక అధ్యయన పరిజ్ఞానంగా, అభివృద్ధి చెందుతున్నది దూరవిద్య. మరికొంత కాలానికి స్పష్టమైన రూపం, లక్షణం ఏర్పడతాయి. స్పష్టతకు విశేషమైన అనుభవం, అనువర్తిత్వం, అధ్యయనం అవసరం. సంక్లిష్టత నుండి స్పష్టతకు ప్రయాణం చిన్నగా జరుగుతుంది.

ఇప్పటికున్న అనుభవం ద్వారా, జరిగిన అధ్యయనం ద్వారా దూరవిద్య అంటే ఏమిటో స్థూలంగా చెప్పగలం. చార్లెస్ వెడిమేయర్, మైఖేల్ మూర్, ఆటో పిటర్స్, బోర్జి హోంబర్గ్, జాన్ బాక్, రిక్‌డల్, ఎర్డోస్, హిలరీ పెరటన్, చైల్డ్, బెల్లింగ్, డెస్మండ్ కీగన్ మొదలైన దూరవిద్యావేత్తల కృషి ఫలితంగా ఇది సాధ్యం. వీరందరు దూర విద్యను వేరువేరుగా వర్ణించారు, నిర్వచించారు. విభిన్న వర్ణనలను, నిర్వచనాలను ఏకీకరణ చేయటానికి డెస్మండ్ కీగన్ కృషి చేశాడు. కీగన్ నిర్వచనంలో దూరవిద్య లక్షణాలు ఏమిటో స్పష్టంగా చెప్పాడు. కీగన్ చెప్పిన దూరవిద్య లక్షణాలు:

1. అధ్యాపకుడు, అధ్యాయి ఒకరి కొకరు దూరంగా ఉండటం.
2. అధ్యాపనపై దూరవిద్యాసంస్థ ప్రభావం.
3. అధ్యాపకుని అధ్యయనం బోధనాపరంగా, అధ్యాపన పరంగా కలిపే సాంకేతిక ప్రసార మాధ్యమం .
4. అధ్యాపకునికి, అధ్యాయికి మధ్య ద్విముఖ సమాచార ప్రసార, అవకాశం.
5. విద్యార్జనకు సామాజికీకరణకు ఉపయోగపడే సందర్భాను సార విద్యార్థి, ఉపాధ్యాయ సమావేశాలు.
6. పారిశ్రామిక లక్షణం.
7. వైయక్తిక అధ్యయనం.
8. సామూహిక అధ్యయన రహితం.

కీగన్ చెప్పిన పై లక్షణాల దృష్ట్యా దూర విద్య స్వరూపాన్ని, స్వభావాన్ని తేలికగా తెలుసుకోగలం. పైగా దానికి నియత విద్యకు గల తేడాలను గూడా తెలుసుకోగలం.

## దూరవిద్య స్థాయిలు

దూరవిద్య అన్ని స్థాయిల్లో, ప్రాథమిక, మాధ్యమిక, ఉన్నత స్థాయిలు-లభ్యమవుతుంది. ప్రాథమిక స్థాయిలో అంతగా అమలులో లేదు. ఎందుకంటే చిన్న పిల్లల వెంట అధ్యాపకులు ఎప్పుడూ ఉంటూ వారికి విద్యాభ్యాసంలో నిరంతరం సాయపడాలి. ప్రాథమిక స్థాయిని విద్యను వయోజనులకు ప్రాథమిక విద్యను బోధిస్తున్నాయి. మాధ్యమిక స్థాయిలో దూరబోధన బాగా అమలులో ఉంది.

కొరియాలో, ఆస్ట్రేలియాలో రేడియో
శాలలు, మెక్సికోలో టెలిపాఠశాలలు,
ఇంగ్లాండ్‌లో నేషనల్ ఎక్స్‌టెన్షన్ కాలేజ్,
దూరబోధనా పద్ధతిలో మాధ్యమిక స్థాయి విద్యను
ఎంతో మందికి అందిస్తున్నాయి. ఉన్నత స్థాయిలో
దూర విద్యాబోధన భారీ ఎత్తున ఉపయోగ పడ్తుంది.

## ఓపెన్ యూనివర్సిటీ

1969లో బ్రిటన్‌లో స్థాపితమైన స్వతంత్ర్య ఓపెన్ యూనివర్సిటీ ప్రభావం ప్రపంచ మంతటిపైనా పడటంతో పెక్కు దేశాల్లో, ముఖ్యంగా తృతీయ ప్రపంచ దేశాల్లో ఉన్నత స్థాయి విద్యావ్యాప్తికి ఓపెన్ యూనివర్సిటీలు పెక్కు ఏర్పాటయ్యాయి. వీటిల్లో ముఖ్యమైనవి:

1. ఓపెన్‌యూనివర్సిటీ,బ్రిటన్;
2. అల్లామా ఇక్బాల్ ఓపెన్ యూనివర్సిటీ, పాకిస్తాన్;
3. ఓపెన్‌యూనివర్సిటీ,శ్రీలంక;
4. సుఖతాయ్ తమ్మతిరాత్ ఓపెన్ యూనివర్సిటీ, తాయ్‌లాండ్;
5. సెంట్రల్ రేడియో అండ్ టెలివిజన్ యూనివర్సిటీ,చైనా;
6. యూనివర్సిటీ ఆఫ్‌ఎయిర్, జపాన్;
7. కొరియా ఎయిర్ అండ్ కరస్పాండెన్స్ యూనివర్సిటీ,కొరియా;
8. క్యొగ్గి ఓపెన్‌యూనివర్సిటీ,కొరియా;
9. ఓపెన్‌యూనివర్సిటెట్,నెదర్‌లాండ్స్;
10. యూనివర్సిటాస్‌టెర్బుకా,ఇండోనేషియా;
11. యూనివర్సిడాడ్ నేషనల్ డి ఎడ్యుకేషన్ ఎ డిస్టన్సియా,స్పెయిన్;
12. యూనివర్సిడాడ్‌నేషనల్‌అబియర్టా,వెనుజులా;
13. యూనివర్సిడాడ్ ఇస్టాటిల్ ఎడిస్టన్సియా, కొస్టారికా;
14. నేషనల్‌ఓపెన్‌యూనివర్సిటీ,నైజీరియా;
15. అటబాస్కా-యూనివర్సిటీ,కెనడా;
16. ఎవ్వరిమాన్స్‌యూనివర్సిటీ,ఇజ్రాయెల్;
17. ఫెర్న్‌యూనివర్సిటీ,పశ్చిమజర్మనీ;
18. ఫ్రీయ నివర్సిటీ,ఇరాన్;
19. అల్‌కుద్స్‌ఓపెన్‌యూనివర్సిటీ,జోర్డాన్;
20. ఆంధ్రప్రదేశ్‌ఓపెన్‌యునివర్సిటీ,ఇండియా;
21. ఇందిరాగాంధి నేషనల్ ఓపెన్ యూనివర్సిటీ, ఇండియా;
22. కోట ఓపెన్‌యూనివర్సిటీ,ఇండియా;
23. నలంద ఓపెన్‌యూనివర్సిటీ,ఇండియా;

పై ఓపెన్ యూనివర్సిటీ లన్నీ చట్టబద్ధత, స్వతంత్ర ప్రతిపత్తి, స్వయం నిర్ణయాధికారంగల దూర ఉన్నత విద్యాబోధన సంస్థలు. ఇవన్నీ పూర్తి ప్రభుత్వ ధన సహాయంతో నడిచేవి. విస్తృత ప్రజా ప్రయోజనాల కోసం ఏర్పాటైన సంస్థలు. ప్రభుత్వమే దూర విద్యాబోధన యూనివర్సిటీలను స్థాపించటంతో, దూరవిద్యకు గౌరవ ప్రతిష్టలు, ఇంతకు పూర్వం లేనంతగా కలిగాయి. గతంలో కొన్ని దూర బోధన సంస్థలు వ్యాపార దృష్టితో నడవడం వల్ల దూరవిద్యకు కొంత అప్రతిష్ట ఏర్పడింది. ప్రభుత్వ స్థాపిత యూనివర్సిటీలతో అప్రతిష్ట పోయి ప్రతిష్ట పెంపొందడం మొదలయ్యింది.

## దూరవిశ్వవిద్యాలయాల ఏర్పాటు లక్ష్యాలు

బోర్జ్‌వోంబర్గ్ దూరవిశ్వ విద్యాలయాలు ఎందుకు ఏర్పడ వలసి వచ్చిందో స్పష్టంగా పేర్కొన్నాడు. స్థాపనకు దారి తీసిన ముఖ్యమైన కారణాలు.

1. విశ్వవిద్యాలయ స్థాయి విద్యను విస్తరించాల్సిన అవసరం;
2. ఉద్యోగాలు, కుటుంబ బాధ్యతలు, సామాజిక బంధాలు కలిగిన ఎక్కువ మంది వయోజనులు పార్ట్‌టైం పద్ధతిన విశ్వవిద్యాలయస్థాయి విద్యను పొందాలని కోర్కె కలిగి ఉండటం.
3. వయోజనులకు ముఖ్యంగా వారిలో బడుగు వర్గాల వారికి ఉన్నత విద్యావకాశాలు కల్గించి వారిని విద్యా పరంగా అభివృద్ధి పరచాలనే ఆకాంక్ష.
3. వయోజనులకు ముఖ్యంగా వారిలో బడుగువర్గాల వారికి ఉన్నత విద్యావకాశాలు కల్గించి వారిని విద్యా

పరంగా అభివృద్ధి పరచాలనే ఆకాంక్ష.

4. వివిధ వృత్తుల్లో పని చేస్తున్న వారి పరిజ్ఞాన స్థాయిని పెంచవలసిన అవసరం.
5. విద్యాబోధనలో అధ్యాపనలో కొత్తకొత్త ఆలోచనలకు, పరికల్పనలకూ, ప్రయోగాలకు ప్రాధాన్యత కలగడం.
6. విద్యావిస్తరణకు సాంప్రదాయిక ముఖాముఖి పద్ధతి కంటే పొదుపైన ఇతర పద్ధతులు ఉన్నవనే భావన.

## ఓపెన్ యూనివర్సిటీ విద్యార్థులు

దూరవిద్యాబోధన జరిగిన తొలిదశల్లో చాలా మంది దానికి ఇష్టపడే వారు కాదు. పేదవారు, మేధాశక్తి లేని వారు, ప్రతిభా వ్యుత్పత్తులు లోపించిన వారు, మారు మూలాల్లో నివసించే వారు, ఉద్యోగాలు దొరకని వారు, ఎక్కువగా దూరవిద్యను కోరతారనే భావం ఉండేది. సమాజాలు చైతన్యవంతం కావటం వల్ల, ప్రభుత్వాలు బాధ్యాతాయుతం కావటం వల్ల దేశాలు ప్రజాస్వామికం కావటం వల్ల ఈ నమ్మకం సన్నగిల్లింది. ప్రజల్ని విద్యావంతం చేసే కృషిలో దూరవిద్య అపూర్వమైన పాత్రను నిర్వహించగలదనే నమ్మకం గట్టి పడింది. దూరవిద్య ప్రయోజనాలను పెక్కురు గుర్తించడం జరిగింది.

దూరవిద్యకు ఆకర్షితులయ్యేవారు పెక్కురు. వారిలో ముఖ్యులు:

1. నియత లేక సాంప్రదాయిక కళాశాలల్లో విశ్వవిద్యాలయాల్లో ప్రవేశానికి అర్హత పొంది కూడా వాటిల్లో పరిమితమై స్థానాలు ఉండటం వల్ల చేరలేనివారు.
2. కుటుంబాలు, ఉద్యోగాలు, సామాజిక బంధాలు కలిగి పూర్తికాలిక విద్యాసంస్థల్లో చదువు కోవటానికివీలులేనివారు.
3. ఉన్నత విద్య సంస్థల ప్రవేశానికి కావల్సిన విద్యార్హత వయో అర్హతలేనివారు.
4. ఆయా నివాస ప్రాంతాల నుండి బయటకు పోలేని వికలాంగులు,అలాంటివారు.
5. వివిధ వృత్తుల్లో పనిచేస్తూ తమ పరిజ్ఞాన స్థాయిని, శిక్షణస్థాయినిపెంచుకోవాలనికోర్కెగలవారు.
6. సర్టిఫికెట్లు, డిప్లొమాలు, డిగ్రీలు అవసరం లేకుండా ఎప్పటికప్పుడు కొత్త విషయాలను తెలుసుకోవాలనే కుతూహలంగలవారు.
7. పై చదువుల వల్ల మెరుగైన ఉద్యోగ అవకాశాలు కలుగుతాయని, తమ చుట్టూ ఉన్న పరిస్థితుల వల్ల, పూర్తికాలిక విద్యాసంస్థల్లో పై చదువులకు పోవటానికివీలులేనివారు.

## ఓపెన్ యూనివర్సిటీ పేర్లు

ఓపెన్ యూనివర్సిటీకి రకరకాల పేర్లు ఉన్నట్లు గమనించాం. ఎక్కువ దేశాల్లో ఓపెన్ యూనివర్సిటీ పేరు మీద దూర విద్యాబోధన విశ్వవిద్యాలయాలు పిలవబడినా, కొన్ని దేశాల్లో దానికి భిన్నమయిన పేర్లు ఉన్నాయి. ఉదాహరణకు జపాన్‌లో "ఎయిర్", కొరియాలో "ఎయిర్ అండ్ కరస్పాండెన్స్", ఇరాన్‌లో "ఫ్రీ", ఇజ్రాయెల్‌లో "ఎవ్విరిమేన్స్" అనే మాటలు వాడుకలోకి వచ్చి ఆ పేర్ల మీదనే ఆ దేశాలులోని ఓపెన్ యూనివర్సిటీలు పిలువబడుతున్నాయి. "యూనివర్సిటీ వితవుట్ వాల్స్" అనే పేరు కూడా కొన్ని విశ్వ విద్యాలయాల కుంది.

ఓపెన్ యూనివర్సిటీ మాటలో "ఓపెన్" అనే పదానికి ఒక ప్రత్యేకత ఉంది, విశిష్టార్థం ఉంది. సాధారణార్థంలో ఓపెన్ యూనివర్సిటీ ఎప్పుడూ తెరచే ఉంటుంది. సాంప్రదాయక విశ్వవిద్యాలయాలు ఎప్పుడూ మూతబడి ఉంటాయి అని భావించరాదు. "ఓపెన్" మాట యూనివర్సిటీ పనితీరులో సరళతను, స్వేచ్ఛను, కొత్తదనాన్ని, నిర్బంధ రాహిత్యాన్ని, సులభతనాన్నిప్రతిబింబిస్తుంది. సాధారణ విశ్వ విద్యాలయాల్లో ఉండే కఠిన నియమ నిబంధనలు ఓపెన్ యూనివర్సిటీలో ఉండవు. ఓపెన్ యూనివర్సిటీ లక్ష్యాలు, విద్యార్థుల సామాజిక పూర్వరంగం, బోధనవిధానం, బోధనాంశాల స్వరూప స్వభావాలు సాంప్రదాయిక, నియత విశ్వవిద్యాలయాలతో పోల్చుకున్నప్పుడు భిన్నంగా ఉంటాయి. ఆ భిన్నత్వాన్ని ప్రతిబింబించే మాట "ఓపెన్".

ఓపెన్ యూనివర్సిటీ విద్యార్థులు చాల మంది వయోజనులు. ఎప్పుడో చదువు మానేసి ఉద్యోగాలు, కుటుంబంతో ఉంటూ మళ్ళీ చదువు కావలని కుతూహలం కల్గిన వారు, పిల్లలున్న తల్లులు, గృహిణులు, పూర్తికాల పద్ధతిని చదవటానికి వీలు కానివారు, ఎప్పుడు తాము పొందిన పరిజ్ఞానాన్ని, శిక్షణను సంపాదించుకోవాలని కాంక్షించేవారు, అంతర విషయగత కోర్సులు చదవాలను కొనేవారు, ఉన్నత విద్యను పొందటానికి కనీస విద్యార్హత లేని వారు. ఇలాంటి వారికి నియత కళాశాలలో విశ్వవిద్యాలయాల ప్రవేశం దొరకదు. చదువుకొనే అవకాశం లభ్యంకాదు. అర్హత, అవకాశం కల్పించేది ఓపెన్ యూనివర్సిటీ ఆ అర్హత, అవకాశాన్ని సూచించే మాట "ఓపెన్". యూనివర్సిటీలో చేరే విద్యార్థులకు, చదివే చోట్లకు, చదివే కోర్సులకు, చదివే కాలానికి చదువు కోడానికి సంబంధించిన మాట "ఓపెన్". వీటన్నింటిలో కఠిన నియమాలు లేక పోవటాన్ని సూచించే మాటే "ఓపెన్".

"ఓపెన్‌నెస్" హద్దులు, పరిమితులు లేని "ఓపెన్‌నెస్" గా ఉంటుందా? సాధ్యమా? ఉండదు, సాధ్యంకాదు అని ఇపుడు అనుకోవాలి. ఎందుకంటే హద్దులు, పరిమితులు, నియమాలు, నిబంధనలు లేకుండా ఏ కార్యక్రమం సాగదు. ఎంతవరకు హద్దులు, ఎలాంటి పరిమితులు, ఏ రకమైన నియమాలు-వీటికి సంబంధించిన నిర్ణయాలు "ఓపెన్‌నెస్" ను నిర్ణయిస్తాయి. నిర్నిబంధ వ్యవస్థను, విధానాన్ని రూపొందించాలంటే ప్రస్తుతం అసాధ్యం. అది ఒక సుదూర లక్ష్యంగా, ఆదర్శంగా మాత్రమే పెట్టుకోగలం. ఆదర్శ రాజ్యంలోనే ఆదర్శ విద్య సాధ్యం. అందరికీ ఆమోదకరమైన ఆదర్శ రాజ్యంసాధ్యమా?

"ఓపెన్" అనే మాట పరిమితార్థంలోనే దూర విద్యావేత్తలు వాడుతున్నారు. 1975 లో ఐక్యరాజ్యసమితి విద్యా సాంఘిక సాంస్కృతిక సంస్థ ప్రచురించిన "ఓపెన్ లెర్నింగ్, సిస్టమ్స్ అండ్ ప్రాబ్లమ్స్ ఇన్ పోస్ట్ సెకండరీ ఎడ్యుకేషన్" అనే పుస్తకంలో కూడా ఓపెన్ లెర్నింగ్ పరిమితార్థంలో వాడబడింది. విద్యారంగంలో రకరకాల సంస్కరణలను, పరికల్పనలను సూచించడానికి ఓపెన్ మాట వాడటం జరిగింది. విశృంఖలత్వాన్ని సూచించే మాటగా వాడలేదు. ఓపెన్‌నెస్ విశృంఖలత్వం కాదు.

ఓపెన్ అనే ఇంగ్లీషు మాటను తెలుగులో సార్వత్రిక / సార్వజనీన అని అంటున్నాం. "సార్వత్రిక" మాట బాగా వాడుకలోకి వచ్చింది. ఓపెన్ యూనివర్సిటీని సార్వత్రిక విశ్వవిద్యాలయం అంటున్నాం. ఆంధ్రప్రదేశ్ ఓపెన్ యూనివర్సిటీని సార్వత్రిక విశ్వవిద్యాలయం అంటున్నాం. ఆంధ్రప్రదేశ్ ఓపెన్ యూనివర్సిటీ పెట్టినపుడు తెలుగు పత్రికలు దాన్ని బహిరంగ విశ్వవిద్యాలయం అని, ఆరు బయలు విశ్వవిద్యాలయం అని కూడా పిలచాయి. చివరకు సార్వత్రిక విశ్వవిద్యాలయం పేరే స్థిరపడిపోయింది. విశ్వవిద్యాలయ అధికారులు కూడా అదే పేరున దృఢపరచారు.

"సార్వత్రిక" అంటే సర్వత్రా వ్యాపించింది అనే భావం వెంటనే కలగవచ్చు. కాని మనం చూడవలసింది విస్తృతార్థంలో "ఓపెన్‌నెస్" కు సమానమైన భావంతో చూడాలి. తెలుగు మాటలోనే చెప్పాలంటే సర్వప్రాంతాలకు, సర్వవిధాల ద్వారా, సర్వరకాల విద్యను, సర్వజనులకు అందించటం-అనేరకంగా భావించవచ్చు. ఇది కృతకంగా కన్పడవచ్చు. రూపాన్నేగాక రూపంలోని భావాన్ని చూడాలి.

పై వివరణను బట్టి ఓపెన్ యూనివర్సిటీ అనే ఇంగ్లీషు మాటైనా, సార్వత్రిక విశ్వవిద్యాలయం అనే తెలుగు మాటైనా దూరవిద్యాబోధన విశ్వవిద్యాలయం అనేమాటకు సమానార్థం అని గ్రహిద్దాం.

## బహుమాధ్యమ బోధన విధానం

నియత విశ్వవిద్యాలయాలు ఏక మాధ్యమ బోధనా విధానాన్ని అనుసరిస్తే సార్వత్రిక విశ్వవిద్యాలయాలు బహుమాధ్యమ బోధన విధానాన్ని అనుసరిస్తాయి. బహుమాధ్యమ బోధన విధానం బహుముఖంగా బహు భాగంగా ఉంటుంది. ఇందులోని ముఖ్యమైనభాగాలు:

1. ముద్రిత పాఠాలు
 – అనుగుణ్య పాఠ్యభాగాలు
 – నియత పాఠ్య పుస్తకాలు
 – అనుబంధ పఠనీయ విషయాలు
2. ప్రసారాలు
 – రేడియో ప్రసారాలు
 – టి.వి. ప్రసారాలు
3. ప్రసారేతర దృశ్య, శ్రవణ సామాగ్రి
 – ఆడియో క్యాసెట్లు
 – వీడియో టేపులు
 – ఫిల్ములు
 – స్లయిడ్లు
4. ప్రయోగాలు
 – గృహ ప్రయోగ సామాగ్రి
 – ప్రయోగశాలల్లో అనుభవం
 – క్షేత్రాల్లో అనుభవం
 – కంప్యూటింగ్
5. అధ్యాపక అధ్యాయ సంబంధాలు
 – బోధనా సమావేశాలు
 – సలహా సమావేశాలు
 – స్వయం సహాయ సమావేశాలు
 – వేసవి పాఠశాలలు

రకరకాల పద్ధతులు, మాధ్యమాల ద్వారా, దూరవిద్యను విద్యార్థులకు, విద్యార్థేతరులకు అందించటం సార్వత్రిక విశ్వవిద్యాలయాల లక్ష్యం. దూరబోధనకు ప్రధానాధారం ముద్రిత పాఠాలు. విద్యార్థులకు నేరుగా పోస్టు ద్వారా అందించబడే ముద్రిత పాఠాలు నిపుణులు, నిష్ణాతులయిన రచయితల బృందాలచే తయారవుతాయి. ముద్రిత పాఠాలు విద్యార్థులు స్వయంగా చదువుకోటానికి వీలుగా ఉండే రీతిలో తయారవుతాయి. దూరవిద్యలో బోధనా సామాగ్రి ముఖ్యంగా ముద్రిత పాఠాలకు స్వయం బోధన లక్షణం ముఖ్యం.

స్వయం బోధన తత్వంతో పాఠాలు రాయడం అంత సులువైన పని గాదు. తగిన శిక్షణ, నేర్పరితనం ఉండాలి. స్వయం బోధన పాఠంలో విద్యార్థి ఎప్పటికప్పుడు ఎంత నేర్చుకొన్నదీ తెలుసుకోంటానికి అవకాశం ఉంటుంది. అంటే స్వీయ అంచనా పాఠంలో అంతర్గతమై ఉంటుంది. స్వీయ అంచనా పాఠంలో అంతర్గతమై ఉంటుంది. స్వీయ అంచనా విద్యార్థి జ్ఞాపకశక్తిని, గ్రహణశక్తిని పునర్ధ్రువీకరిస్తుంది. విద్యార్థి ముందుకు పోవడానికి కావలసిన ప్రేరణ, ఉత్తేజం, ఉద్దీపనను కల్గిస్తుంది.

ముద్రణ సామాగ్రితో పాటు రేడియో, టి.వి. ప్రసారాలు, ప్రసారేతర దృశ్య, శ్రవణ కార్యక్రమాలు విద్యార్థికి స్వయం అధ్యాపనలో తోడ్పడతాయి. ముద్రణ పాఠాలు ప్రసార ప్రసారేతర కార్యక్రమాలు ఎలా కలసి ఉండాలి? ఏ పాళ్ళల్లో కలిసి ఉండాలి? అనే వాటి మీద కూడా భిన్నాభిప్రాయాలున్నాయి. దూరవిద్యా సంస్థ లక్ష్యాల మీద, వనరుల మీద సాంకేతిక స్తోమత మీద బోధన విధానంలో ప్రసార, ప్రసారేతర దృశ్య శ్రవ్య భాగాల పాత్ర ఉంటుంది.

ఇక బోధనా సమావేశాలు, సలహా సమావేశాలు. బోధనా సమావేశాల్లో విద్యార్థులకు అర్థం కాని విషయాలని వివరించడం, విశ్లేషించడం జరుగుతుంది. సలహా సమావేశాలు కోర్సులకు సంబంధించిన అనుమానాలు, వ్యక్తిగత సమస్యలు, సమాచార అవసరాలు మొదలగు వాటిపై అధ్యాపకుడు విద్యార్థికి తగు సలహాలు ఇస్తాడు. మొదటి ప్రక్రియను ట్యూటరింగ్ అని, రెండవ ప్రక్రియను కౌన్సిలింగ్ అని అంటారు.

## ఓపెన్ యూనివర్సిటీల వర్గీకరణ

దూర విద్యావేత్తలు దూరవిద్యాబోధన విశ్వవిద్యాలయాలను రకరకాలుగా వర్గీకరించారు. బోధన, పాలనలలోని ఒక్కో అంశాన్ని బట్టి ఒక్కో రకమైన వర్గీకరణను ప్రతిపాదించారు. 1971 లో ఆటోపేటర్స్, 1973లో ఎల్‌బ్రుష్రా, 1979లో కాయ్, 1982లో డెస్మండ్ కేశన, 1982లో రంబుల్‌ల భిన్న అంశాల ఆధారంగా భిన్న వర్గీకరణలను ప్రతిపాదించారు. రంబుల్‌ల వర్గీకరణ ప్రకారం దూరవిద్యా బోధన విశ్వవిద్యాలయాల రకాలు అవి:

1. స్వతంత్ర ప్రతిపత్తి కలిగి కేంద్రీకృత నియంత్రణాధికార వ్యవస్థ కలిగిన విశ్వవిద్యాలయాలు

2.స్వతంత్ర ప్రతిపత్తి కలిగి వికేంద్రీకృత నియంత్రణాధికారవ్యవస్థకలిగినవిశ్వవిద్యాలయాలు
3.సాంప్రదాయిక విద్యను, దూరవిద్యను ఒకే వ్యవస్థ ద్వారాబోధించేవిశ్వవిద్యాలయాలు
4. సాంప్రదాయిక విశ్వవిద్యాలయంలో అంతర్భాగంగా దూర విద్యను బోధించే విశ్వవిద్యాలయాలు స్థూలంగా సార్వత్రిక విశ్వవిద్యాలయాలను రెండు రకాలుగా వర్గీకరించవచ్చు:

1. స్వయం ప్రతిపత్తి, స్వయం పాలనాధికారం గల విశ్వవిద్యాలయాలు
2. సాంప్రదాయిక విద్యను, దూరవిద్యను పక్కపక్కన బోధించేవిశ్వవిద్యాలయాలు.

మొదటిరకం సార్వత్రిక విశ్వవిద్యాలయాలకూ నేడు ప్రాధాన్యం పెరుగుతుంది. ఎందుకంటే కోర్సుల రూపకల్పనలో, నిర్వహణలో, బోధన విధానం అమలులో పూర్తి స్వాతంత్ర్యం వీటికుంటుంది. రెండో రకం విశ్వవిద్యాలయాల్లో సాంప్రదాయిక విద్యా ప్రభావం దూర విద్యా బోధన విధానాలమీద కొద్దోగొప్పో ఉంటుంది. రెండోరకం విశ్వవిద్యాలయాలు మొదటి రకం రూపాన్ని పొందటానికి జరుగుతున్న కృషిని మనం గమనిస్తూనే ఉన్నాం.

## దూరవిద్య భవిష్యత్తు

అన్ని దేశాల్లో, ముఖ్యంగా తృతీయ ప్రపంచ దేశాల్లో, విద్యకోసం ఒత్తిడి నానాటికి పెరుగుతుంది. నియత సంస్థల ద్వారానే ఈ ఒత్తిడిని ఎదుర్కొనే శక్తి లేదు. నియత విద్యను విస్తృత పరచడానికి దేశాలకు వనరులు లేవు, తగిన సిబ్బంది లేదు. కావలసిన వారందరికీ ఉన్నత విద్యను అందించగల స్తోమత, స్థితి సంపన్న దేశాలకు కూడా లేదు. ఈ రోజు కాకపోయినా రేపైనా విస్తృత విద్యావ్యాప్తికి కావలసిన భౌతిక సదుపాయాలు, మానవ వనరులు ఉంటాయని ఆశించడం అవాస్తవికం. పైగా సమాజంలో కొందరికిగాక అందరికీ విద్యను అందించి విద్యా విధానాన్ని ప్రజాస్వామికం చేయటం నేడు తప్పనిసరి. తమ సాంకేతిక నైపుణ్యాలను పెంపొందించుకోవాలనుకొనే వారి వృత్తి ఉద్యోగుల ప్రయోజనాలను, జీవితాంతం విద్యను పొందాలనుకొనే వారి కోర్కెను నిర్లక్ష్యం చేసే పరిస్థితి లేదు. ఆధునిక ప్రసార సాంకేతిక విజ్ఞాన ప్రభావానికి లోను గాకుండానూ ఉండటం కష్టం. ఈ కారణాల వల్ల నియత విద్యతో పాటు, దూరవిద్యా విధానాన్ని అభివృద్ధి చేసుకోవలసిన అవసరం ఏర్పడింది.

విద్య కొద్దిమందికే లభ్యమైన రోజుల్లో బోధన కేవలం ముఖాముఖిగా జరిగిన కాలంలో సాంప్రదాయిక విద్యా వ్యవస్థ రూపొందింది. ఈనాడు ప్రసార సాంకేతిక రంగంలో వచ్చిన అపూర్వమైన మార్పుల ఫలితంగా విద్యను ఏ దూర ప్రాంతానికైనా ఏవ్యక్తి దగ్గరకైనా తీసుకుపోగల అవకాశం ఏర్పడింది. విద్యను కాలానికి, వయసుకు, స్థలానికి పరిమిత మైందనే భావన తొలిగి పోయింది. ప్రపంచంలోని దూరవిద్యా సంస్థల అనుభవాన్ని గమనిస్తే దూరవిద్య ప్రయోజనాలను స్పష్టంగా గ్రహించగలం. దగ్గర విద్య, దూరవిద్య పరస్పరం వ్యతిరేకం అనే భావన కొందరిలో ఉంది. ఇది తప్పుడు భావన. రెండూ పరస్పర పోషకాలు. రెండూ సమాజాన్ని విద్యావంతం చేసేవిధానాలే.

ఉన్నతవిద్యను దూరవిద్యావిధానం ద్వారా బోధించే సంస్థల సంఖ్య, సంస్థల్లో చేరే విద్యార్థుల సంఖ్య నానాటికి పెరుగుతుంది. బ్రిటిష్ ఓపెన్ యూనివర్సిటీ తొలి ఉపాధ్యక్షుడు వాల్టర్ పెర్రీ మూడు సంవత్సరాల కింద జరిపిన ఒక సర్వే ద్వారా ప్రపంచమంతటా మూడు వందలపై దూర ఉన్నత విద్యా బోధన సంస్థల నుండి రకరకాల సమాచారాన్ని సేకరించాడు. లభించిన సమాచారం అసంపూర్ణం. ఈ అసంపూర్ణ సమాచారాన్ని బట్టి ప్రపంచ మంతటా 20 లక్షల మంది దూర విద్యా బోధన ద్వారా ఉన్నత విద్యను పొందుతున్నారు. ఈ గణాంక వివరాల్లోకి కమ్యూనిస్టు దేశాల్లోని దూరవిద్యార్థులు చేరలేదు. కమ్యూనిస్టు దేశాల్లోని దూర విద్యార్థుల సంఖ్యను కలుపుకొంటే మొత్తం దూర విద్యార్థుల సంఖ్య 40 లక్షలు దాటుతుంది. ఇతర దేశాల్లో కంటే చైనాలో దూర విద్యార్థుల సంఖ్య చాలా ఎక్కువ. దాదాపు 10 లక్షల పై చిలుకు దూర విద్యార్థులున్నారు.

# ఇందిరాగాంధి జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయం

ప్రొఫెసర్ జి.రాంరెడ్డి
ఉపాధ్యక్షులు,
ఇ.గా.జా.సా.విశ్వవిద్యాలయం, కొత్తఢిల్లీ

బ్రిటన్‌లో 1969లో స్థాపితమయిన సార్వత్రిక విశ్వవిద్యాలయం, సమర్థవంతమైన దూర విద్యాబోధన విశ్వవిద్యాలయంగా పెంపొందింది, భారతదేశంలోని విద్యాప్రణాళికా రచయితలను, విధాన నిర్మాతలను ఎంతగానో ఉత్తేజపరచింది. ఈ ఉత్తేజం ఫలితంగా విధాన నిర్మాతలు విద్యావ్యవస్థను కలవరపరుస్తున్న కొన్ని సమస్యలను పరిష్కరించేందుకు సార్వత్రిక విశ్వవిద్యాలయాన్ని మనదేశంలో స్థాపించే అవకాశాలను పరిశీలించటం ప్రారంభించారు. అంతర్జాతీయ విద్యాసంవత్సరమయిన 1970 కేంద్ర ప్రభుత్వ విద్యామంత్రిత్వశాఖ, విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘం, సమాచార ప్రసార మంత్రిత్వశాఖ సహకారంతో భారతదేశంలో సార్వత్రిక విశ్వవిద్యాలయం నెలకొల్పేందుకుగల అవకాశాలను పరిశీలించేందుకు ఒక సదస్సు నిర్వహించింది. సదస్సు ప్రారంభించిన అప్పటి విద్యామంత్రి ఆచార్య వి.కె.ఆర్.వి.రావ్ మాట్లాడుతూ "విశ్వవిద్యాలయ వ్యవస్థకు దూరంగా ఉన్న జనబాహుళ్యానికి సార్వత్రిక విశ్వవిద్యాలయం నూతన విద్యా ప్రసార సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించుకుంటూ, నాణ్యమైన విద్యను అందివ్వాలని" అన్నారు. దేశంలో సార్వత్రిక విశ్వవిద్యాలయం స్థాపనను సిఫారసు చేస్తూ, దాని లక్ష్యాలను గురించి, నిర్వహణగురించి, ఆదాయ వ్యవహారాలూ, పని పద్ధతుల గురించీ, ఆ సదస్సు చాలా సూచనలన చేసింది. విశ్వవిద్యాలయ స్థాపనకు కావలసిన సకల వివరాలనూ పరిశీలించేందుకు ఒక అధ్యయన బృందాన్ని ఏర్పరచాలని కూడా ఆ సదస్సు సిఫారసు చేసింది. సదస్సు చేసిన సిఫారసులను పురస్కరించుకొని భారతదేశ ప్రభుత్వం అప్పట్లో జవహర్‌లాల్ నెహ్రూ విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షుడుగా ఉన్న శ్రీ జి. పార్థసారథి అధ్యక్షతన ఎనిమిదిమంది సభ్యులతో కూడిన వర్కింగ్ గ్రూపును ఏర్పరచింది. దేశంలోని ఉన్నత విద్యాస్థితిగతులను ఆ సంఘం సంపూర్ణంగా సమీక్షించి సార్వత్రిక విశ్వవిద్యాలయం స్థాపించాలనే సూచనను చేసింది. తత్ఫలితంగా జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పేందుకు ముసాయిదా బిల్లు తయారు చేయడమైంది. అటు తర్వాత స్పష్టంగా అది ఏమైందో తెలియరాలేదు. 1982లో డాక్టర్ మాధురీషా అధ్యక్షతన కేంద్ర విశ్వవిద్యాలయాన్ని స్థాపించటానికి ఆచరణాత్మకమైన కృషి చేయాలని, ఎంతమాత్రమూ జాప్యం చేయరాదనీ సిఫారసు చేసింది. అప్పటికే కరస్పాండెన్సు కోర్సులతో సంబంధమున్న చాలామంది, కరస్పాండెన్సు విద్యావ్యవస్థను సమన్వయపరచటానికి దేశంలో జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయం లేక జాతీయ దూర విద్యాసంస్థ లాంటి కేంద్రవ్యవస్థఅవసరంఅని భావించారు.

## రాష్ట్రాల్లో సార్వత్రిక విశ్వవిద్యాలయాలు :

జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయ స్థాపనకు ప్రయత్నాలు జరుగుతున్నపుడు 1978 ప్రాంతాల్లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వానికి సార్వత్రిక విశ్వ విద్యాలయాన్ని స్థాపించాలనే ఆలోచన కలిగింది. కానీ వెంటనే ఈ ఆలోచన కార్యరూపం ధరించలేదు. దాదాపు ఈ సమయంలోనే ఉస్మానియా విశ్వవిద్యాలయం దూర విద్యాబోధనకై సార్వత్రిక కళాశాలను ప్రారంభించే ప్రతిపాదనకు శ్రీకారం చుట్టింది. ఈ కళాశాల విశ్వవిద్యాలయంలో అంతర్భాగంగా ఉండి పూర్తి స్వయం ప్రతిపత్తితో ఉండవలెననే ఆలోచన జరిగింది. సార్వత్రిక కళాశాల ఆలోచన ముందుకు సాగే సమయంలోనే అప్పటి రాష్ట్ర ముఖ్యమంత్రి శ్రీ భవనం వెంకట్రామ్ సార్వత్రిక విశ్వవిద్యాలయాన్ని నెలకొల్పేందుకు గతంలో సాగిన ఆలోచనలను

పట్టించుకున్నారు. 1982లో సార్వత్రిక విశ్వ విద్యాలయస్థాపన ప్రతిపాదనను పరిశీలించేందుకు ఒక సంఘాన్ని నియమించారు. విద్యావకాశాలను ప్రజాతంత్రం చేసే ధ్యేయంతోనూ, "జీవిత సర్వంతర విద్య" అనే క్రొత్త భావన లక్ష్యంగానూ రాష్ట్రంలోని వయోజనులకు ఉన్నతవిద్య అందించే అవకాశాలను అభివృద్ధి పరచటానికి, వాళ్ళ విధి నిర్వహణా సామర్థ్యాన్ని మెరుగుపరిచేందుకూ, వాళ్ళ జీవనసరళి నాణ్యతను పెంపొందించేందుకు సార్వత్రిక విశ్వవిద్యాలయాన్ని స్థాపించాలని ఈ సంఘం సిఫారసు చేసింది. ఈ సిఫారసుల ఆధారంగా 1982 ఆగస్టులో ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం స్థాపితమయింది.

## జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయం

ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం ప్రారంభించేనాటికి జాతీయ స్థాయి సార్వత్రిక విశ్వవిద్యాలయం స్థాపన ఆలోచనలన్నీ కాగితాలమీదే ఉండిపోయాయి. పార్థసారధి సంఘం నివేదికను, ముసాయిదా బిల్లును ఎవరూ పట్టించుకోలేదు. 1983-84లో కేంద్ర విద్యా మంత్రిత్వశాఖ పరిశీలనకు ఈ ప్రతిపాదన మళ్ళీ వచ్చింది. భారత ప్రధాని రాజీవ్‌గాంధి 1985 జనవరిలో చేసిన మొదటి రేడియో ప్రసంగంలో జాతీయ స్థాయిలో ఒక సార్వత్రిక విశ్వవిద్యాలయం ఏర్పాటుచేస్తామని చెప్పారు. వెంటనే సమర్థులైన విద్యావేత్తలు సభ్యులుగా విషయ పరిశీలనకు ఒక సంఘాన్ని విద్యామంత్రిత్వ శాఖ ఏర్పరచింది. ఈ సంఘం ముసాయిదా బిల్లునే కాకుండా, ప్రాజెక్టు నివేదికను కూడా తయారు చేసింది. జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయ స్థాపనకు సంబంధించిన వివిధ అంశాలు, ప్రాజెక్టు నివేదికలు ఉన్నాయి. విశ్వవిద్యాలయం లక్ష్యాలు, బోధించే కోర్సులు పాలనా యంత్రాంగం, ప్రసార వ్యవస్థ, ఆదాయ వ్యయ అంచనాలు, ప్రాజెక్టు వివరంగా పేర్కొంది. దూరవిద్యను అభివృద్ధిపరచేందుకు నిబద్ధమై ప్రభుత్వం **వెంటనే** పార్లమెంటులో ఇందిరాగాంధి జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయం బిల్లును ప్రవేశపెట్టింది. 1985 సెప్టెంబరు 20న ఇందిరాగాంధి జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయం భౌతికఅస్తిత్వాన్నిసంతరించుకుంది.

జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయం లక్ష్యాలు, ధ్యేయాలు ప్రశంసనీయమైనవి. పరిధి చాలా విస్తృతమైంది.

## విశ్వవిద్యాలయ లక్ష్యాలు :

1) విజ్ఞానాన్ని అభివృద్ధి పరచేందుకూ, వ్యాప్తి చేసేందుకూ ప్రసారసాంకేతిక విజ్ఞానంతో సహా వివిధ మాధ్యమాలను ఉపయోగించడం, 2) జనాభాలో అధికభాగానికి ఉన్నత విద్యావకాశాలను సమకూర్చటం, 3) ప్రజల విద్యాస్థాయిని పెంపొందించటం 4) దేశ విద్యావిధానంలో సార్వత్రిక విశ్వవిద్యాలయం, దూరవిద్య వ్యవస్థలను అంతర్భాగాలుగా చేసి, వాటి మధ్య సమన్వయాన్ని సాధించడం, వాటిలో ప్రమాణాలను పెంచడం. ఇంతేకాక దేశ నిర్మాణ కార్యకలాపాలకు సంబంధించిన విద్యను బోధించడం, వివిధ ఉద్యోగాల్లో ఉన్నవారికి తమ విద్యను, విజ్ఞానాన్ని, నైపుణ్యాతలను అభివృద్ధి పరచుకునే సదుపాయాలను కలిగించడం, అనియత విద్యను నియతవిద్యకు పూరకంగా అభివృద్ధి చేయటం, జాతీయ సమైక్యతను పెంపొందించటం, తదితర కార్యకలాపాలద్వారా జనశక్తి అఖండాభివృద్ధికి దోహదం చేయడం కూడా విశ్వవిద్యాలయ లక్ష్యాలే.

ఇందిరాగాంధి జాతీయ విశ్వవిద్యాలయం జాతీయ స్థాయి సంస్థ. తక్కిన సంప్రదాయ విశ్వవిద్యాలయాలలాగా కాదు. ఇది భారతదేశ సర్వవ్యాపకమైంది. కేంద్ర విశ్వవిద్యాలయాన్ని జాతీయసంస్థలుగా స్థాపించినా వాటిలో కొన్ని అవిస్థాపించిన ప్రాంతాలకే పరిమితమై అక్కడి విద్యార్థుల్ని మాత్రమే ఆకట్టుకోగల్గుతున్నది. కానీ ఇందిరాగాంధి జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయం విద్యార్థులు దేశం అంతటా ఉన్నారు. అది విద్యను దేశంలోని అన్ని భాగాలకు, పట్టణాలకూ, పల్లెలకూ, మైదానాలకూ, కొండ ప్రాంతాలకూ తీసుకువెళ్ళింది. అవసరాలనూ, అపేక్షితాలనూ అనుసరించి దేశమంతటా అధ్యయన కేంద్రాలను స్థాపించటానికి, ఈ అధ్యయన కేంద్రాలను సమన్వయపరచటానికి ప్రాంతీయ కేంద్రాలు దేశమంతటా ఉన్నాయి. ఇందిరాగాంధి సార్వత్రిక

విశ్వవిద్యాలయం ఒక జాతీయ విశ్వవిద్యాలయమనేది అక్షరాలా సార్థకం.

విద్యాకార్యక్రమాలు:

విశ్వవిద్యాలయం సాధారణ విద్యారంగంలో స్వల్పకాలిక, దీర్ఘకాలిక కార్యక్రమాలను నిర్వహిస్తుంది. నిరంతర విద్యకూ విద్యా విస్తరణకూ దోహదం చేస్తుంది. పరిశోధనకు సదుపాయాలను సమకూరుస్తుంది. రకరకాల సర్టిఫికెట్, డిప్లొమా, డిగ్రీకోర్సులను నిర్వహిస్తుంది. విశ్వవిద్యాలయంలో కీలకమైన అంశం నమ్యత. విద్యాకార్యక్రమాలు, కోర్సులూ నిర్వహించటంలో ఒక విశ్వవిద్యాలయంనుండి మరో విశ్వవిద్యాలయం లోకి (అది నియత విద్యావ్యవస్థ లేదా అనియత విద్యావ్యవస్థ కావచ్చు). ఒక వ్యవస్థ నుండి మరో వ్యవస్థలోకి విద్యార్థుల గమనశీలతలో సార్వత్రిక విద్యా వ్యవస్థ దృక్పథం నమ్యమైంది. విద్య కాల పరిమితి విషయంలో కూడా ఈ వ్యవస్థ నమ్యమైందే. వీటన్నిటికన్నా ముఖ్యమైన అంశం కోర్సు ప్రవేశ నియమాలలో ఈ వ్యవస్థ కనబరిచే నమ్యత. ఈ సదుపాయాలను వినియోగించుకొని వివిధ రంగాలకు చెందిన ఉద్యోగస్తులూ, గృహిణులూ, విద్యాసంబంధ అసమానత లనుభవిస్తున్న తదితర ప్రజలూ ప్రయోజనాన్ని పొందగలరు. విశ్వవిద్యాలయం తొలి కోర్సయిన దూరవిద్య, మేనేజిమెంట్ డిప్లొమా కార్యక్రమాలలో ఈ లక్షణాలన్నీ ఉన్నాయి. దూర విద్యలో పాక్షిక లేదా పూర్ణకాలిక వ్యాసాంగాన్ని ఎంచుకునేవారికి ఉద్దేశించింది డిప్లొమా కోర్సు. భారతదేశమంతటా సార్వత్రిక విశ్వవిద్యాలయ వ్యవస్థతో సంబంధం ఉన్నవారందరికీ దూరవిద్యను పరిచయంచేయడం ఈ డిప్లొమాకోర్సు లక్ష్యం. మేనేజిమెంటు డిప్లొమాకు పర్యవేక్షక స్థాయిలో 5 సంవత్సరాలు అనుభవం ఉన్నవారికి ప్రవేశం ఉంది. పట్టభద్రులైన వారి విషయంలో ఈ కాలపరిమితి 3 సంవత్సరాలే. మొదటి సంవత్సరం మూడువేలకు పైగా విద్యార్థులు ఈ కోర్సులో ప్రవేశం పొందారు. ఈ కోర్సు ఒక మాడ్యుల్ మాత్రమే. ఇది మేనేజిమెంటులో స్నాతకోత్తరస్థాయి విద్యకు దారితీస్తుంది.

త్వరలో ప్రారంభమయ్యే డిప్లొమా, సర్టిఫికెటు కోర్సులు:

గ్రామాభివృద్ధి, కంప్యూటర్ విద్య, పౌష్టికాహారం - ఆరోగ్యం, ఉన్నతవిద్య ,పాఠశాల పూర్వవిద్య, భూమి అభివృద్ధి, నీటి ఉపయోగం డిప్లొమాకోర్సులు తయారవుతున్నాయి. రక్షణ సిబ్బంది అవసరాలను దృష్టిలో ఉంచుకొని కొన్ని ప్రత్యేక కార్యక్రమాలకు రూపకల్పన చేస్తున్నారు. ఏరోనాటికల్ ఇంజనీరింగ్‌లో ఎం.ఎస్‌సి. కోర్సులకు కృషి జరుగుతుంది.

బి.ఎ., బి.కాం., బి.ఎస్‌సి., విద్యాకార్యక్రమాలను ప్రారంభించడానికి విశ్వ విద్యాలయం బృహత్తరమైన ప్రయత్నాలు చేసింది. విద్యార్థుల్లో రెండు రకాల వారున్నారు. అనియత విద్యార్థులు (అంటే ఏవిధమైన పూర్వ విద్యార్హతలు లేని వారు ), 10 + 2 పరీక్షలో ఉత్తీర్ణులైన నియత విద్యార్థులు. అనియతవిద్యార్థులు విశ్వవిద్యాలయం నిర్వహించే ప్రవేశపరీక్షలో ఉత్తీర్ణులైతేనే బి.ఎ., బి.కాం., కోర్సుల్లో చేరడానికి అర్హులవుతారు. స్నాతకపూర్వవిద్య కోర్సు కాలపరిమితి 3 సంవత్సరాలు. కానీ విద్యార్థికి తన అనుకూలాన్నిబట్టి ఈ కోర్సును పూర్తిచేసే స్వేచ్ఛ ఉంది. కానీ కోర్సును పూర్తిచేసేందుకు గరిష్టపరిమితి 8 సంవత్సరాలు. స్నాతక పూర్వవిద్య కోర్సులో ఒక ప్రత్యేక లక్షణం ఉంది. అది పాఠ్యాంశాలలో మౌలిక అంశాలకు సంబంధించింది. ఈ మౌలిక అంశాల కోర్సులో భారత నాగరికత సంస్కృతులు, విజ్ఞాన సాంకేతిక శాస్త్రాల అభివృద్ధి ప్రాముఖ్యాల వంటి సామాన్య అంశాలుంటాయి. వీటితోబాటు విద్యార్థులు మూల పాఠ్యాంశాలను, అన్వయపూర్వక పాఠ్యాంశాలనూ అధ్యయనం చేస్తారు. ఇంకొక ముఖ్యమైన లక్షణం ఏమిటంటే పాఠ్యాంశాలన్నీ క్రెడిట్ల రూపంలో తయారవుతాయి. స్నాతకపూర్వ విద్యను పూర్తి చేయాలనుకునే విద్యార్థి 96 క్రెడిట్లను పొందవలసి ఉంది.

దేశంలో వేలాదిమంది గ్రంథాలయో-ద్యోగులు పాఠశాలల్లో, కళాశాలల్లో తదితర సంస్థల్లో

పనిచేస్తున్నారు. వారిలో చాలామందికి వృత్తి పరమైన అర్హతలు లేవు. వారిలో చాలామంది ఆ అర్హతలను సాధించేందుకు ఆసక్తి చూపుతున్నారు. కాని వారు చేస్తున్న ఉద్యోగాలను వదిలి రావటానికి వీలులేక, లేదా సంప్రదాయవ్యవస్థలో ప్రవేశం దొరకకా అలాగే ఉండిపోతున్నారు. అలాంటి వ్యక్తులకోసం గ్రంథాలయ సమాచార విజ్ఞానాలలో స్నాతకపూర్వ డిగ్రీ కోర్సు త్వరలో ప్రారంభంకానున్నది.

**బోధనా పద్ధతులు :**

అవసరాలనూ, అపేక్షాలనూ దృష్టిలో ఉంచుకుని జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయం వివిధ బోధనా పద్ధతులను అవలంబిస్తుంది. దూర అధ్యాయిలకు నాణ్యమైన విద్యను అందించడానికి విశ్వవిద్యాలయం ఆధునిక ప్రసార సాంకేతిక విజ్ఞానాన్ని ఉపయోగించుకుంటుంది. ముద్రిత పాఠాలు, రేడియో, దూరదర్శిని ప్రసారాలూ, శ్రవణ, దృశ్య కార్యక్రమాలూ, ప్రయోగాలు ముఖాముఖి బోధన మొదలైన బహుమాధ్యమ విద్య ద్వారా విశ్వవిద్యాలయం విద్యార్థులకు బోధిస్తుంది.

**పాఠ్యాంశాల తయారీ :**

ప్రారంభించవలసిన విద్యాకార్యక్రమాలను విశ్వవిద్యాలయం తొలుత నిర్ణయిస్తుంది. ఆ తర్వాత ఇతర విశ్వవిద్యాలయాల నిపుణులతో సంప్రదించి ఆ కార్యక్రమాలకు రూపకల్పనచేస్తారు. ఒకసారి కార్యక్రమం ఆమోదించిన తర్వాత ఒక కోర్సు బృందాన్ని నియమిస్తారు. ఆ బృందం చేసే పనిని సమన్వయ పరచేందుకు ఒక సంపాదకుడు ఉంటాడు. పాఠ్యాంశాలను నిపుణుల బృందాలు తయారుచేస్తాయి. ఈ బృందాల్లోని నిపుణులు చాలావరకు సంప్రదాయ విశ్వవిద్యాలయాలకు చెందినవారే అయి ఉంటారు. విద్యావిజ్ఞాన నిపుణులకూ, ప్రసార విజ్ఞానవేత్తలకూ పాఠ్యాంశాల తయారీలో భాగస్వామ్యం ఉంటుంది. దృశ్య శ్రవణ కార్యక్రమాల మేళవింపును కూడ వారే నిర్ణయిస్తారు.

**సిబ్బంది:**

విశ్వవిద్యాలయంలో పనిచేసే సిబ్బంది 3 రకాలు. విద్యాసంబంధ సిబ్బంది, సాంకేతిక సిబ్బంది, విద్యేతర సిబ్బంది. వారి నియామకాలను అపేక్షించే అర్హతలు, వారి జీతభత్యాలు కేంద్ర విశ్వవిద్యాలయాల్లో ప్రస్తుతం అమలులో ఉన్న వాటితో సమానంగా ఉంటాయి. ప్రస్తుతం ఇక్కడ విద్యా సిబ్బందిలో 50 కి పైగా పూర్ణకాలిక, 270 కి పైగా పాక్షిక కాలిక ఉద్యోగులున్నారు. సాంకేతిక, విద్యేతర సిబ్బందిలో 300 కి పైగా పూర్ణకాలిక, 50 కి పైగా పాక్షిక కాలిక సిబ్బంది ఉన్నారు. రాబోయే సంవత్సరాలలో విద్యాసిబ్బంది,విద్యేతరసిబ్బంది సంఖ్య గణనీయంగా పెరిగే అవకాశాలున్నాయి. పూర్ణకాలిక ఉద్యోగసిబ్బంది నియామకం జాతీయ స్థాయి ఎంపిక ద్వారా జరుగుతుంది. సలహాదారులుగా, సమన్వయకర్తలుగా, కోర్సు రచయితలుగా, సంపాదకులుగా వివిధస్థాయిలలో విశ్వవిద్యాలయానికి తోడ్పడే పాక్షికకాలిక సిబ్బందిని సంప్రదాయ విశ్వవిద్యాలయాలనుంచి తీసుకుంటారు.

**ప్రాంతీయ కేంద్రాలు, అధ్యయన కేంద్రాలు :**

ప్రాంతీయ కేంద్రాలు, అధ్యయన కేంద్రాలు విద్యార్థులకు, వాళ్ళ చదువుల్లో సహాయంచేసేందుకు నిర్మాణాత్మక కార్యక్రమాలను చేపడతాయి. ప్రస్తుతం 100 కు పైగా అధ్యయన కేంద్రాలున్నాయి. మరో 100 కేంద్రాలను నెలకొల్పే ప్రతిపాదన ఉంది. ఏదైనా ఒక నియతవిద్యా సంస్థలో అధ్యయన కేంద్రాన్ని స్థాపిస్తారు. ఇందులో చిన్న గ్రంథాలయం, దృశ్య, శ్రవణ పరికరాలు, కేసెట్లు ఉంటాయి. కొందరు సలహాదారులుంటారు. అధ్యయన కేంద్రానికి అధికారి సమన్వయకర్త. అధ్యయన కేంద్రాన్ని నిర్వహించడం అతని పని.

ప్రాంతీయ కేంద్రం అధ్యయన కేంద్రాల కార్యకలాపాల్ని సమన్వయపరుస్తుంది. ప్రస్తుతం 10 ప్రాంతీయ కేంద్రాలున్నాయి, త్వరలోనే దేశంలోని అన్ని ప్రధాన రాష్ట్రాల్లో ఒక్కొక్క ప్రాంతీయ కేంద్రం ఏర్పాటవుతుంది. ప్రాంతీయ కేంద్రానికి అధికారిగా ప్రాంతీయ సంచాలకుడు ఉంటాడు. అతనికి పూర్ణకాలిక సిబ్బందిభాగం సహాయంచేస్తుంది.

### ప్రాంతీయ కేంద్రాలు, అధ్యయన కేంద్రాలు :

ప్రాంతీయ కేంద్రాలు, అధ్యయన కేంద్రాలు విద్యార్థులకు, వాళ్ళ చదువుల్లో సహాయంచేసేందుకు నిర్మాణాత్మక కార్యక్రమాలను చేపడతాయి. ప్రస్తుతం 100 కు పైగా అధ్యయన కేంద్రాలున్నాయి. మరో 100 కేంద్రాలను నెలకొల్పే ప్రతిపాదన ఉంది. ఏదైనా ఒక నియతవిద్యా సంస్థలో అధ్యయన కేంద్రాన్ని స్థాపిస్తారు. ఇందులో చిన్న గ్రంథాలయం, దృశ్య, శ్రవణ పరికరాలు, కేసెట్లు ఉంటాయి. కొందరు సలహాదారులుంటారు. అధ్యయన కేంద్రానికి అధికారి సమన్వయకర్త. అధ్యయన కేంద్రాన్ని నిర్వహించడం అతని పని.

ప్రాంతీయ కేంద్రం అధ్యయన కేంద్రాల కార్యకలాపాల్ని సమన్వయపరుస్తుంది. ప్రస్తుతం 10 ప్రాంతీయ కేంద్రాలున్నాయి, త్వరలోనే దేశం లోని అన్ని ప్రధాన రాష్ట్రాల్లో ఒక్కొ ప్రాంతీయ కేంద్రం ఏర్పాటవుతుంది. ప్రాంతీయ కేంద్రానికి అధికారిగా ప్రాంతీయ సంచాలకుడు ఉంటాడు. అతనికి పూర్ణకాలిక సిబ్బందిభాగం సహాయంచేస్తుంది.

### దూర విద్యావ్యాప్తిలో జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయ పాత్ర :

దేశంలో విద్యా సౌకర్యాల్ని విస్తృత పరచటంలో అనియత విద్యావ్యవస్థ ప్రాధాన్యాన్ని గురించి భారత ప్రభుత్వ జాతీయ విద్యావిధానం (1986) నొక్కి చెప్పింది. దూర విద్యాసంస్థలను అభివృద్ధి పరచటం ద్వారా విద్యానాణ్యతను మెరుగుపరచవచ్చని ప్రకటన చేసింది. దేశంలో సార్వత్రిక విశ్వవిద్యాలయం, దూర విద్యావ్యవస్థలను అభివృద్ధి పరచే బాధ్యతలు ఇందిరాగాంధి జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయానికి కేంద్ర ప్రభుత్వం అప్పగించింది. వీటితోబాటు బోధన ప్రమాణాల నిర్ణయీకరణ, మూల్యాంకనం, పరిశోధన బాధ్యతలు కూడా ఈ విశ్వవిద్యాలయానిదే. ఈ కార్యాల్ని నిర్వర్తించేందుకు వీలుగా ఆయా దూర విద్యావ్యవస్థలకు నిధులను కేటాయించి, పంపిణీచేసే అధికారం కూడ విశ్వవిద్యాలయానికి ఉంది. విశ్వవిద్యాలయం దేశం లోని దూర విద్యావ్యవస్థలకు మార్గ నిర్దేశిగా పని చేస్తుంది.

చాలా రాష్ట్రాలు సార్వత్రిక విశ్వవిద్యాలయాలను ఏర్పరచాలనే ఆసక్తిని వెల్లడించాయి. వాటిలో ముఖ్యమైనవి పశ్చిమ బెంగాల్, మహారాష్ట్ర, కేరళ, ఉత్తరప్రదేశ్, మధ్యప్రదేశ్, గుజరాత్, కర్నాటక, ఒరిస్సా రాష్ట్రాలు. వీటిలో చాలా రాష్ట్రాలు తమ తమ ప్రాంతాల్లో సార్వత్రిక విశ్వవిద్యాలయాలను ఏర్పరచే అవకాశాలను పరిశీలించేందుకు సంఘాలను నియమించాయి. బీహార్, రాజస్థాన్ రాష్ట్రాలు అప్పుడే సార్వత్రిక విశ్వవిద్యాలయాలను స్థాపించాయి. తక్కిన రాష్ట్రాలు సార్వత్రిక విశ్వవిద్యాలయాలను నెలకొల్పే కార్యక్రమంలో ఉన్నాయి. పశ్చిమ బెంగాల్, ఉత్తర ప్రదేశ్, సార్వత్రిక విశ్వవిద్యాలయాన్ని ఏర్పరచే ప్రయత్నాలను వాయిదా వేసినట్లున్నాయి. మరి కొన్ని రాష్ట్రాలు, ఇందిరా గాంధి జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయం బోధించే కోర్సులను పరిశీలించి వాటినుంచి ఎలాంటి ప్రయోజనాలు పొందవచ్చో పరిశీలిస్తున్నాయి. సార్వత్రిక విశ్వవిద్యాలయాలను ఏర్పరచేందుకు తీసుకునే నిర్ణయాలు ఈ ఆలోచనల మీదే ఆధారపడ్డట్లున్నాయి. ఈ సందర్భంలో జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయం, రాష్ట్ర సార్వత్రిక విశ్వవిద్యాలయాల మధ్య సంబంధాలను గురించిన ముఖ్యమైన ప్రశ్న ఒకటి తలెత్తుతుంది. ఈ విషయాన్ని దీనికి సంబంధించిన వ్యవహర్తలు చాలా సమావేశాలలో చర్చించారు. పాఠాల ఉత్పత్తిలో పునరుక్తత నివారించాలనే అంశంలో ఒక అంగీకారానికి వచ్చారు. దేశంలోని సార్వత్రిక విశ్వవిద్యాలయాలన్నీ ఒక సమీకృత కార్యక్రమాన్ని ఏర్పాటు చేసుకోవాలనే అంశాన్ని అందరూ ఒప్పుకున్నారు. ఆ సమీకృత కార్యక్రమంలో భాగంగా తాము ఏర్పరచిన పాఠ్యాంశాలను విశ్వవిద్యాలయాలు ఒకదానికొకటి వినియోగపరుచుకుంటాయి. ఈ సమీకృత కార్యక్రమంలో భాగస్వామి అయిన ఒక విశ్వవిద్యాలయం ఒక మంచి కోర్సును ఏదైనా ప్రారంభించి ఉంటే వీలైనంత వరకు ఇతర విశ్వవిద్యాలయాలు వాటికి నకలు అనదగిన పాఠ్యాంశాలను తయారు చేయకూడదు. ఇది పాఠ్యాంశాల

తయారీకి పెద్దమొత్తంలో అయ్యే వ్యయాన్ని మాత్రమే కాకుండా అనవసరమైన కార్యభారాన్నీ, కాలహరణనూ నివారిస్తుంది. అవసరం ఉన్నచోట ఆ కోర్సును ప్రాంతీయ భాషలోకి తెచ్చుకోవచ్చు. ఈ సమీకృత కార్యక్రమంలో మరొక ఆసక్తికరమైన అంశం ఏమిటంటే ఒక సార్వత్రిక విశ్వవిద్యాలయంలో చేరిన విద్యార్థి వేరే సార్వత్రిక విశ్వవిద్యాలయాలు నిర్వహించే కోర్సులలో చేరటానికి స్వేచ్ఛ ఉండటం. ఆ విధంగా సమీకృత కార్యక్రమంలో అధిక సంఖ్యలో కోర్సులు సార్వత్రిక విశ్వవిద్యాలయాల విద్యార్థికి అందుబాటులో ఉంటాయి. కోర్సుల రూపురేఖలకు సంబంధించి ఒకఏకరూపత ఉంటుంది.

ఇందిరాగాంధి జాతీయ సార్వత్రిక విశ్వ విద్యాలయం నిర్వహించవలసిన పాత్రలో సంస్థల అనుబంధం, గుర్తింపు అనే అంశాల ఉన్నాయి. విశ్వవిద్యాలయం భారతదేశం లోపలా, వెలుపలా కూడా ఏ విద్యాసంస్థనైనా అనుబంధం చేసుకోవచ్చు. డిగ్రీల ప్రధానం, లేదా గ్రాంటుల స్వీకరణల నిమిత్తం ఏ ఉన్నత విద్యాసంస్థనైనా గుర్తించవచ్చు. కేవలం సార్వత్రిక విశ్వవిద్యాలయంగా విధి నిర్వహణ చేయుటకు కాకుండా దూర విద్యలో నాయకత్వ పాత్రను కూడ నిర్వర్తిస్తోంది. దేశంలో విశ్వవిద్యాలయం స్థాపనతో దూరవిద్యకు ఇతోధిక ప్రోత్సాహం, శక్తి లభ్యమవుతాయనే ఆశించవచ్చు.

ఇందిరాగాంధి జాతీయ విశ్వవిద్యాలయ స్థాపన సంచలనాన్ని సృష్టించింది. పరస్పర విరుద్ధమైన ప్రతిస్పందనలను రేకెత్తించింది. చాలామంది బుర్రలను తొలుస్తున్న మొదటి అనుమానం ఏమిటంటే - కరస్పాండెన్స్ కోర్సులకన్నా ఈ జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయం ఏవిధంగా భిన్నమైంది? దూరవిద్యను అభివృద్ధి చేయటానికంటూ ఒక ప్రత్యేక విశ్వవిద్యాలయం మనకు అవసరమా? అని. దూరవిద్యను అందించే లక్ష్యంలో ఒకటైనా సార్వత్రిక విశ్వవిద్యాలయం, కరస్పాండెన్స్ సంస్థలు పరస్పర భిన్నమైన వ్యవస్థలన్న విషయం గుర్తుచేసుకోవటం ఈ సందర్భంలో చాలా అవసరం. కరస్పాండెన్సు వ్యవస్థ సంప్రదాయ విశ్వవిద్యాలయ చట్రంలోనే విధులను నెరవేరుస్తుంది. నియత వ్యవస్థలోని నియమాలూ, నిబంధనలూ, పాఠ్యాంశాల స్వరూపమూ కలిగి ఉంటుంది. వివిధ తరగతులకు చెందిన అధ్యాయిల అవసరాల కనుగుణంగా నూతన కల్పనలకు అవకాశాలను ఇచ్చే నమ్యత ఇందులో లేదు. ఈ లక్షణాలన్నింటిలోనూ ముఖ్యమైనది సార్వత్రిక విశ్వవిద్యాలయానికి ఏర్పడిన చట్టబద్ధమైన హోదా. ఈ కరస్పాండెన్సు సంస్థలు నియత విశ్వవిద్యాలయ వ్యవస్థలో భాగంగా ఉంటాయి తప్ప విశ్వవిద్యాలయానికున్న స్వయం ప్రతిపత్తిస్థాయి కలిగి ఉండవు. ఇందిరాగాంధి జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయం దేశంలోని తక్కిన విశ్వ విద్యాలయాల్లాగా ప్రత్యేక చట్టబద్ధతని, సంప్రదాయ వ్యవస్థలోని తన ప్రతిరూపాల్లాగానే స్వయం ప్రతిపత్తిని అనుభవిస్తుంది. ఈ మౌలికమైన భేదం అంటే జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయానికున్న చట్టబద్ధత, దూరవిద్య దృక్పథం ఈ విశ్వవిద్యాలయాన్ని దేశంలోని తక్కిన దూరబోధనా సంస్థలనుండి వేరు పరుస్తుంది.

దేశంలో ఉన్నత విద్యకు ప్రత్యామ్నాయ వ్యవస్థగా జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయం కాగలదా, అనే ఆశ్చర్యం కూడా కొంతమందికి కలగవచ్చు. సంప్రదాయ విద్యావ్యవస్థకు ప్రత్యామ్నాయంగా ఇది ఉంటుందా? అనే ప్రశ్న రావచ్చు. జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయం నియత విద్యావ్యవస్థను పెంపొందించడానికి ఉద్దేశించికాదు. ఇది నియత వ్యవస్థకు ప్రత్యామ్నాయం కాదు. నియత విద్యావ్యవస్థను వ్యర్థపరచటానికి ఏర్పడలేదు. విద్యావకాశాలు లభ్యం కానివారికి ఆధునిక ప్రసార సాంకేతికవిజ్ఞానాన్ని ఉపయోగిస్తూ విద్యావకాశాలను విస్తృతపరచడానికి ఉద్దేశించబడింది. దాని కార్యక్రమాలు దూరవిద్యను అభివృద్ధిపరచటానికి తోడ్పడతాయి. ఇందిరాగాంధి జాతీయ సార్వత్రిక విశ్వవిద్యాలయ స్థాపన దేశంలో ఉన్నత విద్యాభివృద్ధిపథంలో ఒక ముఖ్యమైన మైలు రాయి. ఉత్తమమైన, నాణ్యతకలిగిన విద్యకు నూతన పరికల్పనకు ఈ కొత్త విశ్వవిద్యాలయం దోహదం చేయగలదనే విశ్వాసం ఉంది. ఈ విశ్వవిద్యాలయం తన విద్యార్థులకు మాత్రమే కాకుండా సంప్రదాయ విశ్వవిద్యాలయ విద్యార్థులకు కూడా తోడ్పడుతుంది.

ఉన్నత విద్యలో సమానావకాశాలు కల్పించేందుకూ, దానిని ప్రజలవద్దకు తీసుకెళ్ళేందుకూ తగిన సామర్థ్యం ఈ విశ్వవిద్యాలయానికుంది. ఈ సందర్భంలో పార్లమెంటులో విశ్వవిద్యాలయం బిల్లుని ప్రవేశ పెడుతూ అప్పటి విద్యాశాఖ మంత్రి శ్రీ కె.సి.పంత్ అన్నమాటలు గుర్తుచేసుకొందాం. ఆయన ఇలా అన్నారు: "ఇతరదేశాల్లో జరిగినట్లే జాతీయ విశ్వవిద్యాలయ నిశ్చయప్రభావం తక్కిన విద్యావ్యవస్థపైన ఉండనే ఉంటుంది. సార్వత్రిక విశ్వవిద్యాలయంలో ముఖ్యంగా నమోదుకాని విద్యార్థులు కూడా దాని బహుమధ్యమ విద్యావిధానం నుంచి ప్రయోజనం పొందవచ్చు మనం ఆశాపథంలో ముందుకు వెళుతున్నాం. ప్రస్తుత విద్యాక్షేత్రంలో కొత్తబాటవేస్తున్నాం."



# కళాశాలలు : స్వయంపాలనాప్రతిపత్తి


డా॥ కె. జయశంకర్
రిజిస్ట్రార్
సెంట్రల్ ఇన్స్టిట్యూట్ ఆఫ్ ఇంగ్లీష్ అండ్ ఫారెన్ లాంగ్వేజెస్
హైదరాబాద్







దేశంలోని విశ్వ విద్యాలయాలకూ కళాశాలలకూ మధ్య గల సంబంధంలో మౌలికమైన మార్పులు తెచ్చి కళాశాలలకు స్వయంపాలనాప్రతిపత్తిని కలిగించవలసిన అవసరాన్ని గుర్తించి కనీసం నాలుగు దశాబ్దాలు గడిచాయి. ఈ దిశలో ప్రయత్నాలు మొదలుపెట్టి రెండున్నర దశాబ్దాల కాలంగడిచింది. ఇన్ని సంవత్సరాల ప్రయత్నం తర్వాత ఈ రోజు దేశంలో అయిదున్నర వేలకు పైగాఉన్న కళాశాలల్లో స్వయంపాలనా ప్రతిపత్తిని పొందిన కళాశాలల సంఖ్య అతికష్టంగా వందకు చేరింది. ఉన్నత విద్యారంగంలో ఒక విప్లవాత్మకమైన సంస్కరణగానూ అనివార్యమైన సంస్కరణగానూ గుర్తింపుపొందిన ఈ విధానం నత్తనడక నడుస్తున్నదని వేరే చెప్పనక్కరలేదు. దీనికి గల కారణాలు ఉన్నత విద్యాక్షేత్రంతో సంబంధం ఉన్నవారికీ, అది ఎదుర్కొంటున్న సమస్యలపట్ల అవగాహన కలవారికి తెలియనివికావు. అయినా వాటిని విమర్శనాత్మకంగా పరిశీలించే అవసరం ఎంతైనా ఉంది.

కళాశాలలను విశ్వవిద్యాలయాలకు అనుబంధసంస్థలుగా పరిగణించే పద్ధతి చాలా పాతది. ఉన్నత విద్యాసంస్థల సంఖ్య చాలా తక్కువ ఉన్న రోజులలో ఈ పద్ధతి రూపుదాల్చింది. ఇటువంటి వ్యవస్థలో పాఠ్యప్రణాళికలను నిర్ణయించి, పాఠ్యపుస్తకాలను ఎంపిక చేసి, పరీక్షలు నిర్వహించి, డిగ్రీలను ప్రదానం చేసే అధికారాలన్నీ విశ్వవిద్యాలయాలకే ఉంటాయి. విశ్వవిద్యాలయాలు ఇచ్చే ఆదేశాలను శిరసావహించే బాధ్యత కళాశాలలపై ఉంటుంది. ఉన్నత విద్యాసంస్థల సంఖ్య చాలా తక్కువ ఉన్నంత వరకు ఈ పద్ధతి కొంత వరకు బాగానే పనిచేసిందని చెప్పవచ్చు. కాని వాటి సంఖ్య అపారంగా పెరిగిన తర్వాత ఈ పద్ధతిని కొనసాగించటం వల్ల అనేక సమస్యలు ఉత్పన్నమౌతున్నాయి. ఈ రోజు దేశంలో విశ్వవిద్యాలయాల సంఖ్య నూటయాబయికి పైగా ఉంది. కళాశాలల సంఖ్య అయిదున్నరవేలు దాటింది. అయితే అన్ని విశ్వవిద్యాలయాలకు అనుబంధ కళాశాలలు లేవు. కాని ప్రతి కళాశాల ఏదో ఒక విశ్వవిద్యాలయానికి అనుబంధంగా ఉంటుంది. అనుబంధ కళాశాలలు కలిగి ఉన్న విశ్వవిద్యాలయాల పరిధిలో చాలా వ్యత్యాసాలున్నాయి. కొన్నిటి పర్యవేక్షణలో అయిదారు కళాశాలలు మాత్రమే ఉంటే మరికొన్నిటి పరిధిలో రెండు వందలకు పైగా ఉన్నాయి.

ఈ వ్యత్యాసాలు ఎలా ఉన్నా కళాశాలలను విశ్వవిద్యాలయాలకు అనుబంధ సంస్థలుగా పరిగణించే పద్ధతికి కాలదోషంపట్టింది. ఈ పద్ధతిలో కళాశాలలకు విద్యావిషయాల నిర్వహణలో ఏ మాత్రం స్వేచ్ఛ ఉండదు. కళాశాలల సంఖ్య, విశ్వవిద్యాలయాల పరిధి పెరుగుతున్నందువల్ల ఈ స్వేచ్ఛారాహిత్యం అనేక ఇతర సమస్యలకు దారి తీసింది. విశ్వవిద్యాలయాలకు కళాశాలలకు మధ్య దూరాలు పెరిగి పరస్పర అవగాహన క్లిష్టతరమౌతున్నది. కళాశాలల నిర్వహణలో ప్రతినిత్యం ఎదురయ్యే సమస్యలకు సత్వపరిష్కారాలు కావాలంటే తక్షణ నిర్ణయాలు తీసుకోవలసిఉంటుంది. కాని నిర్ణయాలు తీసుకునే అధికారమూ, స్వేచ్ఛా కళాశాలలకు లేకపోవటం చేత ప్రతిచిన్న విషయానికి అవి విశ్వవిద్యాలయాల ఆజ్ఞల కోసం నిరీక్షించ వలసివస్తున్నది. దీనితో కాలయాపన జరగటంతో పాటు ఇంకా అనేక సమస్యలు ఉత్పన్నమౌతున్నాయి.

క్షేత్రం (field) లో పనిచేసే వారికి స్థానిక సమస్యలపట్ల అవగాహన ఉన్నప్పటికీ, విధాననిర్ణయాలలో వారికి ఎటువంటి పాత్రలేదు.

క్షేత్రంతో ప్రత్యక్ష సంబంధం లేక, స్థానిక సమస్యలపట్ల అవగాహన లేనివారికే విధాన నిర్ణయాలలో గుత్తాధికారం ఉంది. ఈ వైరుధ్యాలవల్ల విశ్వవిద్యాలయాలు కళాశాలల పని తీరును సమర్థంగా పర్యవేక్షించ లేకపోతున్నాయి, వాటికి కావలసిన నాయకత్వాన్ని సూచనలను అందించలేకపోతున్నాయి. కళాశాలలు తమవద్దగల వనరులను, ప్రతిభా పాటవాలను పూర్తిగా వినియోగించుకోలేకపోతున్నాయి, మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా ప్రతిస్పందించ లేకపోతున్నాయి. ఒకవైపు విశ్వవిద్యాలయాలు మోయరాని బరువుతో కుంగిపోతుంటే మరోవైపు కళాశాలలు తేలికతనం (weightlessness) తో బాధపడుతున్నాయి. ఈ విపరీత పరిస్థితి వల్లనే ఉన్నత విద్యారంగంలో, ప్రధానంగా అండర్ గ్రాడ్యుయేట్ స్థాయిలో, సామాజిక అవసరాలకు అనుగుణంగా ఆధునికీకరణ జరగటంలేదు,మార్పులు రావటంలేదు.

విశ్వవిద్యాలయాలకు కళాశాలలకు మధ్య గల సంబంధం ఒకరిమీద మరొకరికి నమ్మకం పోవటానికి ఒక ఉదాహరణగా తయారైంది. విశ్వవిద్యాలయాలలో "రాజ్యాలేలేవారు" కళాశాలలను "సామంత రాజ్యాలుగా" పరిగణించడం పరిపాటి అయిపోయింది. ఉన్నత విద్యా విషయాలలో నాయకత్వం వహించే సామర్థ్యం కేవలం విశ్వవిద్యాలయాలకే ఉంటుందని, వాటి ఆదేశాలను శిరసావహించటం కళాశాలల ప్రథమ కర్తవ్యమని భావించేవారి సంఖ్య విశ్వవిద్యాలయాలలో దినదినం పెరిగిపోతుంది. ఇటువంటి అనుచితమైన దృక్పథాల వల్లనే అనుబంధ కళాశాలల్లో కల ప్రతిభకు పూర్తిగా వికసించే అవకాశమూ, ప్రోత్సాహమూ లభించటంలేదు. అనుబంధ కళాశాలలను స్తబ్దంగా ఉంచటంలో విశ్వవిద్యాలయాలలో పనిచేసే వారికి స్వార్థం (vested interest) ఉన్నట్లు అనిపిస్తుంది. కళాశాలలు అన్నివిధాలా అభివృద్ధి చెందితే విశ్వవిద్యాలయాల నాయకత్వానికి ప్రమాదం వాటిల్లుతుందనే భయం వారికి ఉన్నట్లుంది. ఈ పెడధోరణులకు ప్రధాన కారకులు విశ్వవిద్యాలయాలలో పనిచేసే ఆచార్యులే అని చెప్పకతప్పదు. వారే విజ్ఞానప్రదాతలనీ, కళాశాలల అధ్యాపకులు కేవలం విజ్ఞానగ్రహీతలనే స్వాతిశయం (superiority complex) తో వారు బాధపడటం జగత్‌విదితమే. చాలా చోట్ల ఈ పరిస్థితులు తలకిందులు (other way round) గా ఉన్న సత్యాన్ని వారు గుర్తించే పరిస్థితిలో లేరు. ఇది అహంభావమూ (arrogance) అజ్ఞానమూ (ignorance) వంటి జాడ్యాల సమ్మేళనమని చెప్పకతప్పదు. విశ్వవిద్యాలయాలు ఈ దురదృష్టకరమైన వైఖరిని అవలంబించటం వల్లనే కార్యనిర్వాహకమండలి, విద్యామండలి (Executive Council/ Academic Council) వంటి ప్రధానమైన విధాన నిర్ణాయక సంస్థలలో అనుబంధ కళాశాలల పాత్ర నామమాత్రంగా ఉండి పోయింది. వాటికి కేవలం గ్రహీతల స్థానమే (receiving end) మిగిలింది. కళాశాల విద్యారంగంలో సంస్కరణలను ప్రవేశపెట్టి నూతనత్వాన్ని కల్పించే ప్రయత్నాలకు ఈ పరిస్థితి ప్రతిబంధకంగా తయారైంది.

ఉన్నత విద్యకు ఈ దుస్థితినుండి విముక్తి కలిగించే ఉద్దేశంతో కళాశాలలకు స్వయంపాలనాప్రతిపత్తిని కలిగించే ప్రతిపాదన వచ్చింది. కొఠారి కమీషన్ (1964-66) నివేదికలో ఈ అవసరాన్ని గట్టిగా చెప్పటం జరిగింది. కాని, ఈ కమీషన్ సిఫారసు చేసిన ఇరవై యేళ్ల తర్వాత కూడా, అంటే 1986 నాటికి; దేశంలో గల అయిదువేల కళాశాలల్లో కేవలం ఇరవై మూడు కళాశాలలకు మాత్రమే స్వయంపాలనాప్రతిపత్తి లభించింది. అందులో సగానికంటె ఎక్కువ ఒక తమిళనాడు రాష్ట్రంలోనే ఉన్నాయి. ఇటువంటి మందగతిపై విచారాన్ని వెలిబుచ్చితూ నూతన విద్యావిధానం (1986) లో ఈ. అంశాన్ని పునరుద్ఘాటించటం జరిగింది. ఏడవ పంచవర్ష ప్రణాళికాంతం నాటికి, అంటే ఏప్రిల్ 1990 నాటికి, కనీసం అయిదు వందల కళాశాలలకైనా స్వయం పాలనా ప్రతిపత్తి కల్పించాలని "శపథం" చేయటం జరిగింది. ఈ ప్రణాళికకు సంబంధించిన మూడున్నర సంవత్సరాలు ఇదివరకే గడిచిపోయాయి. అయినా ఈ కాలంలో స్వయంపాలనా ప్రతిపత్తి కల్పించబడిన కళాశాలల సంఖ్య అతికష్టంగా నూటికి చేరింది. ఇక మిగిలిన ఒకటిన్నర కాలంలో మరో నాలుగు వందల కళాశాలలకు ఈ స్థాయిని కల్పిస్తేనే ఏడవ పంచవర్ష ప్రణాళికలో నిర్ధారించిన లక్ష్యాన్ని సాధించగలుగుతాం. ఇది ఎంత

వరకు సాధ్యమో నలభైసంవత్సరాల మన అనుభవాలను బట్టి ఊహించుకోవచ్చు.

ఉన్నత విద్యాక్షేత్రానికి ఒక నూతన స్వరూపాన్ని ఇచ్చే సత్సంకల్పంతో కళాశాలలకు స్వయంపాలనా ప్రతిపత్తిని కల్పించాలనే ప్రతిపాదన చేశారు. ఈ విధానాన్ని అమలు పరచటంలో యూనివర్సిటీ గ్రాంట్ కమీషన్‌కు కావలసినంత చిత్తశుద్ధి ఉంది. తమపైగల భారాన్ని తగ్గించుకోవాలనే తపన పెద్ద సైజు విశ్వవిద్యాలయాలకు ఉంది. స్వేచ్ఛనిస్తే తమ సామర్థ్యాన్ని నిరూపించుకునే ఆత్మవిశ్వాసం కొన్ని కళాశాలలకు ఉంది. అయినా ఈ విధానాన్ని అమలు పరచటంలో అందరు నత్తనడకే నడుస్తున్నారు. ఇది నిజంగా దురదృష్టకరమైన పరిస్థితి.

విధానాలను ఎంతచిత్తశుద్ధితో నిర్ణయించినా అవి ఎంత మార్గదాయకంగా ఉన్నా వాటిని అమలు పరిచేటప్పుడు అంతే చిత్తశుద్ధి లేనప్పుడు, అమలు పరిచే వారి ఉద్దేశాలు అనుమానాస్పదంగా ఉన్నప్పుడు ఏ సంస్కరణైనా విజయవంతం కాలేదు. కళాశాలలకు స్వయంపాలనా ప్రతిపత్తిని కల్పించే ప్రతిపాదన కూడా ఆచరణ దశకు వచ్చేవరకు ఇదే జాడ్యానికి గురైంది. అనేక ప్రశ్నలు, సందేహాలు ఉత్పన్నమైనాయి. మాకు స్వేచ్ఛ లేదు అని మొరపెట్టుకున్న కళాశాలలు స్వేచ్ఛ నిస్తామంటే దాన్ని స్వీకరించటానికి సిద్ధంగా లేవు. విశ్వవిద్యాలయాలు, రాష్ట్ర ప్రభుత్వాలు స్వయం పాలనా ప్రతిపత్తిని స్వీకరించవలసిందిగా, "కొన్ని" కళాశాలలను వాటి యాజమాన్యాలను బతిమిలాడుతున్నాయి. గమనించవలసిన విశేష మేమిటంటే ఈ "కొన్ని" కళాశాలలు చాలా వరకు ప్రైవేటు రంగంలో ఉన్నాయి. ప్రభుత్వ రంగంలో ఉన్న కళాశాలల జోలికి వారు ఎక్కువగా పోవటంలేదు. విశ్వవిద్యాలయాలు తమ పర్యవేక్షణ భారాన్ని వదిలించుకోవాలనే ప్రయత్నిస్తున్నట్లు, రాష్ట్రప్రభుత్వాలు కళాశాలను నిర్వహించే ఆర్థిక భారంనుంచి విముక్తి పొందే ప్రయత్నాలు చేస్తున్నట్లు కనిపిస్తుంది.

ప్రైవేటు కళాశాలలకు స్వయం పాలనా ప్రతిపత్తిని కలిగించటంలో సిద్ధాంతరీత్యా ఏమీ అభ్యంతరం ఉండకూడదు. కాని ఈ రంగంతో మనకుగల అనుభవాలు అనేక సందేహాలకు, భయాలకు దారితీసే అవకాశం ఉంది. ప్రైవేటు కళాశాలలకు స్వయం పాలనా ప్రతిపత్తిని కల్పించినప్పుడు వాటికి అనేక కీలకమైన విషయాలలో స్వయంనిర్ణయాధికారాన్ని ఇవ్వవలసి ఉంటుంది. పాఠ్యాంశాలు, బోధనాపద్ధతులు, పరీక్షా విధానాలతోపాటు, అడ్మిషన్ పద్ధతులు, ఫీజులరేట్లు, అధ్యాపకుల నియామకాలు, వారి సర్వీసు నిబంధనలు మొదలయిన అంశాలపై నిర్ణయాలు తీసుకునే విషయంలో ఎటువంటి ప్రతిబంధకాలుండకూడదు. ఆదర్శప్రాయంగా నడిచే కొన్ని సంస్థలను మినహాయిస్తే ప్రైవేటు రంగంలోని కళాశాలల పనితీరు అందరికి తెలిసిందే. కేవలం దాతృత్వ (Philanthrophic) దృష్టితో విద్యాసంస్థలు నడిపేవారు ఈనాడు ఎవరూలేరు. ఆ రోజులు పోయాయి. అనేక ప్రైవేటు కళాశాలలు ప్రభుత్వ గ్రాంట్లతోనే నడుస్తున్నాయి. ప్రభుత్వం ఇచ్చే గ్రాంట్లను కూడా దుర్వినియోగం చేసే యాజమాన్యాలు తక్కువ సంఖ్యలో లేవు. ఈ దురాచారాలను అరికట్టే ఉద్దేశంతో ప్రైవేటు కళాశాలలపై ప్రభుత్వ నియంత్రణ క్రమేపి పెంచడం జరిగింది. అయినా అనాచారాలు పూర్తిగా రూపు మాసిపోలేదు. ప్రైవేటు కళాశాలల పరిస్థితి ఈ విధంగా ఉన్నప్పుడు వాటికి స్వయం పాలనా ప్రతిపత్తి కల్పించే పేరుతో సర్వాధిరాలిస్తే అనేక ప్రశ్నలు ఉత్పన్నం కావటం సహజం.

స్వయంపాలనా ప్రతిపత్తిని కలిగించే విషయంలో ప్రభుత్వ కళాశాలలకంటే ప్రైవేటు కళాశాలలపై ఎక్కువ శ్రద్ధ ఎందుకు చూపబడుతుంది ? ఉన్నత విద్య ప్రైవేటైజేషన్ (Privatisation) ను శీఘ్రంగా పూర్తి చేసే ప్రయత్నంలో ఇది ఒక భాగమా?

ఉపయోగకరమైన కోర్సులను ప్రవేశ పెట్టేపేరుతో ప్రైవేటుకళాశాలలు ఫీజులను ఇష్టం వచ్చిన మేరకు పెంచితే, ఆ కోర్సులు, ఆ కళాశాలలు బలహీనవర్గాలకు అందుబాటులో ఉంటాయా?

ప్రైవేటు యాజమాన్యాలకు సర్వాధికారాలిస్తే వాటి ఆధీనంలో పనిచేసే సిబ్బందికి భద్రతఉంటుందా?

భద్రత, రక్షణ లేని సిబ్బందితో నడుపబడే సంస్థలలో విద్యాప్రమాణాలు కాపాడబడుతాయా?

స్వయంపాలనాప్రతిపత్తి పేరుతో కళాశాలలు, వ్యాపారసంస్థలుగా, కలవారి కేంద్రాలు (Elitist Centres) గా మారితే దానివల్ల ఉత్పన్నమయ్యే ఉద్రిక్తత గురించి ప్రభుత్వాలకు అవగాహన లేదా?

ఈ ప్రశ్నలకు ప్రభుత్వాలు విశ్వవిద్యాలయాలు తృప్తికరమైన సమాధానాలు చెప్పలేకపోతున్నాయి. ఇటువంటి అయోమయపరిస్థితివల్ల ఉపాధ్యాయలోకం కాని విద్యార్థులుకాని ఈ పథకం పట్ల ఎక్కువ ఆసక్తి చూపటంలేదు. విద్యార్థులకు పట్టని అధ్యాపకులకు గిట్టని విధంగా తయారైన ఈ విధానాన్ని ఎవరి కొరకు ప్రవేశపెడతారు ? ఎవరిద్వారా దాన్ని అమలు పరుస్తారు?

భారతదేశం వంటి అభివృద్ధి చెందుతున్న దేశాలలో ఏ సంస్కరణను విజయవంతం చేయాలన్నా ప్రభుత్వంపై ప్రధాన బాధ్యత ఉంటుంది. విద్యారంగం వంటి అతి సున్నితమైన రంగంలో అది మరింత కీలకపాత్ర వహించవలసి వస్తుంది. అలా జరగనప్పుడు సమర్థమైన వైద్యసౌకర్యాలను విక్రయించే ప్రైవేటు ఆసుపత్రులవలె, మేలురకపు సౌకర్యాలను అమ్మే ప్రైవేటు రవాణా కంపెనీలవలె విద్యా సంస్థలు కూడా వ్యాపార సంస్థలై పోతాయి. ఈ సత్యాన్ని ప్రభుత్వాలు గుర్తించనంత వరకు విద్యారంగంలో ప్రవేశపెట్టదలచిన ఒక మహత్తరమైన సంస్కరణ కేవలం కాగితం పైనే ఉండి పోతుంది.



# ఆంధ్రప్రదేశ్‌లో గ్రంథాలయాల అభివృద్ధి

ఆర్. కృష్ణమూర్తి
పౌరగ్రంథాలయసంచాలకులు,
హైదరాబాదు.




భారతదేశం పూర్వకాలంలో విజ్ఞాన నిలయంగా, ఆధ్యాత్మిక చింతనకు పట్టుగొమ్మగా విలసిల్లింది. ఆనాడు ఈ విజ్ఞానము వాగ్రూపంగా గురువునుంచి శిష్యులకు సంక్రమిస్తూ వచ్చేది. కాలక్రమేణ ముద్రణయంత్రాలు వాడుకలోకి రావడంవల్ల విజ్ఞానమంతయూ పుస్తకరూపంలో మన గ్రంథాలయాలలో చదువరుల కోసం నిక్షిప్తం చేయడం జరిగింది.

మన దేశంలో గ్రంథాలయోద్యమానికి ఒక విశిష్టత ఉంది. ఆంగ్లేయులు మన దేశంలో అడుగుపెట్టడానికి ముందే మన దేశంలో కొన్ని గ్రంథాలయాలు నెలకొల్పబడి విస్తృత జనాదరణ పొందాయి. భారతదేశంలో గ్రంథాలయ వ్యాప్తికి యూరోపియన్‌లు కొంతవరకు దోహదం చేశారనే విషయం వాస్తవమే ఐనప్పటికీ, మన రాష్ట్రంలో మాత్రం అది కొందరి నిస్వార్థ సేవాపరాయణుల కృషి ఫలితంగానే ప్రజా ఉద్యమంగా మొలకెత్తి, వికసించింది. గతంలోకి తొంగిచూస్తే క్రీ.శ. ఏడవ శతాబ్దంలోనే నాగార్జునాచార్యుడు స్థాపించిన నాగార్జున విశ్వవిద్యాలయంలో అనేక ఉత్తమ గ్రంథాలతో ఒక గ్రంథాలయమున్నట్లు మనకు తెలుస్తుంది. క్రీ.శ. 1800 సంవత్సరంలో పరవస్తు కుటుంబానికి చెందిన గ్రంథాలయంలో ప్రజల ఉపయోగార్థం అందరికి ప్రవేశము కల్పించడంజరిగింది. 1820 సంవత్సరంలో తంజావూరులో "సరస్వతి మహల్" అనే గ్రంథాలయం స్థాపితమయింది. వనపర్తి రాజు శ్రీ రాజారామేశ్వరరాయలు గారు తన స్వంత గ్రంథాలయాన్ని అందరి ఉపయోగార్థం తెరచి ఉంచారు. అదే కాలంలో జేమ్స్ టామస్‌అనే ఆంగ్లేయుడు కూడా రాజమహేంద్రవరంలో ఒక గ్రంథాలయాన్ని స్థాపించినట్లు, సం. 1850లో థియొసాఫికల్ సొసైటీ వారు గుంటూరులో ఒక గ్రంథాలయాన్ని స్థాపించినట్లు తెలుస్తున్నది. ఈ విషయంలో చాలా చొరవ, సాహసం చూపిన ఒక ప్రాథమిక పాఠశాల ఉపాధ్యాయుడు శ్రీ మంతిన ఆదినారాయణ మూర్తి గారి కృషి ఎంతో శ్లాఘనీయమైనది. ఆయన 1856వ సంవత్సరంలో విశాఖపట్టణంలో ఆధునిక పద్ధతిలో మొదటి గ్రంథాలయాన్ని నెలకొల్పారు. ఆనాడు ఆంగ్లభాషలో గాని, ఆంగ్ల సంస్కృతి సంప్రదాయాలలో గాని, ఆచార వ్యవహారాల్లో గాని అంతగా పరిచయం లేని ఉత్సాహవంతులైన యువకుల, పెద్దల సేవాకృషి ఫలితంగా ఈ గ్రంథాలయోద్యమం మూడు పూవులు ఆరుకాయలుగా ఫలించింది. ఈ విధంగా అనేక గ్రంథాలయాలు, పట్టణాలలోనూ, గ్రామసీమలలోను స్థాపితమై ప్రజలలో పఠనాసక్తిని ప్రోత్సహించి వారిని విజ్ఞానవంతులుగా చేయడానికి ఎంతో ఉపయోగించాయి.

1914 సంవత్సరంలో బెజవాడలో జరిగిన ప్రథమ ఆంధ్రదేశ గ్రంథభాండాగారుల మహాసభ ఈ గ్రంథాలయోద్యమంలో ఒక ముఖ్య సంఘటన. ఈ మహాసభకు దాదాపు అన్ని జిల్లాలలోని ప్రతినిధులూ, నాటి హైదరాబాదు సంస్థానం నుంచి 60 మందీ హాజరైనారు. ఈ సభకు శ్రీ చిలకమర్తి లక్ష్మీ నరసింహం గారు అధ్యక్షత వహించారు. ఆనాడు ఆయనిచ్చిన సందేశం గ్రంథాలయ వేదంగా ఈ నాటికీ పరిగణిస్తున్నారు.

"వాయువెల్లవారికి ఎట్లు స్వాధీనమై యున్నదో
జ్ఞానము కూడ అట్లు స్వాధీనము కావలయును.
ఉదకమెల్లవారికి ఎట్లు సేవ్యమై యున్నదో
జ్ఞానమును అట్లు సేవ్యమై యుండవలయును.
సూర్య చంద్రమండలముల తేజస్సు ఎల్లవారికి ఎట్లు

సౌఖ్యప్రదముగా నున్నదో
జ్ఞానమును అట్లు సౌఖ్యప్రదముగ నుండవలయును"

ఆయన ప్రసంగం ఈ గ్రంథాలయోద్యమం వ్యాపింపజేయడానికి ఎంతోమందిని ప్రభావితులను చేసింది. ఈ ఉద్యమానికి ఎంతో మంది ఎన్నో విధాల చేయూతనిచ్చారు. ఈ మహాసభలో పాల్గొన్నవారు ఈ కార్యక్రమాన్ని రాష్ట్రంవ్యాప్తంగానే కాక దేశవ్యాప్తంగా సాగించే తలంపుతో ఒక ప్రతినిధి సంఘాన్ని స్థాపించి దానికి ఆంధ్రదేశ గ్రంథభాండాగార సంఘమని పేరు పెట్టారు. ఇది తరువాత కొంతకాలానికి ఆంధ్రదేశ గ్రంథాలయ సంఘంగా పేరు మారింది. శ్రీ మోచర్ల రామచంద్రరావు గారు దీనికి మొదటి అధ్యక్షులు. శ్రీ అయ్యంకి వెంకటరమణయ్య, శ్రీ నాళంకృష్ణారావు ప్రధాన కార్యదర్శులుగా ఎన్నికైనారు. శ్రీయుతులు దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు కందుకూరి వీరేశలింగం, గాడిచర్ల హరిసర్వోత్తమరావు, శనివారపు సుబ్బారావు, గోపరాజు రామచంద్రరావు, పాతూరి నాగభూషణం, కోదాటి నారాయణరావు, సురవం ప్రతాపరెడ్డి, మాడపాటి హనుమంతరావు మొదలయినవారు ఎన్నో ఒడిదుడుకుల నెదుర్కొని గ్రంథాలయాల విస్తరణకు, అభివృద్ధికి ఎనలేని సేవలందించారు. వీరందరూ ఆదర్శపురుషులు. వారి కృషి చిరస్మరణీయమైనది.

ఆంధ్రప్రదేశ్ గ్రంథాలయ చరిత్రలో ఆంధ్రప్రదేశ్ పౌరగ్రంథాలయ చట్టం (1960) ఒక మైలు రాయి : అంతకు మునుపు తెలంగాణా గ్రంథాలయ చట్టం, మదరాసు గ్రంథాలయ చట్టం ఆంధ్ర, తెలంగాణా ప్రాంతాలలో అమలులో ఉండేది. వీటిని సమన్వయ పరచి ఆంధ్రప్రదేశ్ పౌర గ్రంథాలయ చట్టంగా రూపొందించారు. దీని ఫలితంగా ప్రభుత్వము గ్రంథాలయ నిర్వహణకోసం ఒక ప్రత్యేక డైరెక్టరేట్‌ను స్థాపించింది. 1967లో ఒక ప్రత్యేక డైరక్టరును ఈ శాఖ నిర్వహణకు నియమించింది. లైబ్రరీ లెజిస్లేషన్ చేసిన కొద్ది రాష్ట్రాల్లో మనదొకటి. ఈ చట్టం మేరకు పౌర గ్రంథాలయ సంచాలకులు పౌర గ్రంథాలయ నిర్వహణకు సంబంధించిన విషయాలను పర్యవేక్షించడానికి, జిల్లా గ్రంథాలయ సంస్థలకు గ్రంథాలయ నిర్వహణలో సూచనలివ్వడానికి, వారి ప్రణాళికలను ఆమోదించడానికి, వారు కొనవలసిన పుస్తకాల జాబితాలను తయారు చేసి అందించుడానికి అధికారమేర్పడింది.

ఈ చట్టం మేరకు విద్యాశాఖ మంత్రి అధ్యక్షతన గ్రంథాలయ సంచాలకులు మెంబర్ సెక్రటరీగా రాష్ట్ర గ్రంథాలయ సంఘమేర్పడింది. ఈ సంఘం గ్రంథాలయాల నిర్వహణకు సంబంధించిన అన్ని విషయాల్లో ప్రభుత్వానికి సలహానిస్తుంది. దీని స్థానంలోనే "రాష్ట్ర గ్రంథాలయ పరిషత్తు"ను విస్తృతాధికారాలతో ఏర్పాటు చేయాలన్న ఆలోచన ప్రభుత్వ పరిశీలనలో ఉన్నది.

ఇప్పుడు ప్రతి జిల్లాలో ఒక జిల్లా గ్రంథాలయ సంస్థ ప్రభుత్వం నామినేట్ చేసిన ప్రతినిధులతోను, కొందరు ఎక్స్ అఫిషియో సభ్యులతోనే ఏర్పడింది. హైదరాబాద్ సికింద్రాబాద్ నగరాలలో నగర గ్రంథాలయ సంస్థ ఏర్పాటయింది. వారి జిల్లాలలో పౌర గ్రంథాలయ నిర్వహణ బాధ్యత ఆయా జిల్లా గ్రంథాలయ సంస్థలదే.

1975 సంవత్సరంలో అప్పటి ప్రభుత్వం ఈ శాఖలో కొత్త పదవుల సృష్టిపై నిషేధం విధించిన కారణంగా గ్రంథాలయాల విస్తరణ దాదాపు స్తంభించి పోయింది. ఇప్పటి ప్రభుత్వం గ్రంథాలయాల ప్రాముఖ్యాన్ని గమనించి 1985-86 సంవత్సరంలో 69 శాఖా గ్రంథాలయాలను, 1986-1987 సంవత్సరంలో 565 శాఖా గ్రంథాలయాలను మాంజూరు చేసింది. దీనివల్ల అన్ని మండల ప్రధానకార్యస్థానాలలో (Mandal Headquarters) శాఖా గ్రంథాలయాలు మంజూరు అయినాయి. ఇంతేకాక హైదరాబాద్ నగర గ్రంథాలయ సంస్థకి ప్రత్యేకంగా 40 శాఖా గ్రంథాలయాలను మంజూరు చేసింది. ఈ శాఖా గ్రంథాలయాలు ఇప్పుడు తెలుగు విజ్ఞాన సమాచార కేంద్రాలుగా నిర్వహించబడుతున్నాయి. సమాచార శాఖ వారు ప్రభుత్వం చేపట్టిన సంక్షేమ కార్యక్రమాలకు సంబంధించిన విషయాలపై ప్రచురించిన సామగ్రిని ఈ కేంద్రాల ద్వారా ప్రజల కందజేస్తున్నారు.

ఈనాడు మన రాష్ట్రంలో హైదరాబాద్‌లో, రాష్ట్ర కేంద్ర గ్రంథాలయం, ఆరు ప్రాంతీయ గ్రంథాలయాలు ఒక సంచార గ్రంథాలయం ప్రభుత్వం నిర్వహిస్తున్నది.

ప్రతి జిల్లాలో జిల్లాగ్రంథాలయ సంస్థలు జిల్లా ప్రధానకార్యస్థానంలో జిల్లా కేంద్ర గ్రంథాలయాలు, మండల ప్రధాన కార్యస్థానాలలో సమాచార విజ్ఞాన కేంద్రాలు (శాఖాగ్రంథాలయాలు) నిర్వహిస్తున్నాయి. మండల కేంద్రస్థానాలలోనే కాక ఇతర ప్రదేశాలలో కలిపి 138 శాఖా గ్రంథాలయాలు పనిచేస్తున్నాయి. ఇవే కాక 325 గ్రామీణ గ్రంథాలయాలు, 582 పుస్తక నిలయ కేంద్రాలు (Book Deposit Centres) జిల్లా గ్రంథాలయ సంస్థల ఆధ్వర్యంలో పనిచేస్తున్నాయి. సైకిల్, రిక్షా సంచార గ్రంథాలయాల ద్వారా పుస్తకాలను చదువరుల ఇండ్లకు చేరుస్తున్నారు. నగర గ్రంథాలయ సంస్థ రెండు పెద్ద మోటారు వాహనాల ద్వారా సంచార గ్రంథాలయాలను నడుపుతున్నది. మరొకటి కూడా కొత్తగా ప్రవేశ పెట్టబోతున్నారు. ఇవేకాక దాదాపు 2394 గ్రంథాలయాలు ప్రవేట్ యాజమాన్యాలకింద పని చేస్తున్నాయి. ఇవేకాక గ్రామపంచయతీలు, పురపాలక సంఘాలు, సహకార సంఘాలు కూడా గ్రంథాలయాలను నిర్వహిస్తున్నాయి. అవి పౌర గ్రంథాలయ శాఖ పరిధిలో లేవు.

ఇటీవల ప్రభుత్వం గ్రంథాలయాల ప్రాముఖ్యాన్ని గుర్తించి 674 శాఖా గ్రంథాలయాలను మంజూరు చేయడం అభినందనీయం. ఒక్కసారి ఇన్ని గ్రంథాలయాలను ప్రభుత్వం మంజూరు చేయడం ఇదే ప్రథమం అయితే ఈ అభివృద్ధి ఇంతటితో ఆగిపోక ఈ విస్తరణ కొనసాగుతూనే ఉండాలి. అందుకు కృషి చేయవలసిన బాధ్యత ప్రభుత్వంపైన ప్రజలపైన ఉంది. ఒకప్పుడు ప్రజల ఉద్యమంగా వెల్లివిరిసిన ఉద్యమమిది. కాని ఈనాడు ప్రజలలో గ్రంథాలయాలకు సాధ్యమైనంత ప్రజా సహాయమివ్వాలన్న భావం సన్నగిల్లుతున్నది. ప్రభుత్వం ఉద్యోగుల జీతభత్యాలకు జిల్లా గ్రంథాలయ సంస్థలకు గ్రాంట్ ఇస్తున్నప్పటికీ, జిల్లా గ్రంథాలయ సంస్థలు తమకు గ్రంథాలయ సెస్సు ద్వారా వస్తున్న రాబడి ద్వారా పుస్తకాలు, పత్రికలు మొదలయిన వాటికి ఖర్చు పెడుతున్నప్పటికీ కొన్ని గ్రామాలలో ప్రజలు కనీసం గ్రంథాలయానికి ఉచిత భవన వసతి కల్పించలేక పోతున్నారు. ప్రతి గ్రామంలో ఒక గ్రంథాలయం స్థాపించవలసిన అవసరమున్న ఈ తరుణంలో ఇది నిరుత్సాహకరంగా ఉన్నది. జిల్లా గ్రంథాలయ సంస్థలు నిధుల కొరత వల్ల తమ గ్రంథాలయాలకు తగిన భవనవసతి కల్పించలేకపోతోంది. తగినన్ని పత్రికలు, పుస్తకాలు, తదితర సామగ్రి సరఫరా చేయలేక పోతోంది. పౌరగ్రంథాలయాలకు చిన్నపిల్లల నుంచి వయోవృద్ధుల వరకు, నూతన అక్షరాస్యుల (Neo - literates) నుంచి వివిధ శాఖలలో నిపుణులైన పండితులకు, వివిధ వృత్తులను చేపట్టిన వ్యక్తులకు, వివిధ విషయములను అభ్యసిస్తున్న విద్యార్థులకు, పరిశోధకులకు (Research Scholars) విభిన్న అభిరుచులు కలవారికి కావలసిన విజ్ఞానదాయకమైన, వినోదదాయకమైన పుస్తకాలు అవసరం. అంతేకాక కొత్తగా ప్రచురితమైన మంచి పుస్తకాలు ఎప్పటి కప్పుడు గ్రంథాలయాలకు తెప్పించడానికి అవసరమైన ఏర్పాట్లు చేయడం చాలా అవసరము. ఈ గురుతర బాధ్యతను నిర్వహించేందుకు తగినంతగా నిధులు చేకూర్చవలసిన అవసరముంది.

మన గ్రంథాలయాలను ఆధునీకరణ చేయవలసిన ఆవశ్యకతకూడా ఉంది. నేటి గ్రంథాలయాలు కేవలం పుస్తక నిలయాలుగా ఉండటానికి వీలులేదు. ఈనాడు, ఫిల్ముల ద్వారా, శ్రవణదృశ్య యంత్రాల ద్వారా, వీడియో కాసెట్ల ద్వారా కూడా విజ్ఞానాన్నందించ వలసిన అవసరం ఏర్పడింది. అన్నింటికి మించి ఫోటో కాపీయింగ్ యంత్రాలు, ప్రొజెక్టర్లు, టి.వి.సెట్లు వి.సి.ఆర్స్, విడియో టేప్స్ అందించవలసిన అవసరమేర్పడింది. గ్రంథాలయాలను కంప్యూటరైజ్ చేయవలసిన అవసరమేర్పడింది. చదువరులకు గ్రంథాలయ సేవలు చురుకుగా అందించడానికి కంప్యూటర్లు అవసరం. ఈ రంగంలో ఎంతో అభివృద్ధి సాధించిన దేశాల స్థాయికి మనం ఎదుగ వలసిన అవసరమున్నది. ఎన్నో అరుదైన పుస్తకాలు రాష్ట్ర కేంద్ర గ్రంథాలయాలలో మరికొన్ని గ్రంథాలయాల్లోనూ కనబడతాయి. వీటన్నిటినీ మైక్రోఫిలిమ్‌ల ద్వారా సంరక్షించవలసిన అవసరం కూడా ఉంది. ఇందుకోసం నగర కేంద్ర గ్రంథాలయంలో ఒక కంప్యూటర్, మైక్రోఫిల్మ్ యూనిట్‌ను స్థాపించడానికి ప్రతిపాదనలు ప్రభుత్వ పరిశీలనలో ఉన్నాయి.

ముందు చూపుతో, చైతన్యవంతంగా సాగుతున్న ప్రభుత్వ పాలనలో, ప్రజల అకుంఠిత దీక్ష, సహకారాలతో, ఒకప్పుడు జాతిని చైతన్యవంతం చేసిన ఈ గ్రంథాలయోద్యమం పునరుజ్జీవించి వేగం పుంజుకొని, పరిపాలనా విధానంలో నిపుణులు సూచించిన మార్గదర్శక సూత్రాలను దృష్టిలో ఉంచుకొని మరింత ముందుకు సాగి జ్ఞానోపార్జనకు, మన సర్వతోముఖ వికాసానికి తోడ్పడగలదని ఆశిద్దాం.



# ఉన్నత విద్య – ఆంగ్లభాషాబోధన

ఐ.వి.చలపతిరావు
పూర్వ ఉపసంచాలకులు,
ఉన్నతవిద్యాశాఖ,
హైదరాబాద్.

ఆంగ్లభాషాబోధన ప్రస్తుత విద్యా విధానంలో చాలా ముఖ్యమైనది. మన దేశానికి స్వాతంత్ర్యం వచ్చినప్పటికీ మన నాయకులు ఉన్నత విద్యాస్థాయిలో ఆంగ్లభాషాబోధన ఆవశ్యకతను గుర్తించి, దానివల్ల కలిగే ప్రయోజనాలను అలక్ష్యం చేయక, నిపుణులైన విద్యావేత్తలతో కమిటీలను ఏర్పాటు చేసి, కళాశాలలలో బోధనా విధా.న్ని అంతకంతకు కట్టుదిట్టం చేస్తున్నారు. ప్రస్తుతం కళాశాలలలో ఆంగ్లం రెండో భాష. ప్రాంతీయభాష నిర్బంధంగా నేర్చుకోవలసిన మొదటి భాషగాను, ఐచ్ఛిక విషయాలను బోధించడానికి మాధ్యంగానూ కొనసాగుతున్నది. అధ్యాపకులు, విద్యార్థులు కేవలం తెలుగులో ఉన్న పాఠ్యగ్రంథాలనేగాక, ఆంగ్లంలో ఉన్న చాలా పుస్తకాలు చదివి, తెలుగు మాధ్యంలో రాయవలసి ఉన్నది. ఈ ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకొని ఆంగ్లాన్ని "లైబ్రరీభాష"గా నిర్ణయించి అధ్యయనాన్ని నిర్బంధం చేశారు.

ఈ పరిణామాలదృష్ట్యా, ఆంగ్లాన్ని బోధించే అధ్యాపకులపై గురుతరమైన బాధ్యత ఉంది. ఒకప్పుడు సాహిత్యాన్ని గురించి తెలుసుకోడానికి ఆంగ్లభాషను అభ్యసించేవారు. షేక్స్పియర్, మిల్టన్ మొదలయిన మహాకవుల గ్రంథాలను పాఠ్యప్రణాళికలో విధిగా ప్రవేశపెట్టేవారు. విద్యార్థులందరినీ ఆంగ్లసాహిత్యవేత్తలుగా తయారుచేయాలనే ప్రయత్నం ఉండేది. ఇప్పుడు బోధన విధానంలో గమనించవలసిన మొదటి మార్పు : ఆంగ్లభాషను విద్యార్థులకు బోధించవలసినది భాష కోసమేగాని సాహిత్యం కోసంగాదు. ఇది మౌలికమైన మార్పు. సాహిత్యం నేర్చుకోగూడదనే నిర్బంధం లేదు. అట్లా నేర్చుకోదలచినవారు ఆంగ్లాన్ని ఐచ్ఛికంగా (Optionals) తీసుకోవచ్చు.

మనకు జూనియర్ కళాశాల, డిగ్రీకళాశాల, విశ్వవిద్యాలయం- ఈ మూడుస్థాయిల్లో వర్తమాన విద్యావిధానం ఒదిగి ఉన్నది. విశ్వవిద్యాలయాల్లో స్నాతకోత్తర స్థాయిలోనే బోధన జరుగుతుంది. ఈ దశలో లోతులను స్పృశించి, విద్యార్థిని సాహిత్యంలో ప్రవీణుని, పరిపూర్ణుని కావించవచ్చు. ఈ దశలో, ఒకప్పుడు ఆంగ్ల సాహిత్యాన్ని మాత్రమే బోధించేవారు. ఇప్పుడు అనేక దేశాల సాహిత్యాలు బోధించవచ్చు. ఉదాహరణకు అమెరికన్‌సాహిత్యం, కెనెడియన్‌సాహిత్యం, ఆస్ట్రేలియన్‌సాహిత్యం, ఇండియన్‌రైటింగ్ ఇన్ ఇంగ్లీష్. ఈ ఆఖరి గ్రూపు తీసుకున్న విద్యార్థులు, భారతీయులు ఆంగ్లంలో చేసిన రచనలు చదవాలి. డాక్టరేట్ చేసేవారు తమ అభిమాన రచయితలపైనగాని, వారి రచనలపైన గాని పరిశోధనలు చేసి డిగ్రీలు పొందుతారు.

ఇప్పుడు మనం విశ్వవిద్యాలయ స్థాయి బోధన గురించిగాక కింది స్థాయికి చెందిన ఉన్నత విద్యా బోధనను గురించి ఆలోచిద్దాం.

ఇంటర్మీడియట్, డిగ్రీ కళాశాలలలో చదివే విద్యార్థులు నేర్చుకొనే విద్య చాలా మట్టుకు సాంఘిక ప్రయోజనాలకి సంబంధించినదైనా అయి ఉండాలి, లేదా ఉద్యోగ సంబంధమైనదైనా అయి ఉండాలి. విద్యార్థికి ఆ భావన ఉండటంలో ఆశ్చర్యం లేదు. నేటి వ్యవస్థా స్వరూపం ఇలా ఉన్నది. కేవలం, జ్ఞాన సంపాదనకు చదువుకొనేవారు తక్కువ సంఖ్యలో ఉంటారు. ఇంచుమించుగా అందరూ ఉద్యోగాలనిమిత్తం, లేదా ధన సంపాదనకోసం చదువుతారు. అలాంటి వారికి పనికి వచ్చే భాష దైనందిన అవసరాలకు (Functional use) తగినదై ఉండాలి. పరీక్షలలో ఉత్తీర్ణులైనవారు ఆంగ్లంలో ఉన్న పుస్తకాలు చదివి, అర్థం

చేసుకోగలవారై ఉండాలి. చదవడం, రాయడం, మాట్లాడడం వస్తే చాలు. పాండిత్యం అవసరం లేదు; సాహిత్యంతో పనిలేదు. అందుకని ఆంగ్లాన్ని భాషగా బోధిస్తే చాలు. సాహిత్యపు అగాథాలను స్పృశించనవసరం లేదు (English should be taught as a Language but not as a Literature).

విశ్వకవి రవీంద్రనాథ్ టాగూర్ చెప్పినట్లు: సాహిత్యాన్ని భాష నేర్పడానికి ఉపయోగిస్తే, అది ఖడ్గాన్ని గడ్డం గీసుకోటానికి ఉపయోగించినట్లుంటుంది. అది ఖడ్గాన్ని అవమానపరుస్తుంది; గడ్డానికి ప్రమాదకరమైనది. ("Using literature to teach language is like using a sword to shave the beard. It insults the sword and hurts the chin"). అందుకని ఆంగ్లాన్ని పరభాషగా నేర్పే నిపుణులు, సాహిత్యాన్ని దూరంగా ఉంచుతారు. భావ ప్రకటనకు, మానవ విలువలు తెలపడానికి మాత్రమే ఉపయోగించే కొద్దిపాటి సాహిత్యాన్ని వాడతారు. ఈ ఆధునిక ధోరణులు ఉన్నత విద్యా బోధన విధానంలో గోచరిస్తాయి.

ఈ సామాజిక నేపథ్యంలో ఈ స్థాయిలో ఉన్న విద్యార్థికి బోధించే విధానానికి, ఎం.ఏ. చదువుతున్న విద్యార్థికిగాని, లేదా సాహిత్యంలో పాండిత్యం సంపాదించదలచిన విద్యార్థికి గాని బోధించే పద్ధతికి చాలా వ్యత్యాసమున్నది. ప్రధాన విషయమేమిటంటే, పై స్థాయిల్లో ప్రతి విషయానికి ఒక తాత్వికమైన అగాధత, వైశాల్యం ఉంటాయి. కింది స్థాయిలో (ఇంటర్మీడియట్, బి.ఏ), భాషని ఏ విధంగా ఉపయోగించాలో బోధిస్తే చాలు. సులభమైన శైలిలో, చిన్న చిన్న వాక్యాలలో ఎలా రాయాలో, ఎలా మాట్లాడాలో నేర్పిస్తే సరిపోతుంది. క్లిష్టమైన వాక్యసరళి, చేంతాడు లాంటి పొడుగైన పేరాలు (Paragraphs) అక్కర్లేదు. నిజానికి, ఇలాంటివి ఎం.ఏ. తరగతి విద్యార్థులకు కూడా పనికిరావు. శైలికి నిర్వచనం: "సరైన స్థానంలో సరైన పదం" (The right word in the right place). సమాసాలు, పదగుంఫనం నిషిద్ధాలు. వాడుక భాషనే ప్రయోగించాలి.

ఆధునిక భాషాబోధన నిపుణులు ఏమంటారంటే: "ఒక విద్యార్థి చక్కగా రాయగలగాలంటే, అతని చేత మంచి గద్య రచనలు చదివించాలి" (Set good prose before him and he will set good prose before you). ఆధునికమైన భాషలో రచించిన వ్యాసాలు, కథలు, లేఖలు, నవలికలు చదువుతుంటే, గద్యరచన అభ్యసించవచ్చు. పాఠ్యపుస్తకాలను నిపుణుల సంఘం జాగ్రత్తగా పరిశీలించి, స్థాయికి తగ్గ భాష (పదజాలం) ఉంటేనే ఎంపిక చేయాలి. ఈ విషయంలో కచ్చితంగా వ్యవహరించాలి. పాతకాలంలో (అంటే, ఇంచుమించుగా పది సంవత్సరాల క్రితం వరకు) ఆంగ్లభాషను సంప్రదాయ వ్యాకరణ పద్ధతిలో బోధించేవారు. ఇప్పుడు "స్ట్రక్చర్" పద్ధతిలో బోధన జరగాలంటున్నారు. అయినప్పటికీ, ఒక సులభ వ్యాకరణాన్ని పాఠ్య గ్రంథంగా సిలబస్‌లో ఉంచుతున్నారు. అధ్యాపకులు ఈ విషయంలో తగిన జాగ్రత్తతో వ్యవహరించ వలసి ఉంటుంది.

ముఖ్యంగా గమనించవలసిన విషయం: ప్రస్తుతం "కాంపోజిషన్" పుస్తకాలు దిద్ది విద్యార్థులకు తగిన శిక్షణ ఇవ్వటం కళాశాలలలో జరగటం లేదు. ఇదివరకు, ట్యూటర్లు ఈ పని చేస్తూండేవారు. ఇప్పుడు లెక్చరర్లు ఈ పని చేయటంలేదని ఫిర్యాదులు వస్తున్నాయి. అందులో, యథార్థం లేకపోలేదు. విశ్వవిద్యాలయాలుగాని, ఇంటర్మీడియట్ బోర్డుగాని ఈ విషయంలో తగిన శ్రద్ధ చూపించటం లేదు. సైన్సు విద్యార్థులకు 'Practicals' (ప్రయోగాలు) ఎంతముఖ్యమో, భాషలు నేర్చుకునేవారికి Composition exercises (రాయించటం, దిద్దించటం) అంత ముఖ్యం. బహుశః ప్రమాణాలు దిగజారిపోవటానికి ఇది ముఖ్యమైన కారణం అయి ఉండాలి.

అధ్యాపకుడు ఒక గంట పాఠం చెప్పటానికి, కనీసం మూడుగంటలైనా కృషి చెయ్యాలి. వారు ఆలోచించాల్సింది, ఏం చెప్పటం అన్నది కాదు; ఇది కూడా అవసరమే. కాని ఎలా చెప్పాలో ఆలోచించటానికి ఎక్కువ సమయం తీసుకోవలసి ఉంటుంది. విషయ పరిజ్ఞానం (Content), బోధన

కౌశలం (Methodology). రెండూ అవసరమే. ఇంటర్మీడియట్, బి.ఏ. డిగ్రీ స్థాయిల్లో రెండోది ఎక్కువ అవసరం. విద్యార్థులకు, వారికి అర్థమయ్యే శైలిలో, పరిమిత పదజాలాన్ని ఉపయోగించి బోధించాలి. ఎలాంటి విషయమైనా, సులభంగా విద్యార్థి అవగాహనలోకి తేవటం ఉపాధ్యాయుని ప్రతిభపై ఆధారపడి ఉంటుంది. విషయాన్ని విషయంగా చెప్పి, విద్యార్థి అవగాహనశక్తిని పెంపొందించాలన్న తపన, ప్రయత్నం ఉండాలి. పరీక్షలో ఉత్తీర్ణులు కావటం ఒకటే. ఆశించిన కౌశలాలు (Skills) సంపాదించటం ఒకటి. ముఖ్యంగా గమనించవలసిన విషయం: నిత్యజీవితంలో పరిపాలన యంత్రాంగంలో తగిన భావవినిమయం (Effective Communication).

ఆయా తరగతులలో విద్యార్థికి, కావలసిన భాషా జ్ఞానాన్ని, పదజాలాన్ని దృష్టిలో పెట్టుకొని పాఠ్య పుస్తకాలను శ్రేణీకరించి (Grading), తాము ఉద్దేశించిన లక్ష్యాలను సాధించటానికి విపుల ప్రయత్నం ప్రస్తుతం జరుగుతూంది. కాని సంతృప్తికరంగాలేదు. అయినప్పటికీ, అధ్యాపకుడు తన బోధన పద్ధతితో ఈ లోపాల్ని సవరించగలడు; నిరాశ చెందవలసిన పనిలేదు. బోధన సరళితో నిర్దేశించిన లక్ష్యాలను అమలుపరచవచ్చు. అధ్యాపకునికి నేర్పు, శ్రద్ధ, చిత్తశుద్ధి ఉండాలి. ప్రస్తుత ప్రపంచానికి, వ్యవహారాలకు అనుకూలమైన భాష ఆధునిక ఆంగ్ల రచయితలు రాసిన వ్యాసాలలోను, నవలలలోనూ కనిపిస్తుంది. ఆంగ్ల రచయితలలో భారతీయులను కూడా చేర్చవచ్చు. మనవారు ఎందులోనూ తీసిపోరు. బేకన్ (Bacon), ఎడిసన్ (Addison), స్టీల్ (Steele), జాన్సన్ (Johnson) మొదలయిన రచయితల శైలిమన విద్యా ప్రయోజనాలకు పనికి రాదు.

గద్యంతోపాటు పద్యాలు కూడా పాఠ్యప్రణాళికలో చోటు చేసుకున్నాయి. రాయటానికి, మాట్లాడటానికి పద్యరచన ఉపయోగపడనప్పటికీ, దానికి విశిష్టమైన ప్రయోజనాలున్నాయి. ఆ ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకుని అధ్యాపకులు పాఠ్యాంశాలను బోధించాలి. కవిత్వం వల్ల ఉపయోగములు: 1. విద్యార్థుల అనుభవాన్ని విశాలపరచటం; ఆలోచనాశక్తిని పెంపొందించటం. భావనాశక్తిని (Imagination) విస్తృతపరచటం; మానవత్వం విలువలవైపు వారి దృష్టిని మళ్లించటం; హృదయానికి ఆహ్లాదాన్ని కలిగించటం. ఇంకా చాలా ప్రయోజనాలు సాధించవచ్చు.

అయితే, పద్యాలను ఎలా బోధించాలి? పద్యానికి కేవలం ప్రతిపదార్థం మాత్రమే చెప్పి తప్పించుకో గూడదు. అందులోని రసాన్ని అందించాలి. ఊరికే నీరసమైన పొడి వాక్యాలుగా చదివి వినిపిస్తే చాలదు. దానిలోని అర్థ సౌందర్యాన్ని, శిల్ప సంపదను, భావ గాంభీర్యాన్ని విశదీకరించి, ఆసక్తికరంగా బోధించి, విద్యార్థిలో సాహిత్యపు విలువలను, అవగాహన శక్తిని పెంపొందించాలి. అభిరుచి (Taste), నైతిక విలువలపట్ల ఆసక్తి (Moral Sensibility) కలిగించాలి. అధ్యాపకుడు భావుకుడు, నిజాయితీపరుడు, ప్రతిభావంతుడైతే, విద్యార్థుల్ని ప్రభావితుల్ని చెయ్యటమేగాక మంత్రముగ్ధుల్ని చెయ్యవచ్చు.

సాధారణంగా ఐదురకాల పద్యాలుంటాయి: 1. సంఘటనలను వర్ణించేవి (Narrative), 2. పాడటానికి, సంగీతపరమైన శబ్దసరళిలో ఉండేవి (Lyric), 3. వ్యంగ్య రచన (Satiric), 4. నీతిని బోధించేవి (Didactic), 5. మహా కావ్యాలు (Epic). ఇవి బోధించేటప్పుడు ముందుగా అర్థవంతంగా, ఆసక్తికరంగా చదవాలి. పద్యాలలో భాషలో అంతర్గతమైన భాష (Language within language) ఉంటుంది. చదవటంలోనే (నాటకీయంగా) అర్థం దానంతట అదే స్ఫురిస్తుంది. మంచి పద్యాలను (పంక్తులను) అనుకోకుండానే విద్యార్థులు కంఠస్థం చేస్తారు.

పద్య కవిత్వాన్ని కేవలం విశ్రాంతి సమయంలో వచ్చే వినోదంగానో లేదా పేజీల కొద్దీ అర్థ వివరణ చేయటంగానో పరిగణించగూడదు. (We have to reject both the method of relaxed enjoyment and the method of indiscriminate 'note-giving'). కవి ఉద్దేశాన్ని, భావాన్ని తెలుసుకోటానికి ప్రయత్నం చేయించాలి. ఆ ఉద్దేశాలను ఏ విధంగా, ఎంతవరకు సాధించాడో

(మిగతా 144 వ పేజీలో)

# ఇంటర్మీడియట్ విద్యాస్థాయిలో శాస్త్ర విద్యాబోధన - ఆధునీకరణ

డా॥ కె. భక్తవత్సలరావు
న్యూ నల్లకుంట
హైదరాబాదు.

సామాజిక మార్పు తీసుకురావడానికి విద్య ఒక ప్రత్యేకమైన పరికరం. ఇది మూడు విధాలుగా తోడ్పడుతుంది. 1) జ్ఞానాన్ని వెదజల్లుతుంది 2) శ్రద్ధ కలుగజేస్తుంది 3) విలువలను పెంపొందిస్తుంది. విద్యార్థులకు విద్య నేర్పడానికి అధ్యాపకుడు / ఉపాధ్యాయుడు ఎంతైనా అవసరం. ఎన్నెన్ని పరికరాలు వచ్చినా అతని విలువ ఎనలేనిది. ఎల్లకాలం అతని ప్రాముఖ్యం తగ్గదు. స్వాతంత్ర్యము వచ్చిన తరువాత విద్యా ప్రాంగణంలో కోకొల్లలుగా మార్పులు చేర్పులు జరుగుతునే వున్నాయి. కాని విద్యాబోధనా సామాగ్రి, పాఠ్యాంశము కొంత వరకు స్తబ్ధతనే సూచిస్తున్నాయి.

విద్యా కమీషన్ నివేదిక (1964-66)లో అధ్యాపకులకు శిక్షణ ఇవ్వాలని, నియత విద్యా విధానాన్ని పునఃపరిశీలించాలని, ట్యుటోరియల్ పనిని పెంపొందించాలని, ప్రయోగాత్మకంగా పాఠాన్ని బోధించాలని, చర్చలు, గోష్ఠుల ద్వారా విద్యావ్యాప్తి, పాఠ్యాంశ ప్రాంగణంలో జరగాలని వివరించబడింది. కేవలం కంఠోపాఠం చేయడాన్ని నిరోధించడం జరిగింది. స్వశక్తికి, ధారణ శక్తికి, విచక్షణ క్రియకు ప్రోత్సాహం ఇవ్వాలని చెప్పడం జరిగింది.

జాతీయ విద్యా విధానంలో (1986) పాఠశాలల / కళాశాలల అధ్యాపకులకు పునఃశ్చరణ తరగతులు విరివిగా నిర్వహించాలని చెప్పబడింది. ప్రతి ఐదు సంవత్సరాలకు ఒకసారి ప్రతి ఒక ఉపాధ్యాయుడు / అధ్యాపకుడు ఏదో విధంగా ఈ తరగతులలో పాల్గొనాలనేదే ధ్యేయం ఈ పథకంలో. ఒక మాదిరిగా ఇది ఒక విద్యా యజ్ఞం. దీనికి అధ్యాపకుడే సారథి. గీతా యజ్ఞానికి కృష్ణపరమాత్మ సారథి ఐతే విద్యాయజ్ఞానికి ఉపాధ్యాయుడే ఏకైక సారథి. ఈ సారథ్యానికి వనరులు చేకూర్చుట ప్రభుత్వ, ప్రజల విధి. విద్యార్జనలో నిమగ్నులై వుండటం విద్యార్థుల కర్తవ్యం.

జాతీయ విద్యావిధానంలో +2 స్థాయి (ఇంటర్మీడియట్)కు ప్రత్యేకమైన స్థానమున్నది. ఇది కౌమార (Adolescent) దశ, విద్యార్థి జీవితంలో. ఇక్కడ అతనికి పూర్తిగా ముద్దలు నోట్లో పెట్టడానికి వీలుండదు. తనంతట తాను పూర్తిగా విచక్షణ చేయలేడు. పాఠ్యాంశంలో ఎక్కువ మోతాదులో జ్ఞానాన్ని సేకరించ వలసి వుంటుంది. +2 స్థాయిలో వృత్తి విద్యా కోర్సులున్నాయి. వివిధ శాస్త్రాలలో నైపుణ్య విధానాలను వీలికాపరంగా బోధిస్తారు. +2 స్థాయిలో ఆప్షనల్ విషయాలలో బోధన జరుగుతుంది. ఇవిగాక ఇంగ్లీషు, ప్రాంతీయ భాషలలో ఏదైన ఒకటి చదువుకోవాల్సి వుంటుంది. వీటిలో ప్రావీణ్యత ఏర్పరచుకొంటే సాంకేతిక విద్యలో ప్రవేశమేర్పడుతుంది. వాటికి ఎంట్రన్స్ పరీక్షలున్నాయి. ఇదిగాక ఉన్నత విద్యవైపు కూడా మనుగడ సాగించవచ్చును. +2 స్థాయి మార్గాన్వేషణ దశ. జీవితాన్ని మలుపు ఏర్పరచే దశ. భవిష్యత్తును తీర్చిదిద్దే దశ. కొందరికి విద్య మానుకొనే దశకూడా. స్వంతంగా వృత్తిలో ప్రవేశించే దశకూడా. ఉన్నత విద్య ద్వారా ప్రవేశం కూడా. ఈ దశలో విద్యార్థికి శాస్త్రబోధన ఎలా జరుగుతోంది ? ఎలా జరగాలి ? ఆధునీకరణ ఎలా చేయాలి ? అనే విషయాలను పరిశీలిద్దాం.

అధ్యాపకుడు విషయం మీద ప్రావీణ్యత కలిగి ఉండాలి. బోధన చేసేటప్పుడు తేటతెల్లమూ చేసే స్వభావం కలిగి ఉండాలి. విద్యార్థులలో ఉత్సాహం కలుగజేయాలి. బోధన చేసేటప్పుడు చాతుర్యం,

చాకచక్యం, సమయస్ఫూర్తి, తగు మోతాదులో హాస్యం, మానవతా ధోరణి కలిగి ఉండాలి. రాధాకృష్ణన్ కమీషన్ నివేదికలో అధ్యాపకుడు సృజనాత్మక శక్తి కలిగి ఉండాలని, సమాజాన్ని మేల్కొలిపే వాడిగా ఉండాలని చెప్పడం జరిగింది. అయితే అధ్యాపకుడి వేతనాలు కూడా పరిరక్షించాలని పేర్కొనడం జరిగింది. శిక్షణ తరగతులలో పరస్పర అవగాహన, కొత్త ప్రయోగాల పరిశీలన, బోధనా సామగ్రి విశ్లేషణ, అన్వేషణా మార్గాల సంశ్లేషణ, మూల్యాంకన పద్ధతులను కూడా అధ్యాపకులు నెమరు వేసుకొంటూ వుండాలి. అధ్యాపకునికి కావలసినవి పటం (1)లో సూచించ బడ్డాయి.

+2 స్థాయిలో ఇదివరలో చెప్పినట్లు వివిధ విషయాలలో ఏవైన మూడింటిని ఎంపిక చేయాల్సి వుంటుంది. ప్రతి విషయం సబ్జెక్ట్ లో ఎన్నో అంశాలుంటాయి. ప్రతి అంశంలో ఎన్నో టాపిక్స్ శీర్షికలు ఉంటాయి. నిర్ణీత సమయంలో పూర్తి చేయాల్సి వుంటుంది. సాధారణంగా ఒక్కొక్క శీర్షికకు 50 నిమిషాలు పడ్తుంది. ఒక్క అంశంలో ఉన్న శీర్షికలు ఒక నెలలో పూర్తి చేయవచ్చును. ప్రతి విషయం సబ్జెక్ట్ టర్మ్‌వైజ్‌గా ఖండికలుగా విభజించబడి వుంటుంది.

బోధనా విధానంలో చెప్పుకోదగ్గ మార్పులేమి రాలేదు. ప్రజాస్వామ్య పద్ధతిలో తరగతులలో ప్రవేశాన్ని సంఖ్యను నిషేధించలేము. మనదసలే ఉన్నత విద్యలో వెనుకబడిన దేశం. అర్హతగల వయస్సు పరిధిలో కేవలం 4.8% మాత్రమే మనదేశంలో ఉన్నత విద్యా ప్రాంగణాల్లో విద్య అభ్యసిస్తున్నారు. కాని జపానులో 30%, సంయుక్త అమెరికా రాష్ట్రాలలో 55%, రష్యాలో 18% శాతం విద్యార్థులు (అర్హతగల వయస్సు పరిధిలో) ఉన్నత విద్య అభ్యాసంలో నిమగ్నులై వున్నారు.

బోధనా పద్ధతులెన్నో వున్నాయి. 1) ఉపన్యాసమార్గము (Lecture method) 2) చర్చారీతి (Discussion method) 3) టుటోరియల్ పద్ధతి 4) క్విజ్ పద్ధతి 5) ప్రయోగాత్మక మార్గం (Demonstration method). మన దేశంలో, ఇతర అభివృద్ధి దేశాలలో మాదిరిగానే ఉపన్యాస పద్ధతినే అనుసరిస్తున్నారు. ప్రయోగశాలలో పరిమితి సంఖ్యలో విద్యార్థులకు ప్రవేశం లభిస్తుంది. ఎందుకంటే ప్రయోగ సామగ్రి అందరికి అందజేయడం కష్టం కదా ! విషయాంశ లేక శీర్షిక బోధన ఈ పద్ధతిలో ఏకధాటిగా సాగుతుంది. అధ్యాపకుడి పాత్రయే ముఖ్యం. అంశంపై వివరాల సేకరణ, వివరాల విస్తరణ, వివరాల బోధన, వివరాలపై అవగాహన కలుగ జేయడం, కూలంకషంగా ప్రశ్నావళి ఇవ్వడం అధ్యాపకుడు ఈ పద్ధతిలో చేసే పనులు. మనస్థైర్యంతో, విచక్షణతో, శ్రద్ధతో పనిచేస్తేనే గాని బోధన ముందుకు సాగదు. ఏదైన కొంటె ప్రశ్న వేస్తే మనస్సు వికలమై గాడి తప్పవచ్చును అధ్యాపకుడు. సహనం, ఓర్పు, సమయానుకూలంగా సర్ది చెప్పడం, మందలించడం వంటి స్వభావాలు కలిగి ఉండాలి.

హెర్‌బర్ట్ పాఠ్యాంశం బోధించేటప్పుడు ఈ విధానాలను అవలభించాలని సూచించాడు.

1) ప్రవేశిక
2) విడమర్చిచెప్పడం
3) విశ్లేషించిబోధనచేయడం
4) పునఃపరిశీలనచేయడం

ఈ విద్యా యుగంలో తరగతులలో పాఠ్యాంశ బోధనలోని ముఖ్యఘట్టాలివి.

1) లక్ష్యం
2) సంక్షిప్తంగా
3) వివరాలు
4) అభ్యాసాలు
5) పదావళి
6) జ్ఞాపికలు/సూచికలు

సార్వత్రిక విద్యాలయాలన్ని ప్రతి శాస్త్రాన్ని ఖండికల కింద విభజిస్తున్నాయి. ప్రతి ఖండిక కింద పాఠాలుంటాయి. ఆ పాఠాలన్నీ పై సూచించిన పద్ధతులలో తయారు చేయబడుతున్నాయి.

ఉదాహరణకు మలేరియల్ పరాన్నజీవి జీవితచక్రం +2 స్థాయిలో బోధించేటప్పుడు లక్ష్యాలు ఈ మాదిరిగా వర్ణించవచ్చు.

1) మలేరియల్ పరాన్నజీవి - జీవితచక్రం
2) కలిగించేవ్యాధి
3) మలేరియా అదుపులో వుంచే మార్గాలు

సంక్షిప్తంగా ఉపన్యాస పద్ధతిలో చెప్పవలసిన అంశాలివి.

1) వర్గీకరణ
2) సంక్షిప్త జీవిత చరిత్ర
3) మలేరియల్ పరాన్నజీవి రకాలు
4) మానవునిలో, దోమలో మలేరియల్ పరాన్నజీవి జీవితచక్రాలు.
5) కలిగించే పరిణామాలు
6) వ్యాధి నిర్మూలన
7) వ్యాధి చికిత్స విధానాలు

ఈపై అంశాలను రెండు మూడు నిర్ణీత తరగతి సమయాలలో వివరంగా చెప్పాల్సి వుంటుంది. రేఖా చిత్రాలు, సంఖ్యల వివరణ కూడా చేయవచ్చు. అంతర్జాతీయంగా, జాతీయంగా మలేరియా వ్యాధి స్వరూపాన్ని తెలుపవచ్చు. ఈ వివరాలు అధ్యాపకుడు చెప్పేటప్పుడు సంక్షిప్త ప్రశ్నలు, కుశాగ్రబుద్ధి ప్రశ్నలను తయారు చేసి విద్యార్థులను పరీక్ష చేయవచ్చును. ఇలా చేయడం వలన పోటీ పరీక్షలలో నెగ్గే అవకాశాలెక్కువ. అభ్యాసాలను తయారు చేసేటప్పుడు రెండు రకాలుగా చేయాలి 1) ఎంపిక (Selection Type) 2) సేకరణ (Supply type). సేకరణ వాటిలో పొడుగాటివి, పొట్టివి ప్రశ్నలను చేర్చవచ్చు. ఎంపిక వాటిలో అవును / కాదు, తప్పు / ఒప్పు, ఖాళీలను పూర్తి చేయడం; నాల్గింటిలో ఏదైన సరిఅయిన ఒక సమాధానాన్ని ఎంపిక చేయడం, సమస్యలన్నింటిలోంచి సరిఅయిన సమాధానాన్ని ఎన్నుకోవడం జరుగుతుంది. కుశాగ్రబుద్ధి ప్రశ్నల ఉత్పత్తి, సాధన చాలా క్లిష్టమైనది. దానికి అధ్యాపకుడికి మంచి శిక్షణ, శ్రద్ధ, అవగాహన ఉండాలి. బ్లూమ్స్ సాంకేతిక పంథాలో పైన పేర్కొన్న ప్రశ్నావళిని అధ్యాపకుడు తయారు చేసుకోవాలి.

ఈపై అంశంపై ఉపన్యాసం ఇస్తున్నప్పుడు సాంకేతిక పదజాలం ఉపయోగించినది ఒకేసారి చెప్తే విద్యార్థులు జ్ఞాపకం వుంచుకోగలుగుతారు. అధ్యాపకుడు పాఠ్యాంశాన్ని పూర్తి చేసేంతరువాత కోరిన విద్యార్థులకు సంప్రదించ వలసిన గ్రంథాల సూచిక ఇస్తే ఉత్తమం.

బోధనా వనరుల ఉపయోగం, సామగ్రి సమకూర్చు కొనడం ఎలాగ ? అనే సమస్య ఉంది. దృశ్య శ్రవణ బోధనా వనరులలో ముఖ్యమైనది నల్లబల్ల (బ్లాక్‌బోర్డు) ఉపయోగం. అదికూడా సంపూర్ణ ఉపయోగం చేయాలి. బ్లాక్‌బోర్డును ఉపయోగించేటప్పుడు ఈ క్రింది అంశాలను దృష్టిలో ఉంచుకోవాలి.

1) దగ్గరదగ్గర, ఒకదానిపైఒకటి అక్షర సముదాయాన్ని వ్రాయరాదు.
2) బోధనా విషయాలను సంక్షిప్తంగా కుదురుగా వ్రాయాలి
3) ఎండపొడ (Glare) పడకుండా చూసుకోవాలి.
4) అక్షరాలు పెద్దవి ఉపయోగించాలి.
5) రంగురంగుల సుద్దముక్కలను వాడాలి.

ఈ సుద్దముక్కలు వాడేటప్పుడు సౌందర్యం కాదు ముఖ్యం, సాంకేతికంగా ఉండాలి. ఉదా: ఆకులు ఆకుపచ్చ రంగులో, రక్తం ఎరుపు రంగులో చూపాలి. తరగతికి పోయే ముందు బొమ్మలు, పటములు, పట్టికలు, రోలింగ్ బోర్డ్సపై వేసుకోవాలి. పేయింటింగ్స్, బట్టమీద వేసి ప్రదర్శించవచ్చును. ఫ్లానల్ బోర్డ్స్, డిస్ప్లేలు, కట్టింగ్స్ కూడా ఆధునిక బోధనా వనరులే. ఉదా: మలేరియా పరాన్నజీవి జీవిత చక్రం చెప్పేటప్పుడు W.H.O. జర్నల్స్, బ్రోష్యర్సులోని కట్టింగ్స్ లభిస్తే ప్రదర్శన, మాదిరిగా పెట్టవచ్చు. జ్ఞానోదయం కలుగుతుంది విద్యా ప్రాంగణాలలో విద్యార్థులకు.

ప్రయోగశాలలో విద్యార్థులు అభ్యసించేటపడు మాడల్స్ (ప్లాస్టర్ ఆఫ్ పారిస్‌తో తయారు చేసినవి) వివిధ అంశాకు సంబంధించినవి పరిశీలన చేయాలి. పరీక్షలలో వివిధ భాగాలను గుర్తించ వలసి వుంటుంది. జీవ శాస్త్రంలో విచ్ఛేదన చేసేటప్పుడు వివిధ మండలాల అవగాహనకు వైర్‌మాడల్స్ తయారు చేసుకోవాలి. ఇక్కడ అధ్యాపకుని సృజనాత్మక శక్తి తోడ్పడుతుంది.

ప్రసిద్ధికెక్కిన శాస్త్రజ్ఞుల సంవత్సరాల పరిశోధన ఫలితాలే ఈ సంక్షిప్త జీవిత చక్రాలు, ఈ పరాన్నజీవులవి (ఉదా: మలేరియా పరాన్నజీవి). అధ్యాపకుడు చారిత్రకంగా కొన్ని ఘట్టాలను వినువించవచ్చును. ఉదా: "మైక్రోబ్ హంటర్స్" పాల్‌డికుర్ఫ్ వ్రాసిన దానిలో మలేరియా గురించి వ్రాసిన పరిశోధనలున్నాయి.

ఈపై సామాగ్రియేకాక ఆడియోటేప్స్ సేకరించి టేప్‌రికార్డర్‌పై వేసి రిలే చేయవచ్చు. నూతన పద్ధతులలో విడియోటేప్‌ను టి.వి.పై ప్రదర్శించవచ్చు. ఫిల్మ్ ప్రొజక్టరు గనుక వుంటే మలేరియా ఫిల్మ్‌ను ప్రదర్శింపవచ్చును.

మన రాష్ట్రంలో సార్వత్రిక ప్రవేశ కళాశాలలు ఏర్పాటు చేయాలని సంకల్పముంది. +2 స్థాయిలో ఇంటర్మీడియట్ బోర్డువారు ఆర్ట్స్, కామర్స్ విభాగాలలో విడియో కాసెట్స్‌లో పాఠాలను రికార్డు చేసారు. టి.వి., వి.సి.ఆర్ గనుక ఖరీదు చేస్తే ఆ పాఠాలను వేసి విద్యార్థులకు చూపవచ్చును. ప్రభుత్వ స్థాయిలో +2 stageలో ఈ ప్రవేశ కళాశాలలో ఈ వసతులు కలిగించబోవుచున్నారు.

భాషా శాస్త్రం బోధించాలంటే భాషా ప్రయోగశాలలో సాంకేతికంగా తయారు చేసిన పాఠాలను విడియో చేస్తారు. కంప్యూటర్ల మీద డేటా (సేకరించిన వివరాలు) సమకూరుస్తే చక్కగా విద్యార్థులకు బోధన జరుగవచ్చును.

విద్యార్థులచే ప్రయోగాలు చేయించడం కూడా శాస్త్ర బోధనలో ఒక విధమైన ఆధునీకరణమే. ఉదా: మొక్కలు వెలుతురు వైపే పెరుగుతాయి అనే అంశంపై చీకటి పెట్టెలో విత్తనం నాటితే ఏమౌతుంది ? మొక్క వుంచితే అది పెరుగుతుందా ? లేదా ? పరిశీలించవచ్చు. వివిధ రంగుల కాగితాలను, మొక్కలను ఖాళీ పాలప్యాకెట్లలో వుంచి పెరుగుదల విధానాన్ని పరిశీలించవచ్చును.

గ్రామీణ ప్రాంతాలలో పొలాలు, సేద్యం, ధాన్యం సేకరణ, కోతలు, వగైరా వ్యవసాయ శాస్త్రం బోధనా సామాగ్రి. ఆధునిక పద్ధతులలో వ్యవసాయం సాగించడం ఫిల్మ్ ద్వారా +2 స్థాయిలో వృత్తి విద్యలో బోధిస్తే చిరస్మరణీయంగా వుంటుంది.

+2 స్థాయిలో కొన్ని క్లిష్టమైన శాస్త్రపరమైన అంశాలను బోధించేటప్పుడు దృశ్య, శ్రవణ సామాగ్రి పరికరాలు, వనరులు అతి ముఖ్యం. ఉదా : వన్య మృగ సంరక్షణ పాఠం చెప్పేటప్పుడు వన్యజీవుల విడియోఫిల్మ్ చూపిస్తే మనస్సును ఆకట్టుకొంటుంది. కణవిభజన ఎలా జరుగుతుంది ? క్షయకరణ విభజన విభిన్న దశలు పరిశీలించాలంటే ఎంత ఉపన్యాసము విన్నా ఫిల్మ్, విడియో చూస్తేనే కాని అర్థం కాదు. కాని ఎన్ని కళాశాలలో ఈ వసతులున్నాయి ? అనేది ఒక సమస్య మనకు. ఈ విషయంలో కాలేజి అధ్యాపకుడు నాల్గు గోడల మధ్య నుండక ప్రజల మధ్య వుండి, ఊరి పెద్దల సహకారంతో, ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థలతో సమన్వయం ఏర్పరచుకొని బోధనా సామగ్రి చేకూర్చుకోవాలి.

మనదేశంలో +2 స్థాయి విశ్వవిద్యాలయ పర్యవేక్షణలో లేదు. కొన్ని రాష్ట్రాలలో మండలులున్నాయి. కొన్ని రాష్ట్రాలలో సెకండరీ బోర్డుల కింద ఈ విద్య సాగుతున్నది. ఈ స్థాయిలో విద్యార్థుల సంఖ్య విపరీతం. ఉదా : ఆంధ్రప్రదేశ్‌లో 4.5 లక్షల విద్యార్థులు ఈ స్థాయిలో వున్నారు. ఇంటర్మీడియట్ విద్యామండలి పాఠ్యాంశాల బోధనా బాధ్యతను నిర్వహిస్తునది. పర్యవేక్షణాధికారులున్నారు. పరీక్షలు నిర్వహించే కార్యక్రమమే ప్రామాణికంగా తయారైంది. ప్రతిఏటా 30-35% విద్యార్థులు కృతార్థులవుతున్నారు. బోధనా విభాగంలో దృశ్య శ్రవణ పాఠాలు (ఆర్ట్స్, కామర్స్) సార్వత్రిక ప్రవేశ కళాశాలలు కొరకు తయారు చేస్తున్నారు. ఈ నిమిత్తమై ప్రయోగశాల, స్టూడియో కూడా నిర్మించు కొంటున్నారు. ఇది ఒక ఆదర్శ కేంద్రంగా ఏర్పడవచ్చును.

జాతీయ విద్యా విధానం (1986)లో రెండు పంథాలలో ఉద్యమంగా విద్య సాగాలి +2 స్థాయిలో : 1) సాధారణ విద్య 2) వృత్తి విద్య. సాధారణ విద్యలో సంఖ్య మాదిరి పెరుగుదల వృత్తి విద్యలో తేవాలని సంకల్పం వుంది. 1990 నాటికి వృత్తివిద్యలో 10% విద్యార్థుల ప్రవేశం ఉండాలని సూచనలున్నాయి. భారీ ఎత్తున మానవ వనరుల మంత్రిత్వ శాఖ, వృత్తి విద్యా వ్యాప్తికి సన్నాహాలు చేస్తోంది. ఫలితాలు కూడా

త్వరలో ఆశించవచ్చు. సాధారణ విద్యలో ఇంగ్లీషు, ప్రాంతీయ భాషతో పాటు ఆధునిక దృక్పథం, మానవతా విలువల పెంపుదలకు, సంస్కృతి గురించి సాధారణ విద్య (General Studies) అవసరమని విద్యావేత్తలభిప్రాయం. జీవనంలో సంస్కృతి ప్రభావం ఎక్కువ. సాధారణంగా జీవితంలో ఎన్నో ఘట్టాల్లో సహనం కోల్పోయి సమస్యలకు గురి అవుతున్నారు విద్యార్థి లోకం. విద్యార్థుల అలజడులకు మూలకారణం సహనం కోల్పోవడం, సమయానికి అధ్యాపకుని సలహాలు లేకపోవడం, అదుపు తప్పడం, పోలీసు బలగంతో అదుపులో తీసుకోవడం.

జాతీయ సమైక్యత భావము ఏర్పరచాలంటే సర్వమతముల నుంచి చక్కని బోధనలను సేకరించి, క్రోడీకరించి కథలు, మాటలు, సంభాషణలు, డ్రామాలు, టేప్సు ద్వారా పాఠ్యాంశాలలో ప్రవేశపెట్టాలి. ఆధునిక పరికరాల ఉపయోగం విరివిగా జరగాలి. మన స్వాతంత్ర్య సముపార్జనకు పాల్గొన్న వీరుల గాథలను విద్యార్థి లోకానికి చాటాలి. పద్యాల ద్వారా, కావ్యాల ద్వారా, నాటకాల ద్వారా, టి.వి. ద్వారా తగు మోతాదులో +2 స్థాయిలో తయారు చేసుకోవడానికి ఎంతో అవకాశముంది. అధ్యాపకలోకం ముందంజ వేయాలి. వేతన సమస్యలు పరిష్కరించుకొంటూ బోధనా పద్ధతుల ఆధునీకరణకు తోడ్పడాలి. ప్రభుత్వ సహాయంతోపాటు స్వచ్ఛంద సంస్థల సహాయం అవసరం. దీనికి సమన్వయం అవసరం. ఉదా: ECIL కు సమీపంలో వున్న +2 స్థాయి విద్యాలయ నిర్వాహకులు, ECIL నిర్వాహకులతో సంప్రదించి కొంతవరకు పరికరాలను ఏర్పరచుకోవచ్చు. విద్యా సలహామండలి, సంరక్షక సంఘాల సమావేశాలలో విద్యా సంస్థల అధికారులు, అధ్యాపకులు సంప్రదిస్తే సత్ఫలితాలు లభిస్తాయి.

ఆధునిక యుగంలో సమాచారానికి అతి ప్రాముఖ్యతనిచ్చారు. అధ్యాపకుడు సమాచార సేకరణ కర్తగా వ్యవహరించాలి. జ్ఞానం / సమాచారం / విద్యావ్యాప్తి దేశ శ్రేయస్సుకు కారకాలు. దేశ అభివృద్ధి దేశయువత, విద్యావ్యాప్తిపై ఆధారపడి వుంది.

రెడ్డెన్ అంటాడు "విద్య అనేది పరిపక్వత కలిగియున్న మానవుని ప్రభావం. ఇది పరిపక్వత చెందని వాడి మీద పడాలి, అభివృద్ధి చెందాలి. ఈ ప్రభావం బోధనద్వారా, క్రమశిక్షణ ద్వారా భౌతికంగా, మానసికంగా, సామాజికంగా గ్రహించే వ్యక్తిలో పడాలి, అభివృద్ధి చెందాలి. సామాజికి చైతన్యానికి విద్యావ్యాప్తియే ప్రథమ సోపానం. ప్రకృతి అవగాహనకు విద్యయే గీటురాయి".

ఆధునిక వనరులతో విద్యా బోధన సాగించాలంటే అధ్యాపకులు విరివిగా సమాచార సేకరణతో పాటు పునఃశ్చరణ తరగతులకు హాజరు కావాలి. జవాబుదారి పంథాల అమలుకు తోడ్పడాలి. విరివిగా గ్రంథాలయాలను సందర్శించాలి. తన విషయ బోధనలో సామర్థ్యం పెంపొందించు కోవాలి. ఈ అంశాలను పటం2లో సూచించబడ్డాయి.

విద్యకు విలువైన వనరు అధ్యాపకుడు. మార్గాన్వేషణకు ఆధునీకరణ - బోధనా పద్ధతులలో ఒక ప్రత్యేకమైన ప్రక్రియ. బోధనా మార్గాలను, బోధనా శాస్త్రంతో ఇనుమడింప చేసి, ఒక నేసిన వస్త్రంలాగా విద్యార్థుల ముందుంచే ప్రయత్నంలో నిమగ్నుడై వుండాలి అధ్యాపకుడు.

రవీంద్రనాథ్ టాగూర్ ఇలా అన్నారు:

*"ఒక అధ్యాపకుడు తను అభ్యసించేంత వరకు బోధించ కలుగుతాడు. వెలుగుతున్న దీపమే ఇంకో దీపాన్ని వెలిగించ కలుగుతుంది".*

సంప్రదించిన గ్రంథాలు :

1. *College Teaching* : Brown & Thornton
2. *Methods of institution in Higher Education* : Collegiate cell publication
3. *Role & Responsibility of Teacher* : U.G.C.




జిజ్ఞాసువు
స్మృతిమాన్
ధృతిమాన్
కృతి
అధ్యాపకుడికి కావలసినవి
నమ్రత
శుచి
ఉత్సాహి
వర్చస్వి
వాచస్వి

పటం-1


అధ్యాపకుల శిక్షణా కార్యక్రమాలలోని అంశాలు
ప్రయోగాత్మకశక్తి
జిజ్ఞాస
బోధనావనరులు
గతస్మృతుల సంశ్లేషణ
ప్రయోగానికి యోచించిన పద్ధతులు / మార్గాలు
సృజనాత్మకశక్తి
నూతన ప్రయోగాలు
మూల్యాంకన పంథాలు
అవగాహన
బోధనా పద్ధతులలో మార్పులు
విద్యాసంస్థలలో బోధన సాగించడం

పటం-2

# ఇంటర్మీడియట్‌స్థాయిలో దృశ్య, శ్రవణ విద్యాబోధనావశ్యకత




డా. కె. సంపత్ నరసింహాచారి,
ఎ. రాజేంద్రబాబు,
ఇంటర్మీడియట్ విద్యామండలి,
ఆంధ్రప్రదేశ్.

నేడు దేశం మొత్తం మీద దాదాపు ఏడు లక్షల పాఠశాలలు ఉన్నాయని ఒక అంచనా. స్వాతంత్ర్యం రాకముందు ఉన్న పాఠశాలల సంఖ్య కంటె ఇది నాలుగు రెట్లు ఎక్కువ. స్కూళ్లో చేరే వయస్సు ఉన్న పిల్లల సంఖ్యను అలా వుంచి, చదువుకోవాలనుకుంటున్న పిల్లల సంఖ్యకు కూడా ఈ స్కూళ్ళు సరిపోవడంలేదన్నది నిర్వివాదాంశం. "చదువు" కోసం అవకాశాలు అందరికీ కల్పించడం నేటి సామాజిక అవసరాలలో ముఖ్యమైనది. పెరుగుతున్న విజ్ఞానాన్ని ఆకళింపు చేసుకోవటానికి వ్యక్తికిగాని, సమాజానికిగాని కావల్సింది "విద్య".

సామాన్య ప్రజానీకానికి చదువు అందుబాటులో ఉండాలన్న నినాదం సహజంగానే అక్షరాస్యత శాతాన్ని పెంచింది. సమాజంలో ఏ పరిణామమైన అభివృద్ధికరమయిన మార్పుకు లోనవుతుంది. దేశానికి స్వాతంత్ర్యం సిద్ధించిన తర్వాత పెరిగిన ఈ అక్షరాస్యత ఉన్నత విద్యారంగంలో కొత్తమార్పులు తీసుకురావల్సిన అవసరాన్ని కలిగించింది. ఉన్నత విద్యను ఆశిస్తున్న వారి సంఖ్య ఈ మధ్యకాలంలో గణనీయంగా పెరిగింది. వారందరికి అవకాశాలు ఎలా కల్పించాలి అన్నది నేడు విద్యావేత్తలను వేధిస్తున్న సమస్య.

నేడు మన దేశంలో దాదాపు 4000 కోట్ల రూపాయలకు పైగా విద్యారంగంపై ఖర్చు అవుతున్నది. పెరుగుతున్న విద్యావసరాలను చూస్తే ఇంకో 4000 కోట్ల రూపాయలయినా సరిపోవు. ఈ పరిస్థితిలో విజ్ఞానశాస్త్రంలో వచ్చిన ఎన్నో విప్లవాలు విద్యారంగానికి బాసటగా నిల్చాయి.

ఉన్నత విద్యలో ఈ సంక్లిష్ట పరిస్థితి ఇంటర్మీడియట్ విద్యకు కూడా పాకింది. నిజానికి ఇంటర్మీడియట్ స్థాయిలోనే ఈ సమస్య తీవ్రంగా ఉంది. ఏ చిన్న ఉద్యోగానికైనా కనీసం ఇంటర్ పాసయి వుండాలన్న నిబంధన ఈ సమస్యకు ఒక కారణం కావచ్చు. ఏ ఉన్నత విద్యాస్థాయికైనా, వృత్తి విద్యకైనా ఇంటర్మీడియట్ కోర్సు మొదటి మెట్టు. ఉన్నత పాఠశాలలనుండి ఉత్తీర్ణులయి వస్తున్న విద్యార్థులను, సదుపాయాలు తగినంతగా లేనందువల్ల, సాంప్రదాయిక జూనియర్ కళాశాలలు ఇముడ్చుకోలేక పోతున్నాయి. ఈ కారణంగా అర్హత ఉండికూడా అడ్మిషన్ పొందలేక పోయిన యువ విద్యార్థులకు కారణాంతరాలవల్ల చదువు కొనసాగించలేక కొంతకాలం తర్వాత రెగ్యులర్ (పూర్తికాలం) గా చదువు సాగించాలి అనుకునే ఔత్సాహిక విద్యార్థులకు అవకాశాలు కల్పించాల్సిన అవసరం ఏర్పడింది.

ప్రపంచంలోని ఇతర దేశాలలోకూడా అనేక ఇతర కారణాలవల్ల ఉన్నత విద్యను సృజనాత్మకమయిన రీతిలో విస్తరించాల్సిన అవసరం ఏర్పడింది. ఈ పరిస్థితిని పరిష్కరించుకునేందుకు ఆయాదేశాలు తమ తమ పరిధులకు లోబడి విభిన్న మార్గాలు ఎన్నుకున్నాయి.

సార్వత్రిక విద్య (Open Education) అన్న తలంపు ఈ సమస్యకు తక్షణ పరిష్కారంగా చాలామంది విద్యావేత్తలకు తోచింది. మొదట కరస్పాండెన్సు కోర్సులద్వారా విద్యాబోధ చెయ్యడం విస్తారంగా అమలులో వుండింది. 1984 వరకల్లా భారతదేశంలో 28 యూనివర్సిటీలు కరస్పాండెన్సు విద్యను చేపట్టి దాదాపు 3 లక్షల మంది విద్యార్థులకు డిగ్రీ మరియు పోస్టుగ్రాడ్యుయేట్ స్థాయిలలో అడ్మిషన్ ఇవ్వగలిగాయి. ఈ సంఖ్య సాంప్రదాయిక బోధనా పద్ధతులకు స్వస్తి చెప్పాల్సిన అవసరాన్ని తెలియజేస్తున్నది. ఎలక్ట్రానిక్స్ రంగంలో వచ్చిన

విప్లవాత్మకమైన మార్పులవల్ల నేడు బోధనా మార్గాలు చాలా రకాలుగా అభివృద్ధి చెందాయి. ఈ మార్గాలను ఒక్కసారి గమనిద్దాం:

### 1. రేడియో, టెలివిజన్‌లు :

అభివృద్ధి చెందిన దేశాలలో మాత్రమేకాక వర్ధమానదేశాలలో కూడా రేడియో, టెలివిజన్‌లు విద్యావసరాల కొరకు విస్తారంగా ఉపయోగ పడుతున్నాయి. కాని, రేడియో, టి.వి. ప్రసారాలు వాటి పరిధుల్లోనే విద్యార్థులకు ఉపయోగపడతాయి. విద్యార్థి తన ఇంటి దగ్గరే కూర్చుని చదువు నేర్చుకునే వీలుంటుంది. కాని, తనకు వీలున్న సమయంలో మాత్రం కాదు. తనకు వీలు లేని సమయాల్లో ఆపుచేయడానికో, . తనకు అర్థంకానపుడు మళ్ళీ వినడానికి వీలుగా ఈ ప్రసారాలు వుండవు. పోగా, తరగతిలో లభ్యమయ్యే చర్చాపద్ధతికి ఇది పూర్తిగా పనికిరాదు. విద్యార్థి తన అనుమానాలను రేడియో ద్వారానో,టి.వి.ద్వారానో తీర్చుకోలేడు.

రేడియో, టి.వి.లలో విద్యార్థుల కోసం కేటాయించే ప్రసారవేళలు ఏమాత్రం అనుకూలంగా లేవన్న విమర్శ బలంగా ఉంది. విద్యార్థులకు అనుకూలంగా వుండే సమయాల్లో ప్రసారం చెయ్యాలంటే అభివృద్ధి చెందిన దేశాలలో వలె రేడియో టెలివిజన్లలో ప్రత్యేకమయిన ఛానల్స్ ఏర్పాటు చేసుకోవాలి. మనదేశంలో అది తలకు మించిన భారం అవుతుంది.

### 2. ఆడియో - క్యాసెట్టులు (శ్రవణపాఠాలు)

రేడియో ప్రసారాలకు ప్రత్యామ్నాయంగా ఆడియో క్యాసెట్టులు ఈ మధ్య విరివిగా వాడబడుతున్నాయి. పాఠ్య ప్రణాళికను వీటిలోకి సులభంగా జొప్పించవచ్చు. విద్యార్థి మళ్ళీ మళ్ళీ వినడానికి, అర్థంకాని చోట ఆపివేసి, అర్థంకాని ఆ భాగాన్ని తిరిగి వినడానికి వీలుగా ఉంటుంది. ఈ రోజుల్లో టేప్ రికార్డర్ దిగువ, మధ్య తరగతి కుటుంబాలకు కూడా అందుబాటులోనున్న వస్తువు కాబట్టి,ఈ పద్ధతి విజయవంతమవుతుందనిచెప్పవచ్చు.

### 3. వీడియో టేపులు (దృశ్య పాఠాలు)

ఇటీవలికాలంలో వచ్చిన వీడియో టేపులు బోధనా మాధ్యమంలో విప్లవాత్మకమైన మార్పును తెచ్చాయి. పోస్టుద్వారానో, రేడియోద్వారానో చెప్పే పాఠాల్లో లేని మానవఅంశం ఈ దృశ్య పాఠాల్లో ఉంటుంది. తరగతి గదిలో ఉపాధ్యాయునికి అందుబాటులో లేని విషయాలను కూడా వీడియో పాఠంలో దృశ్యాల చిత్రీకరణ ద్వారా చూపించగలిగే వీలుంటుంది. అయితే, ఆర్థికంగా వెనుకబడిన దేశాలలో విద్యార్థి టి.వి. మరియు క్యాసెట్ ప్లేయర్ కలిగి వుండటం కష్టం. ఇది ఖర్చుతో కూడుకున్న విషయం. విద్యార్థిగాని, అతని తల్లిదండ్రులుగాని అంతఖర్చును భరించలేరు స్టడీసెంటర్లు ఏర్పాటు చేయడం ద్వారా ఈ లోపాన్ని పూరించవచ్చు. సార్వత్రిక విద్యాలయంలో వీడియో పరికరాలను ఉంచి, విద్యార్థికి వీలున్న సమయాలలో వాటిని ఉపయోగించుకునే ఏర్పాటుచేయవచ్చు.

దృశ్య శ్రవణ పాఠాల వలన విద్యార్థికి స్థల కాల నిబంధన ఏదీ ఉండకపోవడమనే గొప్ప సౌకర్యం ఉంటుంది.

### 4. కంప్యూటర్లు

కంప్యూటర్ల ద్వారా విద్యాబోధన మాత్రమే కాదు - పరీక్షల నిర్వహణ కూడా సాధిస్తున్నారు పశ్చిమ దేశాల వారు. అభివృద్ధి చెందిన దేశాల్లో కంప్యూటర్లు విద్యావసరాల కోసం బాగా వుపయోగపడుతున్నాయి. ఉదాహరణకు అమెరికాలోని కార్నీ-మెలాన్ యూనివర్సిటీ మొత్తం కంప్యూటర్ పరివృత్తంలో పనిచేస్తుంది. కేంద్రీకృతమయిన కంప్యూటర్‌కు అన్ని తరగతులు, గ్రంథాలయం కనెక్టు చేయబడి వుంటాయి. విద్యార్థులు పరీక్షలుకూడా కంప్యూటర్ ద్వారానే రాస్తారు. పరీక్షా పత్రాల పరిశీలన, వ్యాఖ్యలు అన్నీ కంప్యూటర్‌ద్వారానే విద్యార్థులకుతెలియపరుస్తారు.

### 5. టెలిఫోన్ ద్వారా విద్యాబోధన

టెలిఫోన్ ద్వారా విద్యా బోధన అన్న ఊహే మనకు ఆశ్చర్యం కల్గించినా అది

సాధ్యమేనని నిరూపించారు విద్యాశాస్త్రవేత్తలు. కొన్ని నెంబర్లుకల టెలిఫోన్లు ప్రత్యేకంగా ఇందుకోసం కేటాయించబడి వుంటాయి. విద్యార్థి అవసరమయినప్పుడు తన అనుమానాలను తీర్చుకోవడానికి గాని, వివరణలు కావల్సినప్పుడుగాని ఫోనుచేయవచ్చు.

### 6. ఉపగ్రహం ద్వారా విద్యాబోధన

టెలికమ్యూనికేషన్స్ రంగంలో మానవాళి సాధించిన గొప్ప విజయం ఉపగ్రహాలని చెప్పవచ్చు. సుదూర ప్రాంతాల మధ్య దూరాన్ని క్షణంలో మాయం చేసే ఈ ఉపగ్రహాలు వెనుకబడిన దేశాల్లో కూడా విద్యావ్యాప్తికై ఉపయోగపడుతున్నాయి.

టెలివిజన్, రేడియో నెట్‌వర్క్ ద్వారా దేశమంతా ఒకేసారి పాఠాలు బోధించడం జరుగుతుంది. మనదేశంలో ఇన్శాట్-1బి ద్వారా స్కూలు విద్యార్థులకు, యూనివర్సిటీ విద్యార్థులకు ఉపయోగకరమయిన పాఠాలు ప్రసారం చేస్తున్నారు.

ప్రపంచంలో వివిధ దేశాలు తమ వనరులను బట్టి, అవకాశాలను బట్టి సాంకేతిక రంగాన్ని పైన పేర్కొన్న రకాలుగా బోధన కోసం ఉపయోగించుకుంటున్నాయి. మనదేశంలో ఈ సార్వత్రిక విద్య ప్రధానంగా పోస్టుద్వారానే అమలవుతుంది. రేడియో, టి.వి.లద్వారా, ఉపగ్రహంద్వారా జరుగుతున్న విద్యాబోధన ఎన్నో పరిమితులకు లోబడి వుంది కాబట్టి చాలా మందికి అందుబాటులో లేదన్న విమర్శ ఉంది.

ఈ పద్ధతులు విద్యార్థులకు మరింత ఉపయోగకరంగా ఉండాలన్న లక్ష్యంతో దృశ్య శ్రవణ పద్ధతులను బోధనలో ఉపయోగించాలన్న ప్రయత్నం భారతదేశంలో మొట్టమొదటిసారిగా ఆంధ్రప్రదేశ్ లోనే జరిగింది. మన రాష్ట్ర ప్రభుత్వం నిష్ణాతులయిన కళాకారుల జంట బాపు, రమణల చేత స్కూలు విద్యార్థులకై దృశ్యశ్రవణ పాఠాలు తయారు చేయించి కొన్ని పాఠశాలలో ప్రయోగాత్మకంగా ప్రవేశపెట్టింది. క్రమేణా, ఈ బోధనా పద్ధతి అన్ని స్కూళ్ళకు విస్తరిస్తుంది.

జూనియర్ కళాశాలలో పెరుగుతున్న విద్యార్థుల సంఖ్య దృష్ట్యా +2 స్థాయిలో కూడా దృశ్య శ్రవణ యంత్రాల ద్వారా బోధనను దేశంలోనే మొట్టమొదటగా ప్రవేశపెట్టిన ఘనత మన ఆంధ్రరాష్ట్రానిదే. జూనియర్ కళాశాలలేని ప్రతిమండల కేంద్రంలోనూ ఒక సార్వత్రిక జూనియర్ కళాశాలను ఏర్పాటు చేయాలన్న నిర్ణయం జరిగింది.

మనకున్న మొత్తం 1104 మండలాలలో 698 మండలాలకు జూనియర్ కళాశాలలే లేవు. మారుమూల గ్రామాలలో నివసించే విద్యార్థి ఇంటర్మీడియెట్ విద్యకోసం పట్టణ ప్రాంతాలకు రావల్సి వస్తుంది. పట్టణంలో ప్రత్యేకమయిన ఏర్పాటుతో తల్లిదండ్రులకు దూరంగా, సంరక్షకులు ఎవరూ లేకుండా ఉండవలసి వస్తున్నది. అలా కాకుండా మండల కేంద్రాలలో కళాశాలలు ఏర్పాటు చేయడం వల్ల విద్యార్థి పాఠాలు అయిపోగానే, తిరిగి తన గ్రామానికి వెళ్ళే వీలుంటుంది. మండల కేంద్రాలు ఆ మండలం మారుమూల గ్రామాలకు కూడా 10, 15 కిలో మీటర్ల కంటె ఎక్కువ దూరం కాకుండా ఉన్నాయి. కాబట్టి విద్యార్థి రోజూ తన గ్రామంలోనే వుంటూ తన ఇంట్లోనే వుండి చదువుకున్నట్లుంటుంది. ఇందులో ఒక సామాజిక సమస్యకు పరిష్కారం కూడా ఇమిడి వుంది. పట్టణ ప్రాంతానికి చదువు పేరుతో వస్తున్న విద్యార్థి పట్టణ వ్యామోహాలకు లోనయి, చదువు తర్వాత కూడా పట్టణంలోనే స్థిరపడాలనుకుంటున్నాడు. పల్లె ప్రాంతాల నుండి పట్టణ ప్రాంతాలకు వలస రావడాన్ని కొంతలో కొంతయినా ఈ విధంగా అరికట్టవచ్చు. విద్యార్థిని పూర్తిగా గ్రామీణ వాతావరణం నుండి దూరం చేసి అర్బన్ వాతావరణంలోకి అసహజంగా ఇమడ్చడం జరుగుతుంది. దీనివల్ల పల్లెల్లోనుండి విద్యాధికుల వలస ఏర్పడి, గ్రామంలో విద్యావంతులైన యువకుల కొరవడుతున్నారు. ఇలా మండల కేంద్రాలలో ఈ ఓపన్ జూనియర్ కళాశాలలు ఏర్పాటు చేయడం వల్ల విద్యావంతులను గ్రామప్రాంతాల సామాజిక అభివృద్ధికి వినియోగపడేట్టు చేసే వీలుంటుంది.

ఈ సార్వత్రిక జూనియర్ కళాశాలలవల్ల విద్యార్థికి, విద్యార్థి తల్లిదండ్రులకు వ్యయం చాలా

తగ్గిపోవడమే కాక ప్రభుత్వపరంగా కూడా ఆర్థిక భారం తగ్గుతుంది. ఒక సాంప్రదాయిక జూనియర్ కళాశాలకు స్థాపనా వ్యయం పదిలక్షల రూపాయిలయితే, సార్వత్రిక ప్రవేశ జూనియర్ కళాశాలకు మూడు లక్షల ఏభయి వేల రూపాయిలే అవుతుంది. ప్రతి సంవత్సరం సిబ్బంది జీతభత్యాలను కలుపుకుని నిర్వహణా వ్యయం సాంప్రదాయిక కళాశాలకు 4.5 లక్షల రూపాయిలయితే, ఓపన్ కళాశాలకు రు.1.5 లక్షలే అవుతుంది.

ఈ సార్వత్రిక కళాశాలలను మండల కేంద్రాలలో వున్న ఉన్నత పాఠశాల భవనాలలో స్థాపించాలని ప్రతిపాదించబడింది. అంతేగాక, అదనపు తరగతుల అవసరం వున్న సాంప్రదాయిక జూనియర్ కళాశాలల్లో కూడా ఆడియో వీడియో తరగతులు ప్రారంభమవుతాయి. టెలివిజన్ మరియు వీడియో క్యాసెట్ ప్లేయర్ వున్న ఏ కళాశాల అయినా ఈ క్యాసెట్లులను తమ కళాశాలలో విద్యార్థుల ఉపయోగార్థమై పొందవచ్చును.

సైన్సు సబ్జెక్టులను వదిలివేసి, మొదట కామర్స్, సివిక్స్, ఎకనామిక్స్, చరిత్రలు ఐచ్ఛికాలుగా కోర్సులు ప్రారంభించాలని నిర్ణయించబడింది. విజ్ఞానశాస్త్రాలను తరువాత ప్రారంభిస్తారు. ఇంగ్లీషు , తెలుగు భాషల బోధన కూడా ఉంటుంది.

నేడు ఓపన్ యూనివర్సిటీలలో అమలులో వున్న సార్వత్రిక విద్యకు, ఆంధ్రప్రదేశ్‌లో ఇంటర్మీడియటర్ విద్యామండలి తలపెట్టిన ఓపన్ అడ్మిషన్ కోర్సులకు ఒక మౌలికమైన భేదం వుంది. సార్వత్రిక విశ్వవిద్యాలయం స్టడీ సెంటర్స్‌లో విద్యార్థి రోజూ క్లాసుకు రానవసరంలేదు. సార్వత్రిక జూనియర్ కళాశాలలో విద్యార్థి రోజూ కళాశాలకు రావాలి. అయితే, కళాశాల 3 గం.లు మాత్రమే పని చేస్తుంది. ఇద్దరు జూనియర్ లెక్చరర్లు వుంటారు. వారివారి సబ్జెక్టులలో ముఖాముఖి క్లాసులు కూడా ఉంటాయి. ఆడియో పాఠాలు, వీడియో పాఠాలు, ఇద్దరు అధ్యాపకులు, ఈ విద్యాబోధనలో భాగం పంచుకుంటారు. దృశ్య పాఠాల స్క్రిప్టులను ముద్రించి కూడా విద్యార్థులకు సప్లయి చేస్తారు. వీటన్నిటితోపాటు వారానికి ఒకసారి ప్రతి సబ్జెక్టులో కాంటాక్టు క్లాసులు (ముఖాముఖి తరగతులు) కూడా నిర్వహించబడుతాయి. సాంప్రదాయిక జూనియర్ కళాశాలల్లో పాటించబడే అడ్మిషన్ రూల్స్ సార్వత్రిక జూనియర్ కళాశాలలకు కూడా వర్తిస్తాయి.

ఈ పాఠాలు అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులచే తయారు చేయబడతాయి. సాంప్రదాయిక కళాశాలల్లో కొందరు ఉపాధ్యాయులు తమ తమ శాఖలలో మంచి పాండిత్యం కల్గి వుంటారు. కాని బాగా ఉపన్యాసం చెప్పలేకపోవచ్చు. కొంతమంది బాగా బోధించగలరు. కాని అంత పాండిత్యం లేకపోవచ్చు. ఈ రెండు రకాలయిన ఉపాధ్యాయుల కలయిక వల్ల విద్యార్థులకు జరిగే లాభాన్ని ఒక్క ఆడియో పాఠం, ఒక్క వీడియో పాఠం ఇవ్వగలదు. మంచి ఉపాధ్యాయుల సమష్టి కృషి ఫలితమే ఈ పాఠాలు. ఈ పాఠాలవల్ల రాష్ట్రం మొత్తం మీద బోధనలో ఏకరూపత (Uniformity of teaching) సాధ్యమవుతుంది.

ఆంధ్ర ప్రదేశ్‌లో ఇంటర్మీడియెట్ స్థాయిలో ప్రవేశపెట్టబడుతున్న ఈ నూతన బోధనా పద్ధతి ఒక సాహస ప్రయోగమే. ఈ ప్రయోగం సఫలీకృతమవుతుందని ఆశిద్దాం!

***

# స్నాతకోత్తర స్థాయిలో సమాజశాస్త్రాన్ని తెలుగులో బోధించడంలో ఎదురయ్యే సమస్యలు

ఆచార్య జె.వి రాఘవేంద్రరావు,
సమాజశాస్త్రశాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయం.

స్నాతకోత్తరస్థాయిలో (Post graduate Level) విద్యార్థులకు తెలుగులో సమాజశాస్త్రాన్ని బోధించడంలో ఆచార్యులకూ, అధ్యాపకులకూ, అనేక సమస్యలు ఎదురవుతున్నాయి. ఈ సమస్యలు ఉదయించడానికి అనేక కారణాలున్నాయి. కారణాల విశ్లేషణ, వివరణ తెలుసుకొనే ముందు వీటి సామాజిక సందర్భాన్ని (Social Context) తెలుసుకోవాలి.

నాకు తెలిసినంతవరకు సమాజశాస్త్ర విభాగాలు రాష్ట్రంలో (major departments) ఆంధ్ర, శ్రీ వెంకటేశ్వర, ఉస్మానియా, శ్రీకృష్ణదేవరాయ, హైదరాబాదు విశ్వవిద్యాలయాల్లో ఉన్నాయి. నాగార్జునలో ఈ మధ్యనే సమాజ శాస్త్ర విభాగాన్ని ప్రారంభించారు. ఆంధ్రప్రదేశ్ విశ్వవిద్యాలయంలోని విస్తరణ విద్యావిభాగంలో (Extension education) సమాజ శాస్త్రజ్ఞులు పనిచేస్తున్నారు. ఈ విభిన్న విశ్వవిద్యాలయాలలోని సమస్యలను చర్చించడానికి ఉద్యమించడం సాహసోపేతమైన కార్యమే అవుతుంది. నేను సుమారు రెండు దశాబ్దాల నుండి ఉస్మానియా విశ్వ విద్యాలయంలో సమాజ శాస్త్రాన్ని బోధిసున్నాను. ఇక్కడి విద్యార్థులూ, ఆచార్యులు, అధ్యాపకులు – ఇక్కడి వాతావరణం నేను బాగా ఎరుగుదును. కాబట్టి నేను గమనించిన ప్రక్రియలు – పరిశీలించిన పరస్పర చర్యలు గడిచిన అనుభవాలు ఈ వ్యాసానికి మూల ఆధారాలు. వీటి ఆలంబనగా ఉస్మానియా విశ్వవిద్యాలయము సామాజిక సందర్భాన్ని అందులో బోధనా ప్రక్రియలో ఎదురవుతున్న సమస్యల్ని చర్చిద్దాం.

ఉస్మానియా విశ్వవిద్యాలయం చారిత్రకంగా తెలంగాణా జిల్లాలలోని విద్యార్థులు ఉన్నత విద్యావసరాలను పూర్తి చేయడానికి స్థాపితమైంది. ఇప్పటికీ అదే ప్రకార్యాన్ని నిర్వహిస్తోంది. ఉస్మానియా సమాజశాస్త్ర విభాగంలో పి.జి.లో (పోస్టుగ్రాడ్యుయేట్) చేరే విద్యార్థులలో 65% మంది గ్రామీణ ప్రాంతానికి చెందిన వారు మిగిలిన 35% మంది నగర, పట్టణ ప్రాంతాలకు చెందినవారు. వీరు ఎక్కువగా నల్లగొండ, ఖమ్మం, కరీంనగర్, వరంగల్ జిల్లాలకు చెందిన వారు. అడపా దడపా వేరే జిల్లాల విద్యార్థులు కూడా చేరుతుంటారు. ఈ 65% శాతం గ్రామీణ విద్యార్థులలో చాలా మంది నేరుగా స్వంత డబ్బుతో లేదా స్కాలర్‌షిప్ సహాయంతో చదువుతుంటారు. 5 శాతం లేదా 5–10% విద్యార్థులు మాత్రం ఉద్యోగులవడం వల్లనో లేదా కళాశాలల్లో విద్యాభ్యాసం చేయలేక పోవడం వల్లనో External Candidates పరీక్షలో ఉత్తీర్ణులై యం.ఎ. కోర్సులో ప్రవేశిస్తున్నారు.

వీరి కుటుంబాల సామాజిక స్థాయి (Social Status) కూడా మనం గమనించాలి. చాలా మంది మధ్యతరగతి లేదా చిన్న మధ్యతరగతి వారు (Middle or Lower middle class) తల్లిదండ్రులు ఎక్కువగా చిన్న రైతులుగా, గుమాస్తాలుగా, లెక్చరర్లుగా, చిన్న వ్యాపారస్తులుగా అనేక వృత్తులలో పని చేస్తున్నారు. వీరిలో కింది స్థాయిలో ఉన్న మధ్య తరగతి వారు కూడా ఉన్నారు. ఒక 5% మంది విద్యార్థులు చాలా పేద కుటుంబాలకు చెందిన వారు. వీరి తల్లిదండ్రులు మిల్లులలో కార్మికులు గానూ, చిన్న పురపాలక సంస్థలలోనూ, రైల్వేలో నాల్గవ తరగతి (IV class employees) ఉద్యోగులు గానూ పని చేస్తున్నారు. క్లాసులోని 30 మందిలో 10–15%

మించకుండా షెడ్యూల్డ్ కులాల (Scheduled Castes) విద్యార్థులుంటారు. షెడ్యూల్డ్ తరగతుల వారు (Scheduled Tribes) పోస్టుగ్రాడ్యుయేట్ కోర్సులో సోషియాలజీలో ప్రవేశించడం చాలా అరుదు. వీరికి కేటాయించిన సీట్లు కూడా సామాన్యంగా షెడ్యూల్డ్ కులాల వారికి చెందడం జరుగుతోంది.

ఇంకొక విషయం ఇక్కడ ముఖ్యంగా గమనార్హం. గ్రామీణ ప్రాంతం నుండి వచ్చే విద్యార్థుల సాంస్కృతిక స్థాయి (Cultural Level) చాలా తక్కువ. వీరిలో గ్రంథ పఠనం, పత్రికా పఠనం–వేరే ప్రజాసాధనాల (Mass media) – రేడియో – టెలివిజన్ మొదలైన వాటి ఉపయోగం చాలా తక్కువ. అందుకే వీరి సాంస్కృతిక స్థాయి ఇతర విద్యార్థులతో పోల్చినపుడు చాలా తక్కువని చెప్పక తప్పదు.

మరొక విషయం గమనించాల్సిందేమంటే వీరు ఇంటా బయటా – అన్ని చోట్ల తెలుగే వాడుతుంటారు. పీల్చే గాలి కూడా తెలుగంటే అతిశయోక్తి కాదేమో. వీళ్ళకి ఇంగ్లీషు పరిజ్ఞానం చాలా తక్కువ. ఇంగ్లీషు మాట్లాడటంలో, వ్రాయడంలో, వీరికి సులువు హాయి లేదు. ఇంగ్లీషులో చక్కగా మాట్లాడి రాసే విద్యార్థినీ విద్యార్థులను చూచి వీరు న్యూనతా భావంతో (inferiority complex) తో బాధపడుతుంటారు. ఈ సామాజిక వాతావరణంలో ఇలాంటి విద్యార్థులకు, ఆచార్యులు, అధ్యాపకులు సమాజశాస్త్రాన్ని బోధించాల్సి వస్తోంది.

స్నాతకోత్తర స్థాయిలో విద్యార్థులకు, సమాజ శాస్త్రం సరిగా నేర్పాలంటే డిగ్రీ స్థాయిలోనైనా కనీసం వాళ్ళ పునాదులు గట్టిగా ఉండాలి. కొద్దో గొప్పో, ఇంగ్లీషు వచ్చిన విద్యార్థులు ఉత్తర భారత దేశం నుండి (ముఖ్యంగా మీరట్, ఆగ్రా) దిగుమతయ్యే చౌకబారు సమాజ శాస్త్ర పుస్తకాల్ని చదువుతుంటారు. కొంతమంది రచయితలు – సి.బి.మమోరియా,యస్ ఆర్.బాజోపార్, వాత్సాయన్ మొదలగు వారు మూలగ్రంధాలనుండి మక్కికిమక్కి కాపీ కొట్టి తప్పు ఇంగ్లీషు పదాలతో, వాక్యాలతో అనేక రచనలు ప్రచురిస్తున్నారు. "సోషియాలజీ మేడ్ ఈజీ" (Sociology made easy) లు చాలా వస్తున్నాయి. విచారకరమైన విషయమేమిటంటే ఇలాంటి దురలవాట్లను పెంచడంలో వీళ్ళకు బోధించే గురువుల పాత్ర కూడా కొంత ఉంది. డిగ్రీలో ఏర్పడ్డ అలవాట్లు యం.ఎ.లో కూడా కొంత మంది విద్యార్థులలో కొనసాగుతున్నాయి. వీరు ఇందు వల్ల బాగా నష్టపోతున్నారు. ఇలాంటి చీకటి పరిస్థితులలో విద్యుల్లతలా, కాంతి ధారలా వచ్చాయి తెలుగు అకాడమీ సమాజ శాస్త్ర ప్రచురణలు. దీని వల్ల తెలుగు బోధనా మాధ్యం (medium of instruction) లో చదివే విద్యార్థులకు చాలా లాభం జరిగింది. పాఠ్యపుస్తకాలను 1970–71 నుండి తెలుగు అకాడమీ నిరాఘాటంగా ప్రచురించి అటు అధ్యాపకులకూ, ఇటు విద్యార్థులకూ, అపారమైన సేవ చేస్తోంది.

విద్యార్జనలోనూ, విద్యాబోధనలోనూ డిగ్రీ స్థాయికీ, పి.జి. స్థాయికీ విపరీతమైన తేడా ఉంది. డిగ్రీ స్థాయిలో 3,4 పేపర్లకంటే ఎక్కువ ఉండవు. కాని పి.జి. స్థాయిలోని కోర్సులో వైవిధ్యం గరిమ చాలా ఎక్కువ. సామాజిక సిద్ధాంతానికి (Social theory) అనువర్తన విధానానికి ప్రణాళిక, అభివృద్ధికి (Planning and Development) సంబంధించిన పేపర్లు కాకుండా అనేక ఐచ్ఛికాలు–రాజకీయ సమాజ శాస్త్రం, గ్రామీణ సమాజ శాస్త్రం, వ్యవస్థాపనాత్మక ప్రవర్తన (Organisational behaviour) మొదలైనవి ఉంటాయి. తెలుగులో ఒకటి రెండు పుస్తకాలు చదివి డిగ్రీ పూర్తి చేసిన విద్యార్థులకు యం.ఎ.లో ఇంగ్లీషు పుస్తకాల పెద్ద చిట్టా కనిపించే సరికి చదువు ఒక కలవరంగా, భయంగా తయారవుతోంది. మేధా గతంగా చూస్తే యం.ఎ. చదువు, ఒక Quantum Jump లా ఫీలవుతారు విద్యార్థులు. ఈ పరిస్థితులలో తెలుగు మీడియం (Medium) నుండి వచ్చిన విద్యార్థులకు స్నాతకోత్తర స్థాయిలో బోధించడం ఎంత కష్టమో ఊహించండి.

బోధనా సమస్యలు స్నాతకోత్తర స్థాయిలో బహుముఖంగా ఉన్నాయి. కొన్ని తరగతి వాతావరణం (Class room situation) నుండి చూస్తే కొన్ని సమాజశాస్త్ర స్వభావం నుండి జనిస్తాయి. మరి కొన్ని

సమస్యలు విద్యార్థుల గ్రాహ్యశక్తి, ప్రతిస్పందన నుండి, అధ్యాపకుల అభివ్యక్తీకరణ సామర్థ్యం నుండి (efficiency of articulation) ఆలోచనా పటిమ నుండి జనిస్తాయి. సమస్యల లిస్టు పెద్దది కారణాలింకా అనేకం ఉన్నాయి.

ఆంధ్రప్రదేశ్‌లోని విశ్వవిద్యాలయాలల్లో స్నాతకోత్తర స్థాయిలో ఇప్పటికీ ఇంగ్లీషు మాత్రమే బోధనా భాషగా ఉంది. తెలుగులో బోధన ఐచ్ఛికం యం.ఏ.లో ప్రత్యేకంగా తెలుగు తరగతులు లేవు, అలా ఉంటే బాగుండేది. తెలుగులో సమాజశాస్త్రం చెప్పడం అప్పని సరి అయ్యేది. తరగతిలో ఉండే విద్యార్థులు మిశ్ర సమూహం (Mixed group) అవడం వల్ల, వారిలో ఎక్కువ మంది స్త్రీ విద్యార్థులు ఇంగ్లీషు మీడియం (Medium) వాళ్ళవడం వల్ల బహిరంగంగా తెలుగులో పాఠం కోసం పురుష విద్యార్థులు డిమాండ్ చెయ్యరు. లెక్చరు ముగిసిన తరువాత గుంపుగా వచ్చి తమకు అర్థం కావడం లేదనీ తెలుగులో చెప్పవలసిందనీ కోరుతారు.

క్లాసు రూంలో ఇంగ్లీషులో, తెలుగులో విద్యార్థులకు ఒకే కాలంలో (simultaneously) బోధించడం రెండు గుర్రాల మీద ఒకేసారి స్వారి చేయడంలాంటిది. ఎక్కడో ఒక చోట కాలు జారక తప్పదు. ఇంగ్లీషులో చెప్పటం అలవాటు కాబట్టి ఆలోచనా ప్రక్రియ (thought process) ఇంగ్లీషులో సాగుతుంది. దీన్ని తెలుగులోకి భాషాంతరీకరణం చేసి విద్యార్థులకు సులువుగా అర్థమయ్యేటట్లు చెప్పడం చాలా ఇబ్బందులలతో కూడుకుని ఉంది. విద్యార్థులకు కూడా ఇంగ్లీషు, తెలుగు వాక్యాల మధ్య అర్థ, సామ్యాన్ని సాంగత్యాన్ని (meaning correspondence and similarity) సాధించడం పెద్ద మెదడు సర్కసుగా తయారవుతున్నది. ఉదాహరణకు సమాజ శాస్త్రీయ సిద్ధాంతంలోని పాఠాలను చెప్పేటప్పుడు, సాంకేతిక పరస్పర చర్యావాదం గురించి (Symbolic interactionism) చెబుతాము. ఉపోద్ఘాతంలో "Man is not only a Homo Loquitóriutalso Homo Hermeneuticus" అని ఇంగ్లీషులో చెబుతాము. మరుక్షణంలో తెలుగులో "మానవుడు సంభాషించే మనిషే కాదు, అతను అర్థజీవి కూడా" అని చెబుతాము. ఇది విద్యార్థులకు తొందరగా అర్థం కాదు. ఇంగ్లీషులో ఆలోచించి చేసే వాక్య నిర్మాణానికీ, తెలుగులో ఆలోచించి చేసే వాక్య నిర్మాణానికి చాలా తేడా ఉంది. అంతేకాదు, తెలుగులో మామూలుగా "అర్థసంపద", "అర్థ శాస్త్రం", అంటే సులువుగా అర్థమవుతాయి. "అర్థజీవి" అనేది కొత్త పదం. వాళ్ళకు త్వరగా బోధపడదు. అర్థజీవి అంటే సంభాషణల ద్వారా, సంకేతాల ద్వారా అర్థాన్ని (meaning) సృష్టించే వ్యక్తి అని విపులంగా ఉదాహరణలతో సహా తెలివినపుడే విద్యార్థులకు అర్థమవుతుంది. విన్న తక్షణమే చాలా మంది ఈ వాక్యాన్ని డబ్బుకోసం, ద్రవ్యం కోసం కష్టపడే వ్యక్తి మానవుడని అపార్థం చేసుకొంటారు. నా క్లాసులో అలాంటి సంఘటన జరిగింది. పైగా తెలుగులో "కష్టజీవి" "మూగజీవులు" అనే ప్రయోగాలున్నాయి. కాని అర్థజీవి అనే ప్రయోగం లేదు. ఆచార్యులు ఉపన్యసిస్తున్నప్పుడు, ఇలాంటి ప్రయోగాలు చేయడం సబబే కాదు-తప్పని సరికూడా. అయితే దీనితో వచ్చే సమస్యలను తప్పించుకోలేం.

కొన్ని బోధనా సమస్యలు సమాజ శాస్త్రం స్వభావం నుండి (Nature of Sociology) బయలు దేరుతాయి. సమాజ శాస్త్రం వికాసాన్ని (evolution) గమనిస్తే, ఇది భౌతిక, రసాయన శాస్త్రాలవలె (physics and chemistry) నిర్దిష్టమైన శాస్త్రం కాదని (exact Science) విదితమవుతోంది. అనేక శాస్త్రాల నుండి భావనలను, దృక్పథాలను పద్ధతులను సేకరించి సమాజ శాస్త్రం సంశ్లిష్ట శాస్త్రంగా (Synthetic Science) రూపొందింది. ఇందులో సాధారణీయతలు (generalities) చాలా ఎక్కువ. నిర్దుష్టతలు పరిమితం దీని ఫలితంగా సమాజశాస్త్రంలోని భావనలు, నిర్వచనాలు, అసంఖ్యాకంగానూ, అస్పష్టంగానూ ఉన్నాయి. ఉదాహరణకు సమాజ శాస్త్రాన్ని వివిధ రచయితలు వారికి నచ్చిన రీతిలో నిర్వచించారు. డాన్ మార్టిండేల్ "అంతర్ మానవ ప్రవర్తన అధ్యయనమే సమాజ శాస్త్రము" (Sociology is the study of inter human life) అని అన్నాడు. దీనికి భిన్నంగా జార్జి జిమ్మెల్ సమాజశాస్త్రం సామాజికీయతా రూపాలను (forms of

sociation) అధ్యయనం చేస్తుంది" అని నిర్వచించాడు. మారిస్ గిన్స్‌బర్గ్ (Morris Ginsberg) సమాజశాస్త్రం సామాజిక సమూహాలను, సంస్థలను (Social groups and Institutions) అధ్యయనం చేస్తుందని ఉల్లేఖించాడు. ఈ పై నిర్వచనాలలోని వైవిధ్యం, అనేకత్వం జిజ్ఞాసువులకు స్పష్టంగా తెలియ చెప్పడం చాలా కష్టం. వీటన్నింటినీ సమన్వయం చేసి ఈ వైవిధ్యంలో ఏకత్వాన్ని, నిర్ద్వంద్వ సమగ్రతను రూపొందించి చెప్పటంలో బోధకులకు (Teachers) భావనాత్మక, భాషాత్మక అవరోధాలు చాలా ఉన్నాయి. నాలాంటి అధ్యాపకులు కష్టపడి వీటిని స్పష్టీకరించడానికి కృషి చేస్తున్నారు. అయినా విద్యార్థులలో కొన్ని అనుమానాలు మిగిలే అవకాశం లేక పోలేదు.

సమాజశాస్త్రంలో పారిభాషక నిర్దిష్టతాలోపం (Lack of terminological exactitude) కూడా ఉంది. ఒకే భావనను ఇంగ్లీషులో అనేక పదాలు విశదీకరిస్తున్నాయి. ఉదాహరణకు సామాజికీకరణ భావనను (concept of socialization) తెలియ చెప్పే ఇంగ్లీషు పదాలు Sociation, Socialization, enculturation వీటిని తెలుగులోకి సామాజికీయతా ప్రక్రియ, సాంఘికీకరణ, సంస్కృతీకరణ అని భాషాంతరీకరించవచ్చు. కొంతమంది రచయితలు "సోషియేషన్" (జిమ్మెల్) వాడితే మరికొంత మంది రచయితలు (Herskovits, Kroeber మొదలైన వారు) "ఎన్కల్చరేషన్" వాడటానికి ఇష్టపడతారు. దీని వల్ల విద్యార్థులలో కొంతకాలందాకా భావనాత్మక అస్పష్టత ఉండి పోతుంది. ఈ అస్పష్టతను దూరం చేయడానికి అధ్యాపకులు ఎంతో కృషి చేసినా సద్యఃఫలితాలుండవు.

స్నాతకోత్తరస్థాయిలో సమాజ శాస్త్రాన్ని తెలుగులో బోధించడంలో-ఇంగ్లీషు నుండి తెలుగులోకి సమానార్థక పదాల (Equivalents) నిర్మాణం చాలా కష్టమైన పని. జార్జి హెర్బర్ట్ మీడ్ (George Herbert Mead) I and Me అనే పదాలను వాడి తన సామాజికీకరణ సిద్ధాంతాన్ని విశదీకరించాడు. దీన్ని తెలుగులోకి నేను, నాది లేదా అహం, సామాజిక అహం అని అనువదించాలి. కాని ఈ అనువాదం తృప్తికరంగా లేదు, అనువాదాన్ని పక్కకు నెట్టి భావాన్ని తెలుగులో స్పష్టీకరిస్తే తప్ప విద్యార్థులకు అర్థం కాదు. అలాగే పెథాలజీలో PSYCHO–drama, Socio drama, అనే పదాలున్నాయి. వీటిని తెలుగులో మానసిక నాటకం, సామాజిక నాటకం అని తర్జుమా చేస్తే హాస్యాస్పదంగా ఉంటుంది. ఇంకా ఎన్నో ఉదాహరణలియ్యవచ్చు. సరియైన సమానార్థక పదాలను సృష్టించగలిగినపుడు ఆచార్యులకు ఆనందం కలుగుతుంది. ఉదాహరణకు falsification కు అసత్యీకరణము, Emperical uniformity కి అనుభవిక రూపత, post-facturn Sociological interpretation కు సంఘటనానంతర సమాజ శాస్త్రీయ వ్యాఖ్య మొదలైన సమానార్థక పదాలను సృష్టించి నేను వాడాను. ఇవి పుస్తకాలలో ప్రచురితమై విద్యార్థులు వాడుతుంటే రచయితలకు, బోధకులకు ఏదో సాధించామనే తృప్తి కలుగుతుంది.

భావనలు, సిద్ధాంతాలు ఒకే ప్రదేశంలో ప్రత్యేక సాంస్కృతిక వాతావరణంలో ఉద్భవిస్తుంటాయి. వాటిని తెలుగీకరించడం కొన్ని సార్లు అసాధ్యం మరికొన్ని సార్లు కష్టసాధ్యం. ఈ పాశ్చాత్య ఆలోచనా సంప్రదాయాన్ని, పద్ధతిని, తెలుగు సంస్కృతిలో చొప్పించి, ఆ సంస్కృతి పదజాలాన్ని తెలుగులో అర్థవంతంగా, సజావుగా నిర్మాణం చేయడం, ఆ భావనా ప్రక్రియను తెలుగులో బోధించడం కష్టమేకాదు ప్రమాద భూయిష్ఠం కూడా. ఉ. ఎథ్నో మెథడాలజీ (Ethno methodology) సిద్ధాంతం ఎథ్నో మెథడాలజీకి సరియైన తెలుగు పదం లేనేలేదు. అసలు ఇంగ్లీషులో కూడా ఈ పదం తమాషాగా తయారయింది. Ethno+Methodology, దీన్ని తెలుగులోకి అనువదిస్తే జానపద + అనువర్తన విధానం అవుతుంది. కాని ఇది మామూలుగా గ్రహించే పద్ధతిలో జానపద ప్రజలు వాడే విధానం అనుకుంటే అది అర్థరహితంగానూ, హాస్యాస్పదంగానూ ఉంటుంది. ఇక్కడ గమనించాల్సిన విషయమేమంటే ఎథ్నో మెథడాలజీ శాస్త్ర పద్ధతుల గురించి కానీ సామాన్యులు వాడే పద్ధతులను గురించి కానీ చర్చించదు. ఇది ఒక తాత్విక దృక్పథం ఇది ఏ సమాజంలోనైనా సామాజిక నిర్మితి (Social

structure) అంటూ లేదనీ, అది నిత్య జీవితంలో జరిపే చర్యల ద్వారా, వినిమయాల ద్వారా ప్రజలు సృష్టించుకుంటున్నారని, వాటికి కొన్ని పద్ధతులను వాడతారని చెబుతుంది. ఎథ్నో మెథడాలజీ దృక్పథానికి ఫినామినాలజీకి (Phenomenology) సింబాలిక్ ఇంటర్ ఏక్షనిజానికి (Symbollic interactionism) దగ్గరి సంబంధం ఉంది. ఈ రెండు వాదాలు 19 వశతాబ్దం చివరలోనూ 20 వశతాబ్దం ఆరంభంలోనూ వచ్చిన తాత్విక ఉద్యమాల ఫలితంగా రూపొందినాయి. ఫినామినాలజీ, సింబాలిక్ ఇంటర్ ఏక్షనిజం భావాలను దృక్పథాలను వాడుకొని ఎథ్నో మెథడాలజీ ఒక కొత్త దృక్పథంగా నిర్మాణమైంది. పాశ్చాత్య సంస్కృతిలో భాగంగా, తాత్విక విజ్ఞాన సంప్రదాయంలో భాగంగా ఈ దృక్పథం ఏర్పడింది. యం.ఎ లో సమాజ శాస్త్రాన్ని అభ్యసించే విద్యార్థులకు తెలుగులో ఎంతో కష్టపడి చెప్పినా సులభంగా అర్థం కాదు. నేను క్లాసులో ఇచ్చే ఉపన్యాసాన్ని అనేక సార్లు పునరావృతం (Repeat) చేసి చెబుతుంటాను. కాని ఫలితం చాలా తక్కువే. రెండు వారాలు తిరగక ముందే విద్యార్థులు మళ్ళీ వచ్చి మాకు కొన్ని భాగాలు విషయాలు స్పష్టీకరించమని అడుగుతుండటం కద్దు. Reflexivity Accounting Indexicabity మొదలైన పదాలు ఎథ్నో మెథడాలజీలో కొత్త అర్థాలను మెళకువలను సంతరించుకున్నాయి. వీటిని మనం పాశ్చాత్య సాంస్కృతిక సందర్భంలో చూచినపుడే మనకు అర్థమవుతాయి. వీటిని తెలుగులో ఇమడ్చటం, తెలుగులో వాటిని బోధించడం బోధకులకు సముద్రంలో అమాంతంగా అలలు వచ్చి మీద పడుతుంటే ఎదురీదడం లాంటిది.

సమాజ శాస్త్రాన్ని స్నాతకోత్తర స్థాయిలో నేర్పే అధ్యాపకులకూ, నేర్చుకొనే విద్యార్థులకూ ఒక ఉమ్మడి గమ్యం ఉంది. అది వీరిద్దరిలో సమాజ శాస్త్రం ఆలోచనను, కాల్పనికతను (sociological thinking and imagination) ఆవిష్కరించి వృద్ధిచేయడమే. ఇలా చేయాలంటే విద్యార్థులకు, అధ్యాపకులకు భాషసరిగా వచ్చి ఉండాలి. శాస్త్రీయ భాష రావాలంటే సరియైన పారిభాషిక పదకోశం తయారు చేయాలి. ఇటు సమాజశాస్త్రంలో కానీ, అటు మిగిలిన మానవీయ సామాజిక శాస్త్రాలలో కానీ (Social Sciences) ఇంతవరకు, నిర్దుష్టమైన సంపూర్ణమైన, సాధికారికమైన పారిభాషిక పదకోశ నిర్మాణం జరుగలేదు. దీనివల్ల ఖచ్చితంగా నేర్పే ఆచార్యులకూ, నేర్చుకొనే విద్యార్థులకూ చాలా ఇబ్బందులు కలుగుతున్నాయి. తెలుగు అకాడమీ వారు ఎంతో ఉత్సాహంతో పదకోశ నిర్మాణం కమిటీలను వేశారు. దీనిలో ఎక్కువ మంది విశ్వవిద్యాలయాల్లో పనిచేసే ఆచార్యులు, అధ్యాపకులే. వీరు సరియైన చొరవ, అభిరుచి చూపించక తమ ప్రత్యేక శాస్త్రాంశాల విషయంలో (speciality) పారిభాషిక పదాల పట్టికను తయారు చేయకపోవడంతో, బండి ముందుకు పోవడం లేదు. దీనివల్ల స్నాతకోత్తర స్థాయి బోధనలో ప్రగతికి బదులు స్తబ్దత వచ్చింది.

తెలుగులో సమాజ శాస్త్రాన్ని సరిగా బోధించాలంటే అధ్యాపకులకూ, విద్యార్థులకూ కనీసం భాషా సామర్థ్యం (Minimum language skills) ఉండాలి. తెలుగులో డిగ్రీ పుచ్చుకొన్న విద్యార్థులకు తెలుగు భాష చక్కగా రాదు. చాలా మంది అధ్యాపకులు, ఆచార్యులు వారి మాతృ భాష తెలుగైనా తెలుగులో పాఠాలు చెప్పలేక పోతున్నారు. వ్రాయడం మాట దేవుడెరుగు. ఈ సందర్భంలో స్నాతకోత్తర స్థాయిలో సమాజశాస్త్రంలో పుస్తకాలు రాయవలసిందిగా తెలుగు అకాడమీ వారు చాలామందిని కోరగా కేవలం ఇద్దరు వ్యక్తులు మాత్రమే వీటిని పూర్తి చేయడం చాలా శోచనీయం. అందుకే తెలుగు అకాడమీ వారు, డిగ్రీ స్నాతకోత్తర స్థాయిలలో పనిచేసే బోధకులకు, మానవీయ సామాజిక శాస్త్రాలలోనూ (social sciences) ప్రత్యేకంగా సమాజ శాస్త్రంలోనూ పరిభాష, భాషా ప్రయోగాల గురించి పునరభ్యసన కార్యక్రమాలను (orientation courses) నిర్వహించాలని నా అభిప్రాయం. దీనివల్ల బోధనా సామర్థ్యం పెరిగి బోధకులు విజ్ఞాన ప్రసారణా లక్ష్యాలను సాధిస్తారని నేను ఆశిస్తున్నాను.

తెలుగులో సమాజ శాస్త్ర, సాంఘిక విజ్ఞాన శాస్త్రాల బోధన ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ విద్యా విధానంతో కూడా ముడిపడి ఉన్నది. ఒకవైపు ప్రభుత్వం వారు తెలుగు జాతి, తెలుగు సంస్కృతి, తెలుగు గౌరవం గురించి బాగా ప్రచారం చేస్తున్నారు. ఇంకొకవైపు విశ్వవిద్యాలయాల్లో స్నాతకోత్తర స్థాయిలో తెలుగు బోధనా కార్యక్రమం మొదలు పెట్టలేదు. ప్రభుత్వం వారి ఆలోచనలోనూ, ఆచరణలోనూ ద్వంద్వ విధానం (dual policy) కన్పిస్తున్నది. బి.ఏ. వరకు అన్ని శాస్త్రాలలో బోధన తెలుగులో జరుగుతున్నది. కాని యం.ఏ. (M.A) బోధన దాదాపు అన్ని విశ్వవిద్యాలయాలల్లో ప్రధానంగా ఇంగ్లీషులోనే జరుగుతున్నది. తెలుగు మీడియం విద్యార్థులు ఎక్కువగా ఉన్న తరంతులలో– ముఖ్యంగా ఉస్మానియా విశ్వవిద్యాలయంలో– ఆచార్యులు, అధ్యాపకులు క్లాసులో ఒకేసారి ఇంగ్లీషులోనూ, తెలుగులోనూ బోధిసున్నారు. విద్యార్థులు ప్రశ్నలడిగినప్పుడు వారికి తెలుగులో సమాధానమిస్తున్నారు. వారితో చర్చించి తెలుగులో విషయాన్ని విశదీకరిస్తున్నారు. కాని తెలుగు బోధనా తరగతులను, నాకు తెలిసినంతవరకు ఏ విశ్వవిద్యాలయంలోనూ నడపడం లేదు. తెలుగులో జరిగే బోధన అందుకే పాక్షికంగానూ, అసంతృప్తికరంగానూ ఉంటోంది. విద్యార్థులు సతమతమవుతున్నారు.

తెలుగు మీడియం విద్యార్థులకు డిగ్రీ స్థాయిలో ఇంగ్లీషు పుస్తకాలు చదివే అలవాటు తప్పింది. వారు యం.ఏకు వచ్చేసరికి విద్యారంగం కొత్తగా, అయోమయంగా అగుపిస్తోంది. తోటి విద్యార్థులు ఇంగ్లీషులో మాట్లాడడం, ఇంగ్లీషు పుస్తకాలు చదవడం, పత్రికలు ఎక్కువగా చదవడం. వీరిలో ఆందోళననూ, అసూయనూ కలిగిస్తోంది. అధ్యాపకులు కూడా ప్రధానంగా ఇంగ్లీషులో బోధించడంతో పరిస్థితి ఇంకా సంక్లిష్టంగా తయారయింది. ఈ నాటికీ విశ్వవిద్యాలయాల్లో అధికృత బోధనా భాషగా (official medium of instruction) ఇంగ్లీషు చలామణి అవుతోంది. ఈ విషయాన్ని పాఠకులు గమనించాలి.

దీనికితోడు యం.ఏ.లోని అన్ని కోర్సులలో సమాజశాస్త్రంతో సహా నిర్బంధంగా చదివే పేపర్లు (Compulsory and Optional papers) చాలా ఎక్కువ. విజ్ఞానం దృష్ట్యాచూస్తే (from knowledgy point of view) బి.ఏ (B.A.) కోర్సులకూ యం.ఏ (M.A.) కోర్సులకూ భూమ్యాకాశాలకున్న తేడా ఉంది. ఈ అగాథాన్నివాళ్లుఅధిగమించలేకపోతున్నారు.

పుస్తకాలు, జర్నల్స్ (Journals) అన్నీ ఇంగ్లీషులో ఉండటంవల్ల తెలుగు మీడియం విద్యార్థులకు వాటిని చదివి, అనువాదం చేసుకోవాల్సిన పరిస్థితి ఏర్పడుతోంది. వారికి ఇంగ్లీషు, తెలుగు భాషలు రెండింటిలోనూ సరియైన ప్రవేశం, అభినివేశం లేకపోవడం వల్ల తెలుగులో నోట్సు తయారు చేసుకోలేక పోతున్నారు.

విద్యార్థుల ఆలోచనా ధోరణిలో కూడా ఒక సంక్షోభం ఏర్పడుతున్నది. వాళ్లు మామూలుగా తెలుగులో ఆలోచిస్తుంటారు; డిగ్రీ దాకా తెలుగు సంకేతాలద్వారా, శబ్దాలద్వారా ఆలోచించడం అలవాటై పోయింది. యం.ఏ.లోకి వచ్చి కొత్త ఇంగ్లీషు సంకేతాలను, శబ్దాలను, భావనలను, సిద్ధాంతాలను నేర్చుకుని తెలుగులోకి అనువదించి, వాటిని మళ్ళీ పరీక్షలో వాడి–అటు తరువాత జీవితంలో తెలుగు సంకేతాల (Symbols) ద్వారా ప్రసారించడమనేది (Communicating) విద్యార్థుల మానసిక వికాసాన్ని తీవ్రంగా గాయపరుస్తుంది. వీరిలో సమన్విత ఆలోచనా శక్తి (integrated thinking) కొరవడి, వారి వ్యక్తిత్వంలో నిండుతనం పోతుంది. వారు విఘటితవ్యక్తులుగా (Split personalities) రూపొందుతారు. ఇది విద్యా ప్రయోజనాలకు, సామాజిక ప్రయోజనాలకు పూర్తిగా విరుద్ధం.

సమాజశాస్త్రంలో బోధన, రచనల ఉద్దేశ్యం సమాజ శాస్త్రీయమైన ఆలోచనను పెంపొందించడమే. అది జరగాలంటే ప్రభుత్వ విధానంలో మార్పులు రావాలి. తెలుగును స్నాతకోత్తర బోధనా భాషగా ప్రకటించాలి. విశ్వవిద్యాలయాలల్లో ప్రత్యేకంగా తెలుగుబోధనా



(మిగతా 144 వ పేజీలో)

# ఆంధ్రప్రదేశ్‌లో వ్యవసాయ బోధన, పరిశోధన, విస్తరణ – ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ పాత్ర

డా. ఆలపాటి అప్పారావు
ఉపాధ్యక్షులు
ఆంధ్రప్రదేశ్‌వ్యవసాయవిశ్వవిద్యాలయం
హైదరాబాదు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రజల ప్రధాన జీవనాధారం వ్యవసాయం. రాష్ట్ర ఆదాయంలో దాదాపు 45 శాతం వ్యవసాయం నుండే లభ్యమవుతుంది. రాష్ట్రంలోని 77 లక్షల క్షేత్రాలలో దాదాపు 450 లక్షల జనాభా వ్యవసాయం పై ఆధారపడి ఉన్నారు. మనదేశంలో పండించే ఆహార పదార్థాలలో 8 శాతం మన రాష్ట్రంనుండే ఉత్పత్తి అవుతుంది. వ్యవసాయ ఉత్పత్తులను కేవలం ఆహారం, పశుగ్రాసం గానే కాకుండా, చక్కెర, నూలు, జౌలు, పొగాకు, నూనె మొదలగు వ్యవసాయ సంబంధ పరిశ్రమలలో ముడి పదార్థాలుగా వినియోగిస్తున్నారు. వీటితో పాటు అనేక మందికి వివిధ స్థాయిలలో ఉపాధి కల్పనావకాశాలు ఏర్పడుతున్నాయి. కాబట్టి మనదేశ మరియు రాష్ట్ర ఆర్థిక సామాజికాభివృద్ధి వ్యవసాయ పటిష్ఠతపై ఆధారపడి ఉన్నదని స్పష్టమవుతోంది.

పరిశోధన ద్వారా వ్యవసాయ విజ్ఞానాన్ని అభివృద్ధి పర్చుట, రైతులకు సహకరించే రీతిలో విద్యార్థులను విజ్ఞాన వంతులుగా చేయుట, తెలుసుకున్న విజ్ఞానాన్ని నైపుణ్యాంతో విస్తృత పర్చుట లాంటి విధులు నిర్వర్తిస్తున్న మనదేశంలోని వ్యవసాయ విశ్వవిద్యాలయాలు సేవానిరతితో కూడుకున్నవి. దేశంలో 1960 లో నెలకొల్పిన ఈ సంస్థలు నూతనత్వం సంతరించుకొన్నవి. వీటి వలన రైతులు, వివిధ పంటలు, పండ్ల ఉత్పత్తి, కోళ్ళ పరిశ్రమ, చేపల పరిశ్రమ, పాడి పరిశ్రమలలో పనిచేసే శ్రామికులు మరియు క్షేత్రంలో పనిచేసే వనితలకు సేవలు చేస్తూ, వ్యవసాయానికి అండగా ఉన్నాయి. ప్రస్తుతం మన దేశంలో 28 వ్యవసాయ విశ్వవిద్యాలయాలు ఉన్నాయి.

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయాన్ని 1964 లో ఏర్పరచి అప్పటికే కొనసాగుతున్న వ్యవసాయ, పశువైద్య, గృహవిజ్ఞాన శాస్త్ర విభాగాలను ఈ విశ్వవిద్యాలయంలోనికి మార్చారు. మరి రెండు సంవత్సరాల తరవాత పరిశోధనా అవస్థాపన, పరిశోధనా స్థానాలు, పరిశోధనా పథకాలను ఈ సంస్థ అధీనంలోకి చేర్చారు. గత 24 సంవత్సరాలుగా విశ్వ విద్యాలయం ఎంతో కృషి చేసి, రాష్ట్రమంతటిలో 7 కళాశాలలను, 59 పరిశోధనా స్థానాలను ఎంతో సమర్థవంతంగా నిర్వహిస్తోంది. విశ్వ విద్యాలయమునకు సంబంధించిన ఆయా సంస్థలలో దాదాపు 1500 శాస్త్రజ్ఞులు పనిచేస్తున్నారు. ఈ విశ్వవిద్యాలయపు మూడు ప్రధాన కార్యకలాపాలు బోధన, పరిశోధన మరియు విస్తరణాలపై సంక్షిప్త నివేదిక క్రింద వివరించబడింది.

## విద్యాబోధన

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయవిశ్వవిద్యాలయంలో వ్యవసాయం, పశువైద్యం మరియు గృహవిజ్ఞానం అను మూడు విభాగాలున్నాయి. విశ్వవిద్యాలయపు ఏడు కళాశాలల్లో 3734 మంది విద్యార్థులు మూడు కేంపస్‌లలో విద్యాభ్యాసములో నిమగ్నులై ఉన్నారు.

బాపట్ల, రాజేంద్రనగర్, మరియు తిరుపతిలలో మూడు వ్యవసాయ కళాశాలలు, రాజేంద్రనగర్, తిరుపతిలలో రెండు పశువైద్య కళాశాలలు, హైద్రాబాద్, బాపట్లలలో రెండు గృహవిజ్ఞాన కళాశాలలు – ఆయా విభాగాలకు సంబంధించిన డిగ్రీ స్థాయి

కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. ఇటీవలనే ఏర్పడిన బాపట్ల గృహవిజ్ఞాన కళాశాల మినహా మిగిలిన అన్ని కళాశాలలో స్నాతకోత్తర కార్యక్రమాలు నిర్వహించబడుతున్నాయి. పిహెచ్.డి. కార్యక్రమాలు హైద్రాబాద్‌లోని అన్ని కళాశాలల్లో మరియు తిరుపతి పశువైద్య కళాశాలలో నిర్వహిస్తున్నారు. ఇవికాక వ్యవసాయ ఇంజనీరింగ్, బాపట్ల, ఉద్యానవన శాస్త్రం, రాజేంద్రనగర్ మరియు పాడి పశువుల విజ్ఞానం,తిరుపతిలో డిగ్రీస్థాయి కార్యక్రమాలను విశ్వవిద్యాలయం నిర్వహిస్తోంది. మన రాష్ట్రప్రభుత్వం నిర్వహించే ఇమ్‌సెట్ EAMCET ప్రవేశ పరీక్ష మార్కుల ఆధారంగా ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయానికి సంబంధించిన ఆయా డిగ్రీ కోర్సులలో ప్రవేశం లభిస్తుంది. బి.ఎస్.సి. (వ్యవసాయం) 440, బి.వి.యస్.సి. అండ్ ఎ.ఎన్.160, బి.ఎస్.సి. (గృహ విజ్ఞానం) 140, బి.ఎస్‌సి (ఉద్యానవన శాస్త్రం) 30, బి.టెక్ (వ్యవసాయ ఇంజనీరింగ్) 30, మరియు బి.ఎస్.సి. (పాడి పశువిజ్ఞానం) 20 మంది విద్యార్థినీ విద్యార్థులను ప్రతి సంవత్సరం చేర్చుకోవడం జరుగుతుంది. స్నాతకోత్తర స్థాయి వ్యవసాయ శాస్త్రంలో 200, పశువైద్య శాస్త్రంలో 90 మరియు గృహ విజ్ఞాన శాస్త్రంలో 24 మందిని, పి.హెచ్.డి. కోర్సునకు సర్వీసు కోటాతో పాటు వ్యవసాయ శాస్త్రంలో 38, పశువైద్య శాస్త్రంలో 26 మరియు గృహవిజ్ఞాన శాస్త్రంలో ఇద్దరిని చేర్చుకోవడం జరుగుతుంది.

వ్యవసాయం మరియు పశువైద్య విభాగాలలో విద్యార్థినుల సంఖ్య నానాటికి అధికమౌతుంది. గత పది సంవత్సరాలలో వ్యవసాయంలో చేర్చుకొన్న విద్యార్థినులు 15 నుండి 110 కి, పశువైద్య విభాగంలో 1 నుండి 20 మందికి పెరుగుట గమనార్హం. గృహ విజ్ఞాన శాస్త్ర విభాగంలో కేవలం విద్యార్థినుల ఉండటమే కాకుండా, అధ్యాపక విద్యార్థినుల నిష్పత్తి 1:8 ఉండి, అత్యధిక విద్యా ప్రమాణం కలిగి ఉండటం విశేషం. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం యొక్క ప్రత్యేక విద్యావిధానం లోని ప్రధాన అంశాలు - సరళమైన కోర్సులు - విశ్వసనీయ పద్ధతి ఆధారంగా అంతర మూల్యాంకన విధానాన్ని అమలు పర్చుట. సెమిస్టరు, దాదాపు 100 పని రోజులు, విద్యాబోధనకుగాను కేటాయిస్తారు. ఈ కాలంలో విద్యార్థి నిర్వర్తనను 10 పాయింట్ స్కేలుతో నిర్ణయిస్తారు.

## గ్రామీణ వ్యవసాయ అనుభవ కార్యక్రమం

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం బి.ఎస్.సి. వ్యవసాయం, ఆఖరు సంవత్సరంలోని విద్యార్థులకై ఈ నిరుపమాన కార్యక్రమాన్ని మొట్టమొదటిసారిగాప్రారంభించింది. కార్యక్రమంలోని విద్యార్థులు నాలుగున్నర నెలలపాటు గ్రామాల్లో ఉండి పనిచేసి, రైతు క్షేత్ర వ్యవసాయాన్ని అనుభవ పూర్వకంగా మరియు ప్రత్యేకంగా తెలుసుకుంటారు. వారు గ్రామాల్లో ఉండటం వలన సాంకేతిక విజ్ఞానాన్ని అమలుపర్చడంలోగల సమస్యలను గుర్తించి వ్యవసాయం మరియు రైతుల పట్ల సదవగాహన చేసుకొనుటకు మంచి అవకాశం లభిస్తుంది.

## నేర్చుకొనుచూ ఆర్జించే పథకం

విద్యార్థులు ఈ పథకంద్వారా ప్రత్యక్ష ఆచరణశీల విజ్ఞానాన్ని మరియు కొంత ధనాన్ని వారి అధ్యయనంలో భాగంగా సంపాదించుకొంటారు. అంతేకాక ఈ పథకం స్వయంఉపాధి చేసుకొనేటట్లుగా విద్యార్థుల స్థైర్యతను వృద్ధిపరుస్తుంది. ఈ పథకం క్రింద, కూరగాయలు పెంపకం, ఫందుల పెంపకం, కోళ్లపరిశ్రమ మొదలగునవి ఉన్నాయి. లాభాలను సరిసమానంగా దీనిలో ప్రవేశం ఉన్న విద్యార్థులు తీసుకుంటారు.

## సాంకేతిక విజ్ఞానం

విశ్వవిద్యాలయం విద్యా విధానాన్ని మెరుగుపర్చుటకు, పాఠ్యప్రణాళికలో అవసరమైన మార్పులను చేయుటకు, బోధనా నైపుణ్యతను మెరుగుపర్చుటకు మరియు మూల్యాంకనప్రక్రియను

ప్రమాణీకరణం చేయటానికి నిరంతర ప్రయత్నాలు కొనసాగుతున్నాయి. ఇతర సంస్థలు "సాంకేతిక విజ్ఞానం"పై నిర్వహించే కార్యశిబిరాలకు, చర్చాగోష్ఠులకు హాజరుకావటానికి విశ్వవిద్యాలయ శాస్త్రజ్ఞులను ప్రతినిధులుగా పంపుతుంది. ఆగస్టు 87లో రాజేంద్రనగర్ వ్యవసాయ కళాశాల, భారత విశ్వవిద్యాలయాల అసోసియేషన్ సహకారంతో మూడురోజులపాటు "నమూనా ప్రశ్నల నిధి తయారీ" పై ఒక కార్య శిబిరాన్ని నిర్వహించింది. అంతేకాక జూన్ 88 లో "వ్యవసాయ విశ్వవిద్యాలయ అధ్యాపకులకై సాంకేతిక విజ్ఞానం" అను అంశంపై వేసవి శిక్షణను కూడా నిర్వహించింది. దేశంలోని వివిధ ప్రాంతాలనుండి అనేకమంది అధ్యాపకులు ఈ కార్యక్రమంలో పాల్గొన్నారు.

ఒకటి,రెండు దశాబ్దాలుగా ఎంతోమంది వ్యవసాయం మరియు పశువైద్య శాస్త్ర పట్టభద్రులకు ప్రభుత్వ వ్యవసాయ మరియు పశుసంవర్ధక విభాగాలలోను, ఉపాధి కల్పించబడేది. స్నాతకోత్తర పట్టభద్రులు విశ్వవిద్యాలయాలలోను వాణిజ్య బాంకులలోను పనిచేస్తున్నారు. గత పది సంవత్సరాలలో ఉపాధి విధానంలోగల ప్రత్యేక మార్పుల వలన ప్రస్తుతం చాలా కొద్ది మందికి మాత్రమే ప్రభుత్వ ఉద్యోగాలు లభిస్తున్నాయి. చాలామంది, ఉత్పాదకాల ఉత్పత్తి మరియు విక్రయ ఏజెన్సీ ఎరువులు, క్రిమిసంహారకాలు, ఔషధ తయారీలు, విత్తనాలు ఉపకరణములు, కోళ్ళు మరియు పాడి పరిశ్రమలలో, వ్యవసాయ సంబంధ పరిశ్రమలలో వాణిజ్య బ్యాంకులలో పనిచేస్తున్నారు. అయినప్పటికీ కొంత మంది పట్టభద్రులు స్వయంగా వ్యవసాయ వృత్తిని చేపట్టుట గమనించతగిన విషయం.

## పరిశోధన

రాష్ట్రవ్యాపితంగా వ్యవసాయం, పశుసంవర్ధక విభాగం, మత్స్య పరిశ్రమ, గృహ విజ్ఞానశాస్త్రం మరియు వ్యవసాయ అటవీ విభాగాలలో పరిశోధనలు నిర్వహించుట ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వ విద్యాలయం ప్రముఖ కర్తవ్యం. నేల, వర్షపాతం, పంట పద్ధతుల దృష్ట్యా రాష్ట్రాన్ని ఏడు వ్యవసాయ వాతావరణ మండలాలుగా విభజించారు. అభివృద్ధి చెందిన ప్రాంతీయ వ్యవసాయ పరిశోధనా స్థానాలు ఈ ఏడు ప్రాంతాలలో ఉన్నాయి. ఇవికాక ఎన్నో పరిశోధనా స్థానాలు రాష్ట్రమంతటా విస్తరించి ఉండి సంబంధిత ప్రాంతీయ వాతావరణ మండలాలతో కలసి ప్రాంతీయ ప్రత్యేకతగల పంటలు మరియు పశుగణాలకు సంబంధించిన వివిధ అంశాలపై పరిశోధనలు జరుపుతున్నారు.

వ్యవసాయ పరిశోధన యొక్క ప్రధాన విధి మేలైన రకాలను రూపొందించుట మరియు ఉత్పత్తిని స్థిరీకరించుటకు అవసరమైన సాంకేతిక విజ్ఞానాన్ని అభివృద్ధిపరుచుట ద్వారా ఉత్పాదకతను పెంపొందించుట. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయవు 222 పథకాలపై (181 వ్యవసాయ విభాగం, 32 పశువైద్య విభాగం, 9 గృహవిజ్ఞాన విభాగం), పరిశోధనలను, రాష్ట్ర (140), భారత వ్యవసాయ పరిశోధనా మండలి, (68) కేంద్ర ప్రభుత్వం (6) మరియు ఇతరములు (8) సహకారంతో నిర్వహిస్తోంది.

## పంటలపై పరిశోధన

పరిశోధనా స్థానాలను 1966లో బదిలీ చేసినప్పటినుండి వ్యవసాయ విశ్వవిద్యాలయం వివిధ పంటలకు సంబంధించిన 127 మేలైన రకాలను విడుదలచేసింది. వీటిలో స్వర్ణ, వజ్రం, ప్రతిభ, సురేఖ, తెల్లహంస, బి.పి.టి.1235, మసూరి, నోనామసూరి, సాంబ మసూరి, ఎన్.ఎల్.ఆర్.9672, ఎన్.ఎల్.ఆర్.9674, పి.ఎల్.ఎ.1100, ఎం.టి.యు.2067, ఎం.టి.యు.2077, వరిరకాలు; ఎల్.బి.జి.17 మినపరకం, ఎల్.ఆర్.జి.30 కందిరకం, అంబరు పాప్‌కార్న్; డి.హెచ్.ఎం.101 మరియు 103, మొక్కజొన్న; మోతి; జొన్నరకం; గోదావరి రాగిరకం; ప్రసాద్ కొర్ర; వరద వరిగ; ఎల్.పి.ఎస్.141 మరియు కృష్ణ పత్తిరకాలు; కదిరి-3 వెరుశనగ; కో.62175, కో-7219, కో.ఎ. 7602, కో-7508, కో-టి-8201 చెరకు రకాలు; జి-4, జి-5, సింధూర్, ఎల్.పి.ఎ.235 మిరప మరియు బి.పి.టి 1 నుండి 6 జీడిమామిడి రకాలు అత్యంత ప్రసిద్ధి చెందినవి. వీటిలో

కొన్ని రకాలు ఇతర రాష్ట్రాలలో కూడా ఆదరణ పొందాయి. వాటిలో ముఖ్యమైనవి జి-4, జి-5, మరియు ఎల్.సి.ఎ.235 మిరపకాయలను జాతీయ రకాలుగా విడుదల చేయడమే కాకుండా ఎల్.పి.ఎస్-141 పత్తిరకం దక్షిణ భారతదేశంలో తెల్లదోమ అధికంగా ఉన్న ప్రాంతాలలో ఈ మధ్యేవిడుదలచేశారు.

చీడలు మరియు తెగుళ్లను తట్టుకొనే రకాలను ఉత్పత్తి చేయుట ఆంధ్రప్రదేశ్ వ్యవసాయవిశ్వ విద్యాలయం యొక్క ముఖ్యమైన విధులలో ఒకటి. ఉల్లికోడును తట్టుకొను వరిరకాలు కాకతీయ మరియు సురేఖ, దోమపోటు తట్టుకొను రకాలు ఎం.టి.యు 5249, ఎం.టి.యు.5293, ఎం.టి.యు.4870, ఎం.టి.యు.2067, ఎం.టి.యు.2077, ఎం.టి.యు.5182 మరియు చెరకులో ఎర్ర కుళ్లును తట్టుకొను రకాలను అభివృద్ధిపర్చారు. పత్తిలో తెల్లదోమ సమస్యను విజయవంతంగా అరికట్టుటకు ఎల్.పి.ఎస్.141 మరియు ఎల్.కె.861 రకాలను అభివృద్ధిపర్చారు. మనరాష్ట్రంలో ఖరీఫ్ కాలంలో దాదాపు 79 శాతం విస్తీర్ణంలో ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయం విడుదల చేసిన వరిరకాలనే సాగుచేయుట విశేషకరమైన విషయం. పరిశోధనా ప్రయత్నాలవల్ల బి.పి.టి.1235 రకాన్ని 1986-87 వరకు రబీకాలంలో దాదాపు 85 శాతం విస్తీర్ణంలో సాగుచేయబడినది. రబీ వరి రకాలను ఒక నెల ముందు నాటుట వలన అత్యధిక ఉత్పత్తిని సాధించి రూ.150-160 కోట్లు సముపార్జించడం జరిగెను. భారతదేశంలో మన రాష్ట్రం విస్తీర్ణము రీత్యా ఆరవ స్థానంలో ఉన్నప్పటికి 1983-84 సంవత్సరంలో 87.9 లక్షల టన్నుల ఉత్పత్తిని సాధించి ప్రథమ స్థానాన్ని పొందింది.

కృష్ణా, గుంటూరు జిల్లాలలో 1984-85 సంవత్సరంలో వరి పంట తరవాత ఎల్.బి.జి.17 రకాన్ని 2-2.5 లక్షల హెక్టారులలో సాగుచేయగా సరాసరి దిగుబడి హెక్టారుకు 1.0 టన్నులు సాధించబడెను. ఈ దిగుబడి ఇంతకు ముందు ఎన్నడూ లేదు. వరి పంటకు జింకుధాతు లోపాలను గుర్తించడం, ఫాస్ఫరస్, జింకు, ఇనుము మరియు ఇతర పోషక పదార్థాల లోపాలుగల ప్రాంతాలను రాష్ట్రవ్యాప్తంగా గుర్తించి, ఈ లోపాలను సరిదిద్దడానికి అవసరమైన చర్యలు తీసుకోవడం ద్వారా పంటల దిగుబడిని హెక్టారుకు 2 నుండి 6 క్వింటాళ్ల వరకు పెంచారు. వ్యవసాయ పనిముట్లు, మరియు పంటల నిల్వల సాంకేతిక విషయాలలో పరిశోధనలకు అధిక ప్రాధాన్యతను ఇస్తున్నారు.

సమర్థవంతమైన నీటి వాడుక విధానాన్ని ప్రోత్సహించడంతోపాటు, నీటివాడుక నియంత్రణపై పరిశోధనలు అధికతరం చేయబడ్డాయి. నాగార్జునసాగర్ ఎడమ పరీవాహక ప్రాంతంలో లభ్యమయ్యే నీటిని నియంత్రణలో క్రమశిక్షణ పాటించడం వలన రెండు లేక మూడు పంటలు పండించవచ్చునని నిర్ణయించడమైనది. ఈ ప్రాంతంలో పెసరపంట ఆధారంగా పండించే పద్ధతులు, వరిపంట ఆధారంగా పండించే పంటలకన్నా అధిక లాభసాటిగా ఉన్నాయి.

## ప్రకృతి భీభత్సాలు మరియు సందిగ్ధావస్థల నియంత్రణ

ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయ శాస్త్రవేత్తలు, వరదలు, తుఫానులు మరియు ఉప్పెనలు వంటి ప్రకృతి భీభత్సాలు 1977, 1979, 1983, మరియు 198 6లో వచ్చినప్పుడు రైతాంగం వెంట నిలచి వారికి చేయూతనిచ్చిరి. ఈ ప్రకృతి భీభత్సాలకుగురియైన ప్రాంతాలలో త్వరితగతిని పంటలను పెంచడంలో అవిరళ కృషి చేశారు. అగష్టు 1986 గోదావరి వరదలు తరవాత వ్యవసాయ శాస్త్రవేత్తలు రాష్ట్రంలో వరదలకు గురియైన ప్రాంతాలలో 100 కోట్ల విలువచేసే వరి ధాన్యాన్ని పండించడంలో ఎంతగానో సహకరించారు.

ఆహారధాన్యాల ఉత్పత్తి 1956-57లో 56.22 లక్షల మెట్రిక్ టన్నులుకాగా 1984-85లో 118.82 లక్షల మెట్రిక్ టన్నుల రికార్డు స్థాయికి చేరుకుంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం 1970-71 నుండి 1984-85 మధ్య కాలంలో ఆహారధాన్యాల ఉత్పత్తిలో 3.16 శాతం అభివృద్ధి స్థాయిని సాధించింది. ఈ స్థాయి దేశం మొత్తం మీద 2.7 శాతం మాత్రమే. నిలకడయైన ఆహారధాన్యాల ఉత్పత్తిని

సాధించిన ఐదు రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. ఈ అభివృద్ధితో పోలిస్తే జనాభా అభివృద్ధి 2.08 శాతం. ఈ వ్యవసాయ విశ్వ విద్యాలయం ఉత్పత్తిచేసిన సాంకేతిక పరిజ్ఞానమే ఈ అభివృద్ధి అంతటికి మూలాధారం.

## పశుసంవర్ధక పరిశోధన

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి గర్వకారణమైన ప్రఖ్యాత ఒంగోలు జాతి పశువుల అభివృద్ధికై లాం ఫారం ప్రధాన కేంద్రంగా సామూహిక మందల పరీక్ష పథకం అమలులో ఉంది. లాంలో హోల్‌స్టైన్-ఫ్రిజియన్, జర్సి, బ్రౌన్‌స్విస్ వంటి మేలుజాతి పశువులయొక్క ఘనీభవింపజేసిన వీర్యాన్ని ఒంగోలుజాతి ఆవులతో సంకరపరచి మేలైన సంతతిని అభివృద్ధి పరచుచున్నారు. ఈ విధంగా సంకరపరచిన పశుజాతులలో హోల్‌స్టైన్ ఫ్రిజియన్‌ను ఒంగోలు జాతి ఆవులతో 50 శాతం స్థాయిలో సంకరపరచిన ఆవులు చాలా మంచి దిగుబడులను ఇచ్చుచున్నవి.

చిత్తూరు జిల్లాలోని పలమనేరు గొర్రెల పథకంలో డార్‌సెట్ x నెల్లూరు సంకర గొర్రెలను ఉత్పత్తి చేస్తున్నారు. ఈ సంకర గొర్రెలకు రాష్ట్రమంతటా గొర్రెల పెంపకందార్ల నుండి మంచి గిరాకీవుంది. రాజేంద్రనగర్‌లోని కోళ్ల పథకంలో రెండు అధిక దిగుబడి రకాలను ఉత్పత్తి చేశారు. వాణిజ్యరకాలతో పోల్చిచూస్తే ఈ రకాలు మేలైనవి. తిరుపతిలోగల పందుల పథకంలో దేశీయ పందులను మేలుజాతి యార్క్‌షైర్ పందులతో సంకరపరచి మేలుజాతి సంకర పందులను ఉత్పత్తి చేయుచున్నారు.

## గృహవిజ్ఞాన శాస్త్రం

గృహవిజ్ఞానశాస్త్ర రంగంలో నాలుగు ప్రధాన విభాగాలైన ఆహారం-పోషణ మానవాభివృద్ధి-కుటుంబ అంశాలు, కుటుంబ వనరుల నిర్వాహణ మరియు బట్టలు-దుస్తులు అన్న అంశాలపై పరిశోధనలు కొనసాగుచున్నవి. ఈ పరిశోధనలు గ్రామీణ ప్రజల జీవన అవసరాలకు ఎంతో అనువైనవి. ఈదిగువపేర్కొన్న కొన్నిపథకాలు ఇప్పటివరకు సమర్థవంతంగా పూర్తిగావింప బడ్డాయి.

ఎ. చిరుధాన్యాలను బాగుచేసే సాంకేతిక పరికరము డీహల్లర్.

బి. ఇండ్లలో పంటనిల్వల నష్టాలను తగ్గించడానికి సమర్థవంతమైన పద్ధతులు.

సి. గణాంక వివరాల ఆధారంగా ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో పోషణ పథకాల రూపకల్పన.

డి. ఆంధ్రప్రదేశ్‌లో వాడుకలలో నున్న వివిధ ఆహార పదార్థాల వాడుక విధానం, పోషణస్థాయి మరియు పోషక విలువల నష్టాల వివరాలను తెలియచేసే మూలకారణాలను అధ్యయనం చేయుట మరియు

ఇ. గణాంక వివరాల ఆధారంగా వివిధ ఇంధన వనరులు రూపాలు మరియు వాటి వినియోగ స్థాయిని అధ్యయనం చేయుట.

## విస్తరణ విద్య

క్షేత్రస్థాయిలో విస్తరణాభివృద్ధివ్యవసాయశాఖ బాధ్యత అయినప్పటికి, ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వ విద్యాలయ విస్తరణ విభాగం, ప్రాథమిక విస్తరణ కార్యకలాపాలైన, రైతుల పొలాలలో కొత్త సాంకేతిక పద్ధతులను పరీక్షించి ప్రవేశపెట్టడం, సాంకేతిక సమాచారాన్ని రూపొందించడం, రాష్ట్ర మరియు ఇతర అభివృద్ధి శాఖల విస్తరణశాఖ సిబ్బందికి శిక్షణ, పరిశోధన-విస్తరణ సంబంధాలను అభివృద్ధిపరచటానికి తగిన విధానాలు-చర్యల రూపకల్పన, నవీన విస్తరణ పద్ధతుల పథకాలను రూపొందించడం మున్నగు విషయాలలో ఎంతగానో కృషి చేస్తోంది.

## విస్తరణ విద్యా విభాగాలు

ఆరు ప్రాంతీయ వ్యవసాయ పరిశోధన స్థానాలలో పాలెం, జగిత్యాల, నంద్యాల, తిరుపతి, లాం, గుంటూరు మరియు అనకాపల్లిలో విస్తరణ విద్యా విభాగాలు వున్నాయి. ఈ విభాగాలు ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయంలో 1982లో జరిగిన విస్తరణ సేవల పునర్వ్యవస్థీకరణ జరిగిన తరువాత ఏప్రిల్, 1982 నుండి పనిచేయుట ప్రారంభించాయి.

ఒక్కొక్క విభాగం ఆ వ్యవసాయ వాతావరణ మండలంలోని కార్యకలాపాలైన – ఆ పరిశోధనా స్థాన పరిధిలోగల క్షేత్రాలలో ముందుగా ఆచరణ యోగ్యమైన పరీక్షలు నిర్వహించి, అచ్చటి రైతుల సామాజిక–ఆర్థిక సామర్థ్యానికి అనుగుణమైనదీ లేనిదీ పరీక్షించి, ఆ సమాచారాన్ని శాస్త్రవేత్తలకు పంపి, ఆ ప్రాంతాలలో వారి సిఫార్సులను మెరుగుపరచడానికి ఉపకరిస్తాయి. ఇతర కార్యక్రమాలలో కొత్తసాంకేతిక పద్ధతులను నిర్వహించడంలోగల ఇబ్బందులను పరిశీలించి నిర్ధారించడం, రైతులకు, విస్తరణ సిబ్బందికి ప్రత్యేక విభాగాలలో శిక్షణ ఆఖరి సంవత్సరం బి.ఎస్‌సి. వ్యవసాయం విద్యార్థులకు గ్రామాలలోనే వ్యవసాయమును గూర్చి నాలుగున్నర నెలల పాటు శిక్షణ ఇవ్వడం మరియు వ్యవసాయ క్షేత్రాల ప్రదర్శన, వ్యవసాయదారుల చర్చా సమావేశాలు, వ్యవసాయ ప్రదర్శనలు, సమాచార కేంద్రాలు మున్నగునవి నిర్వహిస్తారు.

## వ్యవసాయసమాచారం మరియు ప్రసార కేంద్రం

ఈ కేంద్రంలో విశ్వవిద్యాలయంలోనూ మరియు ఇతర అనుబంధ సంస్థలద్వారా ఉత్పన్నమైన అధునాతన పరిశోధన సమాచారాన్ని రూపుదిద్ది ప్రజలకు ప్రత్యేకించి రైతాంగానికి, విస్తరణ సిబ్బందికి అందజేస్తుంది. ఈ సమాచారాన్ని ప్రచురణలు, ఆకాశవాణి, పత్రికలు మరియు దూరదర్శన్ ద్వారా అందజేయడంలోని ముఖ్యోద్దేశం – రాష్ట్ర వ్యవసాయశాఖ మరియు విశ్వవిద్యాలయ విస్తరణ కార్యక్రమాలను బలపరచడం. దీనితోపాటు, వ్యవసాయ ప్రదర్శనలు, సదస్సులు, రైతుల సమస్యలకు సమాధానాలు, దృశ్య పరికరాలను తయారు చేయడంతోసహా పంటల, పశుసంవర్ధక మరియు గృహవిజ్ఞాన శాస్త్ర విషయాలలో సాంద్ర పద్ధతులను ప్రసరించడం.

## కృషి విజ్ఞాన కేంద్రాలు

భారత వ్యవసాయ పరిశోధనాసంస్థ వారి అధ్వర్యంలో ఈ కేంద్రాలను అనంతపురం, రస్థకుంటుబాయ్, మరియు ఆముదాలవలసలలో నిర్వహిస్తున్నారు. ఈ కేంద్రాలలోను, ఈ కేంద్ర పరిధిలోగల రైతులకు, రైతు మహిళలకు మరియు యువకులకు సంబంధించిన అత్యవసర వ్యవసాయ, పశుసంవర్ధక మరియు గృహ విజ్ఞాన శాస్త్ర సంబంధమైన అంశాలలో స్వల్పకాలిక మరియు దీర్ఘకాలిక శిక్షణా కార్యక్రమాలను నిర్వహిస్తాయి. వీరు అర్థాంతరంగా స్కూలు మానివేసిన వారికి, అనియత విద్యా కార్యక్రమాలు, రైతులకు వృత్తి విద్యా కార్యక్రమాలు చేబడుతున్నారు. రైతు దినోత్సవాలు, రైతు సందర్శనలు రైతు ప్రదర్శనలు, ఆకాశవాణిలో రైతు చర్చలు, చర్చామండల్లు మున్నగునవి నిర్వహించడం. ఈ కృషి విజ్ఞాన కేంద్రాలు ఇప్పటివరకు 1570 శిక్షణా కార్యక్రమాల్లో 25,085 మంది రైతులకు శిక్షణ నిచ్చాయి.

## జాతీయ ప్రదర్శన క్షేత్రాల పథకం

భారత వ్యవసాయ పరిశోధనాసంస్థ అధ్వర్యంలో, 1967 నుండి ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విశ్వవిద్యాలయంచే నిర్వహింపబడుచున్నది. ప్రస్తుతం ఈ పథకం అనంతపురం, వరంగల్లు మరియు విశాఖపట్నం జిల్లాలలో మూడు కేంద్రాలలో ఉన్నది. నిర్దిష్టమైన కాలంలో, నిర్దిష్టమైన భూవైశాల్యంలో ఉత్పత్తిని అధికతరం చేయడానికి తగిన పద్ధతులను సిఫార్సు చేయడం మరియు తద్వారా అధిక దిగుబడి వంగడాలను, పంటల క్రమాన్ని రైతుల పొలాలలో వేర్వేరు శాఖలలోని శాస్త్రవేత్తలు చక్కగా రూపొందించిన ప్రదర్శన క్షేత్రాల ద్వారా సాంకేతిక పరిజ్ఞానాన్ని విస్తరింపచేయడం ఈ పథకం యొక్క ముఖ్య ఉద్దేశం. ఈ పథకం కర్నూలు, చిత్తూరు, కడప, పశ్చిమగోదావరి, గుంటూరు, మెదక్, విజయనగరం మరియు రంగారెడ్డి జిల్లాలకు విస్తరించివుంది. ఈ పథకం యొక్క ఫలితాలు, రాష్ట్ర వ్యవసాయశాఖ విస్తరణ కార్యకలాపాలకు ఎంతగానో సహకరించాయి. ఇప్పటివరకు వివిధ ధాన్యాలు, పప్పుధాన్యాలు మరియు నూనె గింజల పంటలలో 1510 ప్రదర్శన

క్షేత్రాలు మరియు 3,428 రైతు దినోత్సవాలలో 83,542 మంది రైతులు పాల్గొన్నారు.

## పాలెం, మహబూబ్‌నగర్ జిల్లాలలో ఎస్.సి/ఒబిసి పథకం

ఈ పథకం షెడ్యూల్డ్ కులాల వారి సామాజిక – ఆర్థిక పరిస్థితులను మెరుగు పరచడానికై స్థాపించబడింది. ఈ పథకం ద్వారా వ్యవసాయం, పశుసంవర్ధక, ఆరోగ్యం మరియు పోషణకు సంబంధించిన అంశాలపై నవీన సాంకేతిక పరిజ్ఞానాన్ని ప్రవేశపెడుతున్నారు. షెడ్యూల్డ్ కులాల రైతులకు, భూములులేని వ్యవసాయ కూలీలకు విజ్ఞానాన్ని పెంపొందించి వారియొక్క వృత్తిపరమైన సామర్థ్యాన్ని అభివృద్ధిపరచి వారికి శిక్షణ పథకాల ద్వారా వృత్తి నైపుణ్యాన్ని అలవర్చడం. ఇప్పటివరకు 440 రైతు కుటుంబాలను దత్తత తీసుకొని, పంటలపై 547 ప్రదర్శన క్షేత్రాలు నిర్వహించారు. ఆరు కోళ్ల విభాగాలు నెలకొల్పబడ్డాయి. తొంభైఐదు మందికి కుట్టుపని మెళకువలు నేర్పారు. ఒక వెయ్యితొంభైఐదు పశువులకు టీకాలు వేయించారు. వీటితోపాటు అనేక విద్యా కార్యక్రమాలు నిర్వహించారు.

## విస్తరణ విద్యా సంస్థ, రాజేంద్రనగర్

ఈ సంస్థ భారత ప్రభుత్వం వారి ఆర్థిక సహాయంతో, ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ విద్యాలయం వారి ఆధ్వర్యంలో 1962 నుండి పనిచేయుచున్నది. ఈ సంస్థ కేరళ, కర్ణాటక, తమిళనాడు, ఆంధ్రప్రదేశ్, ఒరిస్సా, పశ్చిమబెంగాలు ఆరు రాష్ట్రాలలోను మరియు కేంద్ర పాలిత పాండిచ్చేరి, అండమాన్ నికోబార్ దీవులలోని మధ్య తరగతి విస్తరణ కార్యనిర్వాహకులకు, విస్తరణ విధానం, ప్రసార సాంకేతిక పద్ధతులు, విస్తరణ నిర్వహణ, విస్తరణ కార్యక్రమాల పర్యవేక్షణ మరియు నియంత్రణ విభాగాలలో శిక్షణ నిస్తోంది. ఇంతవరకు, ఈ సంస్థ నిర్వహించిన 277 శిక్షణ కార్యక్రమాలలో 5444 మంది పాల్గొన్నారు.

## పరిశోధనాశాల నుండి పంట పొలాలకు కార్యక్రమం

ఈ పథకం భారత వ్యవసాయపరిశోధనా మండలివారి ఆధ్వర్యంలో ఆ సంస్థ స్వర్ణోత్సవాల గుర్తుగా ఈ విశ్వవిద్యాలయంలో 1979లో ప్రారంభించబడింది. ఈ కార్యక్రమం శాస్త్రవేత్తలు నేరుగా రైతాంగంతో కలసి పనిచేసి వారికి తగిన వ్యవసాయ మరియు సంబంధిత విషయాలలో సాంకేతిక పరిజ్ఞానాన్ని రూపొందించడానికి ఉద్దేశింపబడింది. అట్టి సాంకేతిక పరిజ్ఞానం చిన్న సన్నకారు మరియు భూములులేని వ్యవసాయ కూలీల వనరులకు అనుగుణంగా ఉండాలని, తక్కువ ఖర్చు, సంబంధిత సాంకేతిక విజ్ఞానం ద్వారా రైతుల రాబడి, ఉత్పత్తి మరియు ఉద్యోగ అవకాశాలను పెంపొందించడానికి ఉద్దేశింపబడింది. అట్టి సాంకేతిక పరిజ్ఞానాన్ని పరీక్షించడానికి, అత్యవసరమైన పెట్టుబడులను, శాస్త్రవేత్తల నిర్ణయానుసారం రైతులకు ప్రోత్సాహకాలుగా ఇస్తున్నారు. ఈ కార్యక్రమ తొలిదశ 1979–82లో 6,000 రైతు కుటుంబాలలో ప్రారంభించబడినది. రెండవదశ 1982–84లో 8484 రైతు కుటుంబాలకు, మూడవదశ 1984–86లో 6,100 రైతు కుటుంబాలకు, నాల్గవదశ 1986లో 4,050 రైతు కుటుంబాలకు ఆంధ్రప్రదేశ్‌లోని అన్ని జిల్లాలలోను విస్తరించబడినది. కానీ, ఆర్థిక ఇబ్బందుల వలన 1–10–1982 నుండి రైతు కుటుంబాల సంఖ్య 300కు తగ్గించబడినది. ఈ విధంగా మొత్తం మీద 25,233 ఉపకారం పొందిన రైతులు 56,405 మంది ప్రదర్శనా క్షేత్రాలు, ప్రయోగాలలో పాల్గొన్నారు. 15,329 మంది రైతులు పాల్గొన్న 502 శిక్షణా కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి. ఇదేవిధంగా పెక్కుమంది రైతులు పాల్గొన్న రైతు దినోత్సవాలు, కిసాన్ మేలాలు, ప్రదర్శనలు, విస్తరణపక్షోత్సవాలతో కూడిన అనేక ఇతర విద్యా కార్యక్రమాలు నిర్వహించబడ్డాయి. ప్రస్తుతం ఈ కార్యక్రమం ముందు పేర్కొన్న మూడు కృషి విజ్ఞాన కేంద్రాలలో అమలులో ఉన్నది.

ఈ విశ్వవిద్యాలయం గృహ విజ్ఞానశాస్త్రంలోని ప్రాథమిక విస్తరణ కార్యకర్తలకు స్త్రీ-శిశు సంక్షేమ శాఖలో శిక్షణనిస్తుంది. వేరువేరు స్థాయిల్లో వర్గాల ప్రజలకు తగిన ప్రచురణలను రూపొందిస్తుంది. సమీకృత శిశు అభివృద్ధి పథకం కార్యకర్తలకు శిక్షణ నివ్వడం గృహవిజ్ఞాన శాస్త్ర విస్తరణ యొక్క ముఖ్య కర్తవ్యం.

పైన పేర్కొన్న విస్తరణ విభాగాలు, కార్యనిర్వహణ రంగంలో అవసరమైన కార్యాచరణకు సంబంధించిన వ్యవసాయ, పశుసంవర్థక, ఉద్యానవన, స్త్రీ-శిశు సంక్షేమ శాఖలతోను మరియు జిల్లా గ్రామీణాభివృద్ధి సంస్థలతోను చక్కని సంబంధములను పెంపొందించు కున్నాయి.

ఈ విశ్వవిద్యాలయం-విస్తరణ కార్యక్రమాలలో భాగంగా తమ పరిశోధనలను రాష్ట్ర వ్యవసాయ శాఖ మరియు రాష్ట్రంలోని ఇతర అభివృద్ధి శాఖలతో సంబంధాన్ని స్థాపించడానికి అనేక పద్ధతులను రూపొందించింది. ఈ సంబంధాల ద్వారా ఈ శాఖలకు సమర్థవంతమైన సేవలనందించి వాటి నిర్వాహణను అభివృద్ధిపరచడంలోను, వ్యవసాయం మరియు గ్రామీణాభివృద్ధి విషయాలలో నిమగ్నమైన అభివృద్ధి శాఖల కార్యక్రమాలకు ఆయా ప్రాంతాలకు తగిన నిర్దిష్టమైన సాంకేతిక మార్గాలను సూచిస్తోంది. ఉదాహరణకు: రాష్ట్ర వ్యవసాయ శాఖతో సంవత్సరానికి ఒకసారి సమావేశమయ్యే రాష్ట్ర స్థాయి పరిశోధన-విస్తరణ సమన్వయ సంఘం, సంవత్సరంలో ఒకటి లేక రెండుసార్లు సమావేశమయ్యే రాష్ట్రస్థాయి పరిశోధన సలహా మండలి, ప్రాంతీయ స్థాయిలో సంవత్సరంలో రెండుసార్లు సమావేశమయ్యే రాష్ట్రస్థాయి, సాంకేతిక శిబిరాలు, మండల పరిశోధనా సలహా మండళ్ళు, విషయ పరీక్షా సంఘాలు, జిల్లా మరియు డివిజన్ స్థాయి నెలవారీ శిక్షణ మరియు సందర్శన శిబిరాలు, ఉమ్మడి క్షేత్ర సందర్శనలు, సర్వీసులోనున్నవారికి శిక్షణ కార్యక్రమాలు సాంకేతిక పరిజ్ఞానాన్ని అందజేసే ఉమ్మడి సంఘాలు, మరియు సమావేశ పథకాలు మున్నగు వాటితో ఈ విశ్వవిద్యాలయం చక్కని సంబంధాలను నెలకొల్పుకొని ఈ సాధనాల ద్వారా పరిశోధకులను, విస్తరణ కార్యకర్తలను, రైతులను, మరియు ఇతర సంస్థల వారిని దగ్గరకు చేర్చి వివిధ కార్యక్రమాలలో ఉమ్మడిగా పాల్గొని ముఖాముఖి చర్చించటానికి అవకాశాలను ఏర్పరచింది.

ఈ విశ్వవిద్యాలయం హైదరాబాద్ మరియు ఇతర ప్రాంతాల, దేశాలలోని జాతీయ, అంతర్జాతీయ సంస్థలతో పరస్పర సహకారంతో విద్యా, శిక్షణ మరియు క్షేత్ర రంగాలలోని అంశాలపై కార్యక్రమాలను నిర్వహించు చున్నది. వీటితోపాటు, ఆకాశవాణి, దూరదర్శిని మరియు పత్రికలతో సత్సంబంధాలు నెలకొల్పుకున్నది.



# అధ్యాపక సిబ్బంది కళాశాలల్లో యు.జి.సి పథకం

ఆచార్య సి.హెచ్. రఘురామ్
అర్థశాస్త్ర శాఖ,
డైరెక్టర్, అధ్యాపక సిబ్బంది కళాశాల,
ఉస్మానియా విశ్వవిద్యాలయం,
హైదరాబాద్.

అనువాదం : దావురాజు సుబ్బారావు
తెలుగు అకాడమి, హైదరాబాదు.

ఈ పత్రంలో మూడు భాగాలున్నాయి. కొత్తగా నియమించిన వారికి, వృత్తిలో ఉన్న (in service) ఉపాధ్యాయులకు పునరభ్యసన కార్యక్రమాల గురించి మొదటి భాగం తెలుపుతుంది. రెండో భాగం అధ్యాపక సిబ్బంది కళాశాలకు యు.జి.సి. పథకాన్ని తెలుపుతుంది. చివరిది ఉస్మానియా విశ్వ విద్యాలయంలో నెలకొల్పిన అధ్యాపక సిబ్బందికళాశాల పనిచేసే తీరును మూడవ భాగం సూచిస్తుంది.

I ఉపాధ్యాయుని ప్రేరణకు (motivation)విద్య నాణ్యతకు ఉన్న సునిశిత అనుబంధాన్ని జాతీయ విద్యా విధానం (NPE,1986) చక్కగా వివరించింది. ఈ ప్రయోజనం నిమిత్తం "ప్రత్యేక బోధన విషయాలు (Specific subjects) సాంకేతిక మెలకువలు (Techniques) పద్ధతి క్రమాల (methodologies)"పై క్రమబద్ధంగా పునరభ్యసనం ప్రతిపాదించింది.

ఉపాధ్యాయులకు ప్రేరణయే ప్రయోజనం కావటం వల్ల, ఈ లక్ష్యాన్ని సాధించడం ఎలాగ అనేది సునిశితమైన సమస్య. జాతీయ విద్యా విధానం (NPE) కింది అంశాలను ప్రతిపాదించింది.

ఎ) ఉపన్యాసకుల స్థాయిలో కొత్తగా ప్రవేశించిన వారికి బోధన పద్ధతి కార్యక్రమాలు, బోధన శాస్త్రాలు, విద్య, మనోవిజ్ఞానం మొదలైన వాటిలో ప్రత్యేకంగారూపరచనచేసిన

బి) వృత్తిలో ఉన్న ఉపాధ్యాయులందరికి ప్రతి 5 సంవత్సరాల్లో కనీసం ఒకసారి అయినా పునశ్చరణకోర్సులను వ్యవస్థాపించడం.

సి) విశ్వవిద్యాలయాల్లోని అంతః వనరులను ఉపయోగించుకొంటూ, అనేక కళాశాలలను దగ్గరగా చేర్చుతూ, పునరభ్యసన కార్యక్రమాలను వ్యవస్థాపించడం.

డి) సదస్సులలోనూ, గోష్ఠులలోనూ పాల్గొనటానికి ఉపాధ్యాయులను ప్రోత్సహించడం.

ఈ రోజు ఉన్న పరిస్థితుల దృష్ట్యా బోధన వృత్తిలో ప్రవేశించేవారికి ఆ వృత్తిని చేపట్టడానికి ఎటువంటి ప్రారంభమూ, ఎటువంటి శిక్షణ, లేదా తయారీ లేకపోవడంవల్ల పైన పేర్కొన్న ప్రతిపాదనలు చేయబడ్డాయి. క్రమబద్ధమైన శిక్షణ లోపించినప్పుడు, కొత్తగా నియమితుడైన ఉపాధ్యాయుడు తనకు తానుగా బోధన అనే కళను నేర్చుకోవలసిన అగత్యం ఏర్పడుతుంది. ఇటువంటి సందర్భాలలో అతడు అతని సహజాతాల పైన(instincts) ఆధారపడాలి, లేదా అతడు తెలుసుకున్నవాటినిబట్టి ఆచరింపదగినదీ అనుకొన్న ఎవరో ఒకరు ఆచరిస్తున్న నమూనాను ఆచరించాలి. మొదటి సందర్భంలో అతని సహజాతాలు అతనిని సరియైన మార్గంలో నడిపించవచ్చు లేదా నడిపించకపోవచ్చు. అప్పుడు ఫలితాలు కూడా ఏదో ఒక పద్ధతిలో ఉండవచ్చు. అతని వృత్తిలో అతని భవితవ్యం ఏవిధంగా ఉందో తెలియక పోవటంవల్ల కొత్తగా ప్రవేశించినవారు మొదట్లో చేసే ప్రయోగాత్మక విధానాలవల్ల ఎదురయ్యే ఆటంకాల వల్ల కలిగే నిస్పృహల వల్ల తప్పుదోవన పోవచ్చు. ఇక రెండో సందర్భంలో సరియైన విధానంలోఉన్న నమూనాన్ని ఆచరించటానికి ఎన్నుకోవటానికి తగిన విచక్షణా జ్ఞానాన్ని కలిగిఉండాలి; ఆ విధంగా ఎన్నుకొన్న విధానం నమూనాను చక్కగా అధ్యయనం చేయటానికి తగినన్ని నైపుణ్యాలు ఉండాలి. ఇదే కనక లేకపోతే అవాంఛనీయమైన మార్గాలలోకి

నవజాత ఉపాధ్యాయుడు మళ్ళిపోయే పెద్ద ప్రమాదం ఉంది.

అయితే ఉన్నత విద్యావిధానం ఇటువంటి సంభావ్యతా పరిగణనల మీద ఆధారపడి ఉండేట్లుగా చేయలేము. విద్యారంగపు తృతీయ వర్గంలో (Tertiary) విపరీతమైన విస్తృతి ఏర్పడింది. దీనికి అనుగుణంగా వివిధ కళాశాలల్లోకి ఉపాధ్యాయులను భర్తీ చేయవలసిన అవసరం ఏర్పడింది. అంతేగాక మొట్టమొదటిసారిగా ఉన్నతవిద్యను విశదపరుస్తున్న ప్రాంతాలకు ఉపాధ్యాయులను పంపడం కోసం పాక్షికంగా గ్రామీణ ప్రాంతాలలో అనేక కళాశాలలను స్థాపించడంలోని ఉద్దేశం. దీనివల్ల ఇతరులు ఆచరించటానికి వీలుగా వారు తమ నడవడికను మార్చుకోవలసిన గురుతరమైన భారం ఉపాధ్యాయుల మీద పడుతుంది. ఈ విధంగా చేయలేకపోతే విద్యా ప్రమాణాల స్థాయి దిగజారుతుంది.

మనం ఎదుర్కొనే "విజ్ఞాన విస్ఫోటనం" (Knowledge explosion) వల్ల పరిస్థితి ఇంకా విషమిస్తుంది. ఉన్నచోటనే ఉండటానికి ఉపాధ్యాయుడు "ఎలిస్ బోధకురాలు రెడ్‌క్వీన్" మాదిరిగా పరుగెత్తుతూనే ఉండాలి. ఈ విధంగా చేయలేక పోతే ఉపాధ్యాయుడు వెనకబడిపోవటానికి ఎక్కువ కాలం పట్టదు. ప్రత్యేకమైన చర్యలు తీసుకోకపోతే ఉన్నత విద్యావిధానంలోకి వాడుకలోని విధానాలు పాతుకొని పోతాయి.

బోధన వృత్తి అంటే బోధన మాత్రమే కాదు. నిజంగాచెప్పాలంటే ఉపాధ్యాయుడు–మార్గదర్శకుడు సలహాదారుడు, మంచిమిత్రుడు, అనుకరింపదగిన ఆదర్శవంతుడై ఉండాలి. అతడు పోషించవలసిన పాత్రకు పాక్షికంగానైనా న్యాయం చేకూర్చాలంటే, ఉపాధ్యాయునికి స్థూలదృష్టి ఉండాలి; అంతేగాక స్థూలంగా సామాజిక అవసరాలకు అతని వృత్తి అనుబంధాన్ని ఏర్పరచాలి; వాంఛనీయమైన విలువలకు అతను ప్రాతినిధ్యం వహించాలి. ఇంతటితో సరిపోదు. అతను ఈ విలువలను ధృవపరుస్తున్నట్లు అనిపించాలి. ఇందుకు అతను ఈ విలువలకు అనుగుణంగా తన్నుతాను మలుచుకొని, సంఘం ఏవైతే సరియైన ప్రమాణాలు, విలువలు అనుకుంటుందో వాటికి అధీనుడు కావాలి.

అందువల్ల కొత్తగా బోధనావృత్తిలో ప్రవేశించినవాడు అనేక లోపాలను ఎదుర్కోవాలి. వీటినుంచి బ్రతికిబట్టకట్టాడు అంటే అతని అదృష్టం లేదా స్వయంకృషి మీదనే ఎక్కువ ఆధారపడి ఉంటాడు. ఈ విధానం అతనికి తగిన ప్రేరణ ఇచ్చేందుకు ఏవిధంగానూ దోహదం చేయదు. ఈ లోపాలను ఎదుర్కోవటానికి వీలుగా నూతన ఆగంతకునికి సంస్థాపరమైన ఎటువంటి నౌకర్యాలు లేవు.

ఈ కారకాలన్నింటిని దృష్టిలో ఉంచుకొని విద్యారంగపు తృతీయ వర్గంలో ఉపాధ్యాయులకు పునరభ్యసన పథకాన్ని విశ్వవిద్యాలయ గ్రాంట్స్ పరిశీలక సంఘం (University Grants Commission) రూపొందించింది. వివిధశ్రేణుల్లోని ఉపాధ్యాయుల అవసరాలను దృష్టిలో ఉంచుకొని వివిధ కార్యక్రమాలను గూర్చి ఆలోచించారు. అందువల్ల నూతన ఆగంతకులకు మౌలికమైన నైపుణ్యాలకు (Basic skills) తగిన రకమైన విలువలకు ప్రాధాన్యం ఇస్తే, కొంతకాలంనుంచి సేవలలో నిమగ్నులైనవారికి ప్రాథమికంగా విషయాలలో (Subject) అధునాతన స్థితిగతులను తెలియచెప్పి వాటిలో వారి ప్రావీణ్యం పెంపొందించటానికి ప్రాధాన్యంఇచ్చారు.

జాతీయ విద్యా విధానం (NPE)1986 ఏర్పరచిన లక్ష్యాలను దృష్టిలో ఉంచుకొని ఈ పునరభ్యసన నిర్దిష్టకార్యక్రమాలు (Orientation Courses) ఉండాలని యు.జి.సి. తగినవిధంగా హెచ్చరించింది. దురదృష్టవశాత్తు మనదేశంలో ఇటువంటి కార్యక్రమాన్ని తెలియ చెప్పే నమూనా ఒకటుంటూ లేదు. నమూనా ఒకటి లేనప్పుడు పునరభ్యసన కార్యక్రమం సాంప్రదాయికమైన బి.యిడ్

(B.Ed) నిర్దిష్ట కార్యక్రమాలనే ప్రతిబింబించే ప్రమాదం ఉందని యు.జి.సి. భావిస్తోంది. పునరభ్యసన కార్యక్రమం అనే భావనలో మిళితమై ఉన్నతత్వం, శిక్షణపొందిన ఉపాధ్యాయులకు శిక్షణఇచ్చే లక్ష్యాలనుంచి మౌలికంగా భిన్నమైనది కావటంవల్ల బి.యెడ్ నిర్దిష్ట కార్యక్రమం మాదిరిగానే ఉండకుండా చేయాలి.

పునరభ్యసన నిర్దిష్ట కార్యక్రమాల స్థూల స్వభావాన్నిబట్టి, వీటి రూపరచనలో సరళత అవసరాన్ని యు.జి.సి. గుర్తించింది. యు.జి.సి. ఉద్దేశ ప్రకారం పునరభ్యసన నిర్దిష్టకార్యక్రమం "యువ ఉపన్యాసకునిలో అతని సాంఘిక, భావ, నైతిక పరిసరాలద్వారా ఆత్మస్థైర్యాన్ని పెంపొందించటానికి ఉద్దేశించబడింది. అతను పనిచేసే సంఘంలో ముఖ్యమైనసభ్యునిగా, మొత్తం సంఘంలోనూ, మేధా, నైతిక ప్రపంచంలోనూ, అతని పాత్రద్వారా అతని శక్తిని అతడే ఆవిష్కరించుకొనేట్లు ఈ కార్యక్రమం చేయాలి". భారతదేశ పరిస్థితులకు అనుగుణంగా ఈ కార్యక్రమాలను క్రమబద్ధం చేయవలసిన అవసరం ఎంతో ఉంది.

II జాతీయ విద్యావిధానంలోని ప్రశంసించదగిన ఈ లక్ష్యాన్ని అమలుపరచటానికి, కళాశాల, విశ్వ విద్యాలయాలలో కొత్తగా నియుక్తులైన ఉపన్యాసకులకు పునరభ్యసన పథకాన్ని యు.జి.సి. రూపొందించింది. అధ్యాపక సిబ్బంది కళాశాలను (ASCS) అనేక విశ్వవిద్యాలయాలలో ఏర్పరచటానికి ఈ పథకం కింద యు.జి.సి. ఆర్థిక సహాయాన్ని కూడా అందచేసింది. ఈ అధ్యాపక సిబ్బంది కళాశాలలు (ASCS) "కళాశాలల్లోను, విశ్వవిద్యాలయాల్లోను కొత్తగా నియుక్తులైన ఉపన్యాసకులను అధ్యాపక సిబ్బంది పునరభ్యసన కార్యక్రమాలను క్రమం తప్పని రీతిలో ప్రణాళికా రచన, వ్యవస్థాపన, అమలుపరచడం పరివీక్షించడం, మూల్యాంకనం చేయడం వంటి విధులను చేస్తాయి. ఇందుకుగాను ప్రతి రాష్ట్రంలోను కనీసం ఒక అధ్యాపక సిబ్బంది కళాశాల (ASC) ఉండేటట్లుగా దేశం మొత్తంమీద 48 అధ్యాపక సిబ్బంది కళాశాలలకు యు.జి.సి. ఆర్థిక సహాయం అందచేసింది. మన రాష్ట్రంలో నాలుగు అధ్యాపక సిబ్బంది కళాశాలలు ఉన్నాయి. కళాశాలలు దశలవారీగా పునరభ్యసన కార్యక్రమాలను చేపడతాయి. మొదటి దశలో కొత్తగా నియుక్తులైన ఉపాధ్యాయులకు కార్యక్రమాలను చేపడతారు; తగినంతకాలం సేవచేసిన ఉపాధ్యాయులకు పునశ్చరణ (Refresher courses) తరగతులను తరవాత దశల్లోనిర్వహిస్తారు.

కొత్తగా నియుక్తులైన ఉపాధ్యాయులకు నాలుగు వారాల కాలపరిమితితో ఏకధాటిగా ప్రామాణిక కార్యక్రమాలను నిర్వహిస్తారు. తరవాత మళ్లీ అదనంగా ఇంకో విడత సీనియర్ ఉపన్యాసకుల ఇతరుల అవసరాలను తీర్చటానికి వీలుగా ప్రామాణిక కార్యక్రమాన్ని (module) 3 నుంచి 4 వారాల కాల పరిమితిలో నిర్వహించే యోచనలు ఉన్నాయి.

కొత్తగా నియుక్తులైన ఉపాధ్యాయులకు స్థూలదృష్టి, అధికమైన అవగాహన కల్పించేందుకు వీలుగా ఈ కార్యక్రమాలు మలచబడ్డాయి. ఈ సందర్భంలో అధ్యాపక సిబ్బంది కళాశాలలకు యు.జి.సి. కింది లక్ష్యాలను నిర్దేశించింది. కొత్తగా నియుక్తులైన ఉపాధ్యాయులకు కింది విషయాలలో సహాయం చేసేవిగా ఈలక్ష్యాలను ఉద్దేశించడమైంది.

ఎ) సాధారణంగా విద్య ప్రాముఖ్యం అవగాహన చేసుకోవటానికి, ప్రపంచ, భారతీయ విద్యా విధానాల్లో ప్రత్యేకంగా ఉన్నత విద్యను అవగాహన చేసుకోవటం.

బి) సంఘంలో మతరహిత వాదం, సమానత్వవాదం మూలసిద్ధాంతాలుగా నెలకొన్న హిందూ విధానానికి ప్రత్యేక అన్వయంతో విద్య, ఆర్థిక, సాంఘిక, సాంస్కృతిక అభివృద్ధి మధ్య ఉన్న సంబంధాలను అవగాహన చేసుకోవటం.

సి) మత రహితత్వం, సమానత్వం అనే జాతీయ లక్ష్యాలను సాధించడంలో కళాశాల విశ్వవిద్యాలయ ఉపాధ్యాయుని పాత్రను అవగాహన చేసుకోవడం.

డి) కళాశాలస్థాయి, విశ్వవిద్యాలయ స్థాయిల్లో బోధనలో మౌలిక నైపుణ్యాలను ఆర్జించుకొనడం, మెరుగు పరచుకోవటం.

ఇ) ప్రత్యేకంగా అతని సబ్జక్టులలో వచ్చే అభివృద్ధిని తెలుసుకోవటం.

ఎఫ్) కళాశాల, విశ్వవిద్యాలయం వ్యవస్థాపనం, నిర్వహణ అవగాహనం చేసుకోవటం; మొత్తం వ్యవస్థలో ఉపాధ్యాయుని పాత్రను తెలుసుకోవడం.

జి) మూర్తిమత్వము, చొరవ (initiative) సృజనాత్మకతలను పెంపొందించటానికి అవకాశాలను వినియోగించు కోవడం.

ఈ లక్ష్యాలను సాధించటానికి, నాలుగు అంశాలతో కూడిన పాఠ్యప్రణాళికను (Curriculum) యు.జి.సి. సూచించింది. అవి:

1) అంశం ఎ : సంఘం, పరిసరాలు, అభివృద్ధి, విద్య–వీటి సంబంధాల జాగృతిని కలిగించడం.
2) అంశం బి : విద్యాతత్వం, భారతీయ విద్య, భారతీయ విద్యావ్యవస్థ, విద్యాసిద్ధాంతం (Pedagogy)
3) అంశం సి : విషయాన్ని ఉన్నత పరచడం (Upgradation)
4) అంశం డి: నిర్వహణ, మూర్తిమత్వం అభివృద్ధి చేయడం.

విద్యలో విస్తృత భావనాన్ని సంఘంలో ఉపాధ్యాయుని పాత్రను గుర్తించడంకోసం ఉపాధ్యాయునికి సహాయపడటం కోసం అంశం "ఎ" ఉద్దేశించడం జరిగింది. తరగతిగదిలో ప్రతిభావంతంగా బోధించడానికి ఉపాధ్యాయునికి కావలసిన మౌలిక నైపుణ్యాలను అందచేయడమే అంశం "బి" ఉద్దేశం. పాల్గొనేవారి విషయ జ్ఞానాన్ని సమున్నతం చేయడం అంశం "సి" ఉద్దేశం. ఒక కళాశాలలో, విశ్వ విద్యాలయంలోని వివిధ వ్యవస్థల మధ్య ఉన్న సంబంధాలను ఉపాధ్యాయునికి అంశం "డి" తెలియ చేస్తుంది. ఇది వ్యవస్థలో ఉపాధ్యాయుని పాత్ర, విధులను మెచ్చుకునే విధంగా చేస్తుంది. ప్రతి అంశం కింద వివిధ విషయాలకు ఉదాహరణాలుగా పట్టికను యు.జి.సి. అందచేసింది. వారివారి అవసరాలకు తగినట్లు అధ్యాపక సిబ్బంది కళాశాలకు స్వేచ్ఛ ఉంది.

ప్రతి విద్యా సంవత్సరంలో కొత్తగా నియుక్తులైన అధ్యాపకులకు ఒక్కొక్కటి నాలుగు వారాలపాటు ఉండే కార్యక్రమాలవంటి 6–8 పునరభ్యసన కార్యక్రమాలను ప్రతి అధ్యాపక సిబ్బంది కళాశాల (ASC) ఏర్పాటు చేయాలని యు.జి.సి. సూచించింది. ప్రతి కార్యక్రమంలోను 40 మంది పాల్గొనే వ్యక్తులు ఉంటారు. వారిని వారి కళాశాలల నుంచి నిర్దిష్ట కార్యక్రమానికి ప్రతినిధిగా పంపాలి. దీనివల్ల కార్యక్రమం కాలవ్యవధిలో కళాశాలలకు వారి గైరు హాజరును డ్యూటీలో ఉన్నట్లుగానే పరిగణించటానికి వీలు కలుగుతుంది. వారికి రోజువారీ భత్యాలకు (స్థానికులకు రోజుకు రు.20.00; బయటి మకాం బత్తెం రోజుకు రు.40.00) ఇవ్వడానికి అర్హత ఉంటుంది. బయటి వారికి యు.జి.సి. నియమావళి ప్రకారం రానుపోను ప్రయాణపు బత్తెం లభిస్తుంది; అధ్యాపక సిబ్బంది కళాశాలకు అనుబంధంగా ఉన్న అతిథి గృహాల్లో వసతి గృహాల్లో (Hostels) ఉచితంగా మకాం చేసేందుకు వీలు ఉంటుంది. అయితే వారు భోజనవసతికి రుసుము చెల్లించాలి. పాల్గొనే వ్యక్తులందరికీ అట్టలు, పెన్‌లు, ఫోల్డర్‌లు, విస్తృత పఠన సామాగ్రి (extensive reading material) ఉచితంగానే ఇస్తారు. పాల్గొనే వ్యక్తులు ఉపయోగించటానికి తగిన గ్రంథాలయ వసతులు కల్పించటానికి అధ్యాపక సిబ్బంది కళాశాలకు సదుపాయాలుఉంటాయి.

ఈ నాలుగు వారాల కార్యక్రమంలోను వివిధ ప్రత్యేకతలనుంచి, శాఖలనుంచి (disciplines) ఆహ్వానించిన సాధన సంపన్నులు (resource persons) ప్రతిరోజు ఉపన్యాసాలు ఇస్తారు. పాల్గొనే ఉపాధ్యాయులు చురుకుగా పాల్గొనేట్లు చేయడమే ఈ సమావేశాలలో ప్రాధాన్యం వహిస్తుంది. వీటితోపాటు వివిధ చర్చా సమావేశాలు,

ఇతర సామూహిక వ్యాసక్తులు కూడా కార్యక్రమంలో ఒక భాగమే.

విషయాలను ఎంపిక చేసుకోవటంలో ఇంతకుముందు చెప్పినట్లుగా అసరళ విధానం (regid pattern) ఉండదు. ఎందువల్ల అంటే వారి అవసరాలకు తగినట్లుగా సూచించిన పాఠ్య ప్రణాళికను మార్పు చేసుకొనేందుకు అధ్యాపక సిబ్బంది కళాశాలకు యు.జి.సి. తగిన స్వేచ్ఛ ఇచ్చింది. ప్రతి అంశానికి (ముఖ్యంగా కొత్తగా నియుక్తులైన వారికి సంబంధించిన ఎ, బి, డి అంశాలు) ఇవ్వవలసిన భారత్వాన్ని (Weightage) కూడా అధ్యాపక సిబ్బంది కళాశాలలే నిర్ణయిస్తాయి. సిబ్బంది కళాశాల అనుబంధంగా ఉన్న విశ్వవిద్యాలయాల నుంచే సాధన సంపన్నులను(resource persons) ముఖ్యంగా ఆహ్వానిస్తారు; అయితే దేశంలోని ఎ ప్రదేశం నుంచి అయినా ప్రముఖ సాధన సంపన్నులను ఆహ్వానించే స్వేచ్ఛ ఉంది. అధ్యాపక సిబ్బంది కళాశాల ఉన్న విశ్వవిద్యాలయాన్ని సంప్రదించి దానికి ఒక ప్రత్యేకత క్షేత్రాన్ని కేటాయిస్తారు. ఒకటి లేదా అంతకంటే ఎక్కువ విశ్వవిద్యాలయాల అధికార పరిధిలోని అన్ని డిగ్రీకళాశాలలు ఒకే అధ్యాపక సిబ్బంది కళాశాల పరిధిలోకి రావచ్చు. అధ్యాపక సిబ్బంది కళాశాలకు జాతీయ లక్షణాన్ని చేకూర్చటానికి ఒక కార్యక్రమంలోని సీట్లలో 15 శాతంమేరకి ఆ అధ్యాపక సిబ్బంది కళాశాల ప్రత్యేకత క్షేత్రానికి వెలుపలగా ఉన్న పాల్గొనే వ్యక్తులకు కేటాయించటాన్ని ప్రోత్సహిస్తూ ఉంది.

కొత్తగా నియుక్తులైన ఉపన్యాసకులకు పునరభ్యసన కార్యక్రమాలను వ్యవస్థీకరించటం మాత్రమేకాక అధ్యాపక సిబ్బంది కళాశాలలకు విస్తృతమైన పరిధిని యు.జి.సి. ఊహించింది. ఇంతకుముందు తెలిపినట్లుగా అధ్యాపక సిబ్బంది కళాశాలలు పనిచేసే మొదటిదశలో మాత్రమే ఈ పనిని చేపడతాయి; రెండవ దశలోనూ తరవాత దశల్లోనూ ఈ కళాశాలలు ఇంతకంటె వైవిధ్యంతోను సవాళ్లతో కూడిన విధులను నిర్వహిస్తాయని ఆశించారు. అధ్యాపక సిబ్బంది కళాశాల విధులు అని కొంతమేరకు యు.జి.సి. పేర్కొన్న వాటిని కింది విధంగా వివరించవచ్చు.

ఒక రాష్ట్రంలో ఒకటి లేదా అంతకంటే ఎక్కువ విశ్వవిద్యాలయాల అధికార పరిధిలోకి వచ్చే కొత్తగా నియుక్తులైన కళాశాల, విశ్వవిద్యాలయ ఉపన్యాసకులకు పునరభ్యసన నిర్దిష్ట కార్యక్రమాలకు ప్రణాళికను తయారుచేయడం, వ్యవస్థీకరించడం, ఆచరణలో పెట్టడం, పరివీక్షించడం (monitor) మూల్యాంకనం చేయడం, అధ్యాపక సిబ్బంది కళాశాల విధులు, సేవలందిస్తూ ఉన్న ఉపాధ్యాయులకు, పునశ్చరణ నిర్దిష్ట కార్యక్రమాలనూ, సీనియర్ పరిపాలకులు, శాఖాధిపతులు (Heads of Departments) ప్రధానాచార్యులు (Principals) మొదలైన వారికి పునరభ్యసన కార్యక్రమాలనూ పునరభ్యసన తత్వశాస్త్రం, మారిన నిర్వహణ వ్యవస్థలపై వ్యవస్థాపించడం కూడా అధ్యాపక సిబ్బంది కళాశాలలు చేస్తాయి. ఒక అధ్యాపక సిబ్బంది కళాశాల నిర్దిష్టంగా

ఎ) పునరభ్యసన కార్యక్రమాన్ని సూత్రీకరిస్తుంది.

బి) వివిధ ప్రత్యేక విభాగాలలో ఉన్న సాధన సంపన్నులను (resource persons) గుర్తిస్తుంది. అటువారికి, పునరభ్యసన కార్యక్రమాలకు కావలసిన తత్వశాస్త్రాన్ని, మార్గదర్శక సూత్రాలను పరిచితం చేస్తుంది.

సి) గ్రంథాలయంతో సహా ప్రలేఖన కేంద్రాన్ని (documentation centre cum library) సంప్రదింపు కోసమూ, పునరభ్యసన నిర్దిష్ట కార్యక్రమాలకు అవసరమైన సాధన సంపత్తిని (resource materials) అందచేయడం.

డి) పునరభ్యసన నిర్దిష్ట కార్యక్రమాలను ప్రతిభావంతంగా ఆచరణలో పెట్టడానికి అవసరమైన ప్రత్యేకంగా రూపొందించిన వస్తు సామాగ్రిని తయారు చేయడం.

ఇ) పునరభ్యసన నిర్దిష్ట కార్యక్రమాల్లో వివిధ అంశాలనూ దశలనూ పరివీక్షించడం.

ఎఫ్) పునరభ్యసన నిర్దిష్ట కార్యక్రమాలను మూల్యాంకనం చేయడం.

జి) సేవలందిస్తున్న ఉపాధ్యాయులకు పునశ్చరణ నిర్దిష్ట కార్యక్రమాలను వ్యవస్థాపించడం.

హెచ్) పునరభ్యసన తత్వాన్ని పరిచయం చేయటానికి శాఖాధిపతులకు, ప్రధానాచార్యులకు, డీన్‌లకు (Deans) నిర్ణయాలు చేసే ఇతర అధికారులకు పునరభ్యసన కార్యక్రమాలను వ్యవస్థాపించడం. దీనివల్ల ఈ సీనియర్ విద్యా పరిపాలకులు సూపర్‌వైజర్‌లుగా వారి కొత్త పాత్రలను అవగాహన చేసుకోవటానికి, వివిధ స్థాయిల్లోని నిర్వహణ వ్యవస్థలను తగిన మార్పుల ద్వారా ఉన్నత విద్యలో ప్రవేశపెట్టి సంస్కరణలను తీసుకొని రావటానికి వీలు కలుగుతుంది.

III ఒక అధ్యాపక సిబ్బంది కళాశాల (ASC) స్థాపించటానికి యు.జి.సి. ఉస్మానియా విశ్వవిద్యాలయానికి ఆర్థిక సహాయం అందజేయటానికి సంసిద్ధతను తెలియచేసింది. ఈ ప్రతిపాదనను ఉస్మానియా విశ్వ విద్యాలయం ఆమోదించింది. దీనిప్రకారం ఒక అధ్యాపక సిబ్బంది కళాశాల ఉస్మానియా విశ్వ విద్యాలయంలో స్థాపించబడింది. మొదట దీన్ని యూనివర్సిటీ కాలేజ్ ఆఫ్ ఆర్ట్స్ మరియు సోషల్ సైన్స్ భవనంలో స్థాపించారు. ఇటీవలనే ఇది విశాలమైన భవనంలోకి మారింది.

ఉస్మానియా, కాకతీయ విశ్వవిద్యాలయాల అధికార పరిధిలో ఉన్న అన్ని డిగ్రీ కళాశాలలు ఉస్మానియా విశ్వవిద్యాలయపు అధ్యాపక సిబ్బంది కళాశాల పరిధిలోకి వస్తాయి. ఈ పరీవాహక్షేత్రంలో (Catchment area) సుమారు 115 కళాశాలలు ఉన్నాయి. ఇంతకుముందు చెప్పినట్లుగానే ఉస్మానియా విశ్వవిద్యాలయంలో ఉన్నదికాక ఇంకా మూడు అధ్యాపక సిబ్బంది కళాశాలలు ఆంధ్రప్రదేశ్‌లో పనిచేస్తున్నాయి. ఆంధ్ర విశ్వవిద్యాలయంలోనూ, (ఆంధ్ర, నాగార్జున పరీవాహక క్షేత్రాలుగా) యస్.వి. విశ్వవిద్యాలయంలోనూ,(యస్.వివిశ్వవిద్యాలయం , శ్రీ వెంకటేశ్వర విశ్వవిద్యాలయాలు పరీవాహక క్షేత్రాలుగా) ఆంధ్రప్రదేశ్ అంతా అధికార పరిధిలోకి వచ్చేట్లుగా హైదరాబాద్ విశ్వవిద్యాలయంలోనూ నెలకొల్పబడ్డాయి.

ఉస్మానియా విశ్వవిద్యాలయ అధ్యాపక సిబ్బంది కళాశాలకు ఒక ఉన్నతాధికార సలహా సంఘం ఉంది; ఈ సంఘం కళాశాలకు సంబంధించిన విద్యా, పాలనా విధానాలను నిర్ణయిస్తుంది. పాఠ్యప్రణాళిక వివరాలకు తుదిరూపం ఇవ్వటానికి, సాధన సంపన్ములను గుర్తించటానికి, ఒక విద్యా సంఘం (Academic Committee) ఉంది. అయితే ఈ సంఘంచేసిన సూచనలకు ఉన్నతాధికారసలహాసంఘం ఆమోదముద్ర పొందవలసి ఉంటుంది.

పునరభ్యసన కార్యక్రమాల్లో పాల్గొనే వ్యక్తులను డిగ్రీకళాశాలల్లో కొత్తగానియుక్తులైన ఉపాధ్యాయులు ఎన్నుకోవటానికి మొదట 13 విషయాలను (Subjects) సలహాసంఘం నిర్ణయించింది. వివిధ కళాశాలల్లోని వివిధ శాఖల్లోను ఉన్న బోధన సిబ్బంది సంఖ్య ఆధారంగా ఈ విషయాలను గుర్తించారు. ఎంపికచేసిన విషయాలనుకిందఇవ్వడంజరిగింది.

1. గణితం, భౌతికశాస్త్రం, రసాయనశాస్త్రం, వృక్షశాస్త్రం, జంతుశాస్త్రం – విశ్వవిద్యాలయ విజ్ఞానశాస్త్ర విభాగం. (Faculty of Science)
2. రాజనీతిశాస్త్రం, చరిత్ర, ఆర్థికశాస్త్రం, ప్రభుత్వ పాలన–సాంఘిక శాస్త్రాల విభాగం. (Faculty of Social Sciences)
3. తెలుగు, హిందీ, ఇంగ్లీష్ – కళల విభాగం (Faculty of Arts)
4. వాణిజ్యశాస్త్రం – వాణిజ్యశాస్త్ర విభాగం (Faculty of Commerce)

పాల్గొనే వ్యక్తులు కనక కొత్తగా నియుక్తులైన వారైతే ఇతర శాస్త్రాలనుంచి కూడా విద్యా సిబ్బంది కళాశాల ఆహ్వానించటానికి స్వేచ్ఛ ఉంది. నిబంధనను పరిత్యజించి కొన్ని సంవత్సరాలు ఉద్యోగం చేసిన ఉపాధ్యాయులను కూడా ఆహ్వానించేందుకు అధ్యాపక సిబ్బంది కళాశాలకు అనుమతి కూడా ఉంది.

ఉస్మానియా విశ్వవిద్యాలయంలోని అధ్యాపక సిబ్బంది కళాశాల నెలకొల్పినప్పటినుంచి డిగ్రీ కళాశాలల ఉపన్యాసకులకు రెండు పునరభ్యసన కార్యక్రమాలను నిర్వహించింది. యు.జి.సి. ఇచ్చిన మార్గదర్శక సూత్రాలకు అనుగుణంగా అవకాశం ఉన్న చోటల్లా కొత్తగా నియుక్తులైన ఉపన్యాసకులకే ప్రాధాన్యం (Preference) ఇవ్వడం జరిగింది. స్థానికులు కాని పాల్గొనే వ్యక్తులు, సాధన సంపన్నులు నివసించటానికి 8 డబుల్ బెడ్ రూములున్న ఉస్మానియా విశ్వవిద్యాలయం అతిథి గృహం అధ్యాపక సిబ్బంది కళాశాలకు అందు బాటులో ఉంది.

వివిధ కళాశాలల్లోనూ,విశ్వవిద్యాలయాల్లోనూ ఉన్న ఉపాధ్యాయులనుంచి అధ్యాపక సిబ్బంది కళాశాల లేఖకు జవాబుగా సుమారు 2000 దరఖాస్తులు వచ్చాయి. భారతదేశం లోని వివిధ రాష్ట్రాల లోని ఉపాధ్యాయుల నుంచి సుమారు 750 దరఖాస్తులు అధ్యాపక సిబ్బంది కళాశాలకు అందటం గమనార్హం. ఒకదానినుంచి వేరొకటి సుదూరంగా ఉన్న బెంగాల్, గుజరాత్, తమిళనాడు, కేరళ, కర్నాటక, మహారాష్ట్ర మొదలైన రాష్ట్రాలనుంచి ఈ దరఖాస్తులు వచ్చాయి. దీనినుంచి ఉపాధ్యాయుల దృష్టిలో అధ్యాపక సిబ్బంది కళాశాల ఉపయుక్తమైన పాత్ర నిర్వహించవలసి ఉన్నదని విదితం.

ప్రత్యేక క్షేత్రాలనుంచి వచ్చిన ప్రముఖ విద్యావేత్తలు, విద్యా పరిపాలకులు ఈ పునరభ్యసన కార్యక్రమాల్లో ఉపన్యసించారు. సాంప్రదాయికమైన ఉపన్యాసాన్నివ్వటానికి బదులుగా అవకాశం ఉన్న మేరకి చర్చలలో సాధన సంపత్తికల వారిని (Resource Persons) పాల్గొనేట్లుగా పాల్గొనేవ్యక్తులు చేయటాన్ని ప్రోత్సహించడం జరిగింది. వీటితోపాటు ప్రత్యేకంగా చర్చా సమావేశాలు సెమినార్ ప్రాక్టీస్ సమావేశాలు, సామూహిక వ్యాసాంగాలు నిర్వహించడం జరిగింది. దీనివల్ల ఉపాధ్యాయుడు అతనితో సమానస్థాయికల వ్యక్తులతో సునాయాసంగా పరస్పర చర్చ జరుపుతాడు.

మాదిరి ఉపన్యాసాలు విని, తాను కూడా కొన్ని మాదిరి ఉపన్యాసాలను ఇవ్వవలసిందిగా పాల్గొనే వ్యక్తులను కోరడం జరిగింది. ఈ ఉపన్యాసాలను వీడియో టేప్ చేసి, తరవాత ఆయా విషయాలలో ఎంపిక చేసిన నిపుణులతో వారి నిర్వహణను (Performance) మూల్యాంకనం చేయించడం జరిగింది. పునరభ్యసన కార్యక్రమాల్లో పాల్గొనే వ్యక్తులు వారి నిర్వహణను స్వయంగానే మూల్యాంకనం చేసుకొని ఇతరుల నిర్వహణను కూడా మూల్యాంకనం చేసుకోవటానికి ప్రోత్సహించడం జరిగింది.

ఒక సమావేశానికి కొంతమంది విద్యార్థులు కూడా పాల్గొనేట్లు అధ్యాపక సిబ్బంది కళాశాల ఏర్పాటు చేసింది. వివిధ ప్రత్యక్షాలు (Perceptions) వెలువడ్డాయి. వాటిని చర్చించారు. మంచి ఉపాధ్యాయుడంటే విద్యార్థులకు ఉండే ప్రత్యక్షం, మంచివిద్యార్థి అంటే ఉపాధ్యాయునికి ఉండే ప్రత్యక్షం, చర్చకు ఆధారమైంది. ఈ చర్చలు ఇరు పక్షాలకు ఉల్లాసం కలిగించాయి.

కార్యక్రమంలోని వివిధ వ్యాసక్తుల ప్రభావాలను నమోదు చేసుకోటానికి వీలుగా పాల్గొనే వ్యక్తులను డైరీ వ్రాయమని సూచించడం జరిగింది. నిర్దిష్ట కార్యక్రమం చివర విస్తృతపరచిన ఫీడ్-బాక్ సమావేశాలలోని కార్యక్రమాలగురించి పాల్గొన్న వ్యక్తుల అభిప్రాయాలను తెలపమని కోరడం కూడా జరిగింది. నిర్దిష్ట కార్యక్రమానికి ముందు, జరుగుతూ ఉండగా, తరవాత వారి వృత్తిపట్ల, వారి విద్యుక్త విధుల పట్ల వారి ప్రత్యక్షాలను తెలపటానికి మూల్యాంకన పత్రాలను పాల్గొనే ఉపాధ్యాయులకు ఇచ్చారు. వాటిలోవారు ఏ విధమైన మార్పును పొందారు, మార్పుపొందితే ఏ దిశలో పొందారో సూచించాలి. ఉస్మానియా విశ్వవిద్యాలయం అధ్యాపక సిబ్బంది కళాశాల నిర్వహించిన రెండు పునరభ్యసన కార్యక్రమాలకు పాల్గొన్న వ్యక్తులనుంచి ఫీడ్-బాక్ తృప్తిగా లభించింది. పాల్గొన్న వ్యక్తులు వారు ఈ కార్యక్రమాలు వారికి ఎక్కువ ప్రయోజనకారిగా ఉన్నాయని ఉప్పొంగిపోతూ చెప్పారు. కొత్తగా,

డిగ్రీ కళాశాలల్లో నియుక్తులైన ఉపాధ్యాయులకు అవసరం గురించి సంస్థాపరమైన సౌలభ్యాల దూరదృష్టితో వ్యవహరించింది (యు.జి.సి). అనటానికి ఇదిఒకసాక్ష్యం

* * * * *

(సార్వత్రిక విశ్వవిద్యాలయాల......) (86 వ పేజీ తరువాయి)

ఫలితాలనివ్వవు. ఉన్నత విద్యను అందరికి అందించాలనే విషయంలో అంగీకారం ఉన్నప్పటికీ, అది ఎటువంటి స్వభావాన్ని కలిగి ఉండాలి, సామాజిక భద్రత అంటే ఏమిటి అనే విషయంలో అంగీకారం, స్పష్టత లేనందువల్ల కూడా నూతన ప్రయోగాలు, కాలక్రమంలో తమ ప్రత్యేకతను, ప్రభావాన్ని కోల్పోయే ప్రమాదం ఉంది. సార్వత్రిక విశ్వవిద్యాలయాలను ఉన్నత విద్యను ఎక్కువ మందికి కల్పించే సాధనంగా, పూర్తి కాలం విద్యను అభ్యసించే స్తోమత లేని వారికి విద్యావకాశాలు కల్పించే సాధనంగా పనిచేసుకొనేవారి నైపుణ్యాన్ని పెంచుకోవడానికి తోడ్పడే విద్యావ్యవస్థగా, సాంకేతిక పరికరాలను విద్యా వ్యాప్తికి ఉపయోగించుకొనే సాధనంగా చూడాలి. అంతేకాని నేటి విద్యావ్యవస్థలో ఉన్న సమస్యలన్నింటికి సార్వత్రిక విశ్వవిద్యాలయం పరిష్కారం కాదు. నూతన ప్రయోగానికున్న అవకాశాలను, పరిమితులను సమస్థాయిలో అంచనా వేసుకోగలిగినప్పుడు మాత్రమే నూతన వ్యవస్థలనుంచి ప్రయోజనాలను పొందగలం. *****

(ఉన్నత విద్య - ఆంగ్లభాషాబోధన) (112 వ పేజీ తరువాయి)

గ్రహించాలి. కష్టపడి ఆలోచించనిదే, అధ్యయనం సఫలం కాదు (It is by an effort after meaning that learning takes place- not by making it easy).

ఆంగ్ల భాషాబోధనలో తప్పనిసరిగా చేయవలసిన పని- ప్రతిక్లాసులోనూ ప్రశ్నలు వేసి ఎంత వరకు అర్థం చేసుకున్నారో తెలుసుకుంటూ, వాళ్ళ సందేహాలను తీరుస్తూ, విద్యార్థులతో సంభాషణలు జరపాలి. అప్పుడే విద్యార్థులు నేర్చుకునే భాష సజీవ భాషగా రూపొందుతుంది. బట్టీ పట్టటం (Memorisation) అలవాటు చెయ్యగూడదు. స్వతంత్రంగా ఆలోచించి సొంత వాక్యాలతో రాయటం, మాట్లాడటం నేర్పించాలి. ఇది ఏమీ బ్రహ్మవిద్యకాదు. సాధనతో వస్తుంది.

*****

(స్నాతకోత్తరస్థాయిలో .......) (126 వ పేజీ తరువాయి)

తరగతులు ప్రారంభించాలి. తెలుగులో వైజ్ఞానిక పత్రికలను (Science Journals) ప్రోత్సహించి ప్రచురించాలి. అన్నింటికంటె ముఖ్యంగా తెలుగులో పాఠ్యగ్రంథాలను, ఉత్తమ గ్రంథాలను (Classics), ప్రామాణిక పరిశోధనా గ్రంథాలను (Standard Research Publications) ప్రచురించాలి. ఈ రంగంలో తెలుగు అకాడమీ 20 సంవత్సరాల నుండి తదేక దీక్షతో కృషిచేస్తూ ఎన్నో వందల గ్రంథాలను ప్రచురించింది. ప్రభుత్వం తెలుగు అకాడమీకి ఇంకా ఎక్కువ వనరుల నిచ్చి ప్రోత్సహించాలి. ఎన్నో మైళ్ళు ప్రయాణించేసి ఎన్నో మైలురాళ్ళను సృష్టించింది తెలుగు అకాడమీ. ఈ ప్రయాణం ఇంకా సాగుతుంది. మనం ఎన్నో వాగ్దానాలు చేశాం. వాటిని మనం పూర్తి చేయాలి. కార్ల్‌సాండ్బర్గ్ (Carl Sandburg) మాటల్లో (కొద్దిగా మార్చి)

------------------------

But we have many promises to keep
And miles to go before we sleep
And miles to go before we sleep"

# ఆంధ్రప్రదేశ్‌లో ఉపాధ్యాయుల శిక్షణ — కళాశాల విభాగం పాత్ర

కె.వి. నరసింహాచార్యులు
కళాశాల విభాగం
ముఖ్య విద్యావిషయక మార్గదర్శకాధికారి
ఉన్నతవిద్యాశాఖ సంచాలకుల కార్యాలయం
హైదరాబాదు.

అనువాదం,
డా. గుమ్మా శంకరరావు
తెలుగు అకాడమి

ఉపాధ్యాయులకు విద్య అనే భావన మనకు కొత్తది కాదు. 18వ శతాబ్ది నుంచి ఈ భావన మన దేశంలో వాడుకలో ఉంది. 1882 లో వచ్చిన ఇండియన్ ఎడ్యుకేషన్ కమిషన్ ఈ భావనను బలపరచింది. 1904 లో వచ్చిన విద్యావిధానం మీద లార్డ్ కర్జన్ తీర్మానం ఉద్యోగంలో ఉన్నవారికి విద్యమీద వివరణాత్మక కార్యక్రమం ప్రవేశ పెడుతూ ఉద్ఘోషించింది. స్వాతంత్ర్యం (1947) తర్వాత దేశంలో విద్యా వికాసానికి గొప్ప చురుకుదనం వచ్చింది. 1948 లో ఏర్పడిన రాధాకృష్ణ కమిషన్ మన విశ్వవిద్యాలయాల్లో కళాశాలల్లో జరిగే బోధన పద్ధతులలో సమగ్రమయిన మార్పు తెచ్చేందుకు త్వరపడింది. అంతేకాదు ఉన్నత విద్యాస్థాయిలో బోధన మృతప్రాయ స్థితిలో ఉందని ఆ కమిషన్ గమనించింది.

1964–66 లో కొఠారీ కమిషన్ వచ్చింది. అదికూడా ఉన్నత విద్యలోని ఈ దృక్పథాన్ని "బోధనాభివృద్ధి" శీర్షిక కింద నిశిత పరిశీలనలు ఇంకా ఎక్కువగా చేసింది. ఉన్నత విద్యలో బోధన, మూల్యాంకనం మెరుగుపరచడం సంస్కరణల్లో అతి ముఖ్యమైనదని వారు భావించారు. ఆ కమిషన్ ఉపాధ్యాయుల విద్యా ప్రాముఖ్యం నొక్కివక్కాణించింది. అంతేకాకుండా మంచి ఉపాధ్యాయులు ఇచ్చిన ఉపన్యాసాన్ని పరిశీలించడమూ, పునశ్చరణ కార్యక్రమాల ద్వారా ఉపాధ్యాయుల విద్యా నాణ్యతను మెరుగు పరచడానికి వివిధ కార్యక్రమాల్ని కూడా అది సిఫారసు చేసింది.

ఉద్యోగంలో ఉన్న ఉపాధ్యాయులకు శిక్షణ కార్యక్రమాలు వృత్తి సామర్థ్యాన్ని చాలినంతగా మెరుగు పరుస్తాయి. అవి వారిలో విద్య పట్ల సరైన సదవగాహనను పెంపొందింపచేస్తాయి. "ఇప్పుడు తరగతి గదుల్లో భారతదేశం అదృష్టం రూపుదిద్దుకొంటూ ఉందని కొఠారీ కమిషన్ సరిగ్గానే అభిప్రాయపడింది. కాబట్టి ఉపాధ్యాయులు నిరంతరాభివృద్ధి పొందుతున్న విజ్ఞానంతో సాన్నిహిత్యం కలిగి ఉంటూ నూతన విద్యా సాంకేతిక పద్ధతిని అలవరచుకోవాలి. "మన ఉపాధ్యాయులకు కేవలం పుస్తక జ్ఞానం మాత్రమే చాలదు. విద్యార్థుల చేత చదివించడానికి సహాయపడే విధానం కూడా తెలియాలి.

నేటి పాఠ్య ప్రణాళికలను పరీక్షిస్తే, విద్యా సంస్థల్లో అనుసరించిన పరీక్షా విధానమూ, మూల్యాంకన పద్ధతులూ అన్ని స్థాయిల్లోనూ మార్పు అవసరాన్ని వెల్లడిస్తున్నాయి. కాబట్టి నిరంతరం ఉపాధ్యాయ శిక్షణ వాళ్ళ విజ్ఞానాన్ని నవీకరించుకోడానికి, అధ్యయనంలో ప్రేరణలు ప్రవర్ధనం చేసుకోడానికి, విద్యా విషయ క్రమశిక్షణను అభివృద్ధి పరచుకోడానికి, అధునాతన బోధన సాంకేతిక పద్ధతుల్లో సాన్నిహిత్యం ఉంచుకోడానికి ఉపయోగపడుతుంది. "ఉపాధ్యాయులకు పటిష్ఠమయిన వృత్తి విద్యాకార్యక్రమాలు గుణాత్మక విద్యాభివృద్ధికి చాలా అవసరమని "ఈ విషయంలో కొఠారీ కమిషన్ చెప్పింది. "కొన్ని మిలియన్ల ప్రజలకు విద్యను మెరుగు పరచడంలో ఫలించిన దాన్ని దృష్టిలో పెట్టుకొన్నప్పుడు ఉపాధ్యాయుల శిక్షణకు పెట్టిన పెట్టుబడి చాలా స్వల్పం,ఫలితం చాలా ఎక్కువ".

మన కళాశాలల్లో బోధన పద్ధతుల మీది ముద్రతోపాటు, మరో చారిత్రకాంశం యూనివర్సిటీకి

అనుబంధ పద్ధతి బోధన మీద తక్కువ బాధ్యత ఉంది. లెక్కలేనన్ని కళాశాలలు, విద్యార్థుల బోధన మీద కూడా నియంత్రణ తక్కువ ఉంది.

ఉన్నత విద్యలో ప్రమాణాల నిర్వహణ బాధ్యత విశ్వవిద్యాలయాలదే. కానీ పాఠ్యప్రణాళిక రూపొందించడంలోనూ పరీక్షలు నిర్వహించడంలోనూ మాత్రమే అవి ఉండి పోతూ, మన బోధన పద్ధతులు, బోధన క్రమశిక్షణల్లో అసమానతను కలిగించాయి. బోధించడానికి, పరీక్షించడానికి మధ్య సన్నిహిత సంబంధం లేదు. అయినప్పటికీ, ఉపాధ్యాయులు మార్గ దర్శకత్వానికీ, సహాయానికి విశ్వవిద్యాలయాల వైపు చూస్తున్నారు.

యువ ఉపన్యాసకులు విశ్వవిద్యాలయాలు వదిలి అధ్యాపక వృత్తిలో ప్రవేశిస్తారు. వాళ్ళకు విషయ పరిజ్ఞానం కావలసినంత ఉన్నప్పటికీ తరగతి గది నిర్వహణలోనూ బోధన నైపుణ్యంలోనూ అనుభవం ఉండదు. వాళ్ళను ఉద్యోగాల్లో నియమించుకున్న వాళ్ళు కానీ విశ్వవిద్యాలయాలు కానీ ఈ యువ ఉపన్యాసకులకు సాధారణంగా ఎలాంటి సూచనలు ఇవ్వరు. రాధాకృష్ణన్ కమీషన్ ప్రకారం, అధ్యయన రంగంలోని విద్యార్థి ఆసక్తిని మేల్కొలపడం, ఉపాధ్యాయుని ప్రాథమిక బాధ్యత, కేవలం అతడు వాస్తవిక సమాచారం, సూత్రాలు, సాధారణీకరణాలు అందించడమే కాదు, వాళ్ళలో విచారణా స్ఫూర్తి, విమర్శనలకు ఉత్తేజనం కలిగించాలి. పైవాటి దృష్ట్యా కళాశాల ఉపాధ్యాయులకు B.Ed కు భిన్నమయిన సముచిత వృత్తి శిక్షణ అవసరమని భావించింది.

## కళాశాల కక్ష్య — దాని ఉనికి

అన్నిటినీ అలా ఉంచి, మన దేశంలో కళాశాల ఉపాధ్యాయులకు శిక్షణ అవసరం లేదనే దాన్ని గౌరవించే సంప్రదాయం ఉంది. జన్మతః ఉపాధ్యాయులు తప్పనిసరిగా ఉంటారు. కానీ వాళ్ళు కూడా శిక్షణతో వాళ్ళ నైపుణ్యం మెరుగు పరుచుకోగలుగుతారు. ప్రత్యేకంగా విజ్ఞానం శీఘ్రంగా విస్తరించడం దృష్ట్యా కళాశాల ఉపాధ్యాయుల విషయంలో నైపుణ్యాలు విషయ రంగంలో సుసంపన్నత్వం, ఆధునికత్వం కోసం అవసరమయింది. ఏ ఉపదేశమూ, పునశ్చరణా లేకుండానే స్నాతకోత్తర స్థాయి వాళ్ళు వెంటనే బోధనా వృత్తిలో కళాశాల ఉపాధ్యాయులుగా ప్రవేశించడంవల్ల సీనియర్ ఉపాధ్యాయుల బోధనా సాంకేతిక పద్ధతులూ, బోధనాభ్యాసమూ, మెరుగు పరచిన పరీక్షా, మూల్యాంకన పద్ధతులూ, పరిశీలించే అవకాశం లేదు అని భావించింది. వాస్తవానికి అన్ని జూనియర్, డిగ్రీ కళాశాలల్లో ఒకే వ్యక్తి ఉండే శాఖల్లో ఇది ఇలాగే సాగుతూ ఉంది.

విద్యాపాలనా నిర్వహణ మీద ప్రిన్సిపాళ్ళకు కూడా పునశ్చరణ అవసరమని నాయకత్వ శైలుల పాలనా నిర్వహణ పద్ధతులలోని మార్పులు భావించాయి. విద్యా కమీషన్‌ల సిఫారసులను దృష్టిలో ఉంచుకొని, పరిస్థితులను జాగ్రత్తగా అధ్యయనంచేసి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1973 లో కళాశాల కక్ష్య, ఉన్నత విద్యాశాఖ సంచాలకుల వారి .ఒక విద్యావిషయక విభాగాన్ని స్థాపించడానికి నిర్ణయం తీసుకొంది. ఈ కక్ష్య ఉన్నత విద్యాశాఖ సంచాలకుని నాయకత్వంలో పనిచేస్తుంది. ఉద్యోగంలో ఉన్న కళాశాల ఉపాధ్యాయులకు శిక్షణ కార్యక్రమం ప్రవేశపెట్టడంలో దేశంలోనే ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ప్రథమ గణ్యమయింది. విద్యాప్రమాణాల సముచిత నిర్వహణకు ఉద్యోగంలో ఉన్న కళాశాల ఉపాధ్యాయులకు శిక్షణ కార్యక్రమాలు అవసరమని యూనివర్సిటీ గ్రాంట్ల కమీషన్ ఈ మధ్యనే ఉద్ఘోషించింది.

ఉపాధ్యాయ శిక్షణ కొత్త శకం గుర్తించడంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం అగ్రగామి అయింది. మిగిలిన రాష్ట్రాలు మనల్ని ఆదర్శంగా తీసుకొని అనుసరిస్తూ ఉన్నాయి.

## కళాశాల కక్ష్య లక్ష్యాలు, విధులు

కళాశాల కక్ష్య కూడా వనరుల కేంద్రంగానూ, ఆలోచనా సరస్సుగాను, ప్రచురణ సంస్థగానూ, అన్ని వైపులా విధులు నిర్వహించాలి. సేవా కార్యక్రమాల నిర్వహణలో కళాశాలకక్ష్య స్థూల ఉద్దేశాలు ఇవి:—

1. ఉపాధ్యాయుని మెరుగుపరచడానికి సహకరించి, ప్రోత్సహించడం.
2. ఆత్మ మూల్యాంకనం, విద్యార్థి మూల్యాంకనం ద్వారా తరగతి గది పరిస్థితి మెరుగు పరచడం.
3. విద్యావిషయక పాలన నిర్వహణ వృత్తి పరమైన సామర్థ్యం అభివృద్ధి పరచడం.
4. మోనోగ్రాఫ్‌లూ, బులెటిన్‌లూ, చేపుస్తకాలూ ప్రచురణ చేపట్టడం.
5. ఉన్నత విద్య మెరుగుదల ప్రోత్సహించడంలో వికాసం, పరిశోధన, ప్రణాళికలను పెంపొందించడం.

పై లక్ష్యాలు సాధించడంలో, కళాశాల కక్ష్య ఆరంభమయిన నాటి నుంచి ప్రభుత్వం ఆమోదించినట్లు వార్షిక కార్య పథకం ఉంది. గత కార్యక్రమాల్లో పాల్గొన్న వారిని దృష్టిలో పెట్టుకొని, ప్రస్తుత సంవత్సరం కార్యక్రమాలు కొనసాగింపుగా రాష్ట్రంలోని విశ్వవిద్యాలయాల నుంచి, డిగ్రీ కళాశాలల సీనియర్ ఉపన్యాసకుల నుంచి, ప్రిన్సిపాళ్ళ నుంచి, కళాశాల కక్ష్యలోని అకడమిక్, సిబ్బంది నుంచి, ఉన్నత విద్యా సంచాలకుల కార్యాలయ సీనియర్ అధికారుల నుంచి, విద్యా నిపుణులనుంచి, విజ్ఞాన శాస్త్ర, సాంకేతిక, పారిశ్రామిక, వాణిజ్య, పాలనా నిర్వహణ రంగాల్లోని ప్రత్యేక నిపుణుల నుంచి ప్రతిభ గల వ్యక్తుల్ని దీనిలోకి తీసుకొంటారు. ఈ వనరుల వ్యక్తులతో పాల్గొనే వ్యక్తుల పరస్పర చర్య మీద కార్యక్రమాల్లో ఉద్ఘాటన ఉంది.

రాష్ట్ర వ్యాప్తంగానే కాకుండా ప్రాంతాల, జిల్లాల వారీగానూ కూడా ఈ కోర్సులు నిర్వహిస్తారు. అవి ఉన్న సౌకర్యాలను బట్టి రాష్ట్ర రాజధానినగరంలోనూ, విశ్వవిద్యాలయాల్లోనూ, జిల్లాకేంద్రాల్లోనూ, ఇతర స్థలాల్లోనూ, ఏర్పరుస్తారు. కార్యక్రమాలను నిర్వహించడమే కాక సదస్సులోనూ/ కార్యశిబిరాల్లోనూ తీసుకొన్న నిర్ణయాలు కూడా ప్రచురించే కార్యక్రమం కళాశాల కక్ష్య చేపడుతుంది. కోర్సులలో పాల్గొనే వ్యక్తి మూల్యాంకనంతో పాటు నిపుణుల మూల్యాంకన కమిటీచేత కార్యక్రమాల సమీక్ష కూడా ఉంటుంది. పై పెచ్చు, కళాశాల కక్ష్య అకడమిక్ సిబ్బంది కళాశాలలకు వెళ్ళి శాస్త్ర విభాగాలకు సహాయం చేయడానికి, భవిష్యత్తులో కోర్సుల రూప కల్పనలో పునర్భరణంలో ఉపయోగపడడానికి ఇవి చేపడుతుంది.

### అంతస్సేవా కార్యక్రమాల రకాలు

కళాశాల కక్ష్య నిర్వహించే అంతస్సేవా కార్యక్రమాలు ఇలా ఉంటాయి

I.a) జూనియర్ / డిగ్రీ కళాశాలల్లోని యువ ఉపన్యాసకులకు పునశ్చరణ / అధిష్ఠింపచేయడం కార్యక్రమాలు.

ఈ కిందివి కోర్సుతీరులోని స్థూల నిమ్నోన్నతాలు చూపుతాయి. ఆ కోర్సు మూడు వారాల / పదిరోజుల పాటు ఉండాలి. వాస్తవ కర్తవ్యానికి సంబంధించిన వ్రాతపని దిద్దుబాటు, ఉపాధ్యాయునికి సంబంధించినవి, మెథడాలజీ ఇందులో చేరతాయి. పునశ్చరణ ప్రయోజనాలకోసం ఏకీకృత ఉపన్యాసాల ద్వారా ఈ కోర్సు భాగం పూర్తి కావాలని ప్రతిపాదించారు. చర్చలూ, సదస్సుల ద్వారా వాస్తవిక, అనుప్రయుక్త దృక్పథాలు పూర్తికావలసి ఉంటుంది. అసలు ఆచరణలో సైద్ధాంతిక సూత్రాల తరగతి గది చిక్కుల్ని ఉపన్యాసకులు గ్రహించడానికి సహాయ పడాలి. ఒకటి లేదా రెండు కళాశాలల్లో ఉపన్యాసాలు, బోధనలు/విజ్ఞాన శాస్త్ర ప్రయోగాలు ఏర్పాటు చేసి క్షేత్ర కృషి ద్వారా పద్ధతులూ, విధానాలనూ ప్రయత్నించి చూడాలి.

### శాస్త్రీయ పద్ధతి దృక్పథాలు

a) సాధారణ పద్ధతి (ఉపన్యాసం, బోధన, విజ్ఞాన శాస్త్రప్రయోగం, గ్రంథాలయం పని, ఇంటిపని)

b) విషయోన్ముఖమైనది.

c) ఆచరణ (ఉపన్యాసం ఎలా తయారు చెయ్యడం, ఉపన్యాసం ఎలా ఇవ్వడం, బోధన / విజ్ఞాన శాస్త్ర వాస్తవకృత్యం ఎలా నిర్వహించడం)

ఉపన్యాసాలూ, కార్యశిబిరాల ద్వారా ఈ కింది వాటిపై ముఖ్య సమాచారం అందచెయ్యాలి.

a) ఉన్నత విద్య ఉద్దేశాలు
b) మూర్తిమత్వం(మనోవైజ్ఞానిక దృక్పథాలు)
c) ప్రేరణ, అంతర్ప్రోత్సాహకాలు
d) తరగతి గది గతిశీలములు (ప్రసార సమస్యలు, ప్రవర్తనా సమస్యలు)
e) జయప్రదమయిన ఉపన్యాసాల విశేష లక్షణాలు, మంచి ఉపన్యాస సంఘటకాలు.
f) ఉన్నత విద్యకు సామాజిక ఆర్థిక రంగం దాని అంతర్నిహిత భావాలు.
g) దృష్టాంత పరిశీలన (ముఖ్య దృష్టాంతాల్ని చర్చించాలి.

## విద్యార్థి సేవలు

a) సలహాలివ్వడం
b) సహపాఠ్యాంశ,పాఠ్యక్రమేతర కార్యకలాపాలు
c) ఉద్యోగిత సేవ–వృత్తి పరమైన సూచన.

## మూల్యాంకన దృక్పథాలు

a) పరీక్షల విశ్వసనీయత, మాన్యత – వాటిని మెరుగు పరిచే చర్యలు.
b) బాహ్య పరీక్షలూ, అంతర్నిర్ధారణలు (1) వ్యాసం, (2) వొట్టి జవాబుల ప్రశ్నలు (3) విషయం రకం ప్రశ్నలు. (4) మౌఖిక పరీక్షలు, (5) ప్రగతి నివేదికలు
c) ప్రశ్నపత్రాల విశ్లేషణ, వాటి మెరుగుదలకు సూచనలు.

## కోర్సు కాలాన్ని పంపిణీ చేసే విధానం శాస్త్రీయ పద్ధతి

a) సాధారణం 20%
b) విషయోన్ముఖం 15%
c) ప్రయోగకృషి 15%

మనోవైజ్ఞానిక, సామాజిక, ఇతర దృక్పథాల మీద

| | |
|---|---|
| ఆవశ్యక సమాచారం | 30% |
| విద్యార్థిసేవలు | 10% |
| మూల్యాంకనదృక్పథాలు | 10% |
| | 50% |

అవసరానుగుణంగా విషయ మిశ్రణం, పద్ధతి సర్దుబాటు జరుగుతుంది.

పై సూత్రాల ననుసరించి 5 సంవత్సరముల కన్న తక్కువ అనుభవమున్న యువ ఉపన్యాసకులకు పునశ్చరణ కార్యక్రమాలు ఇస్తారు.

## I. (b) పునశ్చరణ కోర్సులు

5 నుంచి 10 సం.ల బోధనానుభవమున్న ఉపన్యాసకులకే ఈ పునశ్చరణ కోర్సులు ఉద్దేశించారు. విషయ రంగాల ఆధునికత్వం మీద ఉద్ఘాటన ఉంది. దానితో పాటు బోధనా పద్ధతి, అధ్యయన పద్ధతి, మూల్యాంకన పద్ధతి వంటి కొన్ని ముఖ్య సంబంధితరంగాలు కూడా ఇందులో చేరి ఉంటాయి. పని చేస్తున్న ఉపాధ్యాయులు పరస్పరం అనుభవాలు మార్చుకోవడానికి, నేర్చుకోడానికి ఈ పునశ్చరణ కోర్సులు అవకాశాలు కల్పిస్తాయి. వివిధ విషయాలలో ఇప్పటివరకు సాధించిన అభ్యుదయాన్ని సరిగ్గా ఉంచుకోడానికి ఉద్యోగంలో ఉన్న ఉపాధ్యాయులకు ఒక చర్చా వేదికను (ఫోరంను) కూడా ఈ పునశ్చరణ కోర్సు కల్పిస్తుంది.

## II. సదస్సులు / కార్యశిబిరాలు

10 సం.లకన్న మించిన సర్వీసు అనుభవమున్న సీనియర్ ఉపన్యాసకులకు ఇవి ఏర్పాటు చేస్తారు. సదస్సు / కార్యశిబిరం నిర్వహించే కాలం 3 లేదా 10 రోజులు. నిర్దిష్ట విద్యావిషయక సమస్యలను సంబంధ విద్యలతో పరస్పర చర్యకు ఈ సదస్సులలో చర్చ సాగించి అనువైన పరిష్కారం సాధిస్తారు. విషయ సంబంధం కల వారికి ఉపకరించడానికి, సంప్రదించడానికి వీలుగా ఈ సదస్సుల/కార్యశిబిరాల అంతిమ నిర్ణయాలను మోనోగ్రాఫులుగా ప్రచురిస్తారు.

సదస్సులలోనూ కార్యశిబిరాల్లోనూ చర్చించే శీర్షికలు ఈ కింది విధంగా ఉంటాయి.

## సదస్సులు

1) ఉన్నత విద్యలో ఉపన్యాస పద్ధతి, సహాయ బోధనవిధానాలు.

2) బోధనను సుసంపన్నం చేయటానికి గ్రంథాలయం ఉపయోగించడం.
3) స్వయంప్రతిపత్తి కళాశాలలు
4) పరీక్షా సంస్కరణలు
5) ఉన్నత విద్యా వనరులు

## కార్యశిబిరాలు

6) రెండు దశలలో జీవశాస్త్ర బోధనా పద్ధతులు
7) ప్రయోగశాలా నియమ సంపుటి.

## III. జూనియర్ / డిగ్రీ కళాశాలల ప్రిన్సిపాళ్ళకు సమావేశాలు

ఉన్నత విద్యలో నాయకులూ, నిర్ణయాధికారులూ అయిన ప్రిన్సిపాళ్ళ పూర్తి జోక్యం వీట్లో ఉంటుంది. ఇటువంటి కోర్సులను ఉన్నత విద్యలోని నిర్ణయాధికారు లూ, పరిపాలకులూ సరిగా అవగాహన చేసుకోకపోతే ఉపాధ్యాయులకు ఇచ్చే ఏ పునశ్చరణ కార్యక్రమ ప్రణాళిక విజయవంతం కాదు. ఉపాధ్యాయులకు ప్రయోజనం చేకూర్చడానికి ఏర్పాటు చేసిన కార్యక్రమాలతో ఉన్నతస్థాయి పరిపాలకులకు పరిచయం ఉండాలి. ఇటువంటి కార్యక్రమాలతో పరిచయం ఏర్పడే కొద్దీ ఉన్నత విద్యా పర్యవేక్షకులుగా వారి పాత్రల్లో చక్కని మార్పు వస్తుంది. పైగా ఇది మారుతున్న పరిపాలన–ఆర్థిక, విద్యావిషయక, విద్యార్థి సంక్షేమ విషయాల్లో ప్రిన్సిపాళ్ళను విద్యావిషయక నాయకులుగా తీర్చిదిద్దటానికి మరింత ఎక్కువగా ఉపకరిస్తుంది. సమావేశాలు మూడు రోజుల పాటు జరుగుతాయి.

## విద్యావిషయక సందర్శనలు

కార్యక్రమాల్లో పాల్గొన్న వారినుంచి ఆ కార్యక్రమాల పరిపూర్తి కోసం 1978–79 నుంచి ఎంపిక ప్రాతిపదిక మీద కళాశాలలకు విద్యావిషయక సందర్శనలు చేయడానికి / అధ్యయనానికి కళాశాల కక్ష్య ప్రారంభించింది. పైగా అమలులో ఉన్న బోధన పద్ధతులూ, గ్రంథాలయాభివృద్ధి, పాఠ్యక్రమేతర కార్యకలాపాల అభ్యుదయం అధ్యయనం చేయడానికి, వాటిని మెరుగుపరిచే సూచనలు ఇవ్వడానికి, ఇది సహకరిస్తుంది. వాళ్ళ అవసరాలను బట్టి భవిష్యత్ కార్యక్రమాలు మార్చుకొనేటట్లు ఇది చేయగలుగుతుంది.

## కార్యక్రమాల సమీక్ష

కళాశాల కక్ష్య నిర్వహించిన ప్రతి కార్యక్రమానికి మూల్యాంకన యంత్రాంగంలో ఒక నిర్మాణం ఉన్నప్పటికీ, వార్షిక కార్యక్రమాలను మదింపు వేయడానికి, అవసరమయితే మార్పులు సూచించడానికి సమీక్షా సంఘాన్ని ఆహ్వానించింది.

## వార్షిక ప్రణాళికా కార్యక్రమాలు

వివిధ సంస్థల్లోని నిపుణుల సహాయంతో వివిధ స్థాయిల్లోని కళాశాలా ఉపాధ్యాయుల ప్రయోజనం కోసం పైన పేర్కొన్న అనేక కార్యక్రమాలు కళాశాల కక్ష్య చేపట్టింది.

రాష్ట్ర ప్రభుత్వం ఇచ్చిన నిధులతో 1973 (చూ.అనుబంధం I) నుంచి ప్రతి సంవత్సరం కార్యక్రమాలు నిర్వహిస్తూ సుమారు 5,000 మంది ఉపాధ్యాయులకు ఇందులో పాల్గొనే అవకాశం కల్పించింది.

## భవిష్యత్తుకు సమ్యగ్దృష్టి

రాష్ట్రంలో కొన్ని కళాశాలల్లో పునర్వ్యవస్థిత కోర్సులూ, వృత్తి సంబంధికోర్సులూ ప్రవేశ పెట్టడం జరిగింది. ఈ దిశలో ముందు అడుగుగా కళాశాల కక్ష్య ప్రణాళిక వేసి, చేపట్టబోతూ ఉంది.

1. వృత్తిసంబంధికోర్సుల్లో ఉద్యోగం చేస్తున్న ఉపాధ్యాయులకు శిక్షణ.
2. కళాశాలల సర్వతోముఖాభివృద్ధికి అక్కడికక్కడ చేసే అధ్యయన సందర్శనలు.

ఇంకా జూనియర్/ డిగ్రీ కళాశాలల స్థాయిలో బోధనలో ఆధునిక సాంకేతిక పద్ధతి ప్రవేశ పెడుతూ వేర్వేరు విషయాల్లో దృశ్యశ్రవణ పాఠాలను తయారు చేసే కార్యక్రమాన్ని చేపట్టడానికి ఇది ఆలోచిస్తూ ఉంది.

## అనుబంధం — I

కళాశాల కక్ష్య డైరక్టర్ ఆఫ్ హయ్యర్ ఎడ్యుకేషన్, ఆంధ్రప్రదేశ్, హైదరాబాదు.

వార్షిక విద్యావిషయక కార్యక్రమాలు: వివిధ కార్యక్రమాల లాభం పొందేవారి పట్టిక.

| సం.రం. | ప్రస్తావన/ఉన్ముఖ కోర్సులలో జూనియర్ ఉపన్యాసకులు | పునరభ్యసన కోర్సులలో కోర్సులలో ఉపన్యాసకులు | డిగ్రీ/జూనియర్ కళాశాలల కార్యశిబిరాల ప్రిన్సిపాళ్ళ సదస్సులలో | ప్రిన్సిపాళ్ళ సమావేశాల్లో జూనియర్ కళాశాలలు | ప్రిన్సిపాళ్ళ సమావేశాల్లో డిగ్రీ కళాశాలలు | కళాశాల కక్ష్య చేసిన విద్యావిషయక సందర్శనల ద్వారా జూనియర్ కళాశాలలు | కళాశాల కక్ష్య చేసిన విద్యావిషయక సందర్శనల ద్వారా డిగ్రీ కళాశాలలు |
|---|---|---|---|---|---|---|---|
| 1973–74 | 38 | 40 | 25 | – | 14 | – | – |
| 19974–75 | 32 | 38 | 14 | 39 | 16 | – | – |
| 1975–76 | 77 | 79 | 25 | 43 | 19 | – | – |
| 1976–77 | 179 | 77 | 25 | 42 | 51 | – | – |
| 1977–78 | 109 | 35 | 37 | 43 | 43 | 10 | 14 |
| 1978–79 | 36 | 87 | 58 | 99 | 41 | 14 | 12 |
| 1979–80 | 113 | 17 | 35 | – | – | 6 | 28 |
| 1980–81 | 156 | 35 | 30 | 38 | 35 | 8 | 19 |
| 1981–82 | 91 | 52 | 178 | – | 46 | 2 | 15 |
| 1982–83 | 141 | – | 87 | – | 83 | 5 | 9 |
| 1983–84 | 151 | 30 | 127 | – | 45 | – | – |
| 1984–85 | 119 | 40 | 150 | 110 | 120 | 1 | 2 |
| 1985–86 | 207 | 185 | – | – | 167 | – | – |
| 1986–87 | 166 | 144 | 30 | 370 | – | – | – |
| బి.ఐ.ఇ. ప్రత్యేక కార్యక్రమాలు | 99 | | – | – | – | – | – |
| మొత్తం | 1,614 | 859 | 821 | 784 | 680 | 46 | 99 |

# పోస్ట్‌గ్రాడ్యుయేట్ బోధన సిబ్బంది : పునశ్చరణ కార్యక్రమం అకడమిక్ స్టాఫ్ కాలేజీల పాత్ర

డా. ఇవటూరి రామబ్రహ్మం,
అసిస్టెంట్ ప్రొఫెసర్,
ఆంధ్రప్రదేశ్ సార్వత్రిక విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

ప్రొఫెసర్, ఆర్.వి.ఆర్. చంద్రశేఖరరావు,
డీన్, సమాజ విజ్ఞాన శాస్త్రాల విభాగం,
హైదరాబాదు కేంద్రీయ విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

1986 నూతన విద్యావిధానం ప్రకారం ఏడో ప్రణాళికాకాలంలో ఇప్పటివరకు 48 అకడమిక్ స్టాఫ్ కాలేజీలు స్థాపించారు. వీటి లక్ష్యాలు మూడు. ఒకటి బోధనలో శిక్షణ, రెండు ఉన్నత విద్యాస్థాయిలో ప్రపంచ/జాతీయ, సామాజిక, ఆర్థిక, వైజ్ఞానిక రంగాలలో జరిగిన అభివృద్ధిని గురించి బోధకులలో అవగాహన కల్పించడం, మూడు వివిధ ప్రత్యేకీకరణ లేదా ప్రత్యేక అధ్యయన అంశాలపై విషయాంశాలకు సంబంధించిన సమాచార సేకరణ, దీన్ని ఉపాధ్యాయులకు అందుబాటులో ఉంచడం . ఒక రకంగా చూస్తే ఈ లక్ష్యాలు త్రివేణీసంగమం లాంటివి. బోధన, శిక్షణ, ప్రత్యేకీకరణలో వస్తున్న మార్పులపై అవగాహన ముఖ్యలక్ష్యాలు.

### శిక్షణ—ఆవశ్యకత

ఉన్నత విద్యారంగానికి చెందిన బోధకులకు శిక్షణ అన్నది పూర్తిగా కొత్త ప్రణాళికగా చెప్పలేం. కళాశాల ఉపాధ్యాయులకు శిక్షణ అవసరం లేదన్నది సాంప్రదాయిక దృక్పథం. అప్పుడప్పుడు ఈ అభిప్రాయానికి ప్రతిఘటన వచ్చినా మౌలికంగా ఈ భావనలో ఈ మధ్యకాలం వరకు కొనసాగుతూనే వచ్చింది. స్వాతంత్ర్యం వచ్చినతర్వాత మొదటిసారిగా డా. డి.ఎస్.కొఠారి నాయకత్వంలో నియమించబడిన విద్యాకమిషన్ ఉన్నత విద్యాస్థాయిలో బోధకులకు శిక్షణపై ఈ విధంగా పేర్కొంది. "కొత్తగా బోధన సిబ్బందిగా చేరినవారికి కొంత శిక్షణ అవసరం. ఈ లక్ష్యాన్ని సాధించడానికి పెద్ద విశ్వవిద్యాలయాలు అకడమిక్ స్టాఫ్ కాలేజీలను (Academic Staff colleges) నెలకొల్పి శిక్షణ అనేది ఒక నిరంతర కార్యక్రమంగా నిర్వహించాలి" (విద్యాసంఘ నివేదిక "విద్య–జాతీయాభివృద్ధి", భారతప్రభుత్వం 1964–66). ఈ నివేదిక ఆధారంగా రూపొందిన జాతీయ విద్యా విధాన పత్రం 1968లో కూడా శిక్షణకు సంబంధించిన అంశాన్ని స్థూలంగా పేర్కొన్నారు.

సెకండరీస్థాయి విద్యాబోధనకు శిక్షణ ఆవశ్యకతను గుర్తించినంతగా ఉన్నతస్థాయి బోధనకు దాని అవసరాన్ని విధాన నిర్మాతలు గ్రహించినట్లు ఈ మధ్యకాలంవరకు మనకు కనపడదు. ముందు పేర్కొన్నట్లు ఉన్నతస్థాయి విద్యాబోధనకు శిక్షణావసరం, లేదన్నదే సర్వత్రా భావించారు. అధిక విద్యార్హతలు, పరిశోధనలోని ప్రచురణలు విశ్వవిద్యాలయ, కళాశాలస్థాయి ఉపాధ్యాయ ఉద్యోగాలకు అర్హతలుగా నిర్ణయించబడి ఆచరణలో స్థిరపడ్డాయి. అంటే ఉపాధ్యాయులకు లాంఛనప్రాయ శిక్షణ అనే భావన దృఢపడడానికి ఉన్నత స్థాయి బోధన సిబ్బంది భర్తీ విధానం కూడా దోహదపడింది. శిక్షణ ఆవశ్యకత గురించిన చర్చ మటుకు కొనసాగుతూనే వచ్చింది. సమగ్ర దృక్పథంలో ఈ సమస్యని విశ్లేషిస్తే ఉపాధ్యాయులకు బోధనలో కొంతశిక్షణ భావ్యం అని అనిపిస్తుంది. ఉన్నత విద్యారంగంలో చేరబోయే వారికి, పనిచేస్తున్నవారికి ఒక క్రమబద్ధ పద్ధతిలో శిక్షణ/ పునశ్చరణ కార్యక్రమాలు నిర్వహించాలని 1986 నూతన విద్యావిధానం పేర్కొంది. దాని ఆవశ్యకతను విశదీకరిస్తూ విశ్వవిద్యాలయాల విరాళాల సంఘం ఈ విధంగా పేర్కొంది; "బోధన అన్నది ఒక యాంత్రిక ప్రక్రియ కాదు. ఏ విభాగానికి చెందిన ఉపాధ్యాయుడికైనా చుట్టూఉన్న సమకాలీన సామాజిక, ఆర్థిక, రాజకీయ,

సాంస్కృతిక పరిసరాల గురించి కొంత అవగాహన ఏర్పడాలి. బోధకులలో సమాజం గురించి సరైన చైతన్యం లేనట్లయితే బోధన అసందర్భంగా ఉండే అవకాశం ఉంది. అందువల్ల సమగ్ర శిక్షణద్వారా సాంప్రదాయిక బోధనలో ఉండే ప్రతిబంధకాలను అధిగమించడానికి వీలుంటుంది". బోధన పరిసరాలు, సందర్భం, విద్యా విషయాంశాలపై వాటి ప్రభావం మొ.వాటి గురించిన అవగాహన బోధన ప్రక్రియనే కూలంకషంగా మార్చగలుగుతాయి. ఇవి విద్యార్థిలో చైతన్యం కలుగజేస్తాయన్న భావన క్రమంగా బలపడుతూ వచ్చింది. ఇదేకాకుండా ఒక ఉపాధ్యాయుడికి సంవత్సరాల తరబడి బోధన అంటే యాంత్రిక భావాన్ని, విసుగును ఈ శిక్షణ లేదా పునశ్చరణ కార్యక్రమాలు పోగొట్టి నూతన చైతన్యాన్ని కల్గించి వృత్తిపై ప్రేరణను కలగచేయగలవు అని విశ్వవిద్యాలయ విరాళాల సంఘం 1987లో రూపొందిన విద్యావిషయక సిబ్బంది పునరభ్యసన పథకం (Academic Staff Orientation Scheme)కు సంబంధించిన పత్రంలో పేర్కొంది.

ఈ పథకప్రధానోద్దేశం ఉపాధ్యాయ ప్రేరణకు, గుణాత్మక విద్యాభివృద్ధికి గల సంబంధాన్ని గుర్తించి ఉన్నత విద్యాబోధనలో సమగ్ర మార్పులకు దోహదపడడం. జాతీయ విద్యావిధానం 1986లో ఈ విషయానికి సంబంధించిన అంశాలను ఉల్లేఖిస్తూ విశ్వవిద్యాలయాల విరాళాల సంఘం విద్యావిషయక పురభ్యసన పథకపత్రంలో ఈ విధంగా పేర్కొంది; "ఉన్నత విద్యారంగ ఉపాధ్యాయులు వారి పాత్ర బాధ్యతలను నిర్వర్తించడానికి వృత్తిపర వికాసానికి నూతన జాతీయ విద్యావిధానం ఎక్కువ అవకాశాలను కల్పించదలచింది. ప్రత్యేక విషయ అధ్యయనంలోనూ బోధనశిల్ప పద్ధతులలోనూ పునరభ్యసన, పునశ్చరణ కార్యక్రమాల ద్వారా సరైన విలువలను ఉన్నత విద్యారంగ ఉపాధ్యాయులలో వారిని నూతన కల్పనలకు ఉన్ముఖులను చేయాలని ఉద్ఘాటించింది. ఇదేకాకుండా, విద్యావిషయక సిబ్బంది పునరభ్యసన ప్రశిక్షణా పథకం, ఉన్నత విద్యా వ్యవస్థకు బోధకుని కేంద్ర బిందువుగా పరిగణించడంతో ప్రారంభం అవాలని సూచించింది. బోధన , ఒక కళగానూ, ఆదర్శ బోధకులను అభినయించడం ద్వారానే బోధనా పటిమను పెంపొందించుకోవాలన్న భావన సాంప్రదాయిక సిద్ధాంతానికి చెందింది. విద్యారంగం ముఖ్యంగా ఉన్నతస్థాయిలో అనూహ్యంగా పెరగడంవల్ల బోధన నాణ్యత తగ్గిందని , కాబట్టి బోధన ఒక కళగానే పరిగణించలేం. విద్యా సాంకేతిక పరిజ్ఞానంలో నూతన పోకడల దృష్ట్యా బోధనను పూర్తిగా కళగా పేర్కొనలేం. ఎందువల్లనంటే అనేకరకాల విద్యా ఉపకరణాలు ఆచరణలోకి వచ్చాయి. వాటిని ఉపయోగించడం ద్వారా బోధన ప్రామాణికం చెందుతోంది. అంతేకాకుండా జ్ఞాన వినోఘటన అన్ని విద్యావిషయక విభాగాలలోనూ సంభవిస్తోంది. ముఖ్యంగా విజ్ఞాన, సాంకేతిక శాస్త్రాలలో జరిగిన పరిశోధన తెలుసుకోడానికి అతి ఎక్కువ కాలం పడుతోంది. కారణం వివిధ విద్వత్ పత్రికలు అందరికి అందుబాటులో ఉండకపోవడం ఒకవేళ ఉన్నా, సమయం చాలనందువల్ల, ఈ సంస్థాగత, ఇతర విద్వత్ పరిమితులను అధిగమించడానికి విశ్వవిద్యాలయాల విరాళాల సంఘం ప్రతి రాష్ట్రంలోనూ ఒక విద్వత్ సిబ్బంది పునరభ్యసన ప్రశిక్షణాలయాలను ప్రారంభించింది.

## లక్ష్యాలు—పాలనా వ్యవస్థ

కొత్తగా నియమితులైన ఉన్నత విద్యాబోధకులకు శిక్షణ ఇవ్వడం, ఇప్పటికే పనిచేస్తున్నవారికి పునశ్చరణ కోర్సులు నిర్వహించడం ఈ పథక ప్రధానోద్దేశాలు. ఈ శిక్షణా కార్యక్రమాల నిర్వహణకు సంబంధించిన వ్యవస్థల స్థాపన ఇతర సంబంధిత అంశాలను గురించి పేర్కొంటూ విశ్వవిద్యాలయాలలో స్వయంప్రతిపత్తిగల భాగాలుగా వాటిని నెలకొల్పాలని, పథకం కొత్తది కాబట్టి అనుకరణకు వీలుగా ఉన్న ఏ నమూనాను నిర్దేశించడం సాధ్యం కాదని పేర్కొంది. శిక్షణా కాలంపై వ్యాఖ్యానిస్తూ పునరభ్యసన శిక్షణ ఎనిమిది వారాలుంటే అభిలషణీయం అనీ దాన్ని రెండు మూడు

వాయిదాలలో ఏర్పాటు చేసుకోవచ్చనీ దీనివల్ల సుశిక్షితులైనవారు వారు పనిచేసే కళాశాలలకు కోర్సు మధ్యలో వెళ్ళి, తర్ఫీదు పొందిన లేదా నూతనంగా ఆర్జించిన విషయ అంశాలను ప్రయోగించడానికి వీలుంటుందని విశ్వవిద్యాలయాల విరాళాల సంఘం అభిప్రాయపడింది.

ఇదేకాకుండా కోర్సు లక్ష్యాల సాధన అభిలషణీయ స్థాయిలో ఉండడానికి కోర్సులలో శిక్షణ పొందినవారి వృత్తిపరవికాస వర్తనం ఇతర అంశాలను కొలవడానికి సరైన కొలమానాలను రూపొందించి, వాటిని క్రమబద్ధమైన రికార్డులను రూపొందించి కోర్సుకు హాజరైన బోధకుల వికాసాన్ని మూల్యాంకనం చేయాలని సూచించారు.

ప్రతి విద్వత్ పునరభ్యసన శిక్షణా కోర్సు నాలుగు విభాగాలుగా అమలు చెయ్యాల్సుంటుంది (Module coverage). ఇవి (అ) సమాజం, పరిసరాలు, అభివృద్ధి విద్యారంగాల మధ్యగల సంబంధాల గురించిన చేతన (Awlinkages between Society, Environment, Development and Educational system); (ఆ) విద్యా తాత్విక చింతన, భారతదేశ విద్యావ్యవస్థ (Educational Philosophy and Indian Educational system); (ఇ) సంబంధిత విషయ పరిజ్ఞానంలో నూతన అంశాల గురించి తెలుసుకోవడం (Subject upgradation); (ఈ) నిర్వహణ, మూర్తిమత్వాభివృద్ధి (Management and Personality Development) పేర్కొన్న ప్రతి మాడ్యూల్ (Module)లు గాను చెప్పవలసిన అంశాల గురించి విశ్వవిద్యాలయాల విరాళాల సంఘం నిర్దిష్టంగా పేర్కొన్నప్పటికీ, సరళత అవసరాన్ని గుర్తించి అకడమిక్ స్టాఫ్ కాలేజీలు అవసరమైన మార్పులు చేసుకోవచ్చని అభిప్రాయపడింది.

### అండర్‌గ్రాడ్యుయేట్ స్థాయి సిబ్బందికి ప్రాముఖ్యత

పథక లక్ష్యాలు, ఉద్దేశాలు దానికి సంబంధించిన ఆదేశాలను విశ్లేషిస్తే ఈ కార్యక్రమం డిగ్రీస్థాయి బోధన సిబ్బందికి శిక్షణకే ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తున్నట్లు అనిపిస్తోంది. అయితే ఈ ప్రాముఖ్యత ఇవ్వడానికి కొన్ని కారణాలు ఉన్నాయి.

విశ్వవిద్యాలయ బోధన సిబ్బందికి, కళాశాలల బోధన సిబ్బందికి వృత్తిపర వికాసానికి అందుబాటులో ఉన్న అవకాశాలలో ఇది స్పష్టమౌతుంది. కాలం, దూరం వంటి కొలమానాలతో కొలిస్తే కళాశాల ఉపాధ్యాయులకు, జ్ఞానార్జన ప్రత్యేక విషయ పరిజ్ఞాన స్థాయి పెంపుదలకు విశ్వవిద్యాలయాల బోధన సిబ్బందితో పోలిస్తే అవకాశాలు తక్కువే. ఉదాహరణకు విశ్వ విద్యాలయాలలో పనిచేసే బోధన సిబ్బందికి ఉన్నతస్థాయిలో ఉన్న Ph.D, M.Phil కోర్సులలో ప్రవేశం కాలేజీ ఉపాధ్యాయులతో పోలిస్తే ఎక్కువే. ఇదేకాకుండా ప్రత్యేక విషయ పరిజ్ఞానాల (Specializations)లో స్థాయి పెంపుకు విశ్వవిద్యాలయాల బోధనా సిబ్బందికి అవకాశాలు ఎక్కువ. అయితే బుద్ధిజీవులతో పరస్పర చర్చలకు, అందువల్ల వికాసవర్తనానికి అవకాశాలు విశ్వవిద్యాలయ స్థాయి ఉపాధ్యాయులకే ఎక్కువ. అయితే ఇక్కడ ఇంకో విషయం మనం పేర్కొనాలి. కళాశాల సిబ్బంది కంటె స్నాతకోత్తర బోధన సిబ్బంది అభివృద్ధికి లభ్యమయ్యే అవకాశాలు ఎక్కువగా ఉన్నప్పటికీ, విశ్వవిద్యాలయాలు విపరీత సంఖ్యలో పెరగడంవల్ల అవసరమైన రిఫరెన్సు గ్రంథాలు, విజ్ఞాన పరిశోధన పత్రాలు/ పత్రికలు ఎన్నో సంవత్సరాలకుకాని కొత్త విశ్వవిద్యాలయాలు సమకూర్చుకోలేకుండా ఉన్నాయి. బోధన సామాగ్రి అందుబాటు కూడా అంతంత మాత్రమే. కొన్ని కొత్తగా స్థాపించిన విశ్వవిద్యాలయాల పరిస్థితి, కాలేజీల కంటే ఏ మాత్రం భిన్నంగా కనిపించడం లేదు. రాజకీయ విధానాలవల్ల ఉన్నత విద్యావిధాన లక్ష్యాలకే ముప్పు వస్తున్న తరుణంలో ఏదో విధంగా కొత్తగా చేరిన స్నాతకోత్తర సిబ్బందికి బోధనకు సంబంధించిన మౌలిక విషయాలలో తర్ఫీదు అవసరం అని భావించడం సమంజసమే.

ఇక విశ్వవిద్యాలయాల్లో పరిశోధన అవకాశాలే జ్ఞానార్జనకు మూలాధారాలు అన్ని సిద్ధాంతం కూడా కొంతవరకు విమర్శకు గురిఅవుతోంది. ముఖ్యంగా సమాజ విజ్ఞాన శాస్త్రాలలో ఈ మధ్య జరుగుతున్న పరిశోధన తీరులను గమనిస్తే అతి చిన్న విషయాంశాలకు పరిశోధన పరిమితమై దత్తాంశ సేకరణ, విశ్లేషణ, నివేదిక రాయడం వరకే విజ్ఞానంగా పరిగణింపబడడం శోచనీయం అని కొంతమంది భావిస్తున్నారు. రాజనీతిశాస్త్రంలో ప్రవర్తన సిద్ధాంతం 1960లలో బహుళ ప్రాచుర్యంలోకి వచ్చింది. ఈ నూతన అధ్యయన పద్ధతి అప్పటివరకు ఉన్న న్యాయపర, విశదీకరణ అధ్యయనాలను (సాంప్రదాయిక పద్ధతులు) విమర్శించింది. అందులో ఉన్న పరిమితులను బహిర్గతం చేసింది. విజ్ఞాన శాస్త్రాలతో ఉన్న ప్రమేయం (Hypothesis), పరిశీలన (Observation), పరీక్షించడం (Testing) వంటి పద్ధతులను రాజనీతి శాస్త్ర అధ్యయనాలలో విస్తృతంగా ఉపయోగించాలని , అందువల్ల సమాజంలోని రాజకీయ వ్యవస్థకు సంబంధించిన అంశాలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి కొన్ని సార్వజనీన ప్రమేయాలను రూపొందించవచ్చని ప్రవర్తన సైద్ధాంతికులు వాదించారు. కాని అతి కొద్దికాలంలోనే ప్రవర్తన సిద్ధాంతంలోని బలహీనతలు బయటపడ్డాయి. రాజనీతిశాస్త్ర పరిశోధనా ధోరణుల సమీక్షలో అనుభవపూర్వక పద్ధతులను ఎక్కువగా వినియోగించడం వల్ల సైద్ధాంతిక పునాదులు లేనట్లయితే సంభవించే దుష్పరిణామాలు వెలుగులోకి వచ్చాయి. అందువల్ల పరిశోధన పటిమను మెరుగుపరుచుకొనేందుకు క్రమపద్ధతిలో శిక్షణ ఉంటేతప్ప అందరు ఉపాధ్యాయులు ఎప్పుడో ఒకప్పుడు పరిశోధన తీరులను గమనించడంలో వెనకపడే అవకాశం పొచ్చే.

ప్రస్తుతం విశ్వవిద్యాలయ విరాళాల సంఘం అమలు చేస్తున్న పథకం స్నాతకోత్తర, స్నాతకపూర్వ ఉపాధ్యాయుల శిక్షణకు సంబంధించి మౌలికంగా మార్పులను గురించి పేర్కొలేదు. దీనివల్ల అన్ని స్థాయిలకు చెందిన ఉపాధ్యాయులకు ఒక పునరభ్యసన శిక్షణ కోర్సును సిఫార్సు చేసిందనే అనుకోవాలి. ఒక విధంగా చూస్తే పునరభ్యసన కోర్సు అనే పదం సందర్భోచితంగా లేదని అనిపిస్తుంది. Represher Course కు పునశ్చరణ అన్నది సరిపోతుంది. కాని Orientation కు పునరభ్యసన అన్న తెలుగు పదం దీనిలో ఇమడడం లేదు. ఇటు Orientation ను, అటు Refresher కోర్సులను దృష్టిలో ఉంచుకొని విశ్వవిద్యాలయాల విరాళాల సంఘం ఈ పథకాన్ని రూపొందించిందని అనుకోవాలి. సరైన తెలుగు తర్జుమా మాట అటుంచి ఇక్కడ మనం విశదీకరించవలసిన అంశం ఏమంటే స్నాతకోత్తర, డిగ్రీస్థాయిలలో ఉండే బోధన సిబ్బందికి శిక్షణ భిన్నంగా ఉండాలంటే అనుసరించవలసిన ప్రాతిపదిక ఏది అన్నది.

### డిగ్రీస్థాయి, స్నాతకోత్తర స్థాయి విభిన్న కోర్సులు; ప్రాతిపదికలు

సులువుగా చెప్పాలంటే పునశ్చరణ, పునరభ్యసన కోర్సులమధ్య భేదాన్ని ఆధారంగా చేసుకొని రెండు భిన్నమైన కార్యక్రమాలను అమలు చేయచ్చు. అయితే ఏ స్థాయికి ఏ విధానం ఉండాలనే ప్రశ్న ఈ సందర్భంలో వస్తుంది. డిగ్రీస్థాయి బోధన సిబ్బంది పునరభ్యసన శిక్షణ అత్యంత ఆవశ్యకం అని, స్నాతకోత్తర స్థాయి బోధన సిబ్బందికి పునశ్చరణ తరగతులు నిర్వహించడం వరకే చాలని నచ్చచెప్పుకోవచ్చు.

తార్కికంగా చూస్తే ఈ పద్ధతి అసమంజసంగా గోచరించదు. ముందు పేర్కొన్నట్లు విద్యా బోధనా, మూల్యాంకన విధానాలు శిల్పపద్ధతులు (Teaching Podagogy, Evaluation Techniques), సామాజిక, ఆర్థిక, రాజకీయ వాతావరణ అవగాహన అన్ని స్థాయిల బోధనకు అత్యవసరమే. బోధన విషయాంశంల సమకాలీన పోకడలు అధ్యాపకులకు తెలియచెయ్యాలనే ఆశయం బహుశా డిగ్రీస్థాయి ఉపాధ్యాయుల విషయంలో ఎక్కువగా అవసరమేమో అనిపిస్తుంది. శిక్షణాస్థాయి ఏ మోతాదులో ఉండాలనే సమీక్షణ క్లిష్టమైందే.

## స్నాతకోత్తర బోధన సిబ్బందికి శిక్షణ : కొన్ని భావాలు

స్నాతకోత్తర బోధన సిబ్బందికి పునరభ్యసన లేదా పునశ్చరణ కార్యక్రమాలను ఏర్పాటు చేసుకోడానికి కొన్ని ప్రత్యేక అంశాలను దృష్టిలో ఉంచుకోవాలి.

1. స్నాతకోత్తర స్థాయిల ప్రత్యేక అధ్యయనాంశాల ప్రాముఖ్యతని గుర్తించాలి. ఈ స్థాయి బోధన, పరిశోధన స్థాయిలలో నూతన పోకడల సవాళ్ళు దృఢంగా స్థిరపడ్డాయి. కాబట్టి పునరభ్యసన కర్సులు ఇందులో నిశితమైన అధ్యయనానికి ఎక్కువ అవకాశాలు ఇవ్వాలి. విద్యార్థులుగా ఉన్నప్పుడు అధ్యయన దశలో అధ్యాపకులు ప్రత్యేక విషయ పరిజ్ఞానంలో కొంత నైపుణ్యం పొంది ఉంటారు. కాని ప్రతి ప్రత్యేక విషయాంశంలో ఉరకలు వేస్తున్న పరిశోధన ప్రవాహంలో ఈదేందుకు తగిన విజ్ఞాన సామర్థ్యాన్ని కల్పించాలి. ఉదాహరణకు రాజనీతితత్వ విచారంలో ప్రత్యేకతను సంతరించుకొన్నవారికి అందులోనే ప్రత్యేక పునశ్చరణ కార్యక్రమం నిర్వహించడంవల్ల వారి పరిశోధన పటిమను పరిపక్వస్థాయికి చేర్చగలగాలి. అలాగే అంతర్జాతీయ సంబంధాలు, రాజ్యాంగ సిద్ధాంతం, ప్రజాపాలనలలో సంబంధిత బోధకులకు లోతైన అధ్యయనానికి అవకాశాలు కల్పించేదిగా పునశ్చరణ కార్యక్రమం నిర్వహిస్తే బావుంటుంది. ఇతర సమాజ విజ్ఞాన శాస్త్రాల ప్రత్యేక విషయాంశాలలో కూడాఇదేపద్ధతిని అనుసరించాలి.

స్నాతకోత్తర స్థాయిలో ప్రత్యేక విషయ అంశాల పరిశోధన ప్రక్రియలను సమ్మేళనం కొంతవరకు సాధ్యపడుతుంది. ప్రత్యేక నైపుణ్యాలను గుర్తిస్తూ మూడు నాలుగు వారాల కోర్సులో ఒక అంశంపై పరిశోధన రూపరచనకు (Research Design), కానీ పరిశోధనా వ్యాసం రాయడానికి కానీ పునశ్చరణ కార్యక్రమం అవకాశం కలిగించవచ్చు. గ్రంథాలయ వినియోగంపై ప్రత్యేకంగా స్నాతకోత్తర స్థాయిలో శిక్షణను విశ్వవిద్యాలయాలు అరుదుగా అందిస్తాయి. సమాచార సాంకేతిక జ్ఞానంలో వేసిన ముందజలు ఒక వ్యక్తి స్వయంకృషితో తెలుసుకోవడం కష్టం. ఇటువంటి పునశ్చరణ కోర్సులద్వారా విశ్వవిద్యాలయ ఉపాధ్యాయుల సమాచార చేతన స్థాయి పెంపొందించవచ్చు. పెర్సనల్ కంప్యూటర్ (Personal Computer : PC) ఆన్‌లైన్ కంప్యూటర్ వంటి సౌకర్యాలు పరిశోధనలో ఎలా ఉపయోగించుకోవాలో భవిష్యత్తులో కంప్యూటర్ వినియోగం అనూహ్యంగా పెరిగే అవకాశం వల్ల ఆ పరికర మౌలిక అంశాలు ముఖ్యంగా పరిశోధనలో వాటి ఉపయోగంపై కనీస సమాచారం విశ్వవిద్యాలయ స్థాయి బోధకులకు అందుబాటులో ఉంచడం సమంజసంగా ఉంటుంది. గ్రంథాలయానికి సంబంధించిందే మరొకటి బిబ్లియోగ్రఫీ తయారుచేయడంలో తర్ఫీదు. పరిశోధకుడు తన పరిశోధన క్షేత్రం గురించి తెలుసుకోడానికి అనేక గ్రంథాలను సంప్రదించవలసి ఉంటుంది. ముందు చెప్పినట్లు గ్రంథాలయం వాడకంలో అనేక సులువైన మార్గాలు పాశ్చాత్యదేశాలలో విరివిగా వాడకంలో ఉన్నాయి. ఆ దేశాలలో ఉండే సాంకేతిక వైజ్ఞానిక స్థాయికి ఎదగడానికి ఎంతో కాలం పట్టవచ్చు. కాని పరిశోధనలో మెళుకువలు తెలుసుకోవడం, అవి పోస్టుగ్రాడ్యుయేట్ స్థాయి విద్యార్థికి అందించడం, బిబ్లియోగ్రఫీలాంటి ప్రాథమిక చర్యలలో ఉపాధ్యాయులు మౌలిక శిక్షణ పొందితేనేకాని విద్యార్థికి అందించలేరు. అందువల్ల గ్రంథాలయాన్ని ఉపయోగించడంలో కొంత తర్ఫీదు ఇవ్వడం పునశ్చరణ కోర్సులు వీలు కల్పించవచ్చు. దీనివల్ల అధ్యాపకులలో ఆసక్తిని ప్రేరేపించి, విశ్వవిద్యాలయాలలోని గ్రంథాలయాలను గరిష్ఠస్థాయిలో వినియోగించడానికి కూడా సాధ్యపడుతుంది.

2.స్నాతకోత్తరస్థాయిలో పరిశోధన ఫలితాలను ప్రచురించడానికి బోధకులకు అవకాశాలెక్కువని సాధారణంగా భావిస్తారు. ఇది వాస్తవాలకు కొంచెం దూరంగా ఉంది. బోధనకే ఎక్కువ సమయం వెచ్చించాల్సి రావడం వల్ల విషయ పరిధిలో సంభవిస్తున్న

మార్పులను పూర్తిగా ఆకళింపు చేసుకొనే సమయం, మార్గదర్శకత్వం లేదన్నది కొత్తవాదన కాకపోయినప్పటికీ ఈనాటి ఉపాధ్యాయులు ఎదుర్కొనే క్లిష్ట కాలనిర్వహణ ఇతర ఇబ్బందులను ఎత్తిచూపుతోంది. ఇప్పటికే కొంత ప్రత్యేకీకరణలో కృషి చేసిన క్షేత్రాలలోనే మరింత గట్టిపునాదులు ఏర్పరచి ప్రోత్సహించడం ద్వారా స్నాతకోత్తర స్థాయి బోధన సిబ్బందిలో ఈ పునశ్చరణ కార్యక్రమాలను కార్యోన్ముఖులుగా రూపొందించవచ్చు.

3. డిగ్రీ స్నాతకోత్తర స్థాయి బోధనలో ఉండే మౌలిక వ్యత్యాసాలను ముందే పేర్కొన్నాం. బోధన అంటే ఒక అధ్యాపకుడి నోటినుంచే ప్రత్యక్షంగా జరగాలి, విద్యార్థులు తు.చ.తప్పకుండా దాన్ని స్వీకరించాలి అన్నది సంప్రదాయ దృక్పథం అని వేరే విశదీకరించక్కరలేదు. కళాశాల స్థాయిలో కూడా చర్చా విధానం, సదస్సులు (Seminars) నూతన భాగస్వామ్య బోధన వ్యూహాలు లేదా పద్ధతులు అనుసరించాలనడం కూడా పాత వాదనే. ఈ కొత్త పద్ధతులు స్నాతకోత్తర స్థాయిలో ఆచరణ యోగ్యంగా ఉంటాయని నిరూపింపబడ్డాయి. విద్యార్థుల సంఖ్య పరిమితంగా ఉండడం, అవగాహనాశక్తి ఎక్కువగా ఉండడం వల్ల నూతన బోధనా పద్ధతులలో అమలు ఈ స్థాయిలో డిగ్రీ స్థాయితో పోలిస్తే సాపేక్షంగా సులువుగా ఉంటుంది. 1970లలో దేశంలోని అనేక విశ్వవిద్యాలయాల్లో ప్రవేశపెట్టిన సెమిస్టరు పద్ధతి ని ఇక్కడ గుర్తు తెచ్చుకోవాలి. అందువల్ల స్నాతకోత్తర స్థాయిలో బోధనశిల్ప పద్ధతులలో కూడా అనుభవజ్ఞులైన వారిచేత శిక్షణ అందించవచ్చు. పాఠశాల స్థాయిలో అధ్యాపక శిక్షణకు నమూనా పాఠశాలలు (Modal Schools) ఏ విధంగా ఉపకరిస్తున్నాయో, అకడమిక్ స్టాఫ్ కాలేజీలు పునశ్చరణ తరగతులద్వారా స్నాతకోత్తర సిబ్బందికి కూడా ఉపకరించవచ్చు.

4. అదే విధంగా విద్యార్థి మూల్యాంకనం కూడా సెమిస్టరు పద్ధతి, క్రమబద్ధ అంతర్ మూల్యాంకనం మొదలైనవి దేశ విద్యావరణ సందర్భంగా విశ్లేషిస్తే డిగ్రీస్థాయిలో కంటె స్నాతకోత్తర స్థాయిలోనే ఈ నూతన పద్ధతులకు అనువుగా ఉంటాయని ఈ మధ్యకాలంలోనే రుజువైంది. విశ్వవిద్యాలయాల్లో అయినంతగా కళాశాలలో అంతర్ మూల్యాంకన పద్ధతి సఫలీకృతంకాలేదు. ఇతర కారణాలు ఏవైనా నూతన పద్ధతులకు ప్రస్తుత సమయంలో డిగ్రీ కాలేజీలకంటే విశ్వవిద్యాలయాలే ప్రథమ పరిశోధనాలయాలుగా ఉంటూ వస్తున్నాయి. అయితే నూతన మూల్యాంకన, బోధన వ్యూహాలలో శిక్షణ ఆవశ్యకత ఎంతైనా ఉంది. విద్యార్థులకు అంతర్ మూల్యాంకన పద్ధతిలో అభ్యాసాలు ఇవ్వడం అంత సులభతరమైనది కాదు. ఎందుకంటే ఈ అభ్యాల వెనక ఉద్దేశం విద్యార్థులకు కొంతమేరకే వివిధ విషయ అంశాలపై సమాచారం ఉపన్యాస రూపంలో అందజేయడం. మిగతాది వారంతటవారే విషయాంశాలకు సంబంధించినది సేకరించగలగాలి. అందువల్ల అభ్యాసాలు కేటాయించడంలో కొంత తర్ఫీదు తప్పనిసరి. అలాగే సదస్సులు (Seminars), వస్తుపర పరీక్షలు (Objective Tests) లలో కూడా శిక్షణ తప్పనిసరి. స్నాతకోత్తర స్థాయి పునశ్చరణ కార్యక్రమం ఈ విషయాంశాలకు కనీసం ఒకవారం కేటాయించడంద్వారా మూల్యాంకనకు సంబంధించిన మౌలిక అంశాలను తెలియపరచవచ్చు.

ఇప్పటివరకు చర్చించింది ప్రత్యేకాంశ అధ్యయనానికి సంబంధించింది అన్న అభిప్రాయం కలగవచ్చు. ప్రత్యేక అధ్యయనంతోపాటు ఈ కార్యక్రమాలు అధ్యాపకులలో ఒక సమీకృత దృక్పథాన్ని పెంపొందించగలగాలి. Missing the Wood for the Tree అన్న సామెత ఇక్కడ మరవకూడదు. ఈ తరహా శిక్షణ విధాన ధ్యేయమే బోధన సిబ్బందిలో సమీకృత దృక్పథం పెంపొందించడం. అందువల్ల పోస్టుగ్రాడ్యుయేట్ ఉపాధ్యాయులకు ఉద్దేశించబడే పునశ్చరణ కార్యక్రమాలు కూడా Synthetic outlook ని కల్పించగలగాలి. వివిధ విషయ పరిజ్ఞానరీతులు గమనిస్తే వాటి ఆశయం కూడా సమీకృత దృక్పథ ఆవశ్యకతను


(మిగతా 172 వ పేజీలో)

# భారతదేశ కేంద్రక శక్తి కార్యక్రమం - ఒక పరిశీలన

అనువాదం:
దావురాజు సుబ్బారావు
తెలుగు అకాడమి
హైదరాబాదు-500 029.

డా॥ యమ్. ఆర్. శ్రీనివాసన్
అధ్యక్షులు, అటామిక్ ఎనర్జి కమిషన్,
అణుశక్తి శాఖ భారత ప్రభుత్వ కార్యదర్శి,
బొంబాయి-400 029.

భారత దేశ స్వాతంత్ర 40వ వార్షికోత్సవం 1987 లో జరిగింది. ఈ సంవత్సరంలోనే దేశ పరమాణు శక్తి కార్యక్రమానికి సంబంధించి కూడా ఒక కొత్తశకం ఆరంభమైంది. 1948లో పరమాణుశక్తి చట్టాన్ని ఆమోదించడంతోపాటు పరమాణుశక్తి కమీషన్ ఏర్పరచినప్పటి నుంచి విద్యుదుత్పాదన కోసం పరమాణు శక్తిని వినియోగించడం దేశ పరమాణు శక్తి కార్యక్రమ ప్రధాన లక్షణాలలో ఒకటి. ఈ కార్యక్రమపు అభివృద్ధి దశలో సాధించిన విజయం వల్ల 1987లో భారతదేశ కేంద్రక శక్తి కార్పొరేషన్ లిమిటెడ్ (Nuclear Power Corporation of India Ltd - NPCIL) ఏర్పాటు పరాకాష్టకు చేరింది. ఇది భారతదేశంలో కేంద్రక శక్తి "పారిశ్రామికీకరణ" ప్రారంభానికి నాంది పలికింది.

## భారతదేశ అభివృద్ధికి విద్యుచ్ఛక్తి అవసరం :

అభివృద్ధి చెందుతూఉన్న దేశంగా భారతదేశ జనాభాలో అధికభాగం కనిష్ఠ జీవనస్థాయిలో ఉన్నారు. ఆర్థిక వ్యవస్థలో ముఖ్యమైన అంశంగా వ్యవసాయం ఉంటూ వచ్చింది. అధికమైన అక్షరాస్యత, పారిశ్రామిక, పట్టణ, వ్యవసాయకంగా అభివృద్ధి చెందిన సమాజంగా పరివర్తనం చెందటానికి లభ్యమవుతున్న వనరులు నిరోధిస్తున్నాయి. ఇట్లాంటి పరివర్తనాలు ప్రపంచంలో కొన్నిచోట్ల పెరుగుతున్న వాణిజ్యపరమైన శక్తి వినియోగం, మొత్తం శక్తి వినియోగంలో విద్యుచ్ఛక్తి వాటా అధికంగా ఉండటంలోనూ మేళవించి ఉన్నాయి. ఎరువులు, తెగుళ్ళ నివారణ, మందుల ఉత్పత్తి, ధాన్యం నిలవ చేయటానికి ఉపయోగించే ప్లాస్టిక్కు ఉత్పత్తి మొదలైన వాటికోసం వినియోగపడే విద్యుత్‌ను కూడా చేర్స్తే ఆహార ఉత్పత్తి, తత్సంబంధ వ్యాసక్తులకు అవసరం అయ్యే విద్యుత్తు వాటా, జనింపచేసిన మొత్తం శక్తిలో (Power) ఇంచుమించుగా మూడోవంతు మాత్రమే ఉంటుందనే అంశం భారతదేశ వ్యవసాయక ఆధార ఆర్థిక వ్యవస్థను ప్రాధాన్యంలోకి తెస్తుంది. అందువల్ల భారతదేశ సంక్షేమం చాలా మేరకు విద్యుచ్ఛక్తి సరఫరా మీద ఆధారపడి ఉంది. గత మూడు నాలుగు దశాబ్దాలలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి రంగంలో జరిగిన చెప్పుకోదగ్గ ప్రగతి కారణంగా స్థూల విద్యుచ్ఛక్తి ఉత్పత్తిలో 4000% పెరుగుదల ఏర్పడింది. ఇది ఎంతగా పెరిగిందంటే 1950-51 లో 5 బిలియన్ యూనిట్‌ల విద్యుచ్ఛక్తి ఉత్పాదితమైతే, 87-88 నాటికి 200 బిలియన్‌ల యూనిట్‌లకు పెరిగింది. అయినా మన తలసరి వినియోగం అభివృద్ధి చెందిన దేశాలలోని తలసరి వినియోగం కంటె ఇప్పటికీ స్వల్పమే. ఇతర పారిశ్రామికంగా అభివృద్ధి చెందిన బ్రెజిల్ (Brazil) కొరియా రిపబ్లిక్, సింగపూర్ వంటి దేశాలతో పోల్చినా కూడా ఇది తక్కువే. ఈ రకమైన పూర్వరంగంలో, 2000 సంవత్సరం నాటికి శక్తి ఉత్పాదక సామర్థ్యపు అవసరం కనీసం 139,000 MWe నుంచి గరిష్ఠ 188 ,000 M We దాకా ఉంటుందని చెప్పితే ఆశ్చర్యపోనక్కరలేదు. ఇటీవలి సంవత్సరాలలో ప్రజలు కూడా క్రమక్రమంగా దేశ పురోగతికి విద్యుచ్ఛక్తి అవసరాన్ని అవగాహన చేసుకోవటంతోపాటు దాన్ని అంగీకరిస్తున్నారు.

## కేంద్రశక్తి ఉత్పాదన - అవసరం (Necessity for Nuclear Power Generation)

విద్యుచ్ఛక్తి అవసరాలకు సంబంధించి

దేశంలోని వివిధ ఏజెన్సీలు నిర్వహించిన అధ్యయనాలు రాబోయే సంవత్సరాలలో విద్యుచ్ఛక్తి సరఫరాలో కేంద్రకశక్తి ప్రముఖపాత్ర నిర్వహించాలని సూచించాయి. విద్యుచ్ఛక్తి ఉత్పాదనకుగల అవకాశాలను మూల్యాంకనం చేసుకోవటంలో శక్తి ఉత్పాదనలో అధికంగా కోల్‌ను వినియోగిద్దామనే ఆలోచన వచ్చినప్పుడు కోల్ నిల్వల స్థానీకృత భౌగోళిక పంపిణీని, దానిలోని అధిక బూడిద శాతాన్ని, దూరప్రదేశాలనుంచి వినియోగించుకొనే ప్రదేశాలకు రవాణా చేయడం, చివరకు, మనదేశంలో అరిగిపోయే కోల్ స్వభావం (abrasive nature of coal) అనే అంశాలను పరిగణించాలి. గాలి నాణ్యత (air quality), పరిమిత కార్బొనేషియస్ ఖనిజ వనరులు తగ్గిపోవడం వంటి ప్రముఖమైన దీర్ఘకాలిక సమస్యలుకూడా ఉన్నాయి. దేశంలో విద్యుచ్ఛక్తి ఉత్పాదనకు ముఖ్యమైన దోహదకారిగా కోల్ కొనసాగితే వచ్చే దశాబ్దంలో, ఇప్పుడు ప్రస్తుతం ఉన్న 6 0–65% నుంచి దాని వాటా క్రమంగా క్షీణించిపోతుందని ఆశించవచ్చు. ప్రస్తుతం జల విద్యుచ్ఛక్తి ఉత్పత్తిలో సుమారు 30–35% ఉంది. ఎప్పుడు ఒక కొత్త హైడ్రో-ప్రోజెక్టును చేపట్టినా మిగిలిన అటవీ ప్రాంతాలు మునిగిపోవటం, అధిక జనాభాకు పునరావాసం కల్పించడం వంటి తీవ్రమైన సమస్యలు ఎదురవుతున్నాయి. ఈ సమస్యలను సంతృప్తికరంగా పరిష్కరించే మార్గాలు కనుక్కోవాలి. జల విద్యుత్ ప్రాజెక్టులను గరిష్ఠస్థాయిలో చేపట్టాలి. ఇవన్నీ చేస్తూ కూడా విద్యుదుత్పాదనకు ప్రత్యామ్నాయ మార్గాలను అన్వేషించేందుకు సిద్ధపడాలి. సౌరశక్తి, గాలి బయోమాస్, బయోగాస్ మొదలైనవి మొత్తం శక్తి కార్యక్రమంలో ముఖ్యమైన అంశాలవుతాయి. **అయితే అధికాంశంలో** విద్యుదుత్పాదనకు సంబంధించినంత వరకు, ఈ వనరుల్లో ఏ ఒకటి కూడా, చూపుమేర భవిష్యత్‌లో ముఖ్యపాత్రను నిర్వహించే అవకాశం లేదు. ఇప్పటిమాదిరిగానే అధికాంశంలో విద్యుదుత్పాదనకు కేంద్రక శక్తి మాత్రమే ఆర్థికంగానూ సాంకేతికంగానూ శక్యమైన మరొక మార్గంగా ఉంది.

## కేంద్రకశక్తి ఉత్పాదన - ప్రపంచ స్థితి (Global Scenario Regarding Nuclear Power Generation) :

కేంద్రక శక్తి ఉత్పత్తికి సంబంధించినంతవరకు ఈ సందర్భంలో ప్రపంచ పరిస్థితిని పరిశీలించటం భావ్యం. 28 దేశాల్లో పని చేస్తూ మొత్తం సంస్థాపిత శక్తి ఉత్పాదక సామర్థ్యం సుమారు 297,000 M We ఉన్న 417కి పైగా కేంద్రక రియాక్టరు పనిచేస్తున్నాయి. ఇవి ఉత్పత్తి చేస్తున్న విద్యుచ్ఛక్తి ప్రపంచ విద్యుదుత్పత్తిలో 16% గా ఉంది. 49,000 M We సంస్థాపిత కేంద్రకశక్తి ఉత్పాదక సామర్థ్యం ఉన్న రియాక్టర్‌ను ఫ్రాన్స్ నెలకొల్పింది. ఈ రియాక్టర్ ఉత్పత్తి చేసే విద్యుచ్ఛక్తి ఫ్రాన్సులోని మొత్తం విద్యుదుత్పత్తిలో సుమారు 70% ఉంటుంది. ఆసియా ప్రాంతంలో కేంద్రకశక్తి ఉత్పాదన సామర్థ్యం జపాన్‌కు సుమారు 27,000 M We; దక్షిణకొరియాకు 5,400 M We; తైవాన్‌కు 4,900 M We ఉంది. సోవియట్ యూనియన్‌లో 55 రియాక్టర్లు పనిచేస్తున్నాయి; వీటి కేంద్రకశక్తి సామర్థ్యం 33,000 M We ఉంది. కోల్, ఆయిల్, గాస్ నిధులు ఎక్కువగా ఉన్నా ఆర్థిక పరిమితులవల్ల వచ్చే కొన్ని సంవత్సరాలలో కేంద్రక శక్తి ఉత్పాదక సామర్థ్యాన్ని గణనీయంగా వృద్ధి చేసుకోవటానికి సోవియట్ యూనియన్ ప్రణాళికలను సిద్ధం చేసుకొంది. కోల్, కేంద్రక వనరులనుంచి విద్యుత్తు ఉత్పాదక గిట్టుబాటును గురించి అనేకమైన అధ్యయనాలు చేశారు. దీనివల్ల కోల్ సత్వరంగా అందుబాటులో ఉన్న ప్రాంతాలల్లో మినహా, కోల్ ఉపయోగించి శక్తి ఉత్పాదించిన దానికంటె కేంద్రక శక్తి ఎక్కువ చౌకగా ఉంటుందని తెలిసింది. ఫ్రాన్స్, బెల్జియమ్‌లు విద్యుత్తును అధికశాతంలో కేంద్రక శక్తినుంచే ఉత్పాదించుకొంటాయి. అయినా పశ్చిమ యూరోపాలోకల్లా తక్కువ ధరకే విద్యుత్తును పొందుతాయి.

## కేంద్రక శక్తి అభివృద్ధికి భారతీయ వ్యూహం:

కొన్ని సంవత్సరాల కాలంలో మనం క్రమంగా కేంద్రకశక్తి కార్యక్రమాలను చేపట్టి, వాటిని ఏకీకృతం చేసుకొన్నాం. ఒక సంస్థలోని పరిశోధన, అభివృద్ధి (Research and development) శాఖలో తీవ్రమైన పరిశోధనలతో సాంకేతికశాస్త్రాన్ని (Technology)

కరతలామలకం చేసుకోవటం, డిజైన్‌ను వ్యవస్థాపించడం, కేంద్రక శక్తి కేంద్రంలో పరికరాల తయారీ సామర్థ్యం పొందటం, వ్యాపార సరళిలో కేంద్రకశక్తి కేంద్రాలను నడపడంలో అనుభవం గడించడం వంటి అంశాలమీదనే మొదటి మూడు దశాబ్దాల కాలంలోని కృషి కేంద్రీకృతమైంది. మొదటి భారత ప్రధాని పండిత జవహర్‌లాల్ నెహ్రూ, డా. హోమి జె. భాభాల దూరదృష్టి వల్లనే 1948లోనే భారత పరమాణుశక్తి కమిషన్ ఏర్పాటు అయింది. కేంద్రకశక్తికి కావలసిన సాంకేతిక విజ్ఞానాన్ని దేశీయంగానే అభివృద్ధి చేయాలని, ప్రముఖ కేంద్రక శక్తి కార్యక్రమం చేపట్టడానికి ముందు పూర్తిగా నిమగ్నులు కావాలని గుర్తించారు. దేశంలో యురేనియమ్ నిక్షేపాలు పరిమితమైనవైనా థోరియమ్ నిక్షేపాలు అపారమైనవని తెలుసు. మొదటి ఒకటిన్నర దశాబ్దం ప్రయోగాత్మకంగా రియాక్టర్‌ను ఏర్పరచడంలోనూ, బొంబాయిలో మల్టి డిసిప్లినరీ పరిశోధన - అభివృద్ధికి (R&D) దోహదం చేసే ముఖ్య శాఖను ఏర్పరచడంలోను గడిచిపోయింది. కేంద్రక విజ్ఞాన శాస్త్రాల్లోని వివిధ రంగాల్లో పరిశోధన, అభివృద్ధి కొనసాగించటానికి నైపుణ్యవంతమైన శాస్త్రజ్ఞులు, ఇంజనీరుల (Skilled cadre of scientists) వర్గాన్ని అభివృద్ధి చేయడానికి అగ్ర ప్రాధాన్యమివ్వడమైంది. ఈ పునాదే భారతదేశ కేంద్రక శక్తి కార్యక్రమాల్లో నేడు జీవగర్ర అయింది.

కేంద్రక శక్తి సముచిత ఉపయోగంకోసం అవలంబించిన ముఖ్యమైన విధానంలో మూడు దశలున్నాయి. ఇందుకు కింద వివరించిన విధంగా వివిధ రకాల రియాక్టర్లను ఉపయోగించవలసిన అవసరం ఉంది.

**మొదటిదశ :** విద్యుచ్ఛక్తి ప్లుటోనియం (ఖర్చయ్యే ఇంధనంలో) ఉత్పాదనకు స్వాభావిక యురేనియమ్‌ను ఇంధనంగా ఉపయోగించే ప్రెషరైజ్డ్ హెవీ వాటర్ రియాక్టర్లు (PHWRs).

**రెండోదశ :** PHWRsలో వినియోగించిన ఇంధనం నుంచి పునఃప్రక్రియ చేసి నిష్కర్షణ చేసిన ప్లుటోనియమ్‌ను ఇంధనంగా ఉపయోగించే ఫాస్ట్‌బ్రీడర్ రియాక్టర్లు (FBRs). ఈ రియాక్టర్లు ఏక కాలికంగా థోరియమ్‌ను ప్రజననపదార్థంగా (బ్రీడింగ్ మెటీరియల్)గా ఉపయోగించుకొంటూ అదనపు ఇంధనాన్ని కూడా దిగుబడిచేస్తాయి.

**మూడోదశ :** ఇవి FRBs నుంచి వచ్చిన ఉద్యోదితం చేసిన థోరియమ్‌ను తిరిగి ప్రక్రియ చేయడంవల్ల లభించిన యురేనియమ్ 233ను ఇంధనంగా ఉపయోగించేథోరియం ఆధార రియాక్టర్లు. తరవాతి కేంద్రకశక్తి యూనిట్‌లకు కేంద్రక ఇంధనం ప్రజననానికి ఇంకా ఎక్కువ థోరియమ్‌కు ఈ రియాక్టర్లు ప్రజననం చేస్తాయి.

## ప్రస్తుతం వాడుకలో ఉన్న కేంద్రక శక్తి రియాక్టర్లు

(Nuclear Power Reactors currently in operation):

PHWR ఆధార కేంద్రక శక్తి కార్యక్రమం చేపట్టాలనే ఆలోచన ఉంది. అయినా కేంద్రకశక్తి కేంద్రాలు పనిచేసే విధానంలో వెంటనే అనుభవం పొందటానికి, నిర్మాణానికి, అమరికకు, సిబ్బందిని చేకూర్చటానికి ఫూచీవహించే పద్ధతిపై యురేనియమ్ ఇంధనంగా వాడే బాయిలింగ్ వాటర్ రియాక్టర్లు (BWRs) రెండింటిని ఏర్పాటు చేసుకొనేందుకు కూడా నిర్ణయించారు. ఆ విధంగా భారతదేశంలో వ్యాపార సరళిలో కేంద్రక శక్తి ఉత్పాదకం 1969లో తారాపూర్ పరమాణుశక్తి కేంద్రం (TAPS) ఏర్పాటుతో ఆరంభమయింది. ఈ కేంద్రంలో రెండు BWR లు ఉన్నాయి. ప్రస్తుతం వాటి ఒక్కొక్కదాని సామర్థ్యం 160 M We. రియాక్టర్లు సుసంగతంగా జల విద్యుచ్ఛక్తికాని శక్తిని భారతదేశంలో సరఫరా చేస్తూనే ఉన్నాయి. గత 18 సంవత్సరాలుగా ఈ కేంద్రం పని చేయటం వల్ల ఈ దేశంలో కేంద్రక శక్తిని మితవ్యయంతో పొందవచ్చు అని రుజువు అయింది. నీటిని పంపే స్పార్జర్ (Sparger) వద్ద కొన్ని పనులు కొనసాగించడంలో TAPS లోని మొదటి యూనిట్‌లో 1987-88లో మళ్ళీ ఇంధనం భర్తీ చేసే కార్యక్రమంలో అంతరాయం ఏర్పడింది. కాని రెండో యూనిట్ సంవత్సరంలో చక్కగా పనిచేసి 82% సామర్థ్యాన్నిసాధించింది.

అరవయ్యో దశాబ్దంలో కెనడా సహకారంతో రెండు PHWRల ఏర్పాటును చేపట్టారు. ఎంతత్వరలో

వీలైతే అంత త్వరగా PHWR సాంకేతిక శాస్త్రంలో స్వావలంబనాన్ని (Self reliance) సాధించాలనేది దీని లక్ష్యం. క్రిటికల్ రియాక్టర్ ఇంటర్నల్స్‌కు అవసరమైన భారజలం, కేంద్రక ఇంధనం, జిర్కోఎలాయ్ అంశాల (Zircaloy Components) ఉత్పత్తికి దేశంలోనే సామర్థ్యం పొందటానికి తగిన కృషి జరిగింది. ఈ సాహస కార్యం కోటా (Kota)లో రాజస్థాన్ పరమాణుశక్తి కేంద్రం (RAPS) లో రెండు 220 MWe రియాక్టర్ల ఏర్పాటుకు దోహదం చేసింది. ఈ యూనిట్‌లు కూడా 1973-74లోనూ 1980-81లో వరసగా పని చేయటం ఆరంభించాయి. దానిలో ఒక ఎండ్‌షీల్డ్ నుంచి లఘుజలం (light water) కారిపోవటాన్ని ఆపటానికి చాలా క్లిష్టమైన స్వభావంతో కూడిన విస్తృతమైన మరమ్మత్తులను మొదటి యూనిట్‌కు చేయవలసి వచ్చింది. ఈ మరమ్మతుల తరవాత గత కొన్ని మాసాలుగా సుమారు 100 M Weతో ఈ యూనిట్ నికరంగా పనిచేస్తోంది. అయితే వేరొకవైపు, రాజస్థాన్‌లోని రెండో యూనిట్ ఇటీవలి సంవత్సరాల్లో చక్కగా పనిచేస్తోంది. ఈ రెండు యూనిట్‌లు 1987-88 సంవత్సరంలో సుమారు 1400మిలియన్ యూనిట్ల విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేశాయి.

మద్రాస్ పరమాణుశక్తి కేంద్రం (MAPS) మొదటి యూనిట్ కల్పాక్కం జూలై 1983లో పూర్తి అయింది. ఇది భారతదేశ కేంద్రక శక్తి కార్యక్రమాల్లో ఒక ముఖ్యమైన ఘట్టం, డిజైన్, తయారీ నిర్మాణం, ఆరంభం చేయడం అన్నీ భారత ఇంజనీర్లు, సాంకేతిక శాస్త్రజ్ఞుల పూర్తి బాధ్యతలపైన చేపట్టిన ఒక జాతీయ సాహసోపేతమైన కార్యం. రెండో యూనిట్ 1985 చివరలో పనిచేయడం ఆరంభించింది. ఒక్కొక్కటి 235 M We సామర్థ్యంతో ఈ రెండు యూనిట్‌లు 1987-88 సంవత్సరంలో మొదటి నెలల్లో బాగా పనిచేశాయి. తరవాత HP టర్బైన్ బ్లేడుల్లో కొన్ని పగుళ్ళను కనుక్కోవటంవల్ల మొదటి యూనిట్ సుమారు ఫిబ్రవరి 1988 దాకా పనిచేయటం మానివేసింది. టర్బైన్ LP రొటార్ బ్లేడ్లు విరగడంవల్ల, HP టర్బైన్ బ్లేడ్లలో పగుళ్ళు చూపడంవల్ల MAPS రెండో యూనిట్ డిసెంబర్ 1987 నుంచి పనిచేయడం ఆగిపోయింది. ఈ సమస్యలున్నా MAPS కేంద్రం సుమారు 2040 మిలియన్ యూనిట్‌ల విద్యుచ్ఛక్తిని 1987-88లో ఉత్పత్తి చేసింది.

## నిర్మాణంలో ఉన్న కేంద్రక శక్తి ప్రాజెక్టులు (Nuclear Power Projects under Construction) :

మొత్తం 1230 M We స్థాపన సామర్థ్యంతో ఉండే ప్రస్తుతం పని చేస్తూ న్న ఆరు రియాక్టర్లు కూడా దేశంలోని విద్యుచ్ఛక్తిలో 3% సరఫరా చేస్తున్నాయి. వీటికి తోడు ఒక్కొక్కటి 235 M We సామర్థ్యంలో ఉండే ఇంకా ఎనిమిది రియాక్టర్లను నాలుగు ప్రదేశాల్లో నిర్మిస్తున్నారు. వీటిలో రెండు ఉత్తరప్రదేశ్‌లో నరోరా (Narora) వద్ద స్థాపించారు. ఇవి పూర్తి కావస్తున్నాయి. నిర్మాణ కార్యక్రమాలు అన్నీ పూర్తి అయ్యాయి. ముఖ్యమైన పరికరాలను స్థాపిస్తున్నారు. ఆరంభం చేస్తున్నారు. ఈ ప్రదేశంలోని మొదటి యూనిట్ 1988లో ప్రారంభమవుతుందని ఆశిస్తున్నారు. అయితే 1989-90లో రెండో యూనిట్ పనిచేయడం ప్రారంభిస్తుందని ఆశిస్తున్నారు. గుజరాత్‌లోని కక్రాపార్ (Kakrapar)లో కూడా ఇట్లాంటి రెండు యూనిట్‌లను నిర్మించే పనిని చేపట్టారు. ఈ ప్రదేశంలో నిర్మాణ కార్యక్రమాలు ముమ్మరంగా సాగుతున్నాయి. ముఖ్యమైన క్రిటికల్ పరికరాల నిర్మాణం కూడా పురోగామి స్థాయిలో (advanced stage) ఉంది. ఈ రెండు యూనిట్‌లు 1990-91లో పనిచేస్తాయని ఆశిస్తున్నారు. గత రెండు సంవత్సరాల్లోనూ కోటా (Kota) వద్ద ఒకటి కర్ణాటకలో కైగా (Kaiga) వద్ద ఒకటి రియాక్టర్ యూనిట్‌ల స్థాపనకు పని మొదలైంది. ఇవి 1990 మధ్య నాటికి పని చేయవలసి ఉంది. నిర్మాణంలో న్న ఈ రియాక్టర్లకు తోడు 235 M We, 500 M We సామర్థ్యంతో ఉండే ఇంకా అనేక PHRS నిర్మాణం చేపట్టటాన్ని ఆశిస్తున్నారు. ఈ 500 M We రియాక్టర్ల డిజైన్ పురోభివృద్ధి దశలో (advanced stage) ఉంది. వీటిలో మొదటిది 1990 లో పని చేయడం ఆరంభిస్తుందని ఆశిస్తున్నారు. కేంద్రకశక్తి కేంద్రాల నిర్మాణానికి అవసరమైన క్రిటికల్ పరికరాలను అందించగల సామర్థ్యం ఉందని భారతీయ పరిశ్రమ రుజువు ఏర్పరచుకుంది. రాబోయే సంవత్సరాలలో ఇట్లాంటి పరికరాలకు

పెరుగుతూఉన్న ఎట్లాంటి అవసరాన్నయినా తీర్చటానికి ఆయత్తమవుతూ ఉంది.

## కేంద్రక శక్తి ఉత్పాదనను వృద్ధిచేసేందుకు భవిష్యత్ పథకాలు (Future plans to increase Nuclear Power Generation) :

ఇటీవలికాలంలో దేశ కేంద్రకశక్తి కార్యక్రమాలను విస్తరించే విషయంలో తీవ్రంగా సమాలోచనలు చేశారు. ఇటువంటి భారీ కార్యక్రమాలు చేపట్టడానికి ముందు డిజైన్, నిర్మాణం, కేంద్రకశక్తి కేంద్రాలు పని చేయటం వంటి వాటికి బాధ్యత వహించే సంస్థ పనితీరులో కొన్ని నిర్మాణాత్మక మార్పులు అవసరం అని భావించారు. ఈ లక్ష్యంతోనే ఇంతకుముందు పూర్వం కేంద్రకశక్తి బోర్డు (Nuclear Power Board) ను NPCIL (Nuclear Power Corporation of India Ltd) గా మార్పుచేశారు. ఇట్లాంటి కార్యక్రమాన్ని చేపట్టడానికి నిర్వహణలో అవసరమైన సరళత చేకూర్చటానికి, కాపిటల్ మార్కెట్ నుంచి ఆర్థిక వనరులను ఆవర్తితంగా సమీకరించటానికి దీనివల్ల వీలుకలుగుతుంది. ఇటీవలనే ఈ కంపెనీ ప్రజానీకానికి బాండ్లు అందజేసింది; వీటికి ఆదరణ ఎక్కువగా లభించి ఆశించినదాని కంటె అధికవాటాలు చేకూరాయి. 2000 సంవత్సరం నాటికి స్థాపన కేంద్రక శక్తి ఉత్పాదన సామర్థ్యాన్ని 10,000 M We కు చేర్చడమే NPCIL ప్రస్తుత లక్ష్యం.

కేంద్రక శక్తి ప్రోజెక్టులు పెట్టుబడితో తీవ్రంగా ముడిపడి ఉండటంవల్ల, షెడ్యూల్‌కు (కాలపట్టికను) తూ.చ.తప్పక పాటించడం వంటి ప్రాముఖ్యాలను మరీ మరీ ఉద్ఘాటించనక్కరలేదు. ఈ లక్ష్యసాధనంలో NPCIL ఏర్పరచడం అనేది అధికంగా కృషి చేస్తుందని భావిస్తున్నారు. నిర్మాణంలో నూతన సాంకేతిక విధానాలను ఉపయోగించటానికి తోడు, కేంద్రకశక్తి ప్రోజెక్టుల ప్రణాళికారచన పరిపీక్షించడంవంటి విధులను ఉద్ధృతం చేస్తున్నారు. పరిశోధన - అభివృద్ధి రంగంలో (Area of R &D) దేశంలో కేంద్రక శక్తి కార్యక్రమాలు ఆరంభించిన నాటి నుంచి భాభా పరమాణు పరిశోధనా కేంద్రం (Bhabha Atomic Research Centre ( BARC) అత్యుత్తమమైన చేయూత నిచ్చింది. ముందు సంవత్సరాల్లో కూడా ఈ పాత్రను కొనసాగిస్తుందని ఆశిస్తున్నారు. ఇప్పుడు కేంద్రకశక్తి ఉత్పాదనం పరిశ్రమల స్థాయిలో (Industrial Phase) ప్రవేశిస్తున్నందువల్ల, PHWR సాంకేతిక విజ్ఞానంలో పరిశోధన, అభివృద్ధిని పదేపదే వక్కాణించడమేకాక, దాని ఆర్థిక స్థోమతను (Viability) మెరుగుపరచే క్షేత్రాలను కూడా సమావృతం చెయ్యాలి. ఫలితంగా దీనిలో గనుల తవ్వకం, నిష్కర్షణ, తక్కువగ్రేడ్ యురేనియం ఖనిజం నుంచి కేంద్రక ఇంధనం రూపొందించడం, భారజలం ఉత్పత్తి ధరను తగ్గించడం, రియక్టర్లు పనిచేసే స్థలాల్లో వికిరణ స్థాయిలు తగ్గించడం, ఒకటో రెండో దశాబ్దాలు రియాక్టర్లు పనిచేసే కాలాన్ని పొడిగించడం వంటి అనేక అంశాలు చేరతాయి.

## కేంద్రకశక్తి సురక్షితం, అంతేకాకుండా ఆర్థికంగా ఆచరణీయం, అభిలషణీయం (Nuclear Power is safe; and Economically viable option) :

దేశంలో కేంద్రక శక్తి ఉత్పాదనపాత్ర పెరుగుతున్న దృష్ట్యా, కేంద్రశక్తి సంక్షేమానికి సంబంధించిన ప్రశ్నను ప్రస్తావించడం సందర్భోచితమే. 1988 ఏప్రియల్‌లో రష్యాలోని చెర్నోబిల్ శక్తి కేంద్రం నెం.4 (Chernobyl Power Station No.4 in USSR) సంఘటన వరకు, ప్రపంచంలో ఎక్కడా కూడా పౌర కేంద్రక శక్తి రియాక్టర్‌కు ఆపాదించదగిన ఘాతుక దుర్ఘటనలు సంభవించలేదు. చెర్నోబిల్ దుర్ఘటనలో ప్లాంట్ ఆపరేటర్‌లకే దుర్మరణాలు పరిమిత మయ్యాయి లేదా అగ్నిమాపకానికి నియోగించినవారు దుర్ఘటనకు లోనయ్యారు. ఇంతకుముందు 1979లో అమెరికాలో త్రిమైల్ ఐలాండ్ శక్తి కేంద్రంలో దుర్ఘటన సంభవించింది; అక్కడ సంస్థాపనకి (Installation) జరిగిన నష్టాన్నిబట్టి దీనిని దుర్ఘటనగా భావించారు. అయితే ఈ దుర్ఘటనవల్ల ప్లాంట్‌లో పనిచేసే సిబ్బందికి లేదా పరిసరాల్లో నివసించేవారికి గాని వికిరణంవల్ల ఆపద సంభవించలేదు. అంతర్జాతీయ పరమాణు శక్తి ఏజన్సీ తీసుకొన్న చొరవ మూలంగా ఈ ముఖ్యమైన రెండు రియాక్టర్‌దుర్ఘటనలకు కారణాలను అంతర్జాతీయ కేంద్రకసమాజం (International nuclear community)

ఎక్కువగా తరచి చూసింది. ఈ దుర్ఘటనల నుంచి వెలువడ్డ అభిప్రాయాలనుంచి మానవ-యాంత్రిక ఉమ్మడి అంశానికి ఎక్కువ ప్రాముఖ్యం ఇస్తున్నారు. కేంద్రక సంస్థాపనల్లో అధికమైన అసంభావ్య అసాధారణ పరిస్థితుల్లో కూడా రియాక్టర్‌నుంచి రక్షణ కల్పించడానికి స్వయం చలన వ్యవస్థలు (Automated systems) వర్ధనం చేసే చర్యలు చేపట్టినారు. ఆపరేటర్ శిక్షణ, అర్హత సిమ్యులేటర్‌లు ఉపయోగిస్తూమళ్ళీ అర్హత పొందటం, స్వతంత్రంగా నిపుణులతో పనిచేసే విధానాలను సమీక్షించడం వంటి వాటిని ఎక్కువగా విశ్వసిస్తున్నారు. ఇటీవలనే అమలులో ఉన్న సమాచారాన్నీ అనుభవాన్నీ (Operating information) ప్రపంచవ్యాప్తంగా అమలులో ఉన్న రెండు కేంద్రక రియాక్టరుల్లో ఉపయోగించటం ప్రారంభించారు. దీనివల్ల కేంద్రకశక్తి కేంద్రాలలోని నిర్వాహక సిబ్బంది, ఆఫ్ డిజైన్ పరిస్థితులలో వ్యవహరించడానికి లేదా వారి సంస్థాపనలలోని ఇతర అసాధారణ పరిస్థితులతో వ్యవహరించడానికి, ప్రపంచంలో మరోచోట ఉన్నవారి అనుభవం నుంచి పూర్తి లాభాలను పొందుతుంది.

భారతీయ కేంద్రకశక్తి కార్యక్రమానికి చెందిన ప్రధాన మార్గంగా రూపొందే PHWR లకు కూడా సహజంగానే కొన్ని రక్షణ లక్షణాలు ఉన్నాయి. ఇప్పటి PHWR లలో అనుసరిస్తూ ఉన్న ద్విపాత్ర సూత్రం (డబుల్ కన్‌టెయిన్‌మెంట్ సూత్రం) వల్ల ప్రతికూల పరిస్థితుల్లో రియాక్టర్ల నుంచి వెలువడే వికిరణాలకు బహుళమైన నిరోధకాలు సంభవిస్తాయి.1.6 కిలోమీటర్ల దూరంలో ఏవిధమైన మానవ నివాసమూ లేకుండా ఉండే కఠినమైన నివేశన స్థల విధానాన్ని కూడా (Stringent siting policy) అనుసరిస్తున్నారు. ఇంకా ప్రతి సంస్థాపన వద్ద బాగుగా శిక్షణ పొందిన ఆపరేటర్‌లను, నిర్వహించే మానవశక్తిని పుష్కలంగా లభింపచేస్తున్నారు. "రియాక్టర్ ఆపరేటర్ ట్రెయినింగ్ సిమ్యులేటర్" నిర్మాణం ఇటీవలనే పూర్తి అయింది. త్వరలోనే దీన్ని అమలుపరిచే సిబ్బందికి శిక్షణ, పునఃశిక్షణ ఇచ్చే సేవలోకి ప్రవేశపెడతారని ఆశిస్తున్నారు. ప్రత్యేకంగా ప్లాంట్‌కు సంబంధించిన ప్రథమ చర్యలకు (initiation) అదనంగా, మూడు సంవత్సరాల కిందట ఏర్పాటు చేసిన పరమాణుశక్తిని క్రమబద్ధం చేసే బోర్డును పటిష్ఠంచేశారు. ఇది లైసెన్సు ఇవ్వటం, విధులను సమీక్షించడం చేస్తుంది. ఈ పూర్వ రంగమే కేంద్రక శక్తి ఉత్పాదనకు క్షేమం. ఈ దేశంలో శక్తి ఉత్పాదనకు ఆర్థికంగా కూడా ఇది ఆచరణీయం.

**ముగింపు :**

ప్రస్తుతం భారత కేంద్రక శక్తి కార్యక్రమం వ్యాపార రంగంలోకి అడుగుపెడుతూ ఉందని తెలుస్తూ ఉంది. గణనీయమైన విధానంలో కేంద్రకశక్తి కార్యక్రమాన్ని పెంపు చేయటానికి ఈరోజు వరకు సమీకరించిన అనుభవాన్ని పారిశ్రామికపు పరిమాణంలో వినియోగిస్తారు. పరిమితమైన శిలాజ వనరులు (limited fossil resources) అధికమైన జనాభా వంటి అవరోధాలున్న భారతదేశంవంటి దేశంలో వచ్చే దశాబ్దాలలో ఇట్లాంటి కార్యక్రమం తప్పకుండా గణనీయమైన లాభాలను చేకూరుస్తుంది.

# సాంకేతికశాస్త్ర నూతన కల్పనల నిర్వహణ : అవకాశాలు - సవాళ్ళు

అనువాదం
దావరాజు సుబ్బారావు
తెలుగు అకాడమి

డా. రామ్ కె. అయ్యంగార్
అదనపు కార్యదర్శి, DSIR
అదనపు డైరెక్టర్ జనరల్, CSIR, కొత్తఢిల్లీ

విజ్ఞానశాస్త్రంలో సృజనాత్మకత అనేది యాదృచ్ఛిక విషయం ఎంతమాత్రం కాదు. అయితే ఒక ధ్యేయంపట్ల ఒక నిర్వాహకవర్గం చేసిన సురక్షితమైన బృందం కృషి సువ్యవస్థీకృతమైన నిర్ధారితమైన నిరంతర కృషి ఫలితమే శాస్త్రవిజ్ఞానంలో సృజనాత్మకత. వ్యక్తి ఆలోచనను లేదా శైలిని నియంత్రించడం ద్వారా సృజనాత్మకతను సాధించలేం. అయితే సృజనాత్మక శక్తులను ప్రోత్సహించేట్లు గానూ, అవి ప్రగతి సాధించేట్లుగానూ కృషి వాతావరణాన్ని నిర్వహించడం ద్వారా ఇది సాధ్యమవుతుంది. వాస్తవానికి మంచి నాయకత్వంద్వారా సృజనాత్మక ప్రక్రియను వ్యవస్థీకృతం చేసినప్పుడు, వెలుగులోకి తెచ్చినప్పుడు, పోషించి నప్పుడు అది ఉత్తమంగా ఉంటుంది. అందరికీ స్పష్టంగా అవగాహనఅయ్యే రీతిలో వ్యస్థాపకశక్తి అనుగుణంగా యోగ్యమైన శిష్టవర్గాలను నిర్వచించడంవల్లనే ఇది సాధ్యపడుతుంది.

శాస్త్రవిజ్ఞానంలోని సృజనాత్మక ప్రయత్నాలు కొత్త సాంకేతిక విజ్ఞానాలను ఏర్పరుస్తున్నాయి. శాస్త్ర విజ్ఞాన పురోభివృద్ధి అందించిన అత్యంత స్థితిజశక్తిని దోచనపెట్టి కొంతమంది ధనవంతుల కోసంకాక బహుప్రజానీక జీవనస్థాయిలో వస్తురూపేణా, సేవల రూపేణ, సంపదను పెంచి వారి జీవిత గుణత్వాన్ని మెరుగుపరచటానికి జాతీయ సంకల్పశక్తి పునరుద్ధాటన అవసరమవుతుంది. అయితే ఇది పరిశోధనసుంచి సాంకేతిక విజ్ఞానాన్ని మాధ్యమిక దశలద్వారా మార్కెట్‌కి బదిలీ చేసే నిర్వహణతో కూడి ఉంది.వినియోగదారుని గిరాకీ గుర్తింపునుంచి సాంకేతిక శక్యతకూ, చివరకు విజ్ఞానం విస్తరణవరకూ ఉండే వ్యాసంగాలకు సంబంధించిన కొత్తవిధానాల శృంఖలంతో కూడి ఉంటుంది. సాధారణంగా సమాజం ముఖ్యంగా వినియోగదారుని అవసరాలను తీర్చటానికి కొత్తవీ, మెరుగైనవీ, ఇంకా ఉపయోగకరమైన ఉత్పత్తులు, సేవల నిరంతర ప్రవాహమే ఇది. అందువల్ల వినియోగదారుని అవసరాల సంశ్లేషణ, అవసరాలని సంతృప్తిపరచే సాంకేతిక సాధనమే నూతన పద్ధతి (Innovation).

ఈ నూతన విధానంలోని అనుసంధానాలను (Linkages) అడ్డంకులను (Barriers) సాకల్యంగా (Holistic view) గుర్తించటానికి, దృష్టి సారించటానికి ప్రస్తుతం ఈ పత్రంలో ప్రయత్నం చేయడం జరిగింది. సంఘ ప్రయోజనంకోసం ఎక్కువమంది, శాస్త్రవేత్తలు, సాంకేతిక శాస్త్రజ్ఞులు, ఇంజనీరులు తమ కృషి ఫలితాలు సద్వినియోగం కావాలని ఆకాంక్షిస్తారు. అందువల్ల ఈ విధానంలో వ్యవస్థాపకత్వ (Entrepreneurship) ప్రాముఖ్యాన్ని గుర్తించవలసిన అవసరం ఉంది. ఈ నూతన విధానం (Innovation Process) నమూనాను పటం-1లో చూడవచ్చు.

సాంకేతిక విజ్ఞానాభివృద్ధికి చోదన శక్తి శాస్త్ర ఆవిష్కరణ లేదా వినియోగదారుని అవసరం కావచ్చు. వినియోగదారుని అవసరం అనేది మార్కెట్ పరిశోధన ద్వారా ఏర్పడిన అవసరం లేదా వినియోగదారుని అత్యవసరం. గత 40 సంవత్సరాల పరిశోధనలోనూ మనదేశంలో కొత్తవిధానాలకి దారితీసిన అనేక శాస్త్ర ఆవిష్కరణలను కనుక్కోవడం కష్టం. ఇంకోవైపు, దిగుమతి చేసుకొన్న ఒక వస్తువు / అంశానికి ప్రత్యామ్నాయాన్ని కల్పించవలసిన అవసరం అనేకమైన నూతన కల్పనలకు దోహదం చేసింది. అతి వాహక పదార్థాల ఆధారంగా చేసిన మొదటి నూతన కల్పనాభివృద్ధి భారతదేశంలోనే జరిగిఉంటే లేదా జీవసాంకేతిక శాస్త్రం ద్వారా రూపొందించిన ప్రాణాలను కాపాడే మందు భారతీయులు సాధించిన


వ్యవస్థాపకుల
అవగాహన
వ్యవస్థాపకులు,
పరిశ్రమ
వస్తు
సేవలు
వినియోగదారు
అవసరాలు
ఇంజనీర్లు, డాక్టర్లు
ఆరోగ్యసేవలు
ఉత్పాదక
వస్తువులు
ఇంజనీరింగ్,
ఉత్పత్తి
సాంకేతిక
పోకేజీలు
శాస్త్రవేత్తలు, సాంకేతిక
విజ్ఞానవేత్తలు
సమాజం,
సమాజావసరాలు
ఆరోగ్యసేవలు
విద్య,
రహ
దారులు
సమాజపరంగా
పరిశోధనా
సంస్థలు
ప్రణాళికాబద్ధమైన అభివృద్ధి ఆధారంగా పరిశోధనా
కార్యక్రమాలు
విద్య, ఆరోగ్యం
మానవవనరులు
సాంకేతిక
విజ్ఞాన ం
నైపుణ్యాల
లోనూ
వైఖరిలోను
శిక్ష ణ
ఖనిజాలు మొదలైన
వాటికోసం ప్రభుత్వ
అభివృద్ధ
అవసరాలు

కార్యం అయి ఉంటే మనకు సంతోషదాయకంగా ఉండే విషయాలు సంభవించినప్పటికీ వినియోగదారుకు ప్రాముఖ్యమున్న నూతన కల్పనల ప్రాముఖ్యాన్ని భారతదేశం విషయంలో శాస్త్రీయమైన, సాంకేతిక శాస్త్రపరమైన (S&T) పరిశోధన నిర్వహణలో గుర్తించవలసి ఉంటుంది.

రక్షణ, అంతరాళ (Space), న్యూక్లియర్ క్షేత్రాలకు వెలుపల విజ్ఞానశాస్త్ర, సాంకేతికశాస్త్రాల వినియోగాదుల్లో ఎక్కువభాగం వ్యవసాయ, ఆరోగ్య, పారిశ్రామిక గ్రామీణ (AHIR) రంగాల్లో ఉన్నారు. టెలికమ్యూనికేషన్, రవాణా, విద్య మొదలైన ఇతర సహాయక రంగాల్లో కూడా ప్రాథమిక AHIR రంగాల్లో మెరుగైన ఉత్పాదకాలను (Inputs) సమకూర్చటానికి విజ్ఞానశాస్త్ర, సాంకేతికశాస్త్ర (S&T) ఉత్పాదకాల అవసరం ఉంది. ఉన్నటువంటి వ్యవస్థల కొత్త ఉత్పత్తి లేదా విధానం రూపంలో ఉత్పాదకాల, నాణ్యతను దక్షతను, స్థానిక వనరులను వినియోగించుకోవలసిన ఆవశ్యకతనూ, లేదా ప్రత్యామ్నాయ వనరులను రూపొందించుకోవలసిన అవసరాన్ని విజ్ఞానశాస్త్ర, సాంకేతికశాస్త్ర రంగాలుకూడా (S & T) నూతన విధానాల ఆవశ్యకతను (demand) గుర్తించాలి.

వినియోగదారుల అవసరాలను గుర్తించడానికి యాంత్రిక క్రియా విధానాలు (mechanisms) ఏవి?

ఇవి మూడు రకాలు. వీటిలో ప్రభుత్వ, ప్రభుత్వ రంగ, ప్రయివేట్ సంస్థలు, సాగించే మార్కెట్ పరిశోధనలు అత్యంత ముఖ్యమైనవి. వ్యక్తిగత, రంగంవారీ ప్రాంతీయ, జాతీయ డిమాండ్‌ను జనాభాలో ఏర్పడే మార్పులు ఆదాయ పంపిణీ ఈ పరిశోధనలు ప్రపంచ వ్యాప్తమైన సాంకేతిక విజ్ఞానాభివృద్ధి ఆధారంగా గుర్తిస్తాయి. సంఘానికి సంబంధించిన ఆరోగ్యం, విద్య, ప్రాంతీయంగా వెనకబడటం మొదలైన అంశాలుకూడా సంఘానికి అవసరమైన ఉత్పత్తులనూ సేవలనూ, గుర్తించే విధంగా చేస్తాయి. స్థానికంగా అందుబాటులో ఉండే వనరుల ఆధారంగా జరిగే అభివృద్ధి మూడోరకమైన యాంత్రిక విధానానికి సంబంధించింది. ఖనిజ, సహజసంపదల వినియోగించవలసిన అవసరం అనేది గత నాలుగు దశాబ్దాలుగా సాంకేతిక విజ్ఞానం డిమాండుకు సంబంధించిన ప్రధానాంశంగా ఉంటూ వచ్చింది.

ఈ రకమైన అవసరాన్ని గుర్తించేదశలో విజ్ఞాన, సాంకేతికశాస్త్ర సంస్థలు (S & T) ఏ మేరకు కృషి చేస్తున్నాయి?

బొగ్గు ఖనిజాల సహజ నిక్షేపాలను వినియోగించడంలో ఎదురయ్యే సమస్యలపట్ల ప్రభుత్వశాఖలూ, ప్రభుత్వరంగసంస్థలూ, పరిశోధన ద్వారా S,T ఉత్పాదకాలను అధిక స్థాయిల్లో గుర్తించటానికి దోహదం చేశాయి. పరిశోధన అభివృద్ధిని అనుసరించే వైఖరిలో వచ్చిన ఈ మార్పు ఒక వంక ప్రముఖ నిర్వాహకుల స్థాయికి ఇంకోవంక కార్యాచరణలోని ఇతర స్థాయిల్లోని కార్మికుల వరకూ చేరనేలేదు. అందువల్ల ఈ కొత్త సంస్కృతి శ్రామిక శక్తిని (Work force) చేరటానికి, సాంకేతికశాస్త్రంలోని కొత్తమార్పులను ఆమోదించి, వాటిని ప్రశంసించటానికి సమాంతరంగా కృషి చేయవలసిన అవసరం ఉంది. ఈ కొత్త S,T సంస్కృతిని ఆమోదించడంలో ఇందుకు సంబంధించి ప్రతి ఒక్కరు హృదయపూర్వకంగా పాల్గొనకపోతే సమస్యల సహజ స్వరూపాన్ని గుర్తించడం కష్టంకావచ్చు.

గనుల తవ్వకం, ఖనిజాల లోహాల విభాగానికి సంబంధించిన సమస్యలమీద జాతీయ స్థాయిలో జరిగిన సమాలోచనలు (deliberations) పరిశోధన, అభివృద్ధి (R&D) అవసరమైన ప్రధాన క్షేత్రాలను గుర్తించాయి. అవి

కోకింగ్ కోల్‌లోని బూడిద అంశాన్ని 17% తగ్గించి ప్రయోజనకారి చేయడం.

బూడిద అంశం ఎక్కువగా ఉండే కోల్‌ను అత్యధికసామర్థ్యంతో ఉపయోగించడం.

ఇనుము ఉత్పత్తిలో కోకింగ్‌కోల్‌ను నాన్ కోకింగ్ కోల్‌తో ప్రతిక్షేపించడం.

గాలికొలిమి కోక్ నాణ్యతలో మెరుగుదల, సింటర్ ద్వారానూ, కోల్డ్‌బాండెడ్ పెల్లెటైజేషన్ ద్వారానూ బ్లాడస్ట్ ఉపయోగించడం

ముందు గాఢత చేయడం (టర్సార్టింగ్) శక్తి

పరిరక్షణ (energy conservation) బయోళ్లీచింగ్ ద్వారా నాన్ ఫెర్రస్ ఖనిజాలకు (Minerals) ప్రయోజనం కల్పించడం.

నూనె, పెట్రోలియం విభాగం, మందులు రసాయనాలు, పెట్రోకెమికల్ విభాగం, ఇంజనీరింగ్, ఉత్పత్తిరంగం ఇదే మాదిరి ప్రయోగాలు చేస్తున్నాయి. వినియోగదారుడు, పరిపాలన విభాగం, శాస్త్ర, సాంకేతిక సేవాసంస్థలు (Agencies) ఒకతాటిమీదికి రావడం ముదావహం. దీనివల్ల స్పష్టంగా నిర్వహించిన, అగ్రప్రాధాన్యం ఉన్న కార్యక్రమం మీద దృష్టి కేంద్రీకృతమవుతుంది.

తాగేనీరు, వంటనూనెలు, ఇమ్యునైజేషన్, టెలికమ్యూనికేషన్‌వంటి రంగాల్లో కూడా సాంఘిక పరమైన ప్రచారక వర్గాలను తీర్చడానికి శాస్త్ర, సాంకేతిక సేవాసంస్థలు సునిశితంగా పనిచేయటానికి మరో అవకాశం లభించింది. దున్నడం, విత్తడంవంటి సంఘటిత మొక్కల నిర్వహణవంటి పంటకోతలకు పూర్వ దశల్లోనూ పంటకోత సమయంలోనూ అవసరమైన శాస్త్ర సాంకేతిక ఉత్పాదకాలను నూనెగింజల సేవాసంస్థ (Agency) నిర్వచించింది. బ్లెండింగ్, పాకింగ్, నిలవచేయడం, పంపిణీవంటి శాస్త్రీయ దృక్పథాలతో పాటు నూనెగింజల సేకరణ నిలవ చేయడం, నూనెల నిష్కర్షణ (Extraction), ప్రాసెసింగ్, శుద్ధి చేయడంవంటి వాటికికూడా ఫలసాయం అందిన తరవాత సాంకేతిక పరమైన జోక్యం అవసరం. అనేక సందర్భాలల్లో కొత్త శాస్త్రీయ పరిశోధన అవసరంలేదు. అనేక సందర్భాలలో సాంకేతిక విజ్ఞానాలు చక్కగా అభివృద్ధి చెందాయి. అంతేకాక ఇవి విదేశాలలో వాణిజ్యపరంగా అందుబాటులో ఉన్నాయి. ఎఫ్లటాక్సిన్స్‌కు, బియ్యపు ఊక, తవుడు వంటి వాటిని స్థిరీకరించి, ప్రాసెసింగ్ చేయటానికి ముందుగానే నూనెగింజలను ఉపచరించడంలోనూ (Treatment) వంటి కొత్త విధానాలను అభివృద్ధి చేయడం, పీడపీడలకు తట్టుకొని అధిక దిగుబడినివ్వటానికి ఆగ్రో టెక్నాలజీని అభివృద్ధి చేయటంలోను నూత్నకల్పనల వలయంలో (Innovations) ఇంకా కొన్ని పూరించవలసిన లోట్లు (gaps)ఉన్నాయి.

పరిశోధన అభివృద్ధికి దోహదం చేసే దిశలోని అవసరాలను గుర్తించడం, శాస్త్ర, సాంకేతిక సేవా సంస్థలు గణనీయమైన పాత్రను వినియోగదారుని సెక్టార్‌లో నిర్వహించాయి. కొత్త విధానాల్లో వ్యవస్థీకృత మందులు, తెగులు నివారకాలు (Pesticides) ఇంకా ఇతర రసాయనాలను అభివృద్ధి చేయటానికి పరిశోధన అభివృద్ధి (Research and Development) కార్యక్రమాలను రూపొందించడానికి వ్యవస్థాపకులను (Entrepreneurs) ప్రవేశపెట్టడానికి 1973లో చేసిన భారతీయ పేటెంట్ చట్టం (Indian Patent Act) దోహదం చేసింది. డిజైన్ తయారీ విభాగాలతో సహాయం S&T సెక్టార్ అభివృద్ధి చేసిన సాంకేతిక విధానాల ఆధారంగా విదేశీ త్పత్తులను ప్రతిక్షేపించటానికి అనేక లఘు పరిశ్రమలను నెలకొల్పడమైంది.

అందువల్ల మూడు ప్రాథమిక వినియోగదారుల ఏజెన్సీల మధ్య, వినియోగదారునిపరంగా రూపొందించిన (Research and Development) కార్యక్రమాలను గుర్తించడానికి దోహదం చేసే S&T సెక్టార్‌లమధ్య ఒక చక్కని అన్యోన్యత ఉందని చెప్పవచ్చు. ఈ అనుసంధానాల (linkages) ద్వారా దేశీయ సాంకేతిక శాస్త్రం ప్రభావాన్ని లేదా అభివృద్ధి రేటును తగ్గించే ఆటంకాలు ఏవి?

దిగుమతి చేసిన సాంకేతిక శాస్త్రాన్ని ఆదరిస్తూ, దేశీయ అభివృద్ధికి వ్యతిరేకంగా సాంప్రదాయికంగా ఉన్న ద్వేషం మొదటి ఆటంకం. కొన్ని సందర్భాల్లో దిగుమతి చేసిన సాంకేతిక విధానాలు త్తమమైనవి. దీనికి తోడు విదేశీ సహకారంవల్ల ఉన్న మోజును ఎవ్వరూ పేక్షించలేరు. ఈ విదేశీ సహకారంవల్ల దిగుమతి అయిన సాంకేతిక విజ్ఞాన విధానాలతోపాటు ఇంకా కొన్ని అజ్ఞాత లాభాలు కూడా సహజంగానే లభిస్తాయి. ఏ శాస్త్ర పరిశోధనా వీటిని అందించలేదు.

కొన్ని సందర్భాల్లో దేశీయ, S&T ఏజన్సీలు, నిర్వహణ పూచీలు సిబ్బంది శిక్షణ, నిర్వహణ, రక్షణకు సంబంధించిన అన్ని పత్రాలతో సహా మొత్తం సాంకేతిక శాస్త్ర విజ్ఞానాన్ని అందించలేదు. అందువల్ల వినియోగదారుని సాంకేతికశాస్త్రానికి విదేశీ

సహాయం అత్యవసరం. S&T ఏజన్సీల డిజైన్ ఇంజనీరింగ్‌బలహీనమైన మద్దతుతోపాటు తయారీ (సెక్టార్) విభాగం క్లిష్టమైన విడి భాగాలకు సంబంధించి ఉత్పత్తిరంగం మరింత దయనీయమైన మద్దతు ఇవ్వడంవల్ల కూడా వ్యవస్థాపకులు విదేశీ సరఫరాదారును ఆశ్రయించక తప్పడంలేదు.

S&T రంగం, డిజైన్, ఉత్పత్తి రంగాలమధ్య అనుసంధానం (feed back linkage) బలహీనంగా ఉంది. వేడిమి, ద్రవ్యరాశి, ద్రవ్యవేగం (మొమెంటమ్) బదలాయింపు, స్వరూపాత్మక విశ్లేషణ (Structural analysis) బలమూ - ప్రతి బలమూ (Strength-stress) పరిసరాల విశ్లేషణ వంటివాటి ఆధారంతో సంప్రదాయిక నమూనాలు, క్లిష్టమైన భాగాలకు ఉన్నత (Advanced) డిజైన్‌లు తయారుచేసిన వాటిని సమావృతం చేసిన మెరుగైన భాగాలు, అంశాల డిజైన్‌లతో కూడిన పరిశోధనా పరియోజనలు (Research Projects) చాలా స్వల్పంగా ఉన్నాయి. ప్లాంటు పరికరాల డిజైన్‌లో ఒక నూతనకల్పన అవసరమైనప్పుడల్లా యంత్రభాగాల భారతీయ డిజైన్, ఉత్పత్తిరంగం నేటికి కూడా దిగుమతి చేసుకొన్న డ్రాయింగ్‌ల (Drawings) మీద ఆధారపడిఉంది. డిజైన్‌లోనూ ఉత్పత్తిరంగంలోనూ పరిశోధనా ప్రాముఖ్యానికి సంబంధించిన లోపం మన విద్యావిధానంలోనూ, సంస్కృతిలోనూ కనిపిస్తుంది. మెకానికల్, ఎలక్ట్రికల్, కెమికల్ ఇంజనీరింగ్‌లో ఉత్తమమైన విద్యార్థులు వారి భవిష్యదవకాశాలకోసం అభివృద్ధి చెందిన దేశాలకు తరలిపోతున్నారు. ఒకవేళ ఎవరైనా ఆ విధంగా తరలిపోకపోతే వారు ప్రయివేటు రంగంలోని నిర్వాహక వర్గంలో చేరిపోతున్నారు. అంతేకాక మార్కెటింగ్, బాంకింగ్ విభాగాల్లో ప్రవేశం పొందని వారు కూడా కొత్త భాగాలు, పరికరాలు కనుక్కోవటానికి ఉద్దేశించిన డ్రాయింగ్ బోర్డులు (Drawing Boards), వర్కుషాప్‌ల (Workshops)లో చేరి పనిచేయటానికి వాస్తవమైన వైఖరి ప్రదర్శించరు. సృజనాత్మక నైపుణ్యాల సంస్కారం ఉన్న వ్యక్తులు మనకు అవసరం. ఇట్లాంటి వారిని డిజైన్‌లు, ఉత్పత్తి పరిశోధనల్లో ప్రోత్సహించవచ్చు.

సమస్యల మూలాన్ని తెలుసుకోవటానికి సమస్యలున్న ప్రదేశాలకు పోవటానికి శాస్త్రజ్ఞుడు - సాంకేతిక శాస్త్రజ్ఞుడు చూపే విముఖతవల్ల వినియోగదారుని అత్యవసరాన్ని S& T ఏజెన్సీకి బదలాయింపు చేసేరేటు మందకొడి అవుతుంది. వినియోగదారు శాస్త్రజ్ఞుల మధ్య ఇది వార్తా-రవాణాలో కొంత వ్యవధి (gap) ఏర్పరుస్తుంది. శాస్త్రీయంగా సవాలుచేసేదిగా సమస్యలేకపోతే, అంటే సంధించడానికి శాస్త్రీయమైన వ్యవధులు లేకపోతే, శాస్త్రజ్ఞుడు - సాంకేతిక శాస్త్రజ్ఞుడు (Scientist-Technologist) సమస్యపట్ల ఆసక్తినికోల్పోతాడు. శాస్త్రజ్ఞునికి, సాంకేతికశాస్త్రజ్ఞునికి పరిచయంలేని వినియోగదారు సమస్యకు సాకల్యమైన దృష్టి (Holistic approach) లేదా ఒక వ్యవస్థ విశ్లేషణం (System analysis) కోరుతుంది.

చివరకు సమస్యను వివిధ అంశాలుగా పృథక్కరించే సామర్థ్యాన్ని కూడా శాస్త్రజ్ఞుడు - సాంకేతిక శాస్త్రజ్ఞుడు అభివృద్ధి చేసుకొని ఉండకపోవచ్చు. అంతేకాక స్వరూపరహిత సమస్యల పరిష్కారాన్ని చేపట్టలేకపోవచ్చు కూడా.

సమస్యను నిర్వచించే దశలో సాంప్రదాయికమైన పరికరాలు, అందుబాటులో లేకపోవడం పూర్వ దత్తాంశాలు అసంపూర్ణంగా ఉండటం, ఒక సమస్యకు మేలైన పరిష్కారాన్ని సూచించే నమూనాల నిర్మాణాలపట్ల సాధారణమైన ఉదాసీనత ఉండటం మరో అవరోధం. వీటన్నిటివల్ల శాస్త్రజ్ఞుడు-సాంకేతికశాస్త్రజ్ఞుడు తనపరిధిని వీలైనంత తక్కువకు కుదించుకొనే స్వభావం పెంపొందించు కొంటాడు. అందువల్ల సమస్య నిర్వచనంపట్ల, పరియోజన (Project) ఏర్పరచుకోవడం పట్ల సాకల్యమైన ధోరణిని రూపొందించుకోలేడు.

వినియోగదారు, S& T ఏజెన్సీ ల మధ్య సమస్యను గుర్తించడంలో ఏకాభిప్రాయం ఉన్నా సమస్యను నిర్వచించడంలో పురోభివృద్ధి లోపించడానికి పైన పేర్కొన్న అంశాలు పాక్షికంగా బాధ్యత వహిస్తాయని చెప్పవచ్చు.

పరియోజన (Project) ఏర్పరిచే విధానంలోనూ, నవకల్పనకు (invention) దోహదం చేసే సమస్యా పరిష్కారంలోనూ లేదా నూత్న కల్పనలోనూ ఉండే అవరోధాలను, ఆటంకాలను ప్రస్తుతం పరిశీలిద్దాం. ప్రాథమికంగా S,T రంగాలలో విస్తరణ కేంద్రాలతో కూడిన పరిశోధనశాలలు గుర్తించిన సమస్యలను పరిష్కరించడంలో S & T రంగం సామర్థ్యానికి బాధ్యత వహించే అంశాలు:

**శాస్త్ర, సాంకేతిక సామర్థ్యాలు :**

- పరిశోధన కొనసాగించటానికి పరికరాలు, పనిముట్లు
- అందుబాటులోని ఆర్థిక వనరులు
- శాస్త్రీయ, సాంకేతిక విజ్ఞాన సమాచారానికి సంబంధించిన దత్తాంశ ఆధారంతో (Date base) సహా S,Tలోని గతానుభవం.
- డిజైన్ ఇంజనీరింగ్, ఉత్పత్తి రంగాలతో సంబంధాలు
- ప్రేరణ, వార్తా రవాణా, (communication) స్వేచ్ఛపరంగా సృజనాత్మక పరిసరం
- ప్రభుత్వపాలసీలు, విధానాలపరంగా బాహ్యపరిసరం

**శాస్త్ర, సాంకేతిక సామర్థ్యాలు ఆధారపడే అంశాలు :**

- పరిశోధనా క్షేత్రంలోకి ప్రతిభావంతులైన యువశాస్త్రజ్ఞులు -సాంకేతిక శాస్త్రజ్ఞులు ప్రవేశించేరేటు.
- పరిశోధనా క్షేత్రాన్ని లుప్త (obsolete), ఉత్పాదకత లేని శాస్త్రజ్ఞులు-సాంకేతిక శాస్త్రజ్ఞులు విడిచిపోయేరేటు.
- విజ్ఞానంలో లాభం, పనిలో అనుభవం ద్వారానూ మానవశక్తి అభివృద్ధి కార్యక్రమం ద్వారానూ, S & T ప్రతిభను పెంపొందించడం. ఇది మళ్ళీ కింది అంశాలపై ఆధారపడి ఉంటుంది.

  - పరిశోధనకు పరికరాలు, పనిముట్లు అందుబాటులో ఉండటం, ఉపయోగించడం.
  - ఈ సదుపాయాలను అభివృద్ధి చేసే కార్యక్రమాలకు ఆర్థికవనరులు అందుబాటులో ఉండటం.
  - ప్రచురణలు, సమావేశాలు, స్వల్పకాలిక పర్యటనలద్వారా S,T అంతర్జాతీయ అభివృద్ధిని తెలిపే సమాచారానికి చేరువ కావటం.

S&T లోని గతానుభవానికి సంబంధించిన సమన్వయలోపం, అసంగతమైన విజ్ఞాన సంకలనం ఆధారంగా సమాచార వ్యవస్థకు సంబంధించిన సాధారణ లోపం అనేది S,T రంగం బలహీనతల్లో ఒకటి.. దీనికితోడు డిజైన్ ఇంజనీరింగ్‌సంస్థ లేదా ఇతర S,T ఏజన్సీలు ఉపయోగించుకోవటానికి అందుబాటులో ఉన్న సమాచారమూ దత్తాంశాలు తగినంతగా కూడా లేవు. ఈ పరిమితి (Limitation) అధిగమించడానికి గాను కంప్యూటర్ చేసిన సమాచారాన్ని ఉపయోగించి దత్తాంశాలను వ్యవస్థీకృతంగా సేకరించడమూ, ఈ దత్తాంశాలనూ, సమాచారాన్ని సమర్థించే గణిత విశ్లేషణమూ అవసరం. ఈ దత్తాంశాల ఆధారతను బలపరచడానికి విశ్వవిద్యాలయాల్లో పరిశోధనవల్ల జనించిన దత్తాంశాలను చేర్చడం కూడా వాంఛనీయం. బలీయమైన దత్తాంశాల (Database) ఆధారాన్ని నిర్మించడానికి ఉదారమైన వినిమయమూ సమాచారాన్ని వేరు చేయడమూ కూడా అవసరమవుతాయి.

S&T సంస్థలో, డిజైన్ ఇంజనీరింగ్ సంస్థలమధ్య అనుసంధానం బలహీనంగా ఉండటం ఇంకో లోపం. కొత్త భావనలను నేర్పుతో నిర్వహించటానికి డిజైన్ ఇంజనీరింగ్ సంస్థలో మేధావుల పరంగా జోక్యం చేసుకోవటానికి విముఖత చూపుతున్నారు. విదేశాలనుంచి లేదా పాఠ్య గ్రంథాలనుంచి ఎరువు తెచ్చుకొన్న ఓవర్ డిజైన్ ఫార్ములేషన్ లేదా వాడుకలోలేక అనుభవంతో వచ్చిన విధానాన్ని (rule of thumb method) ఉపయోగించటంతోనే వారు సంతృప్తి చెందుతారు. వేడిమి, ద్రవ్యరాశి, ద్రవ్యవేగం బదలాయింపు (Momentum transfer) నిర్మాణాత్మక ప్రతిబల విశ్లేషణం (Structural and stress analysis), క్లిష్టమైన డిజైన్‌లకోసం పురోభివృద్ధిచెందిన ఇంజనీరింగ్ శాస్త్రాలను ఉపయోగించడం చాలా తక్కువ. అందువల్ల డిజైన్ సంస్థలు, పరిశోధనలు జరిపే పరిశోధనశాలలు సిద్ధాంతపరమైన సంస్థలు (Academic institutions)వీటన్నిటి సంఘటిత ప్రయత్నం అవసరం.

దేశీయ పరిశోధన, అభివృద్ధి ఆధారంగా పరికరాలను తయారీకి వచ్చేసరికి ఈ అనుసంధానం ఇంకా బలహీనమవుతుంది. తగిన వివరాలతో కూడిన వివరణలు లేకపోవడంవల్లా, పూర్వానుభవము లేకపోవడం వల్ల తయారీకి, ఉత్పత్తికి సంబంధించిన ఇంజనీరింగ్ డిజైన్‌లను అభివృద్ధి చేసే కృషికి అనేకమంది ఉత్పత్తిదారులు విముఖత చూపుతున్నారు. బహుశ- ఎంతో కొంతధరకి పరిశోధిత డిజైన్ ఆధారంగా ఉత్పత్తి రంగం కొన్ని ప్రత్యేకభాగాలను తయారు చేయడానికి అంగీకరించినప్పుడు విశ్వాంతరాళానికి, కేంద్రక పరిశోధనలకు సంబంధించినవి ఇందుకు కొన్ని మినహాయింపులు, విదేశీ సహకారంకోసం పరుగెత్తి ఇంజనీరింగ్ డ్రాయింగ్‌లు డిజైన్‌లు సంపాదించి తక్కువస్థాయిలో సాంకేతిక ఉత్పత్తులను తయారు చేయడంతో ఉత్పత్తిరంగం సంతృప్తిపడటానికి సాధారణంగా మొగ్గుచూపుతూ ఉంది. ఉత్పత్తిరంగంలోని పునరావృత సహకారాన్ని విశ్లేషిస్తే నవకల్పనల శృంఖలంలో పాల్గొనటానికి వారికి సాధారణంగా ఉండే మేధాపరమైన అలసత్వమూ, దిగుమతులను సులువుగా చేసుకొనటాన్ని ఆశ్రయించడమూ విశదమవుతుంది. దీనివల్ల మన ఖర్చుతో, పరిశోధనలను దత్తాంశాల ఆధారంగా సమాచార సేకరణకు విదేశీ కంపెనీలు ఎక్కువ కృషి చేసుకొనేందుకు అవకాశం కలుగుతూ ఉంది. ఈ విధంగా సులువుగా దగ్గర మార్గంలో చేసే దృక్పథంవల్ల నవకల్పనల శృంఖలంలో ఉత్పత్తిరంగం (manufacturing sector) తన పాత్రను సక్రమంగా నిర్వహించలేదు.

ఇక సృజనాత్మక పరిశోధన కోసం మనం పరిసరాలవైపు దృష్టి మళ్లిద్దాం. ఆసక్తిదాయకమైన శాస్త్రీయ ఆవిష్కరణల దశలోనే సృజనాత్మక విధానం ఆగకూడదు. అభివృద్ధికి సమాజానికి, వినియోగదారు అవసరాలను తీర్చటానికి, కొత్త, వివిధ రకాల ఉత్పత్తులను సృజించటానికి దీన్ని కొనసాగించవలసి ఉంది. సమస్యా పరిష్కారానికి అనుభావిక (emperical) లేదా సిద్ధాంతపరమైన విజ్ఞానం అభివృద్ధికి శాస్త్రజ్ఞులు-సాంకేతిక శాస్త్రజ్ఞులకు ప్రేరణ కలిగించడానికి సాఫల్యం, విజయంపట్ల మన వైఖరి మారాలి. ప్రమరణ ఆధారంగా ప్రతిభను గుర్తించడంపై అధిక ప్రాముఖ్యముండటంవల్ల, సమస్యా పరిష్కారానికి ఆచరణరూపక కార్యానికి ప్రశంసలేకపోవడంవల్ల, అనేకమంది శాస్త్రజ్ఞులు-సాంకేతికశాస్త్రజ్ఞులు సృజనాత్మక ఉత్సుకతను కోల్పోతున్నారు. ఇతరులుచేసిన కొన్ని ఆవిష్కరణలను ఉన్నత శాస్త్రజ్ఞులు (Senior Scientists) తమవిగానే చెప్పుకొనే స్వభావం, గ్రంథచౌర్యం (Plagarism) దోపిడి (Piracy), స్వేచ్ఛా స్వాతంత్ర్యాలను, బాధ్యతలను అరికట్టే వాతావరణం చుట్టుముట్టి ఉన్నందువల్ల వ్యక్తిగత నైపుణ్యం ఆధారంగా పొందిన విజ్ఞానాన్ని ఆచరణ రూప అనుభవాన్ని ఇతరులకు అందజేసేందుకు కొంత విముఖత ఏర్పడింది. యువ శాస్త్రజ్ఞులు, సాంకేతిక శాస్త్రజ్ఞులు తమపై అధికారులపట్ల భయభావంతో వారిని నిరోధించడంవల్ల కొన్ని సందర్భాలలో వారికి సృజనాత్మక పరిశోధనలపట్ల స్వేచ్ఛ కూడా నశిస్తుంది.

పరిశోధనా సంస్థల్లో మంచి నాయకత్వాన్ని అభివృద్ధి చేసి, నేర్వవలసిన అవసరం కూడా ఉంది. దీనివల్ల స్వేచ్ఛగాను నిష్కపటంగాను శాస్త్రీయ అభిప్రాయాలను తెలిపి సాంకేతికపరమైన ఎంపికలను చేసుకోవటానికి అవకాశం ఏర్పడుతుంది. అంతేకాక మౌలికశాస్త్రాల (Basic Sciences) అన్వేషణకు తిలోదకాలివ్వకుండా సృజనాత్మక ధోరణిలో సమస్యా పరిష్కారానికి యువ శాస్త్రజ్ఞులు వారివారి మేధాసంపదను అందించగలుగుతారు.

సాంకేతిక శాస్త్రపరమైన మూడు అంశాల్లో కూడా విజ్ఞానశాస్త్రం (Science), సాంకేతిక శాస్త్ర ఉత్పాదకాలు (inputs)అవసరం.

- దేశీయ సాంకేతిక విజ్ఞానోత్పత్తి బదలాయింపు
- సాంకేతిక విజ్ఞానం దిగుమతి-విలీనం
- ఉన్నటువంటి సాంకేతికశాస్త్రాన్ని ఉన్నతశ్రేణికి పెంచడం

భారతీయ పరిశ్రమల్లోనే అంతర్జాతీయ పోటీని ప్రోత్సహించటానికి అన్ని సంఘటిత సంస్థల్లోనూ సృజనాత్మక సంస్కృతిని అభివృద్ధిచేసే

అవసరం తప్పనిసరయింది. ప్రస్తుతమున్న లేదా ముందు ముందు మార్కెట్ అవసరాలను తీర్చడానికి వ్యయ పోటీతత్వాన్నీ సంస్థ లాభదాయకతనూ నిర్వహించానికి కాలంచెల్లిన వాటిని నిరోధించడంతోపాటు సంస్థ పతనాన్ని నిరోధించడం వంటి అవసరంద్వారా సాధారణంగా నూతనకల్పనను గుర్తిస్తారు.

ప్రత్యేక మార్కెట్ అవసరాలను గుర్తించి, వాటిని సంతృప్తి పరచటానికి వీలుగా అవసరమైన వస్తువులను, సేవలను దిగుమతి చేసుకొని దేశీయ సాంకేతిక విజ్ఞానాన్ని ఉత్పాదించినవారు సాంకేతిక విజ్ఞానాన్ని (Know how) వేరొకరికి తెలపటానికి ఇష్టపడకపోవచ్చు, పైగా వారి ఉత్పత్తులను విక్రయించటానికి ఆసక్తి చూపవచ్చు. దీనికి హైపెర్‌ఫార్మెన్స్ ప్లాస్టిక్స్ ఒక ఉదాహరణ. విదేశీ సహాయకులు నిర్దేశించిన ముడిపదార్థాలు, శక్తి వస్తువు ఉత్పత్తిదారునికి దేశంలో అందించని లేదా వారు కోరిన సేవలను అందించలేని స్థితి ఏర్పడటం అనేది రెండో పరిస్థితి. మనదేశ పరిస్థితులకు మాత్రమే అంతర్గతంగా ఉండే వింతధర్మాలు భారతదేశంలోని ముడిపదార్థాలకు ఉండవచ్చు. ముడినూనెలో మైనం (Wax) అంశం ఎక్కువగా ఉండటం, కోల్‌లో బూడిదశాతం అధికంగా ఉండటం మొదలైనవి ఇందుకు ఉదాహరణలు. ఈ సందర్భంలో దేశీయ సాంకేతిక అభివృద్ధి కోసం తీవ్రమైన కృషి చేయవలసి ఉంది.

అధునాతన అభివృద్ధిదశలో సాంకేతికశాస్త్రం అందుబాటులోఉంటే దాని దిగుమతిని ప్రోత్సహించ వచ్చు. యంత్ర సముదాయం ఉత్పత్తి ప్రారంభించే దశకు మనదేశంలోకి దిగుమతి చేసుకొన్న సాంకేతిక విధానాలలో అధికభాగం వాడుకలో ఉండకపోవటం అనేది మన అనుభవం. ఈ సందర్భంలో తీవ్రమైన సాంకేతికశాస్త్ర విషయాలను ముందుగా సూచించడానికి, మార్కెట్ పరిశోధనలు జరగాలి అని నిర్వహణాధికారుల కోరిక. దీనివల్ల భవిష్యత్తులో వచ్చే ఉత్పత్తి ప్రత్యేకతలలోని మార్పులను గుర్తించవచ్చు. ఏదశలో అందుబాటులో ఉంటే అదే దశలో విదేశాల నుంచి సాంకేతిక విజ్ఞానాన్ని సమీకరించుకోవాలి. అప్పుడు ఆ సాంకేతిక విజ్ఞానాన్ని అభివృద్ధి చేయడానికి ఒకే సమయంలో తీవ్రమైన పరిశోధనను,అభివృద్ధిని చేపట్టాలి.

ఉన్నటువంటి సాంకేతిక విజ్ఞానాన్ని ఉన్నతదశకు చేర్చడంతో కూడిన మూడవ సందర్భంలో, క్వాలిటి కంట్రోల్ ఇంజనీర్లను ప్రొడక్షన్ ఇంజనీరింగ్ శాఖలను సమావృతం చేస్తూ పరిశోధన, అభివృద్ధి నిరంతరాయంగా కొనసాగుతూనే ఉండాలి. ప్రస్తుతమున్న ఉక్కు-కర్మాగారాలను ఆధునీకరించడం ఉన్నత శ్రేణికి పెంచడం, విలక్షణమైన (Typical) ఉదాహరణ అవుతుంది. విదేశీ సరఫరాదారులకు టర్న్‌కీ (Turn key) ప్రాతిపదికమీద ఉక్కు- కర్మాగారాలను ఆధునీకరించే పనిని అప్పగించడం, ఆధునీకరణ అవసరాలను గుర్తించడం లోనూ, ఆధునీకరణ తరవాత సాధించే కొత్త సాంకేతిక పరామితులను పేర్కొనడంలోనూ పరిశోధన, అభివృద్ధి సంస్థలతోపాటు డిజైన్ ఇంజనీరింగ్ సంస్థలను కూడా పూర్తిగా నిమగ్నం చేస్తే తప్ప జాతిశ్రేయస్సు దృష్ట్యా వాంఛనీయంకాదు.

వివిధ ఆధునీకరణ పథకాలను ఎంపిక చేయడంలో తీవ్రమైన ప్రాసెస్ ఇంజనీరింగ్ పరిశోధన అవసరం. ఈ పరిశోధన వాడకంలోలేని సాంకేతిక విజ్ఞానాల కారణంగా ప్రస్తుతమున్న కర్మాగారాలలో నిర్మాణమై ఉన్న బలహీనతలను పరిగణనలోకి తీసుకొంటుంది. ఉత్పాదక అవసరాలను నిర్వచించడానికి కూలంకషమైన విశ్లేషణ, అవసరమైన వస్తునాణ్యతను సక్రమంగా అవగాహన చేసుకోవడం ప్రస్తుతమున్న ప్లాంట్లును ఆధునీకరణకు ముందే జరగాలి. ఇట్లాంటి కొత్త పరికరాలు సక్రమంగా పనిచేయడానికి అవసరమైన పరిస్థితులను సక్రమంగా నిర్వచించాలి. ఇట్లాచేస్తే ఆధునీకరించిన ప్లాంట్లుకు సంబంధించి తక్కువస్థాయి వినియోగాన్ని విచారించవచ్చు.

నవకల్పన వ్యవస్థకు చెందిన ఉత్పత్తిని నిర్ణయించడంలో వ్యవస్థాపకుడే వ్యక్తికావచ్చు. ప్రయివేట్ సంస్థ కావచ్చు లేదా ప్రభుత్వ రంగ సంస్థ కావచ్చు - తుది ఏజన్సీ. మార్కెట్ భవితవ్య సూచన ఉత్పాదక పదార్థాలు (input materials) పుష్కలంగా అందుబాటులో ఉండటం, ఉత్పాదక వస్తువులు (Capital goods) అవస్థాపన (infrastructure) శిక్షణ పొంది నైపుణ్యంతో కూడిన మానవశక్తి, ఆర్థిక స్వయంభరణ శక్తి (financial viability), ప్రభుత్వ సిద్ధాంతాలు ఆధారంగా వ్యవస్థాపకుడు స్వయంగా తానే సాంకేతిక విజ్ఞానాన్ని (Technology) ఎన్నుకొంటాడు. ఈ నిర్ణయ ప్రమాణాలకు (criteria) అనుకూలంగా సాంకేతిక శాస్త్ర సంపద ఆదుకుంటే తప్ప వ్యవస్థాపకుడు ఈ వాణిజ్యపరంగా సాహసం చేయలేడు.

వ్యవస్థాపకుని వాణిజ్యపరమైన సాహసాలను ప్రోత్సహించడంలో S,T రంగం పాత్ర ఎటువంటిది?

మార్కెట్ పరిశోధనను మెరుగుపరచడానికి సాంకేతిక భవితవ్య సూచన ద్వారా S&T రంగం చేయగలిగిన మొదటి ఉత్పాదకం (input) ప్రోడక్టు డిజైన్లు, ప్రత్యేకీకరణల (Specifications)లో మారుతున్న ధోరణుల భవితవ్య సూచననూ ప్రత్యామ్నాయ పదార్థాల ఉపయోగాన్ని పరిగణనలో ఉన్న ఉత్పత్తి గిరాకీని పెంచే ఇతర క్షేత్రాలలోని అభివృద్ధి పైన సంయుక్త ప్రభావాన్ని కూడా మార్కెట్ పరిశోధన తెలిపేదిగా ఉండాలి. బయోటెక్నాలజీ పదార్థాల పురోభివృద్ధి, ఎలక్ట్రానిక్స్, సాగర్ అభివృద్ధి వంటి సరిహద్దు క్షేత్రాలలోని మానవుని సృజనాత్మక నైపుణాన్ని విశ్లేషించి, భవిష్యత్తులో వెలువడే అవకాశం ఉన్న అవకాశాలను గుర్తించవచ్చు. భవితవ్యంలోని మార్కెట్‌కు ఉపయోగపడటానికి అవసరమైన లేదా వెలువడుతూన్న టెక్నలాజికల్ భావి సంఘటనలు తీసుకొని వచ్చే ఉత్పత్తి ప్రత్యేకీకరణలో మార్పుకు అనుగుణంగా ప్రత్యేక వాణిజ్యపరమైన కృషిపై ఈ విశ్లేషణ కేంద్రీకృతం కావాలి.

ప్రస్తుత, భావి అవసరాలను తీర్చటానికి సులభంగా అందుబాటులో ఉండే ముడి పదార్థాలను, శక్తి వనరులను ఉపయోగించుకొంటూ, దేశీయ సామర్థ్యాల ఆధారంగా పరికరాల డిజైనింగ్, ఇన్‌స్ట్రుమెంటేషన్‌కు సహాయపడే రీతిలో సంపూర్ణమైన సాంకేతిక శాస్త్ర పరిజ్ఞానాన్ని S,T అందజేయడం అనేది రెండో ఉత్పాదకం. తగినటువంటి ప్రత్యేకీకరణలను ఏర్పరుస్తూ, నాణ్యతా ప్రమాణాలకు అనుగుణంగా టెక్నాలజీలను అభివృద్ధి చేయడం కూడా S,T రంగం చేయగలిగిన విధులలో ముఖ్యమైనది. ప్రోసెస్ కంట్రోల్ ఆధారంగా దేశీయంగా అభివృద్ధి చేసిన సెన్సార్స్* పనిముట్లు, మైక్రోప్రోసెసర్ వంటి క్షేత్రంలో S,T జోక్యం చేసుకొని ప్రభావితం చెయ్యవచ్చు.

అయితే దేశీయ టెక్నాలజీలు అందుబాటులో లేకపోయినా, తగినంతగా అభివృద్ధి చెందకపోయినా అంతర్జాతీయంగా అందుబాటులో ఉన్న టెక్నాలజీని, అందులోనూ ముఖ్యంగా పరిసరాల, భద్రతల కోణంలోనూ, స్థానికంగా అందుబాటులో ఉన్న పదార్థాల అనురూపకత; ప్రతిభావంతంగా పనిచేయటం, నిర్వహణకు వీలుగా టెక్నాలజీని వెలువరించడంలోనూ, వ్యవస్థాపకుడికి S&T సెక్టారు సహాయం చేయవచ్చు. తగిన శిక్షణ ఇవ్వడంలో అందులోనూ ముఖ్యంగా నైపుణ్యత స్థాయిలో ఇచ్చే దానిలో తగిన శ్రద్ధ వహించడంలో S,T రంగం సహాయపడవచ్చు.

---

* ఒక భౌతిక ధర్మాన్ని గుర్తించటానికి, రూపనం చేయటానికి ఉపయోగించే పరికరాన్ని సెన్సార్ అంటారు.

దిగుమతి చేసిన సాంకేతిక విజ్ఞానాన్ని తగిన విధంగా అలవరచుకొని ఉపయోగించుకోవటంలో S&T రంగం కట్టుదిట్టం చేసుకోవాలి. దీనివల్ల అధికస్థాయిలో సాంకేతిక విజ్ఞాన అభివృద్ధికి R&D ప్రయత్నం కొనసాగేందుకు అవకాశం వస్తుంది. ఉత్పత్తుల ప్రత్యేకీకరణలలోనూ నూతన సాంకేతిక విజ్ఞాన అభివృద్ధిలోను వచ్చే మార్పులను ఊహించి, వీటిని అంతర్జాతీయ అభివృద్ధితోపాటు మనదేశంలోనూ ఏకకాలంలో ప్రవేశపెట్టకలిగే విధంగా జాతీయ S&T వ్యూహాలు ఉండాలి. ఈ విధంగా మనదిగా చేసుకొన్న శాస్త్రీయ విజ్ఞానాన్ని భావిలోని సాంకేతిక విజ్ఞానంపై కేంద్రీకృతం చేసి, ప్రస్తుతం ఉన్న సాంకేతిక విజ్ఞాన లోపాన్ని సవరించుకోవటానికి ఉపయోగించుకోవాలి. మౌలిక శాస్త్రాలలోని విజ్ఞానాన్ని మౌలికమైన పరిశోధనల ద్వారా ముందుకు తీసుకొనిపోతూ, అంతర్జాతీయ దత్తాంశాలను సమకూర్చుకోవటానికి కూడా చిత్తశుద్ధితో తీవ్రమైనకృషిచేయాలి.



(పోస్టుగ్రాడ్యుయేట్ బోధన సిబ్బంది......) (156వ పేజీ తరువాయి)

నొక్కి చెప్పడమే. అర్థశాస్త్ర అధ్యయనం స్థిరపడిన పరిమాణాత్మక పద్ధతులను (Qualitative Methods: Operations Reseach, Regression Analysis; Computer Simulation) అనేక ఉప విషయాంశాల పరిశోధనకు వినియోగిస్తున్నారు. ఇటువంటివి తెలియచెప్పడం ద్వారా సమీకృత దృక్పథ ఆవశ్యకతను బోధకులలో కలగచేయవచ్చు. అలాగే రాజనీతిశాస్త్రంలోని వ్యవస్థాసిద్ధాంతం, సమూహాల ప్రవర్తన, సామాజిక-మానసిక వంటి నూతన సిద్ధాంతాలు, నవీన పోకడలు రాజనీతిశాస్త్ర అధ్యయనాన్ని ఏ విధంగా ప్రభావితం చేశాయో ఈ విభాగానికి చెందిన బోధన సిబ్బందికి తెలియచేయవచ్చు. సమాజశాస్త్రాలని బంధించే సైద్ధాంతిక చట్రాన్ని గురించి అవగాహనను కల్గించడమే , ఒక విధంగా చెప్పాలంటే, సమీకృత దృక్పథ ధ్యేయంగా భావించాలి.

శాస్త్ర సాంకేతిక రంగంలో వస్తున్న అనేక అంశాలకు సంబంధించిన అంశాలపై ప్రచురితమైన వ్యాసాలను క్రోడీకరించి పరిశోధనలో విభిన్నధోరణులను తెలియచేయడంద్వారా పోస్టుగ్రాడ్యుయేట్ బోధన సిబ్బందికి ఆసక్తిని రేకెత్తించవచ్చు. ఇది అవసరం కూడా. శాస్త్రీయ పద్ధతిలో 20వ శతాబ్దంలో వచ్చిన ధోరణులు ఇవి ఎన్ని రీతులుగా ఉన్నది పరిశోధన రంగంలో పరిమితులు విజ్ఞాన సాంకేతిక శాస్త్రాల పరిశోధనలో ఉన్న పరిమితులు, విజ్ఞానం అంటే వాస్తవిక విషయాలను తెలుసుకోవడమనే కాదని, మానవ విలువలకు, విజ్ఞానసరళికి కల అనుబంధం, వైరుధ్యాలు గుర్తించి, శాస్త్రీయ పద్ధతి సమాజ విజ్ఞాన శాస్త్ర పరిశోధన రీతులను ఏ విధంగా ప్రభావితం చేసింది, అది సృష్టించిన సమస్యలను ఉన్నత విద్యారంగానికి చెందిన పోస్టుగ్రాడ్యుయేట్ బోధన సిబ్బందికి తెలియజేయడం ఈ పునశ్చరణ పునరభ్యసన శిక్షణ కోర్సుల లక్ష్యంగా ఉంటే సఫలీకృతం అవుతాయి.



# రసాయన శాస్త్రం - జీవం

డా॥ వి.వి. ఆర్. శాస్త్రి
అఖిలభారత ప్రొడక్ట్ మేనేజర్-ఫౌండ్రి,
గ్రీవ్స్ ఫోసెకో లిమిటెడ్,
చించివాడ్,
పూనె-411019

రసాయన చర్యలు, రసాయన శాస్త్రంతో మన చుట్టూ ఉండే ప్రతిధానికి ఏదో కొంత సంబంధం ఉంటుంది. మనం తినే ఆహారం, ధరించే దుస్తులు, నివసించే ఇళ్లు, వ్యాధుల బారినుంచి మనలను రక్షించే మందులు గురించి ఆలోచించండి. పెన్నులు, కాగితాలు, పెయింట్, కార్లు, విమానాలు ఎరువులు రేడియోలు, టి.వి, దుప్పట్లు, విద్యుత్చ్ఛక్తి హీటర్లు, ఎయిర్‌కండిషనింగ్, గాజువస్తువులు, లోహాలు, మూటముల్లె, పెట్టెబేడ మొదలైన వాటిని గమనించండి. మనకు కావలసిన ప్రతి వస్తువు ఏదో ఒక రూపానికి చెందిన రసాయన శాస్త్రం నుంచి ఏర్పడినదే.

మీరు ఉపాధ్యాయులైనా, వైద్యులైనా, రసాయన శాస్త్రజ్ఞులైనా, ఇంజనీరు అయినా ప్రతి రోజు మీ మటుకు మీరు చాలా భాగం రసాయన శాస్త్రాన్ని కొనసాగిస్తారు. ఉదాహరణకు మీరు ఒక అగ్గిపుల్ల వెలిగిస్తే మీరు ఒక రసాయన చర్యను జరపారన్నమాట. అగ్గిపుల్ల మండి, కర్ర బొగ్గుగా మారుతుంది. మీరు ప్రాతఃకాలంలో తీసుకునే ఆహారంలో ఒక కోడిగుడ్డు తిని పాలు తాగుతారు. ఆ గుడ్డులోని ప్రోటీన్‌లు పాలలోని కాల్షియమ్ వరసగా జరిగే కొన్ని రసాయన చర్యల మూలంగా మీ శరీరం, మీ ఎముకలులో భాగంగా మారినాయి. నిజానికి రసాయన శాస్త్రం మినహా, ఈ ప్రపంచం నిర్జీవమే అవుతుంది. ఊపిరితీసుకోవడం, జీర్ణక్రియ, శక్తి విడుదల కోసం శ్వాసకియలో ఆహారం ఆక్సీకరణం చెందడం కిరణజన్య సంయోగక్రియ వంటివి అన్ని కూడా రసాయన చర్యల మీద ఆధారపడి ఉన్నాయి. మానవులకు మొక్కలకు జీవపదార్థాలైన హీమోగ్లోబిన్, పత్రహరితం (Chlorophyll) అనేవి రసాయనాలు. అవి ఆక్సిజన్ రవాణాకు, ఆహారం తయారు చేయడానికి జరిగే అతి ముఖ్య రసాయన చర్యల్లో పాల్గొంటాయి.

రసాయన చర్యల వల్లనే ఇంచుమించుగా మన చుట్టూ ఉండే ప్రతిది సంభవిస్తుంది. ఒక క్షణంలో జరిగే రసాయన చర్యల సంఖ్యను లెక్కపెట్టడం అనేది అసాధ్యం. మనం లెక్కపెట్టడం మొదలు పెట్టిన క్షణానికి అనేక రసాయన చర్యలను మన మెదడు ఆరంభిస్తుంది. రసాయన చర్యలు కారణంగానే మనం చూస్తాం, వింటాం, వాసన, రుచిచూస్తాం. రసాయన చర్యల వల్లనే మన అభ్యాసనకు జ్ఞాపకశక్తికి మన మెదడు సహాయపడగలుగుతూ ఉంది. జీవానికి కీలకమైన శారీరక ధర్మ ప్రక్రియాలన్నింటికి ప్రాణమైన అతిముఖ్య రసాయన పదార్థాలను మానవశరీరంలోని వివిధ గ్రంధులు విడుదల చేయగలుగుతున్నాయి. అదే మాదిరిగా మనచుట్టూఉన్న ఆకుపచ్చని మొక్కలు సూర్యకాంతి సమీక్షంలో, భూమి నుంచి నీటిని, గాలినుంచి కార్బన్‌డైఆక్సైడ్‌ను గ్రహించి వాటిని పరివర్తనం చెందించి ఆహారాన్ని ఏర్పరుస్తున్నాయి. మానవులు జంతువులు మొక్కల ఆహారాన్ని అవి తీసుకున్నప్పుడు వాటి శ్వాసక్రియా విధానంలో ఆ ఆహారాన్ని శక్తిగా మారుస్తాయి. మన పనిని మనం చేయటానికి కావలసిన శక్తిని ఆ విధానం విడుదల చేస్తూ ఆ ఆహారాన్ని మళ్లీ కార్బన్‌డైఆక్సైడ్‌గాను నీరుగాను ఆక్సీకరణం చెందిస్తుంది.

మనం కారులోనో, విమానంలోనో ప్రయాణించేటప్పుడు మనం ముందుకు సాగిపోయేలా చేసేది ఏది ? మన శరీరాలకు ఆహారం అవసరమైనట్లే స్వయం చోదక వాహనాలకు (Automobiles) విమానాల కదలికకు ఇంధనం కావాలి. చలనానికి కావలసిన శక్తిని విడుదల చేస్తూ స్వయం చోదక వాహనం లోని అంతర్దహనయంత్రంలో (Internal combustion Engine) గాసోలీన్, (పెట్రోల్) గాలి మిశ్రమం పేలుతుంది. గాసోలీన్, ఆక్సిజన్ ఒక దానితో ఒకటి చర్యపొందింది. అవి రెండూ కలిసి

కార్బన్‌డైఆక్సైడ్, నీటి ఆవిరిగా మార్పు చెందుతాయి. మానవశరీరంలో, స్వయం చోదక వాహనంలో కావలసిన శక్తిని విడుదల చేసే రసాయన చర్యల్లో ప్రస్ఫుటంగా పోలికలులేవా?

ఆసక్తిదాయక రసాయనిక మార్పుకు ఉదాహరణంగా మనంతినే ఉప్పుకు సంబంధించిన చర్య. సురక్షితమైనటువంటి అత్యవసరమైనటువంటిది పదార్థం దాని మూలక పదార్థాలనుంచి ఏ విధంగా రసాయన ప్రయోగశాలల్లో తయారు అవుతుందో మీకు తెలుసా ? రసాయనికంగా ఉప్పును సోడియం క్లోరైడ్ అని పిలుస్తారు. విస్ఫోటనం చెందే విషాక్త సోడియం లోహం, క్లోరిన్ వాయువులో మండి వంటింటి రసాయనాలలోకెల్ల సురక్షిత రసాయనం తయారు అవ్వడం ఆశ్చర్యంకాదూ?

## రసాయన చర్యలు (Chemical reactions) :

రసాయన శాస్త్రానికి రసాయన చర్యలు వెన్నెముకగా ఉండి అవి జీవప్రక్రియలను ఐహిక సౌభాగ్యాలకు ఎంత ముఖ్యమో తెలుస్తూనే ఉంది. సాధారణ ఉప్పు మొదలుకొని అణుబాంబు ఏర్పడటంవరకు రసాయన చర్యలు జీవం పోస్తాయి. రసాయన విజ్ఞానానికి అవి ఆధారభూతాలు. మనం వీటికి ఎంతో ఋణపడి ఉన్నాం. మన చూట్టూ ఉండే పదార్థాలు అన్నీ సుమారు 100కు మించి రసాయన మూలకాలనుంచి కాని వాటి సంయోగాలనుంచి కాని ఏర్పడినాయి. భూమి వల్కలంలో సుమారు మూడు వంతులు ఆక్సిజన్, సిలికాన్‌లతో ఏర్పడి నీరు, ఇసక ఒండ్రు మొదలైన రూపాల్లో ఉంటుంది. మిగతా భాగానికి మిగిలిన ఇతర మూలకాలు లెక్కకు వస్తాయి. అదే విధంగా 65% ఆక్సిజన్, 18% కార్బన్, 10% హైడ్రోజన్‌లతో మానవశరీరం ఏర్పడి మిగిలిన భాగం మిగతా సూక్ష్మమూలకాలచే సంఘటితమవుతుంది. అసంఖ్యాక రసాయన మార్పులు జరిగినందువల్లనే భూమి వల్కలం, మానవశరీరం-రెండూ కూడా ఏర్పడినాయి.

ప్రపంచంలోని జీవ, నిర్జీవ పదార్థాలు రెండూ కూడా రసాయన చర్యల ఫలితమే అయితే, ఈ రసాయన చర్యల్లో ఏమి జరుగుతుంది ? రసాయన చర్యలు ఏ విధంగా జరుగుతాయో తెలుసుకోవటం సముచితం, సరళ ఉదాహరణాలతో అవగాహన చేసుకోవటం సులభం. సోడియం క్లోరైడ్ ఏర్పడటాన్ని పరిశీలిద్దాం. సోడియం లోహంలో సోడియమ్ పరమాణువులు ఒక క్రమ నిర్మాణంలో అమరి ఉంటాయి. క్లోరిన్ వాయువులో క్లోరిన్ అణువులు ఉంటాయి. క్లోరిన్ వాయువులో సోడియం లోహం మండినప్పుడు, సోడియం లోహంనుంచి సోడియం పరమాణువులు, క్లోరిన్ వాయువులోని క్లోరిన్ అణువునుంచి క్లోరిన్ పరమాణువులు ఒకదానినుంచి ఒకటి విడిపోతాయి. ఈ పరమాణువులు వాటి అంతట అవే ఒక కొత్త నిర్మాణకంగా, పునరమరిక చెందుతాయి. ఈ కొత్త నిర్మాణకంలో ఆ రెండు రకాల పరమాణువులు ఏకాంతంగా అమరిఉంటాయి. ఈ విధంగా సోడియం, క్లోరిన్ పరమాణువుల అమరిక వల్లనే కొత్త పదార్థం ఏర్పడి ఉప్పుధర్మాలకు కారకమవుతుంది. అందువల్ల అది సోడియం క్లోరిన్ మూలకాల రెండింటికి పోలికలేకుండా పోతుంది.

కొన్ని పదార్థాలు చర్య పొందే స్వభావాన్ని కలిగి నూతన పదార్థాలుగా మారటం, మిగిలినవి ఒకదానితో మరొకటి ఎంతకాలం కలసి ఉన్నా చర్యనొందక పోవడం అనే ప్రశ్న శాస్త్రవేత్తలను చాలా కాలం మధన పరచింది. దీనిని వారు అవగాహన చేసుకునే సమయంలో కొన్ని చర్యలు అతి నెమ్మదిగా జరగటం, మరికొన్ని త్వరగా జరిగేవిగా గుర్తించారు. గది ఉష్ణోగ్రతవద్ద హైడ్రోజన్, ఆక్సిజన్‌లను కలిపి ఉంచితే కొన్ని సంవత్సరాల తరవాత కూడా అవి చర్య పొందవు. కాని తుపాకీ మందు, డైనమైటు పేలటంవంటివి నిజంగా శీఘ్రగతిని జరిగే చర్యలే!

హైడ్రోజన్, ఆక్సిజన్ వాయువులు కలిసి ఉన్నగాజు పాత్రను వేడి చేయండి. నీటి అణువులు ఏర్పడటం గమనించండి. 550°వద్ద ఈ చర్య ఎంత త్వరగానూ చురుకుగానూ జరుగుతుందంటే ఆ పాత్ర కూడా పగిలిపోతుంది. ఇక్కడ హైడ్రోజన్, ఆక్సిజన్‌ల మధ్య నెమ్మదిగా జరిగే చర్యను వేడిమి త్వరిత పరచింది. నీరు తయారీకి ఈ వాయువులనే గది ఉష్ణోగ్రత వద్ద కూడా సంయోగ పరచగలవా ? చెయ్యవచ్చు. అందుకు కొన్ని

విధానాలు ఉన్నాయి. కొన్ని రసాయనిక ఉత్ప్రేరకాలు దాన్ని చేయకలుగుతాయి.

చర్యలు నెమ్మదిగా జరగటం వల్ల మనం నిరుత్సాహ పడకూడదు. నిజానికి హైడ్రోజన్, ఆక్సిజన్‌లు యాదృచ్ఛికంగా చర్య జరిపితే భూమి మీద జీవరాశి ఉండేదే కాదు. ఒక వేళ ఆ చర్యలే అతి శీఘ్రంగా జరిగితే అధమా ఇప్పుడు ఉన్న రూపంలో మాత్రం జీవరాశి ఉండేదేకాదు. హైడ్రోజన్, ఆక్సిజన్ అంతా కలిసి నీరు ఏర్పడేది. అన్ని లోహాలు చూర్ణంగా ఉండే ఆక్సైడ్‌లుగా మార్పు చెందేవి. ఈ రకమైన రసాయన దుర్ఘటన జరగకుండా నిరోధించే ఒక విచిత్రమైన అడ్డంకి ఒకటి ఉంది; దీనినే ఉత్తేజక శక్తి (Activation energy) అంటారు. అణువులు తమ శక్తిలో ఉత్తేజక శక్తి అని పిలవబడే కొంత విలువ గల శక్తిని అధిగమించినప్పుడే అవి రసాయన చర్యల్లో పాల్గొంటాయి. హైడ్రోజన్, ఆక్సిజన్ లను కలిపి వేడిచేసినప్పుడు ఇదే జరుగుతుంది. అణువులు వాటి ఉత్తేజక శక్తిని పొంది సత్వరంగా చర్య నొంది నీరుగా మారుతాయి.

## రసాయన చర్యలను మనం ఏ విధంగా వివరించవచ్చు ?

పల్లపు ప్రదేశానికి నీరు ఎందుకు ప్రవహిస్తుందో ఎత్తునుంచి రాయి కిందికి ఎందుకు పడుతుందో అనే విషయాలకు కారణాలు పరిశీలిస్తే కొన్ని రసాయన చర్యలు ఎందుకు యాదృచ్ఛికంగా జరుగుతాయో మరికొన్ని ఎందుకు జరగవో అనే వాటికి సమాధానం దొరుకుతుంది. పడే రాయి, ప్రవహించే నీరు వంటి యాదృచ్ఛికంగా జరిగే విధానాల ఉదాహరణల్లో స్థితిజశక్తి తరుగు దిశలో నికర స్థితిజశక్తి తగ్గడం అనేది రెంటికీ సాధారణ లక్షణం. ఈ తరిగిపోయే స్థితిజశక్తి దాని అంతట అదే ఒక రసాయన చర్యగా రూపొంది. ఉష్ణాన్ని బయటకు విడుదల చేయవచ్చు. అసంఖ్యాకమైన రసాయన చర్యలు యాదృచ్ఛికంగా జరగటానికి ఈ తర్కం వివరిస్తుంది. అదే విధంగా రసాయన చర్యలు జరగటానికి వెనక ఉన్న చాలకశక్తి బయటకు వెలువడిన వేడిమి కొలతగా జరిగిన శక్తిమార్పు అని విదితమవుతుంది.

పై వివరణకు అనుగుణంగా ఉన్న ఉష్ణయోచక రసాయన చర్యలు (ఉష్ణం వెలువడే చర్యలు) అసంఖ్యాకంగా ఉన్నాయి. ఉదాహరణకు ఆక్సిజన్‌తో కార్బన్ చర్య నొంది కార్బన్‌డైఆక్సైడ్‌ను ఏర్పరచే చర్యలో కార్బన్‌డైఆక్సైడ్‌గా ఏర్పడే ప్రతి అణువుతో 393.3 కిలోజౌల్స్ ఉష్ణశక్తి వెలువడటం సహచరితంగా ఉంటుంది. అయితే ఈ వాదాన్ని ఎల్లప్పుడు అనువర్తింపచేయటానికి వీలులేదు. ఎందువల్ల అంటే ఉష్ణాన్ని గ్రహిస్తూ జరిగే రసాయన చర్యలు ఎన్నో మనకు తెలుసు కనక. ఇటువంటి చరలను ఉష్ణగ్రాహక చర్యలు అంటారు. దీనికి ఉదాహరణగా అతి ముఖ్యమైన ఎరువు అయిన అమ్మోనియమ్ నైట్రేట్ నీటిలో కరగడం. ఈ రసాయన పదార్థం కరుగుతూ ఉంటే ఆ పాత్ర చల్ల బడటం మనకు తెలుస్తుంది. ఎందువల్ల అంటే పాత్ర నుంచి, పరిసరాలనుంచి ఈ రసాయన ఎరువువేడిమిని గ్రహించడమే.

అయితే ఉష్ణగ్రాహక చర్యలను ఏ విధంగా వివరించగలం ? అందుకు మరో వివరణ అవసరం. ఆ వివరణ "ఎంట్రోపి" అందజేస్తుంది. ఉష్ణంగా వెలువడిన శక్తిలో తరుగుదల వల్ల రసాయన చర్య జరగడానికి దోహదం చేసినా అది ఆ రసాయన చర్య చోదక బలానికి మాత్రం పూర్తి కారణంకాదు. ఒక వ్యవస్థ "ఎంట్రోపి" పెరుగుదల యాదృచ్ఛికంగా మార్పు సంభవించటానికి దోహదం చేస్తుంది. సాధారణ భాషలో చెప్పాలంటే " ఎంట్రోపి " అనేది క్రమరాహిత్యం తెలిపే స్థాయి (Degree of disorder). శూన్యంలోకి ఒక వాయువు వ్యాకోచంచెందటం ఇందుకు ఒక ఉదాహరణ. - కొంత ఘనపరిమాణానికి పరిమితమైన వాయువులు ఎక్కువ ఘనపరిమాణంలోకి విడిచినప్పుడు అవి వ్యాకోచం చెందాయి. ఆ వాయువుకు సంబంధించిన ఏదైనా ఒక అణువు ఆక్రమించిన స్థల ఘనపరిమాణం సంభావ్యత తగ్గుతుంది. అప్పుడు దాని స్థలాన్ని కనుక్కోవడానికి వీలు తక్కువ లేకపోతే క్రమరాహిత్యం ఎక్కువైంది. దాన్ని మరో విధంగా చెప్పాలంటే " ఎంట్రోపి " పెరిగింది. రసాయన చర్యల్లో పరమాణువులలోని అమరికలోని భేదం వల్లనే ఎంట్రోపిలో మార్పు సంభవిస్తుంది. చర్యా ఉత్పన్నం అణునిర్మాణం కనక ఎక్కువ క్రమరాహిత్యంతో ఉంటే ఎంట్రోపి పెరుగుతుంది.లేకపోతే ఎంట్రోపి తగ్గుతుంది.

ఒక రసాయన చర్యలో ఉష్ణశక్తి, ఎంట్రోపి రెండూ కూడ మార్పు చెందాయి అనుకుందాం. అప్పుడు చర్యలు ఏ విధంగా సంభవిస్తాయి అని ఊహించి చెప్పగలం ? ఒక రసాయన చర్యలో ఉష్ణశక్తి, ఎంట్రోపి రెండింటిలో కూడా మార్పులు వస్తే, ఈ రెండింటి ప్రభావాల ఫలితం ఆ చర్య కొనసాగుతుందా, ఏ దిశలో సాగుతుంది అనే అంశాలను నిర్ణయిస్తుంది.

వేడిమిని గ్రహిస్తూ అమ్మోనియమ్ నైట్రేట్ నీటిలో కరగటాన్ని ఏ విధంగా వివరించవచ్చునో పరిశీలిద్దాం. ఇది కూడా ఎంట్రోపి పెరుగుదలకు, సంబంధించినది. అమ్మోనియమ్ నైట్రేట్ అయాన్‌లు ఎక్కువ క్రమరాహిత్యంలో ద్రావణంలో ఉన్నాయి. ఈ ఎంట్రోపిలో మార్పు అత్యధిక ప్రబలమైంది. అందువల్లనే అమ్మోనియం నైట్రేట్ నీటిలో కరగటానికి దోహదం చేస్తుంది. వేడిమి వెలువడటం ఎంట్రోపి రెండూ ఒకదానికొకటి వ్యతిరేక ప్రభావాలు చూపడం వల్ల రసాయన చర్యకు దోహదం చేసే చోదనశక్తిని ఒక వ్యవస్థకు సంబంధించిన స్వేచ్ఛాశక్తి (Free energy) మార్పుతో వివరిస్తారు. దానిని $\Delta G=\Delta H-T \times \Delta S$ అని నిర్వచిస్తారు.

$\Delta G$ స్వేచ్ఛాశక్తిలో మార్పు, $\Delta H$ ఉష్ణశక్తిలో మార్పు, $\Delta S$ ఎంట్రోపిలో మార్పు, రసాయన చర్య జరిగే పరమ ఉష్ణోగ్రతను T సూచిస్తుంది.

ఒక రసాయన చర్య జరగాలంటే $\Delta G$ ఋణాత్మకంగా ఉండాలి. ఈ సంబంధంలో $\Delta H$, $\Delta S$ విలువలు తెలిస్తే అనేక చర్చలను మనం ఊహించి చెప్పవచ్చు. అసంఖ్యాకమైన రసాయన పదార్థాలకు ఈ విలువలు నమోదు అయి ఉన్నందువల్ల, రసాయన చర్య జరగడానికి ముందుగానే వాటి ఫలితాలను ఊహించి చెప్పవచ్చు. చర్య కనక ఉష్ణ మోచకమై ($\Delta H$ ఋణాత్మకం) ఎంట్రోపి పెరిగినట్లయితే ($\Delta S$ ధనాత్మకం) అప్పుడు $\Delta G$ఋణాత్మకం అయి, చర్య జరుగుతుంది. చర్యకనక ఉష్ణగ్రాహకమైతే, ఎంట్రోపి తగ్గి, చర్య ఎంత మాత్రం జరగదు. ఈ రెండు ప్రభావాలు ఒకదానికొకటి వ్యతిరేకమై ఋణాత్మక $\Delta G$ తో ఉండే చర్యలు మాత్రమే ముందుకు సాగుతాయి.

తక్కువ ఉష్ణోగ్రత వద్ద కొన్ని చర్యలు జరుగవు. కాని అధిక ఉష్ణోగ్రత వద్ద జరుగుతాయి. ఎందువల్ల అంటే అధిక ఉష్ణోగ్రతవద్దనే $\Delta G$ ఋణాత్మకం అవుతుంది. ఒకప్పుడు అసలే జరగవని భావించిన రసాయన చర్యలను కూడా ఉష్ణోగ్రతను తగ్గించి లేదా అధికం చేసి అనుకూల పరిస్థితుల్లో జరిగేటట్లు చేయడం జరిగింది.

రసాయన శాస్త్రజ్ఞుడు తన రసాయన శాలలో రసాయన చర్యలు తనకు కావలసిన విధంగా జరుపుతూ మనకందరికీ జీవితం వినోదవంతం చేస్తూ మనం తింటానికి కొత్త కొత్త పదార్థాలు సృష్టించడం కట్టుబట్టలు తయారు చేయడం వ్యాధుల బారినుంచి కాపాడడం వంటివి అతనికి చిన్నపిల్లల ఆటవంటిది అని అంటే మీరు అంగీకరించరా?

# జీవావరణం



ఆచార్య జి.ఆర్.రావు
వృక్షశాస్త్రవిభాగం, భారతిదశన్ విశ్వవిద్యాలయం,
తిరుచిరాపల్లి-620 024

భూమిపై నివశించే జీవరాసుల సామూహిక సాకల్యమే జీవావరణం. ప్రతి సంవత్సరం అన్ని రకాల జీవపదార్థం ఉత్పత్తి అయ్యే గరిష్ఠ పరిమితి 410 బిలియన్ టన్నులు. దీనిలో సుమారు 290 బిలియన్ టన్నులు మొక్కల పెరుగుదలకు ప్రాతినిధ్యం వహిస్తుంది. మిగిలినది అంతా వాటిని వినియోగించుకునే జీవరాసులకు చెందుతుంది. (పటం 1). జీవావరణ సహజధర్మానికి (Biosphere Physiology) నీరు, ఖనిజాలు ముఖ్యమైన పదార్థాలు.

మొక్క జీవితం, జంతు జీవితం రెండూ పరస్పరం ఒకదానిపై మరొకటి ఆధారపడి ఉన్నాయి. జీవి ఆవృత చర్యలపై మూలక రసాయనిక ఆవరణపు సంఘటనం ఆధారపడి ఉంటుంది. మంటలు, జంతువుల, మొక్కల శ్వాసక్రియవల్ల కార్బన్‌డయాక్సైడ్ వాతావరణంలోకి మళ్లీ చేరని పక్షంలో, వాతావరణ కార్బన్ డై ఆక్సైడ్ అంతా ఒక సంవత్సరంలోనే మొక్కల కిరణజన్య సంయోగక్రియ తొలగించి ఉండేది. అదేవిధంగా గాలిలోని మొత్తం నైట్రోజన్‌ను ఒక మిలియన్ సంవత్సరాల లోపుగానే నైట్రోజన్ స్థాపక సూక్ష్మజీవులు నిశ్శేషం చేసి ఉండేవి. స్వయంకృతాధార సంఘంలో మొక్కలు, జంతువులు, నైట్రోజన్ స్థాపక జీవులేకాక జీవపదార్థంగా బంధితమైన రసాయన పదార్థాల్ని విడుదల చేసే విచ్ఛిన్నకారులు (Decomposers) కూడా ఉండాలి. సూక్ష్మజీవులు కర్బనాన్ని బంధించే కర్బన రసాయన పదార్థాలను విచ్ఛిన్నం చేస్తాయి.

అందువల్ల ప్రతి స్వయంకృతాధార సంఘానికి ఇవి తప్పవు:

అ) శక్తిఉత్పత్తిదారులు (ఆకుపచ్చనిమొక్కలు)

ఆ) ప్రాథమిక వినియోగదారులు (సూక్ష్మజీవులు, శిలీంధ్రాలు, శాఖాహారులు)

ఇ) ఉన్నతస్థాయి వినియోగదారులు (మాంసాహారులు, పరభక్షులు, పరాన్నజీవులు, స్కావెంజర్‌లు)

ఈ) విచ్ఛేధనకారులు (ముడిపదార్థాలను జనింప చేస్తాయి).

## అనేక శక్తి వనరులు :

విశ్వాంతరాళంలో భూమి తేలుతూ ఉంటుంది; దీనికి అనేక వనరుల నుంచి శక్తి లభిస్తుంది (పటం-2). సూర్యకాంతి ప్రాథమిక శక్తివనరు. ఇది విశ్వ వికిరణాలద్వారా (Cosmic radiation) భూమిని చేరుతుంది. ఇదేకాక అనేక ద్వితీయ వనరులనుంచి కూడా శక్తిని గ్రహిస్తుంది. రేడియో ధార్మికతవల్ల భూమి అంతర్గతంగా వేడెక్కుతుంది. అంతేకాక వేలా ఘర్షణం (Tidal friction) వల్ల కూడా ఉష్ణశక్తిని పొందుతుంది. వీటి అన్నింటికి మించి మానవుడు ఇంధనాలను మండించడంవల్ల నిల్వశక్తిని అత్యధిక పరిమాణాల్లో విడుదల చేస్తున్నాడు. మన మొత్తంశక్తి రాబడిలో అనుదినం 99.9998% ఉండే సూర్యరశ్మితో పోలిస్తే అన్ని ద్వితీయ శక్తి వనరులు సూక్ష్మాతి సూక్ష్మం. సంవత్సరానికి 13 × $10^{23}$ గ్రా. కాలరీల మేరకు సౌరశక్తి సరఫరా ఉంటుంది. మనకు వచ్చేశక్తిలో సుమారు మూడోవంతు పరావర్తనం వల్ల నష్టమై మిగిలిన దానిని వాతావరణం, భూమి శోషిస్తాయి. ఈ శక్తి మంచును కరగించటానికి, నేల, సముద్రాల్ని వేడెక్కించటానికి, నీటిని ఆవిరిగా మార్చటానికి వినియోగపడుతుంది. సౌరశక్తిలో అత్యల్పభాగం, అంటే ఒకశాతం సౌరశక్తిలో సుమారు 400 వ వంతు కిరణజన్య సంయోగక్రియలోకి ఇముడుకొని జీవావరణ జీవక్రియా పోషణకు లభిస్తుంది. సూర్యకాంతినుంచి పొందిన

## జీవావరణం




C : మొత్తం భూమి ద్రవ్యరాశిలో 10000 భాగాల్లో సుమారు 3 భాగాలు

$CO_2$ : 2400 బిలియన్ టన్నులు

N : భూమి ద్రవ్యరాశిలో 10,000 వంతు

P : భూమిమీద ఉన్న పదార్థం ద్రవ్యరాశిలో 1 శాతంలో 1/10 వంతు కంటె ఎక్కువ

పటం : 1

## సజీవుల శక్తి వనరులు




పటం : 2

శక్తిలో 1 / 6 వంతు శక్తిని మొక్కలు వాటి జీవక్రియకు వినియోగించుకొని, మిగిలిన 5 / 6 వంతును జంతువులకు అందుబాటులో ఉండేవిధంగా చేస్తాయి.

మొక్కలలో నిలవఉన్న శక్తిలో సుమారు 50% కిలోరీలు శాఖాహారులు వాటి వివిధ జీవక్రియల కోసం రాబట్టుకొని మిగిలినది జీవక్రియా రద్దుగా బయటపడుతుంది. శాఖాహారులు గ్రహించిన దానిలో సుమారు 10 నుంచి 15% వరకు జంతువుల మాంసానికి చేరుతుంది. విసర్జకపదార్థాలను ఆహారంగా చేసుకున్న క్రిమికీటకాదులవల్ల, పశువులపేడను ఇంధనంగా మానవుడు దహనం చేసినందువల్ల నష్టపోయిన కిలోరీలను రాబట్టుకోవచ్చు. ఆతిథేయిలనుంచి నిల్వశక్తిని బలవంతంగా రాబట్టుకొన్న పరాన్నజీవులు, వాటిమీద ఆధారపడిన పరాన్నజీవులద్వారా మరి ఏ జీవికీకూడా ఆధారం ఇవ్వలేనంతగా శక్తిని కలిగినటువంటి పరాన్నజీవులను పోషిస్తాయి.

ద్వితీయ వినియోగదారులు అంటే శాఖాహారులను భక్షించే మాంసాహారులు వాటి అంతర్గత రసాయనక్రియలకోసం 70% మాంసాన్ని ఉపయోగించుకొని, మిగిలిన 30% వాటి కణజాల నిర్మాణానికి వినియోగించుకుంటాయి. అందుకని ఒకరకానికి చెందిన మాంసాన్ని మరో రకంగా మార్చుకొనే గరిష్ఠ సామర్థ్యం మాంసాహారుల్లో చాల తక్కువ.

నిల్వశక్తి ఒక జీవినుంచి వేరొకజీవికి చేరుకున్న కొద్దీ అతిత్వరగా కుంచించుకుపోతుంది. (పటం-3). ఉదా. శైవలాలు (Algae) నిలవచేసిన 1000 కిలోరీలశక్తిని చిన్నజలచరాలు 150 కేలోరీలకు సరిపడే జీవపదార్థంగా మార్చుకోగలుగుతాయి. అయితే ఈ జంతువులను సాల్మన్‌జాతికి చెందిన చిన్నచేప (Smelt) తినడంవల్ల 30 కేలోరీల జీవపదార్థం మాత్రమే తయారవుతుంది. మానవుడు కనక ఈ సాల్మన్ జాతి చిన్నచేపను తింటే 30 కేలోరీలనుంచి 6 కిలోరీలు విలువచేసే తన కొవ్వును లేకపోతే తన కండరాన్ని సంశ్లేషణం చేసుకోగలడు. ఈ సాల్మన్ జాతి చిన్నచేపను ట్రౌట్ (Trout) అనే మరోరకం సాల్మన్‌జాతి చేప తిన్నపిదప మానవుడు కనక ఆ ట్రౌట్‌ను తింటే ఆ 30 కేలోరీల దిగుబడి విలువ 1-2 కేలోరీలకు దిగిపోతుంది. మనం కనక నిజంగా సరస్సుల మీదే ఆహారంకోసం ఆధారపడి ఉంటే ట్రౌట్‌ను సమూలంగా నాశనంచేసే స్మెల్ట్ అనే సాల్మన్‌జాతి చిన్నచేపను తినాలి! లేదా ఈ స్మెల్ట్ అనే చిన్నచేపను కూడా సమూలంగా నాశనం చేసి ప్లవకాలు (Plankton) తిని జీవించాల్సి ఉంటుంది. ఈ సిద్ధాంతాలే నేలమీద ఉండే వాటికి కూడా వర్తిస్తాయి. మానవుడు తనజాతిని వీలైనంత అత్యధిక జనాభాగా నిలబెట్టడానికి నిర్ణయించుకొంటే ఈ ఆహార శృంఖలాన్ని తనవరకు వీలైనంతగా కుదించి శాఖాహారిగా మారాలి.

జీవావరణ సహజ ధర్మానికి నీరు, ఖనిజాలు ముఖ్యమైన పదార్థాలు అని ముందుగా చెప్పుకున్నాం. సముద్రాలు సాలీనా ఒక మీటరు లోతుకు సరిపడే నీటిని భాష్పీభవనం చెందిస్తాయి. నేల నుంచి, మంచి నీటి జలాశయాలనుంచి ఆవిరిఅయ్యే నీరు సముద్రాలనుంచి ఆవిరిఅయ్యే నీటిలో ఆరోవంతు. ఈ భాష్పీభవనంలో కనీసం 20 శాతం నేలమీద పెరిగే మొక్కల భాష్పోత్సేకం నుంచి జరుగుతుంది. అయితే సాలీనా పెరసి మొత్తానికి అయ్యే నీటి పరిమాణం సుమారు 400,000 ఘన కిలోమీటర్లు. అవక్షేపణం (Precipitation) కూడా సాలీనా అంతే అయి ఉండాలి. నేలను చేరే అవక్షేపణం ఆవిరి చెందిన దానికంటె 36,000 ఘన కిలోమీటర్లకంటె కొంచెం ఎక్కువ. అది సాలుకు నేలమీద పారే నీరుకు ప్రాతినిధ్యం వహిస్తుంది. (పటం-4).

నీరు భూమిమీదనుంచి సముద్రంలోకి ప్రవహించి పోయేటప్పుడు సుమారు 20 బిలియన్ టన్నుల నేల ఉపరితలాన్ని క్రమంగా క్షయం చేస్తుంది (Erodes). ప్రస్తుత కాలంలో ప్రతి శతాబ్దానికి 1 సెం.మీ. రేటుతో సగటున ప్రపంచవ్యాప్తంగా ఖండాలు క్షయం చెందుతూ ఉన్నాయి. నేలయొక్క భౌమ ఉద్ధరణం (Geological uplift) ఎల్లప్పుడు జోక్యం చేసుకొని, సముద్రపుమట్టానికంటె పైకి సముద్ర అవక్షేపాలను తీసుకొనివస్తుంది. ఈ చక్రం మళ్ళీ ప్రారంభం అవుతుంది.

సుమారు 4 బిలియన్ టన్నుల నీటిలో కరగిన మూలక రసాయనపదార్థాన్ని (పటం-5) ప్రపంచంలోని నదులన్నీ కలిసి సముద్రాల్లోకి చేరవేస్తున్నాయి.

## కాయుగ సరస్సులో ఆహార శృంఖలం

శైవలాలు

మానవుడు

1000కిలోరీల
జీవపదార్థం

1.2 కిలోరీలు విలువచేసే
కొవ్వులేదాకండరం

6కిలోరీలు విలువచేసే
కొవ్వులేదాకండరం

ట్రౌట్

30కిలోరీల
జీవపదార్థంస్మెల్ట్

జలచరాలు
150కిలోరీలజీవపదార్థం

**పటం : 3**

## అవక్షేపితం సరఫరా

సాలీనా అవక్షేపితం
100,000 ఘనపుమైళ్ళు

సాలీనా ప్రవహించి
పోయేనీరు
9000 Cu.miles per year

భూమి

సముద్రాలు

సాలీనామొత్తంనీరు
ఆవిరిఅయ్యేది
100,000 Cubic miles

భూమి
నుంచి
ఆవిరిఅయ్యేది

మంచినీటిసరస్సుల
నుంచి
ఆవిరిఅయ్యేది

సగటున1 మీ
లోతునీరు
ఆవిరిఅవుతుంది

సముద్రంనుంచి
ఆవిరిఅయ్యేదానిలో
1/6 ఆవిరిఅయ్యేది

**పటం : 4**

## సాలీనా ధ్వంసం అయ్యే భూమి ద్రవ్యరాశి




పటం : 5

ఫాస్ఫరస్ (3.5 మిలియన్ టన్నులు) పొటాసియమ్ (100 మిలియన్ టన్నులు) నైట్రోజన్ (10 మిలియన్ టన్నులు) వంటి ముఖ్యమైన రసాయనపదార్థాలు ఉండటంవల్ల ఈ కరగినపదార్థాలు ఎక్కువ ఆసక్తిదాయకాలు.

జీవపదార్థంలో కర్బనం, హైడ్రోజన్, ఆక్సిజన్, నైట్రోజన్, సల్ఫర్, ఫాస్ఫరస్ ఉన్నాయి. జీవపదార్థం ద్రవ్యరాశిలో ఈ మూలకాలు 95% కంటె ఎక్కువభాగం ఉన్నాయి. భూమిపై విస్తారంగా ఉన్న మూలకం ఆక్సిజన్. సజీవత్వానికి ముఖ్యపదార్థం ప్రోటీన్. భూమి నష్టపోయిన నైట్రోజన్, నైట్రోజన్ చక్రంద్వారా ఉత్క్రమణీయం చెందుతుంది. స్థాపించిన నైట్రోజన్ను సముద్రజీవులు అమ్మోనియాగా మార్పుచేస్తాయి. అది మళ్ళీ వాతావరణం ద్వారా భూమిని చేరుతుంది.

## కర్బనం - నికరనష్టం :

సముద్రాలనుంచి కర్బనం కార్బన్ డై ఆక్సైడ్ రూపంలో తప్పించుకొని పోతుంది. ధ్రువప్రాంతాల లోని సముద్రాలు ఆ కార్బన్ డై ఆక్సైడ్ను శోషిస్తాయి. కార్బనేట్స్ రూపంలో కొంత కార్బన్ సముద్రపు అవక్షేపాల్లో నిక్షిప్తం కావడంవల్ల జీవావరణం నుంచి కర్బనం నికరంగా కొంత నష్టమవుతుంది. ఈ మూలకం కొరత జీవరాశిని పరిమితంచేసే ప్రమాదం ఏమీలేదు. వాతావరణంలో సుమారు 2,400 బిలియన్ టన్నుల కార్బన్ డై ఆక్సైడ్ ఉంది. దీనికి సుమారు 30 రెట్లు సముద్రాలలో కరిగి ఉంది. అగ్నిపర్వతాల నుంచి కార్బన్ డై ఆక్సైడ్ వెలువడుతుంది. వాతావరణ సగటు కార్బన్డై ఆక్సైడ్ శాతాన్ని మానవుడు పెంచుతున్నాడు అనే నిందనుమోస్తూ అత్యధిక ప్రమాణాల్లో ఇంధనాన్ని మండిస్తున్నాడు. దీనికి తోడు పురాతన సముద్ర గర్భాలనుంచి భూమి ఉద్ధరణ కారణంగా కావలసినంత సున్నపురాయి పైకి తీసుకురాబడుతోంది.

భూమినుంచి సాలీనా 3.5 మిలియన్ టన్నుల ఫాస్ఫరస్ సముద్రంలోకి ప్రక్షాళితమై అవక్షేపితం అవుతుంది. కాని అది దురదృష్టవశాత్తు సముద్రం నుంచి వాయురూపంలో బయటికిపోదు. సముద్రం నుంచి అది పునఃప్రాప్తి చెందే ఒకేఒక విధానం సముద్ర పక్షులు వేశే గానో (Guano) అనే రెట్ట. సాలీనా నష్టపోయిన ఫాస్ఫరస్లో 3% కంటె తక్కువ మాత్రమే ఈ విధంగా తిరిగి భూమిని చేరుతుంది. అనేక వ్యవసాయ భూములు ఫాస్ఫరస్ లోపంవల్ల నష్టాన్ని పొందుతున్నాయి. జీవావరణం పనిచేయడానికి ఫాస్ఫరస్ కీలక పరిమిత వనరు. జీవావరణంనుంచి ఫాస్ఫరస్ క్రమంగా క్షీణించిపోతోంది. ఈ పరిస్థితిని మెరుగు పరచడానికి ఆచరణ యోగ్యత విధానం ఏమీ అవుపించదు. కాకపోతే భూమ్యుద్ధరణం ఆవృత్తం కారణంగా ఫాస్ఫేట్ శిలలు సముద్ర మట్టానికి పైగా తీసుకు వచ్చేవరకు వేచిఉండాలి. ఆకుపచ్చని మొక్కల జీవనానికి అవసరమైన సల్ఫర్, కాల్షియమ్, పొటాసియమ్, మెగ్నీషియమ్, ఐరన్ వంటి అత్యవసర మూలకాలను గురించి కూడా మనం ఆరాటపడవలసి ఉంది.

అడవులను కొట్టివేయడం, భూమిక్షయం చెందడం అనే సమస్యలు మనకు కొంత ఆసక్తిదాయకమని ఈ పరిశీలనలు సూచిస్తాయనడం న్యాయోచితమని చెప్పవచ్చు. రేడియో ధార్మికపతనం, వెదజల్లిన రసాయనికపదార్థాల పొగలు వంటివి సేంద్రియపదార్థాన్ని వినియోగించేసే సూక్ష్మజీవుల్ని సమూలంగా నాశనం చేస్తాయని మానవుడు ఆతని నిర్లక్ష్య ధోరణికారణంగాతెలుసుకోలేకపోతున్నాడు.



# అణుస్థాయిలో కేన్సర్ అవగాహన


ఆచార్య వైచ్.పోలాస
అధ్యక్షులు,
మైక్రోబయాలజీ డిపార్టమెంటు,
ఉస్మానియా విశ్వవిద్యాలయం
హైదరాబాదు

అనువాదం
దామరాజు సుబ్బారావు
తెలుగు అకాడమీ
హైదరాబాదు

డాక్టర్ కల్పగం పోలాస,
రిసర్చి ఆఫీసర్
పోషకాహారసంస్థ (NIN)
హైదరాబాదు


సాధారణ ప్రతి రూపకణాల నుంచి పరివర్తనచెందిన కణాల్ని గుర్తించటానికని కణస్వరూపంలోని మార్పులు, ప్రతి రక్షక జనకత్వం, జీవక్రియా పెరుగుదల రేటులోని మార్పుల్ని సాంప్రదాయ కంతి (Tumour) జీవశాస్త్రజ్ఞులు ఉపయోగించారు. అంతులేని విభిన్న కాన్సర్ నిర్దిష్ట దృశ్యరూపాలు (Cancer Specific Phenotypes) విభ్రాంతిని కలగ చేసేవిగా కనుపిస్తాయి. అయితే ఈ కాన్సర్ స్థితికి ఇన్ని మార్పులు అవసరమని, పైకి కనుపించే దృగ్విషయాలు మాత్రం సూచిస్తాయనే అన్వేషణ అసాధ్యం. రెట్రోవైరస్‌లు అనే ఒక రకపు వైరస్‌ల సమూహం కనుక్కోవడంతో కంతి జీవశాస్త్రజ్ఞులు కాన్సర్‌కణం తాలుకు అణుస్థాయి పరిశోధనలు చేశారు. మొదటిసారిగా పైటన్‌రాస్ (Peyton Rous) ఈ మార్గంలో అన్వేషణ సాగించాడు. పరివర్తనం చెందిన కణాల గాలితంలో (Celleiltrate) సార్కోమా వైరస్ (Sarcoma Virus) ఉందని 1908 లో నివేదించాడు. దాన్ని ప్రస్తుతం అతని పేరుతో పిలుస్తున్నారు. మామూలుగా ఆరోగ్యంగా ఉండే కోడిపిల్లల్లో ఈ గాలిత కారక "సార్కోమా" ను ప్రేరేపించింది.

ప్రస్తుతం అనేక రెట్రోవైరస్‌లను కనుక్కొన్నారు. అవన్నీ ఒకే లక్షణాలు కలిగి ఉంటాయి. అవి 1) వాటి నిర్మాణాత్మక ప్రోటీన్‌లు అన్నీ దాదాపు సమ జాతీయ మైనవి. 2) వాటి అన్నింటి జీనోమ్ (Genome) నిరుపమానమైంది. అంటే వాటి అనువంశిక పదార్థం / ద్వయస్థితిక అణుకంగా (Diploid dirmer of single standard RNA) ఏర్పడిన ఒకేపోచ కలిగిన ఆర్.యన్.ఎ. 3) RNA నిర్దేశంలో DNA సంశ్లేషణ జరుపగల వైరస్ తాలుకు పాలిమారేజ్‌లు, వైరస్‌తాలుకు నాలుగు జన్యువులు గుర్తించి, వాటిని దాని క్రోమోసోమ్ మీద చిత్రీకరించారు. వాటిలో మూడు ఆ వైరస్ ప్రతికృతి (Replication)కి కావలసిన ప్రోటీన్‌లను క్రోడీకరిస్తాయి. 4) నూతన రూప పరివర్తనానికి విశిష్ట రూపాన్ని ఏర్పరచేటటు వంటిది.[2]

ఈ రోజు మనం అనుకునే వాటిలో బాగా నాటుకుపోయిన ఒక సాధారణ విషయాన్ని కంతి శాస్త్రజ్ఞులు ధ్రువపరచారు. భిన్న జన్యు తంతువు (Genome) కలిగినటు వంటి కంతి వైరస్ ఒక సాధారణ కణం నుంచి వర్ధనం చేయబడిన కణాన్ని కంతి ఏర్పరచే (Tumorigenric state) స్థితికి పరివర్తనం చెందిస్తుందని వారు కనుక్కొన్నారు. కణంలో ఉండే "జీనోమ్" కంటె ఎన్నోరెట్లు చిన్నదిగా ఉన్న 5–10 Kb పరిధిలో ఉండే వైరస్ తాలూకు చిన్నచిన్న "జీనోమ్‌లు" కణంలో ఉండటం వల్ల ఆ కణం పరివర్తనం చెందగలదని విదితమవుతుంది. ఈ "జీనోమ్"లను "ఆన్‌కోజన్యువులు" (Oncogenes) అని అంటారు. ఇవి బహుముఖ ప్రభావితంగా పనిచేస్తాయని భావిస్తున్నారు. అంటే అధిక సంఖ్యలో ఏర్పడే దృశ్యరూపక మార్పుల్ని (Phenotypic shifts) కొద్ది సంఖ్యలో ఉండే ఈ జన్యువులు వెలికి తీస్తాయి.[22]

అంతుపట్టని సంక్లిష్టతను ఆపాదించుకొన్న కాన్సర్ దృశ్యరూపాలతో పనిలేకుండా ఉండేందుకు సాపేక్షంగా సాధారణత కలిగిన జన్యువుల అధ్యయనం వీలు కలిగిస్తుందని సూచిస్తుంది. వైరస్‌కు చెందిన ఆన్‌కోజన్యువులు వాటితో సమజాతీయత కలిగినటువంటి కణంలోని

ఆంకోజన్యువుల నుంచే తప్పని సరిగా ఏర్పడినాయని అతి తొందరగానే తెలుసుకోవడం జరిగింది. ప్రాధమికంగా రెట్రోవైరస్‌ల జన్యువహనం (Transduction) వల్ల అనేక కణ అంకోజన్యువుల్ని కనుక్కోవడం జరిగింది. తత్ఫలితంగా (ప్రవేశపెట్టడం వల్ల వచ్చే ఉత్పరివర్తనం) కంతుల్ని ఏర్పరచే కణఅంకోజన్యువుల్ని DNA లో ఒక స్థానం నుంచి వేరొక స్థానానికి స్థానాంతరం చెందించవచ్చు. జన్యువహనం చెందించవచ్చు. అత్యున్నత స్థాయిలో వ్యక్తమయ్యే రీతిలో వాటిని విపులీకరించవచ్చు.

ఉత్క్రమణీయ అనులేఖిత ఎంజైమ్ (Reverse transcriptase) వల్ల రెట్రోవైరస్ తన ప్రతికృతి గావిస్తుంది. ఈ ఎంజైమ్ వైరస్ తాలుకు మధ్యంతర DNA ను సంశ్లేషిస్తుంది. ఈ మధ్యంతర DNAదానివంతుగా వైరస్ RNA ను సంశ్లేషిస్తుంది. రెట్రోవైరస్ జన్యువుల వ్యక్తీకరణ వ్యూహం ఆ వైరస్ సంబంధిత జన్యుఉత్పన్నాల సాపేక్ష అవసరాన్ని బట్టి అవి స్వతంత్రంగా వ్యక్తీకరించబడటానికి దోహదం చేస్తూ, నిజకేంద్ర కణాలలో (Eukaryoti, cells) నిర్దేశించబడినట్లు m- RNA అణువుల అనువాదం వాటి 5[1] చివరల వద్దనే ప్రారంభమవటానికి వీలు అవుతుంది.

వైరస్ ప్రవేశాన్ని అరికట్టడం వల్ల కాని, ఆ వైరస్ జన్యువుల వ్యక్తీకరణకు బాధ్యత వహించే కణాంతర సంఘటనలను అణచి పెట్టడం వల్ల గాని రెట్రోవైరసెస్‌ల ప్రతికృతిని ఆతిధేయ కణాలు నిరోధించ గలవు. వైరస్ జీవిత చక్రంలోని ఏ ముఖ్య దశనైనా కణాంతర అదుపు చర్యలు ప్రభావితం చేస్తాయి. కణాంతర అదుపు చర్యల ఫలితంగా వైరస్‌గా పరివర్తనం చెందించే జన్యువుల వ్యక్తీకరణను నిరోధించడం గాని వైరస్ జన్యు తంతువు (genome) సంఘటిత DNAగా ఉన్నప్పటికీ దాన్ని భంగపరచడం గాని జరుగుతుంది.

**అంతర్జాత** రెట్రోవైరస్‌ల జన్యుతంతువులు **అనేక జాతుల బీజసంతతిలో ఉండి** మామూలు **ఆతిధేయ కణంలోని** జన్యు నిర్ణయకారకాల (Genetic determinants) నియంత్రణకు అంతర్జాతంగా ఉండే ఈ రెట్రోవైరస్‌ల వ్యక్తీకరణ లోబడి ఉంటుంది. నిజానికి వైరస్ పరివర్తనానికి "Src" జన్యువు అనే జన్యువు కారణమని రౌస్‌సార్కోమా వైరస్‌తో (Rous SarcomavirusRSV)చేసిన ప్రయోగాల నుంచి తగిన సాక్ష్యాధారాలు లభించాయి. "Src" జన్యువుగురించి ఇంకా జరిపిన పరిశోధనలు Sre జన్యువు కణంలో ఏర్పండిందని అది అంతకు పూర్వమే RSV 19 ఏర్పడే సమయంలోనే కోడిపిల్లల జన్యుతంతువుల నుంచి సంక్రమించిందని మేము నమ్మేటట్లు చేశాయి. సుషుప్తస్థితిలో ఉన్నట్లు పైకి కనువించేటటు వంటిది తగిన విధంగా ప్రేరేపించి నట్లయితే తీవ్రరూపం దాల్చగలిగినటువంటి జన్యువును కణం తాలూకు జన్యుతంతువులు కలిగి ఉంటాయని ఇది నిరూపిస్తుంది. అటువంటి భావనే కనీసం 18 రకాల కణజన్యువులు పూర్వఆన్కోజన్యువులను మేము గుర్తించటానికి దారితీసింది. ఇవి జన్యు వహనం చెందే రెట్రోవైరస్‌తో కలసి ఉన్నప్పుడే ఆన్కోజన్యువులుగా మారేస్థితిని సంక్రమించు కుంటాయి. పూర్వఆన్కోజన్యువుల ఉనికి కణాలు వాటి జన్యుతంతువులలో ఉన్నటువంటి జన్యువుల వల్ల ఏవిధంగా పరివర్తనం చెందుతాయో విశదీకరిస్తుంది. ఈ పరిస్థితిలో బహిర్జాత రెట్రోవైరస్‌ల జన్యువహనం ఎంతమాత్రం అవసరం ఉండదు. సకసేరుకాలు, చేపలు, పక్షులకు చెందిన కణసంతతి పూర్వ **ఆన్కోజన్యువులు** ఎందుకు ఉంటాయని మేము **ఆలోచించవలసి** వచ్చింది. అవి వైరస్ **ఆన్కోజన్యువులతో** సమజాతీయతను ఏవిధంగా **కలిగి ఉంటాయి?** మామూలు కణాలలో వాటి విధులు **ఏమిటి?** పరిణామ క్రమంలో సకసేరుకాల్లో **జన్యువులు** రక్షించబడతాయి. రెట్రోవైరస్ **ఆన్కోజన్యువులు** ప్రతికణానికి చెందినటువంటి **జన్యుసంబంధిత** అంశం **అనే** పరికల్పనను హ్యూబ్నర్ (Heubner) టోడారో (Todaro) ప్రతిపాదించారు. కాన్సర్ పెంపొందించే కారకంతో ఉత్ప్రేరణ చెందినపుడు అవి వ్యక్తం అయి కణాల్ని అతి తీవ్రరూపం దాల్చేవిగా పరివర్తనం చెందిస్తాయి.

ఈ పరికల్పన రుజువు చేయటానికి సకశేరుకాల DNA లో Src ఉందో లేదో తెలుసు కోవటానికి ఉత్క్రమణీయ అనులేఖిత ఎంజైమ్ (Reverse transcriptase) సహాయంతో Src జన్యువునుంచి రేడియోధార్మిక DNAను తయారు చేయటం జరిగింది. Src జన్యువులోని న్యూక్లియోటైడ్ అనుక్రమాన్ని పోలిన కణ DNA ను వెదకడం కోసం ఈ రేడియోధార్మిక DNA ఒక పరిశోధనా పరిశీలకంగా (Probe) ఉపయోగించబడింది. వ్యాధి సంక్రమణం జరగనికోడిపిల్లలు, తదితర పక్షులు DNA లతో ఈ Src జన్యువు తాలుకు DNA పరిశోధనా పరిశీలకం సంక్రమణం చెందటం అనే విషయం తెలుసుకోవటంతో వీటికి సంబంధించిన అన్ని జాతులలోనూ వాటి కణజన్యువుల అనుక్రమం Src జన్యువు అనుక్రమాన్ని పోలిఉంటుందని తెలుపుతూ ఈ పరికల్పన రుజువు అయింది. ఈ కణజన్యువును దాని ప్రతిరూపం అయిన వైరస్ Src జన్యువుతో వేరువేరుగా గుర్తించటానికని అది v-Src అని పిలవడం జరిగింది.[1] వైరస్ ఆన్కోజన్యువులలో ఉండే DNA అనుక్రమానికి సరిపోలి Src ఆన్కోజన్యువు మాదిరి అనేకమైన ఆన్కోజన్యువులు కణంలో ఏర్పడేవి ఉన్నాయి.[4] ఈ రెండు సమూహాల ఆన్కో జన్యువులను వేరువేరుగా గుర్తించేటందకు అవి చైతన్యవంతమయ్యే చర్యా విధానం తోడ్పడుతుంది. వాటిలో ఒకటి జన్యువహానం, రెండోది శాకీయ ఉత్పరివర్తనం. కణ Src (C.Src) ప్రోటీనుకు సంబంధించిన సంకేత సమాచారం ఎక్సానులు (Exons) అనే వేరువేరు ప్రదేశాలలో ఉండి వాటి మధ్యన ఉండే ప్రదేశాలు ఇంట్రాన్‌లు (Introns) గా ఏర్పడుతుందని కూడా తెలుసుకున్నారు. ఈ రకమైన విభక్త విన్యాసం జంతువుల్లోని జన్యువుల విలక్షణత. కాని ఇది రెట్రోవైరస్ జన్యువు,లలో ఉండదు. అందువల్ల ఏదో విధంగా అంతకుపూర్వమే, ఉండేటటువంటి రెట్రోవైరస్‌లు కణ ఆన్కోజన్యువులను గుర్తించి వాటిలో ఉండే ఇంట్రాన్‌లను తొలగించి, ఎక్సానులన్నింటిని జతపరచి, దాన్ని ఆ రెట్రో వైరస్ జన్యుతంతువులో ఇమడ్చడం జరుగుతుందని నిర్ధయించడం జరిగింది.

దీన్ని మరింత ధ్రువ పరచేదిగా పెద్దపెద్ద భాగాలు కోల్పోయిన Src జన్యువు కలిగిన కొన్ని RSV రకాలను కూడా వేరు చేయడం జరిగింది. ఈ వైరస్‌లు ప్రయోగాత్మక జంతువుల్లో సార్కోమాలను పెంపొందించలేవు. ఇటువంటి వికలాంగ వైరస్‌లను కోడిపిల్లలలోకి ఎక్కించి వాటిని మళ్ళీ ఆ కోడిపిల్లల వ్యాధి సంక్రమిత కణాలనుంచి రాబట్టడం జరిగింది. ఈ వైరస్‌లలో వాటి V-src జన్యువు పునర్నిర్మాణం జరిగిందని కనుక్కున్నారు. నాల్గింట మూడు వంతులు వరకూ కణజన్యువు నుంచి వైరస్ ఆన్కోజన్యువు సంక్రమించుకొన్న V-Src జన్యు పదార్థం C-Src జన్యుపదార్థంతో సంయోగం చెందినందువల్ల అది కంతులు ఏర్పరచ కలిగే ధర్మాన్ని తిరిగి పొందిందని విదితమైంది. C-Src , V-Src ల విధులు ఒకటేనని ఈ పరిశీలనలు తిరిగి సూచిస్తాయి[1].

సాధారణ కణాల్లో ఆన్కోజన్యువులు ఏమిచేస్తూ ఉంటాయనే నిగూఢ ప్రశ్నకు జవాబు కోసం Src జన్యువుతాలుకు m RNA ను దాని నుంచి ఏర్పడే ప్రోటీన్ ఉత్పన్నాలను అధ్యయనం చేయటానికి నిర్ధయించడం జరిగింది. పరిమాణంలోనూ, రసాయన నిర్మాణంలోనూ విధుల్లోనూ C-Src నిర్మించిన ప్రోటీన్ కూడా V-Src నిర్మించిన ప్రోటీన్‌నే పోలి ఉందని కనుక్కోవడం జరిగింది.[1,4]

## ఆన్కోజన్యువుల ప్రోటీన్‌లు వాటి చర్యా విధానం (Proteins of Oncogenes and their mode of action)

ఫాస్ఫొరిలేషన్ అనే చర్యలో ప్రోటీన్‌లలోని అమైనో ఆమ్ల అంశాలతో ఫాస్ఫేట్ అయాన్‌లను సంలగ్నం చేసే ప్రోటీన్ కైనేజ్‌గా (60,000 డాల్టన్‌ల అణుభారం) Src జన్యువుప్రోటీన్‌ను గుర్తించారు. ఈ ప్రోటీన్ కైనేజ్ ప్రత్యేకించి టైరోసిన్ (Tyrosine) ను ఫాస్ఫొరిలేషన్ చేస్తుందని తెలుసుకున్నారు. సాధారణ కణాలు కూడా కొంత ఈ అమైనో ఆమ్ల విశిష్ట ప్రోటీన్ కైనేజ్‌ను కలిగి ఉంటాయి. కాని

కాన్సరు కణంలో ఈ ప్రత్యేక ప్రోటీన్ కనీసం 20 రెట్లు అధికంగా ఉంటుంది. ఒక కణాన్ని పరివర్తనం చెందించే శక్తి ఆన్కోజన్యువుకు సంబంధించిన ప్రోటీన్కు ఎట్లా ఉందనేది ఒక చిక్కు సమస్య. బహుశా ఈ ప్రోటీన్లు అనేక ముఖ్య కణాంతర లక్ష్యాలను మార్పు చేసి, కణంపై బహుముఖ క్రియాశీల వంతమవుతాయి.[1,11]

Src పరివర్తనం చేసిన కణాల ప్లాస్మా త్వచాల పరీక్ష నుంచి ఒక ప్రత్యేక కణ ప్రోటీన్పై pp60V-Src చర్యనూ, కాన్సర్ కణనిర్మాణంలోనూ, దాని విధుల్లోనూ గోచరించే విలక్షణ మార్పునూ, కొంతవరకు అవగాహనం చేసుకోవచ్చు. త్వచంలోని ఘన ఉపరితలాలకు అంటిపెట్టుకొనే అసంజనక (Adhesion) ఫలక ప్రదేశాల్లో pp 60V-Src కేంద్రీకృతమై ఉందని చూపబడింది. కాన్సర్ కణాలలో అసంజనక ఫలకాలు వాటి నిర్మాణాన్ని కోల్పోతాయి. తత్ఫలితంగా ఏర్పడే కణాల అసంజనకత్వ తరుగుదల వల్ల అధిక సంఖ్యలో కాన్సర్ కణాలు అవి ఏర్పడిన కణాలనుంచి విడిపోవటం అతి సునాయాసంగా జరిగి ఆ కణాలు వేరొక ప్రదేశానికి తరలిపోవటానికి దోహదం చేస్తుంది. విన్క్యులిన్ (Vinculin) అనేది ఒక ప్రోటీన్. ఇది సాధారణ అసంజనక ఫలకాల్లో (Adhesion Plaques) ఒక అనుఘటకంగా ఉండి, Src చే అది పరివర్తనం చెందిన తరువాత కణంలోని అన్ని భాగాలకు వితరణ చెందుతుంది. ఈ విన్క్యులిన్ లోని టైరోసిన్ ప్రమాణాన్ని pp 60V-Src ఫాస్ఫరిలేట్ చేస్తుందని ఎలక్ట్రాన్ సూక్ష్మదర్శిని పరీక్షల ఆధారాల నుంచి నిర్ణయం చేశారు. కనక విన్క్యులిన్ ఫాస్ఫరిలేషన్ అసంజనక ఫలకాలు వాటి నిర్మాణం కోల్పోవటానికి ప్రోత్సాహిస్తుందని సూచించడం జరిగింది. అయితే కాన్సర్ కణాల క్రమరాహిత్య ప్రవర్తనతో ఈ సంఘటనల ప్రాముఖ్యాన్ని నిర్ధారించ వలసి ఉంది.

## "మోతాదు"— పరికల్పన (Dosage hypothesis)

పరివర్తనం చెందిన కణంలోని Src జన్యువు తాలుకు పెరిగిన ప్రోటీన్ ఉత్పన్నంలో ఆ పరివర్తనానికి సంబంధించిందని వెల్లడైంది. ఆ విధంగా రెట్రోవైరస్ ఆన్కోజన్యువుల వల్ల కలిగిన కాన్సర్ పుట్టుక పరివర్తనానికి సంబంధించింది. అందువల్ల రెట్రోవైరస్ ఆన్కోజన్యువుల వల్ల జరిగిన కాన్సర్ పుట్టుక ఆ జన్యు ఉత్పత్తుల అధిక ఉత్పాదనకుసంబంధించింది. ఈ పరికల్పనను మరింత అవగాహన చేసుకోవటానికి కణ ఆన్కోజన్యువులకు వైరస్ ప్రవర్ధకాన్ని సంలగ్నం చేసి కణాల్లోకి చెర్చబడింది. దీని ఫలితంగా రెట్రోవైరస్ఏర్పరచే పరివర్తనను పోలిన పరివర్తనం జరిగింది[1].

## ఆన్కోజన్యువుల కుటుంబం (Family of Oncogenes)

ఇంతవరకు అనేక రకాల ఆన్కోజన్యువులు ఉన్నాయని తెలపడం జరిగింది. వాటి విధులు Src జన్యువు కుటుంబాన్ని పరిపోలవు. జన్యు వహనం వల్ల ఏర్పడిన మానవ కంతుల్లోని ఆన్కోజన్యువులు రాస్జన్యువుల (ras gene)· కుటుంబంలోనివిగా కనుక్కోవడం జరిగింది. ఈ రాస్ జన్యువులతో నిర్మాణాత్మక సమజాతీయతను కలిగి ఉండదు. కిర్స్టన్ (Kirsten) హార్వే (Harvey)ల ఎలుకల సార్కోమావైరస్తో ఉన్న వాటి సాహచర్యం కారణంగా మొదట్లో వాటిని రాస్ ఆన్కోజన్యువులు అని పిలిచారు. అవి ప్రోటీనులను (21,000 డాల్టన్ అణుభారం) సంకేత పరుస్తాయి (Encode). అయితే అవి టైరోసిన్ కైనేజ్ల (Tyrosine Kinases) ప్రోటీన్లు ఎంత మాత్రం కావు. అవి ప్లాస్మాత్వచంతో సంబంధం ఏర్పరచుకొని GDP,GTPలని బంధిస్తాయి[9]. అవి కణ ఆకారం, దాన్ని ఒక స్థానంలోనే నిలపడం, దాని స్వాతంత్ర్యతలను నిలిపి ఉంచడంలో పాల్గొంటాయని భావించడం జరిగింది. జీవ పదార్థంలో వాటి స్థానీకరణ వాటి చర్యల తీరుకు సూచన అందించవచ్చు.

మానవ ఎడినోవైరస్ మీద చేసిన అనేక సంవత్సరాల అధ్యయనాలు ఎడినోవైరస్ తాలూకు Ela,Elb ఆన్కోజన్యువుల్ని గుర్తించడానికి వీలైంది. ఈ రెండు జన్యువులు కంతులు ఏర్పరచేస్థితిని వాటంతట అవే కలిగించలేవు. కాని ఈ రెండు ఉమ్మడిగా పనిచేస్తే ఈ స్థితిని ఏర్పరచగలవు [12]. పోలియోమా వైరస్ లోని మాధ్యమిక Tగాని స్థూల Tగాని వాటి అంతట అవి పని చేసి కంతి పరివర్తనాన్ని ప్రేరేపించలేవు. కాని అవి రెండూ ఉమ్మడిగా పనిచేసి అన్ని రకాల కంతి కణ దృశ్యరూపాలను (Turmour cell phenotype) పెంపొందించవచ్చు[15]. ఇదేమాదిరిగా రాస్ (ras)మిక్(Myk) ఆన్కోజన్యువులు కూడా కంతిని ఏర్పరచే స్థితిని ప్రేరేపించటానికి అనేక ఆన్కోజన్యువుల మధ్య సహకారం అవసరమని ఈ పరిశీలనలు సూచిస్తాయి. స్వాభావికంగా కేన్సర్ స్థితి ఏర్పడటంలోని అనేక అంచెలుగా జరిగే విధానాన్ని అణుస్థాయిలో చేసిన పరిశీలనలు వివరిస్తూ అటు వంటి ప్రతి అంచె మరొక కణ జన్యువును ఉత్తేజ పరచటాన్ని ప్రతి ఫలిస్తుందేమో. ఆన్కోజన్యువుల ఈ సంపూరక సమూహాలు బహుశా, కణ బహుధాకరణ (Cell Proliferation) విధానాన్ని నియంత్రించే బహుకొద్దిపాటి కేంద్రీకృత నియంత్రతా పథాలను ప్రతి ఫలించే అవకాశం ఉంది. ప్రతి పథం దాని వంతు వచ్చినప్పుడు విభిన్న ఆన్కోజన్యువులు సంకేత పరచిన ప్రోటీన్లలో ఏదో ఒకదానిచే చర్యాబద్ధం కావచ్చు.

Erbb అనే ఆన్కోజన్యువు ఉత్పాదితం బాహ్యచర్మ పెరుగుదల కారకం (Epiderml growth factor EGF) మాదిరి పని చేస్తుంది[8]. అదేవిధంగా సూక్ష్మ ఫలకాలనుంచి (Platelets) ఏర్పడిన పెరుగుదల కారకం (Patelet derived grwoth factor PDGF) ప్రవర్తించేదిగా Sisఆన్కోజన్యువు ప్రోటీన్ కూడా ప్రవర్తిస్తుంది. ఈ పెరుగుదల ఉత్తేజ కారకాలు కణగ్రాహకాలకు (Cell-receptors) బంధితమై కణాల్లోకి సిగ్నల్స్‌ను ప్రసారం చేస్తాయి [11,7,21]. ఇదే విధంగా గ్రాహక స్థాయిలోనే Erbb, Sis ప్రోటీన్ పని చేయవచ్చు. లేదా గ్రాహకాల నుంచి వచ్చే పెరుగుదల సిగ్నల్స్‌ను క్లిష్టకణ లక్ష్యాల (Critical cellular targets) వైపు జరిగే వహనానికి కారణం కావచ్చు. ఆన్కోజన్యువుల ప్రోటీన్లకు PDGF లేదా EGF ల మధ్య ఉన్న భేదం ఏమిటంటే అవి నిర్మాణాత్మకంగా (Constitutively) లైగాండ్లతో బంధింపబడినట్లుగా ప్రవర్తిస్తూ, ఒక ఊర్ధ్వ ప్రవాహిక మూలం నుంచి సాధారణంగా కావలసిన ఉత్తేజాన్ని పొందకుండా అధోప్రవాహిక లక్ష్యాలకు ఉత్తేజక సిగ్నల్స్‌ను ప్రసారం చేయగలవు. [11]ఒక సందర్భంలో ఎబిల్సన్ మ్యూరైన్ లూకిమియా (Abelson murine leukemia) వైరస్ఆన్కోజన్యువును పోలిన C-abl మానవకణజన్యువు 9 నుంచి 22 వ క్రోమోసోమ్‌కు బదలాయింపు ఫలితంగా మైలోసైటిక్ లుకేమియా (Myelocyticleukemia)ఏర్పడింది[5]. మరో సందర్భంలో 159 క్షారజంటల కూర్పు అనుక్రమం (Insertion sequence) తో C-మోస్ కణ ఆన్కోజన్యువు (C-mos cellular oncogene) పునరమరిక వల్ల ట్రాన్స్‌ఫెక్షన్ (Transfection) పరీక్షలో చుంచుఎలుక ఫైబ్రోబ్లాస్టలలో పరివర్తనం చెందాయి. వైరస్ ప్రమేయం లేకుండా ప్రేరేపిత కంతి ఏర్పడటంలో DNA ను స్థానాంతరణ చెందించే విధానంతో కణ ఆన్కోజన్యువును చైతన్యవంతం చేయడం అనేది ప్రప్రథమంగా నిరూపితమైంది[16].

ఒక ప్రత్యేక బర్కిట్ (Burkitt) లిమ్ఫోమా కణ సంతతి (Lymphoma cell line) లో మానవ C-మోస్ (C-mos) జన్యు పునరమరికకు సాక్ష్యాధారం ఇటీవలనే నివేదించబడింది. ఇందులో ఇమ్యునోగ్లాబ్యులిన్ {$V_h$ జన్యువు సమీపంలో పునరమర్చిన C- మోస్ (C-mos)} జన్యువును చొప్పించడం జరిగింది. ఈ పునరమరిక C-mosఉన్న 8 8 వ క్రోమోసోమ్ చివరి భాగం మానవ ఇమ్యునోగ్లాబ్యులిన్ల స్థూల శృంఖలాల జన్యువులు ఉండే 14వ క్రోమోసోమ్‌కు స్థానాంతరణం చెందడం వల్ల జరిగింది. ఈ జన్యువులు అత్యంత చైతన్యవంతంగా వ్యక్తమవుతూ C-mos జన్యువుల్ని కూడా అత్యంత చైతన్యమంతంతో వక్తీకరణం అవ్వడానికి దోహదం చేస్తాయి[16].

కంతికణాన్ని ఏర్పరచడంలో రెట్రోవైరస్ జన్యువులు సంభావ్యత పాత్రను ఇంతవరకు దొర్కొన్న సాక్ష్యాధారాలు వివరిస్తాయి. రసాయన క్యాన్సరు కారకాలపై జరిపిన పరిశోధనలు పరివర్తనం చెందే శక్తిమంత రసాయనాలచే, వాతావరణ కాలుష్యంతో మందులవల్ల, విషపదార్థాల వల్ల కాన్సర్‌ను ప్రేరేపితం చెయ్యవచ్చు అని నిరూపించాయి. ఇవన్నీ కాన్సర్ జనిత చైతన్యానికి DNA అంతిమ లక్ష్యం అని సూచిస్తాయి. కంతి కణాలలోని DNA ఖండాలను గుర్తించి, వాటి అధ్యయనానికి ప్రయోగాలు రూపొందించారు. ఆ ఖండాల మార్పు ఆన్కోజన్యువుల పరివర్తనానికి (Convertion) కీలక మవుతుంది[17]. మానవ మూత్రాశయం క్యాన్సరు కణ సంతతి నుంచి ప్రత్యేకిత స్థాన అంతర్ఘాత న్యూక్లియేజన్‌లను ఉపయోగించి చిన్నచిన్న DNA ముకలను వేరు చేయడం జరిగింది. సాధారణ కణజన్యువు ఉత్పరి వర్తనం చెంది మూత్రాశయ ఆన్కోజన్యువుగా కాన్సర్ పుట్టుకొచ్చే విధానంలో ఏర్పండిందని ఈ ప్రయోగాలు విశదపరుస్తాయి. జన్యువుల బదలాయింపు, అణువు శాఖీయోత్పత్తి (Molecular clouning) విధానాలను ఉపయోగించి EJ మూత్రాశయపు కాన్సరు జన్యుతంతువు ఒక 6.6 K.b DNA ఖండంలో ఒక చోట ఉంటుందని చెప్పటానికి సాధ్యమవుతుంది. ఈ ప్రాంతం అనుక్రమాన్ని సేఫ్ (seif) పురోగమన/తిరోగమన "డైడీఆక్సీ DNA అనుక్రమ విధానాలలోనూ మాక్సమ్, గిల్బర్ట్ (Maxam and Gilbert) రసాయన పద్ధతిలోనూ కనిపెట్టడం జరిగింది. ఈ అనుక్రమంలోని భేదం P - 21 ప్రోటీన్ నిర్మాణాన్ని ప్రభావితం చేస్తుందని తెలుసుకోవటం జరిగింది[20]. దాంట్లో గ్లైసిన్ అనే అమైనో ఆమ్లం వాలైన్ అవశేషంతో ప్రతిక్షేపణ చెంది అమైనో ఆమ్లాల సరళప్రతిక్షేపణం జరిగింది. ఇది GGC అనే అనుక్రమం వాలైన్‌కు సంకేతంగా ఉండే GTC గా బిందు ఉత్పరివర్తనం (Point mutation) చెందటం కారణంగా జరిగింది[17]. ఈ ప్రాంతంలోని P21 ప్రోటీన్‌ను మానవ ప్రోటీన్‌లోని ఛారాస్-1 (C-Haras-1) జన్యువుతోను ఎలుకల C - హారాస్ జన్యువుతోను హార్వేసార్కోమావైరస్‌కు చెందిన V-హారాస్ (V-Haras) ఆన్కోజన్యువుతోను పోల్చడం జరిగింది. హార్వేసార్కోమావైరస్ (Harvey Sarcoma Virus) తాలూకు ఆన్కోజన్యువు విశ్లేషణ అనీ, ప్రత్యక్షంగా ఎలుక కణ జన్యువు, తాలుకు పూర్వప్రాంతంలో ఒకే ఒక స్థానంలో వేరుగా ఉందని, అంటే EJ ఆన్కోజన్యువులో గ్లైసిన్ ఆర్జినైన్‌గా అదేస్థానంలో మార్చబడి నటువంటిది అని తెలియ పరచింది. ఈ మార్పు ఎలుక కణాలలోని V హారాస్ (V-Haras) జన్యువు పూర్వగామి నుంచి (Precursor) దీన్ని చైతన్య పరచటానికి మానవుల మూత్రాశయపు ఆన్కోజన్యువును, దాని సవ్యప్రతిరూపం నుంచి చైతన్య పరచటానికి కీలకం అవుతుంది. P 21 ప్రోటీన్ దాని సాధారణ కణ లక్ష్యాలతో జరిపే పరస్పర చర్యలో సంక్లిష్ట పరిస్థితుల్ని గ్లైసిన్ వాలైన్‌తో ప్రతిక్షేపణం చెందడంతో చేకూర్చుతుంది. గ్లైసిన్‌లో పార్శ్వ శృంఖలం లేకపోవడం అనేది 20 అమైనో ఆమ్లాలలోకెల్లా ఒక వైపరీత్యం. అందువల్ల అది పాలిపెప్టైడ్ శృంఖలాల ముఖ్య ఆధారాన్ని (Backbone) వంచడంలోను మడచడంలోను పాల్గొంటూ, సర్పిలాకార నిర్మాణాలను (Helicis) అత్యంత శక్తిమంతంగా విడగొడుతుంది. ఆ విధంగా దాని ప్రతిక్షేపణం ప్రోటీన్‌కు సంబంధించిన స్థానిక ప్రాదేశిక రసాయన శాస్త్రంలో ఆకస్మిక మార్పుల్ని తెస్తుంది. ఈ విధంగా మారిన ప్రోటీన్‌కుపరివర్తనం చేసే ధర్మం ఉంటుంది[17].

అనేక సహచరిత కారకాలు, అనేక రేటు పంమిత చర్యలు అవసరం కణ జన్యువును చైతన్య వంతం చేయడం, ఉత్పరివర్తనం, వైరస్ సంక్రమణం వంటి వాటితో ప్రభావితమయ్యే బహుపధ విధానం కాన్సర్ పుట్టుక (Carcinogenisis) అని ఈ ఆధారాలు అన్నీ సూచిస్తాయి. వాటిలోని ప్రతి ఒక్కటి వ్యాధి సంబంధిత నూతన కణజాలంగా (Neoplastic) రూపాంతరం చెందే బహు పథవిధానంలోని ఒక చర్యగా ప్రత్యర్థిత్వం వహించవచ్చు.

**References :**


1 Bishop J. M , 1982, oncogenes, Scientific American 246, 80-92

2 Bishop J M , 1978, Viral oncogenes of retroviruses Annual Review of Biochemistry, 47, 35-88

3 Coffin J. M H E Warmus, J M Bishop, M Essex, W D Hardy, G S Martin, N.E Rosenberg, E M. Scolnick, R A Weinberg and P.K Vogt, 1981, Proposal for naming host cell derived inserts in retrovirus genomes, Journal of Virology, 40, 953-957

5 Deblein A ,A G Vankessel, G Grosveld, R Bartram, A Hageme jer, D Bootsma, M.K Spun, M.Heisterkamp, J Grotten, J R -Stephenson, 1982 A cellular oncogene is translocated to the philadelphio chromosome in chronic myelecytic leukemia, Nature, 300, 765-767

6 Der C.S ,T Krontiris and G M Cooper, 1982 Transforming genes of human bladder and lung carcinoma cell lines are homologous to the ras genes of Harvey and Kirstn Sarcoma viruses Prod, NaH, Acad, Sci, (USA) 79, 3637-3640

7. Doolittle R. F , M Hunkapiller, L Hood, S Devare, K C Robbins, S A Aaronson, H M. Antoniades, 1983 Simian sarcoma virus oncogene, Vsis is derived from the gene or (genes) encoding a platelet derived growth factor, Science, 221, 275-276

8 Downward J , Y Yarden, E Mayes, G Scrace, M Tony, P Stockwell, A Ullrich, S Schlessinger and M D Waterfield, 1984 Close similarity of epidermal growth factors receptors and V-erb B oncogene protein sequences, Nature, 307, 521-527

9. Ellis, R W., D R Lowy, and E M. Scolnich, 1982 Advances in viral oncology, Raven Press 107, 126

10. Goldfarb M., K. Scimizu, M. Perucho and M. Wigler, 1982, Isolation and preliminary characterisation of transforming gene from T24 bladder carcinoma cells, Nature, 296, 404-409

11. Hunter T , 1934, The proteins of oncogenes, Scientific American, 251, 60-69

12. Jochemsen H , J. J. L. Daniels, P. Hertoghs, J. Schrier, P. J. Vanden Elsen and E. B Vander, 1982, Identification of adenovirus type 12 gene products involved in transformation of oncogenesis, Virology, 122, 15-28

13 Land H , L. F Parada and R A Weinberg 1983 Tumorigenic convrsion of primary embryo fibroblasts requires atleast two co-operating oncogenes, Nature, 304, 596-602

14 Parada C F , C J Tabin, C Shih and R A Welnburg E J Human, 1982, bladder carcinoma oncogene if homologue of harvey sarcoma virus ras gene, Nature 297, 596-602

15 Rassoulzadegan M , A Cowle, A Carr, M Glaichenjaus, R Kamen and E Cuzin, 1982. The roles of indivudual polyma virus early proteins in oncogenic transformation Nature, 300, 713-718

16 Rechavi, G , D. Givol and E Cavaan, 1982, Activation of a cellular oncogene by DNA rearrangement possible involvement of IS like element, Nature, 300, 607-611

17 Reddy E P., R K Reynolds, E Santos, M Barbacid, 1982 A point mutation is responsible for the acquisitio of transforming protetïes by the T24 human bladder carc noma oncogene, Nature, 300, 149-152

18 Santos E , S Tronick, S A. Aaronson, S Pulciani and M Barbacid, 1982 $T_{24}$ human bladder carcinoma oncogenes in an activated form of normal human homologue of BALB-and Harvey MSV transforming gene, Nature, 292, 343-347

19. Stehenin D , H E Warmis, J. M Bishop and P K Vogt, 1976, DNA related, to the transforming gene(s) of Avian Sarcoma viruses is present in normal Avian DNA Nature, 260, 170-173.

20 Tabin C J , S M Bradley, C I. Bargmann, R A Weinberg, A. G Papgeorge, E M Scolnick, R Char, D R. Lowy and E H. Charge, 1982 Mechanim of activation of humanoncogene,·Nature, 300, 143-149.

21. Waterfield M., G Scarce, M Whittle, P Stroobont, A Johnson, A Wasteson, B Westermaker, C. H Heldin, J Huang and T. Deuel, 1983 Platelet derived growth factors in structurally related to the putative transformaing protein p28 SLS of silian sarcoma virus, Nature, 304, 35-39

22 Weinberg R. A , 1984, cellular oncogenes, Trends in Biochemical Sciences, 9, 131-133

# ఆంధ్రప్రదేశ్ జంతు ప్రదర్శనశాలలు



శ్రీ గాలి ముద్దుకృష్ణమనాయుడు
అటవీశాఖామాత్యులు
ఆంధ్రప్రదేశ్

## I. నెహ్రూ జంతు ప్రదర్శనశాల, హైదరాబాదు

**ఉపోద్ఘాతం :**

భూమిపై మానవుడు అవతరించిన నాటినుంచీ, వనరులను నిత్యజీవితంలో ఉపయోగించుకోవటం ఆరంభించి, జంతువులను ఆహారం లేదా పనికోసం పెంపుడు జంతువులుగా పెంచుతూనే ఉన్నాడు. అందువల్ల మానవ నాగరికత ఎంత పురాతనమైనదో అంత పురాతనమైనవే జంతు ప్రదర్శనశాలలు. అయితే ఈ నవీన కాలంలో మన సాంఘిక జీవితంలో జంతుప్రదర్శనశాలల పాత్ర విపరీతమైన మార్పు చెందింది. 18వ శతాబ్దం చివరిభాగంలో వినోదం కోసం మాత్రమే నిర్వహించిన చిన్న సమూహాల నుంచి, ఇప్పుడు వన్యమృగాల సంరక్షణకు చివరి నిక్షేపాలుగా వృద్ధి చెందాయి. ఈ పరిధి ఇంకా విస్తృతి చెందింది. దీనివల్ల ప్రకృతి సిద్ధంగా కనుపించే ఆవరణల్లో జంతువులను, పక్షులను ఉంచుతున్నారు. ఈ అంశాలను దృష్టిలో ఉంచుకొని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం 1959లో నెహ్రూ జంతు ప్రదర్శనశాలను ఏర్పరచింది. కొన్ని జంతువుల సముదాయతోనూ, అవస్థాపన వసతులతోనూ జంతువుల కోసం కొన్ని ఆవరణలనుతోనూ ఏర్పరిచారు. దీనిని ప్రజలు సందర్శించటానికి అక్టోబర్ 1965లో అనుమతించారు. దీన్ని క్రమంగా ప్రస్తుత స్థాయికి అభివృద్ధి చేశారు. ప్రస్తుతం నెహ్రూ జంతు ప్రదర్శనశాల 153.90 హెక్టేర్ల విస్తీర్ణంలో విస్తరించి ఉంది. దీనిలో జంతువులకు పక్షులకు, సరీసృపాలకు (reptiles) చక్కగా అమర్చిన వివిధ ఆసక్తిదాయకమైన ఆవరణలు ఉన్నాయి. అవి ఒకదానితో ఒకటి కలిసిఉన్నాయి.

**జంతువుల సేకరణ :**

వీలైనంత మేరకి మౌలికంగా జంతువులను ఒక క్రమబద్ధంగా ప్రదర్శిస్తున్నారు. అంటే మాంసాహారులు, శాఖాహారులు, ప్రైమేట్‌లు, సరీసృపాలు, పక్షులు మొదలైన వాటి అలవాట్లను అనుసరించి సమూహాలుగా చేసి, వాటిని ప్రత్యేక తరగతులుగా ఉంచి, విశాలమైన ఆవరణల్లో ప్రదర్శిస్తారు.

__ప్రైమేట్‌లు: (Primates):__

పెద్ద బహిరంగ ఆవరణలో మధ్య ఆఫ్రికా నుంచి వచ్చిన చింపాంజీ ఈ సమూహాలకు ముందు ఉంటుంది. దీని తరవాత, ఉన్న రంగురంగుల "మాన్‌డ్రిల్, డ్రిల్, సేక్రెడ్, చక్మ, ముదురు ఆకుపచ్చ, పసుపచ్చ బాబూన్‌లు (బహిరంగ ప్రదేశంలో); మీసాలున్న "గ్యూనాన్, డయానా, మోనా, డిబ్రాజు, వెర్‌వట్, మంగాబీ" మొదలైన కోతుల జాతులన్నీ ఆఫ్రికా నుంచి వచ్చినవే. "స్క్వైరల్" కోతులు, "కాపూచియా"లు దక్షిణ అమెరికాకు ప్రాతినిధ్యం వహిస్తాయి. అరుదైన "హూలాక్", "గిబ్బన్"లు, "రీసస్", "బొన్నెట్", "స్టమ్ప్‌టెయిల్డ్", "లయన్ టెయిల్డ్", "పిగ్‌టెయిల్డ్" కోతులు భారతీయ ప్రైమేట్‌లకు చెందినవి.

**మాంసాహారులు**

భారత, ఆఫ్రికా జాతులకు చెందిన రెండు రకాల సింహాలు జంతుప్రదర్శనశాలలో ఉన్నాయి. ఇంచు మించుగా అడవిలో మాదిరిగానే ఉన్న ఆసియాలోని భారతదేశపు సింహాలతో కూడిన ఒకేఒక సఫారీపార్కును సందర్శించడం నయనానందకరం. తెల్లవి, మామూలు రకం పెద్దపులులకు వాటి అనువైన అడవిప్రాంతాలు ఉన్నాయి. చిరుతపులులు (మామూలు రకం, నల్లవి) వాటికోసం పెద్ద కొండరాళ్ళ చరియలతో అమర్చిన విశాల ఆవరణల్లో ఉన్నాయి. విదేశపు పిల్లులలో అమెరికా దేశపు "ప్యూమా", "జాగ్వార్"లు, ఆఫ్రికా దేశపు "చీతాలు", కూడా

ఉన్నాయి. ఇక మిగిలినవాటిలో తోడేళ్ళు, గుంటనక్కలు, నక్కలు, హాయానాలు ఉన్నాయి. వీసెల్ గ్రూప్‌లో "ఆట్టర్స్ (Otters), రాటెల్" ఉన్నాయి.

స్లాత్ బేర్స్, హిమాలయ నల్లని ఎలుగు, గోధుమరంగు ఎలుగు, మలయా సన్‌బేర్ - ఇవన్నీ ఎలుగులకు ప్రాతినిధ్యం వహిస్తూ అగడ్త ఉన్న ఒక పెద్ద ఆవరణలో ఉన్నాయి.

**శాఖాహారులు:**

వీటిలో ముందు ఉండే సమూహం ఏనుగుల మంద. ఇవి బహిరంగమైన ఆకుపచ్చని ఆవరణంలో ఉన్నాయి. దీని తరవాత అరుదైనదీ, పెద్దదీ అయిన భారతదేశపు ఖడ్గమృగమూ, దాని ఆఫ్రికాదేశపు బంధువు అయిన తెల్ల ఖడ్గమృగమూ పెద్ద బురదగుంటలో ఉన్నాయి. వీటికి సరిపోలినట్టిది ఆఫ్రికా దేశం నుంచి వచ్చిన నీటి గుఱ్ఱం (Hippopotamus)ల సమూహం వాటి మొదటి సంతతితో సగర్వంగా ఉన్నాయి.

జంతు ప్రదర్శనశాలలో ప్రముఖ స్థానాన్ని ఆక్రమిస్తూ జిరాఫీలు, జీబ్రాలు, గౌర్‌లు (Gaurs) అమెరికా బైసన్ ఉన్నాయి. వీటిపక్కనే భారతీయ గౌర్ (Gaur), అరుదైన అడవి గాడిదలు కూడా ఉన్నాయి.

భారతీయ ఆంటిలోప్స్, నీల్‌గాయ్, బ్లాక్‌బక్, చౌసింగ, చిన్‌కార కోసం ప్రత్యేకంగా విశాలమైన బహిరంగమైన **ఆవరణలు ఉన్నాయి.**

**దుప్పి (Deer) సమూహంలో** పెద్ద సాంబార్ అందమైన చుక్కల **చీతాల్** (చుక్కలలేడి), స్వాంప్ హాగ్‌దుప్పి, జపాన్ సికా దుప్పి (Japanise sika Deer) ఉన్నాయి.

ఈ దుప్పులలో గర్వించదగిన సమూహం మణిపూర్ లేదా దామియా దుప్పి. ఇది వన్యమృగంగా ఇంచుమించుగా నశించిపోయింది.

మలబార్ జయంట్ స్క్వైరల్స్, మలయా **ఉడుతలు,** ముళ్ళపందులు, కుందేళ్ళు, గినీ పందులు **మొదలైనవి** రోడెంట్స్‌లోకి వస్తాయి.

**అన్ని** రకాల దుప్పులను, ప్రజననం చేయటంలోనూ తిరిగి సమీకరించడంలోనూ, ఎక్కువవాటికి పునరావాసం కల్పించడంలోనూ ఈ జంతుప్రదర్శనశాల సఫలీకృతమైంది.

**పక్షులు** (Birds) : భారతదేశ జాతీయ పక్షితోపాటు ఇతరరకాల నెమళ్ళు అంటే బంగారు వర్ణం, రజితవర్ణం, వలయ కంఠాలూ ఉన్న నెమళ్ళు ప్రదర్శనశాలలో ఉన్నాయి. ఇవేకాక స్పర్‌ఫౌల్స్, ఫాట్రిడ్జిలు, క్వైల్సు కూడా ఉన్నాయి.

పెలికాన్‌లు, ఫ్లమింగ్‌లను పెద్ద కొలనుల్లో చూడవచ్చు. వీటితోపాటు ఆడ్‌జిండ్సు, నల్లమెడ, తెల్లమెడలు ఉన్నవేకాక, నల్లని స్కార్కులను చూడవచ్చు. సాధారణ కొంగలుకూడా ఉన్నాయి. ఇవన్నీ ఆరుబయలు మైదానంలో ఉన్నాయి.

బాతులు, (ఆడ, మొగా) పెద్ద కొలనుల్లో ఉండి, కొలనుల్లోనూ పక్షుల నివాసాల్లోనూ నడుస్తూ ఉంటాయి.

ఇక చిలుకల కుటుంబంలో రంగుల మెకాకీ (macaque), కుకాటీస్ (cookatees), ఇంకా ఇతర లవ్‌బర్డ్సు ఉన్నాయి. వీటితోబాటు భారతదేశపు చిలుకలు కూడా ఉన్నాయి.

జంతు ప్రదర్శనశాలలో పావురాలు, గువ్వపిట్టలు, వేటాడబడే పక్షులు కూడా ఉన్నాయి. **వీటితో** గ్రేట్ హారన్ బిల్సు, వైయిట్ హారన్ బిల్సు, గ్రేహారన్ బిల్సు, తగు **సంఖ్యలో ఉన్నాయి. మునియాలు, ఫిమిషెస్, బన్‌టెన్‌జిలు అనేక రకాలు** ఉన్నాయి.

**సరీసృపాలు** (Reptiles) : 100 కిలోగ్రాముల బరువున్న ఒక జత పెద్ద తాబేళ్ళు; ఇంకా నక్షత్ర తాబేళ్ళు, మంచినీటి తాబేళ్ళు, సందర్శకులను పరామర్శిస్తాయి. వీటితో పాటు వాటి దగ్గర బంధువులు ఘరియాల్స్, మగ్గర్స్, నదీ ముఖ ద్వారాల్లో ఉండే మొసళ్ళు కూడా ఉన్నాయి. ఇవన్నీ బహిరంగంగా ఉండే కొలనులో ఉన్నాయి. రాక్షసి బల్లులు (Monitor lizards) ఊసరవెల్లులతో**పాటు** (Chemilions) బహిరంగంగా ఉన్న **ఆవరణలో** సహజీవనం చేస్తాయి. పడగతోఉన్న భారతదేశపు త్రాచుపాము, అందమైన రసెల్స్‌వైపర్, కొండ

చిలువలు (Rock pythans) బహిరంగంగా ఉండే ఆవరణలో ఉన్నాయి. కీల్‌బాక్స్, పసిరికపాములు (tree snakes) కూడా ఉన్నాయి:

ప్రత్యేకతలు (Specialities)

(ఎ) **సింహాల సఫారి పార్కు :** ఈ జంతు ప్రదర్శనశాలకు అనేక ఆధిక్యతలు, అగ్రశ్రేణి అంశాలు ఉన్నాయి. భారతదేశంలోనే మొట్టమొదటి సింహాల సఫారిపార్కు 1974 లో ఏర్పరిచారు. తరవాత మహారాష్ట్ర, కర్ణాటక, పంజాబ్, ఒరిస్సా వంటి ఇతర రాష్ట్రాలలో దీనిని అనుకరించారు. ఇదే మాదిరిగా మొట్టమొదటిసారిగా దేశంలోనే ప్రాచీన చారిత్రక జంతువుల పార్కును ఏర్పరిచిన ఖ్యాతి నెహ్రూ జంతు ప్రదర్శనశాలకే దక్కింది.

(బి) **నిశాచరాల నివాసం** (Nocturnal animal House) : రాత్రిపూట చురుకుగా పరిసరాల్లో సంచరిస్తూ తవ్వటం, బొరియలు చేయటం వంటి దినచర్యను ఆహారాన్వేషణకు సాగిస్తూ పగటిపూట వాటి బొరియల్లోనో లేదా గూళ్ళలోనే నిద్రించే జంతువులను నిశాచరాలు (Nocturnal animals) అంటారు. ఇటువంటి జంతువులను పగటిపూట సందర్శకుల కోసం మామూలు ఆవరణల్లోనో లేదా పంజరాల్లోనో ఉంచితే ఆకర్షణీయంగా ఉండవు. ఎందువల్ల అంటే అవి పగటిపూట ముడుచుకొని ఏ మూలో పడుకొని ఉంటాయి. సందర్శకులకోసం పగటిపూట కూడా చురుకుగా ఉండేటట్లు, వాటికి రాత్రి అనే భావం కలిగించేటందుకు మెలకువ - నిద్ర చక్రాన్ని వ్యుత్క్రమం చేస్తారు. దీనివల్ల రాత్రులందు వాటికి ఉండే వ్యాసక్తులను ప్రేరేపిస్తాయి. ఈ సందర్భంలో రోజులో కాలాన్ని క్రమంగా మార్చేట్టు ప్రత్యేకమైన ఏర్పాట్లను చేస్తారు. అంటే పగటి వెలుతురు నుంచి చీకటికి, అసుర సంధ్య నుంచి ప్రాతఃకాలానికి మార్పులు కృత్రిమంగా కలిగిస్తారు. దీనివల్ల ఆ జంతువులు వాటి నిత్య జీవనాన్ని జీవ-ఆవృతాన్ని (Bio-rhythm)నికి మార్చుకొనే విధంగా అలవాటు చేస్తారు. సందర్శకులు ఒక గుహలోనుంచి వెడుతున్నామనే భావం కలిగించే విధంగానూ దానిలో నుంచి వెడుతూ ఆ జంతువుల నిశాచర అలవాట్లను పరిశీలించడానికి వీలుగా నవీనపద్ధతిలో ఒక గుహను నిర్మించడానికి ప్రతిపాదనలు ఉన్నాయి. దీనివల్ల వెన్నెలలో మెరిసిపోయే జంతు ప్రదర్శనశాలలకు భంగం వాటిల్లదు.

ప్రదర్శనకోసం ప్రతిపాదించిన నిశాచరాలను కింద పట్టికలో చూడవచ్చు.

1. స్లెండర్‌లోరిస్ (Slender loris)
2. స్లోలోరిస్ (Slow loris)
3. ముళ్లపందులు (Porcupines)
4. పునుగుపిల్లి (Civet cat)
5. గుడ్లగూబలు (Owles)
6. రాటిల్ (Ratel)
7. హెడ్జ్‌హాగ్స్ (Hedge Hogs)
8. నైట్‌జార్స్ (Night jars)
9. మౌస్‌డీర్ (Mouse deer)
10. అడవి పిల్లి (Jungle cat)
11. లియోపార్డ్‌కేట్ (Leopard cat)
12. అనేక రకాల ఎలుకలు

ఈ ప్రాజెక్టు ఆసియాలోనే మొట్టమొదటిది. ఆంధ్రప్రదేశ్‌లోని నెహ్రూ జంతు ప్రదర్శనశాలకు అత్యధికమైన ఖ్యాతిని చేకూరుస్తుంది.

ఇందుకు 1977-78లో ఆరంభం జరిగింది. నిశాచరనివాసం నిర్మాణానికి ప్రణాళికలు తయారు చేశారు. ఇందుకుగాను 12 లక్షల రూపాయలు వ్యయం అవుతుంది. ఈ నిర్మాణాన్ని నాలుగు దశల్లో చేపట్టడానికి ప్రతిపాదించారు. పని 1987లో పూర్తి అయింది. సందర్శకులకోసం 7.10.87న గౌరవనీయులైన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గారు ప్రారంభోత్సవం చేశారు.

(సి) **పెద్దపులుల సఫారీపార్కు** (Tiger safari park):

మనదేశంలోనే మొదటి పెద్దపులుల సఫారీపార్కును 17.4 హెక్టేర్ల ప్రదేశంలో 26 లక్షల రూపాయల వ్యయంతో ఏర్పరిచారు.

గౌరవనీయులైన ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గారు ఈ పార్కుకు 27.6. 83న ప్రారంభోత్సవం చేశారు. మూడుపులులను దీనిలో ప్రవేశపెట్టారు. ఈ పెద్దపులుల సఫారీపార్కులో చక్కగా రోడ్లు వేశారు. సందర్శకులు వాహనాల్లో వెళ్ళి ఈ పులులను వాటి సహజ పరిస్థితుల్లో చూడవచ్చు.

(డి) **సరీసృపాల నివాసగృహం** (Reptile House) : జంతు ప్రదర్శనశాల రంగలో అగ్రస్థానాన్ని నిలుపుకుంటూ ఉంది. దీనిలో త్వరలోనే 10 లక్షల రూపాయల అంచనా వేసిన వ్యయంతో అధునాతన సరీసృపాల నివాసగృహం ఏర్పాటు చేయనున్నారు. ఈ ప్రాజెక్టు కూడా ఇంచుమించు పూర్తికావొచ్చింది. త్వరలోనే దీన్నికూడా సందర్శకులు చూడటానికి అనుమతిస్తారు. దీనిలో అనేక రకాల పాములు, తొండలు (Lizards), తాబేళ్ళను ప్రదర్శనకోసం ఉంచుతారు. వీటిని సందర్శకులు దగ్గరగా చూడటమేకాక, వాటి అలవాట్లను, సహజ నివాసాన్ని కూడా అధ్యయనం చేయవచ్చు.

**ప్రజనన కార్యక్రమం (Breeding Programme) :**

వన్యమృగ సంరక్షణ లక్ష్యాలకు అనుగుణంగా నెహ్రూ జంతు ప్రదర్శనశాల కొన్ని జంతువులను ప్రజననం చేసింది. విదేశాల నుంచి వచ్చినవీ, దేశీయమైనవీ అయిన జంతువులు, పక్షులు ఉన్నాయి. వీటిలో చెప్పదగినవి భారతదేశ ఖడ్గమృగం, ఆసియాదేశపు సింహం, పెద్దపులి, చిరుతపులి (Panther), జిరాఫీ, గార్ (Gaur) భారతదేశ గౌర్ మొదలైనవి. నిజానికి ప్రజననరేటు ఎంత ఎక్కువగా ఉంది అంటే అధికంగా ఉన్న లేళ్ళను, దుప్పులను వివిధ పార్కులలోను, అభయారణ్యాల్లోను (Sanctuaries) తిరిగి ప్రవేశ పెట్టవలసి వచ్చింది. జంతుప్రదర్శనశాల చేపట్టిన మొసళ్ళ పునరావాస కార్యక్రమాన్ని ఇక్కడ పేర్కొనవచ్చు. ఈ ప్రదర్శనశాలలో సుమారు ఇంతవరకు ప్రవర్ధనం చేసిన మగ్గర్ మొసళ్ళను (Muggar Crocodiles) మన రాష్ట్రంలోనే తిరిగి అటవికదశలో తిరిగి ప్రవేశింపచేశారు.

**ఆర్థిక విషయాలు** (Financial aspects) : ఈ పార్కు ఏర్పరచటానికి మార్చి 1987 చివరనాటికి పునరావృతం కానిఖర్చు రు. 1,53,34,938=00గా తేలింది.

ఈ పార్కును నిర్వహించటానికి సాలీనా 60 లక్షల రూపాయలు అవసరం. దీనిలో సుమారు 47 లక్షలు సిబ్బంది జీతాలకు వ్యయం అవుతుంది. 12 లక్షలు జంతువులను మేపటానికి, 3 లక్షలు నిర్వహణకు, 2 లక్షలు వాహనాలు నడపటానికి, మిగిలినది ప్రణాళికా పథకంలో అభివృద్ధి కార్యక్రమాలకు వ్యయం అవుతుంది.

**ఆదాయం** (Revenue) : ప్రదర్శకుల కోసం ఈ పార్కును 1963లో ప్రారంభించారు. సాలీనా కొన్నివేల సందర్శకుల నుంచి క్రమంగా పెరుగుతూ ఇది జంట నగరాల్లోని ప్రజలకు ఒక ప్రముఖ ఆకర్షణ అయింది. ప్రస్తుతం సాలీనా 15,00,000 సందర్శకులు వస్తున్నారు. సగటున సాలీనా ఈ పార్కుకు 15 లక్షల రూపాయలు ఆదాయం వస్తూ ఉంది.

**సిబ్బంది నమూనా** (Staff pattern):

ఈ పార్కును డిప్యూటీ కన్సర్వేటర్ ఆఫ్ ఫారెస్ట్స్, నిర్వహిస్తారు. వీరికి సహాయకులు A.C.F., ఇద్దరు రేంజి ఆఫీసర్లు ఉంటారు. 89 జూ అసిస్టెంటులు 125 మాలీలు, 44 కాపలాదారులు ఉంటున్నారు. ఎటెండెంట్‌లు, కాపలాదారులు మూడు షిఫ్ట్‌ల్లో రాత్రింబవళ్ళు పనిచేస్తారు. ఈ కాడర్‌లపై పర్యవేక్షక సిబ్బంది ఉండి, నిత్యం జరిగే పనిని పర్యవేక్షిస్తారు. పశువైద్య విభాగంలో ముగ్గురు వైద్యులు, వారి సహాయకులతో పనిచేస్తూ ఉంటారు.

## II.ఇందిరాగాంధీ జంతు ప్రదర్శనశాల: విశాఖపట్నం

బంగాళాఖాతం ఒడ్డున పారిశ్రామికంగా త్వరిత గతిన అభివృద్ధి చెందుతున్న విశాఖపట్నంలో, ఆధునిక జంతు ప్రదర్శనశాల ప్రాంతం ఉంది. ప్రపంచంలోని కొన్ని ఉత్తమ జంతు ప్రదర్శనశాలలతో దీనిని సరి పోల్చవచ్చు. ఇది బంగాళాఖాతంలోకి జారుతున్నట్లుగా ఉండే, కొండల మధ్యలో ఆకర్షణీయమైన ప్రాంతంలో ఉంది. 250 హెక్టార్ల ప్రాంతం ఇది. దీనిని ఆగస్టు 15, 1972లో ప్రారంభించారు. తక్కువ వ్యవధిలోనే, సంవత్సరం పొడవునా, పెద్ద

సంఖ్యలో, సందర్శకులను ఆకర్షిస్తూనే ఉంది. లే అవుట్‌పని, ఎన్‌క్లోజర్ల నిర్మాణం, ప్రకృతి దృశ్యాలను తీర్చిదిద్దేపని సాగుతూంది.

ప్రస్తుతం ఈ జంతుప్రదర్శనశాలలో 70 జాతులపైగా జంతువులున్నాయి. పులులు, ఆఫ్రికన్ సింహాలు, చిరుతపులులు, హైనాలు, నక్కలు, అడవి పిల్లులు, పామ్ సివెట్, స్లోత్ ఎలుగుబంటి, హిమాలయన్ ఎలుగుబంటి, రాటిల్, మచ్చల జింక, సాంబార్, బార్కింగ్ జింక, బ్లాక్‌బక్, నీల్‌గై, గౌర్ (ఇండియన్ అడవిదున్న), వన్య ప్రాంతపు ఎలుగుబంటి, ఏనుగులు, రీసస్ కోతులు, బొనెట్ కోతులు, కురచని తోక కోతులు, ఆలివ్ బబూన్‌లు, లాంగూర్, భారతదేశపు పెద్ద ఉడతలు, ముళ్ళపందులు, భారతదేశపు కుందేళ్ళు, చెవులపిల్లులు, గిన్నీ పందులు, తెల్ల ఎలుకలు, రోజీ పెలికాన్‌లు, పెయింటెడ్ స్టార్క్‌లు, ఎడ్జవెంట్ స్టార్క్‌లు, తెల్లని రొమ్ముగల నీటికోళ్ళు, ఎర్రని అడవి కోళ్ళు, అడవి కౌజు పిట్టలు (Quails), పీ కోళ్ళు (Pea Fowls), కాలిజ్, రింగ్ నెకడ్ గోల్డెన్, సిల్వర్ ఫిజంట్‌లు, కొండప్రాంతపు హైనాలు, బ్లాక్ హెడెడ్ మునియాలు, రెడ్ టర్టిల్ పావురాళ్ళు, మచ్చలున్న పావురాళ్ళు, పారాకీట్‌లు, మొదలైన 500స్పెసిమన్లు ఇందులో ఉన్నాయి.

**ఎన్‌క్లోజర్‌లు :**

మొదట అనుకున్న మొత్తం 1.4 కోట్ల వ్యయంలో, నిధుల సౌలభ్యతనుబట్టి, ప్రతి సంవత్సరం కొన్ని పనులు చేపట్టి పూర్తి చేస్తున్నారు. ఆధునిక పద్ధతులను ప్రవేశపెడుతూ, చుట్టూ ఎగుడు దిగుడుగా ఉన్న ప్రకృతి దృశ్యాలతో కలిసి పోయేటట్లుగా, ప్రకృతి సిద్ధంగా ఉండే "మాంసాహార జంతువుల ఎన్‌క్లోజర్‌లు (moated enclosures) నిర్మించాలను కుంటున్నారు. ప్రహరీగోడలో ఎక్కువ భాగం, క్షీరదాలను, పక్షులను దగ్గరగా గమనించడానికి వీలయ్యే అనేక ఎన్‌క్లోజర్‌లు, ఆరు జింకల ఎన్‌క్లోజర్‌లు, ఏడు చిన్న క్షీరదాల ఎన్‌క్లోజర్‌లు, ఐదు కోతుల ఎన్‌క్లోజర్‌లు, చిరుతపులికోసం ఎన్‌క్లోజర్, సింహాలు, చిరుతపులులు, ఎలుగు బంటులు, కోతులు మొదలగు వాటిని దగ్గరగా చూడటానికి వీలయ్యే బోనుల నిర్మాణం వంటి పనులు జరుగుతూనే ఉన్నాయి. నీటి రిజర్వాయరు, నీటి పక్షులకోసం నీటి మడుగులు, ఒక వృత్తాకారపు రోడ్డు (ring road) కూడా పూర్తయ్యాయి. పెద్దపులులు, సింహాలు, రైనోసిరాస్‌లు, ఎలుగుబంట్లు, ఏనుగులు, హిమాలయన్ నల్లని ఎలుగుబంట్లు, హిప్పో-పోటమస్‌లు, బబూన్లు, అంగ్యులేట్‌లు, పక్షుల కోసం నిర్మించిన ఎన్‌క్లోజర్‌లతోపాటుగా ఒక "జింకల సఫారీ-పార్కు" (Deer safari park) కూడా ఈ సంవత్సరంలో పూర్తి అవుతుంది.

**నడుస్తూ చూసే ఖగశాల (Walk through Aviary)**

అదనంగా చేర్చిన ప్రత్యేకమైన అంశం ఏమిటంటే ఇరుకుగా, లోతుగా ఉండే త్రోవలో, నడుస్తూ, ఖగశాల (పక్షులుండే చోటు - Avairy) ను తిలకించటం. సందర్శకులు ఇరుకుగా ఉండే సొరంగంలాంటి (tunnel-like) దారిగుండా ప్రవేశిస్తారు. ఈ ఖగశాల 15 మీటర్ల ఎత్తుండి, లోపలి విస్తీర్ణం 400 చ.మీ. ఉంది. కొండప్రాంతపు మైనాలు, ఆకుపచ్చని పావురాళ్ళు, రూఫిస్, టర్టిల్ పావురం మొదలగు తూర్పుకనుమల నుండి సేకరించిన పక్షులు, ఆంధ్ర విశ్వవిద్యాలయంలో "తూర్పు కనుమల గురించిన గోష్ఠి జరిగిన సందర్భంగా ఉగాదిరోజున 1982, మార్చి 26వతేదీన, ప్రఖ్యాత పక్షిశాస్త్రవేత్త (Ornithologist) డాక్టర్ సలీమ్ ఆలీ గారు ప్రారంభించారు. ఇపుడు ఉన్నదానికి దగ్గరలో రెండవ "నడుస్తూ చూసే ఖగశాల" (Walk through Aviary) పూర్తి కావొస్తూంది. దీనిలో నీటి పక్షులైన పెలికాన్‌లు, ఫ్లామింగోలు, బాతులు, స్టార్క్‌లు ఉంటాయి.

**మైరైన్ లాండ్ కాంప్లెక్స్ :**

బంగాళాఖాతం ఒడ్డున ఒక "మైరైన్ లాండ్ కాంప్లెక్స్"ను నిర్మించాలని తలపెట్టారు. ఇది సముద్ర తీరాన 48.60 హెక్టేర్ల స్థలంలో, బంగాళాఖాతానికి సంబంధించిన సముద్ర జంతుజాలమైన డాల్ఫిన్‌లు, డ్యూగాంగ్‌లు, సముద్రపు తాబేళ్ళు మొదలైన వాటిని ప్రదర్శిస్తుంది. అపాయకరమైన స్థితిలో ఉన్న జాతులకోసం, ప్రకృతి సిద్ధమైన ఎన్‌క్లోజర్‌లను అమర్చాలనే ప్రణాళిక కూడా ఉంది. ఈ పథకానికి సంబంధించిన పని త్వరితంగా

జరుగుతోంది. ఈ పథకం వివరాలు కింది విధంగా ఉన్నాయి.

మానవుని క్రియాశీలత పెరిగి, తద్వారా దేశంలోని తీరరేఖ ప్రాంతానికి సంభవిస్తున్న కాలుష్యం (pollution) వల్ల అపాయకరమైన పరిస్థితిలో ఉన్న సముద్ర జంతుజాలాన్ని సంరక్షించడం చాలా ముఖ్యమైన విషయంగా మారింది. భారతదేశంలో ఆంధ్రప్రదేశ్‌కు పొడవయిన తీర ప్రాంతం ఉంది. బంగాళాఖాతంలో వివిధ రకాల సముద్ర జంతుజాలం - డాల్ఫిన్‌లు, డ్యూగాంగ్‌లు, తాబేళ్ళు ఇంకా పక్షిజాతులు కూడా ఉన్నాయి. మానవుడు విచక్షణా రహితంగా స్వలాభంకోసం వినియోగించుకోవడం వల్లగాని లేదా అపాయకరమైన స్థితిలో ఉన్న సముద్ర జంతుజాలాల ఆవాసాలను (Habitats) నాశనం చేయడం వల్లగాని ఆవరణ సంబంధమైన అసమానతలు సంభవిస్తున్నాయి. సరైన సమయంలో వీటిని అరికట్టకపోతే, ఆ జాతులు పూర్తిగా నాశనమయ్యే ప్రమాదం ఉంది. భారతదేశపు చిరుతపులి, పాసింజర్ పావురం, డోడ్ మొదలైన జాతులు పూర్తిగా అంతర్థానమవడం అనేది - మానవుని విచక్షణా రహితమైన స్వలాభాపేక్షకు నిదర్శనం. సముద్ర జంతుజాలంలో ఎక్కువగా వాటి మాంసం కోసం గాని, చర్మాలకోసం గాని లేదా రెండింటి కోసంగాని వేటాడబడే జాతుల్లో ముఖ్యమైనవి - తాబేళ్ళు, ఉప్పునీటి మొసళ్ళు, డ్యూగాంగ్‌లు, డాల్ఫిన్‌లు మొదలైనవి.

అపాయకరమైన స్థితిలో ఉన్న సముద్ర జంతుజాలం సంరక్షణార్థం, ఆంధ్రప్రదేశ్ అటవీశాఖ, విశాఖపట్నం దగ్గర ఒక ఆధునికమైన "మెరైన్ లాండ్ కాంప్లెక్స్"ను స్థాపిస్తోంది. దీని కోసం, దశలవారీగా ఖర్చుపెట్టడానికి 4కోట్ల రూపాయలు అవుతుందని అంచనా వేశారు. దీనిలో అపాయకరమైన స్థితిలో ఉన్న సముద్ర జంతువులను ప్రజననం (breeding) చేసి, తిరిగి వాటి సహజసిద్ధమైన పరిసరాలలోకి విడిచిపెడతారు.

ఈ కాంప్లెక్స్ ముఖ్యమైన లక్షణాలు ఏమిటంటే-

- డాల్ఫిన్‌లు, డ్యూగాంగ్‌లు వంటి సముద్ర జంతుజాలం, తెల్లని ఉదరంగల సముద్రపు గద్దలు, గల్స్, టెర్న్‌లు వంటి సముద్రతీరపు పక్షులు - వీటికి సంబంధించిన ప్రజనన సమూహాలను ఏర్పరచటం.
- వివిధ జాతులలో ప్రజననాన్ని ప్రేరేపించే సహజసిద్ధమైన, విశాలమైన ఎన్‌క్లోజర్‌లను ఏర్పాటు చేయటం.
- సముద్ర జంతుజాలానికి సంబంధించిన చిన్నవాటిని పెంచి, సరైన వయసురాగానే వాటిని సహజ ఆవాసాలలో వదలివేయటం.
- ఎక్కువ అపాయకరమైనస్థితిలో ఉన్న జాతులైన ఉప్పునీటిలో పెరిగే మొసళ్ళు, ఆలివ్ రిడ్లే, ఆకుపచ్చ తాబేళ్ళు, హాక్స్‌బిల్ వంటి సముద్రపు తాబేళ్ళల్లోని వివిధ జాతులు వంటి సముద్రపు సరీసృపాల (reptiles) కోసం ప్రజనన ఎన్‌క్లోజర్‌లను ఏర్పాటుచేయటం.
- చేపలు, స్పాంజిలు, సీలెంటిరేటాలు, ఆర్థోపొడాలు, సముద్రపు అరిచ్ఛిన్న మొలస్కాలు మొదలగు జాతులను అందంగా ప్రదర్శించటానికి ఆధునాతనమైన ఆక్వేరియమ్‌లను ఏర్పాటు చేయటం. సముద్రపు నీటి అడుగున ప్రకృతి సిద్ధంగా ఏర్పరిచిన ఎన్‌క్లోజర్‌లగుండా నడుస్తూ, సందర్శకులు సముద్ర ప్రపంచాన్ని తిలకించగలరు.
- విద్యావిషయిక కార్యక్రమాలను చేపట్టి, సందర్శకులకే కాకుండా, సముద్ర జీవశాస్త్రం విద్యార్థులకు, పరిశోధకులకు కూడా అధ్యయనానికి వీలయ్యే అవకాశాలు కల్పించటం.
- శరీర ధర్మశాస్త్రం, ఆవరణశాస్త్రం, జాతుల ప్రజనన సమస్యలకు సంబంధించిన పరిశోధన కార్యక్రమాలను చేపట్టడం.

***

# ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థికపురోభివృద్ధి

డా. దివాకర్
అర్థశాస్త్ర విభాగం,
హైదరాబాదు విశ్వవిద్యాలయం,
హైదరాబాదు.

ఒక దేశ ఆర్థిక పురోభివృద్ధిని సూచించే అంశాలుచాలా ఉంటాయి. వాటిలో అతి ముఖ్యమైనవి-నిజ జాతీయాదాయము, తలసరి నిజ ఆదాయము, పారిశ్రామిక ఉత్పత్తి, వ్యవసాయక ఉత్పత్తి, అవస్థాపనలో మార్పులు, సాంఘిక సంక్షేమము తీరుతెన్నులు మొదలగునవి. భారతదేశంలో నున్న పెద్ద రాష్ట్రాలలో ఆంధ్రప్రదేశ్ ఒకటి. ఈ రాష్ట్రంలో ఆర్థిక పురోభివృద్ధికి సంబంధించిన కొన్ని అంశాలను పరిశీలిద్దాం.

మొట్టమొదట నిజ జాతీయాదాయము, తలసరి ఆదాయములో వచ్చిన మార్పులను తెలుసుకుందాం. 1970–71 నుండి 1984–85 వరకు రాష్ట్ర నికర ఆదాయము ఏ విధముగా వృద్ధి చెందినదీ ఈ దిగువ పట్టికలో చూపినాము.

పట్టిక –1

| సంవత్సరం | నికరఆదాయము(రూ.కోట్లు) | | తలసరిఆదాయము(రు.కోట్లు) | |
|---|---|---|---|---|
| | (ప్రస్తుత ధరలలో) | 1970–71 ధరలలో | ప్రస్తుత ధరలలో | 1970–71 ధరలలో |
| 1970–71 | 2522.77 | 2522.77 | 585 | 585 |
| 1971–72 | 2758.00 | 2600.20 | 628 | 592 |
| 1972–73 | 2947.92 | 2396.63 | 657 | 534 |
| 1973–74 | 3926.04 | 2859.60 | 857 | 624 |
| 1974–75 | 4722.18 | 2934.67 | 1010 | 628 |
| 1975–76 | 4217.96 | 2986.96 | 883 | 625 |
| 1976–77 | 4275.55 | 2713.93 | 877 | 557 |
| 1977–78 | 4993.98 | 3066.82 | 1003 | 616 |
| 1978–79 | 5511.11 | 3352.67 | 1083 | 659 |
| 1979–80 | 6127.56 | 3279.82 | 1179 | 631 |
| 1980–81 | 7209–31 | 3432.17 | 1358 | 647 |
| 1981–82 | 8997.86 | 3907.24 | 1659 | 721 |
| 1982–83 | 9463.00 | 3935.10 | 1708 | 710 |
| 1983–84 | 11060.90 | 4200.64 | 1955 | 743 |
| 1984–85 | 11082.66 | 3991.34 | 1916 | 691 |

తొలిఅంచనాల ప్రకారం

Source: A.P. Govt. 'Statistical Abstract'

ప్రస్తుత ధరలలో చూపిన ఆదాయానికి 1970–71 ధరలలో చూపిన ఆదాయానికి గల మధ్య తేడా ద్రవ్యోల్బణం వల్ల వచ్చిందని గ్రహించాలి. 1970–71 కోట్లు కాగా 1984–85లో అది రూ. 3991.84 కోట్లకు పెరిగింది. ఈ పెరుగుదల సాలీనా 3.59 శాతం కాంపౌండ్ వృద్ధి రేటును సూచిస్తుంది. కాని ప్రస్తుత ధరలలో గణించబడిన అంకెల ప్రకారం 1970–71లో రాష్ట్ర ఆదాయము రూ.2522.7 కోట్లు కాగా 1984–85 లో ఈ ఆదాయం రూ,11802.66 కోట్లుకు పెరిగింది. ఈ పెరుగుదల సాలీనా సుమారు 12.5 శాతం కాంపౌండు వృద్ధి రేటును సూచిస్తుంది. కనుక 1970–71 నుండి 1984–85 మధ్యకాలంలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో సాలీనా సగటు ద్రవ్యోల్బణం రేటు (Inflation rate) 7.46 శాతం ఉంది. ఆర్థిక వృద్ధిని తెలుసుకోడానికి ద్రవ్యోల్బణం రహిత రేటును మాత్రమే తీసుకోవాలి. కనుక 3.59 శాతం సాలీనా వృద్ధిరేటు సాధించబడిందని తెలుస్తోంది. తలసరి ఆదాయము పెరుగుదల 1970–70 ధరలలో రు. 585 నుండి రూ. 691 వరకు ఉంది. ప్రస్తుత ధరలలో రు.585 నుండి రు. 1918 వరకు పెరిగింది. ఈ పెరుగుదల సూచికలను బట్టి ఆంధ్రప్రదేశ్ గణనీయమైన . ఆర్థికాభివృద్ధిని సాధించినట్లు తోస్తుంది. కాని భారతదేశం సగటు వివరాలతో పోల్చినచో ఈ రాష్ట్రం ఇంకా ఎంతో కృషి చేయవలసి ఉంది. ఉదాహరణకు 1970–71లో భారతదేశ సగటు తలసరి ఆదాయము రు. 632.8 కాగా ఆంధ్రప్రదేశ్ తలసరి ఆదాయము రూ. 585 మాత్రమే ఉంది. అదే విధముగా 1984–85లో భారతదేశ తలసరి ఆదాయము (1970–71 ధరలతో) రూ.771.5 కాగా ఆంధ్రప్రదేశ్ తలసరి ఆదాయము రు. 691 మాత్రమే ఉంది. కనుక ఈ రాష్ట్రం దేశ సగటు అభివృద్ధి స్థాయిని ఇంకా అందుకోలేదని విశదమౌతుంది.

రాష్ట్ర నికర ఆదాయం పెరుగుదల తీరుతెన్నులను వివిధ రంగాలలో సాధించిన అభివృద్ధిని బట్టి కూడా పరిశీలించవచ్చు. ఆ వివరాలను పట్టిక-2 లో చూపినాము.

ప్రాథమిక రంగంలో సాధించిన వృద్ధి రేటు మిగిలిన రంగాలతో పోల్చి చూస్తే, (1.51 శాతం) అత్యల్పంగా ఉన్నది. సేవల రంగం, ఆధునిక రంగాలలో వృద్ధి రేటు (5.81 శాతం, 5.61 శాతం వరసగా) అత్యధికంగా ఉన్నది. ప్రభుత్వ యంత్రాంగం ఖర్చు పెద్ద యెత్తున పెరుగుచుండటం వల్ల సేవల రంగం అత్యధిక రేటులో వృద్ధి చెందింది. పై పట్టికలో చూపిన వివరాల ప్రకారం ప్రాథమిక రంగం 1970–71 లో మొత్తం రాష్ట్ర ఆదాయంలో 57.2 శాతం ఉండేది. కాని 1984–85 నాటికి ఈ శాతం 43.9 శాతం తగ్గింది. అభివృద్ధి చెందుతున్నప్పుడు ప్రాథమిక రంగం వాటా క్రమేణా తగ్గడం, ఇతర రంగాల శాతం ఎక్కువగుట సాధారణంగా జరుగుతుంది. పోతే

(1970–71 ధరలలో) కోట్లరు.లలో — పట్టిక – 2

| వ.సం | వివరాలు | 1970–71 | 1980–81 | 1984–85 | సాలీనా కాంపౌండ్‌వృద్ధిరేటు |
|---|---|---|---|---|---|
| 1. | ప్రాథమికరంగం | 1442.23 (57.20) | 1654.59 (48.21) | 1753.76 (43.90) | 1.51 |
| 2. | ఆధునికరంగం | 338.82 (13.40) | 557.16 (16.23) | 690.18 (17.30) | 5.61 |
| 3. | సేవలు,ఇతరములు | 741.72 (29.40) | 1220.42 (35.56) | 1547.90 (38.80) | 5.81 |
| | మొత్తం | 2522.77 (100.0) | 3432.17 (100.0) | 3991.84 (100.0) | 3.59 |

Source: A.P.Govt. 'Statistical Abstract' Various volumes

* (బ్రాకెట్లలో నున్న అంకెలు వాటి శాతాన్ని తెలియచేస్తాయి)

వ్యవసాయ రంగంలో సాధించిన ప్రగతి ఏ విధంగా ఉంది? ఈ రాష్ట్రంలో సుమారు 101.29 లక్షల హెక్టార్లలలో ఆహారపు పంటలు, మిగిలిన విస్తీర్ణంలో ఆహారేతర పంటలను పండించుచున్నారు. సుమారు 12 మిలియన్ టన్నుల ఆహార ధాన్యాల ఉత్పత్తి కాబడుతుంది. 1970–71 సంవత్సరాన్ని ప్రాతిపదికగా తీసుకొంటే 1983–84 లో వ్యవసాయక ఉత్పత్తి సూచీ సంఖ్య 182.3 ఉత్పాదకత సూచీసంఖ్య సుమారు 152 కలదు. కనుక ఈ రాష్ట్రంలో వ్యవసాయ రంగం సంతృప్తికరంగానే వృద్ధి చెందిందని భావించవచ్చు. అయితే రాష్ట్రంలో వ్యవసాయ వస్తూత్పత్తి పెరిగి నప్పటికీ సాపేక్ష దృష్టితో పరిశీలించినచో అభివృద్ధి అనుకున్నంతగా లేదనే చెప్పాలి. ఇటీవల ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రకటించిన కొన్ని వివరాలను బట్టి రాష్ట్రంలో సాగైన విస్తీర్ణం 1978–79 నుండి క్షీణించడం ప్రారంభించింది. ఉదాహరణకు 1978–79లో నికర సాగుభూమి 113.49 లక్షల హెక్టార్లు కాగా 1985–86 లో అది 104.3 లక్షల హెక్టార్లకు దిగజారిపోయింది. అదే విధంగా రాష్ట్రంలో నీటిపారుదల క్రింద నున్న విస్తీర్ణం (Irrigation)1978–79లో 46.98 లక్షల హెక్టార్లు కాగా 1985–86లో అది 43.4 లక్షల హెక్టార్లకు పడిపోయింది. వ్యవసాయరంగంలో ఈ విధమైన ధోరణులకుగల కారకాలను అన్వేషించాల్సి ఉంది. సకాలంలో వర్షాలు లేకపోవుట, వ్యవసాయ ఉత్పత్తులకు ప్రోత్సాహకరమైన ధరలు లేకపోవుట, అవసరమగు అవస్థాపన లభ్యం కాకపోవుట మొదలగు అనేక కారణాలను ఈ సందర్భంగా పేర్కొనవచ్చు. సాగు విస్తీర్ణం క్షీణించకుండా దానిని వృద్ధి పరచడానికి తక్షణ చర్యలను ప్రభుత్వం చేపట్ట వలసి ఉంది.

వ్యవసాయ రంగం అభివృద్ధి చెందినచో పారిశ్రామిక రంగం కూడా అభివృద్ధి చెందగలదు. పారిశ్రామిక రంగం ఉత్పత్తి చేసిన వస్తువులకు తగినంత డిమాండ్ లభ్యం కావలెనంటే వ్యవసాయరంగంలో ఆదాయాలు పెరగవలసి ఉంటుంది. పంపిణీ దృష్ట్యా పరిశీలించినచో ఇతర రాష్ట్రాలలో వలె ఆంధ్రప్రదేశ్‌లో కూడా వ్యవసాయరంగంలోకొన్ని జిల్లాలలో సంభవించిన "హరితవిప్లవం" లాభాలు ఎక్కువగా పెద్ద భూస్వాములకు మాత్రమే పరిమితమై పోయింది. వ్యవసాయకంగా అభివృద్ధి చెందిన ఉభయ గోదావరి జిల్లాలలో వ్యవసాయ కూలీల సంఖ్య పెరగడం, దారిద్ర్య రేఖ కింద నున్న వారి సంఖ్య పెరగడం జరిగింది. వ్యవసాయ భూపంపిణీకి సంబంధించి కొన్ని మార్పులను తీసుకురావటానికి ఇటీవల ప్రభుత్వం యోచిస్తోంది.

ఇక ఆధునిక రంగం గూర్చి కొంత తెలుసుకొందాం. ఈ రంగంలో వృద్ధి రేటు (పట్టిక-2) సాలీన 5.81 శాతం ఉన్నది. కర్మాగారాల చట్టం క్రింద రిజిష్టరు కాబడిన ఫ్యాక్టరీల వస్తురాశి పెరుగుదల రేటు కంటే క్రమబద్ధం కాని ఫ్యాక్టరీల నుండి ఉత్పత్తి అయిన వస్తురాశి పెరుగుదల రేటు ఎక్కువ. రాష్ట్రంలో పారిశ్రామిక ఉత్పత్తిని తెలియచేయు సూచీ సంఖ్య 1986–87లో 307.5 పెరిగింది. పారిశ్రామిక అభివృద్ధిని తెలియచేయు సంకేతాలు చాలా ఉంటాయి. వాటిలో ముఖ్యమైనవి 1.ఫాక్టరీల సంఖ్య 2. ఫాక్టరీలలో ఉద్యోగిత 3. ఉత్పత్తి పరిమాణం 4. మూలధనరాశి, 5. వస్తురాశి విలువలో పెరుగుదల మొదలగునవి. (Valueadded). ఒక ప్రాంతంలో సాధించబడిన పారిశ్రామికాభివృద్ధిని తెలుసుకోడానికి సమగ్ర సూచికను నిర్మించుకోవలసి ఉంటుంది. (Compostie index). రాష్ట్రంలో సాధించబడిన పారిశ్రామికాభివృద్ధిని సమగ్ర సూచిక ద్వారా పరిశీలిస్తే హైదరాబాద్, రంగారెడ్డి, జిల్లాల వాటా 32 శాతం ఉంది. అంటే పారిశ్రామికాభివృద్ధిలో ప్రాంతీయ వ్యత్యాసాలు ఎక్కువగా ఉన్నట్లు తెలుస్తోంది. పోతే హైదరాబాద్, రంగారెడ్డి, జిల్లాలలో పారిశ్రామికాభివృద్ధి అధికంగా ఉన్నప్పటికీ మిగిలిన తెలంగాణా జిల్లాలలో పారిశ్రామికాభివృద్ధి చాలా తక్కువగా ఉంది. అదే విధంగా రాయలసీమ ప్రాంతంలో అనంతపురం, కడప జిల్లాలు, కోస్తా ఆంధ్రలో శ్రీకాకుళం జిల్లా పారిశ్రామికంగా వెనుకబడి ఉన్నాయి.

రాష్ట్ర ఆర్థిక పురోభివృద్ధిలో పారిశ్రామిక రంగానికి కీలకమైన పాత్ర ఉంది. అయితే పారిశ్రామికంగా ఒక ప్రాంతం వృద్ధి చెందాలంటే ఆ ప్రాంతంలో ముఖ్యమైన ముడిసరుకులు లభ్యం కావడంతో పాటు ఉత్పత్తి కాబడిన వస్తువులను సక్రమమైన ధరలకు

విక్రయించడానికి వీలుగా మార్కెట్ కూడా ఉండాలి. వస్తువులకున్న డిమాండ్ ప్రజలలో ఉన్న ఆదాయ పంపిణీని బట్టి ఉంటుంది. కనుక ఆదాయ పంపిణీలో ఎక్కువ అసమానతలున్నచో కొన్ని రకాలైన పారిశ్రామిక వస్తువులకు తగినంత డిమాండ్ ఉండక పోవచ్చు. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర వాణిజ్య తీరుతెన్నులను పరిశీలించినచో బియ్యం (ధాన్యం), సిమెంట్, బొగ్గు, కోక్, సున్నపురాయిలను ఈ రాష్ట్రం ఎగుమతి చేస్తుంది. ముఖ్యమైన దిగుమతులలో పప్పుదినుసులు, మాంగనీసు, ఇనుము, ఉక్కు ఉన్నాయి. ఈ రాష్ట్రంలో బొగ్గు, సున్నపురాయి, బాక్సైట్, లవణం, నిక్షేపాలు పుష్కలంగా ఉన్నట్లు శాస్త్రవేత్తలు కనుగొన్నారు. కనుక వాటిని ఉపయోగించే విధంగా తగు పరిశ్రమలను నెలకొల్పవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఇటీవల మన రాష్ట్రంలో కృష్ణా, గోదావరి ప్రాంతాలలో చమురు గ్యాస్ నిక్షేపాలున్నట్లు కనుగొన్నారు. కనుక పెట్రోలియంకు సంబంధించిన కొన్ని పరిశ్రమలు అభివృద్ధి చెందడానికి చాలా అవకాశం ఉంది. ఇటీవల కేంద్ర ప్రభుత్వం పారిశ్రామిక వృద్ధికై ప్రవేశపెట్టిన "సడలింపు" విధానం (Liberalisation process) రాష్ట్రంలో గల చిన్న మధ్యతరహా పరిశ్రమల వృద్ధిని ప్రోత్సహించవచ్చు.

ఇకపోతే సేవలరంగం గూర్చి తెలుసుకుందాం. ఈ రంగం సాలీనా 5.81 శాతం వృద్ధిరేటును సాధించింది. ఈ రంగంలో బాంకులు, రైల్వేలు, ప్రభుత్వ పరిపాలన, రవాణా మొదలగు భాగాలు చేరిఉన్నాయి. ప్రభుత్వ పరిపాలన యంత్రాంగం పెరిగినందువల్ల, బాంకుల వ్యవస్థ వృద్ధి చెందినందువల్ల ఈ రంగంలో వృద్ధిరేటు ఎక్కువగా కన్పిస్తోంది. రవాణా సదుపాయాలను ఎక్కువ చేయవలసిన అవసరం కలదు.

## ప్రణాళిక వ్యయంలో ప్రధానతలు

ప్రణాళిక వ్యయానికి ఉత్పత్తి పరిమాణానికి మౌలిక సంబంధం కలదు. వివిధ రంగాలలో ప్రభుత్వ పరంగా ఎంతెంత ప్రణాళిక వ్యయము కేటాయించబడిందో తెలుసుకోవడం ముఖ్యం. 10 సంవత్సరాల వ్యవధిని రెండు దశలుగా విభజించి ఈ ధోరణులను ఈ దిగువ పట్టికలో చూపినాము. 1978-79 నుండి 1982-83 (5 సంవత్సరాలు)లో కేటాయించబడిన ప్రభుత్వ ప్రణాళిక వ్యయాన్ని 1982-83 నుండి 1987-88 (5 సంవత్సరాలు) వ్యయంతో పోల్చడం జరిగింది. (పట్టిక-3).

1978-79 నుండి 1982-83 లో వ్యవసాయ రంగానికి చేసిన ప్రభుత్వ ప్రణాళిక వ్యయం రు.9039.87 కోట్లు. 1983-84 నుండి 1987-88లో ఈ వ్యయం రు.21173.08 కోట్లకు పెరిగింది. అంటే 134.2 శాతం ఎక్కువ. మొత్తం ప్రణాళిక వ్యయంలో వ్యవసాయ రంగానికి కేటాయించిన వ్యయం 3.7 శాతం నుండి 4.3 శాతంకు పెరిగింది. అదేవిధంగా గ్రామీణాభివృద్ధికి చేసిన వ్యయం ప్రణాళిక మొత్తం వ్యయంలో 1978-79 నుండి 1982-83 లో 4.6 శాతం ఉంది. ఈ వ్యయం 1983-84 నుండి 1987-88 కాలంలో 7.6 శాతంకు పెరిగింది. పోతే నీటి పారుదల విద్యుచ్ఛక్తి రంగాలలో ఈ రెండు కాలవ్యవధుల్లో చేసిన వ్యయంలో చాలా తేడా కన్పిస్తుంది. 1978-79 నుండి 1982-83 లో నీటిపారుదలకై చేసిన వ్యయంలో చాలా తేడా కన్పిస్తుంది. 1978-79 నుండి 1982-83 లో నీటిపారుదలకై చేసిన వ్యయం రూ. 76155.74 కోట్లు. మొత్తం ప్రణాళికా వ్యయంతో ఇది 31.2 శాతం అవుతుంది. ఈ వ్యయం 1983-84 నుండి 1987-88 లోరు. 123337.25 కోట్లకు పెరిగింది. కాని మొత్తం ప్రణాళిక వ్యయంలో ఒక శాతంగా తీసుకొంటే ఈ వ్యయం 24.8 శాతం మాత్రమే ఉంది. అదే విధంగా 1978 -79 నుండి 1982-83లో మొత్తం ప్రణాళికవ్యయంలో విద్యుచ్ఛక్తి రంగానికి గల వాటా 30.4 శాతం ఉండగా ఆ శాతం 1983-84 నుండి 1987-88 లో 17.0 శాతానికి దిగజారిపోయింది. (పట్టికలో 4,5 గళ్ళు) కాని సాంఘిక సేవలకై చేసిన వ్యయం 1983-84 నుండి 1987-88 కాలంలో గణనీయంగా పెరిగింది. అంతకు ముందు 5 సంవత్సరాలలో సాంఘిక సేవలకై చేసిన వ్యయం మొత్తం ప్రణాళిక వ్యయంలో 17.9 శాతం కాగా అది 30 శాతానికి పెరిగింది. సాంఘిక సేవలకై చేయు ఖర్చు అధికం అయినందువల్ల ఇతర ఉత్పాదన అవస్థాపన రంగాలకు తగినంత ఆర్థిక వనరులను ప్రభుత్వం

పట్టిక – 3

ప్రణాళికల్లో వ్యయం

| సంవత్సరం | | వ్యవసాయ రంగం | గ్రామీణాభివృద్ధి | నీటిపారుదల | విద్యుచ్ఛక్తి | పరిశ్రమలు గనులు | రవాణా | సాంఘిక సేవలు | ఆర్థికసేవలు | సాధారణ సేవలు | మొత్తం |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 | 7 | 8 | 9 | 10 | 11 |
| 1978–79 నుండి 1982–83 | 9089.87 | 11246.54 (3.7) | 76155.74 (4.6) | 74168.30 (31.2) | 1137915 (30.0) | 17462.53 (4.6) | 43623.74 (7.1) | 235.56 17.9) | 932.60 (0.1) | 244244.11 (0.4) | (100.0) |
| 1983–84 నుండి 1987–88 | 21173.08 | 37630.40 (4.3) | 123337.25 (7.8) | 84569.30 (24.8) | 29321.15 (17.0) | 44915.32 (5.9) | 149062.91 (9.0) | 969.79 (30.0) | 5847.03 (0.2) | 496828.31 (1.2) | (100.0) |

Source : AP Government 'New era in Development 1988 Annexure-I (Mimeo)

కేటాయించ లేకపోయిందని విమర్శలున్నాయి. సాంఘిక సేవలకై చేయు ఖర్చు శ్రామికుల ఉత్పాదక శక్తిని పెంచి, రాష్ట్ర ఆదాయాన్ని అధికం చేయడానికి తోడ్పడినచో ఈ ఖర్చును సమర్థించవచ్చు. కాని ఎంత మేరకు ఈ ధ్యేయం సాధించబడుతుందో చెప్పడానికి ఖచ్చితమైన గణాంక వివరాలు లభ్యం కావడం లేదు. అయితే ఈ వ్యయం వల్ల పేదప్రజలకు తక్షణం కొన్ని సదుపాయాలను ప్రభుత్వం అందించగలుగుతుందని చెప్పడంలో సందేహం లేదు. ఏది ఏమైనప్పటికీ ఉత్పాదక రంగాలకై చేయు ఖర్చు ఆర్థిక వృద్ధికి తోడ్పడగలదని సాంఘిక సేవలకై చేయు ఖర్చు సాంఘిక న్యాయాన్ని అందిస్తుందని అర్థశాస్త్ర సూత్రాలు చెబుతున్నాయి. కనుక ఈ రెండు ధ్యేయాలకు సరైన ప్రాధాన్యతను యివ్వ వలసి ఉంటుంది.

ఇక ఆర్థిక సాంఘిక అవస్థాపనలో ఏర్పడిన కొన్ని మార్పులను గూర్చి ఇప్పుడు తెలుసుకొందాం.విద్యుచ్ఛక్తి రంగంలో స్థాపిత శక్తి 1978–79 లో 1563 మెగావాట్స్ కాగా 1986–87 లో అది 3595 మెగావాట్స్‌కు పెరిగింది. నీటిపారుదల వివరాలను పరిశీలించినచో భారీ నీటిపారుదల ప్రాజెక్టుల క్రింద సృష్టించబడిన పొటెన్షియల్ (Potential) సుమారు 15 లక్షల హెక్టార్లు కలదు. ఏడవ ప్రణాళికలో తెలుగుగంగ, సోమశిల, శ్రీరామ్‌సాగర్, శ్రీశైలం కుడికాలువ, తుంగభద్రకాలువరెండవ దశ, వంశధారరెండవ దశమొదలగు పథకాలను అమలు పరచడానికి చర్యలు తీసుకోవడం జరిగింది. సాంఘిక అవస్థాపనలో ఇటీవల సాధించిన ప్రగతి–మహిళలకై ప్రత్యేక విశ్వవిద్యాలయం, తెలుగు విశ్వవిద్యాలయం, గ్రామీణ ప్రాంతాలలో రెసిడెన్షియల్ పాఠశాలలు, వైద్య విశ్వవిద్యాలయం, గ్రామీణ ప్రాంతాలలో వైద్య సదుపాయాలు మొదలగునవి.

ఇంతవరకు రాష్ట్ర ఆర్థిక పురోభివృద్ధిని సమీక్షించాం. రాష్ట్రం ఎదుర్కొంటున్న కొన్ని సమస్యలను ఇప్పుడు తెలుసుకొందాం. వ్యవసాయ రంగాన్ని వృద్ధి చేయాలంటే నీటిపారుదల సదుపాయాలను ఇంకా ఎక్కువ చేయవలసి ఉంది. భారీ నీటిపారుదల వృద్ధికి ప్రభుత్వం ఇంతవరకు ఎక్కువ శ్రద్ధ



(మిగతా 206వ పేజీలో)

# కేంద్ర - రాష్ట్ర ఆర్థిక సంబంధాలు - ఇటీవలి పరిణామాలు

మూలం:
జి. ఆర్. రెడ్డి
సంయుక్త సంచాలకులు
ఆర్థికశాఖ, సచివాలయం,హైదరాబాదు

అనువాదం : డా// లక్ష్మీనారాయణశర్మ
తెలుగు అకాడమి

ఇటీవలికాలం వరకూ కేంద్ర రాష్ట్ర - ఆర్థిక సంబంధాలు చర్చనీయాంశంగానే ఉంది. కేంద్రం తమకు చాలినంత ఆర్థిక వనరులు చేకూర్చలేదని రాష్ట్రాలూ, రాష్ట్రాలు ఆర్థిక విషయాలపట్ల బాధ్యతగా ప్రవర్తించలేదని కేంద్రమూ, పరస్పరం నిందించుకొంటూనే ఉన్నాయి. లోగడ ఉన్న ఆర్థిక సంఘాలేవీ ఈ భేదాలను తొలగించలేకపోయాయి. వారి పరిధిలోకి కేంద్ర రాష్ట్ర ఆర్థిక సంబంధాల అన్ని అంశాలు రాకపోవడమే కారణం. ప్రస్తుతం ఉండే రాజ్యాంగావకాశాల్లో మార్పు తెచ్చే విధానాలేవీ ఈ సంఘాలు సూచించకపోవడం మూలంగానూ రెంటి మధ్యా ఆర్థిక సంబంధాలు అట్లాగే ఉండిపోవడానికి దోహదం చేసింది. రాష్ట్రాలు చేసిన/చేస్తున్న ఫిర్యాదులు పరిశీలించినట్లయితే, వారు కోరే కోరికలన్నీ ప్రస్తుత రాజ్యాంగావకాశాల మేరకు నెరవేరుతాయి. కేంద్రం వాటి అమలుకు ఏ విధమయిన చొరవ తీసుకోవడం లేదనే విషయంలోనే అసలయిన పేచీ ఉంది. మునుపు, రాష్ట్రాలు కేంద్రానికి చేసిన ఫిర్యాదుల్లో అధికభాగం పన్నులువచ్చే ఆదాయ భాగాల అసమానతల గురించి, సహాయక అనుదాయక నియమావళి మొ// వాటిగురించే ఉండేవి. రాష్ట్ర ఆర్థిక విషయాల పై ఆధారపడ్డ అన్ని అంశాలకూ ఈనాటి ఫిర్యాదులు విస్తరించాయి. కొత్తగా కేంద్రం అనుసరిస్తున్న విధానాలవల్ల రాష్ట్రాలు, కేంద్రం ఎదురు పడలేని కలుషిత వాతావరణం ఏర్పడింది. గత ఏడాది ఏర్పడిన 9వ ఆర్థిక సంఘం నిర్దేశాంశాల్లో వచ్చిన మార్పు దృష్ట్యా ఆర్థిక సంబంధాలు మరింత దెబ్బతిన్నాయి. రాష్ట్రాల ఆర్థిక స్థితిని దెబ్బ తీసే ఏ అంశాలను భారత ప్రభుత్వం ఇటీవలివిధానాలలో ప్రవేశపెట్టింది? ఈ విధానాలను, రాష్ట్రాలపై వాటి ప్రభావాన్ని ఈ వ్యాసంలో చర్చించడం జరుగుతుంది. సులువుగా ఉండడానికి ఈ విధానాలను కొన్నిస్థూల విషయాలుగా విడదీయడం జరిగింది.

### మార్కెట్ ఋణగ్రహణాలు

ప్రజా ఋణగ్రహణం ప్రణాళిక పెట్టుబడికి ప్రథమపంచవర్ష ప్రణాళిక కాలంనుంచీ ఒక వనరుగా ఉంటూ వచ్చింది. ప్రజాఋణాల్ని గ్రహించేముందు కేంద్రం రాష్ట్రాలను సంప్రదించాలన్నది తప్పనిసరి. రాజ్యాంగ పరిధిలో ఇందుకు అవకాశాలూ ఉన్నాయి కాని భారతదేశంలో రూపొందిన ఆర్థిక వ్యవస్థలో కేంద్రమే ఒక వైపు ఏ యే మొత్తాల్లో ఋణంకావాలో నిర్ణయించి కేంద్ర రాష్ట్రాల మధ్య ఋణపంపిణీని నిర్ధారిస్తుంది. మరోవైపు రాష్ట్రాలకు కేటాయించిన మొత్తాన్ని ఏయే రాష్ట్రాలకూ ఎంత పంపిణీ చేయాలో నిర్ణయిస్తుంది. దేశ అంతర్గత ఋణవ్యవస్థలో మార్కెట్ ఋణగ్రహణాలు ప్రముఖ పాత్ర నిర్వహిస్తాయి.

కొన్ని ఆర్థిక సంస్థల మీద నిబంధించిన రాజ్యాంగపరమయిన విధుల ద్వారా సేకరించిన ప్రభుత్వ బాండ్లు, సెక్యూరిటీలపై మార్కెట్ ఋణగ్రహణాలు ఆధారపడి ఉంటాయి. వాణిజ్య బ్యాంకులు, భారతదేశ జీవిత భీమాసంస్థ, ఉద్యోగుల భవిష్యనిధి సంస్థ మొ// ఈ సంస్థలలో కొన్ని. రాజ్యాంగ పరమయిన ద్రవ్యత్వ నిష్పత్తి నియమానుసారంగా వాణిజ్య బ్యాంకులన్నీ కలిసి 38% డిమాండ్ లయబిలిటీలను సమయానుకూలంగా ప్రభుత్వ సెక్యూరిటీలలో పెట్టుబడిపెట్టాల్సి ఉంటుంది.

పేర్వేరు ప్రణాళికాకాలాల్లో కేంద్రం, రాష్ట్రాల మధ్య ఉన్న మార్కెట్ ఋణగ్రహణ పంపిణీ మొత్తాలను దిగువ పట్టికలో ఉదహరించడం జరుగుతోంది.

## మొత్తం మార్కెట్ ఋణగ్రహణాల పంపిణీ

(రూ// కోట్లలో)

| | ప్రణాళికాకాలం | కేంద్రం మార్కెట్ | రాష్ట్రం మార్కెట్ | మొత్తం | వాటా% కేంద్రం | రాష్ట్రం |
|---|---|---|---|---|---|---|
| 1 | మొదటిప్రణాళిక (1951-56) | 49 | 155 | 204 | 24.0 | 76.0 |
| 2 | రెండవప్రణాళిక (1956-61) | 400 | 356 | 756 | 52.9 | 47.1 |
| 3 | మూడవప్రణాళిక (1961-66) | 307 | 516 | 823 | 37.3 | 62.7 |
| 4 | వార్షిక ప్రణాళికలు (1966-69) | 384 | 341 | 725 | 53.0 | 47.0 |
| 5 | నాల్గవప్రణాళిక (1969-74) | 1744 | 1044 | 2788 | 62.5 | 37.5 |
| 6 | అయిదవ ప్రణాళిక (1974-79) | 3746 | 2133 | 5879 | 63.7 | 36.3 |
| 7 | వార్షికప్రణాళిక (1979-80) | 1850 | 521 | 2371 | 78.0 | 22.0 |
| 8 | ఆరవ ప్రణాళిక (1980-85) ఇటీవలిఅంచనాలు | 17401 | 4719 | 22120 | 78.7 | 21.3 |
| 9 | ఏడవ ప్రణాళిక (1985-90) మూలఅంచనాలు | 20620 | 9942 | 30562 | 67.5 | 32.5 |

మొదటి పంచవర్ష ప్రణాళికలో కేంద్రానికి మొత్తం మార్కెట్ ఋణగ్రహణాలు రూ// 49 కోట్లుంటే, అది 421 రెట్లు పెరిగి 7వ పంచవర్ష ప్రణాళికలో రూ// 20,620 కోట్లయింది. అదే రాష్ట్రాల మొత్తం మార్కెట్ ఋణగ్రహణాలు మొదటి పంచవర్షప్రణాళికలో రూ// 155 కోట్లుంటే, అది 64 రెట్లు పెరిగి 7వ పంచవర్ష ప్రణాళికలో రూ// 9,942 కోట్లయింది. మొదటి ప్రణాళికకాలంలో రాష్ట్రాలకుండే 76% వాటా ప్రజాఋణగ్రహణం ఆరవప్రణాళికాకాలం నాటికి 21.3%కి పడిపోయింది. పదే పదే రాష్ట్రాలు విజ్ఞప్తులు చేయడం వల్ల ఏడవ ప్రణాళికలో వాటాను 32.5%కి కేంద్రం పెంచింది.

ఏడవ ప్రణాళికలో మొదటి నాలుగేళ్ళ ప్రజాఋణగ్రహణాల కేటాయింపులను పరిశీలిస్తే, ప్రణాళికాకాలంలో ఉండే కేటాయింపులను మించి కేంద్రం రూ// 24,415 కోట్లను గ్రహించింది. అదే రాష్ట్రాలు కేవలం రూ// 7,963 కోట్లనే గ్రహించాయి. ఇది రాష్ట్రాల వాటాలో 24.6% మాత్రమే. కేంద్రం ప్రకటించిన అధిక వాటాను సాధించే అవకాశాలు ఎక్కడా కనిపించడం లేదు.

కేంద్ర ప్రణాళిక పరివ్యయం, రాష్ట్ర ప్రణాళిక పరివ్యయం దాదాపు సమానంగానే ఉంటుంది. అందుకే ప్రజాఋణగ్రహణం సమానంగానే ఉండాలనే కేంద్రంతో రాష్ట్రాలు వాదిస్తున్నాయి. కేంద్రం, రాష్ట్రాల ప్రణాళికా పరివ్యయాలలో ప్రజాఋణగ్రహణాల వంతు పరిశీలిస్తే మొత్తం పంపిణీలో అన్యాయాన్ని ప్రస్ఫుటంగా గమనించవచ్చు. ఏడవ ప్రణాళిక ఆర్థిక వనరుల ఆమోదిత అంచనాలను గమనిస్తే, కేంద్రప్రణాళిక పరివ్యయంలో ప్రజా ఋణగ్రహణాల వంతు 20.8% ఉంటే, రాష్ట్రాల ప్రణాళిక పరివ్యయాల్లో ప్రజాఋణగ్రహణాలవంతు 12.3% మాత్రమే ఉంది. కేంద్రానికి రాష్ట్రాలకన్నా అధిక వ్యాకోచ వనరులున్నా, ప్రణాళిక పెట్టుబడి రాష్ట్రాల ప్రజాఋణగ్రహణాల మీద ఆధారపడక తప్పడం లేదు. రాష్ట్రాలు పంచుకోని విదేశీ ఋణగ్రహణాల సౌకర్యం కేంద్రానికి అదనంగా ఉంది.

## ప్రభుత్వ నిర్ధారిత ధరలు

ఎన్నో ఏళ్లుగా కేంద్రం ప్రభుత్వ నిర్ధారిత ధరల్ని అధికంగా పెంచి వనరులను సాధించుకుంటున్నది. పెట్రోలియం సరుకులు, ఉక్కు, బొగ్గు మొ॥ పదార్థాల నిర్ధారిత ధరలలో పెరుగుదల అధికంగా కనిపిస్తూంటుంది. పెరిగిన ధరలకు పూర్తిగా కేంద్రాన్ని నిందించలేం. ధరలను పెంచిన తీరుకే రాష్ట్రాలు అభ్యంతరం చెబుతున్నాయి. ఈ పదార్థాల ధర ఉత్పాదకాల ఖర్చుల పెరుగుదల కన్నా ఎన్నో రెట్లు ఎక్కువగా పెంచుతున్నారనేడే వాదన. పైపెచ్చు కేంద్రం వనరులే కూడగట్టుకోదల్చుకున్నట్టయితే ఈ పదార్థాల ధరలను కాక ఎక్సయిజ్ డ్యూటీని పెంచి సమకూర్చుకోవచ్చన్నది రాష్ట్రాల వాదన. రాష్ట్రాలకు వాటా ఇవ్వవలసివస్తుందని ఎక్సయిజ్ డ్యూటీని కాక ధరనే పెంచుతున్నదని రాష్ట్రాలు కేంద్రాన్ని నిందిస్తున్నాయి. 8వ ఆర్థిక సంఘం కేంద్రం సేకరించిన ఎక్సయిజ్ డ్యూటీ మొత్తంలో రాష్ట్రాలకు 45% కేటాయింపు ఉండాలని సిఫారసు చేసింది.

రాష్ట్రాల వాదన పైకి మొండిగా కనిపించినా, వాదనలో వాస్తవం మాత్రం లేకపోలేదు. ప్రభుత్వ నిర్ధారిత, ధరలను కేంద్రం స్వేచ్ఛగా పెంచిందని "ప్రభుత్వ నిర్ధారిత ధరల విధానం[1]" అనే వ్యాసంలో ఉండే చర్చల వల్ల తెలుస్తుంది. 1970-71 నుంచి 1985-86 దాకా నిర్ధారితేతర ధరల పెరుగుదల 8.49%గానూ, ప్రభుత్వ నిర్ధారిత ధరల పెరుగుదల 9.07%గానూ ఉంది. 1980కాలంలో ప్రభుత్వ నిర్ధారిత ధరల పెరుగుదలలో గణనీయమయిన మార్పులు వచ్చాయి. 1981-82 నుంచి 85-86 కాలంలో కనిపించే ద్రవ్యోల్బణంలో 39.7% పెరుగుదల ప్రభుత్వ నిర్ధారిత ధరల వల్లనే జరిగింది. 1988-89 కాలంలో, ప్రభుత్వ నిర్ధారిత ధర పెరుగుదలలో వచ్చే మార్పులవల్ల అదనంగా రూ॥3100 కోట్లు లభిస్తుందని అంచనా.

## చిన్నతరహా పొదుపు

పంచవర్ష ప్రణాళికా కాలంలో పోస్టాఫీసుల్లో మదుపు చేసే చిన్న మొత్తాలే ప్రణాళికకు ఒక ముఖ్యమయిన వనరుగానిలిచింది. రాష్ట్రాలలో పోగయిన పొదుపు మొత్తాల్లో 75% ఋణంగా రాష్ట్రాలకు తిరిగి కేంద్రం ఇస్తుంది. అందువల్ల రాష్ట్రాలు చిన్నతరహా పొదుపును ఒక ఉద్యమంగా ప్రోత్సహించేందుకు ప్రభుత్వ యంత్రాంగాన్ని వినియోగించింది. ఉద్యోగుల భవిష్యనిధి పెట్టుబడి నియతినే మార్చడంతో రాష్ట్రప్రభుత్వాల ప్రయత్నాలకు భంగం కలిగిందనే చెప్పాలి. లోగడ ఉద్యోగుల భవిష్యనిధి జమయిన మొత్తంలో 40% చిన్న తరహా పొదుపులోనూ, 30% ప్రత్యేక డిపాజిట్లలోనూ, మిగిలిన 30% భారత ప్రభుత్వ సెక్యూరిటీలలోనూ ఉంచేవారు. కాని ఏప్రిల్ 86లో కేంద్ర ప్రభుత్వం చేసిన సవరణ ప్రకారం భవిష్యనిధిలో 85% మొత్తం ప్రత్యేక డిపాజిట్లలోనూ, 15% భారత ప్రభుత్వ సెక్యూరిటీలలోనూ ఉంచాలి. ఫలితంగా చిన్నతరహా పొదుపు మొత్తాల్లో రాష్ట్రాల వాటాను 2/3 వంతుల నుంచి 3/4 వంతులకు పెంచినా ప్రయోజనం కనిపించడంలేదు. ఈ నష్టం ముఖ్యంగా ప్రభుత్వం కల్పించిన ప్రత్యేక డిపాజిట్ పథకం మొత్తాన్ని పెంచడంవల్లే జరిగింది.

ప్రజలనుంచి పొదుపు మొత్తాలను గ్రహించడానికి కేంద్రం భవిష్యనిధి పెట్టుబడులలోనే కాక, ఇంకా కొన్ని విధాలయిన మార్పుల్ని ప్రవేశపెట్టింది.

1 గవర్నమెంట్ ఆఫ్ ఇండియా, మినిస్ట్రీ ఆఫ్ ఫైనాన్స్, "డిస్కషన్ పేపర్ ఆన్ అడ్మినిస్టర్డ్ ప్రైస్ పాలసీ" న్యూఢిల్లీ 1986.

రాహత్‌పత్ర, ప్రత్యేక డిపాజిట్ పథకం మొ// కొత్త పథకాలలో రాష్ట్రాలకు ఏ విధమయిన వాటాలేదు. చిన్న తరహా పొదుపులో రాష్ట్రాలకుండే 75% వాటాను ఈ ప్రత్యేక పథకాలు దెబ్బ తీస్తున్నాయి.

## కేంద్ర రంగ సంస్థలు ప్రవేశపెట్టిన బాండ్లు

ఇటీవలికాలంలో కేంద్ర ప్రణాళిక పరివ్యయంలో పెరుగుదలలో అధిక భాగం బడ్జెటేతర వనరులే చేకూరుస్తున్నాయి. 1988-89 కేంద్ర ప్రణాళిక అధిక పరివ్యయం మొత్తం రూ// 3014 కోట్లుంటే అందులో రూ// 2058 కోట్లు బడ్జెటేతర వనరులు చేకూరుస్తున్నాయి. మిగతా రూ// 956 కోట్లు మాత్రమే బడ్జెట్ పరంగా సమకూరుతోంది. కేంద్రరంగ సంస్థలు బాండ్ల పద్ధతిని ప్రవేశపెట్టడం ద్వారానే బడ్జెట్ వనరులపై ఆధారం తగ్గింది. ప్రభుత్వ రంగ సంస్థ బాండ్లను ఆకర్షవంతంగా ఉంచడానికి, ప్రభుత్వం ఎన్నో రకాల రాయితీలను కల్పిస్తోంది. అంటే బాండ్ల వల్ల ఆదాయ పన్ను ద్వారా వచ్చే ఆదాయం తగ్గించి జాతిని నష్టపరుస్తోంది. దీని వల్ల చిన్న తరహాపొదుపు పథకమూ దెబ్బతిని, దానిద్వారా రాష్ట్రాలూ ఎంతో హానిని పొందుతున్నాయి.

రాష్ట్రాలూ, కేంద్రం ప్రవేశపెట్టినట్లుగానే తామూ రాష్ట్రరంగసంస్థలలో బాండ్లను ప్రవేశపెడతామని అర్థిస్తున్నాయి. కాని ఈ కనీసపు కోరికను కేంద్రం అనుమతించడం లేదు.

## ఓవర్‌డ్రాఫ్ట్‌సౌకర్యం

ఇటీవలే కేంద్రం రాష్ట్రాలకున్న ఓవర్‌డ్రాఫ్ట్ సౌకర్యాన్ని తొలగించింది. దీనివల్ల రాష్ట్రాలు ఆర్థికంగా క్రమశిక్షణతో ప్రవర్తించేందుకు అవకాశం ఏర్పడింది. కాని ఇదే విధమయిన క్రమశిక్షణ కేంద్రానికి వర్తిస్తుందని రాష్ట్రాలు వాదిస్తున్నాయి. రాష్ట్రాలు పెట్టే ఓవర్‌డ్రాఫ్టులను పరీక్షించి నిరోధించేందుకు ఎన్నో నియమాలున్నా, కేంద్రం పెట్టే ఖర్చుకో నియమం అంటూలేదు. 86-87 కేంద్ర ప్రభుత్వం రూ// 8285 కోట్లను లోటుగా ప్రవేశపెట్టింది. ఈ ఏడాది ఆలోటు రూ//7484 కోట్లు ఉంటుందని అంచనా.

## 9వ ఆర్థిక సంఘం

కేంద్ర, రాష్ట్ర ఆర్థిక సంబంధాల వివాదాలన్నీ ఏదయినా ఆర్థిక సంఘం ఏర్పాటుతోనే బహిరంగపడతాయి. గతంలో ఏ సంఘమూ, 9వ ఆర్థిక సంఘం లేవదీసినంత వివాదాలు లేవదీయలేదు. లోగడ ఆర్థిక సంఘాల నియామకం జరిగినప్పుడు చర్చలు గణనీయమయిన అంశాలకే పరిమితం అయితే ఈ సారి నిర్దేశిత విధులకే ప్రాధాన్యం వ్వడం జరిగింది. లోగడ ఉన్న సంఘాల నిర్దేశితాలకూ, 9వ ఆర్థిక సంఘం నిర్దేశితాలకు మధ్య చాలా తేడా ఉండడమే దీనికి ముఖ్యకారణం.

కేంద్ర, రాష్ట్రాల ఆదాయ వ్యయాల పట్ల ప్రమాణబద్ధమయిన దృక్పథంతో వ్యవహరించమని కేంద్రం 9వ ఆర్థిక సంఘాన్ని కోరింది. పూర్వం ఉన్న సంఘాలకు ఎన్నో అంశాలతో పాటు ఆదాయవ్యయాల అంచనాలో దీన్ని సూచన ప్రాయంగా పేర్కొన్నారు. తర అంశాలను చర్చించే స్వేచ్ఛకు, ది ఏ రకంగానూ అడ్డు రాలేదు. కాని ఈ సారి 9వ ఆర్థిక సంఘంలో " సంఘం ప్రమాణ బద్ధమయిన దృక్పథం" తో వర్తించాలి అని తప్పనిసరి విధిగా విధించడంతో ఆర్థిక సంఘానికి మరో దృక్పథంతో వ్యవహరించే స్వేచ్ఛను కోల్పోయింది. ది ఒక విధంగా రాజ్యాంగవిరుద్ధంగా కనిపిస్తుంది. రాజ్యాంగ బద్ధంగా ఏర్పడిన ఆర్థిక సంఘం కేంద్రం ద్వారా రాష్ట్రాలకు పెట్టుబడులు ఎలా చేకూర్చాలన్న విషయానికి ప్రాముఖ్యతను వ్వాల్సి ఉంటుంది. సంఘం ధృవీకరించేందుకు కేంద్రం తన వంతు సహకారం అందించాలి తప్ప, తానే సంఘానికి నిర్దేశిత సూత్రాలను కల్పించి రాష్ట్రోద్దేశాలను భంగం చేయకూడదు.

స్థూల ప్రాతిపదిక మీద రాష్ట్రాల ఆదాయ వ్యయాలను అంచనా వేయడం ప్రమాణబద్ధ దృక్పథంలో అనుసరించే విధానం. రాష్ట్రాల వ్యయాలేవయినా స్థూల ప్రాతిపదికలో మదకపోతే అంచనా నుంచి తప్పించాలి. మొదట్లో నిర్దేశిత నియమాల్లో ఆర్థిక సంఘం కేంద్రం, రాష్ట్రాల ఆదాయ, వ్యయాల అంచనాలను వేయాలని నిర్దేశించినా, రాష్ట్రాల అంచనాకే పరిమితమయే అవకాశాలు

ఎక్కువ కనిపించాయి. రాష్ట్రాల సరాసరి ఆదాయ, వ్యయాల స్థాయిననుసరించి ఒక దృక్పథంతో వ్యవహరించడం సులువు కనుక రాష్ట్రాల అంచనాలకే నిర్దేశితనియమాలను పరిమితం చేసే ప్రమాదం ఉందని రాష్ట్రాల అభిప్రాయం. విద్య, ఆరోగ్యం, వ్యవసాయం, నీటి పారుదల మొ// రాష్ట్రరంగ విషయాలు కలిసి ఉన్న కేంద్ర వ్యయం అంచనా కట్టి ఒకే దృక్పథం అనువర్తించడం కష్టమని ప్రభుత్వాభిప్రాయం.

9వ ఆర్థిక సంఘం "ప్రమాణబద్ధ దృక్పథం"[2] నేపథ్యాన్ని పత్రరూపంలో ప్రకటించడంతో రాష్ట్రాలకున్న భయశంకలన్నీ నిజరూపం దాల్చాయి. రాష్ట్రాల ఆదాయ వ్యయాలను అంచనా వేసే విధానాలను ఈ పత్రంలో పేర్కొన్నారు. రాష్ట్రాలపరంగా 1994-95 నాటికి ఆదాయలెక్కల్లో ఏ మాత్రం శూన్యం (లోటు) లేకుండా చూపడమే లక్ష్యంగా పెట్టుకొని ఆర్థిక సంఘం వర్తిస్తుంది. కేంద్రం లెక్కల్లోనే లోటుఅధికంగా కనిపించినా, రాష్ట్రాలకు చెందిన అంశాలనే అధికంగా చర్చించారు. ఆ విధంగా సంఘం దృక్పథంలోనే రాష్ట్రాల, కేంద్రం పట్ల, ప్రవర్తిస్తున్నతీరులోనే తేడాలు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

రెవెన్యూ లెక్కల (Revenue Account) మీద అయే ఖర్చుల అంచనాను 9వ ఆర్థిక సంఘం నిర్దేశిత విధుల్లో ఒకటిగా భావిస్తోంది. ఇదీ ఒక విధంగా మునుపటి సంఘాలతో పోలిస్తే వైవిధ్యంగానే ఉందని పేర్కొనాలి. లోగడ ఉండే సంఘాలు రాష్ట్రాల ప్రణాళికేతర ఆదాయఖర్చులనే అంచనా వేస్తే, 9వ ఆర్థికసంఘం ఇందుకు భిన్నంగా రాష్ట్రాల ప్రణాళిక, ప్రణాళికేతర రెవెన్యూ వ్యయాలను అంచనా వేస్తోంది. ఆ విధంగా ఆర్థికసంఘం క్షేత్ర పరిధి ప్రణాళిక వ్యయానికీ వ్యాపించింది. లోగడ ప్రణాళిక సంఘమే ప్రణాళిక లోని రెవెన్యూవ్యయాన్ని అంచనావేసి, రాష్ట్రాల ప్రణాళికలకు కావలసిన నిధులను, ఋణాలను మంజూరు చేయడానికి సమర్పిస్తుండేది. ఇప్పుడు ఆర్థిక సంఘమే ఈ ప్రయోజనం నెరవేర్చడం వల్ల, రాష్ట్రాలప్రణాళికకు కేంద్రం అందిస్తున్న సహాయం అనుసరించి, నియతిలోమార్పులు తేవడం తప్పనిసని అయింది. ప్రణాళిక విధానాలకు, కేంద్ర సహాయనియతికి జాతీయ అభివృద్ధి మండలిమంజూరు తప్పనిసరి. జాతీయాభివృద్ధి మండలికార్యకలాపాలకు అడ్డు వచ్చేలా నిర్దేశిత సూత్రాలను 9వ ఆర్థిక సంఘానికి విధించే ముందు కేంద్ర ప్రభుత్వం జాతీయాభివృద్ధి మండలి అభిప్రాయం తెలుసుకొని ఉంటే బాగుండేది.

ఎక్సైజ్ వారి మౌలిక సుంకాలతో పాటు వస్త్రాలు, పంచదార, పొగాకులపై అదనంగా వేసిన సుంకాలను కలపడం సాధ్యమవుతుందో లేదో 9వ ఆర్థిక సంఘం పరిశీలించడం, మరో కొత్త మార్పు. ప్రస్తుతం అమలులో ఉన్న విధానంలో రాష్ట్రాలు వస్త్రాలు, పంచదార, పొగాకు మొ// వాటి మీద అమ్మకపు పన్ను విధించడం లేదు. ఈ మేరకు 1956 డిసెంబర్‌లో జరిగిన జాతీయాభివృద్ధి మండలి సమావేశంలోనే నిర్ణయం తీసుకున్నారు. అదనంగా ఎక్సైజ్ సుంకాలను విధించవచ్చన్న దానికి జాతీయాభివృద్ధి మండలినిర్ణయం వ్యతిరేకంగా నిలుస్తుంది. అమ్మకపుపన్ను బదులు అదనపు ఎక్సైజ్ సుంకం విధించి వచ్చే ఆదాయాన్ని రాష్ట్రాలకు ఇవ్వాలనేది జాతీయాభివృద్ధి మండలితీసుకున్న నిర్ణయాలలో మరొక అంశం. ఆర్థిక సంఘానికి నిర్దేశించేవిధులను · కేంద్రం మొదట రాష్ట్రాలతో చర్చించాలన్న ఏ నియమంలేకపోయినా, కనీసం, జాతీయాభివృద్ధి మండలిచేసిన నిర్ణయానికి వ్యతిరేకంగా ఉండే ఈ విషయాన్నయినా కేంద్ర ప్రభుత్వం ఆర్థిక సంఘానికి అప్పగించేముందు రాష్ట్రాలతో చర్చించి ఉండాల్సింది.

రాష్ట్రాల వనరులకు విరుద్ధంగా ఉండే మరికొన్ని అంశాలు 9వ ఆర్థిక సంఘం పరిధిలో ఉన్నాయి. వీటన్నింటినీ ఇప్పుడిక్కడ చర్చించడం లేదు. ఇప్పటి వరకూ కేంద్ర రాష్ట్ర సంబంధాలలో వచ్చిన ఇటీవలిమార్పులను గమనిస్తే, రాష్ట్రాల ఆర్థికవనరులు దెబ్బతిన్నాయనే చెప్పాల్సి ఉంటుంది. ఆదాయంలో లోటు, అప్పు బరువు ఎక్కువయిపోతున్న ఈ

2 ఫైనాన్షియల్ ఎక్స్‌ప్రెస్ "ప్రమాణబద్ధ దృక్పథ నేపథ్య పత్రం" 4, 5వ మే 1988.

కాలంలో ఆర్థిక పరమయిన క్రమశిక్షణను ఎవరూ కాదనరు. దేశ ఆర్థిక పరిస్థితిని చక్కదిద్దేందుకు రాష్ట్రాలూ, కేంద్రం కలసి సమానినిష్పత్తిలో బాధ్యతలు పంచుకోవాల్సిందేకాని బాధ్యత అంతా ఒకరి మీదికి నెట్టేయడం వాస్తవాన్ని తప్పించుకునే పలాయన వాదమే అవుతుంది. కాబట్టి తప్పనిసరిగా పాటించాల్సిన ఆర్థిక క్రమశిక్షణను రాష్ట్రాలూ, కేంద్రమూ కలసి కృషి చేయాలి. అప్పుడే రాష్ట్రాలకు కేంద్రానికి మధ్య సామరస్య వాతావరణం ఏర్పడిన సరయిన ఆర్థిక సంబంధాలు ఏర్పడతాయి.



(ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ఆర్థిక పురోభివృద్ధి)

(200 వ పేజీ తరువాయి)

చూపింది. చిన్న మధ్యతరహా నీటి పారుదలను వృద్ధి చేసినచో చాలా ప్రాంతాలలో వ్యవసాయ అభివృద్ధిని త్వరితం చేయవచ్చు. గత రెండు, మూడు సంవత్సరాలుగా విద్యుచ్ఛక్తి, తగినంతగా సరఫరా కావడం లేదు. ఫలితంగా రాష్ట్రంలో పరిశ్రమ రంగం చాలా ఇబ్బందులకు లోనైంది. విద్యుచ్ఛక్తి సరఫరాను వృద్ధి చేయడానికి ఎక్కువగా థెర్మల్ విద్యుదుత్పాదన పట్ల ప్రాధాన్యత చూపవలసి ఉంటుంది. పారిశ్రామిక రంగానికి సంబంధించిన చాలా చట్టాలు కేంద్ర ప్రభుత్వ పరిధిలో ఉన్నాయి. వాటిలో కొన్నింటినైనా రాష్ట్ర ప్రభుత్వాల పరిధిలోకి చేర్చవలసిన అవసరం ఎంతైనా ఉంది. ఈ సూచన ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికే కాక మిగిలిన రాష్ట్రాలకు కూడ వర్తింపచేయవచ్చు. వోతే ప్రణాళికలలో సరైన ప్రాధాన్యతలను నిర్మించుకోవాలి. వివిధ రకాల వస్తుసేవల ఉత్పత్తికి సంబంధించిన పూర్తి గణాంక వివరాలు ప్రస్తుతం లభ్యం కావడం లేదు. ఉదాహరణకు రాష్ట్రంలో చిన్న తరహా పరిశ్రమలు, కుటీర పరిశ్రమలకు సంబంధించి పూర్తి వివరాలు లేవు. ఈ రంగానికి సంబంధించిన పూర్తి వివరాలను సెన్సస్ ద్వారా సేకరించడానికి ఇటీవల ప్రయత్నాలు జరుగుతున్నాయి. అదే విధంగా వివిధ వర్గాల ప్రజల్లో నున్న ఆదాయ పంపిణీ పొదుపు పెట్టుబడులు మొదలగు అతి ముఖ్యమైన ఆర్థిక, సాంకేతాల వివరాలు లేవు. సక్రమంగా ప్రణాళికలు వేయడానికి అవసరమగు ఉత్పాదక-ఉత్పత్తులకు గల పరస్పర సంబంధాన్ని తెలియ చేయు పట్టికలను (Input-Output-Tables) ఇంతవరకు గణించడం జరుగలేదు. రాష్ట్రంలో లభ్యమవుతున్న వనరులను ఎటువంటి సాంకేతిక పద్ధతి ద్వారా ఉత్పత్తి చేస్తే ఆర్థిక, సాంఘిక ప్రయోజనం ఎక్కువ చేయగలమో తెలుసుకోవడం జరగ లేదు.

ఈ సమస్యలను పరిష్కరించడానికి సత్వర చర్యలు తీసుకోవలసిన అవసరం ఎంతైనా ఉంది.

# శ్రీశైలం ప్రాజెక్టులోని పురాతన కట్టడాల పరిరక్షణ చర్యలు

అనువాదం
డాక్టర్. సి. సీత
తెలుగు అకాడమి
హైదరాబాదు

డాక్టర్ వి.వి. కృష్ణశాస్త్రి
సంచాలకులు
ఆంధ్రప్రదేశ్ పురావస్తుశాఖ
హైదరాబాదు.

ఇటీవల, ముఖ్యంగా 1950 తరవాత, భారత పురావస్తుశాఖ చాలా ఒత్తిడికి గురయింది. బహుళార్థకంగ, భారీ యెత్తున నదుల మీద కట్టే ఆనకట్టల వల్ల ఆ నదుల ఒడ్డున ఉన్న పురాతన కట్టడాలకు ప్రమాదం ఏర్పడింది. పురావస్తు శాఖ మామూలుగా చేసే అధ్యయనం, పరిశోధనలను విడిచిపెట్టి ఆ కట్టడాలను పరిరక్షించే పనిని వెంటనే చేపట్టవలసివచ్చింది.

1960 దశాబ్దంలో కృష్ణానది మీద నాగార్జున సాగర్ ఆనకట్ట నిర్మిత మయింది. దీని వల్ల నాగార్జున కొండ, ఏలేశ్వరం ప్రాంతాలలోని బౌద్ధ, హైందవ అవశేషాలు ముంపుకు గురయ్యే ప్రమాదం ఏర్పడింది. గత–ఆగతాల మధ్య ద్వైనా ఒక దానిని ఎంచుకోవలసిన క్లిష్ట స్థితిలో ఇప్పుడు భారతదేశం ఉంది. గతానికి గుర్తుగా మిగిలిన అవశేషాలు ఆనాటి ప్రజల ఆశల్ని, ఆశయాల్ని, విశ్వాసాల్ని తెలుపుతాయి. అవి మన జాతి దీర్ఘచరిత్రకు సాక్ష్యాలు. అవి వెనకటి తరాల వారి సాంస్కృతిక విజయాలను ప్రతిబింబిస్తాయి. అయితే, ఆర్థిక ఒత్తిడులను పక్కన బెట్టి గత వైభవంతో తృప్తి పడలేదు భారతదేశం వంటి బీద దేశం. బహుళార్థక ప్రాజెక్టులను నిర్మించి నీటిని భూములకు ప్రవహింప జేస్తే తప్ప, పరిశ్రమల్ని పెంపొందించ డానికి విద్యుత్తును ఉత్పత్తి చేస్తే తప్ప ఆకలితో అలమటిస్తున్న కోట్లాది ప్రజల బాధ తీరదు.

14, డిసెంబర్, 1964 నాడు భారతదేశ పురావస్తు సర్వే శాఖ ఒక శతాబ్దం పూర్తి చేసుకొని ఉత్సవం జరుపుకుంది. ఆ ఉత్సవాన్ని ప్రారంభించిన జవహర్‌లాల్ నెహ్రూ, పురాతన కట్టడాల్ని రక్షించడంలో భారతప్రభుత్వ భావి విధానాన్ని వివరిస్తూ, ఇలా అన్నారు. "కొన్ని సంవత్సరాల క్రితం, దక్షిణాదిని ఉన్న నాగార్జున కొండను ఏం చేయాలి? అన్న విషయంలో ప్రశ్న తలెత్తింది. ఇది మనస్సుకు సంబంధించిన ప్రశ్న. ఒక ప్రక్క పురాతన నగరం క్రమంగా వెలుగులోకి రావడం. మరోపక్క అక్కడ ఒక పెద్ద ఆనకట్ట, పెద్ద జలాశయం నిర్మించి వ్యవసాయానికి కావలసిన నీటిని అందించే ప్రతిపాదన. గతం అవసరాలకు ,ఇప్పటి, అంటే వర్తమాన వాస్తవిక, ప్రయోజనాత్మక అవసరాలకు మధ్య వైరం ఏర్పడింది. ఈ వైరం మాకు ఇబ్బందిని కలుగ జేసింది. అయితే నిర్ణయం వర్తమానం వైపే మొగ్గడం అనివార్యమయింది. అదే – గతాన్ని సంరక్షించడానికి కూడ మంచి మార్గం అయింది. నాగార్జున కొండలోని పురాతన అవశేషాలు క్రమంగా బూడిదలో, మట్టిలో శిథిలమై పోతున్నాయి. అందువల్ల అక్కడి నుంచి వాటిని తరలించి సరస్సు మధ్యలో ఒక చిన్న ద్వీపకల్పం మీద పెట్టి అవి శిథిలం కాకుండ సంరక్షించాలని నిర్ణయించాం. వర్తమానం ఒక గొప్ప నీటి పారుదల ప్రాజెక్టును నిర్మించేలా చేసింది.

1960 ప్రాంతాల్లో, బహుశ్రుతీయులకు, మహీశ శాకులకు, అపర వినాశిలీయులకు, చూళధర్మగిరి మొ :న వారికి చెందిన అనేక శిల్పాలను మహాస్తూపం, ఇతర స్తూపాల వంటి బౌద్ధ అవశేషాలను నాగార్జున కొండ మీద విశాలమైన చదరంగా ఉన్న ప్రదేశం మీద నిలిపారు. అయితే స్తూపాలు,విహారాలు మొ:నవి బౌద్ధ నిర్మాణాలన్నీ ఇటుకతో చేసినవే కనక వాటి పునస్థాపన ఒక పెద్ద సమస్యగా సంరక్షకులకు అనిపించలేదు. వాటిని ఇటుకఇటుకగా ఊడదీసి మరల నాగార్జున కొండ మీద పునర్నిర్మించారు. ఇప్పుడు రిజర్వాయర్ మధ్యలో ఉన్న పురావస్తు శాల, పురాతన కట్టడాలు యాత్రికులకు చాలా ఆకర్షణీయ స్థలాలు. ముందున్న స్థలం నుంచి పునస్థాపన స్థలం పెద్దగా దూరం కానందు వల్ల ఊడదీసిన నిర్మాణాల రవాణా భారత

పురావస్తు శాఖకు పెద్ద ఇబ్బంది కాలేదు. పురాతన కట్టడాలకు ఉపయోగించిన ఇటుకను ట్రక్కుల్లో పెద్ద మొత్తంలో కొత్తగా వేసిన ఘాట్ రోడ్డు ద్వారా తరలించారు.

అయితే, అనేక రకాల కట్టడాల పునస్థాపనకు సరియైన స్థలం చూడడం ఒక పెద్ద సమస్య అయింది. ఉదాహరణకు కట్టడాల్లో బౌద్ధ స్తూపాలు, విహార సముదాయాలు, అవభృథ సరస్సు కూర్మచితి సముదాయం వంటి బ్రాహ్మణిక నిర్మాణాలు, విజయపురిని, కృష్ణానదిని ఒకప్పుడు కలిపిన మట్టి కొట్టుకున్న మెట్ల వరసలు, కోడిగుడ్డు ఆకారంలో ఉన్న బహిరంగ రంగస్థలం లేక కోడిగుడ్డు ఆకారంలో ఉన్న రంగంస్థలం వంటి లౌకిక నిర్మాణాలు మొదలైన నిర్మాణాలకు సరియైన స్థలం చూడడం పెద్ద సమస్య అయింది. బౌద్ధ స్తూపాలను, బ్రాహ్మణిక నిర్మాణాలను కొండపైన చదరంగా ఉన్న నేలమీద చాలా సుకరంగానే పునస్థాపించడమైనది. కానీ, కోడిగుడ్డు ఆకారంలో ఉన్న పై కప్పులేని గాలరీ చుట్టు ఉన్న గుండ్రని రంగస్థలానికి, ధ్వని సరిగ ఉండేలా చూడటానికి వీలువాలుగా ఉండేస్థలం కావలసి వచ్చింది. దీనికి నాగార్జున కొండ మీద స్థలం కనిపించలేదు. కనక చెరువు ఒడ్డున ఉన్న పురావస్తు శాలకు 7 కి.మీ. దూరంలో ఉన్న స్థలాన్ని ఎంచుకోవలసి వచ్చింది. నాగార్జున కొండమీద అందుబాటులో ఉన్న పునస్థాపిత పురాతన కట్టడాలన్నింటిని యాత్రికులు చూడ గలుగుతున్నారు. కానీ విలక్షణమైన ఈ కోడిగుడ్డు ఆకారంలో గాలరీ ఉన్న కప్పులేని గుండ్రని రంగస్థలం మాత్రం అసంపూర్ణ స్థితిలోనే ఉంది.

నాగార్జున కొండ దగ్గర ఈ పునస్థాపన కార్యక్రమాలు 1960లో మొదలై 1961 చివరికి ముగిశాయి. సందర్భవశంగా ఆదేసమయాన ఈజిప్టులో న్యూబియన్ వాలీలో ఈ పరిరక్షక కార్యక్రమాలు జరిగాయి. ఆబూ సింబెల్ పరిరక్షక కార్యక్రమం కథ అంతా విరివిగా వినికిడిలో ఉండడమే కాక ప్రపంచంలో జరిగిన ఇతర కార్యక్రమాల కంటే కూడ అధికంగా ప్రచారం పొందింది. పురాతన కట్టడాలను పరిరక్షించ వలసిందిగా ప్రపంచ వ్యాప్తంగా సానుభూతిని, నిధుల్ని నిపుణుల్ని పోగు చేయడానికి యునెస్కో చాలా పెద్ద యెత్తున ప్రయత్నాలు చేసింది. తత్ఫలితంగా రాళ్ళల్లో మలిచిన భవనాల ముందు భాగాలను వాటి వెనక ఉన్న లోతైన పూజామందిరాలను, రాళ్ళ పలకలు ఉన్నవి ఉన్నట్లుగానే పెద్దగా కోసి వాటిని కొత్త నైలు సరస్సు ఒడ్డున నిల్పడమైంది. ఇది సివిల్ ఇంజనీరింగ్ సాధించిన ఘనవిజయాల్లో ఒకటి. అట్లాగే రోమన్ చక్రవర్తి అగస్టస్ - శిల్పాలున్న రోమన్ కాలానికి చెందిన కలాబా దేవాలయాన్ని ఊడదీసి నైలునది పశ్చిమ తీరంలో ఎత్తైన ప్రదేశంలో పునర్నిర్మించడమైంది. నాగార్జున కొండ తరవాత ఆంధ్రప్రదేశ్‌లో రెండోసారి పెద్ద యెత్తున పురాతన కట్టడాల పరిరక్షక కార్యక్రమాలు శ్రీశైలం ప్రాజెక్టు ముంపుకు గురయ్యే ప్రాంతాల్లో జరిగాయి. శ్రీశైలం ప్రసిద్ధి వహించిన శైవక్షేత్రం. శ్రీశైలం ఉత్తరాన 160.05 రేఖాంశంలోను 79.54 తూర్పున అక్షాంశంలోనూ ఉంది. ఈ కార్యక్రమాలు కృష్ణానది మీద హైడ్రో ఎలక్ట్రిక్ ప్రాజెక్టు నిర్మాణం పూర్తయ్యే లోగా పూర్తయ్యేటట్లు చేయడమైంది.

ఈ ప్రాజెక్టు కింద ముంపుకు గురయ్యే గ్రామాలు 102.887 యం.యస్ పరిమాణం ఉన్న రిజర్వాయర్ వల్ల వరదకు గురయ్యే భూమి (అడవులు, నదీతీరం కలుపుకొని) 1,62,320 ఎకరాలు లేదా 253.6 చమైళ్ళు. ఒక నమ్మిక మైన నివేదిక ప్రకారం మునిగిన ఇళ్ళు 11,309, తరలిపోయిన జనం 52,049 మంది.

## పరిపాలనాంశం

రిజర్వాయర్‌లో నీళ్ళుటికె లోపలనే పరిరక్షక కార్యక్రమాలు నిర్వహించడానికి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం శ్రీశైలం ఉన్నతాధికార కమిటీ నొకదానిని నియమించింది. పురావస్తు పరిరక్షణకు చేపట్టవలసిన పనిని, దాని కోసం అయ్యే ఖర్చును ప్రభుత్వానికి సలహా ఇయ్యడం ఈ కమిటీ కర్తవ్యం. ఈ కమిటీలో సభ్యులు 20 మంది. దానికి అధ్యక్షుడు పురావస్తు శాఖకు సంబంధించిన మంత్రి. అందులో విమోచన, పునరావాస శాఖ మంత్రి, పురావస్తు శాఖకు సంబంధించిన కార్యదర్శి, విత్తశాఖ, వ్యవసాయ శాఖ, రెవెన్యూ ప్రాజెక్టుల కార్యదర్శులు, హైడ్రో-ఎలక్ట్రిక్ ప్రాజెక్టు చీఫ్ ఇంజనీర్, దేవాదాయ శాఖ కమీషనర్, స్థపతి, పురావస్తు శాఖ

డైరెక్టర్ జనరల్, ముంపుకు గురయ్యే ప్రాంతాల నుంచి ఎన్నికయిన విధాన సభ సభ్యులు, యాత్రాస్థల శాఖ డైరెక్టరు, ముంపుకు గురయ్యే ప్రాంతాల జిల్లా కలక్టర్లు ఉన్నారు. పురావస్తు శాఖ డైరెక్టరు దీనికి కన్వీనర్ సభ్యుడు. ఈ ఉన్నతాధికార కమిటీ నిజంగా ఒక వరమని చెప్పాలి. ఉద్యోగి స్వామ్యంలో ఉండే ఆలస్యం లేకపోవడం వల్ల, ప్రతి దశలోను పని చురుగ్గా జరిగింది. అందువల్ల ప్రకంటింపదగిన కాల పరిమితిలో తరలింపు కార్యక్రమాలు పూర్తయ్యాయి.
ముంపు ప్రాంతాల్లో జరిగిన పురావస్తు పరిరక్షక కార్యక్రమాల్ని మూడురకాలుగా వర్గీకరించవచ్చు.

1. పురావస్తు స్థలాల్ని వెదకడం, ఎంచుకున్న స్థలాలను తవ్వడం
2. గుర్తించిన దేవాలయాన్ని పునస్థాపించడం
3. విడిగా ఉన్న శిల్పాల్ని సేకరించి కొత్త పురావస్తు శాలలను ఏర్పాటుచేయడం.

## 1. స్థలాల్ని వెదకడం, తవ్వడం

కృష్ణానదిని కన్నబెన్న లేక కృష్ణవేణి అని అంటారు. దీనికి భీమ, తుంగభద్ర అనే పెద్ద ఉపనదులున్నాయి. కృష్ణానది మానవ నాగరికతను ఎన్నో మిలియన్ల సంవత్సరాల నుంచి కొనసాగించింది. కర్నూలు, మహబూబ్ నగర్ జిల్లాల్లో శ్రీశైలం ఆనకట్ట వల్ల మునిగి పోయే ప్రాంతాల్లో కృష్ణానదికి రెండు పక్కల ఎన్నో ప్రాక్చారిత్రక పరిశీలనా స్థలాలున్నట్లు గుర్తించడమైనది. కర్నూలు జిల్లాలో షేక్‌పల్లి, శాసనూరు, కరపక్కల, కొత్తూరు, సింగవరం, ఉప్పలపాడు, కూడవల్లి, పీరాపురం, వెల్లాల, వేముల పాడు గ్రామాల్లోను, మహబూబ్ నగర్ జిల్లాలో రామేశ్వర పురం, బూడిద పాడు, యాపర్ల, వెల్లటూరు, సోమశిల గ్రామాల్లోను, పూర్వ, మధ్య ,పర ప్రాచీన శిలాయుగానికి, బృహత్‌శిలా యుగానికి, లేదా అర్వాచీన రాతి యుగానికి చెందిన అనేక పరిశీలనా స్థలాల్ని గుర్తు పట్టడమైంది. నవీనశిలాయుగ – తామ్ర శిలాయుగ లక్షణాలు చాగటూరు, చిన్న మరూరు, పీరాపురంలో దొరికిన పురావస్తువుల్లో బాగా కనివించాయి.

ఇనుప యుగానికి చెందిన అనేక వందల ప్రాక్చరిత్ర మధ్యకాలం సమాధులు పెద్దమరూరు, చిన్న మరూరు,ఉప్పలపాడు గొండిమల్ల,చాగటూరు, సోలిపురం మొదలైన గ్రామాల్లో కనివించాయి. అక్కడ రాతి కుప్పలు సరిహద్దుగా ఉన్న గుండ్రని గోతులు, శవపేటికలున్న సమాధులు, ఒక్కొక్కచోట ఈ సమాధులకు మార్గాలుగా గదులు, మృణ్మయ శవపేటికలు మొదలైన అనేక రకాల శిల్ప లక్షణాలు కనివించాయి. శవపేటికలున్న కొన్ని సమాధుల్లో రెండు లేక మూడు అరులున్నాయి. పెద్దమరూరు, చిన్నమరూరు దగ్గర బృహత్‌శిలా యుగానికి చెందిన వస్తువులు తవ్వకాలలో విస్తృతంగా లభించాయి.

మౌర్యుల, శాతవాహనుల కాలానికి సమకాలిక తొలిచారిత్రక దశకు చెందిన అనేక పరిశీలన స్థలాలున్నాయి. కర్నూలు జిల్లాలోని పీరాపురంలో అనేక శాతవాహనులు,తరవాతి కాలం నాటి నిర్మాణాలు లభించాయి. సాతానికోటలో శాతవాహనుల ప్రాకారం ఒకటి కనివించింది. క్రీ.శ. ఒకటి రెండు శతాబ్దాలకు చెందినదని చెప్పదగిన మరొక చారిత్రక పరిశీలనా స్థలం క్యాటూరు గుమ్మడం దగ్గర తవ్వి తీసిన తొలి ఇటుక దేవాలయాలు క్రీ.శ. 4–5 శతాబ్దాలకు చెందినవి. గుమ్మడంలో దొరికిన నిర్మాణాలు బహుశా ఆ ప్రాంతంలో శైవ దేవాలయాల తొలి శిల్పం అయి ఉండవచ్చు.

## 2. దేవాలయాల పునస్థాపన

క్రీ.శ. 4–5 శతాబ్దాల నుంచి 16–17 శతాబాల దాకా అంటే మధ్యయుగం చివరి కాలం దాకా ఉన్నట్లు చెప్పదగిన బ్రహ్మాండమైన దేవాలయాలు కృష్ణా, తుంగభద్రా నదీ ప్రాంతంలో ముఖ్యంగా శ్రీశైలం ముంపు ప్రాంతంలో ఎక్కువగా ఉన్నాయి. ఇది వరకే చెప్పినట్లు పీరాపురం–గుమ్మడంలో తవ్విన ఇటుక దేవాలయాలు తొలి హిందూ యుగం నాటి ఇటుక చెక్కడాలు. ఆ ప్రాంతం మూడు శిల్ప వైఖరులు కలిసిన ప్రాంతమనిపిస్తుంది. అవి కదంబ నాగర లేక పిరమిడ్ ఆకారంలో మెట్లున్న విమాన శైలి, రేఖానాగర, ద్రావిడ

వైఖరులు. గూడెంలో ఉన్న దేవాలయాలు తొలి కదంబనాగర దేవాలయాలు లేదా క్రీ.శ. 6వ శతాబ్దానికి చెందిన ఆకారంలో మెట్లున్న విమాన శైలిలోని వని చెప్పవచ్చు. ఇవి ప్రవేశ మందిరమున్న చిన్న గుడులు. అమరావతి బౌద్ధ శిల్పానికి మరీ దూరంలో లేని తీగల అల్లిక మొదలైనవి ఇక్కడ కూడ కనిపిస్తాయి. అయితే శిల్పాకారాలు మాత్రం పూర్తి పొందూ పద్ధతిలో ఉన్నాయి. అలంపూర్ దగ్గర నవబ్రహ్మ గుడుల సముదాయం, తుంగభద్ర కృష్ణల సంగమం దగ్గర ఉన్న కూడవల్లి సంగమేశ్వర దేవాలయం రేఖానగర పద్ధతికి అద్భుతమైన ఉదాహరణ, సిద్ధేశ్వరంలోని "అందరాల లో ఉన్న ఏకకూటాలు, భవనాశి కృష్ణానదుల సంగమం దగ్గర ఉన్న రూపాల సంగమేశ్వరం ద్రావిడ పద్ధతి కింద వర్గీకరించవచ్చు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వ పురావస్తు శాఖ, కేంద్ర ప్రభుత్వ పురావస్తు పరిశోధన శాఖ 1966లో గ్రామాల వారీగా ముంపు ప్రాంతంలో సర్వే జరిపాయి. ఫలితంగా పురావస్తువుల దృష్ట్యా, శిల్పం దృష్ట్యా పునస్థాపన కోసం 43 వర్గాల దేవాలయాలు ముఖ్యమని గుర్తించడమైంది. ఈ సర్వేవల్ల కింద తెలిపిన స్థూల శిల్ప పద్ధతులు దేవాలయ నిర్మాణంలో వెలుగులోకి వచ్చాయి.

1. రాష్ట్రకూటుల పద్ధతిలో కట్టిన దేవాలయాలు కూడలి సంగమేశ్వరం, రూపాల సంగమేశ్వరం, అలంపూర్ దగ్గర పాపనాశి సముదాయం, రూపాల సంగమేశ్వరం ప్రక్కనే ఉన్న భుజంగేశ్వర దేవాలయాలు రాష్ట్రకూట పద్ధతిలో ఉన్నాయి.
2. పశ్చిమ చాళుక్యులపద్ధతిలో కట్టిన దేవాలయాలు మల్లేశ్వరం, సోమశిల, ప్రాత కోట మొదలైనవి ఉన్న గుడులు దీనికి ఉదాహరణ.
3. a)విజయనగర పద్ధతిలో కట్టిన దేవాలయాలు జటప్రోలు లోని మదనగోపాలస్వామి, మంచాల కోటలోని మాధవ స్వామి గుడులు దీనికి ఉదాహరణ.

   b) ద్రావిడ విమానంతో చివరి విజయనగర పద్ధతిలో కట్టిన దేవాలయాలు చిన్నమరూరులోని చెన్న కేశవ దేవాలయం దీనికిఉదాహరణ.

పైన చెప్పిన పద్ధతుల్లో కట్టిన దేవాలయాలే కాక విజయనగర రాజుల కాలంలో పునరుద్ధరించిన దేవాలయాలు కొన్ని ఉన్నాయి. యార్ల దిన్నె దేవాలయంలో చాళుక్య విజయనగర పద్ధతుల మిశ్రమం కనబడుతుంది. పైన తెలిపిన అంశాల సారాంశం ఆ 43 దేవాలయ సముదాయాలను (మొత్తం 100 దేవాలయాలు) వాటి ప్రత్యేక శిల్ప పద్ధతుల్ని బట్టి పునస్థాపించడానికి ఎంపిక చేయడందానికి పాటించిన పద్ధతులివి.

1. రాష్ట్రకూట, పశ్చిమ చాళుక్య లేదా విజయనగరం వంటి ప్రత్యేక శిల్ప శైలి ఉన్న గుడులు.
2. ఒక ప్రత్యేక శిల్ప శైలి ఉన్న పునర్నిర్మితమయిన గుడులు.
3. వాడిన రాయికి ఊడదీసేటప్పుడు తొందరగా పగిలి పోయే స్వభావం ఉన్నందువల్ల పునస్థాపనకు పనికి రాక పెద్ద యెత్తున పునర్నిర్మితమయిన గుడులు.

ఉదా. (పగటూరులో ఉన్న త్రికూట శిల్ప శైలిలోని వరద రాజ స్వామి గుడి, శివుని గుడి విషయంలో వాటి నిర్మాణంలో ఉపయోగించిన రాయి మంచిది కాకపోవడం వల్ల, నిర్మాణంలో అంత నైపుణ్యం లేనందు వల్ల వాటిని పనికి రావని వదలివేయడమైంది. అయితే ఈ గుడులలోని అద్భుతమైన కొన్ని చెక్కడాలను, శిల్పాల తరలింపుకు ఎంపిక చేయడమైంది. ఇంకా కొన్ని సందర్భాల్లో స్థానికుల ఒత్తిడి వల్ల మొదట వదలి వేసిన గుడులు కొన్ని తప్పని సరిగ పునస్థాపించవలసి వచ్చింది.

## పునస్థాపనకు ప్రదేశాల ఎంపిక

ప్రతి క్షేత్రానికి ఒక తీర్థం అవసరమయినందు వల్ల, నదుల ఒడ్డున పూర్వం ఉన్న కొన్ని గుడులకు ఎప్పుడూ నీరు సరఫరా అయ్యే ప్రత్యామ్నాయ ప్రదేశమే

ఎంపిక చేయవలసి వచ్చింది. జాతప్రోలులోని మదన గోపాల స్వామి గుడి వంటి గుడుల్ని రోడ్డుకు దగ్గరగా, ముందున్న స్థలానికి, ఒక కి.మీ. దూరంలో కొత్త రిజర్వాయరుకు దగ్గరలో,ఎత్తు ప్రదేశంలో పునస్థాపించవలసి వచ్చింది. పాత స్థలానికి 2 కి.మీల దూరంలో కొత్త సోమశిల గ్రామంలో 14 గుడులున్న సోమశిల గుడుల సముదాయాన్ని పునస్థాపించడమైంది. సంవత్సరమంతా తగినంత నీరు లభ్యమయ్యేట్లుగాను, కొత్త చోటు యాత్రాప్రధానంగాను ఉండే పునస్థాపిత స్థలాలను ఎంపిక చేయడంలో చాలా జాగ్రత్త తీసుకోవడమైంది. ఈ సముదాయం పునర్నిర్మాణం తరవాత తూర్పు ముఖమై రిజర్వాయరులోని విశాలమైన నీటిని చూస్తూ, రెండు పక్కల ఉన్న కొండ ప్రాంతాన్ని కప్పిన దట్టమైన అడవిని అల్లుకొని ఉంది. శ్రీశైలం నుంచి సోమశిల వరకు ఉన్న లోతైన వాగు ద్వారా ఒక మోటారు బోట్ నడిపించాలన్న ప్రతిపాదన కూడ చేయడమైంది. అందువల్ల వరదకు కొట్టుకు పోని ప్రాక్చరిత్ర రాతి చెక్కడాలు, బృహత్‌శిలా యుగం నాటి రాతి బల్లలు, ఒక మధ్యయుగం కోట, దట్టమైన అడవి పచ్చదనం, క్రూర మృగాలు, అనేక రకాల పక్షులు మొ:నవి యాత్రికులు చూడవచ్చు. గజకేసరి స్తంభాలతో విజయనగర శిల్ప

పద్ధతిలో ఉన్న మంచాల కట్ట (మంత్రాల కట్ట అసలు పేరు) దేవాలయాలను తాలూకా కేంద్రమయిన కొల్లాపూర్‌లో పునస్థాపించడమైంది. రూపాల సంగమేశ్వర దేవాలయం రాష్ట్రకూటుల కాలానికి సంబంధించిన పెద్ద భవనం. అందులో చాలా అందంగా చెక్కిన నటరాజ, హరిహర, అంధకాసురవధ మూర్తి, ద్వార పాలురు, గంధర్వులు మొదలైన వారి విగ్రహాలు , ప్రతిమలు ఉన్నాయి. ఆ దేవాలయంలో ఉన్న అనేక శాసనాల్లో ఒక దానిలో అంకన, ప్రసాద (దేవాలయం) నిర్మాణ ప్రసక్తి ఉంది. కర్నూలు దగ్గర జగన్నాథ గట్టు మీద ఇప్పుడు ఆ దేవాలయం పునస్థాపనలో ఉంది. బాలబ్రహ్మేశ్వర దేవాలయ సముదాయం మధ్య అలంపురంలో చాల అందమైన, పెద్దదైన కూడలి సంగమేశ్వర దేవాలయ పునస్థాపన భారత పురావస్తు శాఖ చేస్తోంది. సిద్ధేశ్వరం, భుజంగేశ్వరం దేవాలయాలు కర్నూలు - శ్రీశైలం మార్గంలో ఉన్న బన్నూరులో పునర్నిర్మితమయ్యాయి. ఈ దేవాలయాలకు దగ్గరున్న కడప - కర్నూలు కాలువ వల్ల నీటిసరఫరా బాగుంది.

## మట్టిపరీక్ష

గట్టిపునాదుల కోసం గట్టి నేలనే ఎంపిక చేసుకోవడమైంది. దేవాలయాలు ముందు కట్టిన ప్రకారమే పునర్నిర్మితమయ్యాయి. ఏ సందర్భంలోను వాటిని మార్చలేదు. ఉదాహరణకు ఒక దేవాలయం తూర్పు ముఖమై ఉంటే పునర్నిర్మాణంలో కూడ దేవాలయ ముఖం అదే వైపు ఉంది.

## దేవాలయ భాగాల్ని ఊడదీయడంలోను, అంకెల గుర్తులు వేయడంలోను సమస్యలు

పునస్థాపన పనిలో అనేక సమస్యలున్నాయి.

1. నమూనా పత్రాల తయారీ
2. ఊడదీయడం
3. సరియైన స్థలాల్ని ఎంచుకోవడం
4. రవాణా చేయడం
5. పునర్నిర్మాణం

## 1. నమూనా పత్రాల తయారీ

పునస్థాపన కోసం ప్రతిపాదించిన కట్టడాలకు పూర్తిగా నమూనా పత్రాలు తయారు చేయాలి. చెట్లు చెదారం అంతా శుభ్రంగా తీసివేస్తే కాని దేవాలయంలోని అన్ని భాగాలూ స్పష్టంగా కనిపించవు. మంచి ఫోటోలు రావు. పూడి పోయిన భాగాలన్నీ తవ్వితే గాని పునాదుల నుంచి దేవాలయం పూర్తి ఆకారం కనిపించదు. కనక నమూనా పత్రాలు తయారు చేయడానికి ఈ కింద తెలిపిన పనులు చేయాలి.

అ) ప్రతి రాతి చెక్క చక్కగా కనబడేటట్లు రాతి మూలాల్ని శుభ్రం చేయడం.

ఆ) దేవాలయం నేల ప్లానును, ఆయా భాగాల పక్క భాగాల ప్లాను గీయించడం.

ఇ) మాసిపోని రంగుతో వాటిపై అంకెల గుర్తు వేయడం. గాలికి, వానకు బహిరంగంగా ఉండడం వల్ల రంగుతో వేసిన అంకెలు మాసిపోవడం, గాని చెరిగి పోవడం గాని జరుగుతుంటుంది. కనక దేవాలయం ప్రతి భాగానికి వెనక పక్క అంకెల్ని చెక్కడం బాగుంటుందని తెలిసింది. పురావస్తు శాస్త్రంలో అంగీకరించిన పరిభాష ప్రకారం అంకెలు వేసేటప్పుడు జాగ్రత్త తీసుకోవాలి. ఊడదీసిన భాగం ఉపరితలాన్ని కాస్టిక్ సోడాతో శుభ్రం చేయడం గాని రుద్దడం గాని చేయాలి.

### ఈ) ఛాయాచిత్రాలను తీయడం

పునస్థాపనకు ముందు అన్నిటికంటె ముఖ్యమైన అంశం ఛాయాచిత్రాలు తీయడం. రేఖాచిత్రాలు అలంకారికమైన వివరాలు చూపించలేవు. వాటి వల్ల సరైన ఆకారం, సాధారణ రూపం, చుట్టూ ఉన్న పరిసరాలు, ఆ ప్రదేశ సౌందర్యం స్పష్టంగా కనిపించవు. ఆకారంలో వక్రతలు, పాడయిన భాగాలు ఫోటోలు తీయడం వల్ల స్పష్టంగా తెలుస్తాయి. గ్రాఫిక్ సర్వే ఫోటోల మిశ్రమం వల్లనే దేవాలయం బొమ్మ సరిగ్గా వస్తుంది. ఎంచుకున్న దేవాలయాన్ని గుర్తులు చేయకముందు, వేసిన తరవాత కుడి, భిన్న కోణాల నుంచి, అనేకవైపుల నుంచి ఫోటోలు తీయాలి. విమానం లేదా గోపురం వంటిపై భాగాల్ని ఫోటో తీసేటప్పుడు, తప్పకుండ ఫోటోగ్రాఫిక్ టవర్లను ఉపయోగించాలి.

### ఉ) క్రతు నిర్వర్తన

ఆగమాల్లో శాస్త్రాల్లో చెప్పినట్లు వర్గాలకు సంఖ్యలు వేసే ముందు "కళాప్రకరణ" లేదా "కళాప్రకర్షణ" అంటే ఒక దేవుడి కళలను ప్రకర్షించి ఒక కలశంలో భద్ర పరచడం. ఆ కళలున్న కలశాన్ని నిత్య పూజాకార్యక్రమం జరిగే ఒక గుడి గర్భ గుడిలో ఉంచి పూజాదికాలు చేయాలి. వర్గాలకు అంకెలు వేసే ముందే "కళాప్రకర్షణ" జరగాలి. అందువల్ల లోపలి వర్గాలకు కూడ అంకెలు వేయడానికి వీలవుతుంది.

### ఊ) అంకెల గుర్తింపు

కింద ఉన్న "అధరశిల" దగ్గర నుంచి పైన ఉండే "స్తూపి" దాకా ప్రతి భాగాన్ని ఆ భాగం దేనికి సంబంధించిందో దానిలో మొదటి అక్షరం గుర్తించి, తరవాత అంకెలు వేయాలి. ఉదాహరణకు, "అధరశిల" లో చెక్కిన మొదటి రాయిపై 'AS-1-S' అనే అక్షరం 'SOUTH' దక్షిణం వైపును సూచిస్తుంది. అట్లాగే, వరసగా ఉండే చిత్రమాల, ఉపపీఠ, కుముద, అధిష్ఠాన పీఠ వంటి వాటికి అదే వరసలో గుర్తింపు అంకెలను వేయాలి. స్తంభ వర్ణమైన గోడలు లేదా భిత్తులను గడియారం ముల్లు తిరిగే దిశలో గుర్తించాలి.

ఋ) దేవాలయం పక్కల్లో (అంటే తూర్పు, పశ్చిమం, ఉత్తరం, దక్షిణం) ఎత్తున ఉన్న చిత్రాల వివరాలను పెద్ద కొలతల్లోకి తేవాలి. రాళ్ళ మీద గుర్తించిన అంకెల నన్నింటిని నమూనా పటంలో కూడ గుర్తించాలి. పునర్నిర్మాణంతో ఎత్తులో ఉన్న చిత్రాలే మార్గదర్శకంగా ఉంటాయి. అంకెలు గుర్తించిన రాళ్ళు రాయి వాటి కచ్చితమైన ఆకారంతో సహా స్పష్టంగా ఉండాలి. అంకెల గుర్తింపు పూర్తయ్యాక దేవాలయాన్ని ప్రతి దిక్కు నుంచి పెద్ద ఫోటో తీయాలి. అందువల్ల కట్టడంలోని ప్రతి భాగం సరిగ్గా ఉందో లేదో మరల కట్టేటప్పుడు పరిశీలించడానికి వీలవుతుంది. ఈశాన్య దిశగా ఉన్న వర్గాలకు ముందుగా అంకెలు గుర్తించడం ఆచారంగా వస్తోంది. ఒకవేళ ఈశాన్యం వైపు శిథిలమయినా, పాడయినా, అంకెల గుర్తింపు తరవాత దిశ కాబట్టి ఆగ్నేయ దిశ నుంచి ప్రారంభించాలి.

### ఊడదీయడం

ఊడదీయడం అంటే రాళ్ళ భాగాల్ని తీసే పనికి పైనుంచి అంటే స్తూపి నుంచి మొదలు పెట్టాలి. గర్భగుడిలోని ఖాళీ ప్రదేశాన్నంతా మట్టితో నింపాలి. పైనుంచి ఊడదీసేటప్పుడు ఏ భాగమయినా కింద పడితే అది పాడవకుండా ఉంటుంది. దేవాలయం పక్క గోడలకు ఏటవాలుగా ఇనుప స్తంభాలు ఆధారంగా పెట్టాలి. ప్రగటూరు లోని వరదరాజస్వామి దేవాలయంపై అంతస్థునుంచి పెద్ద అడ్డ దూలాన్ని ఊడదీసేటప్పుడు,

ఏటవాలుగా ఇనుప స్తంభాలను ఆధారంగా పెట్టడానికి బదులు, నేల మీద నుంచి పై వరకు పెద్ద మట్టికట్టను ఏటవాలుగా వేయడమైంది. చెక్కరోలర్ల సహాయంతో జాగ్రత్తగా బరువైన రాతి దూలాలను దింపడమైంది. రాళ్ళను దింపడానికి రోలర్లుగా ఇనుప గొట్టాలను వాడకూడదు.

ఊడదీసిన వర్గాలను వొరల వారీగా, దిశల వారీగా ఎంచుకొన్న కొత్త ప్రదేశంలో ఉంచాలి. ఉదాహరణకు, అధరశిల భాగాలన్ని వరస క్రమంలో అంకెల ప్రకారం ఒక చోట ఉంచాలి. దిశల వారీగా వాటినన్నింటిని ఉంచాలి. అంటే దక్షిణం వైపున్న రాయిని దక్షిణం వైపుకు దగ్గరగా ఉన్న స్థలం లోనే వరస క్రమంలో ఉంచాలి. ఆ భాగాన్ని సులభంగా గుర్తించడానికి, వరస క్రమంలో పునర్నిర్మాణం జరిగే చోటికి వాటిని తరలించడానికి ఈ పద్ధతిని అవలంబించడమైంది.

## రవాణా

ఊడదీసిన వర్గాలను చక్కరోలర్ల సహాయంతో మట్టి కట్టమీద నుంచి దొర్లించాలి. అవి నేల మీదకు పడేటప్పుడు బరువైన చక్క ఇరుసు, ఒక అడుగు ఎత్తులో చిన్న చక్రాలున్న లాగుడుబండి (స్లెడ్జ్‌కార్ట్) మీదకు తీసుకోవాలి.

## పునర్నిర్మాణం

పునర్నిర్మాణం కోసం స్థలం ఎంపిక చేసుకొన్న తరవాత అధిష్ఠానంపనికి పూనుకోవాలి. పునాది గుంట లోతు, వెడల్పు ఆధునిక నిర్మాణ పద్ధతి ప్రకారం అధరశిల నుంచి "స్తూపి" వరకు దేవాలయం బరువును బట్టి ఉండాలి. బేస్‌మెంటు వెయ్యడానికి ముందే అక్కడ మట్టి మచ్చును మట్టి పరీక్ష ప్రయోగ శాలకు పంపితే మంచిది. బురద ప్రాంతానికి దగ్గరలో ఉన్నా,అక్కడ బల్లపరుపు భూమిలో నీటి ప్రమాణం ఎక్కువగా ఉన్నా ఊటరాకుండా ఉండడం కోసం పునాది వేస్తే మంచిది. బన్నూరు దగ్గర ఉన్న భుజంగేశ్వర, సిద్ధేశ్వర దేవాలయాల్ని పునర్నిర్మాణంలో కడప-కర్నూలు కాలవ దగ్గరవడం వల్ల రీఇన్‌ఫోర్స్‌డ్ రాఫ్ట్ పునాది వేయడం జరిగింది. దేవాలయాన్ని పునర్నిర్మించే టప్పుడు సాధారణంగా ఈశాన్యం మూలనుంచి కుడివేపుగా మొదలు పెడతారు. ద్వార స్తంభాలు, స్తంభాలు గర్భగృహం పైన ఉన్న ఎత్తునకు సరిపడే ఎత్తులో భూమిమీద నిలిపి కడతారు. తరవాత అడ్డంగా ఉన్న దూలాల మీద పైకప్పు వేస్తారు.

అనేక దేవాలయాల్లో గర్భగుడి గోడలు రెండు వొరలుగా కట్టి ఆ వొరల మధ్యలో మట్టి నింపినట్లు గుర్తించడమైంది. ఈ అలవాటు బుద్ధుని కాలం నుంచి వాడుకలో ఉంది. బరువైన నిర్మాణం తూకాన్ని భరించేటట్లుగా అట్లా కట్టే వారని దీని వల్ల తెలుస్తుంది.

ఊడదీయడానికి ముందు తయారు చేసిన నమూనా పటాల్లో ఎలివేషన్స్‌లో, ఫొటోలలో ఉన్నట్లుగానే పునర్నిర్మాణం పని జరగాలి. కడుతున్నపుడు ఎత్తులు, కొలతలు ఎప్పటి కప్పుడు సరిచూచుకోవాలి. సబ్బునీళ్ళతో తేలిక రసాయనాలతో గాని, అంతకు ముందు వర్గాలపై రంగుతో వేసిన అంకెలను తుడిచి వేయాలి. పునర్నిర్మితమయిన దేవాలయం అంకితం చేయడానికి సిద్ధం కాగానే పూజార్హమై పగలకుండా ఉన్న విగ్రహాలున్నట్లయితే, "కళాన్యాస" అనే క్రతువును నిర్వర్తించాలి. అంటే దర్భలతో మరల కళాకర్షణ కలశంలోని దివ్యశక్తిని ఆకర్షించడం, దాంతో పాటే మహాసంప్రోక్షణ లేదా కుంభాభిషేకాన్ని చెయ్యాలి. ఇదే నిత్య పూజాదికాలు జరిగిన పునర్నిర్మిత దేవాలయానికి జరిగే ఆఖరు తంతు. ఒకవేళ ఆ గుడి పాడుబడి పోయిన దయితే ఈ చివరి తంతు నిర్వర్తించనవసరం లేదు గుర్తించిన 43 దేవాలయ సముదాయాల్లో అనేకమైన దేవాలయాలు, ప్రాత కోట, అలంపురం దగ్గర పాపనాశి, సోమశిల సముదాయాల వంటివి కొన్ని తప్పించి, పునర్నిర్మిత మయ్యాయి. ప్రాతకోట పాత గ్రామం చాలా పెద్ద దవడం వల్ల అంత ప్రదేశం మరల గ్రామస్థుల పునరావాసానికి దొరక నందువల్ల, కడప, కర్నూలు కాలవకు తూర్పున, పశ్చిమాన జనాన్ని రెండు భాగాలుగా, రెండుచోట్ల విడదీసి



(మిగతా 222వ పేజీలో)

# ఇంటిపేర్ల మార్పు

ఆచార్య తూమాటి దొణప్ప
తెలుగు విశ్వవిద్యాలయం

అది అసఫ్‌జాహీ సల్తనత్‌నసబ్‌నామా - వంశ పరంపర - లో ఆఖిరీ నిజాము హయాము. తన ఇలాఖా ప్రజలను కన్నబిడ్డలుగా భావించి పాలించిన వెనకటి నిజాం మహబూబ్ అలీ ఖాన్ ప్రజల చూపులో నిజంగా అబుల్‌ఫజల్ అని అభిజ్ఞులంటూ ఉంటారు. మరి తర్వాత తఖ్తునెక్కిన ఉస్మాన్ అలీఖాన్ పిత్ర్యంగా పొందినది రాజ్యాధికారమేకాని ప్రకృతిరంజనం కాదు. స్వతహాగా అతని బుర్రలో తొలిచేదో, లేక ఎవరైనా చెవులు కొరికే చాడీకోరుల చెడుసలహాలపై తోచేదో కాని, ఆఖిరీ నిజాముకు తెలుగు పలుకు వినిపిస్తే ఉలికిపాటు, తెలుగులిపి కనిపిస్తే తడబాటు, తెలుగుదనంవాసనిస్తే కలవరపాటు, తెలుగుగాలివీస్తే గగుర్పాటు. తెలుగు సభలంటే గుండెపోటు. అందులోనూ సంస్థానంబయట భారత జాతీయసమరం ముమ్మరంగా సాగుతూ ఉన్న రోజులవి. ఛప్పన్నారు దేశాలలో సర్వస్వతంత్ర పాలకుడు కావాలన్న తుర్తీపుర్తీ - తపనా, సలాకార్లుకాని రజాకార్, జతగాళ్ల వత్తాసూ, ఇతర విద్రోహకారుల - దఘల్‌బాజీశక్తుల జులుం జబర్దస్తీలూ తోడుకాగా, సంస్థానం తాలూకు ప్రజలకు గడిగడి గండంగా గడచిన గడ్డు గడియలవి. ఈ ఆటుపోట్లకు తోడు జాతీయ సదురపు సెగాపొగా తగిలి నిజాం ఇలాఖా జనం రగిలిపొగిలినప్పుడు ప్రజల ఊహాలపై, ఉద్యమాలపై ఉచ్చులు మరింత బిర్రబిగిసేవి. బహిరంగసభలుకాని, ఊరేగింపులుకాని, ఉత్సవాలుకాని జరుపుకోవడానికి అన్నీ పేచా పేచీలే, అన్నీ తంటాతకరారులే! ఎన్నెన్నో గస్తీ నిషాన్‌లూ, ఎకరార్నామాలూ, గైర్ ముల్కీ ఖానూన్‌లూ వగైరాలు జనుల గొంతులకు ఉరితాళ్ళుగా, కాలిసంకెళ్ళుగా, నోటితాళాలుగా అమలులో ఉండేవి.

గ్రంథాలయ కార్యక్రమాలపేర, సంస్కరణోద్యమాల చాటున, సాహితీసాంస్కృతిక సభల సాకుతో, కవులూ కళాకారుల సత్కారాల మిషతో - ఏ రావిచెట్టు వారింటనో, ఏ హనుమంతరావుగారి భవంతిలోనో, మరీ ఫరవాలేదనుకుంటే శ్రీకృష్ణదేవరాయాంధ్ర భాషా నిలయంలోనో చాటుమాటు, సమావేశాలు కార్యకర్తల చలాకీతనంతో గప్‌చుప్‌గా జరిగేవి. పశ్చిమాంధ్ర ప్రాంతంనుంచో, సాగరాంధ్ర తీరంనుంచో ప్రజాశ్రేయఃకాములైన నాయకులు నిజాం హద్‌బందీదాటి లోపల అడుగుపెడితే చాలు, వారి అంటూసొంటూ గిట్టని అధికారవర్గమూ వారి సిబ్బందీ తరతరలాడుతూ వేయికళ్ళతో నిఘా పహారాలు చేసేవారు. సదరదాలత్ కోర్టు అమీనుల తాఖీదు తప్రీఫ్‌లతో, నాజిరీ అదాలత్ నిగాబానుల తర్జుమా దప్తరీ తహజ్జీ దర్జుమాలలో, తీర్పులివ్వడానికి తయారైన హుకుందారీ హుజూరు కచేరి దర్వానుల పిలుపులతో, కొత్వాలీ నిగాచానుల నమూదారీ నక్షాలలో, తారీతపాలాదప్తరీ జవానుల వాకబులలో ఆంధ్ర నాయకులపేర్లు వింతవింత రూపాలతో వినిపించేవి; కనిపించేవి. టాంగ్‌టూటీపీర్‌కాశీం, పట్టాభాయ్ సత్తార్‌మియా, టప్పాభాయ్ సత్తార్ మియా, ఖొండా పెన్నా టప్పాభాయ్ పెంటాలూ - వంటివి వీటికి కొన్ని ఉదాహరణాలు. మొదటిది టంగుటూరిప్రకాశంగారి పేరు. రెండూ మూడూ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారి వికృతిరూపాలు, చివరిది కొండా వెంకటప్పయ్య పంతులు గారి పేరుకు వచ్చిన తిప్పలు. ఉర్దూభాషీయులమాట అటుంచి, ఉర్దూ భాషా ముఖంగా ఓనమాలు దిద్దుకుని, తరిఫీదు పొంది, పట్టాలు స్వీకరించి,

పదస్థులైన తెలుగువారి ఉచ్చారణతోపాటు తెలుగు భాషాజ్ఞానం సైతం అంతంత మాత్రంగా ఉండేది. ఇక, తతిమ్మా అలగాజనం నిశానీశాల్తీల ఉచ్చారణతీరు గూర్చి హాయ్‌రాన పడ (ఆశ్చర్యపడ) నక్కరలేదు! ఉర్దూలిపి కూర్పులో, ధ్వనుల పలుకు తీర్పులో తెలుగువారి పేర్లకు వచ్చిన మార్పులివి. టాంగ్‌టూటీ అంటే కాళ్ళు విరిగిన అనీ టప్పాఖాస్ అంటే తపాలా బంట్రోతు అనీ అర్థాలు. ఈ తరహా ఉల్టాపల్టా ఉచ్చారణ - ఉచ్చాటనలకు బలియైన తెలుగువారి పేర్లకు వీటికి ఉదాహరణలుగా స్థానికులైన పెద్దలు పేర్కొంటూ చమత్కరిస్తూ ఉంటారు.

దేశకాల వస్తు వ్యక్తి జన్మసంస్కార వృత్తి ప్రవృత్త్యాది ఉపాధిభేదాలను ఆశ్రయించి ఇంటిపేర్లు ఏర్పడుతూంటాయని వెనకటి ప్రసంగంలో స్థిరీకరించడం జరిగింది. అందువల్ల ఈ ఇంటిపేర్లు స్థిరంగా ఉంటాయన్న భరోసా ఎవ్వరూ ఇవ్వలేరు. అయితే, అనేక కారణాలవల్ల కొన్ని ఇంటిపేర్లు చకచకా మార్పులకు లోనుకావచ్చు; వాటి అభావంలో కొన్ని చాల తరాలకుగాని మార్పునందకపోవచ్చు. ఉపాధిభేదాలైన దేశకాలాదులు మారినప్పుడల్లా ఇంటిపేర్లు సర్వసామాన్యంగా మారిపోతాయని నిరూపించడమే ప్రకృత ప్రసంగానికి పరమార్థం.

ఇంటిపేర్ల మార్పులకు హేతువులు అనేకం. దత్తువెళ్ళినప్పుడూ, స్త్రీకి వివాహానంతరమూ, స్త్రీ విడాకులు పొందినప్పుడూ, ప్రసిద్ధుల ఇంటికి పురుషులు ఇల్లరికం వెళ్ళినప్పుడూ, అశ్లీలార్థక, నీచార్థక నివారణకూ ఇంటిపేర్లు మారడం సహజం. ఇవికాక, కృత్రిమ వ్యుత్పత్తులూ సంస్కృతీకరణలూ, పోషకుల మెహర్బానీకై కవి పండితులు చేసిన కైవారాల చమత్కారాలూ, ఆయా వ్యక్తుల అవయవ వైకల్యాలూ, కొత్తగా చేపట్టిన వృత్తి ప్రవృత్తులూ ఒ ఇలాగా ఎన్నెన్నో అంశాలు ఇంటిపేర్ల మార్పునకు హేతుభూతాలవుతుంటాయి. ప్రకృతం ఒక్కొక్క అంశాన్ని విడివిడిగా సోదాహరణంగా పరిశీలిద్దాం.

కొడుకులు కొమ్మలు లేని దంపతులకు నరకం తప్పదని మన నమ్మకం. అందుకని దత్తు తెచ్చుకోవడం పరిపాటి. దత్తువెళ్తే దత్తుడి జనక పితరుల ఇంటిపేరు పాలకపితరుల ఇంటి పేరుగా మారుతుంది. కాశీ కృష్ణాచార్యులు పుట్టుకతో అక్కివారి అబ్బాయి. వాడ్రేవు పురుషోత్తం జనకపితరులు అమలాపురం నివాసులు జోగులాంబ, సుబ్బారావులు మంచాళవారు. ప్రసిద్ధ సంగీత విద్వాంసులు మంచాళ జగన్నాథరావుగారూ, వీరూ ఏకోదరులు. గుడిపాటి వెంకటచలం కొమ్మూరివారి కుర్రవాడు; కొమ్మూరి వెంకట్రామయ్యగారి సోదరులు. ఎలమంచిలి గ్రామనివాసులు పూడిపెద్దిగోపాలశాస్త్రిగారి కుమారులు వెంకటచయనులు విశాఖపట్టణం వాస్తవ్యులు శ్రీరంగం సూర్యనారాయణగారికి దత్తువచ్చి శ్రీరంగం వెంకటరమణయ్య (శ్రీశ్రీ జనకులు) గామారాడు. విజయనగరం వాస్తవ్యులు. మూలాపేరన్న శాస్త్రి తాతావారి ఔరసపుత్రులు.

ఆంధ్రప్రదేశ్ హైకోర్టు న్యాయమూర్తి జస్టిస్ శ్రీ ఎద్దుల సీతారామరెడ్డిగారి జనక పితరులు ఉండవిల్లి వాస్తవ్యులు పొడుగు వెంకట్రామమ్మ చెన్నారెడ్డి దంపతులు. కంచుపాడు నివాసులైన ఎద్దుల తులశమ్మ తిప్పారెడ్డిగార్లు వీరి పాలకపితరులు. ప్రఖ్యాత మానసిక వైద్యులు డాక్టర్ పొడుగు రఘురామరెడ్డిగారు జస్టిస్ సీతారామరెడ్డిగారిది స్వయానా సోదరులు. కాకతీయవిశ్వవిద్యాలయ మాజీవైస్ - ఛాన్సలర్ ఆచార్య వెంకట్రామయ్యగారు కైలాసవారి ఇంటికి దత్తులు. మూలకుల గోత్రీయ ఆర్యవైశ్యకులోద్భవులు ఖమ్మం జిల్లా మధిరతాలూరా వెజెళ్ళపాడు గ్రామవాసులు. శ్రీ తొండెపు రత్నమ్మ, ఆదెయ్యలు వీరి జనక పితరులు. ఇదే కులగోత్రాలుగల సికిందరాబాదు సోమ సుందరంపేట వాస్తవ్యులు కైలాస నరసమ్మ వెంకన్నలు పాలక పితరులు. అలాగే పాపన్నపేట జమీందారు రాజారామచంద్రరెడ్డిగారుకూడా దత్తులే. శ్రీవత్స సగోత్రులు అల్లాడ అంబమ్మ లక్ష్మణశాస్త్రుల కుమారులైన వెంకటనరసింహయ్య రంగంపేట నివాసులైన గుడిమంచి అంబయ్యకు దత్తుడుగావెళ్ళి గుడిమంచి బంగారు శాస్త్రిగా మారినారు. పద్దెనిమిదో శతాబ్దినాటి తెలంగాణా యక్షగాన కర్తలలో బంగారుశాస్త్రి ఒకరు. ప్రసిద్ధ విద్వత్పరిశోధకులు రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

కర్నమడకల అలవేలుమంగమ్మ కృష్ణమాచార్యుల ఔరసపుత్రులు. అనంతపురంజిల్లా రాళ్ళపల్లి గ్రామవాస్తవ్యులైన పీరిమాతామహి రాళ్ళపల్లి లక్ష్మమ్మగారి దత్తు స్వీకారమైనందున ఇంటిపేరు మారింది.

వివాహానంతరం స్త్రీ పుట్టింటిపేరు స్థానంలో సాధారణంగా అత్తింటివారిపేరు వచ్చి నిలుస్తుంది. భండారు అచ్చమాంబ పుట్టింటిపేరు కొమర్రాజువారు. గొడేవారి ఆడపడుచు పెళ్ళయ్యాక మదినె సుభద్రయ్యమ్మగా మారింది. అన్నాప్రగడ చన్నఘంటమ్మ కల్లివారికన్య. ఆవుల జయప్రదాదేవి లింగంవారి ఆడబడుచు. కొత్త లక్ష్మీరఘురామ్ జంపాల వారి ఆడపడుచు గారపాటి రేణుకాచౌదరి కానుమిల్లివారికన్య. నారాయణాచార్యుల భార్య పుట్టపర్తి కనకమ్మ కిడాంబి శేషమ్మ దేశికాచార్యుల తనయ. కోటిరెడ్డిగారి భార్య కడపరామసుబ్బమ్మ (1902-1982) కొనదుల అచ్చమ్మ రామచంద్రారెడ్డి (1886-1981), కడప జిల్లా జమ్ముల మడుగు తాలుకా సుద్దపల్లె వాస్తవ్యులు) గార్ల కూతురు, మాజీరాష్ట్రపతి డాక్టర్ నీలం సంజీవరెడ్డిగారి సతిమణి నీలం నాగరత్నమ్మ తరిమెలసుబ్బారెడ్డిగారి పుత్రిక. నాగిరెడ్డిగారి భార్య తరిమెల లక్ష్మీకాంతమ్మ నీలం సంజీవరెడ్డిగారి సోదరి ఇల్లిందల సీతారామారావుగారి భార్య సరస్వతీదేవి కామరాజు రత్నమ్మ, వెంకటప్పయ్యలకన్య. టి.యన్. (తక్కెళ్ళనారాయణ) సదాలక్ష్మి కర్రిగోపమ్మ, కొండయ్యల పుత్రిక. మల్లాది సుబ్బమ్మ కొండూరివారి కూతురు. మాదిరెడ్డి సులోచనగారి పుట్టింటిపేరు మామిడివారు. యద్దనపూడి సులోచనారాణి పుట్టింటివారు నెమలికంటివారు. తెలంగాణం శంకరంపేట వాస్తవ్యులు శ్రీ వైష్ణవ బ్రాహ్మణులు చింతామణి వెంకటలక్ష్మమ్మ శేషాచార్యుల తనయ ఆండాళమ్మ బోయినిపల్లె వారి కోడలై కృష్ణమాచార్యుల ఇల్లాలైనది. గద్వాలాస్థాన విద్వత్కవి చింతామణి యామునాచార్యుల సోదరియైన ఈమెకవయిత్రి కూడా.

పాఠకులు తబ్బిబ్బు పడకుండానూ, ప్రచురణకర్తలకూ, పంపిణీదారులకూ, పుస్తక విక్రేతలకూ వ్యాపారపరంగా ఇబ్బంది కలగకూండానూ పుట్టింటిపేరూ, అత్తింటిపేరూ రెండూ (పుట్టింటి పేరు బ్రాకెట్లలో అనుకోండి) పెట్టుకుంటున్న రచయిత్రులు లబ్ధప్రతిష్ఠలు కొందరు కనిపిస్తారు. ఆరెకపూడి (కోడూరి) కౌసల్యాదేవి, శిఖా (గంటి) వెంకటరమణ, సత్యవాడ (టేగేటి) ఇందిరాదేవి, అవసరాల (వింజమూరి) అనసూయాదేవి మొదలైనవారిని ఇందుకు ఉదాహరణలుగా పేర్కొనవచ్చు.

పెళ్ళి అయిన తర్వాతకూడా పుట్టింటిపేరుతోటి వాడుక పడ్డవారు కూడ కనిపిస్తారు. డాక్టర్ కొమర్రాజు అచ్చమాంబ, డాక్టర్ తూమాటి అనురాధ (అత్తింటిపేరు గుర్రంవారు), డాక్టర్ నాయని కృష్ణకుమారి (అత్తిల్లు కనకవల్లి), శ్రీమతి నిడదవోలు మాలతి (అత్తిల్లు ఫాల్చెరు), డాక్టర్ అన్నే లలితకుమారి (అత్తిల్లు వుయ్యూరు), శ్రీమతి తెన్నేటి సుధ (అత్తిల్లు రావలరామరాజు) డా. ఇల్లిందల చిత్ర (భర్త నడింపల్లివారు), కూచి (కె.) రామలక్ష్మి (భాగవతుల) ఆరుద్రగారి సతి - మొదలైనవారు ఈ వర్గం కిందికి వస్తారు. అయితే, విదేశీయాత్రల అనుమతి పత్రాలలో, సివిల్ మ్యారేజి అర్హతా పత్రాలలో అత్తింటిపేరు నమోదుచేసినప్పటికి స్వదేశంలో పుట్టింటిపేరుతోటి కొందరు చెలామణి అవుతున్నారు.

విడాకులు పొందిన స్త్రీల ఇంటిపేర్లు "మనోవర్తి" పొందినా, పొందకపోయినా ఫలానా పద్ధతిలోనే ఉండాలని విడాకుల చట్టం నిర్దిష్టంగా, నిర్ద్వంద్వంగా నిర్దేశించదు. వ్యక్తిగతమైన నిర్ణయాలపై ఈ పేరు మార్పిడి ఆధారపడి ఉంటుంది. భర్త ఇంటిపేరే, ఉంచుకోవచ్చు, లేదా పుట్టింటి పేరుకు మారవచ్చు. లేక రెండింటి ప్రమేయంలేక అంటే ఇంటిపేరుకు అతీతంగా ఉండవచ్చు. దద్దనాలవారి ఆడబడుచు పెళ్ళయ్యాక ముప్పాళ్ళ రంగనాయకమ్మగా వాడుకకెక్కి విడాకుల తర్వాత రెండింటినీ కాదని వట్టి "రంగనాయకమ్మ"గా తమ సాహితీసృష్టి సాగిస్తున్నారు. వితంతువుగానీ, విడాకులు పొందిన మహిళగానీ పునర్వివాహం చేసుకుంటే దంపతుల ఇష్టానిష్టాలపై ఇంటిపేరు ఆధారపడి ఉంటుంది. అవివాహితల

ఇంటిపేరు మారదని విడిగా పేర్కొనక్కరలేదు.

ప్రసిద్ధుల ఇంటికి ఇల్లరికం వెళ్తే అల్లుడి ఇంటిపేరు అడపాదడపా మారిన సంఘటనలు అక్కడక్కడ కనిపిస్తాయి. కర్నూలు జిల్లా వెలుగోడు మండలం రేగడి గూడూరువాసులు దుబ్బా పెదలింగారెడ్డి కోయిలకుంట్ల తాలూకా ఉయ్యాలవాడ గ్రామవాస్తవ్యులు దానశీలురు బుడ్డావెంగళరెడ్డి గారి చెల్లెలిని పెళ్ళాడినందున తామరతంపరగా వర్ధిల్లిన పెదలింగారెడ్డి వంశపరంపరలో "బుడ్డా" ఇంటిపేరుగా స్థిరోభవ అయింది. సంతతీ, జ్ఞాతి సంతతీ లేని అక్కగారు (చింతలాంపల్లి పోతులనాగమ్మ బాల నాగప్పల కొమార్తె) వెల్నాటి పెద్దక్క (ఈమె వెల్నాటి ఓబన్న భార్య) తమ్ముడైన పోతుల వెంకటప్ప, గంజికుంటగ్రామం - వజ్రకరూరు వండలం, అనంతపురం జిల్లా - వచ్చి అక్కగారికి తోడుగా నిలిచి స్థిరపడి ఇంటా బయటా వ్యవహారాలు నిర్వహిస్తూ దానవిక్రయం మూలంగా అక్కగారి ఆస్తిపాస్తులకు హక్కుదారుడైనందున వెల్నాటి వెంకటప్పగా జనంలో వాడుకపడ్డారు. పోతుల వెంకటప్ప అన్నపేరు కౌలు కదపాలు, దస్తావేజుల మతలబులకు మాత్రం పరిమితం. ఇది ఇల్లరికమూకాదు, అలాగనీ దత్తూకాదు. వెంకటప్పభార్య లక్ష్మమ్మ పుట్టిల్లు లత్తవరం. మహబూబ్‌నగర్ జిల్లాలోని "కిసిరెడ్డి" వారు "మంద" వారి ఇంటికి ఇల్లరికం వెళ్ళి "మంద"వారుగా మారారు. వకీలు మంద బాలకృష్ణారెడ్డి భార్యది "మకురాల" అందుకే "మంద" వారిలో ఈ శాఖవారు "మకురాల" ఇంటిపేరివారయ్యారు.

పోషకుల వంశనామానికి సమీపోచ్చారణం కలిగి, పురాణోక్తమైన ఏదో ఒక క్షత్రియశాఖతో ముడిపెట్టి వారి ఆభిజాత్యాన్ని ఆకాశపుటంచులకెత్తి పొగడ్తలతో ముంచెత్తి ఉబ్బించి, పబ్బంగడుపుకోవడం పోష్యవర్గానికి చెందిన కవుల ఆనవాయితీ. దీనికి వలసినన్ని సాక్ష్యాలు చరిత్ర పుటలలో సాక్షాత్కరిస్తాయి. బ్రహ్మ "చుళుకం" నుంచి పుట్టిన ఒక ప్రముఖవ్యక్తి సంతతి "చౌళుక్య"గా రూపొంది చిరకాల వ్యవహారంలో అదే "చాళుక్య"గా మారిందని శాసనకవుల సంజాయిషీ. "సలికి" అని శాసనాల పాఠం. విజయనగర రాజ్యపాలకులలో అతి ప్రసిద్ధులైన శ్రీకృష్ణదేవరాయల తాతముత్తాతలు తుళు/తౌళవ భాషావ్యవహారప్రాంతానికి చెంది, ఆ పిమ్మట తెలుగుగడ్డపై అడుగుపెట్టి అందలమెక్కినందున వారి వంశనామం తళువగా ఉపశ్లోకితమైందని చరిత్రకారుల కథనం. మనుచరిత్ర ప్రబంధకర్త అల్లసాని పెద్దన, కృతిపతియైన కృష్ణరాయల వంశావతార కీర్తనంచేస్తూ ప్రసిద్ధ చంద్రవంశ క్షత్రియ చక్రవర్తి యయాతి కుమారులలో ఒకరైన "తుర్వసు" నామకవ్యక్తి నుంచి తళువ వంశనామం సంక్రమించినట్లు "...తుళువాన్వవాయమయ్యె" నని రూపించడం మనకు తెలుసు.

ఇంగ్లీషు కుంఫిణీ సర్కారువారికి నడినెత్తిమీది "మేకు"గా తయారైనందున నూజివీడు సంస్థానాధిపతుల ఇంటిపేరు "మేకా" గా రూపొందిందని ఒక ఆధునిక కవిగారికైవారం. కుంఫిణీ లష్కరు వారి రోజువారీ ఆగడాల బెడదలనుంచి తమను రక్షించుమని సంస్థాన ప్రజలు చిన్నాచితకా, ముసలీముతకా ఈ "మేకు"ను "మేకా!మేకా!" అని అలగోడు బాలగోడుగా మొరపెట్టుకున్నారట! సంబుద్ధిసహితమైన ఈ ఆర్తనాదమే వీరి ఇంటిపేరు "మేకా"గా స్థిరపడిందని ఈ కవిగారి సమర్థింపు. నూజివీడు సంస్థానపాలకులలో ఒకరైన నారయ్యాప్పారావు (క్రీ.శ. 1772-1782) కొన్ని కారణాలవల్ల కుంఫిణీ సర్కారుపై తిరుగుబాటొనర్చి కొన్నేళ్ళపాటు కుంఫిణీ సేనలతో మెరపుపోటు లడాయిచేసి ముప్పతిప్పలు పెట్టిన మాట చరిత్రపుటలలోని యదార్థగాథయే. కాని, నారయ్యాప్పారావుకు చాల పూర్వమే ఈ సంస్థానపాలకులకు "మేకా" అన్న ఇంటిపేరు వాడుకలో ఉంది. నారయ్యాప్పారావుకు పూర్వం నూజివీడు పాలకులు కుంఫిణీ సర్కారుమీద గానీ, గోలకొండనవాబులతోగానీ తలపడినట్లు దాఖలాలు లేవు. విప్పర్ల గోత్రజుడైన మేకాబసవన్న నూజివీడు వారికోవకు మూలపురుషుడు. పైగా, "మేకా" అన్న గృహనామం తెలుగునాట ఇతరకులాలలోనూ ప్రచురం. కాగా, కవిగారి కైవారంలోని కథనం అర్థరహితం, ఆధారరహితం.

పురాణాలలోని పృథుచక్రవర్తిలాగా కలినిదండించి, ధర్మాన్ని నాల్గుపాదాల నడిపించిన మొగల్తుర్రు సంస్థానపాలకుల కూటస్థుల ఇంటిపేరు

"కలిదండి" యై దీనితిరుతెన్నులెరుగని సామాన్యజనుల వాడుకలో "కలిదండి"గా మారిందని మొగల్తుర్రుపాలకుల కుదురునకు చెంది, వరసావిత్రి చరిత్ర ప్రబంధకర్తగా పరికీర్తితుడైన కవిరాజు రామరాజకవి కైవాడం. "కలిదిండి" ఇంటిపేరుగా వెరిక తెగవారిలోను ఉంది. కాని కృష్ణాజిల్లాలో "కలిదిండి"ఒక గ్రామనామం "ఝుల్లిగడల" గృహనామకులైన క్షత్రియులు "కలిదిండి" కోటను సాధించి దానినే తమఇంటి పేరుగా పెట్టుకున్నట్లు క్షత్రియాన్వయ మంజూషావివరణం. కలిదండి, ఇరుగదిండ్ల, గోరుదిండ్ల,దిండిగల్లు, దిండి మొదలైన స్థలవాచకాలనుబట్టి "కలిదిండి" గ్రామవాచకమేగాని "కలిదండి"కి వికృతి కాదని తాత్పర్యం.

"ఔరారి వధూ వితతుల కొప్పెర (కొప్పు+ఎర) గొనుటనుబట్టి కొప్పెర అన్న ఇంటిపేరు కవితాశిల్పంలోని మరొక గడుసరికల్పన శత్రురాజులస్త్రీల కొప్పులను కప్పంగా స్వీకరించడం అంటే వారిని వితంతువులుగా మార్చి అని కవిగారిభాష్యం వెడల్పుమూతిగలిగి నీరూ, నూనె మొదలైనవాటిని నిలువచేసుకునే కాగును కొప్పెర అంటారు. చట్టి, వెడత, ముంతవంటి మట్టిపాత్రలపేర్లు ఇంటిపేర్లుగా ఉండడం సర్వజనవిదితమే.

పుంసపాలుడు లేక పుంసపాటుడు అనే క్షత్రియవీరుని సంతతివారు పూసపాటి గృహనామకులుగా వాసికెక్కినట్లు మరొక ఆస్థానకవిగారి నిర్వచనం. ఇది కళింగ విజయనగరం జమీందారుల ఇంటిపేరు కృష్ణామండలంలోని పూసపాడు గ్రామనివాసం కారణంగా ఈ జమీందారుల మూలపురుషుల ఇంటిపేరు దీని ఔపవిభక్తికరూపమైన "పూసపాటి"గా రూపొందింది.

అతిథులకు, అభ్యాగతులకు, ఇతర తైర్థికులకు తమఇంటచోటు, నీరుఇచ్చి ఆదరిస్తున్న కారణంగా అమలాపురం నివారు భూపయ్య అగ్రహారం వాస్తవ్యులు గౌతమ సగోత్రియులు "పేరి" వారి ఇంటిపేరు "చోటీనీరి"గా మారిందన్న స్థలజ్ఞుల కథనం అంతవిశ్వసనీయంగా తోచదు. పైగా, ఈ పేరుకు "చోటేరం" అన్న రూపాంతరం ఉంది. ఇది స్థల వాచికమనిపిస్తుంది.

కనకమేడల వారి పూర్వనామం కనకమాడలవారు అయి ఉండవచ్చు. అచ్చనావిధి ననుసరించిన "కనకమాడలసమర్పణ"గాని అర్థతాత్రమాన్నిబట్టి సంక్రమించిన "కనకమాడల స్వీకరణ"గాని ఇంటిపేరుకు మూలంకావచ్చు.

ఇద్దరు తల్లుల ముద్దుల బిడ్డని సంతతివారికి ఉర్దూభాషారూపాలైన "దో-మా" అన్నపేరు సంక్రమించిందని శతావధానులు దోమా వెంకటస్వామిగుప్తగారి ఆకాశపురాణప్రసంగపరమైన చమత్కారభాషణం వాస్తవంలో "దోమా" తెలంగాణంలోని ఒక గ్రామనామం. ఇంటిపేర్ల వ్యుత్పత్తి నిరూపణంలో పండితూ, పామరులూ కల్పించిన జానపద వ్యుత్పత్తులూ (folk etymologies), శిల్పించిన కృతకప్రామాణికాలు (hyper forms) లెక్కలేనన్ని వీటిలో కొన్ని.

ఇలాగా పైన పేర్కొన్నవన్నీ చమత్కారచారువులేగాని సత్యచరిత్ర రచనలో దోహదకారులు కావు.

షోడశమహాదానాలలో చేరకపోవచ్చుగాని, పుల్లెలు (విస్తళ్ళు) కుట్టి యాత్రాపరులైన అరదేసి, పరదేశులకు తిండిపెట్టే స్తోమతలేక కాబోలు భోజన పాత్రలుగా ఉచితంగా పంచిపెట్టే దానశీలురు "పుల్లెల" కృహ నామకులయ్యారనీ, వీరియథాశక్తి ధర్మపరతను గుర్తించిన ఆనాటి ప్రభువులు వీరిని అగ్రహారాదిక సమ్మానాలతో సత్కరించారనీ ప్రతీతి. "ధర్మాల" గృహనామకులూ ఇట్టివారేకావచ్చు.

పద్మశ్రీ బోయిభీమన్నగారి పూర్వగృహనామం "గడ్డం"వారు. ప్రసిద్ధాంధ్ర రచయిత ఆరుద్ర(భాగవతుల) పూర్వపు గృహనామం "ఆదిభట్ల"

ఇక సంస్కృతీకరణం మాట. ఇంటిపేర్లు తేటతెలుగు మాటలతో వాడుకలో ఉంటే డాబూ దర్పమూ చాలవని వాటిని సంస్కృతీకరించడం గీర్వాణ ప్రియులైన కవిపండితుల భాషాభేషజంగా కనిపిస్తుంది. అహోబలపండితీయకర్త గాలినరసయ్య ప్రభంజనం

అహోబిలపతిగా మార్పుచెందడం ఈ కోవకు చెందిందే. నడిమింటి సర్వమంగళేశ్వరశాస్త్రి ఇంటిపేరు "మధ్యమందిరం"గా, రెంటచింతల అన్న ఇంటిపేరు "ద్వితింత్రిణీ"గా, గుంటూరు "గర్తపురి"గా, గోరుగుంతలపాడు "నఖగర్తపురం"గా ఆయా యుగాలలో కవులు కొందరు సంస్కృతీకరించడం వారి భాషాభేషజానికి గుర్తుగా స్వీకరించవలసి ఉంటుంది. ద్వైతమత ప్రతిష్ఠాపకులైన మధ్వాచార్యుల తండ్రిపేరు మధ్యగేహాభట్టు. "మధ్యగేహకులమౌళి" అని శ్రీమధ్వవిజయకావ్యంలో ప్రస్తావితం. గ్రామ మధ్యంలో ఉన్న కారణంగా ఏర్పడ్డ "నడ్డం ఇల్లాయ" అన్నతుళుభాషాపదానికిది సంస్కృతరూపం. "నడిమింటి ఆయన" అని తెలుగులో తీర్చవచ్చు. ఆయన అసలు పేరేదో ఈనాటివరకూ ఎవరినడిగినా ఇదమిత్థమ్మని చెప్పలేకపోతున్నారు. ఉడిపికి చేరువలోని దేవగిరి కొండలదిగువనగల "శివరూప్య"మన్న జనపదం వీరి తొలినివాసం. ఈ కుటుంబంవారి తరువాతి అభిజనమైన "పాజకక్షేత్రం" (ఉడిపికి దక్షిణదిశలోని రాజవీధి వరుసలో నడిమింటిలో కాపురమున్నందున అసలు ఇంటిపేరు సంస్కృతీకరించబడి నొంతపేరు మటుమాయమై ఉనికినిబట్టి మూర్తికట్టిన గృహనామమే వ్యక్తినామంగా చెలామణీ అయిఉండవచ్చు. భట్టు అన్నది వైదిక బ్రాహ్మణుల పట్టుపుపేరు. వాల్మీకి రామాయణం అయోధ్యాకాండ (12-29) వ్యాఖ్యానంలో ప్రసక్తమైన "మధ్యమవీధి" భట్టారకుని వినినిగొట్టు కథనం చాలమందికి తెలియని అంశం.

జాతాశౌచ మృతాశౌచాది బాధలనుంచి పరిహారంగా, తెలిసి తెలిసి చేసిన మార్పు త్రిపురనేని వారు, తివిర్నేని, తివ్విర్నేనిగా కావడం. ఐతే, ఇంటిపేరు మార్చుకుంటే జ్ఞాతిసంబంధాలు వీడిపోతాయన్న ఊహ వట్టి భ్రాంతి మూలకం మాత్రమే. జ్ఞాతులపరమైన ఆశౌచకర్మాచరణం సాప్తపౌరుషం - ఏడు పురుషాంతరాలకు సంబంధించినది - అంటారు. సంప్రదాయజ్ఞులు కూడా సాపిండ్య సంబంధం - జ్ఞాతిత్వం - ఇంటిపేరు మార్పిడితో పోతుందనుకోవడం అర్థరహితమని పెద్దలమాట. ఏడుతరాలు దాటితే తప్ప జ్ఞాతిత్వం విడిపోదని గృహ్యాకల్ప సూత్రకారుల సిద్ధాంతం. నిజరూపు

ఇలాఉండగా జ్ఞాతులలోని సంతతిబాహుళ్యం వల్ల పురుషుడు పుణ్యాలలో తక్కిన శుభాశుభ కార్యనిర్వహణలలో దినదినమూ ఇబ్బందులు ఏర్పడతాయని కొందరు తమ ఇంటిపేర్లలో పైన సూచించినట్లుగా చిన్న చిన్న మార్పులు చేసుకొని ఆశౌచబాధలనుంచి విముక్తులమయ్యామని తృప్తిచెందుతుంటారు. ఐతే, ఇలాచీలిపోయినవారిలో కుటుంబనియంత్రణ కారణంగానూ, ఇతరత్రానూ జనాభా తగ్గి ముఖ్యంగా మృతశౌచాది సందర్భాలలో ఇరకాటం ఏర్పడడంతో పునరాలోచించి మళ్ళీ మొదటికే వచ్చి కలసిపోయిన సందర్భాలూ లేకపోలేదు.

తరతరాలుగా వస్తున్న తమ ఇంటిపేర్లలో అశ్లీలార్థమో, నైచ్యార్థమో ఉందని భ్రమపడడంవల్ల మార్పాటుపొందిన ఇంటి పేర్లు కూడా మనకు కనిపిస్తాయి. ముళ్లూరు, ముట్నూరుగా మారడం అశ్లీలార్థక నివారణం కోసమని వారి భావన. బొక్కావారు బ్రహ్మండం వారుగానో, భారతంవారుగానో, భాగవతంవారుగానో, సాధుసభా సమ్మతంగా ఎవరికి తోచిన రీతిగా వారు మార్చుకోవడం కూడా వారి మౌలిక గృహనామానికి అశ్లీలార్థం ఆపాదించబడుతుందని భావించడమే మూలకారణం.

తమ ఇంటిపేరు నాజూకుగా లేదని తమంతతమకు తోచిగానీ, నైచ్యార్థక మవుతందని ఆత్మీయులెవరో సూచించగా తెలిసిగానీ, కొందరు తమ ఇంటిపేర్లను మార్చుకున్న సందర్భాలు కూడా లేకపోలేదు. "దాసరి", "దామోదరం" గానూ, "సింగాడి", "సముద్రాల" గానూ మార్చుకోవడం ఈ మాదిరి మార్పులకు ఉదాహరణాలు.

మూలపదం నిజరూప - మౌలికార్థాలతో తబ్బిబ్బుపడడంవల్ల మౌలికమైన ఎన్నో ఇంటిపేర్లు జననిరుక్తులతో, కృత్రిమ వ్యుత్పత్తులతో మార్పాటు పొందడం మనం గమనించవచ్చు. వీటిలో "ఆసాది" "ఆశావాది"గా మారడమొకటి. వాస్తవంగా సంస్కృతంలోని ప్రసాద శబ్ద సంబంధి ఇది. అస్తమానూ ప్రభుసన్నిధిలో మెలగుతూ ఆజ్ఞా సందర్భాలలో ప్రసాదం, మహాప్రసాదం అంటూ రాజకార్యాలను నిర్వర్తించేనిపుణుల పడికట్టు

మాట ఇది. ఆ ప్రసాదమే కన్నడంలో "హసాదు"గా మారి తెలుగులో "అసాదు"గా చేరి ఆనాటి నిపుణుల సంతతివారు ఆసాది వారయ్యారు. అసలు తత్త్వమిలా ఉండగా ఆసాదివారు ఆశావాదిగా మారడం ఆశ్చర్యకరం.

మూలపురుషుడైన కంఠమనాయని సంతతివారి ఇంటిపేరు కంఠమనేనిగా మారి ఉచ్చారణ త్వరలో కంఠమని (అక్కిని, బిక్కిని, గన్నమని వలె) అయింది. "కంఠమని" కి అర్థంలేదని భావించి కాబోలు "కంఠమణి"గా చెలామణి అవుతున్నారు. పురోహితులలో, ఒకపాటి డొక్కశుద్ధిగల ఇతరులో చెప్పిన సూచనలపై ఊహాసిద్ధమైన ఇలాంటి మార్పులు జరగడానికి ఆస్కారమైంది.

కామరాజు అన్న ఇంటిపేరుకు మరొకరూపం కామరసు ఇది తిమ్మరసు, దేవరసు, బొమ్మరసు, వైజరసు వంటి వాటిని పోలినది. "అరసు" కన్నడభాషాపదం; రాజు తత్రమమని కొందరూ, వైకృతమని కొందరూ. ఏది ఏమైనా అరసు, రాజు శబ్దాలు సంస్కృత "రాజు" శబ్ద సంబంధులు. ఐతే, కామఋషి శబ్దం కామరసు/కామర్సు అన్న వికృతిరూపాలుగా మార్పాటు చెందిందని పొరపడి కొందరు తమ ఇంటిపేర్లను కామఋషిగా మార్చుకున్నారు. ఋషిశబ్దం అలసులూ, అల్పప్రజ్ఞులూ ఐన పామరుల పలుకుతీరులో "అరసు"గా మారిందన్న వీరి అభిప్రాయం సరికాదు.

ఇక "భవనం" వారి సంగతి. స్థానిక దేవతలకు - అమ్మవార్లకు - సమర్పించే నైవేద్యం బోనం. బోనాలగంప, బోనాల పండుగ, బోనాల పుటిక, బోనాలబండి, బోనాలెత్తు మొదలైన తెలుగు పలుకుబడులు జనపదాలలో అతిప్రచురం. బోనాలెత్తడం ఒక ప్రత్యేకమైన వాక్కు. ప్రసిద్ధ గ్రామదేవతలకు ప్రథమనైవేద్యం - తొలిబోనం- సమర్పించే తరతరాల దర్జాదర్పాలు కొన్ని కుటుంబాలవారికి ఆనువంశికమైన అధికారం. సంస్కృత "భోజన-" శబ్దం ప్రాకృతంలో "బోయనం" లేక "బోనం"గా మారుతుంది ప్రాకృతభవంగా తెలుగున "బోనం" సిద్ధించింది. ఈ పూర్వచరిత్ర తెలియనివారు "బోన" శబ్దం ఔద్ధత్యసూచకంగాలేదని "భవనం"గా మార్చుకున్నట్లు ఊహించడంలో దోషంలేదు. లేక రాజప్రసాదాది మహోన్నత భవన రూపకల్పనా - నిర్మాణ దక్షతా కలిగిన వారి సంతతివారమని చెప్పుకుంటారేమో!

"పొట్టపేగుల" అన్నది నేతపనివారిలో ఒకటి ఇంటిపేరు. ఇది వాస్తవంగా "పొత్తిపేగుల" నుంచి వికృతినందిన రూపంగా భావించవచ్చు. పడుగుకు సరిపూసేటప్పుడు గానీ, కుంచె వేసేటప్పుడు గానీ ఆసుపోసే వేళలోగానీ, మగ్గంపై నేతనేసేటప్పుడు గానీ పడుగుపేకలలో ఏదైనా పోగుతెగితే ఆ పోగులను పొత్తుచేసి అతకడానికి వాడే చిన్న నూలిపోగును "పొత్తిపోగు"అని అంటారు. దీనినే "కొత్తముట్టు" అని తిక్కన్న ప్రయోగించినట్లున్నాడు. ఈ పొత్తిపోగులను అతకడంలో నేర్పుగలవారి ఇంటిపేరు "పొత్తిపోగుల" కావడం అతిసహజం. అసలువృత్తి దూరమై అన్యవృత్తులను చేపట్టిన వారికి పూర్వవృత్తి పరమైన మాటల అనుపానులెలాతెలుస్తాయి? దీని మౌలికార్థం మూలబడి "పొట్టపేగుల" వెలికి వచ్చింది. అయితే, వీరశైవంలో వీరవ్రతాచారపరాయణుల ఆత్మార్పణ పద్ధతులలో తలనో, చేతులనో, కాళ్ళనో ఖండించి మహారుద్రునకు సమర్పించే తామసాచార మొకటి లేకపోలేదు. ఈ రీతి వీరవ్రతాచార విహారంతో "పొట్టపేగుల" అన్న ఇంటిపేరు ఏర్పడి ఉండకూడదా! అన్న ప్రశ్నరావచ్చు. కావచ్చు. ఔగాములు నిర్ధరించడానికి బలమైన ప్రమాణాలు కావాలి.

శైవాచార పరాయణులైన దేవాంగులలో ఒకరి ఇంటిపేర్లలో "మిడతల" ఒకటి. వాస్తవంగా "మిడుత" తో ఈ ఇంటి పేరుకు సంబంధంలేదు. ఇది "మిడిదల" వీరవ్రతాచార దీక్షితుల మొక్కుబడితంతులో తలనునరికి ఇష్టదైవానికి సమర్పించిన సమయాచారపరుల సంప్రదాయం అపూర్వమైనది. ఆనాటి వాడుకకు దూరమై, ఆ ఆచరణమే భారమై ఆధునిక సమాజంలో దురాచారమై అదృశ్యమైన దీని అనుపానులు సరిగా తెలియని దశలో ప్రచురప్రచారంలో ఉన్న మిడుతతో తమ ఇంటిపేరును ముడిపెట్టుకున్నట్లు తోస్తుంది.

తెలుగుదనం భాసించాలనీ, తమిళవాసన తగలరాదనీ కాబోలు తెలిసీ తెలిసీ ఇంటిపేరు మార్చుకున్నవారు కొందరున్నారు. వారిలో నల్లదీగవారూ, నల్లదీగలవారూ పేర్కొదగ్గవారు. నల్లదీగ, నల్లదీగల – తెలంగాణంలో తెంగళ్ సంప్రదాయానికి చెందిన వైష్ణవులగృహనామాలు. ఇందలి "తీగ" లతావాచకంకాదు. "నల్లదీగ, కులోద్భవం", "నల్లదీగాన్వయం" అంటూ గీర్వాణంలో వీరి గృహనామం కనిపిస్తుంది. ఒకరు ఏకవచనంతో ఏకాకులయ్యారు; ఒకరు బహువచనంతో బయలుపడ్డారు. మౌలికంగా ఈ ఇద్దరి ఇంటిపేరూ ఒక్కటే; గోత్ర సూత్రశాఖలూ ఒక్కటే. వీరి గృహనామానికి పూర్వరూపం నల్లమ్+తికట్. ఇదే ఈనాటి ఉచ్చారణలో నల్లం దిగళ్, నల్లం దిఘళ్. ప్రకాశించే గుణాలుకల (గృహస్థులు) వారు అని ఈ తమిళ పదబంధానికి మౌలికార్థం. తమిళం అనే అర్థంలో తిగుళ భూములు (జై.భార అవతారిక 45,) తిగళగురుని (ఘటికా. 2-180) అన్న ప్రయోగాలు తెలుగు సాహిత్యంలో కనిపిస్తాయి. "తిగుళ్ళ" ఇంటిపేరుగా తెలంగాణంలో కనిపిస్తుంది. తిగళ, తిగుళ=వలసవచ్చిన తమిళుడని అర్థం.

గణ, యతి, ప్రాసాది ఛందోనిర్బంధాలవల్ల ఇంటిపేర్లలో కొన్ని మార్పులు కనిపిస్తున్నాయి. "అమవసనిసి యన్నమాట అలసని పెదనా" (ఒక చాటువు), కాకునూర్యప్ప సుకవి (అప్పకవీయము), శళ్వాపిళ్ళ (ఘటికా. 1-67), "తిరుపతి వెంకటేశ కవిధీరుల శిష్యుఁడ నాదుపేరు వేలూరి శివరామశాస్త్రి యని లోకము వాకొను..." చెళ్లపిళ వంశస్వామి (రామాయణ కల్పవృక్షము), దామర వేంకట ప్రభువతంసుని వెంగళభూప..." (బహుళాశ్వ. 1-15), "దామర్లాన్వయముఁ బొగడఁదగుడేధాత్రిన్" (వైది. 1-37), "...అచ్చెఁ గదవాల కాడ పెద పెద్ద పెసంగము నేస్తడంటారా" (చాటువు), శ్రీ గోడె జగ్గరాయ భూధవ" (శశిరేఖాపరిణయము, పు.2), "కొత్తా వంశ పయోధిచంద్ర" (కె.వి.ఆర్. నరసింహంగారి సుజాత), "కుదురుగఁ బెంచి సత్ఫలము గూర్చిన మా మరిగంటి సత్కవి / ప్రథితయశస్కులన్..." (శ్రీ రఘునందనకుశేశయ ప్రబంధము, 22). అల్లసాని, కాకునూరి, వేలూరి, దామర్ల, గద్వాల, గోడె, కొత్త, మరింగంటి అని అసలు రూపాలు.

భారత జాతీయ స్వాతంత్ర్యసమరంలో భాగంగా సాగిన "వందేమాతరం" ఉద్యమం (1938) లో ఇరవయ్యొక్కటేండ్ల యువకుడుగా స్థిరకీర్తిని గడించిన గద్వాల వాస్తవ్యులు వావిలాల రామచంద్రరావు (1917- )గారి ఇంటిపేరు ఏతదుద్యమ స్ఫూర్తిమూర్తి "వందేమాతరం"గా మారిపోయింది. అనంతపురం జిల్లా బుక్కరాయ సముద్రం వాస్తవ్యులూ, సంస్కృతాంధ్ర హిందీభాషా విద్వాంసులూ; స్వాతంత్ర్య సమరయోధులూ అయిన శ్రీ పొడరాళ్ళ లక్ష్మయ్య భగవద్గీతాది వేదాంతగ్రంథాలకు వ్యాఖ్యానాలు రచించి, ఉపనిషత్తత్వాన్ని జిజ్ఞాసువులలో ప్రవచించి పేరుపొంది నందున వారి ఇంటిపేరు "వేదాంతం " గా మారిపోయింది.

ఉత్తర భారతదేశంలో "ఖత్రి" తెగలలో ఒకరి పట్టపు పేరైన "ఖన్నా"కుగల ప్రచార ప్రశస్తులను గమనించి అచ్చం తెలుగు వారైన "కన్నా" గృహ నామకులు ఈ రెండుపేర్లలో ఉచ్చారణ సామీప్యం ఉండడంచేత పబ్లిసిటీ గొప్పలకై పదాది అల్పప్రాణ వర్ణాన్ని మహాప్రాణంగా మార్చుకున్నవైనం లోకానికి తెలుసు. ఏం చేస్తాం? పొరుగింటి పుల్లగూర రుచి! ఇలాగే ఎన్నో తెగలూ, కులాలూ పేర్ల మార్పిడికి మాత్రం ఉద్యమించి అంతతో ఆగిపోవడం శ్రేయం కాదు. వీటిలో చాల భాగం పాతగిల్లి ఆధునికుల దృష్టిలో జుగుప్సావో, నైచ్యానో సూచిస్తున్నమాట నిజమే. పాతపంచారపు దేశవాళీ మాటల పొందిక నచ్చక మెరమెచ్చులకోసం పరభాషలలోని పరిభాషలను ఆశ్రయిస్తున్నారు. వీటిలో కొన్ని ఉపపత్తిపరామర్శ లోపించిన ఊహాలు; కొన్ని వ్యుత్పత్తి బలంచాలని వీడివాదాలు; కొన్ని యుక్తి ప్రమాణ కుశలులు అంగీకరించని విపరీతార్థ కల్పనలు; తక్కిన కొన్ని దైన్యాన్ని దాచుకోవడానికి తొక్కిన పక్కదారులు. విశ్లేషించి చరిత్ర గతినీ, సంప్రదాయ పద్ధతినీ విస్మరించిన తొందరపాటు నిర్ణయాలివి. విద్యావిషయక చర్చలలో ఇలాటి మిడిమిడి జ్ఞానపు ప్రతిపాదనలు స్వాగతించరానివి; సమ్మతించరానివి.

సమాజంలో ప్రతివ్యక్తీ, ప్రతివర్గమూ ఉత్తమ స్థాయికి ఎదగాలనీ, ఉదాత్తకీర్తిని పొందాలనీ ఉబలాటపడడం అతి సహజమేగాక, అది అత్యావశ్యకం కూడా. ఐతే, పేర్లు మార్చుకున్నంతమాత్రాన ఎవరి ప్రతిష్ఠా పెరగదు. పెంచుకోదలచడంలో తప్పులేదు. కాని, సమాజంలో తమ ఉనికినీ, మనికినీ భద్రపరచుకోవడానికి వట్టిమాటలు కట్టిపెట్టి గట్టిమేల్‌తలపెట్టి, పై పైపూతలను మూలకునెట్టి, వాస్తవమైన ఉన్నతస్థితి నందుకోవడానికి తగినట్లుగా ఆయా వ్యక్తులూ, వర్గాలూ ఆచరణయోగ్యాలైన పథకాలద్వారా, ఆమోదయోగ్యాలైన పద్ధతులద్వారా త్రికరణశుద్ధిగా కృషిచేయాలి. అభ్యుదయంపట్ల ఆసక్తినీ, అందుల కవసరమైన శక్తియుక్తులనూ అన్ని వర్గాలవారూ సమకూర్చుకోవాలి. చిత్తశుద్ధీ, సుస్థిరబుద్ధీ, కార్యనిర్వహణ దక్షతా అమరితే తప్ప లక్ష్యసిద్ధి కలలోని మాట! ఈ వరకే పై అంతస్తులలో ఉన్నవారు తక్కినవారికి చేయూత నిచ్చిపైకి చేదుకోవాలి. అధికార చక్రం చేపట్టినవారు దీనికి వలసిన హంగులనూ అవకాశాలనూ కల్పించాలి. అటుకాక ఆశయాలకూ, ఆచరణలకూ ఆమడల దూరమైతే మన ఊహాలూ, ఉద్యమాలూ అన్నీ వృధా! వృధా!

సముద్రపు లోతులను చూడబోయిన ఉప్పుబొమ్మ ఉబలాటం వంటిది నా ఈ ఉపరిశోధనం "సత్యంజ్ఞానమనంతమ్".

(శ్రీశైలం ప్రాజెక్టులోని ......) (213వ పేజీ తరువాయి)

ఉంచవలసి వచ్చింది. ఈ రెండు వైపుల వారి మధ్య దేవాలయం, వాళ్ళ కంటే వాళ్ళకని అంతంలేని న్యాయ యుద్ధం జరుగుతోంది. ఈ సమస్య పరిష్కృత మయ్యే వరకు దేవాలయం పునర్నిర్మాణం సాధ్యం కాదు. సోమశిల సముదాయాన్ని నిల్పడానికి చాలా కాలం పట్టింది. అయితే చివరికి కొత్తగా కట్టిన సోమశిల గ్రామానికి వెలుపల ఒక కొత్త రిజర్వాయరుకు అభిముఖంగా సుందర ప్రదేశం ఎంపిక చేయడమైంది. అలంపురం దగ్గర ఉన్న పాపనాశి దేవాలయ సముదాయం పునర్నిర్మాణ కార్యక్రమం మొదలై పని చురుకుగా జరుగుతోంది. అట్లాగే రూపాల సంగమేశ్వర దేవాలయం పని దాదాపు పూర్తవుతోంది. పెద్ద యెత్తున పురాతన కట్టడాల పరిరక్షక చర్యల్ని భారత ప్రభుత్వం, ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం నిర్వహించడం ఇదే మొదటిసారి అయి ఉండవచ్చు. దేవాలయాన్ని గుర్తించి, పునస్థాపన జరిగే వరకు ఉన్న మొత్తం పని అంతా భారత ప్రభుత్వ పురావస్తుశాఖ, రాష్ట్రప్రభుత్వ పురావస్తు శాఖ, రాష్ట్ర ప్రభుత్వ దేవాదాయ శాఖ మొదలైన సంస్థలు 300లక్షల రూపాయల ఖర్చుతో చేపట్టాయి.

**విడిగా ఉన్న శిల్పాల సేకరణ**

మహబూబ్‌నగర్, కర్నూలు జిల్లాల్లోని ముంపు ప్రాంతాల్లో అనేక వందల కొలది విడిగా ఉన్న శిల్పాలను సేకరించి కర్నూలుకు, అలంపూరంకు, హైదరాబాదుకు తరలించడమైంది. తవ్వకాలలో లభ్యమైన పురాతన వస్తువులను ప్రదర్శించడానికి మూడు కొత్త పురావస్తు శాలలు, కర్నూలు, అలంపురం, హైదరాబాద్‌లలో తయారవుతున్నాయి. శ్రీశైలం ఆనకట్ట స్థలంలో మొదటి తరగతి పురావస్తుశాల నిర్మాణాన్ని ప్రతిపాదించడమైంది. సేకరించిన శిల్పాల్లో మహిషమర్దని, భద్రకాళీ, సూర్యుడు, కుబేర, యోగ నరసింహ మొదలైన వారి అద్భుతమైన మూర్తులున్నాయి. ఈ శిల్పాలే కాక ప్రగటూరులోని ద్వార స్తంభాలు తొలి విజయనగర శిల్పానికి కళాఖండాలని చెప్పవచ్చు.

గ్రామాల వారీ సర్వే నుంచి పురావస్తు శాల కట్టేవరకు చేసే పరిరక్షక కార్యక్రమాలకు దాదాపు రెండు దశాబ్దాలు పడుతుంది. ఇందులో అనేక సంస్థల, శాఖల,విద్యావేత్తలు, నిపుణుల, శ్రామికుల కృషి ఉంది. శ్రీశైలం ఆనకట్టవల్ల కలిగిన ప్రయోజనాలకు తక్కువ కాని ప్రయోజనాలే ఈ పరిరక్షక కార్యక్రమాల వల్ల కలిగాయి.

* * *

